మహర్షి వేదవ్యాస ప్రణీత

# శ్రీమద్భాగవతము

## తృతీయ స్కంధము






తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

మహర్షి వేదవ్యాస ప్రణీత

# శ్రీమద్భాగవతము

## (తృతీయ స్కంధము)

స్వామి తత్త్వవిదానంద సరస్వతి
(బ్రహ్మవిద్యాకుటీర్, పాతఅల్వాల్, సికింద్రాబాదు)
గారిచే రచింపబడిన ''తత్త్వప్రకాశిక'' అనే
తెలుగు టీకతో కూడినది




ప్రచురణ
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
2003

# SRI MADBHAGAVATAMU
with Telugu Commentary
**III Skandha**

by
**SWAMI TATTVAVIDANANDA SARASWATI**



T.T.D. Religious Publications Series No.623

First Edition : 2003
Copies : 2000

*Published by*
Sri Ajeya Kallam, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 501.

*Printed at*
KEERTHI OFFSET,
Tirupati - 517 501

# ముందుమాట

భారతీయ వాఙ్మయంలో పురాణాలు అత్యంత విశిష్టమైనవి. అవి లోకానికి మిత్రులవలె హితాన్ని ఉపదేశిస్తాయి. కాబట్టి, ''మిత్ర సమ్మితములు''గా ప్రఖ్యాతి వహించాయి. పురాణాలు ప్రాచీనమైనవైనా ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా ప్రకాశిస్తూ వుంటాయి. అవి మన పురాతన విజ్ఞాన సర్వస్వాలు (Encycropaedias) అటువంటి పదునెనిమిది పురాణాల్లో అగ్రగణ్యమైనది శ్రీమద్భాగవతము.

'భాగవత'మంటే భగవంతుని గూర్చి వివరించే గ్రంథమని భావం. ఇలాగే 'భగవత్' శబ్దంతో సంబంధించిన నామధేయం కల మరొక ప్రసిద్ధ గ్రంథం 'భగవద్గీత'. భగవంతుడు చెప్పింది భగవద్గీత; ఆ భగవంతుని గూర్చి చెప్పేది భాగవతము. ఇది ఈ రెంటికి గల అవినాభావ సంబంధం.

వేర్వేరు పురాణాలను, ఇతిహాసాలను రచియించిన వేదవ్యాసుడు బదరికావనంలో సరస్వతీనదీ తీరాన గల తన ఆశ్రమంలో ఒకప్పుడు చింతిస్తూ కూర్చొని ఉండినాడు. ఆ సమయంలో అక్కడకు విచ్చేసిన నారదమహర్షి, విషయం తెలిసికొని, వ్యాసునితో ఇలా అన్నాడు: 'మునీంద్రా! నీవు ఇంతవరకు ఎన్నో గ్రంథాలను రచించినప్పటికీ, భగవానుడైన శ్రీమహావిష్ణువు యొక్క గుణగణాలను, మహిమలను, అవతారలీలలను వెల్లడించే కథలతో గూడిన సమగ్ర గ్రంథాన్ని ప్రత్యేకంగా రచింపలేదు. కావున, అలాంటి ఉత్కృష్ట గ్రంథాన్ని రచిస్తే నీకు పరిపూర్ణమైన మనశ్శాంతి ఏర్పడుతుంది'-అని, ఆ విధంగా నారదుని ఆదేశాన్ని పాటించి, వేదవ్యాస మహాముని రచించిన ఉదాత్తగ్రంథమే శ్రీమద్భాగవత మహాపురాణం!

మంత్రాలన్నింటిలోనూ ఉత్తమమైన మంత్రం 'గాయత్రి' అటువంటి గాయత్రీమంత్రాన్ని ఆధారంచేసికొని ఈ గ్రంథం విస్తరిల్లినట్లు ఇందలి అవతారికలో పేర్కొనబడి ఉంది. ఈ గ్రంథానికి 'భక్తిశాస్త్ర'మని, 'సాత్వతసంహిత' అని, 'మోక్షగ్రంథ'మని, 'హయగ్రీవ బ్రహ్మవిద్య' అని – అనేక నామాంతరాలు పూర్వంనుండీ వాడుకలో ఉన్నాయి. ఇవన్నీ ఈ భాగవత గ్రంథానికి గల ప్రశస్తిని చక్కగా చాటుతూ వున్నాయి.

వేదవ్యాసుడు తొలుదొల్త భాగవత పురాణాన్ని కుమారుడైన శుకునికీ, శిష్యుడైన రోమ హర్షణునికీ ఉపదేశించాడు. రోమహర్షణుని కుమారుడైన ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలో వెయ్యేండ్ల సత్రయాగాన్ని నిర్వహిస్తూవున్న శౌనకాది మహామునుల వద్దకు వెళ్లి, భాగవత పురాణాన్ని ప్రవచనం చేశాడు. ఆ విధంగా ఉగ్రశ్రవసుడనే సూతుడు అలనాడు నైమిశారణ్యంలో

ఆరంభించిన భాగవత కథా ప్రవచనం నేటికీ దేశంలో ఎక్కడో ఒకచోట అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే వస్తున్నది.

ఈ సుప్రసిద్ధ గ్రంథానికి ''తత్త్వప్రకాశిక'' - అనే తెలుగు టీక సమకూర్చబడి ఉండటం ప్రస్తుత ప్రచురణలోని ముఖ్య విశేషం! ప్రతిపదార్థ, తాత్పర్యాలతో కూడిన ఈ తెలుగు టీక సరళమైన భాషలో, సులభశైలిలో, సామాన్య పాఠకులను సైతం ఆకట్టుకొనే రీతిలో సముచితంగా కొనసాగింది. సార్థక నామధేయమైన ఈ టీకను రచించిన సహృదయులు, సుగృహీతనామధేయులు, బ్రహ్మవిద్యానిధులు, బహుగ్రంథకర్తలు పూజ్యశ్రీ తత్త్వవిదానంద సరస్వతీ స్వామివారికి కృతజ్ఞతాపూర్వక అభివందనాలు.

చివరగా నొక్కమాట: పద్మపురాణంలో శ్రీమద్భాగవతం సాక్షాత్తు భగవంతుని స్వరూపంగా నిరూపింపబడింది. తదనుగుణంగా భాగవతంలోని మొదటి రెండు స్కంధాలు భగవంతుని పాదాలు; మూడు నాలుగు స్కంధాలు ఊరువులు; ఐదవ స్కంధం నాభి ప్రదేశం; ఆరవ స్కంధం హృదయం; ఏడు ఎనిమిది స్కంధాలు బాహువులు; తొమ్మిదవ స్కంధం కంఠం; పదవ స్కంధం ముఖం; పదకొండవది లలాటం; పన్రెండవ స్కంధం శిఖ.

పద్మపురాణంలోని పై వరసను బట్టి, తృతీయ చతుర్థ స్కంధాలు విరాట్పురుషునియొక్క ఊరువులు ఆవిష్కరింపబడినట్లుగా భావించాలి! అందులో ఇది మూడవ స్కంధం. ఇలాగే, తరువాతి స్కంధాలను కూడ త్వరలో ప్రచురించే ప్రయత్నాలు చురుకుగా కొనసాగుతున్నాయి . అలమేల్మంగా శ్రీనివాసుల అనుగ్రహవిశేషంతో ఆ యా సంపుటాలు అచిరకాలంలోనే వెలుగుచూడగలవని ఆశిస్తున్నాము.

ఆస్తిక మహాశయులెల్లరకు ఈ ధార్మిక ప్రచురణ ఆనందదాయి కాగలదని ఆకాంక్షిస్తున్నాము.

> *''భాగవత పురాణ ఫల రసాస్వాదన*
> *పదవిఁ గనుఁడు! రసికభావవిదులు!''*

తిరుపతి.

**కార్యనిర్వహణాధికారి,**
తి.తి. దేవస్థానములు

# విషయ సూచిక

* * * * *

శ్రీగణేశాయ నమః

ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్రీ మహర్షి వేదవ్యాస ప్రణీతం

# శ్రీమద్భాగవత మహాపురాణమ్

## తత్త్వ ప్రకాశికా సంయుతమ్

# తృతీయః స్కంధః

## అథ ప్రథమోఽధ్యాయః

### విదుర-ఉద్ధవ సంవాదము

శ్రీశుక ఉవాచ ।
ఏవమేతత్పురా పృష్టో మైత్రేయో భగవాన్ కిల ।
క్షత్త్రా వనం ప్రవిష్టేన త్యక్త్వా స్వగృహమృద్ధిమత్ ॥ 1

శ్రీశుకః = శ్రీశుకమహర్షి, ఉవాచ = పలికెను, పురా = పూర్వము, ఋద్ధిమత్ = సంపదలతో కూడియున్న, స్వగృహమ్ = స్వగృహమును, త్యక్త్వా = విడిచిపెట్టి, వనమ్ = అడవిని, ప్రవిష్టమ్ = ప్రవేశించియున్న, క్షత్త్రా = విదురునిచే, భగవాన్ = పూజ్యుడగు, మైత్రేయః = మైత్రేయుడు,

ఏతత్ = ఈ విషయము, ఏవమ్ = ఇదే విధముగా, పృష్టః కిల = ప్రశ్నించబడినాడు సుమా!

శ్రీశుకమహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! పూర్వము సకలసంపదలతో కూడియున్న తన ఇంటిని విడిచిపెట్టి అడవికి వెళ్లిన విదురుడు, ఇదే విషయమును నీవు ఇప్పుడు నన్ను ప్రశ్నించిన విధముగానే, భగవాన్ మైత్రేయుని ప్రశ్నించినాడు.

యద్వా అయం మంత్రకృద్వో భగవానఖిలేశ్వరః ।
పౌరవేంద్రగృహం హిత్వా ప్రవివేశాత్మసాత్కృతమ్ ॥ 2

యద్వా = ఏ సమయములోనైతే, అఖిల-ఈశ్వరః = సర్వమునకు శాసకుడగు, అయమ్ = ఈ, భగవాన్ = శ్రీకృష్ణ భగవానుడు, వః = మీయొక్క, మంత్రకృత్ = రాయబారమును నడిపినాడో, పౌరవ-ఇంద్రగృహమ్ = పౌరవ (పురువంశమునకు చెందిన) మహారాజగు దుర్యోధనుని ఇంటిని, హిత్వా = విడిచిపెట్టి, ఆత్మసాత్-కృతమ్ = తనదిగా చేసుకొనబడిన విదురుని గృహమును, ప్రవివేశ = ప్రవేశించెనో.

సర్వజగన్నాథుడగు ఈ శ్రీకృష్ణ భగవానుడు మీకు రాయబారియై పౌరవరాజగు దుర్యోధనుని వద్దకు వెళ్లిన సమయములో వాని ఇంటికి వెళ్లకుండగా, విదురుని ఇల్లు తనదిగనే భావించి అచటకు వెళ్లియుండెను.

రాజోవాచ ।
కుత్ర క్షత్తుర్భగవతా మైత్రేయేణాస సంగమః ।
కదా వా సహ సంవాద ఏతద్వర్ణయ నః ప్రభో ॥ 3

రాజా = పరీక్షిన్మహారాజు, ఉవాచ = పలికెను, ప్రభో = ఓ మహర్షీ!, క్షత్తుః = విదురునకు, భగవతా = పూజ్యుడగు, మైత్రేయేణ సహ = మైత్రేయునితో, సంగమః = సమావేశము, సంవాదః = సంభాషణము, కుత్ర = ఎక్కడ, కదా వా = ఏ సమయములో, ఆస = జరిగినది?, నః = మాకు, ఏతత్ = ఈ విషయమును, వర్ణయ = వర్ణించి చెప్పుము.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ఓ శుకమహర్షీ! విదురుడు పూజ్యుడగు మైత్రేయుని ఎక్కడ కలుసుకొనెను? వారిద్దరికి సంభాషణము ఏ సమయములో జరిగినది? ఈ విషయమును మాకు వర్ణించి చెప్పుము.

న హ్యాల్పార్థోదయస్తస్య విదురస్యామలాత్మనః ।
తస్మిన్ వరీయసి ప్రశ్నస్సాధువాదోపబృంహితః ॥ 4

అమల-ఆత్మనః = స్వచ్ఛమగు అంతఃకరణము గల, తస్య = ఆ, విదురస్య = విదురునియొక్క, వరీయసి = శ్రేష్ఠుడగు, తస్మిన్ = ఆ మైత్రేయునియందు (వేయబడిన), ప్రశ్నః = ప్రశ్న, అల్ప-అర్థ-ఉదయః = అల్పమగు ప్రయోజనము (విషయము) యొక్క ఆవిష్కారము గలది, న = అయి ఉండదు, హి = ఏలయనగా, సాధువాద-ఉపబృంహితః = బాగు బాగు అనే ప్రశంసచే వర్ధిల్లజేయబడినది (లేదా, సాధుపురుషుల చరిత్రచే మహిమోపేతము చేయబడిన ప్రశ్న).

స్వచ్ఛమగు అంతఃకరణము గల విదురుడు మహాత్ముడగు మైత్రేయునకు వేసిన ప్రశ్న, విషయములో గాని ప్రయోజనము దృష్ట్యా గాని, అల్పమైనది అయి ఉండదు. ఏలయనగా, మహాత్ముల చరితమును గురించిన ఆ ప్రశ్న మహిమాన్వితమైనది. మైత్రేయుడు బాగు బాగు అని ప్రశంసించి, ఆ ప్రశ్నను వర్ధిల్లజేసినాడు.

సూత ఉవాచ ।
స ఏవమృషివర్యో ऽ యం పృష్టో రాజ్ఞా పరీక్షితా ।
ప్రత్యాహ తం సుబహువిత్ప్రీతాత్మా శ్రూయతామితి ॥ 5

సూతః = సూతుడు, ఉవాచ = పలికెను, పరీక్షితా రాజ్ఞా = పరీక్షిన్మహారాజుచే, ఏవమ్ = ఈ విధముగా, పృష్టః = ప్రశ్నించబడిన, అయమ్ = ఈ, సుబహువిత్ = సర్వజ్ఞుడగు, సః = ఆ, ఋషివర్యః = శుకమహర్షి, ప్రీత-ఆత్మా = ఆనందముతో నిండిన అంతఃకరణము గలవాడై, తమ్ = ఆ పరీక్షిత్తును ఉద్దేశించి, ప్రతి-ఆహ = బదులు చెప్పెను, శ్రూయతామ్ = వినబడుగాక!

సూతుడిట్లు పలికెను --- పరీక్షిన్మహారాజు ఈ విధముగా ప్రశ్నించగా, అటువంటి సర్వజ్ఞుడగు శుకమహర్షి మిక్కిలి సంతసించినవాడై, వినుము అని హెచ్చరించి, ఇట్లు బదులు చెప్పెను.

శ్రీశుక ఉవాచ ।
యదా తు రాజా స్వసుతానసాధూన్
పుష్ణన్నధర్మేణ వినష్టదృష్టిః ।
భ్రాతుర్యవిష్ఠస్య సుతాన్ విబంధూన్
ప్రవేశ్య లాక్షాభవనే దదాహ ॥ 6

శ్రీశుకః = శ్రీశుకమహర్షి, ఉవాచ = ఇట్లు పలికెను, యదా తు = ఏ కాలమునందైతే, వినష్టదృష్టిః = చూపు (వివేకము) లేని, రాజా = ధృతరాష్ట్ర మహారాజు, అసాధూన్ = దుష్టులగు, స్వసుతాన్ = తన కుమారులగు దుర్యోధనాదులను, అధర్మేణ = అధర్మవిధానముచే, పుష్ణన్ = సమర్థించుచున్నవాడై, యవిష్ఠస్య భ్రాతుః = చిన్న తమ్ముడగు పాండుమహారాజుయొక్క, విబంధూన్ = తండ్రి లేని, సుతాన్ = పుత్రులగు ధర్మరాజాదులను, లాక్షాభవనే = లక్క ఇంటియందు, ప్రవేశ్య = ప్రవేశపెట్టి, దదాహ = తగులబెట్టెనో.

శ్రీశుకమహర్షి ఇట్లు పలికెను --- ఇది ఒకనాటి మాట. ధృతరాష్ట్ర మహారాజునకు కన్ను చూపుతో బాటు వివేకము కూడ లేదు. ఆయన తన కుమారులగు దుర్యోధనుడు మొదలగు దుష్టుల అన్యాయప్రవృత్తిని సమర్థించెడివాడు. ఆయన చిన్న తమ్ముడు పాండుమహారాజు. పాండుపుత్రులగు ధర్మరాజు మొదలగువారు తండ్రిని కోల్పోయిరి. ఆ ధృతరాష్ట్రుడు వారిని లక్క ఇంటిలో ప్రవేశపెట్టి దానిని తగులబెట్టించెను.

యదా సభాయాం కురుదేవదేవ్యాః
కేశాభిమర్శం సుతకర్మ గర్హ్యమ్ ।
న వారయామాస నృపస్స్నుషాయాః
స్వాస్రైర్హరంత్యాః కుచ కుంకుమాని ॥ 7

యదా = ఏ కాలమునందైతే, నృపః = ధృతరాష్ట్ర మహారాజు, సభాయామ్ = రాజసభయందు, కురుదేవదేవ్యాః = కౌరవ వంశ సమ్రాట్ అగు ధర్మరాజుయొక్క పట్టపురాణి అయినట్టియు, స్నుషాయాః = తనకు కోడలు అయినట్టియు, స్వ-అస్రైః = తన కన్నీళ్లతో, కుచకుంకుమాని = వక్షఃస్థలమునందలి కుంకుమను, హరంత్యాః = కడిగివేయుచున్నట్టి ద్రౌపది యొక్క, కేశ-అభిమర్శమ్ = జుట్టు పట్టుకొని లాగుట అనే, గర్హ్యమ్ = నిందించదగిన, సుతకర్మ = తన పుత్రుడగు దుశ్శాసనుని చేష్టను, న వారయామాస = అడ్డుకొనలేదో.

ఆ కాలములో కౌరవవంశ చక్రవర్తియగు ధర్మరాజుయొక్క పట్టపురాణి, ధృతరాష్ట్ర మహారాజునకు కోడలు అగు ద్రౌపదిని నిండు సభలో దుశ్శాసనుడు జుట్టుపట్టుకొని లాగెను. వక్షఃస్థలమునందలి కుంకుమ కన్నీటితో కడిగి వేయబడునట్లుగా ఆమె ఏడ్చెను. కాని, నిందించదగిన ఆ తన పుత్రుని చేష్టను ధృతరాష్ట్ర మహారాజు అడ్డుకొనలేదు.

ద్యూతే త్వధర్మేణ జితస్య సాధోః
సత్యావలంబస్య వనాగతస్య ।
న యాచతోఽదాత్సమయేన దాయం
తమో జుషాణో యదజాతశత్రోః ॥ **8**

యత్ = ఏ కాలములో, ద్యూతే = జూదమునందు, అధర్మేణ తు = అధర్మప్రక్రియచే, జితస్య = జయించబడినవాడు, సాధోః = మంచివాడు, సత్య-అవలంబస్య = సత్యమునందు నిష్ఠ గలవాడు, వన-ఆగతస్య = వనమునుండి తిరిగి వచ్చినవాడు, సమయేన = ప్రతిజ్ఞకు తగ్గట్లుగా, దాయమ్ = తన తండ్రి రాజ్యములో వాటాను, యాచతః = కోరుచున్నవాడు, అజాతశత్రోః = అజాతశత్రుడు అగు ధర్మరాజునకు, తమః = అజ్ఞానమును, జుషాణః = ప్రేమించువాడై, న అదాత్ = ఈయలేదో.

ఆ కాలములో సత్పురుషుడగు ధర్మరాజును దుర్యోధనాదులు అన్యాయముగా జూదములో ఓడించిరి. సత్యనిష్ఠ గల ధర్మరాజు ప్రతిజ్ఞను పాటిస్తూ వనవాసమును చేసి గడవు పూర్తి అయిన తరువాత మరలి వచ్చె

ను. చేసిన ప్రతిజ్ఞ ప్రకారముగా తన తండ్రి పాలించిన రాజ్యములో తనకు రావలసిన భాగమును ఇమ్మని ఆ అజాతశత్రుడు ప్రార్థించెను. కాని, అధ ర్మమునందు రమించే దుర్యోధనుడు ఈయలేదు.

యదా చ పార్థప్రహితస్సభాయాం జగద్గురుర్యాని జగాద కృష్ణః ।
న తాని పుంసామమృతాయనాని రాజోరు మేనే క్షతపుణ్యలేశః ॥ 9

చ = మరియు, యదా = ఏ కాలమునందు, పార్థప్రహితః = ధర్మ రాజుచే పంపబడిన, జగత్-గురుః = జగత్తునకు గురువగు, కృష్ణః = శ్రీకృ ష్ణుడు, సభాయామ్ = రాజసభలో, పుంసామ్ = భీష్ముడు మొదలగువారికి, అమృతాయనాని = అమృతము నిండియున్న, యాని = ఏ వచనములను, జగాద = చెప్పెనో, తాని = వాటిని, క్షతపుణ్యలేశః = ఏ కొద్దిపాటి పుణ్యము ఉన్ననూ అది నశించియున్న, రాజా = దుర్యోధన మహారాజు, న ఉరు మేనే = ఆదరణీయములని తలంచలేదో.

మరియు ఆ కాలములో ధర్మరాజు పంపగా జగద్గురువగు శ్రీకృ ష్ణుడు కౌరవుల సభకు వెళ్లి హితమును పలికెను. ఆయన మాటలు భీష్ముడు మొదలగు వారికి అమృతనిధానములుగా భాసించగా, దుర్యోధన మహారాజు, తనకు గల కొద్దిపాటి పుణ్యము కూడ నశించి యుండుటచే, ఆ మాటలకు లేశమైననూ విలువనీయలేదు.

యదోపహూతో భవనం ప్రవిష్టో
మంత్రాయ పృష్టః కిల పూర్వజేన ।
అథాహ తన్మంత్రదృశాం వరీయాన్
యన్మంత్రిణో వైదురికం వదంతి ॥ 10

యదా = ఏ కాలమునందు, పూర్వజేన = అన్నగారగు ధృతరాష్ట్ర మహారాజుచే, ఉపహూతః = పిలువబడినవాడై, భవనమ్ = రాజభవనము ను, ప్రవిష్టః = ప్రవేశించినవాడై, మంత్రాయ = సలహా కొరకు, పృష్టః = ప్రశ్నించబడిన, మంత్రదృశామ్ = రాజనీతి వేత్తలలో, వరీయాన్ = శ్రేష్ఠు డగు విదురుడు, అథ = అప్పుడు, తత్ = అట్టి నీతిని, ఆహ కిల = చెప్పెను

గదా!, యత్ = దేనిని, మంత్రిణః = నీతిశాస్త్రవేత్తలు, వైదురికమ్ = విదుర నీతి అని, వదంతి = వ్యవహరించుచున్నారో.

ఆ కాలములో ధృతరాష్ట్ర మహారాజు సలహా కొరకై విదురుని కొరకు కబురు పెట్టెను. అప్పుడు రాజనీతిజ్ఞులలో శ్రేష్ఠుడగు విదురుడు అన్నగారి వద్దకు వెళ్లి ధర్మమును బోధించెను. ఆ బోధను నీతిశాస్త్రవేత్తలు విదురనీతి అని వ్యవహరించుచున్నారు.

అజాతశత్రోః ప్రతియచ్ఛ దాయం
తితిక్షతో దుర్విషహం తవాగః ।
సహానుజో యత్ర వృకోదరాహిః
శ్వసన్ రుషా యత్త్వమలం బిభేషి ॥ 11

దుర్విషహమ్ = ఎంతయు సహింప శక్యము గాని, తవ = నీ, ఆగః = అపరాధమును, తితిక్షతః = సహించుచున్న, అజాతశత్రోః = అజాతశత్రు వగు ధర్మరాజునకు, దాయమ్ = రాజ్యములో వాటాను, ప్రతియచ్ఛ = తిరిగి ఇమ్ము, యత్ర = ఏ ధర్మరాజు వద్ద, వృకోదర-అహిః = భీముడు అనే పాము, సహ-అనుజః = తమ్ములతో గూడినదై, రుషా = కోపముతో, శ్వసన్ = బుసలు కొట్టుచున్నదో, యత్ = ఎవని వలన, త్వమ్ = నీవు, అలమ్ = మిక్కిలి, బిభేషి = భయపడెదవో.

(విదురుడు ఇట్లు పలికెను ---) నీవు చేసిన అపరాధమును సహించుట చాల కష్టము. అయిననూ, అజాతశత్రువగు ధర్మరాజు సహించుచున్నాడు. ఆయన వాటాను ఆయనకు ఇమ్ము. ఆయన వద్ద తమ్ములతో గూడియున్న భీముడు అనే సర్పము గలదు. అది కోపముతో బుసలు కొట్టుచున్నది. నీవు భీముని వలన చాల భయపడెదవు గదా!

పార్థాంస్తు దేవో భగవాన్ముకుందో గృహీతవాన్ స క్షితిదేవదేవః ।
ఆస్తే స్వపుర్యాం యదుదేవదేవో వినిర్జితాశేషనృదేవదేవః ॥ 12

భగవాన్ = భగవానుడగు, ముకుందః = మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుడు, పార్థాన్ తు = పాండవులనైతే, గృహీతవాన్ = తన వారినిగా చేసుకు

న్నాడు, క్షితిదేవదేవః = బ్రాహ్మణులకు రక్షకుడు, యదుదేవదేవః = యదు శ్రేష్ఠులకు ఆరాధ్యుడు, వినిర్జిత-అశేషనృదేవదేవః = జయించబడిన సకల రాజులు గల ప్రభుడు అగు, సః = ఆ శ్రీకృష్ణుడు, స్వపుర్యామ్ = తన నగర మునందు, ఆస్తే = ఉన్నాడు.

మోక్షప్రదాతయగు శ్రీకృష్ణ భగవానుడు పాండవులను రక్షించే పూ[illegible] తా[illegible] స్వీకరించినాడు. బ్రాహ్మణులను రక్షించే ఆ ప్రభుడు తన ద్వారకానగరములో యదువీరులచే ఆరాధింపబడుతూ మకాము చేసియు న్నాడు. ఆయన రాజులనందరినీ జయించిన ప్రభుడు.

స ఏష దోషః పురుషద్విడాస్తే గృహాన్ ప్రవిష్టో యమపత్యమత్యా।
పుష్ణాసి కృష్ణాద్విముఖో గతశ్రీస్త్యజాశ్వశైవం కులకౌశలాయ।।13

పురుషద్విట్ = శ్రీకృష్ణ భగవానుని ద్వేషించే, సః = ఆ, ఏషః = దోషః = పాపము, గృహాన్ = ఇంటిని, ప్రవిష్టః = ప్రవేశించినదై, ఆస్తే = ఉన్నది, యమ్ = పాపమూర్తియగు ఏ దుర్యోధనుని, కృష్ణాత్ = శ్రీకృష్ణుని నుండి, విముఖః = విముఖుడవైన, గతశ్రీః = పోయిన సంపద గల నీవు, అపత్యమత్యా = కొడుకు అనే భావముతో, పుష్ణాసి = పోషించుచున్నావో, కులకౌశలాయ = వంశముయొక్క క్షేమము కొరకు, ఆశు = వెంటనే, అశైవమ్ = దుష్టుడగు దుర్యోధనుని, త్యజ = విడిచి పెట్టుము.

పాపమే దుర్యోధనుని మూర్తిని దాల్చి నీ ఇంటిలో ప్రవేశించి పరమపురుషుడగు శ్రీకృష్ణ భగవానుని ద్వేషించుచున్నది. నీవు శ్రీకృష్ణుని నుండి విముఖుడవై ఆ పాపమూర్తియగు దుర్యోధనునియందు పుత్రప్రేమ గలవాడవై వానిని పోషించుచున్నావు. ఆ కారణముగానే నీ సంపద తొలగి పోవుచున్నది. నీవు వంశముయొక్క క్షేమమును కోరువాడవైనచో, వెంటనే దుర్బుద్ధియగు దుర్యోధనుని పరిత్యజించుము.

ఇత్యూచివాంస్తత్ర సుయోధనేన ప్రవృద్ధకోపస్ఫురితాధరేణ ।
అసత్కృతస్సత్స్పృహణీయశీలః క్షత్తా సకర్ణానుజసౌబలేన ।। 14

సంస్పృహణీయశీలః = మిక్కిలి అభిలషణీయమైన స్వభావము గల, క్షత్తా = విదురుడు, తత్ర = ఆ సమయములో, ప్రవృద్ధకోపస్ఫురిత-అధరేణ = పెచ్చు పెరిగిన కోపముచే వణకుచున్న క్రింది పెదవిగలవాడు, సకర్ణానుజసౌబలేన = కర్ణుడు సోదరుడగు దుశ్శాసనుడు మరియు శకునిలతో కూడియున్నవాడు అగు, సుయోధనేన = దుర్యోధనునిచే, అసత్కృతః = అవమానించబడినాడు, ఇతి = ఈ విధముగా, ఊచివాన్ = (దుర్యోధనుడు) పలికినాడు.

విదురుని స్వభావము అందరు కోరదగినది. కాని, ఆం ే మాటలను విని దుర్యోధనుని కోపము పెచ్చరిల్లెను. ఆతని క్రింది దవి కోపముతో వణకుచుండెను. అపుడాతడు కర్ణునితో, తన ే ్ము ి దుశ్శాసనునితో మరియు శకునితో కూడినవాడై, విదురుని అవమానిస్తూ ఈ విధముగా పలికెను.

> క ఏనమత్రోపజుహావ జిహ్మం
> దాస్యాస్సుతం యద్బలినైవ పుష్టః ।
> తస్మిన్ ప్రతీపః పరకృత్య ఆస్తే
> నిర్వాస్యతామాశు పురాచ్ఛ్వసానః ॥ 15

జిహ్మమ్ = కుటిలుడు, దాస్యాః = దాసీయొక్క, సుతమ్ = పుత్రుడు అగు, ఏనమ్ = ఈ విదురుని, అత్ర = ఇచటకు, కః = ఎవడు, ఉపజుహావ = పిలిపించినాడు?, యద్-బలినా ఏవ = ఎవని అన్నముచే మాత్రమే, పుష్టః = పోషించబడినాడో, తస్మిన్ = అట్టి నాయందు, ప్రతీపః = విరోధము గలవాడై, పరకృత్యే = ఇతరుల కార్యములయందు, ఆస్తే = ఉన్నాడు, ఆశు = వెంటనే, శ్వసానః = జీవించియుండగనే, పురాత్ = నగరము నుండి, నిర్వాస్యతామ్ = బహిష్కరించబడుగాక!

దాసీపుత్రుడగు ఈ విదురుడు కుటిలుడు. వీనిని ఇచటకు ఎవడు రప్పించినాడు? వీడు నా అన్నమును తిని శరీరమును పోషించుకుంటూ నాకు ప్రతికూలుడై, నా శత్రువుల కొమ్ము కాయుచున్నాడు. వీనిని ప్రాణ

ములతో విడిచిపెట్టెదను. కాని, వీనిని వెంటనే నగరమునుండి బహిష్కరిం చుడు.

స ఇత్థమత్యుల్బణకర్ణబాణైః
భ్రాతుః పురో మర్మసు తాడితోఽపి ।
స్వయం ధనుర్ద్వారి నిధాయ మాయాం
గతవ్యథోఽయాదురు మానయానః ॥ 16

ఇత్థమ్ = ఈ విధముగా, అతి-ఉల్బణకర్ణబాణైః = మిక్కిలి కఠోర ములు చెవులలో బాణములవలె తగిలే మాటలతో, భ్రాతుః = అన్నగారగు ధృతరాష్ట్ర మహారాజుయొక్క, పురః = ఎదుట, మర్మసు = మర్మస్థానముల యందు, తాడితః అపి = కొట్టబడినప్పటికీ, సః = ఆ విదురుడు, స్వయమ్ = స్వయముగా, ధనుః = ధనస్సును, ద్వారి = ద్వారమునందు, నిధాయ = ఉంచి, మాయామ్ = భగవంతుని మాయాశక్తిని, ఉరు = గొప్పదిగా, మాన యానః = తలంచుచున్నవాడై, గతవ్యథః = తొలగిన దుఃఖము గలవాడై, అయాత్ = వెళ్లెను.

దుర్యోధనుడు ఈ విధముగా ధృతరాష్ట్రుని యెదుటనే విదురుని మిక్కిలి కఠోరములగు వచనములతో నిందించెను. ఆ మాటలు ఆయన చెవికి బాణములవలె సోకెను. ఈ విధముగా మర్మభేదకములగు వచనము లను విని కూడా, ఆయన భగవానుని మాయాశక్తి చాల గొప్పది అని తల పోసెనే గాని, దుఃఖమును పొందలేదు. ఆయన తన ధనస్సును రాజద్వా రము వద్ద ఉంచి, వెళ్లిపోయెను.

స నిర్గతః కౌరవపుణ్యలబ్ధో
గజాహ్వయాత్తీర్థపదః పదాని ।
అన్వాక్రమత్పుణ్యచికీర్షయోర్వ్యాం
స్వధిష్ఠితో యాని సహస్రమూర్తిః ॥ 17

కౌరవపుణ్యలబ్ధః = కౌరవుల పుణ్యముచే లభించిన, సః = ఆ విదు రుడు, గజాహ్వయాత్ = హస్తినాపురమునుండి, నిర్గతః = బయల్వెడలినవా

డై, పుణ్యచికీర్షయా = పుణ్యమును చేయవలెననే కోరికతో, ఉర్వ్యామ్ = భూమియందు, తీర్థపదః = పాదమునందు తీర్థము (గంగ) గల శ్రీహరియొక్క, పదాని = స్థానము (క్షేత్రము) లను, అన్వాక్రమత్ = తిరిగెను, యాని = ఏ క్షేత్రములను, సహస్రమూర్తిః = అనేకములగు రూపములు గల శ్రీహరి, స్వధిష్ఠితః = చక్కగా అధిష్ఠించి యున్నాడో.

కౌరవులు చేసుకున్న పుణ్యప్రభావముచే వారికి విదురుడు లభించెను. కాని, ఇపుడాయన హస్తినాపురమునుండి బయల్వెడలి పుణ్యమును సంపాదించ గోరువాడై, భూమియందు గల శ్రీహరియొక్క క్షేత్రములకు పయనమాయెను. గంగ మొదలగు తీర్థములు ఆ శ్రీహరి పాదములనుండి జన్మించినవి. ఆయన ఆయా క్షేత్రములలో అనేకరూపములలో విరాజిల్లుచున్నాడు.

పురేషు పుణ్యోపవనాద్రికుంజేష్వపంకతోయేషు సరిత్సరస్సు ।
అనంతలింగైస్సమలంకృతేషు చచార తీర్థాయతనేష్వనన్యః ।।18

అనంతలింగైః = అనంతుడగు శ్రీమహావిష్ణువుయొక్క మూర్తులచే, సమలంకృతేషు = అలంకరించబడియున్న, పురేషు = నగరములయందు, పుణ్య-ఉపవన-అద్రికుంజేషు = పవిత్రములగు ఉద్యానములయందు పర్వతములయందు మరియు పొదరిళ్లయందు, అపంకతోయేషు = బురద లేని నీరు గల, సరిత్-సరస్సు = నదులయందు సరస్సులయందు, తీర్థ-ఆయతనేషు = తీర్థప్రదేశములయందు, అనన్యః = ఒంటరియై, చచార = సంచరించెను.

విదురుడు అనంతభగవానుని మూర్తులచే అలంకరింపబడియున్న నగరములకు, పవిత్రములగు ఉద్యానములకు, పర్వతములకు, పొదరిళ్లకు మరియు తీర్థప్రదేశములకు ఒంటరిగా యాత్రను చేసెను. ఆయన స్వచ్ఛమైన నీటితో ప్రకాశించే నదులలో మరియు సరస్సులలో పుణ్యస్నానములను చేసెను.

గాం పర్యటన్మేధ్యవివిక్తవృత్తిస్సదాఽఽప్లుతోఽధశ్శయనోఽవధూతః ।
అలక్షితస్స్వైరవధూతవేషో వ్రతాని చేరే హరితోషణాని ।। 19

మేధ్యవివిక్తవృత్తిః = చెట్లనుండి రాలిన పళ్లు మొదలగు పవిత్రమగు ఆహారమును తినువాడై, సదా = ఎల్లవేళలా, ఆప్లుతః = స్నానమును చేయువాడై, అధః = నేలపై, శయానః = పరుండువాడై, అవధూతః = దేహాలంకారములు లేనివాడై, స్వైః = తనవారిచే, అలక్షితః = కానరానివాడై, అవధూత వేషః = అవధూతయొక్క వేషము గలవాడై, గామ్ = భూమిని, పర్యటన్ = పర్యటించుచున్నవాడై, హరితోషణాని = శ్రీహరిని సంతోషపెట్టే, వ్రతాని = వ్రతములను, చేరే = పాలించెను.

విదురుడు తీర్థయాత్రలను చేయునప్పుడు చెట్లనుండి రాలిన పళ్లు మొదలగు పవిత్రమగు ఆహారమును మాత్రమే భుజించెడివాడు. బంధువులు గుర్తుపట్టలేని విధముగా ఆయన అవధూతవేషములో నుండెను. ఆయన తీర్థములన్నింటియందు మూడు పూటలా స్నానమును చేసెడివాడు. ఆయన దేహమును అలంకరించే ప్రయత్నమును చేసెడివాడు కాదు. ఆయన నేలపై నిద్రిస్తూ, శ్రీహరిని సంతోషపెట్టే వ్రతములను పాలించెడి వాడు.

ఇత్థం వ్రజన్ భారతమేవ వర్షం కాలేన యావద్గతవాన్ ప్రభాసమ్ ।
తావచ్ఛశాస క్షితిమేకచక్రామేకాతపత్రామజితేన పార్థః ॥ 20

ఇత్థమ్ = ఈ విధముగా, భారతం వర్షం ఏవ = భారతదేశమును మాత్రమే, వ్రజన్ = ప్రయాణము చేయుచున్నవాడై, యావత్ కాలేన = ఏ కాలమునాటికి, ప్రభాసమ్ = ప్రభాసక్షేత్రమును, గతవాన్ = చేరినాడో, తావత్ = అప్పటికి, పార్థః = ధర్మరాజు, అజితేన = శ్రీకృష్ణుని సాహాయ్యముతో, ఏకచక్రామ్ = అఖండమగు, ఏకాతపత్రామ్ = ఒకే గొడుగు (రాజాధికారము) గల, క్షితిమ్ = భూమండలమును, శశాస = పాలించెను.

ఈ విధముగా విదురుడు భారతదేశమంతటా తీర్థయాత్రలను చేయుచూ కొంత కాలమునకు ప్రభాసతీర్థమును చేరెను. అప్పటికి ధర్మరాజు శ్రీకృష్ణుని అనుగ్రహము వలన రాజ్యాధికారమును పొందినవాడై అఖండమగు భూమండలమును ఏకచ్ఛత్రాధిపతియై పాలించుచుండెను.

తత్రాథ శుశ్రావ సుహృద్వినష్టిం

వనం యథా వేణుజవహ్నిసంశ్రయమ్ ।
సంస్పర్ధయా దగ్ధమథానుశోచన్
సరస్వతీం ప్రత్యగియాయ తూష్ణీమ్ ॥ 21

అథ = తరువాత, తత్ర = అక్కడ, వేణుజవహ్నిసంశ్రయమ్ = వెదురుడొంకలనుండి పుట్టిన అగ్నికి ఆశ్రయమైన, వనమ్ = అడవి, యథా దగ్ధమ్ = ఏ విధముగా దహింపబడునో, సంస్పర్ధయా = అన్యోన్య కలహముచే, సుహృద్-వినష్టిమ్ = బంధువుల వినాశమును గురించి, శుశ్రావ = వినెను, అథ = తరువాత, అనుశోచన్ = దుఃఖించుచున్నవాడై, తూష్ణీమ్ = ఏమియు మాటలాడకుండగా, సరస్వతీం ప్రతి = సరస్వతీనదిని గురించి, ఇయాయ = వెళ్లెను.

అడవిలో వెదురుడొంకలలో రాపిడిచే పుట్టిన అగ్ని వలన అడవి అంతా తగులబడిన విధముగా అన్యోన్యకలహముచే కురువంశము నాశనమయ్యెను. ఆ వృత్తాంతమును విదురుడు ప్రభాస తీర్థమునందుండగా విని చాల దుఃఖించినవాడై ఏమియు మాటలాడకుండగా సరస్వతీనదీతీరమునకు వెళ్లెను.

తస్యాం త్రితస్యోశనసో మనోశ్చ
పృథోరథాగ్నేరసితస్య వాయోః ।
తీర్థం సుదాసస్య గవాం గుహస్య
యచ్ఛ్రాద్ధదేవస్య స ఆసిషేవే ॥ 22

తస్యామ్ = ఆ నదీతీరమునందు, సః = ఆ విదురుడు, స్య = త్రితుని, ఉశనసః = ఉశనసుని, చ = మరియు, మనోః = మనువుయొక్క, పృథోః = పృథువుయొక్క, అథ = మరియు, అగ్నేః = అగ్నియొక్క, అసితస్య = అసితుని, వాయోః = వాయుదేవుని, సుదాసస్య = సుదాసుని, గవామ్ = గోవులయొక్క, గుహస్య = గుహుని, శ్రాద్ధదేవస్య = శ్రాద్ధదేవుని, యత్ = ఏ, తీర్థమ్ = తీర్థము గలదో దానిని, ఆసిషేవే = సేవించెను.

విదురుడు సరస్వతీనదీతీరమునందు త్రితుడు, ఉశనసుడు, మనువు, పృథువు, అగ్ని, అసితుడు, వాయుదేవుడు, సుదాసుడు, గోవులు, గుహుడు, శ్రాద్ధదేవుడు అను పేర్లతో ప్రసిద్ధిని చెందిన తీర్థములను సేవించెను.

అన్యాని చేహ ద్విజదేవదేవైః
కృతాని నానాయతనాని విష్ణోః ।
ప్రత్యంగముఖ్యాంకితమందిరాణి
యద్దర్శనాత్కృష్ణమనుస్మరంతి ॥ 23

చ = మరియు, ఇహ = ఈ లోకములో, ద్విజదేవదేవైః = మహర్షులచే మరియు దేవతలచే, కృతాని = ప్రతిష్ఠించబడిన, అన్యాని = ఇతరములగు, విష్ణోః = శ్రీమహావిష్ణువుయొక్క, నానా-ఆయతనాని = అనేకములగు స్థానములను, ప్రత్యంగముఖ్య-అంకితమందిరాణి = ఆయుధములలో ముఖ్యమగు చక్రము చిహ్నముగా గల మందిరములను, యత్-దర్శనాత్ అను = వేటిని చూచిన పిదప, కృష్ణమ్ = కృష్ణుని, స్మరంతి = స్మరించెదరో.

ఇంతేగాక, ఈ లోకములో మహర్షులు మరియు దేవతలు ప్రతిష్ఠించిన శ్రీమహావిష్ణువుయొక్క ఆలయములను పెక్కింటిని విదురుడు సేవించెను. భగవానుని ఆయుధములలో ప్రముఖమగు చక్రము ఆ ఆలయశిఖరములను అలంకరించి యుండును. వాటిని చూడగనే జనులు శ్రీకృష్ణుని స్మరించుచుందురు.

తతస్త్వతివ్రజ్య సురాష్ట్రమృద్ధం
సౌవీరమత్స్యాన్ కురుజాంగలాంశ్చ ।
కాలేన తావద్యమునాముపేత్య
తత్రోద్ధవం భాగవతం దదర్శ ॥ 24

తతః తు = తరువాతనైతే, ఋద్ధమ్ = సమృద్ధమగు, సురాష్ట్రమ్ = సౌరాష్ట్రప్రాంతమును, సౌవీరమత్స్యాన్ = సౌవీరమత్స్యప్రాంతములను, కురుజాంగలాన్ చ = కురుజాంగలప్రాంతమును కూడ, అతివ్రజ్య = దాటివె

ళ్లి, కాలేన తావత్ = కొంత కాలమునకు, యమునామ్ = యమునానదీతీర మును, ఉపేత్య = చేరుకొని, తత్ర = అచట, భాగవతమ్ = భగవద్భక్తుడగు, ఉద్ధవమ్ = ఉద్ధవుని, దదర్శ = చూచెను.

తరువాత విదురుడు సమృద్ధమగు సౌరాష్ట్రమును, సౌవీర మత్స్య కురుజాంగల ప్రాంతములను కూడ దాటివెళ్లి కొంతకాలమునకు యమునా నదీతీరమును చేరుకొని, అచట భగవద్భక్తుడగు ఉద్ధవుని దర్శించెను.

స వాసుదేవానుచరం ప్రశాంతం
బృహస్పతేః ప్రాక్ తనయం ప్రతీతమ్ ।
ఆలింగ్య గాఢం ప్రణయేన భద్రం
స్వానామపృచ్ఛద్భగవత్ప్రజానామ్ ॥ 25

వాసుదేవ-అనుచరమ్ = శ్రీకృష్ణుని అనుచరుడు, ప్రశాంతమ్ = మిక్కిలి శాంతమగు స్వభావము గలవాడు, బృహస్పతేః = బృహస్పతికి, ప్రాక్ = పూర్వములో, తనయమ్ = శిష్యునిగా నున్నవాడు, ప్రతీతమ్ = ప్రఖ్యాతిని గాంచినవాడు అగు ఉద్ధవుని, సః = ఆ విదురుడు, ప్రణయేన = ప్రేమతో, గాఢమ్ = గట్టిగా, ఆలింగ్య = కౌగిలించుకొని, భగవత్-ప్రజానామ్ = శ్రీకృష్ణభగవానుని ఆశ్రితులైన, స్వానామ్ = తన వారియొక్క, భద్రమ్ = క్షేమసమాచారమును గురించి, అపృచ్ఛత్ = ప్రశ్నించెను.

మిక్కిలి శాంతస్వభావము గల ఉద్ధవుడు శ్రీకృష్ణభగవానుని అను చరులలో ప్రసిద్ధిని గాంచినవాడు. ఆయన ఒకప్పుడు బృహస్పతి వద్ద శిష్యునిగా నుండెడివాడు. విదురుడు ఆయనను ప్రేమతో గట్టిగా కౌగిలిం చుకొని శ్రీకృష్ణభగవానుని పుత్రపౌత్రాదులు మరియు ఆశ్రితులు అగు తన బంధువుల క్షేమసమాచారమును గురించి ప్రశ్నించెను.

కచ్చిత్పురాణౌ పురుషౌ స్వనాభ్య-
పాద్మానువృత్త్యేహ కిలావతీర్ణౌ ।
ఆసాత ఉర్వ్యాః కుశలం విధాయ
కృతక్షణౌ కుశలం శూరగేహే ॥ 26

స్వనాభ్యపాద్మ-అనువృత్త్యా = తన నాభియందలి పద్మమునుండి జన్మించిన బ్రహ్మగారి ప్రార్థనచే, పురాణౌ పురుషౌ = పురాణ (సనాతన) పురుషులగు బలరామకృష్ణులు, ఇహ = ఈ భూలోకమునందు, అవతీర్ణౌ కిల = అవతరించియున్నారు గదా!, ఉర్వ్యాః = భూమికి, కుశలమ్ = క్షేమ మును, విధాయ = కలిగించి, కృతక్షణౌ = లభించిన అవకాశము గలవారై (అందరికీ ఉత్సాహమును కలిగించుచున్నవారై), శూరగేహే = వసుదేవుని గృహమునందు, కుశలమ్ = క్షేమముగా, కచ్చిత్ ఆసాతే = ఉన్నారా?

శ్రీమహావిష్ణువుయొక్క నాభికమలమునందు జన్మించిన బ్రహ్మ గారు ప్రార్థించగా, పురాణపురుషులగు బలరామకృష్ణులు ఈ లోకము నందు అవతరించి యున్నారు గదా! వారు భూభారమును తగ్గించి లోక మునకు క్షేమమును కలిగించినారు. వారికి ఇప్పటికి కొంత అవకాశము లభించినది. వారు వసుదేవుని గృహములో అందరికీ ఆనందమును కలి గిస్తూ క్షేమముగా నున్నారా?

కచ్చిత్కురూణాం పరమం సుహృన్నో
భామస్స ఆస్తే సుఖమంగ శౌరిః ।
యో వై స్వసౄణాం పితృవద్దదాతి
వరాన్ వదాన్యో వరతర్పణేన ॥ 27

అంగ = ఓ మిత్రుడా!, కురూణామ్ = కురువంశము వారికి, పరమం సుహృత్ = గొప్ప మిత్రుడు, నః = మాకు, భామః = పూజ్యుడు అగు, సః = ఆ, శౌరిః = వసుదేవుడు, సుఖమ్ = సుఖముగా, కచ్చిత్ ఆస్తే = ఉన్నాడా?, వదాన్యః = దాతయగు, యః = ఏ వసుదేవుడు, స్వసౄణామ్ = కుంతి మొదలగు తోబుట్టువులకు, పితృవత్ = తండ్రివలె, వరతర్పణేన = వారి వారి భర్తలను సంతోషపెట్టుచూ, వరాన్ = అభీష్టములగు వస్తువుల ను, దదాతి = ఇచ్చుచుండునో.

ఓ మిత్రమా! మా కురువంశీయులకు గొప్ప స్నేహితుడు, పూజ్యుడు అగు వసుదేవుడు సుఖముగా నున్నాడా? ఆయన చాల ఉదారు

డు. తన తోబుట్టువులను, వారి భర్తలను తండ్రివలెనే చూచెడివాడు. ఆయన వారికి అభీష్టములగు వస్తువులను ఇచ్చి సంతోషపెట్టెడివాడు.

కచ్చిద్వరూథాధిపతిర్యదూనాం ప్రద్యుమ్న ఆస్తే సుఖమంగ వీరః।
యం రుక్మిణీ భగవతోఽభిలేభే ఆరాధ్య విప్రాన్ స్మరమాదిసర్గే॥28

అంగ = ఓ మిత్రమా!, యదూనామ్ = యాదవుల, వరూథ-అధిపతిః = సేనానాయకుడు, వీరః = వీరుడు అగు, ప్రద్యుమ్నః = ప్రద్యుమ్నుడు, సుఖమ్ = సుఖముగా, కచ్చిత్ ఆస్తే = ఉన్నాడా?, ఆదిసర్గే = పూర్వజన్మయందు, స్మరమ్ = మన్మథుడగు, యమ్ = ఏ ప్రద్యుమ్నుని, రుక్మిణీ = రుక్మిణి, విప్రాన్ = బ్రాహ్మణులను, ఆరాధ్య = ఆరాధించి, భగవతః = భగవానునినుండి, అభిలేభే = పొందెనో.

ఓ మిత్రమా! యాదవసేనానాయకుడు, వీరుడు అగు ప్రద్యుమ్నుడు సుఖముగానున్నాడా? ఆయన పూర్వజన్మలో మన్మథుడు. రుక్మిణి బ్రాహ్మణులనారాధించి భగవానునినుండి ఆతనిని పుత్రునిగా బడసెను.

కచ్చిత్సుఖం సాత్వతవృష్ణిభోజ-
దాశార్హకాణామధిపస్స ఆస్తే ।
యమభ్యషించచ్ఛతపత్రనేత్రో
నృపాసనాశాం పరిహృత్య దూరాత్ ॥ 29

సాత్వతవృష్ణిభోజదాశార్హకాణామ్ = సాత్వతులు, వృష్ణులు, భోజులు, దాశార్హులు అను వంశములకు చెందిన యాదవులకు, అధిపః = అధిపతియగు, సః = ఆ ఉగ్రసేన మహారాజు, సుఖమ్ = సుఖముగా, కచ్చిత్ ఆస్తే = ఉన్నాడా?, నృప-ఆసన-ఆశామ్ = రాజసింహాసనమునందలి ఆశను, దూరాత్ = దూరముగా, పరిహృత్య = విడిచిపెట్టియున్న, యమ్ = ఎవ్వానిని, శతపత్రనేత్రః = పద్మపత్రమువంటి కన్నులు గల శ్రీకృష్ణభగవానుడు, అభ్యషించత్ = అభిషేకించెనో.

సాత్వత, వృష్ణి, భోజ, దాశార్హ వంశములకు చెందిన యాదవులకు అధిపతియగు ఆ ఉగ్రసేన మహారాజు సుఖముగా నున్నాడా? ఆయన రాజ్యాధికారమునందలి ఆశను పూర్తిగా విడిచిపెట్టి యుండగా, పద్మపు రేకులవంటి కన్నులు గల శ్రీకృష్ణ భగవానుడు ఆయనను మహారాజుగా అభిషేకించినాడు.

కచ్చిద్ధరేస్సౌమ్య సుతస్సదృక్ష
ఆస్తేఽగ్రణీ రథినాం సాధు సాంబః ।
అసూత యం జాంబవతీ వ్రతాఢ్యా
దేవం గుహం యోఽంబికయా ధృతోఽగ్రే ॥ 30

సౌమ్య = ఓ ప్రసన్నమగు మనస్సు గలవాడా!, హరేః = శ్రీహరికి, సదృక్షః = సమానమైన, సుతః = పుత్రుడు, రథినామ్ = రథికులలో, అగ్రణీః = అగ్రేసరుడు అగు, సాంబః = సాంబుడు, సాధు = సుఖముగా, కచ్చిత్ ఆస్తే = ఉన్నాడా?, యమ్ = ఏ, గుహం దేవమ్ = కార్తీక భగవానుని, వ్రత-ఆఢ్యా = వ్రతనిష్ఠురాలగు, జాంబవతీ = జాంబవతి, అసూత = కన్నదో, యః = ఎవడు, అగ్రే= పూర్వ-అవతారమునందు, అంబికయా = పార్వతీదేవిచే, ధృతః = ధరించబడినాడో.

ఓ ప్రసన్నమగు మనస్సు గల ఉద్ధవా! సాంబుడు శ్రీకృష్ణభగవానునకు అనురూపమైన పుత్రుడు. రథికులలో అగ్రేసరుడగు ఆ సాంబుడు శ్రీకృష్ణునితో సమానమగు పరాక్రమము గలవాడు. పూర్వజన్మలో ఆయన సాక్షాత్తుగా పార్వతీపుత్రుడగు భగవాన్ కుమారస్వామి. ఆయనను జాంబవతి కఠినములగు వ్రతములను సలిపి పుత్రునిగా బడసినది. ఆయన కుశలముగా నున్నాడా?

క్షేమం స కచ్చిద్యుయుధాన ఆస్తే
యః ఫాల్గునాల్లబ్ధధనూరహస్యః ।
లేభేఽంజసాధోక్షజసేవయైవ
గతిం తదీయాం యతిభిర్దురాపామ్ ॥ 31

సః = ఆ, యుయుధానః = సాత్యకి, క్షేమమ్ = క్షేమముగా, కచ్చిత్ ఆస్తే = ఉన్నాడా?, యః = ఏ సాత్యకి, ఫాల్గునాత్ = అర్జునునినుండి, లబ్ధధనూరహస్యః = పొందబడిన ధనుర్విద్యయొక్క రహస్యములు గలవాడో, అధోక్షజసేవయా ఏవ = శ్రీకృష్ణభగవానుని సేవచే మాత్రమే, యతిభిః = యతులచే, దురాపామ్ = కష్టముచే పొంద శక్యమైన, తదీయామ్ = ఆ భగవానునకు సంబంధించిన, గతిమ్ = స్థితిని, అంజసా = తేలికగా, లేభే = పొందినాడో.

సాత్యకి క్షేమముగా నున్నాడా? ఆయన ధనుర్వేదరహస్యములను అర్జునుని వద్ద అభ్యసించినాడు. ఆయన శ్రీకృష్ణభగవానుని సేవించి, కేవలము ఆ సేవయొక్క ప్రభావముచే యతులకు కూడ పొందుటకు కష్టమైన భాగవత (భగవద్భక్త) స్థితిని తేలికగా పొందినాడు.

కచ్చిద్బుధస్స్వస్త్యనమీవ ఆస్తే
శ్వఫల్కపుత్రో భగవత్ప్రపన్నః ।
యః కృష్ణపాదాంకితమార్గపాంసు-
ష్వచేష్టత ప్రేమవిభిన్నధైర్యః ॥ 32

బుధః = విద్వాంసుడు, అనమీవః = పాపమునెరుగనివాడు, భగవత్-ప్రపన్నః = భగవంతుని శరణు పొందినవాడు, శ్వఫల్కపుత్రః = శ్వఫల్కుని పుత్రుడు అగు అక్రూరుడు, స్వస్తి = క్షేమముగా, కచ్చిత్ ఆస్తే = ఉన్నాడా? యః = ఏ అక్రూరుడు, ప్రేమవిభిన్నధైర్యః = ప్రీతిచే సడలిన ధైర్యము గలవాడై, కృష్ణపాద-అంకితమార్గపాంసుషు = శ్రీకృష్ణుని కాలి ముద్రల గుర్తులుగల దారియందలి ధూళియందు, అచేష్టత = పొరలినాడో.

విద్వాంసుడు, పాపమునెరుంగనివాడు, భగవంతుని శరణు పొందినవాడు, శ్వఫల్కుని పుత్రుడు అగు అక్రూరుడు కుశలముగా నున్నాడా? ఆయన మార్గమునందలి ధూళియందు శ్రీకృష్ణభగవానుని కాలిగుర్తులను చూచి అతిశయించిన భక్తిచే మనోధైర్యమును కోల్పోయినవాడై ఆ ధూళియందు పొరలాడినాడు.

కచ్చిచ్ఛివం దేవకభోజపుత్ర్యా
విష్ణుప్రజాయా ఇవ దేవమాతుః ।
యా వై స్వగర్భేణ దధార దేవం
త్రయీ యథా యజ్ఞవితానమర్థమ్ ॥ 33

దేవమాతుః ఇవ = దేవమాతయగు అదితివలె, విష్ణుప్రజాయాః = శ్రీమహావిష్ణువు సంతానముగా గల, దేవకభోజపుత్ర్యాః = భోజవంశీయుడగు దేవకుని పుత్రికయైన దేవకికి, శివం కచ్చిత్ = కుశలమేనా?, యా వై = ఏ దేవకి, యజ్ఞవితానమ్ = యజ్ఞముయొక్క విస్తారము అనే, అర్థమ్ = అర్థమును, త్రయీ యథా = వేదము వలె, దేవమ్ = భగవానుని, స్వగర్భేణ = తన గర్భముచే, దధార = ధరించెనో.

భోజవంశీయుడైన దేవకుని పుత్రికయగు దేవకి కుశలముగానున్నదా? ఆమె శ్రీమహావిష్ణువును సంతానముగా పొందిన దేవమాత అదితి వంటిది. వేదము తనలో విస్తారమగు యజ్ఞప్రక్రియను నిరూపించే జ్ఞానమును కలిగియున్న విధముగా, ఆమె తన గర్భమునందు భగవానుని ధరించినది.

అపి స్విదాస్తే భగవాన్ సుఖం వో
యస్సాత్వతాం కామదుఘోఽనిరుద్ధః ।
యమామనంతి స్మ హ శబ్దయోనిం
మనోమయం సత్త్వతురీయతత్త్వమ్ ॥ 34

భగవాన్ = పూజ్యుడగు, అనిరుద్ధః = అనిరుద్ధుడు, సుఖమ్ = సుఖముగా, అపి స్విత్ ఆస్తే = ఉన్నాడా?, యః = ఏ అనిరుద్ధుడు, సాత్వతామ్ = భక్తులగు (యదువంశీయులగు), వః = మీ, కామదుఘః = కోరికలను పూర్తి చేయునో, యమ్ = ఎవనిని, శబ్దయోనిమ్ = వేదములకు కారణమైనవాడుగను (వాక్కునకు కారణమైన), సత్త్వతురీయతత్త్వమ్ = భగవానుని నాల్గవ అంశగను (అంతఃకరణముయొక్క నాల్గవ అంశయగు), మనోమయమ్ = మనస్సునకు అధిష్ఠానముగను, ఆమనంతి స్మ హ = వర్ణించుచున్నారో.

అనిరుద్ధ భగవానుడు సుఖముగా నున్నాడా? ఆయన భక్తుల మరియు యదువంశీయుల కోరికలను పూర్తి చేయువాడు. ఆయనయే వేద ములను ఆవిర్భవింప జేసినవాడనియు, శ్రీమహావిష్ణువుయొక్క నాల్గవ అంశ అనియు మహాత్ములు వర్ణించుచున్నారు. వాక్కునకు మూలము, చిత్తము అహంకారము బుద్ధి మరియు మనస్సు అనే నాలుగింటి సమాహా రము అగు అంతఃకరణములో నాల్గవ అంశము అగు మనస్సునకు ఆయన అధిష్ఠాన దైవము.

అపి స్విదన్యే చ నిజాత్మ దైవమనన్యవృత్త్యా సమనువ్రతా యే ।
హృదీకసత్యాత్మజచారుదేష్ణగదాదయస్స్వస్తి చరంతి సౌమ్య॥35

సౌమ్య = ఓ ఉద్ధవా!, చ = మరియు, హృదీకసత్యా-ఆత్మజచారు దేష్ణగద-ఆదయః = హృదీకుడు, సత్యభామాపుత్రుడగు చారుదేష్ణుడు, గదుడు మొదలగు, అన్యే = ఇతరులు, స్వస్తి = కుశలముగా, అపి స్విత్ చరంతి = సంచరించుచున్నారా?, యే = ఎవరైతే, నిజ-ఆత్మ దైవమ్ = తమ హృదయేశ్వరుడగు శ్రీకృష్ణుని, అనన్యవృత్త్యా = అనన్య (మరియొకటి లేని) మగు ప్రేమతో, సమనువ్రతాః = చక్కగా అనుసరించెదరో.

ఓ ఉద్ధవా! హృదీకుడు, సత్యభామాతనయుడగు చారుదేష్ణుడు, గదుడు మొదలగు ఇతరులు కూడ కుశలముగా సంచరించుచున్నారా? వారు తమ హృదయేశ్వరుడగు (తమ ఆత్మరూపునిగా ప్రకాశించే) శ్రీకృ ష్ణుని అనన్యమగు (భేదభావన లేని) ప్రేమతో (ఏకాంత భక్తితో) చక్కగా అనుసరించుచుందురు.

అపి స్వదోర్భ్యాం విజయాచ్యుతాభ్యాం
ధర్మేణ ధర్మః పరిపాతి సేతుమ్ ।
దుర్యోధనోఽతప్యత యత్సభాయాం
సామ్రాజ్యలక్ష్మ్యా విజయానువృత్త్యా । 36

ధర్మః = ధర్మరాజు, స్వదోర్భ్యామ్ = తన రెండు భుజములైన, విజయ-అచ్యుతాభ్యామ్ = అర్జునునితో మరియు శ్రీకృష్ణునితో, ధర్మేణ =

ధర్మబద్ధముగా, సేతుమ్ = లోకమర్యాదను, అపి పరిపాతి = అన్ని విధము లుగా రక్షించుచున్నాడు గదా?, యత్-సభాయామ్ = ఎవని మయసభ యందు, విజయ-అనువృత్తయా = విజయ పరంపరచే (అర్జునుడు చేసిన సేవ వలన కలిగిన), సామ్రాజ్యలక్ష్మ్యా = సామ్రాజ్య వైభవముచే, దుర్యో ధనః = దుర్యోధనుడు, అతప్యత = పరితపించినాడో.

ధర్మరాజునకు శ్రీకృష్ణార్జునులు రెండు భుజములవంటి వారు. ఆయన వారి సహాయముతో ధర్మబద్ధముగా పాలిస్తూ లోకమర్యాదను నిల బెట్టుచున్నాడా? ఆయనకు కలుగుచున్న విజయముల పరంపరను, ఆయ నకు మయుడు కట్టి ఇచ్చిన సభలో ప్రకటమైన సామ్రాజ్య వైభవమును, ఆ వైభవమునకు మూలములోనున్న అర్జునుని సేవను చూచి, దుర్యోధనుడు అసూయతో చాల దుఃఖమునసుభవించెను.

కిం వా కృతాఘేష్వఘమత్యమర్షీ
భీమోఽహివద్దీర్ఘతమం వ్యముంచత్ ।
యస్యాంఘ్రిపాతం రణభూర్న సేహే
మార్గం గదాయాశ్చరతో విచిత్రమ్ ॥ 37

కృత-అఘేషు = చేయబడిన అపరాధము గలవారియందు, అతి -అమర్షీ = మిక్కిలి అసహనము గల, భీమః = భీముడు, అహివత్ = పాము వలె, దీర్ఘతమమ్ = మిక్కిలి దీర్ఘకాలము కొనసాగే, అఘమ్ = కోపమును, కిం వ్యముంచత్ = విడిచిపెట్టినాడా?, వా = లేదా?, గదాయాః = గద యొక్క, విచిత్రమ్ = వివిధములైన, మార్గమ్ = గతిని ఉద్దేశించి, (విచిత్రమ్ = అనేక విధములుగా) చరతః = సంచరించే, యస్య = ఏ భీముని, అంఘ్రి పాతమ్ = కాళ్ల తొక్కుడును, రణభూః = రణభూమి, న సేహే = సహించలే కపోయెనో.

భీముడు అపరాధమును చేసినవారియందు తీవ్రమగు అసహ నము గలవాడు. అతని కోపము పాము కోపము వలె చాల కాలము వరకు కొనసాగును. అతడు అట్టి కోపమును విడిచిపెట్టినాడా, లేదా? అతడు

యుద్ధరంగములో గదను రకరకములుగా త్రిప్పుతూ సంచరిస్తూ ఉంటే, ఆతని పాదముల తాకిడిని భూమి సహించలేక పోయెడిది.

కచ్చిద్యశోధా రథయూథపానాం గాండీవధన్వోపరతారిరాస్తే ।
అలక్షితో యచ్ఛరకూటగూఢో మాయాకిరాతో గిరిశస్తుతోష ।। 38

రథయూథపానామ్ = రథికుల మరియు సేనానాయకుల మధ్య లో, యశోధాః = కీర్తిని ధరించువాడు, గాండీవధన్వా = గాండీవమనే ధనస్సును ధరించువాడు అగు అర్జునుడు, ఉపరత-అరిః = తొలగిపోయిన శత్రువులు గలవాడై, కచ్చిత్ ఆస్తే = ఉన్నాడా?, గిరిశః = కైలాసవాసియగు శివుడు, మాయాకిరాతః = మాయచే కిరాతుడై, అలక్షితః = గుర్తు పట్టరానివాడై, యత్-శరకూటగూఢః = ఎవని బాణసమూహముచే కప్పివేయబడినవాడై, తుతోష = సంతోషించెనో.

అర్జునుడు మహారథులలో మరియు సేనానాయకులలో గొప్పవానిగా కీర్తిని గడించినాడు. అతడు శత్రువులను నిర్మూలించి ఇప్పుడు ప్రశాంతముగ నున్నాడా? కైలాసపతియగు శివుడు గుర్తు పట్టుటకు వీలులేని విధముగా మాయచే కిరాతవేషమును దాల్చి రాగా, ఆతడు ఆయనను తన బాణములతో కప్పివేసెను. ఆ కారణముగా, శివుడు ఆతని విషయములో చాల సంతోషించెను.

యమావుత స్విత్తనయౌ పృథాయాః
పార్థైర్వృతౌ పక్ష్మభిరక్షిణీవ ।
రేమాత ఉద్దాయ మృధే స్వరిక్థం
పరాత్సుపర్ణావివ వజ్రివక్త్రాత్ ।। 39

పృథాయాః = కుంతియొక్క, తనయౌ = పెంపుడు కొడుకులు, పార్థైః = కుంతియొక్క సంతానమగు ధర్మరాజాదులచే, పక్ష్మభిః = కనురెప్పలచే, అక్షిణీ ఇవ = రెండు కన్నులు వలె, వృతౌ = కాపాడబడినవారు, యమౌ = కవలలు అగు నకుల సహదేవులు, మృధే = యుద్ధమునందు, పరాత్ = శత్రువగు దుర్యోధనునినుండి, స్వరిక్థమ్ = రాజ్యములో తమ

వాటాను, వజ్రివక్త్రాత్ = ఇంద్రుని నోటినుండి, సుపర్ణౌ ఇవ = గరుడపక్షులు వలె, ఉద్ధాయ = లాగుకొని, రేమాతే ఉత స్విత్ = రమించుచున్నారా?

కవల బిడ్డలగు నకుల సహదేవులను కుంతియే పెంచి పోషించిన ది. కుంతియొక్క పుత్రులగు ధర్మరాజు, భీముడు మరియు అర్జునుడు వారిద్దరిని కంటికి రెప్పల వలె కాపాడెడివారు. గరుడపక్షుల జంట ఇంద్రుని వద్దనుండి అమృతమును లాగుకున్న విధముగా, వారిద్దరు శత్రువగు దుర్యోధనుని వద్దనుండి రాజ్యములో తమ వాటాను లాగుకొని, సుఖముగా రమించుచున్నారా?

అహో పృథాపి ధ్రియతేఽర్భకార్థే రాజర్షివర్యేణ వినాపి తేన ।
యస్త్వేకవీరోఽధిరథో విజిగ్యే ధనుర్ద్వితీయః కకుభశ్చతస్రః ।। 40

అహో = ఆశ్చర్యము!, పృథా అపి = కుంతి కూడా, రాజర్షివర్యేణ = రాజర్షులలో శ్రేష్ఠుడగు, తేన వినా అపి = ఆ పాండువు లేకున్ననూ, అర్భక-అర్థే = పిల్లల కొరకై, ధ్రియతే = ప్రాణములను ధరించియున్నది, ఏకవీరః = సాటిలేని వీరుడు, అధిరథః = రథయుద్ధమును చేయువారిలో శ్రేష్ఠుడు అగు, యః తు = ఏ పాండు మహారాజైతే, ధనుః-ద్వితీయః = ధనస్సు మాత్రమే తోడుగా గలవాడై, చతస్రః = నాలుగు, కకుభః = దిక్కులను, విజిగ్యే = జయించెనో.

రాజర్షులలో శ్రేష్ఠుడగు పాండుమహారాజు లేకున్ననూ పిల్లల కొరకై కుంతి ప్రాణములను ధరించియుండుట చాల కొనియాడ దగినది. ఆ పాండు మహారాజు సాటిలేని వీరుడు మరియు రథయుద్ధమును చేయువారిలో శ్రేష్ఠుడు. ఆయన తన ధనస్సును మాత్రమే తోడుగా చేసుకొని, నాలుగు దిక్కులను జయించెను.

సౌమ్యానుశోచే తమధఃపతంతం
భ్రాత్రే పరేతాయ విదుద్రుహే యః ।
నిర్యాపితో యేన సుహృత్స్వపుర్యా
అహం స్వపుత్రాన్ సమనువ్రతేన ।। 41

సౌమ్య = సౌమ్యస్వభావము గల ఓ ఉద్ధవా!, అధః = నరకమునందు, పతంతమ్ = పడుచున్న, తమ్ = ఆ ధృతరాష్ట్రుని గురించి, అనుశోచే = పలుమార్లు శోకించుచున్నాను, యః = ఏ ధృతరాష్ట్రుడు, పరేతాయ = మరణించిన, భ్రాత్రే = సోదరుని కొరకు, విదుద్రుహే = ద్రోహమును చేసినాడో, స్వపుత్రాన్ = తన పుత్రులగు దుర్యోధనాదులను, సమనువ్రతేన = ఖచ్చితముగా అనుసరించి నడచిన, యేన = ఏ ధృతరాష్ట్రునిచే, సుహృత్ = హితమును కోరేవాడనగు, అహమ్ = నేను, స్వపుర్యాః = తన నగరము నుండి, నిర్యాపితః = వెడలగొట్ట బడితినో.

సౌమ్యమగు స్వభావము గల ఓ ఉద్ధవా! మరణించిన సోదరునకు ద్రోహమును చేసి పాపమును మూటగట్టుకున్న ధృతరాష్ట్రుని గురించి నేను అధికముగా శోకించుచున్నాను. ఆయన కొడుకులు చెప్పిన మాటను అనుసరించుటయే వ్రతముగా పెట్టుకొని, తన హితమును గోరే నన్ను తన నగరమునుండి పంపించి వేసినాడు.

సోఽహం హరేర్మర్త్యవిడంబనేన
దృశో నృణాం చాలయతో విధాతుః ।
నాన్యోపలక్ష్యః పదవీం ప్రసాదాత్
చరామి పశ్యన్ గతవిస్మయోఽత్ర ॥ 42

సః = అట్టి, అహమ్ = నేను, మర్త్యవిడంబనేన = మానవులను అనుకరించుటచే, నృణామ్ = మానవుల, దృశః = మనోవృత్తులను, చాలయతః = భ్రమింపజేయునట్టియు, విధాతుః = జగన్నియంతయగు, హరేః = శ్రీకృష్ణునియొక్క, ప్రసాదాత్ = అనుగ్రహము వలన, న అన్య-ఉపలక్ష్యః = ఇతరులచే తెలియబడనివాడనై, గతవిస్మయః = తొలగిన ఆశ్చర్యము (ఖేదము) గలవాడనై, పదవీమ్ = భగవానుని మహిమను, పశ్యన్ = చూచుచున్నవాడనై, అత్ర = ఈ లోకమునందు, చరామి = సంచరించుచున్నాను.

నాకు ఈ విషయములో ఆశ్చర్యము గాని, ఖేదము గాని లేదు. ఏలయనగా, జగన్నియంతయగు శ్రీహరి మానవాకారమును దాల్చి శ్రీకృష్ణుడై మానవుల మనోవృత్తులకు భ్రమను కలిగించుచున్నాడు. కాని, నేను

ఆయన అనుగ్రహముచే ఆయన మహిమను గాంచుచూ, ఇతరులచే తెలి యబడని వాడనై ఈ భూలోకములో సంచరించుచున్నాను.

నూనం నృపాణాం త్రిమదోత్పథానాం
మహీం ముహుశ్చాలయతాం చమూభిః ।
వధాత్ప్రపన్నార్తిజిహీర్షయేశోఽ-
ప్యుపైక్షతాఘం భగవాన్ కురూణామ్ ॥ 43

త్రిమద-ఉత్-పథానామ్ = మూడు రకముల గర్వముచే ధర్మమా ర్గమును తప్పినట్టియు, మహీమ్ = భూమిని, చమూభిః = సేనలతో, ముహుః = పలుమార్లు, చాలయతామ్ = కంపింపజేసిన, నృపాణామ్ = రాజుల, వధాత్ = వధ కారణముగా, ప్రపన్న-ఆర్తిజిహీర్షయా = శరణు పొందినవారి కష్టములను తొలగించాలనే కోరికచే, భగవాన్ = శ్రీకృష్ణ భగ వానుడు, ఈశః అపి = సమర్థుడే అయిననూ, కురూణామ్ = కౌరవుల, అఘమ్ = అపరాధమును, ఉపైక్షత = ఉపేక్షించినాడు, నూనమ్ = ఇది నిశ్చయము.

కొందరు రాజులు తమ ధనవిద్యాకులములను చూచుకొని గర్వించినవారై, తమ సేనలను నడిపించి భూమండలమును పలుమార్లు కంపింపజేసెడివారు. భగవానుడు వారిని వధింపజేసి, తనను శరణు జొచ్చి న పాండవులు మొదలగువారి కష్టములను తొలగించగోరెను. కావుననే, ఆయన అపరాధమును చేసిన కౌరవులను అక్కడికక్కడే శిక్షించగల్గిననూ, ఉపేక్షించినాడు. ఇది నిశ్చయము.

అజస్య జన్మోత్పథనాశనాయ
కర్మాణ్యకర్తుర్గ్రహణాయ పుంసామ్ ।
నన్వన్యథా కోఽర్హతి దేహయోగం
పరో గుణానాముత కర్మతంత్రమ్ ॥ 44

అజస్య = పుట్టుకలేని పరమేశ్వరునకు, ఉత్పథనాశనాయ = ధర్మ మార్గమును తప్పినవారి వినాశము కొరకు, జన్మ = పుట్టుక, అకర్తుః = కర్త

కాని పరమేశ్వరునకు, పుంసామ్ = మానవుల, గ్రహణాయ = సంగ్రహము (తన వైపునకు త్రిప్పుకొనుట) కొరకు, కర్మాణి = కర్మలు, నను = ఓ ఉద్ధవా!, అన్యథా = అట్లు కానిచో, గుణానామ్ = సత్త్వరజస్తమోగుణముల కు, పరః = అతీతుడైన, కః ఉత = ఎవ్వాడైననూ, కర్మతంత్రమ్ = కర్మకు అధీనమై యుండే, దేహయోగమ్ = దేహముతోడి సంబంధమును, అర్హతి = తగునా?

ఓ ఉద్ధవా! పరమేశ్వరునకు పుట్టుక లేదు. కాని, ఆయన ధర్మమా ర్గమును తప్పినవారిని నిగ్రహించుట కొరకై అవతరించును. ఆయన కర్త కాడు. కాని, ఆయన మానవులను తనవైపు త్రిప్పుకొనుట కొరకై, అనగా, లోకసంగ్రహము కొరకై, కర్మలను చేయును. అట్లు కానిచో, సత్త్వరజస్తమో గుణాత్మకమగు సంసారమునకు అతీతుడగు జ్ఞాని ఎవ్వరైననూ కర్మకు వశమైయుండే దేహసంబంధమునకు అర్హుడు అగునా? కాడు.

తస్య ప్రపన్నాఖిలలోకపానా-
మవస్థితానామనుశాసనే స్వే ।
అర్థాయ జాతస్య యదుష్వజస్య
వార్తాం సఖే కీర్తయ తీర్థకీర్తేః ॥ 45

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
విదురోద్ధవసంవాదే ప్రథమోఽధ్యాయః ॥

సఖే = ఓ మిత్రుడా!, స్వే = తన, అనుశాసనే = ఆజ్ఞయందు, అవ స్థితానామ్ = ఉండే, ప్రపన్న-అఖిలలోకపానామ్ = శరణు పొందిన ఇంద్రుడు మొదలుగా గల లోకపాలకుల, అర్థాయ = ప్రయోజనము కొరకు, యదుషు = యదువంశమునందు, జాతస్య = పుట్టిన, అజస్య = పుట్టుక లేని, తీర్థకీర్తేః = పవిత్రమగు కీర్తి గల, తస్య = ఆ శ్రీకృష్ణుని, వార్తామ్ = వృత్తాంతమును, కీర్తయ = చెప్పుము.

ఓ మిత్రుడా! ఇంద్రుడు మొదలగు లోకపాలకులు అందరు ఆ భగ వానుని ఆజ్ఞను అనుసరించి పని చేయుచుందురు. వారు శరణు పొందగా,

వారి కార్యమును సాధించి పెట్టుట కొరకై జన్మలేని భగవానుడు యదువంశములో జన్మించినాడు. ఆయనను కీర్తించినవారు పవిత్రులగుదురు. ఆయన వృత్తాంతమును చెప్పుము.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
విదుర-ఉద్ధవసంవాదమునందు మొదటి
అధ్యాయము ముగిసినది (1).

* * * * *

# అథ ద్వితీయోఽధ్యాయః

## శ్రీకృష్ణుని బాల్య లీలలు

శ్రీశుక ఉవాచ ।
ఇతి భాగవతః పృష్టః క్షత్త్రా వార్తాం ప్రియాశ్రయామ్ ।
ప్రతివక్తుం న చోత్సేహ ఔత్కంఠ్యాత్స్మారితేశ్వరః ॥ 1

శ్రీశుకః = శ్రీశుకమహర్షి, ఉవాచ = పలికెను, భాగవతః = భగవద్భక్తుడగు ఉద్ధవుడు, ఇతి = ఈ విధముగా, క్షత్త్రా = విదురునిచే, ప్రియ-ఆశ్రయామ్ = ప్రియుడగు శ్రీకృష్ణునితో సంబంధము గల, వార్తామ్ = సమాచారమును గురించి, పృష్టః = ప్రశ్నించబడినవాడై, ఔత్కంఠ్యాత్ = అధికమగు ప్రేమ వలన, స్మారిత-ఈశ్వరః = స్మరింపజేయబడిన ఈశ్వరుడు గలవాడై, ప్రతివక్తుమ్ = సమాధానమును చెప్పుటకు, న చ ఉత్సేహే = సమర్థుడు కాలేదు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- విదురుడు భగవద్భక్తుడగు ఉద్ధవుని ఈ విధముగా ప్రియతముడగు శ్రీకృష్ణునకు సంబంధించిన సమాచారమును గురించి ప్రశ్నించెను. కాని, ఈశ్వరుని స్మరణమాత్రముచే ఆయన, హృదయము ప్రేమతో నిండి ఉత్కంఠభరితుడై సమాధానమును చెప్పలేక పోయెను.

యః పంచహాయనో మాత్రా ప్రాతరాశాయ యాచితః ।
తన్నైచ్ఛద్రచయన్ యస్య సపర్యాం బాలలీలయా ॥ 2

పంచహాయనః = ఐదు సంవత్సరములు వయస్సు గల, యః = ఏ ఉద్ధవుడు, మాత్రా = తల్లిచే, ప్రాతరాశాయ = చల్ది అన్నమును తినుట కొరకై, యాచితః = కోరబడినవాడై, బాలలీలయా = బాల్యమునందలి క్రీడచే,

యస్య = ఏ శ్రీకృష్ణునియొక్క, సపర్యామ్ = సేవను, రచయన్ = చేయుచున్నవాడై, తత్ = ఆ చల్ది అన్నమును, న ఐచ్ఛత్ = ఇష్టపడలేదో.

ఉద్ధవుడు ఐదు సంవత్సరముల బాలకుడై యుండగా ఒక శ్రీకృష్ణ మూర్తిని కల్పించి, దానికి సేవను పూజను చేయుచుండెను. అపుడు తల్లి చల్ది అన్నమును తినుట కొరకు పిలిచెను. కాని, తాను చేయుచున్న పూజను విడిచి వెళ్లి ఆహారమును భుజించుట ఆ బాలకునకు నచ్చలేదు.

స కథం సేవయా తస్య కాలేన జరసం గతః ।
పృష్టో వార్తాం ప్రతిబ్రూయాద్భర్తుః పాదావనుస్మరన్ ॥ 3

కాలేన = కాలముచే, తస్య = ఆ శ్రీకృష్ణునియొక్క, సేవయా = సేవచే, జరసమ్ = పెద్ద వయస్సును, గతః = పొందియున్న, సః = అట్టి ఆ ఉద్ధవుడు, వార్తామ్ = సమాచారమును గురించి, పృష్టః = ప్రశ్నించ బడిన వాడై, భర్తుః = ప్రభువగు శ్రీకృష్ణుని, పాదౌ = పాదములను, అనుస్మరన్ = స్మరించుచున్నవాడై, కథమ్ = ఏ విధముగా, ప్రతిబ్రూయాత్ = సమాధాన మును చెప్పును?

అట్టి ఉద్ధవుడు దీర్ఘకాలమునుండియు శ్రీకృష్ణుని సేవిస్తూ వృద్ధు డైనాడు. శ్రీకృష్ణుని గురించి ప్రశ్నించగానే, ఆయన ఈ ప్రభుని పాదము లను స్మరించుట మొదలిడినాడు. అట్టి ఉద్ధవుడు సమాధానమునెట్లు చెప్ప గల్గును?

స ముహూర్తమభూత్తూష్ణీం కృష్ణాంఘ్రిసుధయా భృశమ్ ।
తీవ్రేణ భక్తియోగేన నిమగ్నస్సాధు నిర్వృతః ॥ 4

సః = ఆ ఉద్ధవుడు, కృష్ణ-అంఘ్రిసుధయా = శ్రీకృష్ణుని పాదముల అమృతముచే, సాధు = బాగుగా, నిర్వృతః = ఆనందమును పొందినవాడై, తీవ్రేణ = తీవ్రమగు, భక్తియోగేన = భక్తియోగముచే, భృశమ్ = మిక్కిలి, నిమగ్నః = పరవశుడై, ముహూర్తమ్ = సుమారు ఒక గంట సేపు, తూష్ణీమ్ = మౌనముగా, అభూత్ = ఉండెను.

శ్రీకృష్ణుని పాదముల భావన అనే అమృతముచే గొప్ప ఆనందమును పొందియున్న ఆ ఉద్ధవుడు తీవ్రమగు భక్తియోగము (భావన ద్వారా భగవంతునితో కలియుట) చే పరవశుడై, సుమారు ఒక గంట వరకు ఏమియు మాటలాడలేదు.

పులకోద్భిన్నసర్వాంగో ముంచన్మీలద్దృశా శుచః ।
పూర్ణార్థో లక్షితస్తేన స్నేహప్రసరసంప్లుతః ॥ 5

పులక-ఉద్భిన్నసర్వ-అంగః = పులకాంకురములచే నిండిన అన్ని అవయవములు గలవాడు, మీలద్దృశా = మూసియుంచబడిన కన్నులతో, శుచః = నీటిని, ముంచన్ = విడుచుచున్నవాడు, స్నేహప్రసరసంప్లుతః = ప్రేమప్రవాహమునందు మునిగియున్నవాడు అగు ఉద్ధవుడు, తేన = ఆ విదురునిచే, పూర్ణ-అర్థః = కృతకృత్యునిగా, లక్షితః = గుర్తించబడినాడు.

ఉద్ధవుని దేహమంతయు పులకాంకురములతో నిండిపోయెను. ఆయన మూసియున్న కన్నుల వెంబడి ఆనందాశ్రువులను విడుచుచుండెను. ఆయన ప్రేమప్రవాహములో మునిగిపోయెను. అట్టి ఉద్ధవుని చూచి విదురుడు, ఈయన కృతార్థుడు (జీవన్ముక్తుడు) అని తలచెను.

శనకైర్భగవల్లోకాన్నృలోకం పునరాగతః ।
విమృజ్య నేత్రే విదురం ప్రత్యాహోద్ధవ ఉత్స్మయన్ ॥ 6

శనకైః = మెల్లగా, భగవత్-లోకాత్ = భగవంతుని లోకమునుండి, నృలోకమ్ = మనుష్యలోకమును గురించి, పునః ఆగతః = తిరిగి వచ్చిన, ఉద్ధవః = ఉద్ధవుడు, నేత్రే = కన్నులను, విమృజ్య = తుడుచుకొని, ఉత్-స్మయన్ = విస్మయమును పొందినవాడై, విదురం ప్రతి = విదురుని ఉద్దేశించి, ఆహ = పలికెను.

ఉద్ధవుడు మెల్లగా భగవద్భావననుండి సంసారములోనికి తిరిగి వచ్చినవాడై, కన్నులను తుడుచుకొని, భగవంతుని లీలలు స్మరణకు వచ్చుటచే విస్మయమును పొందినవాడై, విదురునితో నిట్లనెను.

ఉద్ధవ ఉవాచ ।

కృష్ణద్యుమణినిమ్లోచే గీర్ణేష్వజగరేణ హ ।
కిం ను నః కుశలం బ్రూయాం గతశ్రీషు గృహేష్వహమ్ ।।7

ఉద్ధవః = ఉద్ధవుడు, ఉవాచ = పలికెను, కృష్ణద్యుమణినిమ్లోచే = శ్రీకృష్ణుడనే సూర్యుడు అస్తమించగా, నః = మా, గతశ్రీషు = నశించిన సంపదలు గల, గృహేషు = ఇళ్లు, అజగరేణ = కొండచిలువచే, గీర్ణేషు = మ్రింగివేయబడగా, అహమ్ = నేను, కుశలమ్ = క్షేమమును గురించి, కిం ను బ్రూయామ్ = ఏమి చెప్పెదను?

ఉద్ధవుడిట్లు పలికెను --- శ్రీకృష్ణుడనే సూర్యుడు అస్తమించినాడు. కాలము అనే కొండచిలువ మా గృహములను మ్రింగివేసినది. మా సంపదలు నశించినవి. నేను ఏమి కుశలసమాచారమును చెప్పగలను?

దుర్భగో బత లోకోఽయం యదవో నితరామపి ।
యే సంవసంతో న విదుర్హరిం మీనా ఇవోడుపమ్ ।। 8

బత = అయ్యో!, అయమ్ = ఈ, లోకః = లోకము (మానవుడు), దుర్భగః = భాగ్యము లేనిది, యదవః = యదువంశీయులు, నితరాం అపి = మరింత భాగ్యహీనులు, యే = ఏ యాదవులు, సంవసంతః = కలిసి జీవించుచున్నవారైననూ, మీనాః = చేపలు, ఉడుపం ఇవ = చంద్రుని వలె, హరిమ్ = శ్రీహరిని, న విదుః = గుర్తించకుండిరి.

ఈ లోకము భాగ్యము లేనిది. మానవుడు భాగ్యవిహీనుడు. అయ్యో! యాదవులు మరింత భాగ్యహీనులు. ఏలయనగా, శ్రీహరి ఈ లోకములో ఉన్న కాలములో యాదవులు ఆయనతో కలిసి ఉండేవారు. కాని, వారాయనను గుర్తించలేదు. చంద్రుడు సముద్రములో ఉన్నంత వరకు చేపలు ఆయనను గుర్తించలేదు గదా!

ఇంగితజ్ఞాః పురుప్రౌఢా ఏకారామాశ్చ సాత్వతాః ।
సాత్వతామృషభం సర్వే భూతావాసమమంసత ।। 9

ఇంగితజ్ఞాః = ఇతరుల మనోభావములనెరింగినవారు, పురుప్రౌఢాః = మంచి నిపుణులు, ఏక-ఆరామాః = ఒకే స్థానమునందు ఉంటూ రమించు

వారు అగు, సాత్వతాః = యాదవులు, సర్వే = అందరు, భూత-ఆవాసమ్ = సకలప్రాణులకు ఆశ్రయమగు శ్రీకృష్ణభగవానుని, సాత్వతామ్ = యాదవుల లో, ఋషభమ్ = శ్రేష్ఠునిగా, అమంసత = తలపోసిరి.

యాదవులు ఇతరుల మనోభావములను తెలుసుకోగలిగే గొప్ప నిపుణులే. వారు శ్రీకృష్ణభగవానునితో బాటు ఒకే స్థానములో నుండి ఆయ నతో రమించిరి. కాని, ఆయన సకలప్రాణులకు ఆశ్రయమగు పరబ్రహ్మ అని గుర్తించలేక, ఆయన కేవలము యాదవులలో గొప్పవాడగు ఒక వ్యక్తి అనియే తలపోసిరి.

దేవస్య మాయయా స్పృష్టా యే చాన్యదసదాశ్రితాః ।
భ్రామ్యతే ధీర్న తద్వాక్యైరాత్మన్యుప్తాత్మనో హరౌ ॥ **10**

దేవస్య = పరమేశ్వరుని, మాయయా = మాయచే, స్పృష్టాః = మోహింప జేయబడినవారు, చ = మరియు, అసత్ = నిష్కారణమగు, అన్యత్ = వైరమును (అసత్ = మిథ్యారూపమగు, అన్యత్ = అనాత్మను), ఆశ్రితాః = ఆశ్రయించిన, యే = ఏ శిశుపాలాదులు గలరో, తద్-వాక్యైః = వారి మాటలచే, ఆత్మని = ఆత్మస్వరూపుడగు, హరౌ = శ్రీహరియందు, ఉప్త-ఆత్మనః = సమర్పించబడిన అంతఃకరణము గలవాని, ధీః = బుద్ధి, న = భ్రామ్యతే = భ్రమింప జేయబడదు.

పరమేశ్వరుని మాయచే మోహితులై అనాత్మ మరియు మిథ్యా భూతము అగు జగత్తును భోగ్యముగా ఆశ్రయించియున్న యాదవులు మొదలగు వారు గాని, లేదా శ్రీకృష్ణునిపై నిష్కారణమగు వైరమును కలిగి యున్న శిశుపాలాదులు గాని, ఆయనను గురించి పలికిన పలుకులు, ఆత్మ స్వరూపుడగు ఆ శ్రీహరియందు తమ అంతఃకరణమును సమర్పించిన భక్తునకు భ్రాంతిని కలిగించ లేవు.

ప్రదర్శ్యాతప్తతపసామవితృప్తదృశాం నృణామ్ ।
ఆదాయాంతరధాద్యస్తు స్వబింబం లోకలోచనమ్ ॥ **11**

యః తు = ఏ భగవానుడైతే, అతప్తతపసామ్ = చేయబడని తపస్సు గల, అవితృప్తదృశామ్ = సంతృప్తిని చెందని చూపులు గల, నృణామ్ = మానవులకు, లోకలోచనమ్ = ముల్లోకములలో అందమైన, స్వబింబమ్ = తన రూపమును, ప్రదర్శ్య = చూపించి, లోకలోచనమ్ = జనుల చూపును, ఆదాయ = తీసుకొని, అంతరధాత్ = అంతర్ధానమును చెందెనో.

ఆ భగవానుడు తపస్సును చేయని మానవులకు కూడ తన త్రిలోకసుందరమగు రూపమును చూపించెను. కాని, ఇంకనూ వారు ఆ రూపమును చూచుటలో తృప్తిని చెందకుండగనే, ఆయన జనుల చూపునే తీసుకొని పోయినాడా యన్నట్లు, ఆ రూపమును ఉపసంహరించి అంతర్ధానమును చెందినాడు.

యన్మర్త్యలీలౌపయికం స్వయోగ-
మాయాబలం దర్శయతా గృహీతమ్ ।
విస్మాపనం స్వస్య చ సౌభగర్ధేః
పరం పదం భూషణభూషణాంగమ్ ॥ 12

స్వయోగమాయాబలమ్ = తన యోగమాయయొక్క ప్రభావమును, దర్శయతా = ప్రదర్శించే భగవానునిచే, మర్త్యలీలా-ఔపయికమ్ = మానవలీలలకు యోగ్యమైనది, స్వస్య చ = తనకు కూడా, విస్మాపనమ్ = ఆశ్చర్యమును కలిగించునది, సౌభగ-ఋద్ధేః = సౌభాగ్యముయొక్క సమృద్ధికి, పరమ్ = సర్వోత్కృష్టమగు, పదమ్ = స్థానము, భూషణభూషణ-అంగమ్ = భూషణములకు కూడ అలంకారమగు అవయవములు గలది అగు, యత్ = ఏ రూపము, గృహీతమ్ = స్వీకరించ బడినదో.

భగవానుడు తన యోగమాయయొక్క ప్రభావమును లోకమునకు చూపగోరి మానవలీలలకు అనురూపమైన రూపమును స్వీకరించినాడు. సౌభాగ్యముయొక్క సమృద్ధికి పరాకాష్ఠయైన ఆ రూపమును చూచి ఆయన తాను కూడ ఆశ్చర్యమును పొందెడివాడు. ఆ రూపముయొక్క అవయవములు భూషణములకే వన్నెను తెచ్చుచుండెడివి.

యద్ధర్మసూనోర్బత రాజసూయే
నిరీక్ష్య దృక్స్వస్త్యయనం త్రిలోకః ।
కార్త్స్న్యేన చాద్యేహ గతం విధాతుః
అర్వాక్సృతౌ కౌశలమిత్యమన్యత ॥ **13**

ధర్మసూనోః = ధర్మరాజుయొక్క, రాజసూయే = రాజసూయయాగమునందు, దృక్-స్వస్తి-అయనమ్ = కన్నులకు గొప్ప ఆనందమును కలిగించే, యత్ = ఏ రూపమును, నిరీక్ష్య = చూచి, త్రిలోకః = ముల్లోకములలోని జనము, బత = ఆశ్చర్యము!, అర్వాక్-సృతౌ = దేవతల సృష్టి తరువాతిది అగు మానవసృష్టియందు, విధాతుః = బ్రహ్మగారి, కౌశలమ్ = నైపుణ్యము, అద్య = ఈనాడు, ఇహ = ఈ రూపమునందు, కార్త్స్న్యేన = పూర్తిగా, గతమ్ = పర్యవసానమును చెందినది, ఇతి = అని, అమన్యత = తలపోసెనో.

ధర్మరాజుగారి రాజసూయయాగములో ముల్లోకములలోని జనులు కన్నులకు పరమానందమును గొలిపే శ్రీకృష్ణుని రూపమును చూచి, ఆశ్చర్యము! దేవతలను సృష్టించిన తరువాత మానవులను సృష్టించిన బ్రహ్మగారి నైపుణ్యమంతయు ఈనాడు ఈ రూపములో పూర్ణముగా వినియోగమునకు వచ్చినది (పర్యవసన్నమైనది) అని తలపోసిరి.

యస్యానురాగప్లుతహాసరాస-
లీలావలోకప్రతిలబ్ధమానాః ।
వ్రజస్త్రియో దృగ్భిరనుప్రవృత్త-
ధియోఽవతస్థుః కిల కృత్యశేషాః ॥ **14**

యస్య = ఏ శ్రీకృష్ణునియొక్క, అనురాగప్లుతహాసరాసలీలా-అవలోకప్రతిలబ్ధమానాః = ప్రేమతో నిండిన చిరునవ్వు వినోదము మరియు లీలతో కూడిన చూపు అనువాటిచే తిరిగి పొందబడిన సమ్మానము గలవారై, వ్రజస్త్రియః = గోపికలు, దృగ్భిః = చూపులతో కూడి, అనుప్రవృత్తధియః = వెనుకనే అనుసరించిన మనస్సులు గలవారై, కృత్యశేషాః =

ఇంకనూ మిగిలియున్న గృహకృత్యములు గలవారై, అవతస్థుః కిల = నిల బడిపోయిరి గదా!

శ్రీకృష్ణుడు అనురాగముతో నిండిన చిరునవ్వుతో, హాస్యవచనము లతో మరియు లీలగా చూసిన చూపుతో గోపికలను చాల సమ్మానించెడి వాడు. అపుడు ఆ గోపికల చూపులు మరియు మనస్సులు శ్రీకృష్ణుని మీదనే నిలిచియుండెడివి. వారు ఇంటి పనులను సగములోనే విడిచిపెట్టి ఆయననే చూస్తూ నిలబడెడివారు.

స్వశాంతరూపేష్వితరైస్స్వరూపైః
అభ్యర్ద్యమానేష్వనుకంపితాత్మా ।
పరావరేశో మహదంశయుక్తో
హ్యజోఽపి జాతో భగవాన్ యథాగ్నిః ॥ 15

స్వశాంతరూపేషు = తన శాంతరూపులగు సజ్జనులు, ఇతరైః = దానికి విరుద్ధములగు, స్వరూపైః = ఘోరరూపులగు రాక్షసులచే, అభి-అ ర్ద్యమానేషు = అధికముగా పీడింపబడుచుండగా, అనుకంపిత-ఆత్మా = కరుణతో నిండిన హృదయము గల, పర-అవర-ఈశః = చరాచరజగత్తు (కా ర్యము) నకు మరియు అవ్యక్తము (ప్రకృతి, కారణము) నకు కూడ నియా మకుడగు పరమేశ్వరుడు, అజః అపి = పుట్టుక లేనివాడే అయిననూ, మహ దంశయుక్తః = మహత్తత్త్వము అంశ (కార్యము) గా గల అవ్యక్తము (మా య) తో కూడినవాడై (తన గొప్ప అంశయగు బలరామునితో కూడినవాడై), అగ్నిః యథా = అగ్ని వలె, జాతః = జన్మించినాడు.

సత్పురుషులు భగవానుని శాంతరూపులు. రాక్షసులు భగవానుని ఘోరరూపులు. వారిని వీరు అధికముగా పీడించుచుండగా చూచిన భగవా నుని హృదయములో గొప్ప దయ కలిగెను. చరాచర జగత్తునకు మరియు దానికి కారణమగు అవ్యక్తమునకు కూడ స్వామియగు పరమేశ్వరునకు జన్మ లేదు. అయిననూ, ఆయన మహత్తత్త్వమునకు కారణమగు మాయా శక్తిచే, తన గొప్ప అంశయగు బలరామునితో కూడి, కట్టెయందు అగ్ని ప్రక టమైన విధముగా, అవతరించెను.

మాం ఖేదయత్యేతదజస్య జన్మ-
విడంబనం యద్వసుదేవగేహే ।
వ్రజే చ వాసోఽరిభయాదివ స్వయం
పురాద్వ్యవాత్సీద్యదనంతవీర్యః ॥ 16

అజస్య = పుట్టుకలేని ఆ పరమేశ్వరుని, వసుదేవగేహే = వసుదేవుని ఇంటిలో, యత్ = ఏ, జన్మవిడంబనమ్ = జన్మించిన లీల గలదో, చ = మరియు, అరిభయాత్ ఇవ = శత్రుభయము చేతను వలె, వ్రజే = గొల్లపల్లె యందు, వాసః = మకాము, అనంతవీర్యః = అనంతమగు పరాక్రమము గల వాడైననూ, స్వయమ్ = స్వయముగా, పురాత్ = నగరమునుండి, యత్ వ్యవాత్సీత్ = పారిపోయెను అనునది ఏది గలదో, ఏతత్ = ఇది, మామ్ = నన్ను, ఖేదయతి = పీడించుచున్నది.

భగవానుడు పుట్టుక లేనివాడే అయిననూ వసుదేవుని ఇంటిలో శ్రీకృష్ణుని రూపములో జన్మించినట్లు లీలను నెరపినాడు. ఆయన శత్రువులక భయపడిపోయినాడా యన్నట్లు గొల్లపల్లెకు చేరి, అచట నివసించినాడు. ఆయన అనంతమగు పరాక్రమము గలవాడే అయిననూ, స్వయముగా నగరమునుండి పారిపోయినాడు. భగవానుని ఈ లీలలు గుర్తుకు వచ్చి నాకు దుఃఖము కలుగుచున్నది.

దునోతి చేతస్స్మరతో మమైతత్
యదాహ పాదావభివంద్య పిత్రోః ।
తాతాంబ కంసాదురుశంకితానాం
ప్రసీదతం నోఽకృతనిష్కృతీనామ్ ॥ 17

ఏతత్ = ఈ విషయమును, స్మరతః = గుర్తుకు తెచ్చుకునే, మమ = నా, చేతః = మనస్సు, దునోతి = దుఃఖమును కలిగించుచున్నది, యత్ = ఏదనగా, పిత్రోః = తల్లిదండ్రుల, పాదౌ = పాదములను, అభివంద్య = నమస్కరించి, ఆహ = పలికెను, తాత = తండ్రీ!, అంబ = అమ్మా!, కంసాత్ = కంసుని వలన, ఉరు = అధికముగా, శంకితానామ్ = భయపడిన, అకృతని

ష్కృతీనామ్ = చేయబడని సేవ గల, నః = మాకు, ప్రసీదతమ్ = ప్రస న్నులు కండు.

శ్రీకృష్ణుడు తన తల్లిదండ్రులగు దేవకీ వసుదేవుల పాదములకు నమస్కరించి, తండ్రీ! అమ్మా! కంసుని వలన చాల భయపడి మీకు సేవను చేయలేక పోయిన నాపై మీరు అపరాధమును మన్నించి ప్రస న్నులు కండు అని పలికెను. ఈ విషయము గుర్తుకు వచ్చినప్పుడు నాకు మనస్సులో చాల దుఃఖము కలుగుచున్నది.

కో వా అముష్యాంఘ్రిసరోజరేణుం
విస్మర్తుమీశీత పుమాన్ విజిఘ్రన్ ।
యో విస్ఫురద్భ్రూవిటపేన భూమేః
భారం కృతాంతేన తిరశ్చకార ॥ **18**

అముష్య = ఈ శ్రీకృష్ణునియొక్క, అంఘ్రిసరోజరేణుమ్ = పాదప ద్మముల పుప్పొడిని, విజిఘ్రన్ = ఆఘ్రాణించే, కః = ఏ, పుమాన్ = పురుషు డు, విస్మర్తుమ్ = మరచుటకు, ఈశీత వా = సమర్థుడగును?, యః = ఎవడై తే, కృతాంతేన = మృత్యువు అయిన, విస్ఫురత్-భ్రూవిటపేన = కదిలే తీగ వంటి కనుబొమతో, భూమేః = భూమియొక్క, భారమ్ = భారమును, తిర శ్చకార = తొలగించి వేసెనో.

శ్రీకృష్ణుడు మృత్యుస్వరూపమైన తన తీగవంటి కనుబొమ కదలి కచే మాత్రమే భూమియొక్క భారమును నిర్మూలించెను. అట్టి భగవానుని పాదపద్మములను సేవించే పురుషుడు ఎవ్వాడు ఆయనను మరువగ ల్గును?

దృష్టా భవద్భిర్నను రాజసూయే
చైద్యస్య కృష్ణం ద్విషతోఽపి సిద్ధిః ।
యాం యోగినస్సంస్పృహయంతి సమ్యక్
యోగేన కస్తద్విరహం సహేత ॥ **19**

రాజసూయే = రాజసూయయాగమునందు, కృష్ణమ్ = శ్రీకృష్ణుని, ద్విషతః అపి = ద్వేషించుచున్నవాడే అయిననూ, చైద్యస్య = శిశుపాలుని, సిద్ధిః = సిద్ధిని పొందుట, భవద్భిః = మీచే, నను దృష్టా = చూడబడినది గదా!, యామ్ = ఏ సిద్ధిని, యోగినః = యోగులు, సమ్యక్ యోగేన = సమ్యగ్దర్శనము అనే సాధనముచే, స్పృహయంతి = కోరుచుందురో, కః = ఎవ్వాడు, తద్-విరహమ్ = ఆ శ్రీకృష్ణుని వియోగమును, సహేత = సహించగల్గును?

రాజసూయ యాగములో శ్రీకృష్ణుని ద్వేషించే శిశుపాలుడు కూడ భగవంతుని పొందుటను మీరు చూచియే యున్నారు గదా! సాధకులు సమ్యగ్దర్శనము ద్వారా అట్టి భగవత్ప్రాప్తిని మాత్రమే కోరుచుందురు. అట్టి భగవానుని వియోగమును ఎవరు సహించగలరు?

తథైవ చాన్యే నరలోకవీరా
యఆహవే కృష్ణముఖారవిందమ్ ।
నేత్రైః పిబంతో నయనాభిరామం
పార్థాస్త్రపూతాః పదమాపురస్య ॥ 20

చ = మరియు, తథా ఏవ = అదే విధముగా, అన్యే = ఇతరులగు, యే = ఏ, నరలోకవీరాః = మానవవీరులు, ఆహవే = యుద్ధమునందు, నయన-అభిరామమ్ = కన్నులకు హాయిని గొల్పే, కృష్ణముఖ-అరవిందమ్ = శ్రీకృష్ణుని ముఖము అనే పద్మమును, నేత్రైః = కన్నులతో, పిబంతి = పానము చేయుచున్నారో వారు, పార్థ-అస్త్రపూతాః = అర్జునుని అస్త్రములచే పావనము చేయబడినవారై, అస్య = ఈ భగవానుని, పదమ్ = ధామమును, ఆపుః = పొందిరో.

ఇంతేగాక, కురుక్షేత్రములో ఎంతో మంది వీరులు కన్నులకు ఆహ్లాదమును కలిగించే శ్రీకృష్ణుని ముఖపద్మమును శిశుపాలుని వలెనే కన్నులతో పానము చేయుచూ యుద్ధమును చేసిరి. వారు అర్జునుని అస్త్రములచే కొట్టబడి వీరమరణమును పొందినవారై ఆ భగవానుని ధామమును పొందిరి.

స్వయం త్వసామ్యాతిశయస్త్ర్యధీశః
స్వారాజ్యలక్ష్మ్యాప్తసమస్తకామః ।
బలిం హరద్భిశ్చిరలోకపాలైః
కిరీటకోట్యేడితపాదపీఠః ॥ 21

అసామ్య-అతిశయః = సరిదూగువాడు గాని అధికుడు గాని లేని వాడు, స్వయం తు = స్వయముగా, త్రి-అధి-ఈశః = సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతికి అధ్యక్షుడు (ముల్లోకములకు అధిపతి), స్వారాజ్యలక్ష్మ్యా = స్వయంప్రకాశస్వరూపముయొక్క సంపత్తిచే (త్రిలోకాధిపత్యము యొక్క సంపదచే), ఆప్తసమస్తకామః = పొందబడిన అన్ని అభీష్టములు గలవాడు అగు శ్రీకృష్ణుడు, బలిమ్ = ఉపహారమును, హరద్భిః = తీసుకువచ్చే, చిరలోకపాలైః = చిరకాలమునుండి లోకములను పాలించుచున్న ఇంద్రాది దేవతలచే, కిరీటకోట్యా = కిరీటముల అగ్రభాగముచే, ఈడితపాదపీఠః = సేవించబడే కాలి పీట గలవాడు.

శ్రీకృష్ణునితో సరిదూగువాడు గాని, ఆయన కంటె అధికుడు గాని మరియొకడు లేడు. ఆయన స్వయముగా సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతికి, దాని కార్యమగు ముల్లోకములకు అధీశ్వరుడు. స్వయంప్రకాశ పరమానంద స్వరూపమునందు నిలిచియుండే ఆ త్రిలోకాధిపతికి అభీష్టములన్నియు పొందబడియే యున్నవి. చిరకాలమునుండి లోకములనేలుచున్న ఇంద్రుడు మొదలగు దిక్పాలకులు పూజాద్రవ్యములను (ఉపహారములను) తీసుకువచ్చి తమ కిరీటముల కొనలను ఆయన కాలూనే పీఠమునకు ఆన్చి సేవించుచున్నారు.

తత్తస్య కైంకర్యమలం భృతాన్నో విగ్లాపయత్యంగ యదుగ్రసేనమ్।
తిష్ఠన్నిషణ్ణం పరమేష్ఠిధిష్ణ్యే న్యబోధయద్దేవ నిధారయేతి ॥ 22

అంగ = ఓయీ విదురా!, పరమేష్ఠిధిష్ణ్యే = సార్వభౌముని సింహాసనమునందు, నిషణ్ణమ్ = కూర్చునియున్న, ఉగ్రసేనమ్ = ఉగ్రసేన మహారాజును గురించి, తిష్ఠన్ = నిలబడియున్నవాడై, దేవ = ఓ మహారాజా!, నిధారయ = అవధరింపుము, ఇతి = అని, యత్ = దేనిని, న్యబోధయత్ = విన్న

వించినాడో, తస్య = ఆ భగవానుని, తత్ = ఆ, కైంకర్యమ్ = సేవాభావము, భృతాన్ = సేవకులమగు, నః = మమ్ములను, అలమ్ = మిక్కిలి, విగ్లాప యతి = గ్లానిని కలిగించుచున్నది.

ఓయీ విదురా! ఉగ్రసేన మహారాజు సార్వభౌమసింహాసనముపై ఆసీనుడై యుండగా శ్రీకృష్ణుడు ఆయన ముందు నిలబడి, ఓ మహారాజా! ఆలకించుడు అని విన్నవించెడివాడు. భగవానుని ఆ సేవాభా॰ ము తలపు నకు వచ్చినప్పుడు మావంటి సేవకులకు మిక్కిలి క్లేశమును క॰ ిగించును.

అహో బకీ యం స్తనకాలకూటం
జిఘాంసయాపాయయదప్యసా ్వీ ।
లేభే గతిం ధాత్ర్యుచితాం తతోऽన్యం
కం వా దయాలుం శరణం వ్రజేమ ॥ 23

అహో = ఆశ్చర్యము!, అసాధ్వీ = దుష్టురాలగు, బకీ = పూతన, యమ్ = ఏ శ్రీకృష్ణుని, జిఘాంసయా = చంపాలనే కోరికతో, స్తనకాలకూ టమ్ = స్తనములయందలి కాలకూటవిషమును, అపాయయత్ = త్రాగించె నో, అపి = అయినప్పటికీ, ధాత్రీ-ఉచితామ్ = పెంపుడు తల్లి (యశోద) కి ఈయదగిన, గతిమ్ = పుణ్యలోకమును, లేభే = పొందెనో, తతః = అట్టి శ్రీకృష్ణునికంటె, అన్యమ్ = మరియొక, దయాలుమ్ = దయానిధిని, కం వా = ఎవ్వానిని, శరణమ్ = శరణు, వ్రజేమ = పొందెదము?

ఆశ్చర్యము! దుష్టురాలగు పూతన శ్రీకృష్ణుని చంపవలెననే కోరి కతో స్తనములకు కాలకూట విషమును పూసుకొని ఆయనకు పాలను త్రాగించెను. అయిననూ, పెంచిన తల్లి యశోదకు అర్హమైన పుణ్యగతి ఆమెకు దక్కెను. శ్రీకృష్ణుడు అంతటి దయామయుడు. ఆయనను విడిచి మేము మరియెవరిని శరణు పొందెదము?

మన్యేऽసురాన్ భాగవతాంస్త్ర్యధీశే
సంరంభమార్గాభినివిష్టచిత్తాన్ ।
యే సంయుగేऽచక్షత తార్క్ష్యపుత్ర-

మంసే సునాభాయుధమాపతంతమ్ ॥ 24

త్రి-అధీశే = ముల్లోకములకు అధిపతి (సత్త్వరజస్తమోగుణములకు అధిష్ఠానము) యగు శ్రీమహావిష్ణువునందు, సంరంభమార్గ-అభినివిష్టచిత్తాన్ = వైరపద్ధతియందు పట్టుదలతో కూడిన చిత్తములు గల, అసురాన్ = రాక్షసులను, భాగవతాన్ = భగవద్భక్తులుగా, మన్యే = తలంచుచున్నాను, యే = ఏ రాక్షసులు, సంయుగే = యుద్ధమునందు, (ఆపతంతమ్ = మీదకు దుముకుచున్న), తార్క్ష్యపుత్రమ్ = కశ్యపపుత్రుడగు గరుత్మంతుని, అంసే = భుజముపై, ఆపతంతమ్ = అధిష్ఠించియున్న, సునాభాయుధమ్ = సుదర్శన చక్రము ఆయుధముగా గల విష్ణువును, అచక్షత = కనుగొనిరో.

ముల్లోకములకు అధిపతి (త్రిగుణాత్మికయగు ప్రకృతికి అధ్యక్షుడు) అగు శ్రీమహావిష్ణువునందు తీవ్రమగు వైరభావము గల రాక్షసులు కూడ ఆ భగవంతుని భక్తులే యని నా అభిప్రాయము. ఏలయనగా, వారు యుద్ధములో కశ్యపప్రజాపతియొక్క పుత్రుడగు గరుత్మంతుని, సుదర్శన చక్రమును చేతబట్టి ఆయన భుజముపై అధిష్ఠించియున్న విష్ణువును దర్శించెడివారు.

వసుదేవస్య దేవక్యాం జాతో భోజేంద్రబంధనే ।
చికీర్షుర్భగవానస్యాశ్శమజేనాభియాచితః ॥ 25

అజేన = బ్రహ్మచే, అభియాచితః = ప్రార్థించబడినవాడై, అస్యాః = ఈ భూదేవికి, శమ్ = సుఖమును, చికీర్షుః = చేయగోరిన, భగవాన్ = భగవానుడు, భోజ-ఇంద్రబంధనే = భోజదేశప్రభువగు కంసుని కారాగారములో, వసుదేవస్య = వసుదేవునకు, దేవక్యామ్ = దేవకీదేవియందు, జాతః = పుట్టినాడు.

బ్రహ్మ ప్రార్థించగా భూదేవియొక్క భారమును తగ్గించి ఆమెకు సుఖమును కలిగించుటకై శ్రీమహావిష్ణువు కంసుని కారాగారములో దేవకీవసుదేవులకు పుత్రుడై జన్మించినాడు.

తతో నందవ్రజమితః పిత్రా కంసాద్విబిభ్యతా ।

ఏకాదశ సమాస్తత్ర గూఢార్చిస్సబలోఽవసత్ ॥ 26

తతః = తరువాత, కంసాత్ = కంసుని వలన, విబిభ్యతా = చాల భయపడుచున్న, పిత్రా = తండ్రితో కూడి, నందవ్రజమ్ = నందుని గొల్లపల్లెకు, ఇతః = వెళ్లినాడు, తత్ర = అచట, సబలః = బలరామునితో కూడినవాడై, గూఢ-అర్చిః = రహస్యమగు తేజస్సు గలవాడై, ఏకాదశ = పదకొండు, సమాః = సంవత్సరముల కాలము, అవసత్ = నివసించెను.

తరువాత కంసుని వలన చాల భయపడియున్న వసుదేవుడు ఆయనను నందుని గొల్లపల్లెకు చేర్చెను. ఆయన అచట బలరామునితో కూడి తన తేజస్సు బయట పడకుండగా పదకొండు సంవత్సరములు నివసించెను.

పరీతో వత్సపైర్వత్సాంశ్చారయన్ వ్యహరద్విభుః ।
యమునోపవనే కూజద్ద్విజసంకులితాంఘ్రిపే ॥ 27

విభుః = ఆ ప్రభుడు, వత్సపైః = దూడలను కాచే కుర్రవాళ్లతో కూడి, వత్సాన్ = దూడలను, పరీతః = చుట్టువారబడినవాడై, చారయన్ = త్రిప్పుచూ (మేపిస్తూ), కూజత్-ద్విజసంకులిత-అంఘ్రిపే = కూసే పక్షులచే వ్యాపించబడియున్న వృక్షములు గల, యమునా-ఉపవనే = యమునానదీతీరమునందలి అడవిలో, వ్యహరత్ = విహరించెను.

ఆ ప్రభుడు యమునానదీతీరమునందలి అడవిలో గోపబాలకులచే చుట్టువారబడినవాడై ఆవులను దూడలను మేపుచూ విహరించెను. ఆ అడవిలోని వృక్షములు కూతలు కూసే పక్షులతో నిండి యుండెడివి.

కౌమారీం దర్శయంశ్చేష్టాం ప్రేక్షణీయాం వ్రజౌకసామ్ ।
రుదన్నివ హసన్ముగ్ధబాలసింహావలోకనః ॥ 28

వ్రజ-ఓకసామ్ = గోకులములో నివసించువారలకు, ప్రేక్షణీయామ్ = మనోహరమైన, కౌమారీం చేష్టామ్ = బాల్యచేష్టను, దర్శయన్ = చూపువాడై, రుదన్ ఇవ = ఏడ్చుచున్నవాని వలె, హసన్ = నవ్వుచున్నవాడై,

ముగ్ధ బాలసింహ-అవలోకనః = సింహపు పిల్లవలె అమాయకపు చూపుగల వాడై (విహరించెను).

ఆయన తన బాల్యలీలలతో గోకులములోని జనుల మనస్సులను దోచివేసెను. ఆయన ఒకప్పుడు ఏడ్చెడివాడు; మరియొకప్పుడు నవ్వెడి వాడు; సింహపు పిల్లవలె అమాయికముగా చూచెడివాడు.

స ఏవ గోధనం లక్ష్మ్యా నికేతం సితగోవృషమ్ ।
చారయన్ననుగాన్ గోపాన్ రణద్వేణురరీరమత్ ॥ 29

సః ఏవ = ఆయనయే, లక్ష్మ్యాః = శోభకు, నికేతమ్ = నివాసస్థానము, సితగోవృషమ్ = తెల్లని ఆవులు ఎద్దులు గలది అగు, గోధనమ్ = గోసంపదను, చారయన్ = త్రిప్పుచూ మేపుచున్నవాడై, రణత్-వేణుః = ధ్వనించుచున్న వేణువు గలవాడై, అనుగాన్ = తనవెంట వచ్చే, గోపాన్ = గోపాలకులను, అరీరమత్ = రమింపజేసెను.

ఆయన కొంత పెద్ద వయస్సు వచ్చిన తరువాత, శోభకు పుట్టినిల్లైన గోసంపదను త్రిప్పుచూ మేపుచూ, వేణువును వాయిస్తూ, తన తోడి గోపాలకులకు వినోదమును కలిగించెడివాడు. ఆయన ఆవుల మందలో తెల్లనివి మాత్రమే గాక ఇతరవర్ణపు ఆవులు, ఎద్దులు కూడ ఉండెడివి.

ప్రయుక్తాన్ భోజరాజేన మాయినః కామరూపిణః ।
లీలయా వ్యనుదత్తాంస్తాన్ బాలః క్రీడనకానివ ॥ 30

భోజరాజేన = భోజరాజగు కంసునిచే, ప్రయుక్తాన్ = నియోగించబడినవారు, మాయినః = మాయావులు, కామరూపిణః = ఇచ్ఛవచ్చిన రూపమును ధరించగలవారు అగు, తాన్ తాన్ = ఆయా రాక్షసులను, బాలః = చిన్నపిల్లవాడు, క్రీడనకాన్ ఇవ = ఆట వస్తువులను వలె, లీలయా = అవలీలగా, వ్యనుదత్ = దునుమాడెను.

భోజరాజగు కంసుడు శ్రీకృష్ణునిపైకి మాయావులు, ఇచ్ఛవచ్చిన రూపమును దాల్చే శక్తిగలవారు అగు రాక్షసులను పంపెను. వారినందరినీ ఆయన, చిన్న పిల్లవాడు ఆటవస్తువులను వలె, అవలీలగా దునుమాడెను.

విపన్నాన్ విషపానేన నిగృహ్య భుజగాధిపమ్ ।
ఉత్థాప్యాపాయయద్గావస్తత్తోయం ప్రకృతిస్థితమ్ ॥ 31

భుజగ-అధిపమ్ = నాగరాజు అగు కాళియుని, నిగృహ్య = దండించి, విషపానేన = విషపు నీటిని త్రాగుటచే, విపన్నాన్ = మరణించిన, గావః = గోవులను, ఉత్థాప్య = జీవింపజేసి, ప్రకృతిస్థితమ్ = విషము తొలగి స్వచ్ఛమైన, తత్ = ఆ, తోయమ్ = నీటిని, అపాయయత్ = త్రాగించెను.

నాగరాజగు కాళియుడు సరస్సులోని జలమునంతనూ విషపూరితము చేసెను. ఆ జలమును త్రాగి గోపాలకులు గోవులు మరణించగా, శ్రీకృష్ణుడు ఆ కాళియుని దండించి, వారిని మరల జీవింపజేసెను. కాళియుని నిష్క్రమణముచే ఆ జలములు మరల యథాప్రకారముగా స్వచ్ఛములై, మరల గోవులకు గోపాలకులకు త్రాగుటకు యోగ్యములాయెను.

అయాజయద్గోసవేన గోపరాజం ద్విజోత్తమైః ।
విత్తస్య చోరుభారస్య చికీర్షన్ సద్వ్యయం విభుః ॥ 32

చ = మరియు, విభుః = ఆ శ్రీకృష్ణప్రభుడు, ఉరుభారస్య = మిక్కిలి సమృద్ధమగు, విత్తస్య = ధనముయొక్క, సద్-వ్యయమ్ = మంచి ఖర్చును, చికీర్షన్ = చేయగోరువాడై, గోపరాజమ్ = నందమహారాజును, ద్విజ-ఉత్తమైః = బ్రాహ్మణోత్తముల ద్వారా, గోసవేన = గోయజ్ఞముచే, అయాజయత్ = పూజను చేయించెను.

ఇంతేగాక, ఆ శ్రీకృష్ణప్రభుడు మిక్కిలి సమృద్ధమగు ధనమును మంచిగా ఖర్చు చేయదలచినవాడై, బ్రాహ్మణోత్తముల సాహాయ్యముతో, నందమహారాజుచే గోపూజను చేయించెను.

వర్షతీంద్రే వ్రజః కోపాద్భగ్నమానేఽతివిహ్వలః ।
గోత్రలీలాతపత్రేణ త్రాతో భద్రానుగృహ్ణతా ॥ 33

భద్ర = ఓ విదురా!, ఇంద్రే = ఇంద్రుడు, కోపాత్ = కోపము వలన, వర్షతి = వర్షించుచుండగా, అతివిహ్వలః = పెద్ద ఆపదను పొందియున్న

వ్రజః = గొల్లపల్లె, అనుగృహ్ణాతా = అనుగ్రహమును చూపే శ్రీకృష్ణునిచే, గోత్రలీలా-ఆతపత్రేణ = పర్వతము అనే విలాస కొరకు పట్టుకునే గొడుగుతో, త్రాతః = రక్షించబడినది.

ఓ విదురా! ఇంద్రుడు కోపించి నందవ్రజమును వర్షముతో ముంచెత్తెను. ఆ పల్లెకు ఆ విధముగా పెద్ద ఆపద వచ్చినప్పుడు, శ్రీకృష్ణుడు పర్వతమును అవలీలగా ఎత్తి గొడుగును వలె పట్టుకొని, అందరినీ రక్షించి అనుగ్రహించెను.

శరచ్ఛశికరైర్మృష్టం మానయన్ రజనీముఖమ్ ।
గాయన్ కలపదం రేమే స్త్రీణాం మండలమండనః ॥ 34

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
విదురోద్ధవసంవాదే ద్వితీయోఽధ్యాయః ॥

శరత్-శశికరైః = శరత్కాలచంద్రుని కిరణములచే, మృష్టమ్ = ప్రకాశించే, రజనీముఖమ్ = ప్రదోష (సాయంసంధ్యా) కాలమును, మానయన్ = సమ్మానించువాడై, స్త్రీణామ్ = గోపికల, మండలమండనః = మండలమును అలంకరించువాడై, కలపదమ్ = అవ్యక్తమధురమగు పదములు ఉండు విధముగా, గాయన్ = గానము చేయుచూ, రేమే = రమించెను.

శరదృతువుయొక్క ప్రదోషకాలములో బృందావనము చంద్రుని వెన్నెలలతో ఉజ్జ్వలముగా ప్రకాశించుచుండగా, శ్రీకృష్ణుడు ఆ ప్రకృతిశోభకు తగిన సమ్మానమునిచ్చువాడై, గోపికల మండలమునకు వన్నెను చేకూరుస్తూ, అవ్యక్తమధురమగు గీతములనాలాపిస్తూ, విహరించెను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
విదుర-ఉద్ధవ సంవాదములో రెండవ
అధ్యాయము ముగిసినది (2).

* * * * *

# అథ తృతీయోఽధ్యాయః

## శ్రీకృష్ణ భగవానుని లీలలను వర్ణించుట

ఉద్ధవ ఉవాచ ।
తతస్స ఆగత్య పురం స్వపిత్రో-
శ్చికీర్షయా శం బలదేవసంయుతః ।
నిపాత్య తుంగాద్రిపుయూథనాథం
హతం వ్యకర్షద్వ్యసుమోజసోర్వ్యామ్ ॥ 1

ఉద్ధవః = ఉద్ధవుడు, ఉవాచ = పలికెను, తతః = తరువాత (ఆ వ్రజ మునుండి), సః = ఆ శ్రీకృష్ణుడు, బలదేవసంయుతః = బలరామునితో కూడినవాడై, స్వపిత్రోః = తన తల్లిదండ్రులకు, శమ్ = సుఖమును, చికీర్షయా = కలిగించవలెననే కోరికతో, పురమ్ = మథురా నగరమును గూర్చి, ఆగత్య = వచ్చి, హతమ్ = కొట్టబడిన, వ్యసుమ్ = పోయిన ప్రాణములు గల, రిపుయూథనాథమ్ = శత్రువర్గమునకు నాయకుడగు కంసుని, తుంగాత్ = ఎత్తైన సింహాసనమునుండి, ఉర్వ్యామ్ = నేలపై, నిపాత్య = పారవేసి, వ్యకర్షత్ = ఈడ్చెను.

ఉద్ధవుడు ఇట్లు పలికెను --- తరువాత శ్రీకృష్ణుడు తన తల్లిదండ్రులకు సుఖమును కలిగించగోరి, బలరామునితో గూడినవాడై నందవ్రజమునుండి మథురా నగరమునకు వచ్చెను. ఆయన అచట తమ శత్రుసముదాయమునకు నాయకుడగు కంసుని కొట్టి చంపి ఎత్తైన సింహాసనమునుండి నేలపై పడవేసి ఈడ్చెను.

సాందీపనేస్సకృత్ప్రోక్తం బ్రహ్మాధీత్య సవిస్తరమ్ ।
తస్మై ప్రాదాద్వరం పుత్రం మృతం పంచజనోదరాత్ ॥ 2

సాందీపనేః = సాందీపని మహర్షినుండి, సకృత్ = ఒక్కసారి, ప్రోక్తమ్ = చెప్పబడిన, సవిస్తరమ్ = అంగోపాంగములతో కూడియున్న, బ్రహ్మ = వేదమును, అధీత్య = చదివి, తస్మై = ఆయన కొరకు, మృతమ్ = మరణించిన, పుత్రమ్ = పుత్రుని, పంచజన-ఉదరాత్ = పంచజనుడనే రాక్షసుని పొట్టనుండి, వరమ్ = వరముగా, ప్రాదాత్ = ఇచ్చెను.

సాందీపని మహర్షి ఒక్కసారి ఉచ్చరించిన దానిని శ్రీకృష్ణుడు వెంటనే నేర్చెడివాడు. ఆ విధముగా ఆయన ఆరు అంగములతో కూడిన వేదమును అధ్యయనము చేసెను. ఆ గురువుగారి పుత్రుడు ఎప్పుడో మరణించెను. శ్రీకృష్ణుడు పంచజనుడను రాక్షసుని ఉదరమునుండి ఆ పుత్రుని తీసుకువచ్చి గురువుగారికి వరము (దక్షిణ) గానిచ్చెను.

సమాహుతా భీష్మకకన్యయా యే
శ్రియస్సవర్ణేన బుభూషయైషామ్ ।
గాంధర్వవృత్త్యా మిషతాం స్వభాగం
జహ్రే పదం మూర్ధ్ని దధత్సుపర్ణః ॥ 3

శ్రియః = లక్ష్మీదేవికి, సవర్ణేన = సమానమగు రూపముగల, (శ్రియః = రుక్మిణికి, సవర్ణేన = పేరులో సమానమగు అక్షరములు గల రుక్మిచే), భీష్మకకన్యయా = భీష్మకుని పుత్రియగు రుక్మిణిచే (ఆమె కారణముగా, లేక ఆమె సౌందర్యముచే), సమాహుతాః = ఆహ్వానించబడిన, యే = ఏ శిశుపాలాదులు గలరో, ఏషామ్ = వీరలు, మిషతామ్ = చూచుచుండగా, పదమ్ = పాదమును, మూర్ధ్ని = శిరస్సుపై, దధత్ = ఉంచువాడై, గాంధర్వవృత్త్యా = గాంధర్వవిధిచే (పరస్పరము ప్రేమ మరియు సంకేతములు గల విధానముచే), బుభూషయా = వివాహమాడు కోరికతో, సుపర్ణః = అందమగు రథము గల శ్రీకృష్ణుడు (గరుడుడు అమృతమును వలె), స్వభాగమ్ = తనలో భాగమైన రుక్మిణిని, జహ్రే = కొనిపోయెను.

భీష్మకుని పుత్రియగు రుక్మిణి స్వయంవరమునకు ఆమె అన్న రుక్మి శిశుపాలుడు మొదలగు వారిని ఆహ్వానించెను. ఆ రుక్మిణి లక్ష్మీదేవి వలె నుండెను. ఆమె సౌందర్యమే ఆహ్వానము కాగా ఆమెను పొందగో

వారందరు విచ్చేసిరి. శ్రీకృష్ణుడు, రుక్మిణి పరస్పరము ప్రేమించుకొని సంకేతములను చేసుకొని యుండిరి. ఆమె ఆయనకు నిత్యసహచారిణి. ఆయన గాంధర్వవిధానముచే ఆమెను వివాహమాడగోరి అందమగు రథ ముపై వచ్చెను. ఆ శిశుపాలాదులు చూచుచున్ననూ లెక్క చేయకుండగా, ఆయన వారి శిరస్సులపై తన కాలిని మోపి (వారిని చిత్తుగా ఓడించి), గరుత్మంతుడు అమృతమును వలె, ఆమెను తీసుకొని పోయెను.

> కకుద్మతోఽవిద్ధనసో దమిత్వా
> స్వయంవరే నాగ్నజితీమువాహ ।
> తద్భగ్నమానానపి గృధ్యతోఽజ్ఞా-
> ఞ్జఘ్నేఽక్షతశ్శస్త్రభృతస్స్వశస్త్రైః ॥ 4

అవిద్ధనసః = కుట్టబడని ముక్కులు గల, కకుద్మతః = ఎద్దులను, దమిత్వా = అదుపులోనికి తెచ్చి, స్వయంవరే = స్వయంవరమునందు, నాగ్నజితీమ్ = నగ్నజిత్తుయొక్క పుత్రికను, ఉవాహ = వివాహమాడెను, తద్-భగ్నమానాన్ అపి = ఆ పనిచే భంగము చేయబడిన అభిమానము కలవారే అయిననూ, గృధ్యతః = రాజకుమారిని పొందాలనే తృష్ణను కలిగి యున్న, అజ్ఞాన్ = అజ్ఞానులగు, శస్త్రభృతః = ఆయుధములను ధరించి యున్న రాజులను, అక్షతః = తాను గాయపడనివాడై, స్వశస్త్రైః = తన ఆయుధములచే, జఘ్నే = సంహరించెను.

శ్రీకృష్ణుడు ముక్కు కుట్టని ఎద్దులను అదుపులోనికి తెచ్చి, స్వయంవరమునందు నాగ్నజితిని వివాహమాడెను. ఆయన చేసిన ఆ గొప్ప కర్మచే ఇతరరాజులకు గర్వభంగము అయ్యేను. అయిననూ, వారు అజ్ఞానముచే ఇంకనూ రాజకుమారియందు తృష్ణ గలవారై ఆయుధము లను చేతబట్టిరి. అపుడు ఆయన తాను స్వయముగా గాయపడకుండగా, తన ఆయుధములతో వారిని సంహరించెను.

> ప్రియం ప్రభుర్గ్రామ్య ఇవ ప్రియాయా
> విధిత్సురార్చ్ఛద్ద్యుతరుం యదర్థే ।
> వజ్ర్యాద్రవత్తం సగణో రుషాంధః

క్రీడామృగో నూనమయం వధూనామ్ ।। 5

ప్రభుః = శ్రీకృష్ణ ప్రభుడు, గ్రామ్యః ఇవ = భోగలాలసుని వలె, ప్రియాయాః = ప్రియురాలగు సత్యభామకు, ప్రియమ్ = ప్రీతిని, విధిత్సుః = చేయగోరువాడై, ద్యుతరుమ్ = పారిజాత వృక్షమును, ఆర్చత్ = పీకుకొని వచ్చెను, యత్-అర్థే = దేని కొరకై, వజ్రీ = వజ్రధారియగు ఇంద్రుడు, రుషాంధః = కోపముతో కన్ను మిన్ను కాననివాడై, సగణః = సైన్యముతో కూడినవాడై, తమ్ = ఆ శ్రీకృష్ణుని ఉద్దేశించి, ఆద్రవత్ = దండెత్తెను, అయమ్ = ఈ ఇంద్రుడు, నూనమ్ = నిశ్చయముగా, వధూనామ్ = స్త్రీల కు, క్రీడామృగః = ఆట జంతువు.

శ్రీకృష్ణప్రభుడు భోగలాలసుని తరహాలో ప్రియురాలగు సత్యభామకు ప్రియమును చేయగోరి స్వర్గమునుండి పారిజాత వృక్షమును తెచ్చెను. దీనిపై ఇంద్రుడు మండిపడి, కోపముతో గ్రుడ్డివాడై, వజ్రమును చేతబట్టి, సైన్యముతో శ్రీకృష్ణునిపై దండెత్తెను. తన ప్రియురాలి ప్రేరణచే అట్లు చేసిన ఇంద్రుడు నిశ్చయముగా ఆడువారి చేతిలో కీలుబొమ్మయే.

సుతం మృధే ఖం వపుషా గ్రసంతం
దృష్ట్వా సునాభోన్మథితం ధరిత్ర్యా ।
ఆమంత్రితస్తత్తనయాయ శేషం
దత్త్వా తదంతఃపురమావివేశ ।। 6

మృధే = యుద్ధమునందు, వపుషా = శరీరముతో, ఖమ్ = ఆకాశమును, గ్రసంతమ్ = మ్రింగుచున్న, సునాభ-ఉన్మథితమ్ = చక్రముచే సంహరించబడిన, సుతమ్ = కుమారుని, దృష్ట్వా = చూచి, ధరిత్ర్యా = పృథివిచే, ఆమంత్రితః = ప్రార్థించబడినవాడై, తత్-తనయాయ = వాని పుత్రుని కొరకు, శేషమ్ = మిగిలిన రాజ్యమును, దత్త్వా = ఇచ్చి, తత్-అంతఃపురమ్ = వాని అంతఃపురమును, ఆవివేశ = ప్రవేశించెను.

యుద్ధములో తన విశాలమగు దేహముతో అంతరిక్షమును మ్రింగుచున్నాడా యన్నట్లు ఉన్న నరకాసురుని శ్రీకృష్ణుడు తన చక్రముతో సంహరించెను. అపుడు వాని తల్లియగు భూదేవి కోరగా, ఆయన మిగిలిన

రాజ్యమును వాని పుత్రుడగు భగదత్తునకు ఇచ్చి, వాని అంతఃపురములో ప్రవేశించెను.

తత్రాహృతాస్తా నరదేవకన్యాః కుజేన దృష్ట్వా హరిమార్తబంధుమ్ ।
ఉత్థాయ సద్యో జగృహుః ప్రహర్షవ్రీడానురాగప్రహితావలోకైః ।। 7

తత్ర = ఆ అంతఃపురమునందు, కుజేన = భూపుత్రుడగు నరకాసురునిచే, ఆహృతాః = తీసుకురాబడిన, తాః = ఆ, నరదేవకన్యాః = రాజకుమార్తెలు, ఆర్తబంధుమ్ = కష్టములో నున్నవారికి రక్షకుడగు, హరిమ్ = శ్రీకృష్ణుని, దృష్ట్వా = చూచి, సద్యః = వెంటనే, ఉత్థాయ = లేచి నిలబడి, ప్రహర్ష వ్రీడా-అనురాగప్రహిత-అవలోకైః = గొప్ప ఆనందము సిగ్గు మరియు అనురాగములచే ప్రేరితములైన చూపులతో, జగృహుః = స్వీకరించిరి.

భూపుత్రుడగు నరకుడు తీసుకు వచ్చిన రాజకన్యలు ఆ అంతఃపురములో గలరు. కష్టములోనున్నవారిని రక్షించే శ్రీకృష్ణుని చూడగానే వారు లేచి నిలబడిరి. వారు గొప్ప ఆనందమును పొంది, సిగ్గుతో మరియు ప్రేమతో ఆయనను చూస్తూ, వెంటనే ఆయనను భర్తగా వరించిరి.

ఆసాం ముహూర్త ఏకస్మిన్నానాగారేషు యోషితామ్ ।
సవిధం జగృహే పాణీననురూపస్స్వమాయయా ।। 8

ఏకస్మిన్ = ఒకే, ముహూర్తే = ముహూర్తమునందు, నానా-ఆగారేషు = అనేకములగు గృహములలో, స్వమాయయా = తన మాయచే, ఆసామ్ = ఈ, యోషితామ్ = యువతులకు, అనురూపః = తగిన రూపము గలవాడై, సవిధమ్ = యథావిధిగా, పాణీన్ జగృహే = వివాహమాడెను.

ఆయన ఆ యువతులనందరినీ వారి వారికి తగిన రూపములను తన మాయచే దాల్చినవాడై ఒకే ముహూర్తమునందు వేర్వేరు గృహములలో యథావిధిగా వివాహమాడెను.

తాస్వపత్యాన్యజనయదాత్మతుల్యాని సర్వతః ।
ఏకైకస్యాం దశ దశ ప్రకృతేర్విబుభూషయా ।। 9

తాసు = వారియందు, ఏక-ఏకస్యామ్ = ఒక్కొక్క భార్యయందు, దశ దశ = పది పది, సర్వతః = అన్ని విధములుగా, ఆత్మతుల్యాని = తనకు తగిన, అపత్యాని = పిల్లలను, ప్రకృతేః = ప్రకృతియొక్క, విబుభూషయా = విస్తరింపజేయవలెననే కోరికచే, అజనయత్ = కనెను.

ఆయన ఆ భార్యలలో ప్రతి ఒక్కరియందు పది మంది పిల్లలను, తనకు అన్ని విధములుగా తగినవారిని కనెను. తద్ద్వారా సృష్టి విస్తరించెను.

కాలమాగధశాల్వాదీననీకై రుంధతః పురమ్ ।
అజీఘనత్స్వయం దివ్యం స్వపుంసాం తేజ ఆదిశత్ ॥ 10

అనీకైః = సేనలతో, పురమ్ = నగరమును, రుంధతః = ముట్టడించిన, కాలమాగధశాల్వ-ఆదీన్ = కాలయవనుడు జరాసంధుడు శాల్వుడు మొదలగు వారిని, స్వయమ్ = స్వయముగా, అజీఘనత్ = సంహరించెను, స్వపుంసామ్ = తన వారలకు, దివ్యమ్ = అలౌకికమగు, తేజః = పరాక్రమమును, ఆదిశత్ = ఇచ్చెను.

కాలయవనుడు, మగధదేశాధిపతియగు జరాసంధుడు, శాల్వుడు మొదలగు వారు సేనలతో మథురను, ద్వారకను ముట్టడించినప్పుడు, శ్రీకృష్ణుడు ఇతరులను కేవలము నిమిత్తముగా చేసుకొని, తానే వారిని మట్టుబెట్టెను. పైగా, అర్జునుడు మొదలగు తన భక్తులకు దివ్యమగు పరాక్రమమును ఇచ్చెను.

శంబరం ద్వివిదం బాణం మురం బల్వలమేవ చ ।
అన్యాంశ్చ దంతవక్త్రాదీనవధీత్కాంశ్చ ఘాతయత్ ॥ 11

శంబరమ్ = శంబరుని, ద్వివిదమ్ = ద్వివిదుని, బాణమ్ = బాణుని, మురమ్ = మురుని, చ = మరియు, బల్వలమ్ ఏవ = బల్వలుని కూడ, అన్యాన్ = ఇతరులగు, దంతవక్త్రాదీన్ చ = దంతవక్త్రుడు మొదలగు వారిని కూడ, అవధీత్ = సంహరించెను, కాన్ చ = మరికొందరిని, ఘాతయత్ సంహరింప జేసెను.

శంబరుడు, ద్వివిదుడు, బాణుడు, మురుడు, బల్వలుడు, దంతవ క్త్రుడు మొదలగు వారిలో కొందరిని శ్రీకృష్ణుడు స్వయముగా సంహరించెను; మరికొందరిని ఇతరులచే వధింపజేసెను.

అథ తే భ్రాతృపుత్రాణాం పక్షయోః పతితాన్ నృపాన్
చచాల భూః కురుక్షేత్రం యేషామాపతతాం బలైః ॥ 12

అథ = తరువాత, తే = నీయొక్క, భ్రాతృపుత్రాణామ్ = సోదరుల పుత్రుల, పక్షయోః = రెండు పక్షములయందు, పతితాన్ = వచ్చిచేరిన, నృపాన్ = రాజులను (సంహరింప జేసెను), కురుక్షేత్రమ్ = కురుక్షేత్రమును గురించి, ఆపతతామ్ = వేగముగా వచ్చుచున్న, యేషామ్ = ఏ రాజుల, బలైః = సైన్యములచే, భూః = భూమి, చచాల = కంపించెనో.

తరువాత ఆయన నీ సోదరులగు పాండు ధృతరాష్ట్రుల సంతానమగు పాండవుల మరియు కౌరవుల పక్షములలో జేరి వచ్చిన రాజులను సంహరింప జేసెను. ఆ రాజులు తమ తమ సైన్యములతో గూడి కురుక్షేత్రమునకు వచ్చుచుండగా, భూమి కంపించెను.

స కర్ణదుశ్శాసనసౌబలానాం
కుమంత్రపాకేన హతశ్రియాయుషమ్ ।
సుయోధనం సానుచరం శయానం
భగ్నోరుమూర్వ్యాం న ననంద పశ్యన్ ॥ 13

కర్ణదుశ్శాసనసౌబలానామ్ = కర్ణుడు దుశ్శాసనుడు మరియు శకుని అను వారల, కుమంత్రపాకేన = చెడు సలహాలు పరిపక్వమగుటచే, హతశ్రియాయుషమ్ = నశింపజేయబడిన సంపద మరియు ఆయుర్దాయము గలవాడు, భగ్న-ఊరుమ్ = విరిగిన తొడలు గలవాడు, స-అనుచరమ్ = అనుచరులతో కూడియున్నవాడు, శయానమ్ = నేలపై పడియున్న, సుయోధనమ్ = దుర్యోధనుని, పశ్యన్ = చూచుచున్నవాడై, సః = ఆ శ్రీకృష్ణుడు, న ననంద = సంతోషించలేదు.

కర్ణుడు దుశ్శాసనుడు మరియు శకుని ఇచ్చిన చెడు సలహాల ఫలితముగా దుర్యోధనుని సంపద నశించి, ఆయువు మూడెను. ఆతడు తొడలు విరుగగొట్టబడగా, అనుచరులతో గూడి యుద్ధరంగములో నేలపై పడియుండెను. కాని, అట్టి దుర్యోధనుని చూచిన శ్రీకృష్ణునకు సంతోషము కలుగలేదు.

కియాన్ భువోఽయం క్షపితోరుభారో
యద్ద్రోణభీష్మార్జునభీమమూలైః ।
అష్టాదశాక్షౌహిణికో మదంశై-
రాస్తే బలం దుర్విషహం యదూనామ్ ॥ **14**

మద్-అంశైః = నా అంశలగు, ద్రోణభీష్మ-అర్జునభీమమూలైః = ద్రోణుడు భీష్ముడు అర్జునుడు భీముడు మొదలగువారిచే, భువః = భూమి యొక్క, అష్టాదశ-అక్షౌహిణికః = పదునెనిమిది అక్షౌహిణుల సంఖ్య గల, అయమ్ = ఈ, క్షపిత-ఉరుభారః = తగ్గించబడిన పెద్ద భారము, కియాన్ = ఎంతటిది?, యత్ = ఏలయన, యదూనామ్ = యాదవుల, దుర్విషహమ్ = సహింప శక్యము కాని, బలమ్ = సైన్యము, ఆస్తే = ఉన్నది.

శ్రీకృష్ణుడు ఇట్లు తలపోసెను --- నా అంశములగు ద్రోణుడు భీష్ముడు అర్జునుడు భీముడు మొదలగు వారు పదునెనిమిది అక్షౌహిణులను మట్టుబెట్టి భూమియొక్క పెనుభారమును తగ్గించినారు. కాని ఇది యెంతటిది? ఏలయనగా, ఇంకనూ సహింప శక్యము కాని యాదవబలము మిగిలియే యున్నది.

మిథో యదైషాం భవితా వివాదో
మధ్వామదాతామ్రవిలోచనానామ్ ।
నైషాం వధోపాయ ఇయానతోఽన్యో
మయ్యుద్యతేఽన్తర్దధతే స్వయం స్మ ॥ **15**

యదా = ఏ కాలమునందు, మధు-ఆమద-ఆతామ్రవిలోచనానామ్ = మద్యముచే కలిగిన గట్టి నిషాచే అంతటా ఎర్రనైన కన్నులు గల, ఏషామ్

= ఈ యాదవులకు, మిథః = పరస్పరము, వివాదః = వివాదము, భవితా = కలుగునో, ఏషామ్ = వీరి, వధ-ఉపాయః = వధయొక్క ఉపాయము, ఇయాన్ = ఇంత మాత్రమే, అన్యః = మరియొకటి, న = లేదు, మయి = నేను, ఉద్యతే = (నిష్క్రమించుటకు) సంసిద్ధుడను కాగా, స్వయమ్ = వారంతట వారే, అంతర్దధతే స్మ = అంతర్ధానమును చెందగలరు.

ఈ యాదవులు మద్యమును త్రాగి గట్టి నిషాతో ఎర్రనైన కన్నులు గలవారై ఒకరితో మరియొకరు పోట్లాడుకొనెదరు. వీరి వధకు ఇంతకంటె మరియొక ఉపాయము లేదు. నేను అవతారమును చాలించుటకు సిద్ధపడు చుండగా వారు తమంత తాముగా నశించగలరు.

ఏవం సంచింత్య భగవాన్ స్వరాజ్యే స్థాప్య ధర్మజమ్ ।
నందయామాస సుహృదస్సాధూనాం వర్త్మ దర్శయన్ ॥16

భగవాన్ = శ్రీకృష్ణ భగవానుడు, ఏవమ్ = ఈ విధముగా, సంచింత్య = ఆలోచించి, ధర్మజమ్ = ధర్మరాజును, స్వరాజ్యే = తన రాజ్యమునందు, స్థాప్య = స్థాపించి, సాధూనామ్ = సత్పురుషుల, వర్త్మ = మార్గమును, దర్శయన్ = చూపుచున్నవాడై, సుహృదః = మిత్రులను, నందయామాస = ఆనందింప జేసెను.

శ్రీకృష్ణ భగవానుడు ఈ విధముగా ఆలోచించి ధర్మరాజును ఆయన రాజ్యమునందు స్థాపించి, తన ప్రవృత్తిచే సత్పురుషుల నడవడిని లోకమునకు చూపిస్తూ బంధుమిత్రులకు సంతోషమును కలిగించెను.

ఉత్తరాయాం ధృతః పూరోర్వంశస్సాధ్వభిమన్యునా ।
స వై ద్రౌణ్యస్త్రసంఛిన్నః పునర్భగవతా ధృతః ॥ 17

అభిమన్యునా = అభిమన్యునిచే, పూరోః వంశః = పూరువంశము, ఉత్తరాయామ్ = ఉత్తరయందు, సాధు = చక్కగా, ధృతః = ధరించబడినది, ద్రౌణి-అస్త్రసంఛిన్నః = అశ్వత్థామయొక్క అస్త్రముచే నశింపజేయబడిన, సః = ఆ శిశువు, భగవతా = శ్రీకృష్ణ భగవానునిచే, పునః = మరల, ధృతః వై = నిశ్చయముగా పరిరక్షించ బడినది.

పూరువంశమును నిలబెట్టువాడు, అభిమన్యుని పుత్రుడు అగు శిశువు ఉత్తరయొక్క గర్భములో చక్కగా పెరుగుచుండగా, ద్రోణపుత్రుడగు అశ్వత్థామ అస్త్రమును ప్రయోగించి, ఆ శిశువును సంహరించెను. అపుడు శ్రీకృష్ణ భగవానుడు ఆ శిశువునకు మరల ప్రాణమును పోసెను.

అయాజయద్ధర్మసుతమశ్వమేధైస్త్రిభిర్విభుః ।
సోఽపి క్ష్మామనుజైః రక్షన్ రేమే కృష్ణమనువ్రతః ॥ 18

విభుః = శ్రీకృష్ణ భగవానుడు, ధర్మసుతమ్ = ధర్మరాజును, త్రిభిః = మూడు, అశ్వమేధైః = అశ్వమేధములచే, అయాజయత్ = యజ్ఞమును చేయించెను, సః అపి = ఆయన కూడా, అనుజైః = సోదరులతో గూడి, క్ష్మామ్ = భూమిని, రక్షన్ = పాలించుచూ, కృష్ణమ్ = శ్రీకృష్ణుని, అనువ్రతః = నిష్ఠతో అనుసరించువాడై, రేమే = సుఖించెను.

శ్రీకృష్ణ భగవానుడు ధర్మరాజుచే మూడు అశ్వమేధయాగములను చేయించెను. ధర్మరాజు కూడ తమ్ములతో కలిసి రాజ్యమునేలుచూ, శ్రీకృష్ణుని నిష్ఠతో అనుసరించువాడై, సుఖించెను.

భగవానపి విశ్వాత్మా లోకవేదపథానుగః ।
కామాన్ సిషేవే ద్వార్వత్యామసక్తస్సాంఖ్యమాస్థితః ॥ 19

విశ్వ-ఆత్మా = జగత్తునకు ఆత్మ (అధిష్ఠానము) అయిన, భగవాన్ అపి = శ్రీకృష్ణ భగవానుడు కూడ, లోకవేదపథ-అనుగః = లోకమర్యాదను వైదిక మర్యాదను అనుసరించువాడై, ద్వార్వత్యామ్ = ద్వారకా నగరమునందు, సాంఖ్యమ్ = ప్రకృతిపురుషవివేకమును (జ్ఞానమును), ఆస్థితః = ఆశ్రయించినవాడై (సాంఖ్యమ్ = సాంఖ్యయోగమును, ఆస్థితః = స్థాపించువాడై), అసక్తః = సంగము లేనివాడై, కామాన్ = భోగములను, సిషేవే = సేవించెను.

జగత్తునకు ఆత్మ, అధిష్ఠానము అగు శ్రీకృష్ణ భగవానుడు తాను కూడ లోకమర్యాదను పాలిస్తూ, వైదిక ధర్మమును అనుష్ఠిస్తూ, సచ్చిదానందమగు ఆత్మయందు నిష్ఠ గలవాడగుటచే సంసారమునందు ఆసక్తి లేనివా

డై, ద్వారకా నగరములో భోగములననుభవించెను. ఆయన ఆ విధముగా లోకములో సాంఖ్యయోగము (జ్ఞానమార్గము) ను నిలబెట్టెను.

స్నిగ్ధస్మితావలోకేన వాచా పీయూషకల్పయా ।
చరిత్రేణానవద్యేన శ్రీనికేతేన చాత్మనా ॥ 20

ఇమం లోకమముం చైవ రమయన్ సుతరాం యదూన్ ।
రేమే క్షణదయా దత్తక్షణస్త్రీక్షణసౌహృదః ॥ 21

స్నిగ్ధస్మిత-అవలోకేన = ప్రేమతో చిరునవ్వుతో గూడిన చూపుతో, పీయూషకల్పయా = అమృతతుల్యమగు, వాచా = మాటతో, అనవద్యేన = నిర్దోషమగు, చరిత్రేణ = చరితముతో, చ = మరియు, శ్రీనికేతేన = లక్ష్మీదేవికి (సౌందర్యమునకు) నివాసస్థానమగు, ఆత్మనా = తన రూపముతో, ఇమమ్ = ఈ, లోకమ్ = లోకమును, చ = మరియు, అముం ఏవ = పరలోకమును కూడ, యదూన్ = యాదవులను, సుతరామ్ = మిక్కిలి, రమయన్ = రమింపజేయుచూ, క్షణదయా = రాత్రిచే, దత్తక్షణస్త్రీ(-ఈ)క్షణసౌహృదః = ఈయబడిన అవకాశము మరియు ఉత్సవము గల గోపికల చూపుల అనురాగము గలవాడై (తత్కాలీనమగు అనురాగము గలవాడై), రేమే = రమించెను.

శ్రీకృష్ణుని ప్రేమతో నిండిన చిరునవ్వు తోడైన చూపులకు, అమృతమువంటి పలుకులకు, దోషరహితమగు చరితములకు, లక్ష్మీదేవికి (సౌందర్యమునకు) నివాసస్థానమగు రూపమునకు ఈ లోకములోని జనులు, విశేషించి యాదవులు మాత్రమే గాక, స్వర్గాదిలోకములలోని వారు కూడ ముగ్ధులైరి. ఆయన రాత్రియందు కొద్ది సమయము లభించిన సందర్భములలో, ఉత్సాహముతో కూడియున్న గోపికల అనురాగపూర్ణములగు చూపులను స్వీకరిస్తూ, రాసక్రీడయందు రమించెను.

తస్యైవం రమమాణస్య సంవత్సరగణాన్ బహూన్
గృహమేధేషు యోగేషు విరాగస్సమజాయత ॥ 22

ఏవమ్ = ఈ విధముగా, బహూన్ = అనేకములగు, సంవత్సరగణాన్ = సంవత్సరసముదాయములను, రమమాణస్య = రమించుచున్న, తస్య = ఆయనకు, గృహమేధేషు = గృహస్థాశ్రమమునకు సంబంధించిన, యోగేషు = భోగసాధనములయందు, విరాగః = వైరాగ్యము, సమజాయత = కలిగెను.

ఆయన ఈ విధముగా అనాసక్తుడై అనేక సంవత్సరములు రమించెను. అపుడాయనకు గృహస్థాశ్రమమునకు సంబంధించిన కామోపభోగములయందు, వాటి సాధనములయందు వైరాగ్యము కలిగెను.

దైవాధీనేషు కామేషు దైవాధీనస్స్వయం పుమాన్ ।
కో విస్రంభేత యోగేన యోగేశ్వరమనువ్రతః ॥ 23

యోగేన = జ్ఞానముచే (కర్మయోగముచే), యోగ-ఈశ్వరమ్ = యోగులకు ప్రభువు (యోగసాధనలకు అధిష్ఠాన దైవము) అగు శ్రీకృష్ణుని, అనువ్రతః = నిష్ఠతో సేవించే, పుమాన్ = పురుషుడు, స్వయమ్ = స్వయముగా, దైవ-అధీనః = దైవముయొక్క అధీనములో నున్నవాడు, కః = ఎవడు, దైవ-అధీనేషు = దైవమునకు అధీనమై యుండే, కామేషు = భోగములయందు, విస్రంభేత = విశ్వసించును?

కర్మయోగ మార్గములో గాని, లేదా జ్ఞానమార్గములో గాని యోగేశ్వరుడగు శ్రీకృష్ణ భగవానుని నిష్ఠతో సేవించే ఏ పురుషుడు భోగములయందు నమ్మకమును కలిగియుండును? ఏలయనగా, మానవుడు తాను స్వయముగా ఈశ్వరునకు అధీనుడై యున్నాడు. భోగములు కూడ ఈశ్వరాధీనములుగనే యున్నవి. ఇట్టి స్థితిలో భగవానుడు భోగాసక్తుడు కాడని వేరుగా చెప్పవలయునా? (భగవానుడే విరక్తుడు కాగా, ఆయనను అనుసరించే భక్తుడు కూడ అటులనే చేయును గదా!)

పుర్యాం కదాచిత్క్రీడద్భిర్యదుభోజకుమారకైః ।
కోపితా మునయశ్శేపుర్భగవన్మతకోవిదాః ॥ 24

కదాచిత్ = ఒకనాడు, పుర్యామ్ = నగరమునందు, క్రీడద్భిః = ఆట లాడుచున్న, యదుభోజకుమారకైః = యదువంశమునకు భోజవంశము నకు చెందిన కుమారులచే, కోపితాః = కోపమునకు గురి చేయబడిన, భగవత్-మతకోవిదాః = శ్రీకృష్ణ భగవానుని అభిప్రాయమును చక్కగా యెరిగి యున్న, మునయః = మునులు, శేపుః = శపించిరి.

ఒకనాడు ద్వారకా నగరములో యదుభోజవంశములకు చెందిన కుమారులు ఆటలాడుతూ మహర్షులకు కోపమును కలిగించిరి. శ్రీకృష్ణ భగవానుని అభిమతము ఆ మహర్షులకు తెలిసి యుండుటచే, వారు శపించిరి.

తతః కతిపయైర్మాసైర్వృష్ణిభోజాంధకాదయః ।
యయుః ప్రభాసం సంహృష్టా రథైర్దేవవిమోహితాః ॥ 25

తతః = తరువాత, కతిపయైః = కొన్ని, మాసైః = మాసములచే, దేవవిమోహితాః = దైవముచే మోహింప జేయబడినవారు, సంహృష్టాః = మిక్కిలి హర్షము గలవారు అగు, వృష్ణిభోజ-అంధక-ఆదయః = వృష్ణి, భోజ, అంధక మొదలగు వంశములకు చెందిన యాదవులు, రథైః = రథములతో, ప్రభాసమ్ = ప్రభాసతీర్థమును గురించి, యయుః = వెళ్లిరి.

కొన్ని మాసముల తరువాత దైవముచే మోహింపజేయబడి యున్న వృష్ణి-భోజ-అంధక మొదలగు వంశములకు చెందిన యాదవులు గొప్ప ఉల్లాసముతో రథములనెక్కి ప్రభాస క్షేత్రమునకు వెళ్లిరి.

తత్ర స్నాత్వా పితౄన్ దేవానృషీంశ్చైవ తదంభసా ।
తర్పయిత్వాథ విప్రేభ్యో గావో బహుగుణా దదుః ॥ 26

తత్ర = అచట, స్నాత్వా = స్నానమును చేసి, పితౄన్ = పితృదేవతలను, దేవాన్ = దేవతలను, చ = మరియు, ఋషీన్ ఏవ = ఋషులను కూడ, తత్-అంభసా = ఆ ప్రభాసతీర్థముయొక్క నీటితో, తర్పయిత్వా = తర్పణములనిచ్చి, అథ = తరువాత, విప్రేభ్యః = బ్రాహ్మణుల కొరకు, బహుగుణాః = మంచి వన్నెకెక్కిన, గావః = ఆవులను, దదుః = ఇచ్చిరి.

వారు ఆ ప్రభాసతీర్థమునందు స్నానము చేసి, దేవ-పితృ-ఋషి తర్పణములను ముగించుకొని, బ్రాహ్మణులకు మంచి లక్షణములతో కూడిన ఆవులను దానము చేసిరి.

హిరణ్యం రజతం శయ్యాం వాసాంస్యజినకంబలాన్ ।
యానం రథానిభాన్ కన్యా ధరాం వృత్తికరీమపి ।। 27

అన్నం చోరురసం తేభ్యో దత్త్వా భగవదర్పణమ్ ।
గోవిప్రార్థాసవశ్శూరాః ప్రణేముర్భువి మూర్ధభిః ।। 28

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
తృతీయోఽధ్యాయః ।।

హిరణ్యమ్ = బంగారమును, రజతమ్ = వెండిని, శయ్యామ్ = శయ్యను, వాసాంసి = వస్త్రములను, అజినకంబలాన్ = మృగచర్మములను కంబళ్లను, యానమ్ = పల్లకిని, రథాన్ = రథములను, ఇభాన్ = ఏనుగులను, కన్యాః = కన్యలను, వృత్తికరీమ్ = జీవనమునకు ఉపయోగించే, ధరాం అపి = భూమిని కూడ, చ = మరియు, ఉరురసమ్ = అనేకవిధముల రుచ్యమగు ఆహారమును, తేభ్యః = ఆ బ్రాహ్మణుల కొరకు, భగవత్-అర్పణమ్ = భగవంతునకు అర్పితమయ్యే విధముగా, దత్త్వా = ఇచ్చి, గోవిప్ర-అర్థ-అసవః = గోబ్రాహ్మణుల రక్షణ కొరకు ప్రాణములను దాల్చియున్న, శూరాః = వీరులగు ఆ యాదవులు, భువి = నేలపై, మూర్ధభిః = శిరస్సులతో, ప్రణేముః = నమస్కరించిరి.

ఆ యాదవులు తమ జీవితమును శక్తిని అంతనూ గోవులను మరియు బ్రాహ్మణులను రక్షించుట కొరకై వినియోగించెడివారు. అట్టి శూరులగు ఆ యాదవులు బంగారము, వెండి, శయ్యలు, విలువైన వస్త్రములు, మృగచర్మములు, కంబళ్లు, పల్లకీలు, రథములు, ఏనుగులు, కన్యలు, పంటలు పండే భూములు, నానావిధముల రుచ్యములగు ఆహార పదార్థములు అనువాటిని బ్రాహ్మణులకు దానము చేసిరి. అట్లు చేయుచూ వారు మనస్సును భగవంతునిపై నిలిపి, ఆ దానములను ఈశ్వరార్పణబు

ద్ధితో చేసిరి. తరువాత వారా బ్రాహ్మణులకు సాష్టాంగప్రణామముల నాచరించిరి.

శ్రీమద్భాగవత మహాపురాణములోని
మూడవ స్కంధములో మూడవ
అధ్యాయము ముగిసినది (3).

* * * * *

# అథ చతుర్థోऽధ్యాయ

## విదురుడు మైత్రేయుని వద్దకు వెళ్లుట

ఉద్ధవ ఉవాచ ।
అథ తే తదనుజ్ఞాతా భుక్త్వా పీత్వా చ వారుణీమ్ ।
తయా విభ్రంశితజ్ఞానా దురుక్తైర్మర్మ పస్పృశుః ॥ 1

ఉద్ధవః = ఉద్ధవుడు, ఉవాచ = పలికెను, అథ = తరువాత, తే = వారు, తత్-అనుజ్ఞాతాః = వారి ఆజ్ఞను పొంది, భుక్త్వా = భోజనమును చేసి, చ = మరియు, వారుణీమ్ = మదిరను, పీత్వా = త్రాగి, తయా = దాని చే, విభ్రంశితజ్ఞానాః = నశింపజేయబడిన జ్ఞానము గలవారై, దురుక్తైః = చెడు మాటలతో, మర్మ = హృదయమును, పస్పృశుః = స్పృశించిరి.

ఉద్ధవుడు ఇట్లు పలికెను --- తరువాత ఆ యాదవులు ఆ బ్రాహ్మ ణుల అనుమతిని పొంది భుజించిరి. తరువాత వారు మద్యమును త్రాగి, దాని ప్రభావముచే నశించిన వివేకము గలవారై, ఒకరినొకరు సూటిపోటి మాటలతో నిందించుకొనిరి.

తేషాం మైరేయదోషేణ విషమీకృతచేతసామ్ ।
నిమ్లోచతి రవావాసీద్వేణూనామివ మర్దనమ్ ॥ 2

మైరేయదోషేణ = మద్యముయొక్క దోషముచే, విషమీకృతచేత సామ్ = వివేకము నశించిన బుద్ధులు గల, తేషామ్ = వారికి, రవౌ = సూర్యు డు, నిమ్లోచతి సతి = అస్తమించుచుండగా, వేణూనాం ఇవ = వెదుళ్లకు వలె, మర్దనమ్ = ఘర్షణము, ఆసీత్ = ఆయెను.

ఈ లోపులో సూర్యుడు అస్తమించెను. మద్యప్రభావముచే వారి వివేకము నశించియుండెను. అడవిలో వెదుళ్లకు ఒకదానితో మరియొక దానికి రాపిడి కలిగే విధముగా, వారిలో వారికి సంఘర్షణ బయలుదేరెను.

భగవాన్ స్వాత్మమాయాయా గతిం తామవలోక్య సః ।
సరస్వతీముపస్పృశ్య వృక్షమూలముపావిశత్ ॥ 3

భగవాన్ = శ్రీకృష్ణ భగవానుడు, ఆత్మమాయాయాః = తన మాయాశక్తియొక్క, తామ్ = ఆ, గతిమ్ = గతిని, అవలోక్య = చూచి, సరస్వతీం ఉపస్పృశ్య = సరస్వతీనదిలో స్నానమును చేసి, వృక్షమూలమ్ = చెట్టు మొదటిని, ఉపావిశత్ = కూర్చుండెను.

శ్రీకృష్ణ భగవానుడు తన మాయాశక్తియొక్క ప్రభావముచే యాదవకులమంతయు ఆ విధముగా వినష్టమగుటను చూచెను. అపుడాయన సరస్వతీనదిలో స్నానమును చేసి, చెట్టు మొదట్లో కూర్చుండెను.

అహం చోక్తో భగవతా ప్రపన్నార్తిహరేణ హ ।
బదరీం త్వం ప్రయాహీతి స్వకులం సంజిహీర్షుణా ॥ 4

చ = మరియు, స్వకులమ్ = తన యాదవ వంశమును, సంజిహీర్షుణా = ఉపసంహరించగోరే, ప్రపన్న-ఆర్తిహరేణ = శరణు పొందినవారి ఇడుములను బాపే, భగవతా = శ్రీకృష్ణ భగవానునిచే, త్వమ్ = నీవు, బదరీమ్ = బదరిని గురించి, ప్రయాహి = బయలు దేరుము, ఇతి = అని, అహమ్ = నేను, ఉక్తః = చెప్పబడితిని.

శరణు జొచ్చిన వారిని కష్టములనుండి గట్టెక్కించే శ్రీకృష్ణ భగవానుడు తన వంశమును ఉపసంహరించ గోరినవాడై నాతో, బదరికి వెళ్లిపొమ్మని చెప్పెను.

అథాపి తదభిప్రేతం జానన్నహమరిందమ ।
పృష్ఠతోఽన్వగమం భర్తుః పాదవిశ్లేషణాక్షమః ॥ 5

అరిందమ = అంతశ్శత్రువులను నశింపజేసిన ఓ విదురా!, తత్-అభిప్రేతమ్ = ఆయన అభిప్రాయమును, అహమ్ = నేను, జానన్ అథ అపి = ఎరిగినవాడనే అయిననూ, భర్తుః = ప్రభువగు శ్రీకృష్ణుని, పాదవిశ్లేష ణ-అక్షమః = పాదముల వియోగమును సహించలేనివాడనై, పృష్ఠతః = వెనుకనే, అను-అగమమ్ = అనుసరించి వెళ్లితిని.

అంతశ్శత్రువులను నశింపజేసిన ఓ విదురా! ఆయన అభిప్రా యము నాకు తెలియును. అయినప్పటికీ, నేను ఆ ప్రభుని పాదములకు దూరమగుటను సహించలేను. కావుననే, నేను ఆయన వెనుకనే వెళ్లితిని.

అద్రాక్షమేకమాసీనం విచిన్వన్ దయితం పతిమ్ ।
శ్రీనికేతం సరస్వత్యాం కృతకేతమకేతనమ్ ।। 6

దయితమ్ = ప్రియతముడగు, పతిమ్ = ఆ ప్రభుని, విచిన్వన్ = వెదుకుచున్న (స్మరిస్తున్న) నేను, ఏకమ్ = ఒంటరి వానిని, ఆసీనమ్ = కూర్చుని యున్నవానిని, శ్రీనికేతమ్ = లక్ష్మికి (సౌందర్యమునకు) నిధాన మైనవానిని, అకేతనమ్ = తన కంటె భిన్నమైన ఆశ్రయము లేనివానిని, సర స్వత్యామ్ = సరస్వతీనదీతీరమునందు, కృతకేతమ్ = చేయబడిన మకాము గలవానిని, అద్రాక్షమ్ = చూచితిని.

నేను ప్రియతముడగు ఆ శ్రీకృష్ణ ప్రభుని వెదుకుతూ ఆయననే స్మరించుచుంటిని. సర్వమునకు ఆశ్రయమైనవాడు, తనకు మరియొక ఆశ్ర యము లేనివాడు, లక్ష్మీపతి, పరమసుందరుడు అగు ఆ శ్రీకృష్ణుడు సర స్వతీ నదీతీరమునందు ఒంటరిగా కూర్చుని యుండగా నేను చూచితిని.

శ్యామావదాతం విరజం ప్రశాంతారుణలోచనమ్ ।
కం పీతకౌశాంబరేణ చ ।। 7

శ్యామ-అవదాతమ్ = శుద్ధమగు (శ్రేష్ఠమైన, లేదా తెలుపు కలిసి న) నీలవర్ణము గలవాడు, విరజమ్ = దోషములు లేనివాడు, ప్రశాంత-అ రుణలోచనమ్ = ప్రసన్నమగు ఎర్రని కన్నులు గలవాడు, చతుర్భిః = నాలు గు, దోర్భిః = భుజములచే, చ = మరియు, పీతకౌశ-అంబరేణ = పచ్చని

పట్టు వస్త్రముచే, విదితమ్ = గుర్తు పట్టబడే వాడు (అగు శ్రీకృష్ణుని చూచి తిని).

శుద్ధసత్త్వమయుడగు ఆయన తెలుపుతో కూడిన స్వచ్ఛమగు నీల వర్ణమును కలిగియుండెను. ఆయన ఎర్రని కన్నులు ప్రసన్నముగా నుండె ను. నాలుగు చేతులను, పచ్చని పట్టు వస్త్రమును చూచి, నేను ఆయనను దూరమునుండియే గుర్తు పట్టితిని.

వామ ఊరావధిశ్రిత్య దక్షిణాంఘ్రిసరోరుహమ్ ।
అపాశ్రితార్భకాశ్వత్థమకృశం త్యక్తపిప్పలమ్ ॥ 8

వామే = ఎడమ, ఊరౌ = తొడయందు, దక్షిణ-అంఘ్రిసరోరుహమ్ = పద్మమువంటి కుడి కాలిని, అధిశ్రిత్య = పైన పెట్టి, అప-ఆశ్రిత-అర్భక -అశ్వత్థమ్ = వెనుక ఆశ్రయించబడిన లేత రావి చెట్టు గలవాడు, అకృశమ్ = పుష్టిగా (ఆనందముగా) నున్నవాడు, త్యక్తపిప్పలమ్ = విడువబడిన ఫల ములు మొదలగు ఆహారము (ఇంద్రియసుఖములు) గలవాడు (అగు శ్రీకృ ష్ణుని చూచితిని).

ఆయన పద్మమువంటి కుడికాలిని ఎడమకాలిపై పెట్టి, లేత రావి చెట్టునకు నడుమును ఆనించి కూర్చుండెను. ఆయన పళ్ళు మొదలగు ఆహారమును ఇంద్రియసుఖములను విడిచిపెట్టియున్ననూ, పుష్టిగా ఆనం దముగా ఉండెను.

తస్మిన్ మహాభాగవతో ద్వైపాయనసుహృత్సఖః ।
లోకాననుచరన్ సిద్ధ ఆససాద యదృచ్ఛయా ॥ 9

తస్మిన్ = ఆ భగవానుని సన్నిధియందు, మహాభాగవతః = గొప్ప భగవద్భక్తుడు, ద్వైపాయనసుహృత్-సఖః = వ్యాసుని ప్రియమిత్రుడు, సిద్ధః = కృతార్థుడు అగు మైత్రేయుడు, లోకాన్ = లోకములను, అనుచరన్ = సంచరిస్తూ, యదృచ్ఛయా = (స్వచ్ఛందముగా) అనుకోకుండగా, ఆస సాద = చేరుకొనెను.

గొప్ప భగవద్భక్తుడు, వ్యాసుని ప్రియమిత్రుడు, కృతకృత్యుడు అగు మైత్రేయుడు స్వచ్ఛందముగా లోకములను తిరుగుతూ ఆ భగవానుని సన్నిధికి యాదృచ్ఛికముగా విచ్చేసెను.

తస్యానురక్తస్య మునేర్ముకుందః ప్రమోదభావానతకంధరస్య ।
ఆశృణ్వతో మామనురాగహాససమీక్షయా విశ్రమయన్నువాచ।। **10**

అనురక్తస్య = అనురాగము గలవాడు, ప్రమోదభావ-ఆనతకంధరస్య = ఆనందము భక్తి అనువాటిచే వంచబడిన మెడ గలవాడు అగు, తస్య = ఆ, మునేః = మైత్రేయ మహర్షి, ఆశృణ్వతః = వినుచుండగా, ముకుందః = శ్రీకృష్ణ భగవానుడు, అనురాగహాససమీక్షయా = అనురాగముతో చిరునవ్వుతో కూడిన చక్కటి చూపుతో, మామ్ = నన్ను, విశ్రమయన్ = తొలగిన శ్రమ గలవానినిగా చేయుచూ, ఉవాచ = పలికెను.

మైత్రేయ మహర్షికి శ్రీకృష్ణునియందు గొప్ప ప్రేమ గలదు. ఆయన ఆనందముతో భక్తితో తలను వంచి వినుచుండెను. అప్పుడు మోక్ష ప్రదాతయగు ఆ శ్రీకృష్ణుడు ప్రేమతో చిరునవ్వుతో నావైపు చూసి, ఆ విధముగా నాకు ఆనందమును కలిగించి, నా శ్రమను అంతనూ పోగొట్టి, ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
వేదాహమంతర్మనసీప్సితం తే
దదామి యత్తద్దురవాపమన్యైః ।
సత్రే పురా విశ్వసృజాం వసూనాం
మత్సిద్ధికామేన వసో త్వయేష్టః ।। **11**

శ్రీభగవాన్ = శ్రీకృష్ణ భగవానుడు, ఉవాచ = పలికెను, వసో = ఓ వసువా!, తే = నీ, అంతః-మనసి = అంతఃకరణమునందు, ఈప్సితమ్ = కోరబడినదానిని, అహమ్ = నేను, వేద = ఎరుగుదును, అన్యైః = ఇతరులచే, దురవాపమ్ = పొందశక్యము కానిది, యత్ = ఏది గలదో, తత్ = దానిని, దదామి = ఇచ్చెదను, పురా = పూర్వము, విశ్వసృజామ్ = ప్రజాపతుల,

వసూనామ్ = వసువుల, సత్త్రే = యజ్ఞమునందు, మత్-సిద్ధికామేన = నన్ను పొందవలెననే కోరికతో, త్వయా = నీచే, ఇష్టః = ఆరాధించ బడితిని.

శ్రీకృష్ణ భగవానుడు ఇట్లు పలికెను --- ఓ ఉద్ధవా! నీవు పూర్వజన్మలో వసువు. నీ అంతఃకరణమునందలి కోరికను నేను ఎరుగుదును. ఇతరులకు పొంద శక్యము కాని ఆ కోరికను తీర్చెదను. పూర్వము జగత్తును సృష్టించే ప్రజాపతులు, వసువులు కలిసి చేసిన యజ్ఞములో నీవు నన్ను పొందగోరి ఆరాధించితివి.

స ఏష సాధో చరమో భవానా-
మాసాదితస్తే మదనుగ్రహో యత్ ।
యన్మాం నృలోకాద్రహ ఉత్సృజంతం
దిష్ట్యా దదృశ్వాన్ విశదానువృత్త్యా ॥ 12

సాధో = సాధువగు ఓ ఉద్ధవా!, ఏషః = ఇది, తే = నీకు, భవానామ్ = జన్మలలో, సః = అట్టి, చరమః = అంతిమమైనది, యత్ = ఏలయనగా, మత్-అనుగ్రహః = నా అనుగ్రహము, ఆసాదితః = పొందబడినది, యత్ = ఏలయనగా, నృలోకాత్ = మానవలోకమునుండి, ఉత్సృజంతమ్ = విడిచి పెట్టి పోవుచున్న, మామ్ = నన్ను, రహః = ఏకాంతమునందు, దిష్ట్యా = దైవయోగముచే, విశద-అనువృత్త్యా = స్వచ్ఛమగు భక్తితో, దదృశ్వాన్ = చూచితివి.

ఓ ఉద్ధవా! నీవు సాధుపురుషుడవు. ఈ సంసారములో నీకు ఇది ఆఖరి జన్మ. ఏలయనగా, నీకు నా అనుగ్రహము లభించినది. పైగా, నేను మానవలోకమును విడిచిపెట్టి వెళ్లే ఈ సమయములో నీవు దైవయోగముచే నన్ను ఏకాంతములో స్వచ్ఛమగు భక్తితో దర్శించితివి.

పురా మయా ప్రోక్తమజాయ నాభ్యే
పద్మే నిషణ్ణాయ మమాదిసర్గే ।
జ్ఞానం పరం మన్మహిమావభాసం
యత్సూరయో భాగవతం వదంతి ॥ 13

పురా = పూర్వము, ఆదిసర్గే = సృష్ట్యాదియందు, మమ = నాయొక్క, నాభ్యే = నాభియందలి, పద్మే = పద్మమునందు, నిషణ్ణాయ = కూర్చునియున్న, అజాయ = బ్రహ్మ కొరకు, మయా = నాచే, మత్-మహిమా-అవభాసమ్ = నా మహిమను ప్రకాశింప జేసే, పరమ్ = సర్వోత్కృష్టమగు, జ్ఞానమ్ = జ్ఞానము, ప్రోక్తమ్ = చెప్పబడినది, యత్ = దేనిని, సూరయః = విద్వాంసులు, భాగవతమ్ = భాగవతమని, వదంతి = చెప్పుచున్నారో.

పూర్వము సృష్ట్యాదియందు నా నాభియందలి పద్మములో కూర్చునియున్న బ్రహ్మకు నేను నా మహిమను ప్రకాశింపజేసే సర్వోత్కృష్టమగు జ్ఞానమునుపదేశించితిని. ఆ ఉపదేశమును విద్వాంసులు భాగవతమని వ్యవహరించుచున్నారు (ఆ జ్ఞానమును నేను నీకు ఇప్పుడు ఇచ్చుచున్నాను).

ఇత్యాదృతోక్తః పరమస్య పుంసః
ప్రతిక్షణానుగ్రహభాజనోఽహమ్ ।
స్నేహోత్థరోమా స్ఖలితాక్షరస్తం
ముంచఞ్ఛుచః ప్రాంజలిరాబభాషే ॥ **14**

ఇతి = ఈ విధముగా, ఆదృత-ఉక్తః = ఆదరింబడినవాడనై పలుకబడిన, అహమ్ = నేను, పరమస్య పుంసః = పరమపురుషుడగు శ్రీకృష్ణుని, ప్రతిక్షణ-అనుగ్రహభాజనః = ప్రతిక్షణము అనుగ్రహమునకు పాత్రుడను, స్నేహ-ఉత్థరోమా = ప్రేమచే కలిగిన రోమాంచము గలవాడనై, స్ఖలిత-అక్షరః = తడబడుచున్న పలుకులు గలవాడనై, శుచః = కన్నీటిని, ముంచన్ = విడుచుచున్నవాడనై, ప్రాంజలిః = చేతులను జోడించినవాడనై, ఆబభాషే = పలికితిని.

ఈ విధముగా ఆయన నాతో ఆదరపూర్వకముగా పలికెను. నేను ఆ పరమపురుషుని అనుగ్రహమునకు ప్రతిక్షణము పాత్రుడనైతిని. నాకు ఆయనయందలి ప్రేమచే రోమాంచము కలిగి మాట తడబడుచుండెను. నేను కన్నీటిని విడుస్తూ చేతులను జోడించి ఇట్లు పలికితిని.

కో న్వీశ తే పాదసరోజభాజాం
సుదుర్లభోఽర్థేషు చతుర్ష్వపీహ ।
తథాపి నాహం ప్రవృణోమి భూమన్
భవత్పదాంభోజనిషేవణోత్సుకః ॥ 15

ఈశ = ఓ ప్రభూ!, తే = నీ, పాదసరోజభాజామ్ = పద్మములవంటి పాదములను సేవించువారలకు, ఇహ = ఈ సంసారమునందు, చతుర్షు = నాలుగు, అర్థేషు అపి = పురుషార్థములయందు కూడ, సుదుర్లభః = మిక్కిలి దుర్లభమైనది, కః ను = ఏది గలదు?, భూమన్ = ఓ పరబ్రహ్మ స్వరూపుడా!, తథా అపి = అయినప్పటికీ, భవత్-పద-అంభోజనిషేవణ-ఉత్సుకః = నీ పాదపద్మములను సేవించుటయందు ఉత్కంఠ గల, అహమ్ = నేను, న ప్రవృణోమి = కోరుట లేదు.

ఓ ప్రభూ! నీ పాదపద్మములను సేవించువారలకు ఈ సంసారములో ధర్మార్థకామమోక్షములనే నాలుగు పురుషార్థములలో ఏది దుర్లభము? (ఏదియు దుర్లభము కాదు). ఓ పరబ్రహ్మ స్వరూపుడా! అయిననూ, నేను వాటిని కోరుట లేదు. ఏలయనగా, నేను నీ పాదపద్మములను సేవించాలనే ఉత్కంఠ గలవాడను.

కర్మాణ్యనీహస్య భవోఽభవస్య తే
దుర్గాశ్రయోఽథారిభయాత్పలాయనమ్ ।
కాలాత్మనో యత్ప్రమదాయుతాశ్రయః
స్వాత్మన్రతేః ఖిద్యతి ధీర్విదామిహ ॥ 16

అనీహస్య = క్రియలు (కామనలు) లేని, తే = నీకు, కర్మాణి = కర్మలు, అభవస్య = పుట్టుక లేని నీకు, భవః = పుట్టుక, అథ = మరియు, కాల-ఆత్మనః = కాల (మృత్యు) స్వరూపుడవగు నీకు, అరిభయాత్ = శత్రుభయము వలన, దుర్గ-ఆశ్రయః = దుర్గమును ఆశ్రయించుట, పలాయనమ్ = పారిపోవుట, స్వాత్మన్-రతేః = తన స్వరూపమునందు రమించే నీకు, ప్రమదా-అయుత-ఆశ్రయః = పదివేల మంది భార్యలతో కూడిన గృహస్థాశ్రమ

ము, యత్ = అనునది యేది గలదో, ఇహ = ఈ విషయములో, విదామ్ = విద్వాంసుల, ధీః = బుద్ధి, ఖిద్యతి = సంశయములో పడుచున్నది.

నీకు కామనలు లేవు. నీవు అకర్తవు. కాని, నీవు కర్మలను చేయుచునే ఉందువు. నీకు పుట్టుక లేదు. కాని, నీవు అవతరించుచునే యుందువు. నీవు కాల (మృత్యు) స్వరూపుడవు. కాని, నీవు శత్రువులకు భయపడి పారిపోయి ద్వారక అనే దుర్గములో తల దాచుకొంటివి. ఆత్మస్వరూపమునందు రమించే నీవు పదివేల భార్యలు గల గృహస్థుడవు. ఈ విషయములను గమనించినప్పుడు పండితులకు కూడ బుద్ధి సంశయములో పడును.

మంత్రేషు మాం వా ఉపహూయ
యత్త్వమకుంఠితాఖండసదాత్మబోధః ।
పృచ్ఛేః ప్రభో ముగ్ధ ఇవాప్రమత్తః
తన్నో మనో మోహయతీవ దేవ ॥ 17

దేవ = ఓ దేవా!, అకుంఠిత-అఖండసత్-ఆత్మబోధః = మొక్కవోని అఖండసచ్చిదాత్మజ్ఞానము గల, త్వమ్ = నీవు, మంత్రేషు = సలహాలయందు, మామ్ = నన్ను, ఉపహూయ వై = పిలిచి, ముగ్ధః ఇవ = తెలియనివాని వలె, అప్రమత్తః = సావధానుడవై, పృచ్ఛేః యత్ = అడిగెడివాడవనేది యేది గలదో, తత్ = అది, ప్రభో= ఓ ప్రభూ!, నః = మాయొక్క, మనః = మనస్సును, మోహయతి ఇవ = మోహింపజేయుచున్నది వలెనున్నది.

ఓ ప్రభూ! నీవు మొక్కవోని అఖండసచ్చిదాత్మజ్ఞానము గలవాడవు. అయిననూ, నీవు నన్ను పిలిచి, ఏమీ తెలియనివాని వలె, చాల సావధానుడవై సలహాలను అడిగెడివాడవు. ఓ దేవా! ఈ సంగతి మా మనస్సును మోహపెట్టుచున్నది.

జ్ఞానం పరం స్వాత్మరహఃప్రకాశం
ప్రోవాచ కస్మై భగవాన్ సమగ్రమ్ ।
అపి క్షమం నోగ్రహణాయ భర్త-
ర్వదాంజసా యద్వృజినం తరేమ ॥ 18

భగవాన్ = భగవానుడవగు నీవు, స్వ-ఆత్మరహఃప్రకాశమ్ = రహస్యమగు నీ స్వరూపమును ప్రకాశింపజేసే, పరమ్ = సర్వోత్కృష్టమైన, జ్ఞానమ్ = జ్ఞానమును, కస్మై = బ్రహ్మ కొరకు, సమగ్రమ్ = సమగ్రముగా, ప్రోవాచ = చెప్పితివి, భర్తః = ఓ ప్రభూ!, నః = మాకు, గ్రహణాయ = గ్రహించుటకు, అపి క్షమమ్ = సామర్థ్యము ఉన్నచో, వద = చెప్పుము, యత్ = దేనివలన, వృజినమ్ = సంసారదుఃఖమును, అంజసా = తేలికగా, తరేమ = తరించెదమో.

ఓ ప్రభూ! భగవానుడవగు నీవు నీ స్వరూపమును ప్రకాశింపజేసే సర్వోత్కృష్టమగు రహస్యజ్ఞానమును బ్రహ్మకు సమగ్రముగా చెప్పియుంటివి. ఆ జ్ఞానమును గ్రహించే సామర్థ్యము మాకు ఉన్నచో, చెప్పుము. దాని వలన, మేము సంసారదుఃఖమును తేలికగా అధిగమించెదము.

> ఇత్యావేదితహార్దాయ మహ్యం స భగవాన్ పరః ।
> ఆదిదేశారవిందాక్ష ఆత్మనః పరమాం స్థితిమ్ ॥ **19**

ఇతి = ఈ విధముగా, ఆవేదితహార్దాయ = నివేదించబడిన హృదయమునందలి అభిప్రాయము గల, మహ్యామ్ = నా కొరకు, పరః = పరబ్రహ్మ స్వరూపుడు, అరవింద-అక్షః = పద్మములవంటి కన్నులు గలవాడు అగు, సః = ఆ, భగవాన్ = శ్రీకృష్ణ భగవానుడు, ఆత్మనః = తన స్వరూపముయొక్క (ఆత్మయొక్క), పరమామ్ = సర్వోత్కృష్టమగు, స్థితిమ్ = స్థితిని, ఆదిదేశ = ఉపదేశించెను.

నేనీ విధముగా నా హృదయములోని అభిప్రాయమును పరబ్రహ్మ స్వరూపుడగు ఆ భగవానునకు విన్నవించితిని. అపుడు పద్మములవంటి కన్నులు గల ఆ శ్రీకృష్ణుడు నాకు తన స్వరూపమగు ఆత్మయొక్క పరమ స్థితిని ఉపదేశించెను.

> స ఏవమారాధితపాదతీర్థా-
> దధీతతత్త్వాత్మవిబోధమార్గః ।
> ప్రణమ్య పాదౌ పరివృత్య దేవ-

మిహాగతోఽహం విరహాతురాత్మా ॥ 20

సః = అట్టి, అహమ్ = నేను, ఏవమ్ = ఈ విధముగా, ఆరాధిత పాదతీర్థాత్ = ఆరాధింపబడే పాదములు గల భగవానుడు అనే గురువునుండి (ఆరాధింపబడే పవిత్రములగు పాదములు గల భగవానునినుండి), అధీతతత్త్వ-ఆత్మవిబోధమార్గః = అధ్యయనము చేయబడిన ఆత్మతత్త్వమును తెలుసుకొనే ఉపాయము గలవాడనై, పాదౌ = పాదములను, ప్రణమ్య = నమస్కరించి, దేవమ్ = ఆ దేవుని, పరివృత్య = ప్రదక్షిణము చేసి, విరహ-ఆతుర-ఆత్మా = వియోగముచే వ్యాకులమైన చిత్తము గలవాడనై, ఇహ = ఇచ్చటకు, ఆగతః = వచ్చితిని.

నేను ఈ విధముగా సర్వులచే ఆరాధింపబడే పవిత్రపాదములు గల భగవానుడే గురువు కాగా, ఆత్మతత్త్వమును తెలుసుకొనే సాధనమును అధ్యయనము చేసి, ఆయన పాదములకు నమస్కరించి, ఆయనకు ప్రదక్షిణము చేసి, ఇచటకు వచ్చియుంటిని. నా చిత్తము ఆయన విరహముచే వ్యాకులితమై యున్నది.

సోఽహం తద్దర్శనాహ్లాదవియోగార్తియుతః ప్రభో ।
గమిష్యే దయితం తస్య బదర్యాశ్రమమండలమ్ ॥ 21

ప్రభో = ఓ విదురా!, తత్-దర్శన-ఆహ్లాదవియోగ-ఆర్తియుతః = ఆ శ్రీకృష్ణుని దర్శనముచే ఆహ్లాదము వియోగముచే దుఃఖము గల, సః = అట్టి, అహమ్ = నేను, తస్య = ఆయనకు, దయితమ్ = ప్రియమైన, బదరీ-ఆశ్రమమండలమ్ = బదరికాశ్రమస్థానమును గూర్చి, గమిష్యే = వెళ్లెదను.

ఓ విదురా! నేను శ్రీకృష్ణుని దర్శనముచే ముందుగా ఆనందమునను భవించిననూ, ఇప్పుడు ఆయన వియోగదుఃఖమునను భవించుచున్నాను. బదరికాశ్రమము ఆయనకు ప్రియమైనది. కావున, నేను ఆ స్థానమునకు వెళ్లెదను.

యత్ర నారాయణో దేవో నరశ్చ భగవానృషిః ।
మృదు తీవ్రం తపో దీర్ఘం తేపాతే లోకభావనౌ ॥ 22

యత్ర = ఎక్కడనైతే, లోకభావనౌ = మానవులను అనుగ్రహించే, నారాయణః దేవః = నారాయణ దేవుడు, చ = మరియు, భగవాన్ = పూజ్యుడు, ఋషిః = ఋషియగు, నరః = నరుడు, మృదు = సౌమ్యమైన, తీవ్రమ్ = తీవ్రమగు, దీర్ఘమ్ = దీర్ఘమైన, తపః = తపస్సును, తేపాతే = చేసిరో.

ఆ బదరికాశ్రమమునందు నారాయణ దేవుడు, పూజ్యుడగు నరమహర్షి మానవుల ననుగ్రహించుట కొరకై చిరకాలము సౌమ్యమగు తపస్సును తీవ్రముగా చేసిరి.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యుద్ధవాదుపాకర్ణ్య సుహృదాం దుస్సహం వధమ్ ।
జ్ఞానేనాశమయత్ క్షత్తా శోకముత్పతితం బుధః ।। 23

ఇతి = ఈ విధముగా, సుహృదామ్ = మిత్రుల, దుస్సహమ్ = సహింప శక్యము కాని, వధమ్ = వధను గురించి, ఉద్ధవాత్ = ఉద్ధవునినుండి, ఉపాకర్ణ్య = విని, బుధః = వివేకియగు, క్షత్తా = విదురుడు, ఉత్-పతితమ్ = పైకి ఉబుకుచున్న, శోకమ్ = దుఃఖమును, జ్ఞానేన = జ్ఞానముచే, అశమయత్ = చల్లార్చుకొనెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా మిత్రుల వధను గురించి సహింప శక్యము గాని సమాచారమును ఉద్ధవునినుండి విని, వివేకియగు విదురుడు పైకి ఉబుకుచున్న దుఃఖమును వివేకజ్ఞానముచే తన లోపలనే శమింప జేసెను.

స తం మహాభాగవతం వ్రజంతం కౌరవర్షభః ।
విశ్రంభాదభ్యధత్తేదం ముఖ్యం కృష్ణపరిగ్రహే ।। 24

కృష్ణపరిగ్రహే = శ్రీకృష్ణునిచే స్వీకరించబడిన వారిలో (శ్రీకృష్ణుని సేవించినవారిలో), ముఖ్యమ్ = ప్రముఖుడైన, వ్రజంతమ్ = వెళ్లుచున్న, మహాభాగవతమ్ = గొప్ప భగవద్భక్తుడగు, తమ్ = ఆ ఉద్ధవుని, కౌరవ-ఋషభః = కౌరవులలో శ్రేష్ఠుడగు విదురుడు, విశ్రంభాత్ = విశ్వాసము (ప్రేమ) వలన, ఇదమ్ = ఈ మాటను, అభ్యధత్త = పలికెను.

శ్రీకృష్ణుని సేవించి ఆయనచే స్వీకరించబడినవారిలో ఉద్ధవుడు ప్రముఖుడు. గొప్ప భగవద్భక్తుడగు ఆ ఉద్ధవుడు బదరికాశ్రమమునకు వెళ్ల బోవుచుండగా, కౌరవులలో ఉత్తముడగు విదురుడు ఆయనయందలి విశ్వాసముతో, ప్రేమతో ఇట్లు పలికెను.

విదుర ఉవాచ ।
జ్ఞానం పరం స్వాత్మరహఃప్రకాశం
యదాహ యోగేశ్వర ఈశ్వరస్తే ।
వక్తుం భవాన్నోఽర్హతి యద్ధి విష్ణోః
భృత్యాస్స్వభృత్యార్థకృతశ్చరంతి ॥ 25

స్వ-ఆత్మరహఃప్రకాశమ్ = తన స్వరూపముయొక్క రహస్యమును ప్రకాశింపజేసే, పరమ్ = ఉత్కృష్టమగు, యత్ = ఏ, జ్ఞానమ్ = జ్ఞానమును, యోగేశ్వరః = యోగేశ్వరుడగు, ఈశ్వరః = శ్రీకృష్ణ భగవానుడు, ఆహ = చెప్పినాడో, నః = మాకు, వక్తుమ్ = చెప్పుటకు, భవాన్ = నీవు, అర్హతి = తగుచున్నావు, యత్ = ఎందువలననగా, విష్ణోః = శ్రీమహావిష్ణువు యొక్క, భృత్యాః = సేవకులు, స్వభృత్య-అర్థకృతః = తమ సేవకుల ప్రయోజనమును సిద్ధింపజేయువారై, చరంతి హి = సంచరించెదరు గదా!

విదురుడు ఇట్లు పలికెను --- యోగేశ్వరుడగు శ్రీకృష్ణ భగవానుడు తన స్వరూపముయొక్క రహస్యమును తేటతెల్లము చేసే ఉత్కృష్టమగు జ్ఞానమును నీకు బోధించినాడు. దానిని నీవు మాకు కూడ చెప్పుట యోగ్యముగా నుండును. ఏలయనగా, విష్ణుభక్తులు తమ భక్తుల కార్యమును సిద్ధింపజేయుట కొరకై సంచారమును చేయుచుందురు గదా!

ఉద్ధవ ఉవాచ ।
నను తే తత్త్వసంరాధ్య ఋషిః కౌషారవోఽంతిమే ।
సాక్షాద్భగవతాఽఽదిష్టో మర్త్యలోకం జిహాసతా ॥ 26

కౌషారవః ఋషిః = మైత్రేయ మహర్షి, తే = నీకు, నను తత్త్వసంరాధ్య = తత్త్వ[illegible]నము కొరకై ఆరాధింప[illegible]దగినవాడు సుమా!, మర్త్యలో

కమ్ = మానవలోకమును, జిహాసతా = విడువగోరే, భగవతా = శ్రీకృష్ణ భగవానునిచే, సాక్షాత్ = సాక్షాత్తుగా, అంతిమే = ఆఖరి క్షణములో, ఆదిష్టః = ఆదేశించబడినాడు.

ఉద్ధవుడిట్లు పలికెను --- కాని, నీవు తత్త్వజ్ఞానము కొరకై మైత్రేయ మహర్షిని ఆరాధించ వలెను. ఏలయనగా, సాక్షాత్తుగా శ్రీకృష్ణ భగవానుడే మానవలోకమును విడువ గోరి, ఆఖరి సమయములో ఆయనకు అట్టి ఆదేశమును ఇచ్చియున్నాడు.

శ్రీశుక ఉవాచ ।
ఇతి సహ విదురేణ విశ్వమూర్తేః
గుణకథయా సుధయా ప్లావితోరుతాపః ।
క్షణమివ పులినే యమస్వసుస్తాం
సముషిత ఔపగవిర్నిశాం తతోఽగాత్ ॥ 27

ఇతి = ఈ విధముగా, విదురేణ సహ = విదురునితో గూడి, విశ్వమూర్తేః = జగద్రూపుడగు భగవానుని, గుణకథయా = గుణవర్ణనము అనే, సుధయా = అమృతముచే, ప్లావిత-ఉరుతాపః = తొలగించబడిన పెద్ద తాపము గలవాడై, ఔపగవిః = ఉద్ధవుడు, యమస్వసుః = యమునా నది యొక్క, పులినే = ఇసుకతిన్నెయందు, తామ్ = ఆ, నిశామ్ = రాత్రిని, క్షణం ఇవ = క్షణకాలము వలె, సముషితః = చక్కగా గడిపినవాడై, తతః = తరువాత, అగాత్ = వెళ్లెను.

శ్రీశుక మహర్షి ఇట్లు చెప్పెను --- ఈ విధముగా విదురునితో కలిసి జగద్రూపుడగు భగవానుని గుణములను వర్ణించగా, ఆ భగవద్గాథ అనే అమృతముచే ఉద్ధవుని మనోవేదన అంతయు తొలగి పోయినది. ఆయన ఆ రాత్రిని యమునా నదియొక్క ఇసుకతిన్నెలపై క్షణకాలము వలె గడిపి, తరువాత వెళ్లెను.

రాజోవాచ ।
నిధనముపగతేషు వృష్ణిభోజే-

ష్వధిరథయూథపయూథపేషు ముఖ్యః ।
స తు కథమవశిష్ట ఉద్ధవో యత్
హరిరపి తత్యాజ ఆకృతిం త్ర్యధీశః ॥ 28

అధిరథయూథపయూథపేషు = అతిరథులు మహారథులు వారికి కూడ నాయకులగు, వృష్ణిభోజేషు = వృష్ణిభోజవంశీయులు, నిధనమ్ = మరణమును, ఉపగతేషు = పొందగా, ముఖ్యః = ముఖ్యుడగు, సః = ఆ, ఉద్ధవః తు = ఉద్ధవుడు మాత్రమే, కథమ్ = ఏ విధముగా, అవశిష్టః = మిగిలి నాడు?, యత్ = ఏలయనగా, త్రి-అధీశః = ముల్లోకములకు ప్రభువగు, హరిః అపి = శ్రీకృష్ణ భగవానుడు కూడ, ఆకృతిమ్ = దేహమును, తత్యాజ = విడిచిపెట్టెనో.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- అతిరథులు, మహారథులు, వారికి కూడ నాయకులు అగు వృష్ణిభోజవంశీయులు అందరు మరణించి రి. ముల్లోకములకు ప్రభువగు శ్రీకృష్ణ భగవానుడు కూడ దేహమును విడి చిపెట్టెను. కాని, యాదవులలో ముఖ్యుడగు ఒక్క ఉద్ధవుడు మాత్రము మిగిలియుండెను. ఇది ఎట్లు సంభవమయ్యెను?

శ్రీశుక ఉవాచ ।
బ్రహ్మశాపాపదేశేన కాలేనామోఘవాంఛితః ।
సంహృత్య స్వకులం నూనం త్యక్ష్యన్దేహమచింతయత్ ॥29

అమోఘవాంఛితః = సత్యసంకల్పుడగు భగవానుడు, బ్రహ్మశాప -అపదేశేన = బ్రాహ్మణ శాపము అనే మిషచే, కాలేన = కాలముచే, స్వకు లమ్ = తన వంశమును, నూనమ్ = నిశ్చయముగా, సంహృత్య = ఉపసంహరించి, దేహమ్ = దేహమును, త్యక్ష్యన్ = విడువబోవువాడై, అచింతయత్ = ఆలోచించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- సత్యసంకల్పుడగు శ్రీకృష్ణ భగవానుడు కాలము వచ్చినప్పుడు బ్రాహ్మణ శాపము అనే మిషచే తన

వంశమును పూర్తిగా ఉపసంహరించి, తాను కూడ దేహత్యాగమును చేయ బోతూ, ఇట్లు తలపోసెను.

అస్మాల్లోకాదుపరతే మయి జ్ఞానం మదాశ్రయమ్ ।
అర్హత్యుద్ధవ ఏవాద్ధా సంప్రత్యాత్మవతాం వరః ॥ 30

మయి = నేను, అస్మాత్ = ఈ, లోకాత్ = లోకమునుండి, ఉపరతే = నిష్క్రమించగా, మత్-ఆశ్రయమ్ = నేను ఆశ్రయము (విషయము) గా గల, జ్ఞానమ్ = జ్ఞానమును, సంప్రతి = ఇప్పుడు, ఆత్మవతామ్ = బుద్ధిమంతులలో (జితేంద్రియులలో), వరః = శ్రేష్ఠుడగు, ఉద్ధవః ఏవ = ఉద్ధవుడు మాత్రమే, అద్ధా = సాక్షాత్తుగా, అర్హతి = తగియున్నాడు.

నేను ఈ లోకమునుండి నిష్క్రమించుచున్నాను. ఇప్పుడు నా (నన్ను బోధించే) జ్ఞానమునకు బుద్ధిమంతులలో శ్రేష్ఠుడు, జితేంద్రియుడు అగు ఉద్ధవుడు మాత్రమే నిశ్చయముగా తగియున్నాడు.

నోద్ధవోఽణ్వపి మన్న్యూనో యద్గుణైర్నార్దితః ప్రభుః ।
అతో మద్వయునం లోకం గ్రాహయన్నిహ తిష్ఠతు ॥ 31

ఉద్ధవః = ఉద్ధవుడు, అణు అపి = లేశమైననూ, మత్-న్యూనః = నాకంటె తక్కువవాడు, న = కాదు, యత్ = ఏలయనగా, ప్రభుః = జితేంద్రియుడగు ఆ ఉద్ధవుడు, గుణైః = సత్త్వరజస్తమోగుణములచే, న అర్దితః = పీడింపబడలేదు, అతః = ఇందువలన, మత్ -వయునమ్ = నా జ్ఞానమును, లోకమ్ = మానవుని గురించి, గ్రాహయన్ = బోధించువాడై, ఇహ = ఈ లోకములో, తిష్ఠతు = నిలిచియుండుగాక!

ఉద్ధవుడు జితేంద్రియుడు. ఆయన అంతఃకరణములోని సత్త్వరజస్తమోగుణములచే మరియు బాహ్యమునందలి గుణకార్యములగు శబ్దాది విషయములచే విచలితుడు కాడు. కావున, ఆయన నాకంటె ఏ మాత్రము తీసిపోడు. కావుననే, నా జ్ఞానమును జనులకు ఉపదేశిస్తూ, ఆయన ఈ లోకములోనే కొంత కాలము నిలిచియుండుగాక!

ఏవం త్రిలోకగురుణా సందిష్టశ్శబ్దయోనినా ।

బదర్యాశ్రమమాసాద్య హరిమీజే సమాధినా ॥ 32

త్రిలోకగురుణా = ముల్లోకములకు గురువు (తండ్రి), శబ్దయోనినా = వేదము అనే ప్రమాణముచే తెలియబడువాడు (వేదమునకు కారణమైన వాడు) అగు శ్రీకృష్ణునిచే, ఏవమ్ = ఈ విధముగా, సందిష్టః = ఆదేశించబడినవాడై, బదరీ-ఆశ్రమమ్ = బదరికాశ్రమమును, ఆసాద్య = చేరుకొని, సమాధినా = ఏకాగ్రచిత్తముతో, హరిమ్ = శ్రీహరిని, ఈజే = ఆరాధించెను.

ముల్లోకములకు గురువు, తండ్రి, వేదము అనే ప్రమాణముచే తెలియబడువాడు, వేదమునకు కారణమైనవాడు అగు శ్రీకృష్ణునిచే ఈ విధముగా ఆదేశించబడినవాడై, ఉద్ధవుడు బదరికాశ్రమమునకు చేరుకొని, ఏకాగ్రచిత్తముతో శ్రీహరిని ఆరాధించెను.

విదురోఽప్యుద్ధవాచ్ఛ్రుత్వా కృష్ణస్య పరమాత్మనః ।
క్రీడయోపాత్తదేహస్య కర్మాణి శ్లాఘితాని చ ॥ 33

విదురః అపి = విదురుడు కూడ, క్రీడయా = లీలచే, ఉపాత్తదేహస్య = స్వీకరించబడిన దేహము గల, కృష్ణస్య పరమాత్మనః = శ్రీకృష్ణ పరమాత్మయొక్క, శ్లాఘితాని = కొనియాడబడిన, కర్మాణి = చరితములను, ఉద్ధవాత్ = ఉద్ధవుని నుండి, శ్రుత్వా = విని.

పరమేశ్వరుడు తన లీలచే శ్రీకృష్ణరూపములో అవతరించి కొనియాడదగిన లీలలను నెరపినాడు. విదురుడు ఆ విషయములను ఉద్ధవుడు చెప్పగా వినెను.

దేహన్యాసం చ తస్యైవం ధీరాణాం ధైర్యవర్ధనమ్ ।
అన్యేషాం దుష్కరతరం పశూనాం విక్లబాత్మనామ్ ॥ 34

చ = మరియు, తస్య = ఆ శ్రీకృష్ణుని, ఏవమ్ = ఈ విధమైన, దేహన్యాసమ్ = దేహత్యాగము, ధీరాణామ్ = ధీరపురుషులకు, ధైర్యవర్ధనమ్ = ధైర్యమును వర్ధిల్లజేయునది, విక్లబ-ఆత్మనామ్ = అధీరచిత్తులగు, అన్యేషామ్ = ఇతరులగు, పశూనామ్ = అజ్ఞానులకు, దుష్కరతరమ్ = మిక్కిలి చేయశక్యము కానిది.

శ్రీకృష్ణుడు దేహమును విడిచిన ఈ విధానము ధీరచిత్తులకు ధైర్యమును వర్ధిల్లజేయును. కాని, గుండె దిటవు లేని అజ్ఞానులగు ఇతరులు ఇట్టి కార్యమును ఎన్నడైననూ చేయలేరు.

ఆత్మానం చ కురుశ్రేష్ఠ కృష్ణేన మనసేక్షితమ్ ।
ధ్యాయన్ గతే భాగవతే రురోద ప్రేమవిహ్వలః ॥ 35

కురుశ్రేష్ఠ = కురువంశశ్రేష్ఠుడవగు ఓ పరీక్షిన్మహారాజా!, చ = మరియు, కృష్ణేన = శ్రీకృష్ణునిచే, మనసా = మనస్సుచే, ఆత్మానమ్ = తనను, ఈక్షితమ్ = దర్శించబడినవానినిగా (విని), భాగవతే = భాగవతుడగు ఉద్ధవుడు, గతే = వెళ్లిపోగా, ధ్యాయన్ = స్మరిస్తూ, ప్రేమవిహ్వలః = ప్రేమచే వ్యాకులమైన మనస్సు గలవాడై, రురోద = దుఃఖించెను.

కురువంశశ్రేష్ఠుడవగు ఓ పరీక్షిన్మహారాజా! పరమభక్తుడగు ఉద్ధవుడు వెళ్లిన తరువాత, శ్రీకృష్ణుడు తనను స్మరించినాడని ఆయననుండి విన్న విదురుడు ఆ శ్రీకృష్ణునే స్మరిస్తూ, ప్రేమచే వ్యాకులమైన మనస్సు గలవాడై రోదించెను.

కాలింద్యాః కతిభిస్సిద్ధ అహోభిర్భరతర్షభః ।
ప్రాపద్యత స్వస్సరితం యత్ర మిత్రాసుతో మునిః ॥ 36

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
చతుర్థోఽధ్యాయః ॥

సిద్ధః = కృతకృత్యుడు, భరత-ఋషభః = భరతవంశ శ్రేష్ఠుడు అగు విదురుడు, కతిభిః = కొన్ని, అహోభిః = రోజులచే, కాలింద్యాః = యమునానది వద్దనుండి, స్వః-సరితమ్ = గంగానదిని, ప్రాపద్యత = చేరుకొనెను, యత్ర = ఎక్కడనైతే, మిత్రాసుతః మునిః = మైత్రేయ మహర్షి ఉండెనో.

కృతకృత్యుడు, భరతవంశ శ్రేష్ఠుడు అగు విదురుడు యమునానదీతీరమునుండి బయలుదేరి కొన్ని రోజులు ప్రయాణము చేసి, గంగానదీతీరమునందు మైత్రేయ మహర్షి ఉన్న స్థానమునకు చేరెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి మూడవ స్కంధములో
నాల్గవ అధ్యాయము ముగిసినది (4).

* * * * *

# అథ పంచమోఽధ్యాయః

## మైత్రేయుడు సృష్టి క్రమమును వర్ణించుట

శ్రీశుక ఉవాచ ।

ద్వారి ద్యునద్యా ఋషభః కురూణాం
మైత్రేయమాసీనమగాధబోధమ్ ।
క్షత్తోపసృత్యాచ్యుతభావశుద్ధః
పప్రచ్ఛ సౌశీల్యగుణాభితృప్తః ॥ 1

శ్రీశుకః = శ్రీశుక మహర్షి, ఉవాచ = పలికెను, కురూణామ్ = కురు వంశీయులలో, ఋషభః = శ్రేష్ఠుడు, అచ్యుతభావశుద్ధః = శ్రీకృష్ణునియందలి భక్తిచే పవిత్రమైన అంతఃకరణము గలవాడు అగు, క్షత్తా = విదురుడు, ద్యునద్యాః = గంగానదియొక్క, ద్వారి = ద్వారమునందు, ఆసీనమ్ = కూర్చునియున్న, అగాధబోధమ్ = లోతైన జ్ఞానము గల, మైత్రేయమ్ = మైత్రేయుని, ఉపసృత్య = సమీపించి, సౌశీల్యగుణ-అభితృప్తః = ఆయనయొక్క సాధుస్వభావము అనే గుణముచే మిక్కిలి తృప్తిని చెందిన వాడై, పప్రచ్ఛ = ప్రశ్నించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- మహాజ్ఞానియగు మైత్రేయుడు గంగా (హరి) ద్వారమునందు సర్వకర్మసన్న్యాసియై కూర్చుని యుండెను. కురువంశ శ్రేష్ఠుడు, శ్రీకృష్ణునియందలి భక్తిచే పవిత్రమైన అంతఃకరణము గలవాడు అగు విదురుడు ఆయన వద్దకు వచ్చెను. ఆయన యొక్క సాధుభావముచే మిక్కిలి ఆనందమును పొందిన విదురుడు ఈ విధముగా ప్రశ్నించెను.

విదుర ఉవాచ ।

సుఖాయ కర్మాణి కరోతి లోకో
న తైస్సుఖం వాన్యదుపారమం వా ।
విందేత భూయస్తత ఏవ దుఃఖం
యదత్ర యుక్తం భగవాన్ వదేన్నః ।। 2

లోకః = మానవుడు, సుఖాయ = సుఖము కొరకై, కర్మాణి = కర్మలను, కరోతి = చేయును, తైః = ఆ కర్మలచే, సుఖమ్ = సుఖమును గాని, అన్యత్-ఉపారమం వా = సుఖవిరుద్ధమగు దుఃఖముయొక్క నివారణను గాని, న విందేత = పొందుట లేదు, భూయః = పైగా, తతః = ఆ కర్మల వలన, దుఃఖం ఏవ = దుఃఖమే కలుగుచున్నది, అత్ర = ఈ స్థితిలో, యత్ = ఏది, యుక్తమ్ = యోగ్యమైనదో దానిని, భగవాన్ = పూజ్యుడవగు నీవు, నః = మా కొరకు, వదేత్ = చెప్పుడు.

విదురుడు ఇట్లు పలికెను --- మానవుడు సుఖములను గోరి కర్మలను చేయును. కాని, వాటి వలన మానవునకు సుఖము లభించుట లేదు; దుఃఖము దూరమగుట లేదు. పైగా, వాటి వలన మరల మరల దుఃఖమే కలుగుచున్నది. ఈ స్థితిలో మానవునకు కర్తవ్యమేమియో పూజ్యుడవగు నీవు చెప్పుము.

జనస్య కృష్ణాద్విముఖస్య దైవాదధర్మశీలస్య సుదుఃఖితస్య ।
అనుగ్రహాయేహ చరంతి నూనం భూతాని భవ్యాని జనార్దనస్య।।3

కృష్ణాత్ = శ్రీకృష్ణునినుండి, విముఖస్య = విముఖుడై యున్నట్టియు, దైవాత్ = దైవవశమున, అధర్మశీలస్య = అధర్మస్వభావము కలిగినట్టియు, సుదుఃఖితస్య = మిక్కిలి దుఃఖితుడై యున్న, జనస్య = మానవుని, అనుగ్రహాయ = అనుగ్రహము కొరకు, ఇహ = ఈ లోకములో, భవ్యాని = మంగళకరులగు, జనార్దనస్య = శ్రీకృష్ణుని, భూతాని = భక్తులు, చరంతి = సంచరించుచున్నారు, నూనమ్ = ఇది నిశ్చయము.

మానవుడు శ్రీకృష్ణ భక్తిలేని కారణముగా దైవయోగముచే అధర్మమునాచరించే స్వభావము గలవాడై, ఆ కారణముగా దుఃఖభాజనుడగుచు

న్నాడు. అట్టి మానవులననుగ్రహించుట కొరకై మంగళకరులగు శ్రీకృష్ణభక్తులు ఈ లోకములో సంచరించుచుందురు. ఇది నిశ్చయము.

తత్సాధువర్యాదిశ వర్త్మ శం నః
సంరాధితో భగవాన్ యేన పుంసామ్ ।
హృది స్థితో యచ్ఛతి భక్తిపూతే
జ్ఞానం సతత్త్వాధిగమం పురాణమ్ ॥ 4

తత్ = అందువలన, సాధువర్య = సాధుపురుషులలో శ్రేష్ఠుడైన వాడా!, నః = మా కొరకు, శమ్ = మంగళకరమగు, వర్త్మ = మార్గమును, ఆదిశ = ఉపదేశించుము, యేన = ఏ మార్గముచే, సంరాధితః = చక్కగా ఆరాధించబడిన, భగవాన్ = భగవానుడు, పుంసామ్ = మానవుల, భక్తిపూతే = భక్తిచే పవిత్రమైన, హృది = హృదయమునందు, స్థితః = ఉన్నవాడై, సతత్త్వ-అధిగమమ్ = స్వరూపముయొక్క అపరోక్షానుభవమును కలిగించే, పురాణమ్ = సనాతనమగు, జ్ఞానమ్ = జ్ఞానమును, యచ్ఛతి = ఇచ్చునో.

సాధుపురుషులలో శ్రేష్ఠుడవగు ఓ మైత్రేయా! నీవు మాకు మంగళకరమగు మార్గమునుపదేశించుము. మానవులు ఆ మార్గములో భగవానుని చక్కగా ఆరాధించి తమ హృదయములను భక్తితో పావనము చేసుకొనెదరు. అట్టి పవిత్రమగు హృదయములో నిలిచియుండే భగవానుడు వారికి ఆత్మస్వరూపముయొక్క అపరోక్షానుభూతిని కలిగించే సనాతన జ్ఞానమును అనుగ్రహించును.

కరోతి కర్మాణి కృతావతారో యాన్యాత్మతంత్రో భగవాంస్త్ర్యధీశః ।
యథా ససర్జాగ్ర ఇదం నిరీహస్సంస్థాప్య వృత్తిం జగతో విధత్తే ॥5

ఆత్మతంత్రః = స్వతంత్రుడు, త్ర్యధీశః = ముల్లోకములకు ప్రభువు, నిరీహః = క్రియ (కామన) లేనివాడు అగు, భగవాన్ = పరమేశ్వరుడు, కృత-అవతారః = అవతారములనెత్తినవాడై, యాని = ఏ, కర్మాణి = కర్మలను, కరోతి = చేయునో, అగ్రే = సృష్టికి పూర్వము, ఇదమ్ = ఈ జగత్తును, యథా = ఏ విధముగా, ససర్జ = సృష్టించెనో, సంస్థాప్య = చక్కని స్థితిని

కల్పించి, జగతః = జగత్తుయొక్క, వృత్తిమ్ = జీవికను, విధత్తే = ఏర్పాటు చేయుచున్నాడో.

స్వతంత్రుడు, ముల్లోకములకు ప్రభువు అగు భగవానుడు అవతారములనెత్తి ఏ కర్మలను చేయును? భగవానుడు కర్తృత్వము మరియు కామనలు లేనివాడే అయిననూ కల్పమునకు ఆరంభములో ఈ జగత్తును సృష్టించిన విధమెట్టిది? ఆయన ఈ జగత్తునకు స్థితిని (రక్షణను) కల్పించి, ప్రాణులకు జీవికను ఏర్పాటు చేసే విధానమెట్టిది?

యథా పునస్స్వే ఖ ఇదం నివేశ్య
శేతే గుహాయాం స నివృత్తవృత్తిః ।
యోగేశ్వరాధీశ్వర ఏక ఏత-
దనుప్రవిష్టో బహుధా యథాఽఽసీత్ ॥ 6

పునః = మరల, నివృత్తవృత్తిః = విరమించబడిన వ్యాపారము (సంకల్పవృత్తి) గలవాడై, సః = ఆ భగవానుడు, ఇదమ్ = ఈ జగత్తును, యథా = ఏ విధముగా, స్వే = తన స్వరూపమైన, ఖే = చిదాకాశమునందు, నివేశ్య = ఉపసంహరించి, గుహాయామ్ = యోగమాయయందు, యథా = ఏ విధముగా, శేతే = నిద్రించును? యోగ-ఈశ్వర-అధి-ఈశ్వరః = యోగేశ్వరులకు అధీశ్వరుడగు, ఏకః = అద్వయ పరమాత్మ, ఏతత్ = ఈ జగత్తును, అనుప్రవిష్టః = తరువాత ప్రవేశించినవాడై, యథా = ఏ విధముగా, బహుధా = అనేకప్రకారములుగా, ఆసీత్ = ఉండెను?

మరల ఆ పరమేశ్వరుడు సంకల్పరూపమైన సృష్టివ్యాపారము నుండి విరమించి, తన స్వరూపమగు చిదాకాశమునందు ఈ జగత్తును ఉపసంహరించి, యోగమాయయందు నిద్రించు విధమెట్టిది? యోగేశ్వరులకు అధీశ్వరుడగు ఆ పరమాత్మ అద్వితీయుడే అయిననూ, ఈ జగత్తును సృష్టించి, దానియందు అంతర్యామి (సత్తా-స్ఫూర్తులు) రూపముగా ప్రవేశించి, తానే అనేకరూపములుగా ప్రకటమైన విధమెట్టిది?

క్రీడన్ విధత్తే ద్విజగోసురాణాం

క్షేమాయ కర్మాణ్యవతారభేదైః ।
మనో న తృప్యత్యపి శృణ్వతాం నః
సుశ్లోకమౌలేశ్చరితామృతాని ॥ 7

అవతారభేదైః = విభిన్నములగు అవతారములచే, క్రీడన్ = విహరించుచున్నవాడై, ద్విజగోసురాణామ్ = బ్రాహ్మణులు గోవులు మరియు దేవతలయొక్క, క్షేమాయ = క్షేమము కొరకు, కర్మాణి = లీలలను, విధత్తే = నెరపుచున్నాడు, సుశ్లోకమౌలేః = పవిత్రమగు కీర్తి గలవారిలో శిఖామణి యగు శ్రీహరియొక్క, చరిత-అమృతాని = అమృతమువంటి చరితములను, శృణ్వతాం అపి = వినుచున్నవారమే అయిననూ, నః = మాకు, మనః = మనస్సు, న తృప్యతి = తృప్తిని పొందుట లేదు.

భగవానుడు వివిధములగు అవతారములనెత్తి విహరిస్తూ, గోబ్రాహ్మణులు మరియు దేవతల క్షేమము కొరకై అనేకలీలలను చేయుచుండును. పవిత్రమగు కీర్తి గలవారిలో ఆయన శిఖామణి. ఆయనయొక్క లీలలను వినుట అమృతపానము వంటిది. ఎంత విన్ననూ, మా మనస్సులకు తృప్తి కలుగుట లేదు.

యైస్తత్త్వభేదైరధిలోకనాథో లోకానలోకాన్ సహలోకపాలాన్ ।
అచీక్లుపద్యత్ర హి సర్వసత్త్వనికాయభేదోఽధికృతః ప్రతీతః॥ 8

అధిలోకనాథః = లోకపాలకులకందరికీ ప్రభువగు భగవానుడు, సహలోకపాలాన్ = లోకపాలకులతో కూడియున్న, లోకాన్ = లోకములను, అలోకాన్ = లోకాలోకపర్వతములకు బాహ్యమునందుండే భాగములను, యైః = ఏ, తత్త్వభేదైః = విభిన్నములగు తత్త్వములచే, అచీక్లుపత్ = రచించెను?, యత్ర = వేటియందు, అధికృతః = అధికారము గల, సర్వసత్త్వనికాయభేదః = సకలప్రాణుల సమూహముల భేదము, ప్రతీతః = గోచరించుచున్నదో.

లోకములు, లోకపాలకులు, లోకాలోకపర్వతములకు బాహ్యమునందుండే భాగములతో కూడిన ఈ బ్రహ్మాండమునందు అధికారభేదమును బట్టి సకలప్రాణుల సమూహములు వేర్వేరుగా ప్రతీయమానమగు

చున్నవి. లోకపాలకులందరికీ ప్రభువగు ఆ భగవానుడు ఏ తత్త్వములతో ఈ బ్రహ్మాండమును రచించెను?

**యేన ప్రజానాముత ఆత్మకర్మరూపాభిధానాం చ భిదాం వ్యధత్త ।**
**నారాయణో విశ్వసృడాత్మయోనిరేతచ్చ నో వర్ణయ విప్రవర్య ॥9**

విప్రవర్య = ఓ బ్రాహ్మణశ్రేష్ఠా!, ఉత చ = మరియు, విశ్వసృట్ = జగత్తును సృష్టించినవాడు, ఆత్మయోనిః = స్వయంభువు అగు, నారాయణః = నారాయణుడు, యేన = ఏ ప్రకారముగా, ప్రజానామ్ = జీవుల, ఆత్మకర్మరూప-అభిధానామ్ = స్వభావము కర్మ రూపము మరియు నామముల, భిదామ్ = భేదమును, వ్యధత్త = చేసెను? ఏతత్ చ = దీనిని కూడ, నః = మా కొరకు, వర్ణయ = వర్ణించి చెప్పుము.

జీవులలో స్వభావము, దానిని బట్టి కర్మ, దానిని బట్టి రూపము, దానిని బట్టి నామము అను అంశములలో భేదము గలదు. స్వయముగా సద్రూపుడు, జగత్తును సృష్టించినవాడు అగు నారాయణుడు ఈ భేదములను ఎట్లు సృష్టించెను? ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! దీనిని కూడ మాకు వర్ణించి చెప్పుము.

పరావరేషాం భగవన్ వ్రతాని
శ్రుతాని మే వ్యాసముఖాదభీక్ష్ణమ్ ।
అతృప్నుమ క్షుల్లసుఖావహానాం
తేషామృతే కృష్ణకథామృతౌఘాత్ ॥ 10

భగవన్ = ఓ పూజ్యా!, పర-అవరేషామ్ = పెద్ద చిన్న వ్యక్తుల, వ్రతాని = ధర్మములు, మే = నాకు, వ్యాసముఖాత్ = వ్యాసుని ముఖము నుండి, అభీక్ష్ణమ్ = పలుమార్లు, శ్రుతాని = వినబడినవి, కృష్ణకథా-అమృత-ఓఘాత్ ఋతే = శ్రీకృష్ణుని గాథలు అనే అమృతప్రవాహమును మినహాయించి, క్షుల్లసుఖ-ఆవహానామ్ = అల్పమగు సుఖమును ఇచ్చే, తేషామ్ = వాటికి, అతృప్నుమ = తృప్తిని చెందితిమి.

ఓ పూజ్యా! సమాజములో వివిధస్థాయిలలోని వ్యక్తులు అనుసరించదగిన ధర్మములను గురించి వ్యాసుని నోటినుండి పలుమార్లు వినియుంటిని. అల్పమగు సుఖమును మాత్రమే ఇచ్చే అట్టి ధర్మములయందు నాకు తృప్తి కలిగినది. కాని, శ్రీకృష్ణుని కథామృతప్రవాహమునందు మాత్రము నాకు తృప్తి కలుగుట లేదు.

కస్తృప్నుయాత్తీర్థపదోఽభిధానాత్
సత్రేషు వస్సూరిభిరీడ్యమానాత్ ।
యః కర్ణనాడీం పురుషస్య యాతో
భవప్రదాం గేహరతిం ఛినత్తి ॥ 11

వః = మీయొక్క, సత్రేషు = సమాజములయందు, సూరిభిః = విద్వాంసులచే, ఈడ్యమానాత్ = కొనియాడబడే, తీర్థపదః = భగవానుని, అభిధానాత్ = చరితము వలన, కః = ఎవ్వాడు, తృప్నుయాత్ = తృప్తిని చెందును?, యః = ఏ శ్రీకృష్ణుడు, పురుషస్య = మానవుని, కర్ణనాడీమ్ = చెవిలోని శబ్దనాడిని, యాతః = పొందినవాడై, భవప్రదామ్ = సంసారమును కలిగించే, గేహరతిమ్ = గృహమునందు ఆసక్తిని, ఛినత్తి = ఛేదించునో.

మీ సాధుసమాజములో విద్వాంసులు భగవానుని చరితములను కీర్తించుచుందురు. వాటిని విన్నవానికి, ఇక చాలును అనే తృప్తి ఎవనికి కల్గును? ఎవ్వనికైననూ కలుగదు. ఆ శ్రీకృష్ణుడు మానవుని చెవిలోని శబ్ద నాడిని పొందినప్పుడు, అనగా మానవుడు శ్రీకృష్ణుని చరితమును విన్నచో, సంసారదాయకమగు గృహాదులయందలి ఆసక్తి పటాపంచలగును.

మునిర్వివక్షుర్భగవద్గుణానాం
సఖాపి తే భారతమాహ కృష్ణః ।
యస్మిన్నృణాం గ్రామ్యసుఖానువాదైః
మతిర్గృహీతా ను హరేః కథాయామ్ ॥ 12

తే = నీ, సఖా = మిత్రుడగు, మునిః = మహర్షియగు, కృష్ణః అపి = కృష్ణద్వైపాయనుడు కూడ, భగవద్-గుణానామ్ = భగవానుని గుణముల

ను, వివక్షుః = చెప్పగోరినవాడై, భారతమ్ = భారతమును, ఆహ = చెప్పె ను, యస్మిన్ = దేనియందు, గ్రామ్యసుఖ-అనువాదైః = ఇంద్రియభోగముల వర్ణనలచే, నృణామ్ = మానవుల, మతిః = బుద్ధి, అను = తరువాత, ను = నిశ్చయముగా, హరేః = శ్రీహరియొక్క, కథాయామ్ = కథయందు, గృహీతా = తీసుకువెళ్లబడినదో.

నీ మిత్రుడగు వ్యాసమహర్షి కూడ భగవంతుని గుణములను వర్ణించగోరి భారతమును రచించినాడు. దానిలో ఆయన విషయసుఖములను వర్ణిస్తూ, వాటి ద్వారా వెనువెంటనే మానవుల బుద్ధిని శ్రీహరియొక్క గాథల వైపునకు తీసుకుపోయే ప్రయత్నమును చేసినాడు.

సా శ్రద్ధధానస్య వివర్ధమానా
విరక్తిమన్యత్ర కరోతి పుంసః ।
హరేః పదానుస్మృతినిర్వృతస్య
సమస్తదుఃఖాత్యయమాశు ధత్తే ॥ 13

సా = ఆ గాథ, శ్రద్ధధానస్య = శ్రద్ధాళువు అగు, పుంసః = మానవునకు, వివర్ధమానా = వర్ధిల్లుచున్నదై, అన్యత్ర = ఇతరములగు భోగములయందు, విరక్తిమ్ = వైరాగ్యమును, కరోతి = చేయుచున్నది, హరేః = శ్రీహరియొక్క, పద-అనుస్మృతినిర్వృతస్య = పాదముల నిరంతరమగు స్మరణముచే ఆనందములో ఓలలాడువానికి, ఆశు = శీఘ్రముగా, సమస్తదుఃఖ-అత్యయమ్ = సకలదుఃఖముల వినాశమును, ధత్తే = చేయును.

శ్రద్ధాళువు అగు మానవునకు శ్రీహరి గాథలయందు అభిరుచి వర్ధిల్లి, ఇతరములగు భోగములయందు వైరాగ్యమును కలిగించును. ఆ విధముగా శ్రీహరియొక్క పాదములను నిరంతరముగా స్మరించి ఆనందించే భక్తునకు ఆ గాథ వెంటనే సకలదుఃఖములను నశింపజేయును.

తాన్ శోచ్యశోచ్యానవిదోఽనుశోచే
హరేః కథాయాం విముఖానఘేన ।
క్షిణోతి దేవోఽనిమిషస్తు యేషా-

మాయుర్వృథావాదగతిస్మృతీనామ్ ॥ 14

శోచ్యశోచ్యాన్ = శోకింపదగినవారిలో కూడ శోకింపదగినవారు, అఘేన = పాపముచే, హరేః = శ్రీహరియొక్క, కథాయామ్ = గాథయందు, విముఖాన్ = విముఖులు అగు, తాన్ = ఆ, అవిదః = అజ్ఞానులను గురించి, అనుశోచే = ఖేదమును పొందుచున్నాను, వృథావాదగతిస్మృతీనామ్ = వ్యర్థములగు వచనములు నడకలు స్మరణములు గల, యేషాం తు = ఎవరికైతే, ఆయుః = ఆయుర్దాయమును, అనిమిషః దేవః = సూర్యభగవానుడు (కాలపురుషుడు), క్షిణోతి = క్షీణింపజేయుచున్నాడో.

ఈ లోకములో శోకింపదగినవారు పలువురు గలరు. కాని ఎవరైతే పూర్వపాపముయొక్క ప్రభావముచే శ్రీహరియొక్క గాథలయం ప విముఖులై యుందురో, అట్టి అజ్ఞానులు అందరికంటె అధికముగా శోకింప దగిన వారు. నేను వారిని గురించి ఖేదమును పొందుచున్నాను. ఏలయనగా, వారి కాయిక, వాచిక, మానసిక వ్యాపారములన్నియు వ్యర్థములే. సూర్యుని రూపములోనున్న కాలపురుషుడు వారి ఆయుర్దాయమును వ్యర్థముగా క్షీణింపజేయుచున్నాడు.

తదస్య కౌషారవ శర్మదాతుర్హరేః కథామేవ కథాసు సారమ్ ।
ఉద్ధృత్య పుష్పేభ్య ఇవార్తబంధో శివాయ నః కీర్తయ తీర్థకీర్తేః॥15

కౌషారవ = ఓ మైత్రేయా!, ఆర్తబంధో = ఇడుములలో నున్నవారికి బంధువు అయినవాడా!, తత్ = అందువలన, శర్మదాతుః = సుఖమునిచ్చువాడు, తీర్థకీర్తేః = పవిత్రమగు కీర్తిగలవాడు అగు, అస్య = ఈ, హరేః = శ్రీహరియొక్క, కథాసు = కథలయందు, సారమ్ = సారభూతమగు, కథాం ఏవ = కథను మాత్రమే, పుష్పేభ్యః ఇవ = పుష్పములనుండి వలె, ఉద్ధృత్య = పైకి తీసి, నః = మాయొక్క, శివాయ = మంగళము కొరకు, కీర్తయ = కీర్తించుము.

ఓ మైత్రేయా! నీవు కష్టములలో నున్నవారికి బంధువువంటి వాడవు. పవిత్రమగు కీర్తిగల ఆ శ్రీహరి భక్తులకు సుఖములనిచ్చును. కావున నీవు, పుష్పముల సారమగు తేనెను తుమ్మెద పైకి తీసిన విధముగా,

లౌకికగాథలలోనుండి సారభూతమగు శ్రీహరిగాథను వెలికి తీసి కీర్తించి, మాకు కల్యాణమును కలిగించుము.

స విశ్వజన్మస్థితిసంయమార్థే
కృతావతారః ప్రగృహీతశక్తిః ।
చకార కర్మాణ్యతిపూరుషాణి
యానీశ్వరః కీర్తయ తాని మహ్యామ్ ॥ 16

సః = ఆ, ఈశ్వరః = పరమేశ్వరుడు, విశ్వజన్మస్థితిసంయమ-అర్థే = జగత్తుయొక్క సృష్టిస్థితిలయములు అనే కార్యమునందు, ప్రగృహీతశక్తిః = స్వీకరించబడిన మాయాశక్తి గలవాడై, కృత-అవతారః = చేయబడిన అవతారములు గలవాడై, అతిపూరుషాణి = అలౌకికములగు, యాని = ఏ, కర్మాణి = చేష్టలను, చకార = చేసెనో, తాని = వాటిని, మహ్యామ్ = నా కొరకు, కీర్తయ = కీర్తించుము.

ఆ పరమేశ్వరుడు మాయాశక్తిని ఆసరాగా చేసుకొని జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను చేయుచున్నాడు. ఆయన ఈ లోకమునందవతరించి చేసిన దివ్యకర్మలను నాకు వినిపించుము.

శ్రీశుక ఉవాచ ।
స ఏవం భగవాన్ పృష్టః క్షత్త్రా కౌషారవిర్మునిః ।
పుంసాం నిశ్శ్రేయసార్థేన తమాహ బహు మానయన్ ॥17

ఏవమ్ = ఈ విధముగా, పుంసామ్ = మానవుల, నిశ్శ్రేయస-అర్థేన = మోక్షము అనే ప్రయోజనముచే, క్షత్త్రా = విదురునిచే, పృష్టః = ప్రశ్నించబడిన, సః = ఆ, కౌషారవిః మునిః = మైత్రేయ మహర్షి, తమ్ = ఆ విదురుని, బహు = అధికముగా, మానయన్ = ఆదరిస్తూ, ఆహ = పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా విదురుడు మానవులకు మోక్షోపాయమును అందించవలెననే భావనతో ప్రశ్నించగా, మైత్రేయ మహర్షి ఆయనను చాల సమ్మానించి, ఇట్లు పలికెను.

మైత్రేయ ఉవాచ ।
సాధు పృష్టం త్వయా సాధో లోకాన్ సాధ్వనుగృహ్ణతా ।
కీర్తిం వితన్వతా లోకే ఆత్మనోఽధోక్షజాత్మనః ।। 18

సాధో = ఓ సాధుపురుషుడా!, అధోక్షజ-ఆత్మనః = అధోక్షజుడే మనస్సునందు గల, ఆత్మనః = నీయొక్క, కీర్తిమ్ = కీర్తిని, లోకే = లోకము నందు, వితన్వతా = విస్తరింపజేయుచున్నట్టియు, లోకాన్ = మానవులను, సాధు = చక్కగా, అనుగృహ్ణతా = అనుగ్రహించే, త్వయా = నీచే, సాధు = చక్కగా, పృష్టమ్ = ప్రశ్నించబడినది.

ఓ సాధుపురుషుడవగు విదురా! నీ మనస్సు సర్వదా శ్రీహరిపైనే లగ్నమై యున్నది. నీవు మానవులను అనుగ్రహించ గోరి చక్కని ప్రశ్నను వేసితివి. ఈ ప్రసంగము ద్వారా నీ కీర్తి కూడ లోకములో విస్తరించగలదు.

నైతచ్చిత్రం త్వయి క్షత్తర్బాదరాయణవీర్యజే ।
గృహీతోఽనన్యభావేన యత్త్వయా హరిరీశ్వరః ।। 19

క్షత్తః = ఓ విదురా!, బాదరాయణవీర్యజే = వ్యాసుని ఔరసపుత్రుడ వగు, త్వయి = నీయందు, ఏతత్ = ఇది, న చిత్రమ్ = చిత్రము కాదు, యత్ = ఏలయనగా, త్వయా = నీచే, ఈశ్వరః = సర్వేశ్వరుడగు, హరిః = శ్రీహరి, అనన్యభావేన = ఏకాంతభక్తిచే (ఆత్మబుద్ధిచే), గృహీతః = ఆశ్రయించ బడినాడు (తెలియబడినాడు).

ఓ విదురా! వ్యాసుని ఔరసపుత్రుడవగు నీవు ఈ విధముగా ప్రశ్నించుటలో ఆశ్చర్యము లేదు. ఏలయనగా, నీవు సర్వేశ్వరుడగు శ్రీహరిని ఏకాంతభక్తితో ఆశ్రయించినవాడవై, ఆయనను ఆత్మరూపునిగా తెలుసుకున్నావు.

మాండవ్యశాపాద్భగవాన్ ప్రజాసంయమనో యమః ।
భ్రాతుః క్షేత్రే భుజిష్యాయాం జాతస్సత్యవతీసుతాత్ ।। 20

ప్రజాసంయమనః = జీవులను దండించే, భగవాన్ యమః = యమభగవానుడు, మాండవ్యశాపాత్ = మాండవ్యమహర్షియొక్క శాపము వలన, సత్యవతీసుతాత్ = సత్యవతి పుత్రుడగు వ్యాసుని వలన, భ్రాతుః = ఆయన సోదరుడగు విచిత్రవీర్యుని, క్షేత్రే = భార్యగా స్వీకరించబడిన, భుజిష్యాయామ్ = దాసియందు, జాతః = జన్మించినాడు.

యముడు మాండవ్యమహర్షియొక్క శాపముచే సత్యవతీపుత్రుడగు వ్యాసుని వలన ఆయన తమ్ముడగు విచిత్రవీర్యునిచే భార్యగా స్వీకరించబడిన దాసియందు జన్మించినాడు. ఆ యమభగవానుడవు నీవే.

భవాన్ భగవతో నిత్యం సమ్మతస్సానుగస్య చ ।
యస్య జ్ఞానోపదేశాయ మాఽఽదిశద్భగవాన్ వ్రజన్ ॥ 21

సానుగస్య = భక్తులతో కూడిన, భగవతః = భగవానునకు, భవాన్ = నీవు, నిత్యమ్ = సర్వదా, సమ్మతః = మిక్కిలి ప్రియుడవు, యస్య = ఏ నీకు, జ్ఞాన-ఉపదేశాయ = జ్ఞానమును ఉపదేశించుట కొరకు, మా = నన్ను, భగవాన్ = శ్రీకృష్ణ భగవానుడు, వ్రజన్ = వెళ్లుచున్నవాడై, ఆదిశత్ = ఆదేశించెనో.

నీవు భగవానునకు, ఆయన భక్తులకు మిక్కిలి ప్రియుడవు. అందువలననే, శ్రీకృష్ణ భగవానుడు అవతారమునుపసంహరిస్తూ, నీకు జ్ఞానమునుపదేశించుమని నన్ను ఆదేశించినాడు.

అథ తే భగవల్లీలా యోగమాయోపబృంహితాః ।
విశ్వస్థిత్యుద్భవాంతార్థా వర్ణయామ్యనుపూర్వశః ॥ 22

అథ = ఇప్పుడు, తే = నీ కొరకు, యోగమాయా-ఉపబృంహితాః = యోగమాయచే విస్తరిల్ల జేయబడిన, విశ్వస్థితి-ఉద్భవ-అంత-అర్థాః = జగత్తుయొక్క సృష్టిస్థితిలయములు ప్రయోజనముగా గల, భగవత్-లీలాః = భగవానుని లీలలను, అనుపూర్వశః = క్రమముగా, వర్ణయామి = వర్ణించుచున్నాను.

భగవానుడు జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను చేయుటకై యోగమాయచే విస్తారముగా లీలలను ప్రకటించినాడు. నేను ఇప్పుడు ఆ లీలలను నీకు క్రమముగా వర్ణించి చెప్పెదను.

భగవానేక ఆసేదమగ్ర ఆత్మాఽఽత్మనాం విభుః ।
ఆత్మేచ్ఛానుగతావాత్మా నానామత్యుపలక్షణః ।। 23

ఇదమ్ = ఈ జగత్తు, అగ్రే = సృష్టికి పూర్వమునందు, ఏకః = అద్వితీయుడు, ఆత్మనామ్ = జీవుల, ఆత్మా = ఆత్మ (స్వరూపము), విభుః = సర్వవ్యాపకుడు; నానామతి-ఉపలక్షితః = అనేకములగు మనోవృత్తుల భేదముచే అనేకముగా చూడబడువాడు, ఆత్మ-ఇచ్ఛా-అనుగతౌ = తన మాయాశక్తి తనయందు విలీనము కాగా, ఆత్మా = కేవలుడు అగు, భగవాన్ = భగవానుడుగా, ఆస = ఉండెను.

ఈ జగత్తు సృష్టికి పూర్వమునందు అద్వితీయుడగు భగవానుని రూపములో నుండెడిది. ఆయననుండి వ్యక్తమైన ఈ జీవుల స్వరూపము (ఆత్మ) ఆయనయే. స్థితికాలమునందు ఆయనయే సర్వవ్యాపియై నామ రూపముల భేదముచే అనేకముగా భాసించుచున్నాడు. ఈ సృష్టికి మూలమునందున్న ఆయన మాయాశక్తి ఆయనలో విలీనము కాగానే, కేవల శుద్ధచేతనుడగు పరమాత్మ మాత్రమే మిగిలియుండును.

స వా ఏష తదా ద్రష్టా నాపశ్యద్దృశ్యమేకరాట్ ।
మేనేఽసంతమివాత్మానం సుప్తశక్తిరసుప్తదృక్ ।। 24

సః = అట్టి, ఏకరాట్ = అద్వితీయుడై ప్రకాశించే, ఏషః వై = ఈ భగవానుడే, తదా = అప్పుడు, ద్రష్టా = ద్రష్టయై, దృశ్యమ్ = దృశ్యమును, న అపశ్యత్ = కానరాలేదు, సుప్తశక్తిః = విలీనమైయున్న శక్తులు గలవాడు, అసుప్తదృక్ = లోపించుట లేని జ్ఞానమే స్వరూపముగా గలవాడు అగు ఆ భగవానుడు, ఆత్మానమ్ = తనను, అసంతం ఇవ = అసత్ (లేనివాడు) ను వలె, మేనే = తలపోసెను.

అద్వితీయుడై ప్రకాశించే అట్టి ఆ భగవానుడు అపుడు తాను ద్రష్టయై చూడగా, దృశ్యమేమియూ కానరాలేదు. అందువలన, ఆయనకు అప్పుడు తనకు తాను అసత్ (ఉనికి లేనివాడు) గా భాసించెను. వాస్తవములో జ్ఞానస్వరూపుడగు ఆ పరమేశ్వరుని జ్ఞానము ఎప్పుడైననూ నిద్రించేది (ఉపరతమయ్యేది) కాదు. కేవలము ఆయన మాయాశక్తి మాత్రమే నిద్రించుచుండెను; అనగా, ఆయనయందు విలీనమై యుండెను.

సా వా ఏతస్య సంద్రష్టుశ్శక్తిస్సదసదాత్మికా ।
మాయా నామ మహాభాగ యయేదం నిర్మమే విభుః ।। 25

మహాభాగ = ఓ మహాత్మా!, మాయా నామ = మాయ అనగా, సంద్రష్టుః = సర్వమునకు ద్రష్టయగు, ఏతస్య = ఈ పరమేశ్వరునియొక్క, సా = ఆ, శక్తిః వై = శక్తియే, సత్-అసత్-ఆత్మికా = కారణకార్యరూపము (అనిర్వచనీయము), విభుః = సర్వవ్యాపకుడగు పరమేశ్వరుడు, యయా = దేనిచే, ఇదమ్ = ఈ జగత్తును, నిర్మమే = నిర్మించెనో.

ఓ మహాత్మా! విదురా! మాయ అనగా నిత్యదృక్-స్వరూపుడగు ఈ పరమేశ్వరుని శక్తియే. అదియే కారణము, అదియే కార్యము. అది భావ (ఉన్నది)-అభావ (స్వతంత్రమగు ఉనికి లేనిది)-రూపమగుటచే అనిర్వచనీయము. ఆ పరమేశ్వరుడు ఆ శక్తిని ఉపాదానముగా చేసుకొని, ఈ విశ్వమును నిర్మించి, సర్వవ్యాపకుడై యున్నాడు.

కాలవృత్త్యా తు మాయాయాం గుణమయ్యామధోక్షజః ।
పురుషేణాత్మభూతేన వీర్యమాధత్త వీర్యవాన్ ।। 26

గుణమయ్యామ్ = త్రిగుణాత్మికయగు, మాయాయామ్ = మాయయందు, కాలవృత్త్యా = కాలప్రభావముచే, వీర్యవాన్ = చైతన్యశక్తితో కూడియున్న, అధోక్షజః = ప్రమాణగోచరుడు కాని పరమేశ్వరుడు, ఆత్మభూతేన = తన స్వరూపమే అయి ఉన్న, పురుషేణ = పురుషుని రూపముగా, వీర్యమ్ = చిదాభాస (చైతన్య ప్రతిఫలనము) అనే బీజమును, ఆధత్త = స్థాపించెను.

చైతన్యాధిష్ఠితమైన సత్త్వరజస్తమోగుణాత్మకమగు మాయాశక్తి యందు కాలప్రభావముచే కదలిక యేర్పడెను. ప్రత్యక్షాది ప్రమాణములకు అతీతుడైన చిచ్ఛక్తిసమేతుడగు పరమేశ్వరుడు ఆ మాయాశక్తియందు తన అంశ (స్వరూపమే) యే అయి ఉన్న పురుషుని (ప్రకృతికి అధిష్ఠాత) రూప ములో చిదాభాస (జీవ) రూపమగు బీజమును స్థాపించెను.

తతోఽభవన్మహత్తత్త్వమవ్యక్తాత్కాలచోదితాత్ ।
విజ్ఞానాత్మాఽఽత్మదేహస్థం విశ్వం వ్యంజంస్తమోనుదః ॥ 27

కాలచోదితాత్ = కాలముచే ప్రేరేపించబడిన, తతః = ఆ, అవ్య క్తాత్ = నామరూపాత్మకమగు వ్యాకరణము లేని మాయాశక్తినుండి, విజ్ఞా నాత్మా = సమష్టి బుద్ధితత్త్వమైనట్టియు, ఆత్మదేహస్థమ్ = తన స్వరూప మునందు బీజరూపముగానున్న, విశ్వమ్ = జగత్తును, వ్యంజన్ = ప్రకటము చేయుచున్నట్టియు, తమోనుదః = చీకటి అనదగిన అజ్ఞానమును పోనాడు నది అగు, మహత్-తత్త్వమ్ = మహత్తత్త్వము, అభవత్ = ప్రకటమయ్యెను.

నామరూపాత్మకమగు వ్యాకరణము లేని ఆ మాయాశక్తినుండి కాలప్రేరణచే మహత్తత్త్వము ఉదయించి, చీకటి అనదగిన అవ్యక్తస్థితికి స్వస్తి పలికి, తనయందు బీజరూపముగా దాగియున్న జగత్తును ప్రకటింప జేయుటకు సిద్ధముగా నుండెను. ఈ జగత్తులోని సకల క్రియాశక్తుల మరియు జ్ఞానశక్తుల సమష్టియే ఈ మహత్తత్త్వము. అది జీవులకు పదార్థ జ్ఞానమును కలిగించి అజ్ఞానమును పోగొట్టును.

సోఽప్యంశగుణకాలాత్మా భగవద్దృష్టిగోచరః ।
ఆత్మానం వ్యకరోదాత్మా విశ్వస్యాస్య సిసృక్షయా ॥ 28

అంశగుణకాల-ఆత్మా = అంశము అనదగిన చైతన్యప్రతిఫలనము, ఉపాదానమగు సత్త్వరజస్తమోగుణములు మరియు ప్రకృతియొక్క సామ్యా వస్థలో క్షోభను కలిగించే కాలము అనువాటికి అధీనమై యుండే, భగవత్- దృష్టిగోచరః = భగవానుని ఆధ్యక్ష్యమునందు ఉండే, ఆత్మా = స్వరూప ముచే ఆత్మయే అయి ఉన్న (పరబ్రహ్మయే అధిష్ఠానముగా గల), సః అపి = ఆ విజ్ఞానాత్మ (మహత్తత్త్వము) కూడా, అస్య = ఈ, విశ్వస్య = జగత్తు

యొక్క, సిసృక్షయా = సృష్టిని చేయవలెననే కోరికతో, ఆత్మానమ్ = తనను, వ్యకరోత్ = నామరూపములుగా (జగద్రూపముగా) ప్రకటించెను.

ఆ మహత్తు చిదాభాసకు, ఉపాదానమగు సత్త్వరజస్తమోగుణములకు మరియు వాటి సామ్యావస్థయందు క్షోభను కలిగించే కాలమునకు వశమై యుండును. అది ఉపాధిచే మహత్తు అయినది కాని, స్వరూపముచే పరబ్రహ్మయే. భగవానుడు అధ్యక్షుడు కాగా, అనగా సచ్చిద్బ్రహ్మయొక్క సన్నిధియందు మాత్రమే, అది తననుండి నామరూపాత్మకమగు జగత్తును ప్రకటింప జేయును. అట్లు ప్రకటమగుటకు సగుణబ్రహ్మ (మహత్తత్త్వముచే అవచ్ఛిన్నమైన చైతన్యము) యొక్క సంకల్పమే కారణము.

మహత్తత్త్వాద్వికుర్వాణాదహంతత్త్వం వ్యజాయత ।
కార్యకారణకర్త్రాత్మా భూతేంద్రియమనోమయః ॥ 29

వికుర్వాణాత్ = వికారమును పొందుచున్న, మహత్తత్త్వాత్ = మహత్తత్త్వమునుండి, కార్యకారణకర్తృ-ఆత్మా = కార్యము (పంచభూతములు) కారణము (తన్మాత్రలు) కర్తృత్వము అనువాటికి ఆశ్రయమైన, భూత-ఇంద్రియమనోమయః = పంచభూతములు ఇంద్రియములు మనస్సు అనే వికారములు గల, అహంతత్త్వమ్ = అహంకారము, వ్యజాయత = ప్రకటమయ్యెను.

ఆ మహత్తత్త్వము వికారమును చెంది అహంకారము పుట్టెను. అది కార్యరూపమగు పంచమహాభూతములు, వాటికి కారణమగు తన్మాత్రలు, మరియు కర్తృత్వము అను వికారములకు ఆశ్రయమగుచున్నది.

వైకారికస్తైజసశ్చ తామసశ్చేత్యహం త్రిధా ।
అహంతత్త్వాద్వికుర్వాణాన్మనో వైకారికాదభూత్ ।
వైకారికాశ్చ యే దేవా అర్థాభివ్యంజనం యతః ॥ 30

అహమ్ = అహంకారము, వైకారికః = సాత్త్వికము, తైజసః = రాజసము, చ = మరియు, తామసః = తామసము, ఇతి = అని, త్రిధా = మూడు విధములుగా నున్నది, వికుర్వాణాత్ = వికారమును చెందుచున్న, వైకారి

కాత్ = సాత్త్వికమగు, అహంతత్త్వాత్ = అహంకారమునుండి, మనః = మనస్సు, అభూత్ = ఆయెను, చ = మరియు, యే = ఏ, వైకారికాః = కార్యములగు, దేవాః = ఇంద్రియాధిష్ఠాన దేవతలు, యతః = ఏ దేవతల వలన, అర్థ-అభివ్యంజనమ్ = శబ్దము మొదలగు విషయముల ప్రకాశము కలుగునో.

అహంకారము సాత్త్వికము, రాజసము, తామసము అని మూడు విధములుగా నున్నది. వాటిలో సాత్త్వికాహంకారము వికారములను పొంది, మనస్సు మరియు ఇంద్రియములకు అధిష్ఠానమగు దేవతలు ప్రకటమైరి. వాటి వలన మాత్రమే శబ్దము మొదలగు విషయములు ప్రకాశించుచున్నవి.

> తైజసానీంద్రియాణ్యేవ జ్ఞానకర్మమయాని చ ।
> తామసో భూతసూక్ష్మాదిర్యతః ఖం లింగమాత్మనః ॥ 31

జ్ఞానకర్మమయాని ఇంద్రియాణి = జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు, తైజసాని ఏవ = రాజసాహంకారమునుండి మాత్రమే పుట్టినవి, చ = మరియు, తామసః = తామసాహంకారము, భూతసూక్ష్మాదిః = సూక్ష్మభూతమగు శబ్దమునకు కారణము, యతః = ఏ శబ్దతన్మాత్రనుండి, ఆత్మనః = తనకు (శబ్దమునకు, లేదా ఆత్మ అనగా పరబ్రహ్మకు), లింగమ్ = లింగమగు (తాను గుణముగా కలది, లేదా శరీరము అగు), ఖమ్ = ఆకాశము (పుట్టెనో).

కర్మేంద్రియములతో బాటు జ్ఞానేంద్రియములు కూడ రాజసాహంకారమునుండి మాత్రమే పుట్టినవి. ఇంతేగాక, తామసాహంకారమునుండి శబ్దతన్మాత్ర పుట్టినది. ఈ శబ్దము ఆకాశమునకు గుణము. శబ్దము గుణముగా గల ఆకాశము పరమాత్మకు శరీరము.

> కాలమాయాంశయోగేన భగవద్వీక్షితం నభః ।
> నభసోఽనుసృతం స్పర్శం వికుర్వన్నిర్మమేఽనిలమ్ ॥ 32

కాలమాయా-అంశయోగేన = కాలము మాయాశక్తి మరియు చిదాభాసల సంయోగముచే, భగవద్-వీక్షితమ్ = భగవంతునిచే చూడబడిన,

నభః = ఆకాశము, నభసః = ఆకాశమునుండి, అనుసృతమ్ = పుట్టిన, స్పర్శనమ్ = స్పర్శ తన్మాత్ర, వికుర్వన్ = వికారమును చెందుచున్నదై, అనిలమ్ = వాయువును, నిర్మమే = నిర్మించెను.

కాలము, తామసాహంకారము రూపములోనున్న మాయాశక్తి మరియు చిదాభాసల సంయోగముచే భగవానుని అధ్యక్ష్యమునందు ఆకాశము పుట్టెను. ఆకాశమునుండి స్పర్శ తన్మాత్ర పుట్టెను. అది వికారమును చెంది, వాయువు పుట్టెను.

అనిలోఽపి వికుర్వాణో నభసోరుబలాన్వితః ।
ససర్జ రూపతన్మాత్రం జ్యోతిర్లోకస్య లోచనమ్ ।। 33

నభసా = ఆకాశముతో గూడి, వికుర్వాణః = వికారమును చెందుచున్న, అనిలః అపి = వాయువు కూడ, ఉరుబల-అన్వితః = గొప్ప బలముతో గూడినదై, రూపతన్మాత్రమ్ = రూపతన్మాత్రను, లోకస్య = లోకమునకు, లోచనమ్ = ప్రకాశకమగు, జ్యోతిః = అగ్నిని, ససర్జ = సృష్టించెను.

గొప్ప బలముతో గూడిన వాయువు ఆకాశముతో కలిసి వికారమును చెందుట వలన రూపతన్మాత్ర, దానినుండి లోకమునకు ప్రకాశమును ఇచ్చే తేజస్సు (అగ్ని) పుట్టినవి.

అనిలేనాన్వితం జ్యోతిర్వికుర్వత్పరవీక్షితమ్ ।
ఆధత్తాంభో రసమయం కాలమాయాంశయోగతః ।। 34

కాలమాయా-అంశయోగతః = కాలము మాయాశక్తి మరియు చిదాభాసల సంయోగము వలన, పరవీక్షితమ్ = పరబ్రహ్మచే చూడబడే, జ్యోతిః = అగ్ని, అనిలేన = వాయువుతో, అన్వితమ్ = కూడినదై, రసమయమ్ = రసాత్మకమగు, అంభః = జలమును, ఆధత్త = నిర్మించెను.

పరబ్రహ్మయొక్క అధ్యక్ష్యములో కాలము, మాయాశక్తి మరియు చిదాభాసల సంయోగము వలన వాయువుతో కూడిన అగ్నినుండి రసతన్మాత్ర, దానినుండి నీరు పుట్టినవి.

జ్యోతిషాఽంభోఽనుసంసృష్టం వికుర్వద్బ్రహ్మవీక్షితమ్ ।
మహీం గంధగుణామాధాత్కాలమాయాంశయోగతః ।। 35

కాలమాయా-అంశయోగతః = కాలము మాయాశక్తి మరియు చిదాభాసల సంయోగము వలన, బ్రహ్మవీక్షితమ్ = పరబ్రహ్మచే చూడబడిన, అంభః = జలము, జ్యోతిషా = అగ్నితో, అనుసంసృష్టమ్ = అనుగతమై యున్నదై, వికుర్వత్ = వికారమును పొందుచున్నదై, గంధగుణామ్ = గంధము గుణముగా గల, మహీమ్ = భూమిని, ఆధాత్ = నిర్మించెను.

కాలము, మాయాశక్తి మరియు చిదాభాసల సంయోగము వలన పరమేశ్వరుని ఆధ్యక్ష్యములో అగ్నితో అనుగతమై యున్న జలము వికారమును పొంది, గంధము గుణముగా గల పృథివిని ఉత్పన్నము చేసెను.

భూతానాం నభఆదీనాం యద్యద్భవ్యావరావరమ్ ।
తేషాం పరానుసంసర్గాద్యథాసంఖ్యం గుణాన్ విదుః ।। 36

భవ్య = ఓ మహాత్మా!, నభఆదీనామ్ = ఆకాశము మొదలగు, భూతానామ్ = భూతములలో, యత్ యత్ = ఏది ఏది, అవర-అవరమ్ = వెనుక వెనుక ఉన్నదో, తేషామ్ = వాటికి, పర-అనుసంసర్గాత్ = ముందు ఉన్నదాని సంయోగము వలన, యథాసంఖ్యమ్ = యథాక్రమముగా, గుణాన్ = గుణములను, విదుః = తెలియుచున్నారు.

ఓ మహాత్ముడవగు విదురా! ఆకాశము మొదలగు ఈ పంచభూతములలో వెనుకదానియందు ముందు ఉన్న భూతములు అనుగతమగుచుండుటచే, వాటి గుణముల సంఖ్య అదే క్రమములో నుండునని తెలియవలెను.

ఏతే దేవాః కలా విష్ణోః కాలమాయాంశలింగినః ।
నానాత్వాత్స్వక్రియానీశాః ప్రోచుః ప్రాంజలయో విభుమ్ ।। 37

విష్ణోః = శ్రీమహావిష్ణువుయొక్క, కలాః = అంశలు అయిన, కాలమాయా-అంశలింగినః = కాలము మాయ మరియు చిదాభాసయొక్క లింగములు గల, ఏతే = ఈ, దేవాః = మహత్తత్త్వము మొదలగువాటి అభి

మాని దేవతలు, నానాత్వాత్ = అనేకములగుట వలన, స్వక్రియా-అనీశాః = తమ కార్యమగు బ్రహ్మాండనిర్మాణమునందు అసమర్థములై, ప్రాంజలయః = చేతులను జోడించినవై, విభుమ్ = సర్వవ్యాపకుడగు పరమేశ్వరుని ఉద్దేశించి, ప్రోచుః = పలికినవి.

మహత్తత్త్వము మొదలగువాటి ఈ అభిమాని దేవతలు శ్రీమహావిష్ణువుయొక్క అంశలే. కాలమునకు లింగమగు వికారము, మాయయొక్క లింగమగు విక్షేపము (అనేకము అగుట) మరియు చిదాభాసయొక్క లింగమగు చేతన అనువాటి సమాహారమే ఈ దేవతలు. కాని, వారు అనేకముగా నుండుటచే, పరస్పర సంబంధము కలుగ లేదు. ఆ కారణముగా, ఆ దేవతలు బ్రహ్మాండరచనను చేయలేకపోయినవి. అపుడా దేవతలు చేతులను జోడించి, పరమేశ్వరునితో ఇట్లు పలికినవి.

దేవా ఊచుః ।
నమామ తే దేవ పదారవిందం
ప్రపన్నతాపోపశమాతపత్రమ్ ।
యన్మూలకేతా యతయోఽంజసోరు
సంసారదుఃఖం బహిరుత్క్షిపంతి ॥ 38

దేవాః = అభిమాని దేవతలు, ఊచుః = పలికినవి, దేవ = ఓ పరమేశ్వరా!, ప్రపన్నతాప-ఉపశమ-ఆతపత్రమ్ = శరణు పొందినవారి తాపమును పోగొట్టే గొడుగువంటి, తే = నీ, పద-అరవిందమ్ = పాదపద్మమును, నమామ = నమస్కరించుచున్నాము, యత్-మూలకేతాః = ఏ పాదముల మూలము ఆశ్రయముగా గల, యతయః = యతనశీలురు, అంజసా = తేలికగా, ఉరు = పెద్దదియగు, సంసారదుఃఖమ్ = సంసారదుఃఖమును, బహిః = దూరముగా, ఉత్క్షిపంతి = పారద్రోలుచున్నారో.

అభిమాని దేవతలు ఇట్లు పలికినవి --- ఓ పరమేశ్వరా! నీ పాదపద్మములు శరణు పొందినవారి తాపమును పోగొట్టే గొడుగు వంటివి. యతనశీలురగు మహాత్ములు నీ పాదమూలమునాశ్రయించిన వారై, సంసారములోని మహాదుఃఖమును తేలికగా దూరముగా పారద్రోలుచున్నారు.

ధాతర్యదస్మిన్ భవ ఈశ జీవాః
తాపత్రయేణోపహతా న శర్మ ।
ఆత్మన్ లభంతే భగవంస్తవాంఘ్రి-
చ్ఛాయాం సవిద్యామత ఆశ్రయేమ ॥ 39

ధాతః = జగత్తును సృష్టించినవాడా!, ఈశ = జగత్తును పాలించువాడా!, జీవాః = జీవులు, అస్మిన్ = ఈ, భవే = సంసారమునందు, ఆత్మన్ = అంతఃకరణమునందు, శర్మ = సుఖమును, న లభంతే = పొందుట లేదు, యత్ = ఏలయనగా, తాపత్రయేణ = మూడు విధముల దుఃఖముచే, ఉపహతాః = కొట్టబడినారో, భగవన్ = ఓ పరమేశ్వరా!, అతః = ఇందువలన, సవిద్యామ్ = సర్వదా జ్ఞానప్రకాశము గల, తవ = నీ, అంఘ్రిచ్ఛాయామ్ = పాదముల నీడను, ఆశ్రయేమ = ఆశ్రయించుచున్నాము.

జగత్తును సృష్టించి పాలించే ఓ పరమేశ్వరా! జీవులు ఈ సంసారమునందు మూడు విధముల దుఃఖముచే పరాభూతులై అంతఃకరణమునందు శాంతిని పొందలేకున్నారు. కావున, మేము సర్వదా జ్ఞానప్రకాశము గల నీ పాదముల నీడను ఆశ్రయించుచున్నాము.

మార్గంతి యత్తే ముఖపద్మనీడైః
ఛందస్సుపర్ణైర్ ఋషయో వివిక్తే ।
యచ్చాఘమర్షోదసరిద్వరాయాః
పదం పదం తీర్థపదః ప్రపన్నాః ॥ 40

ఋషయః = మహర్షులు, తే = నీయొక్క, ముఖపద్మనీడైః = పద్మమువంటి ముఖమే గూడుగా గల, ఛందః-సుపర్ణైః = వేదములు అనే పక్షుల ద్వారా, వివిక్తే = ఏకాంతమునందు, యత్ = దేనిని, మార్గంతి = అన్వేషించెదరో, చ = మరియు, యత్ = ఏది, అఘమర్ష-ఉదసరిత్-వరాయాః = పాపములను పోగొట్టే జలములు గల నదులలో శ్రేష్ఠమైన గంగకు, పదమ్ = పుట్టుక స్థానమో, తీర్థపదః = పావనమగు పాదములు గల నీ, పదమ్ = పాదమును, ప్రపన్నాః = శరణు వేడుచున్నాము.

మహర్షులు నీ పద్మమువంటి ముఖమే గూడుగా గల (నీ ముఖప ద్మముయొక్క సొగసును వర్ణించే) వేదములు అనే పక్షుల ద్వారా (వేద మంత్రముల ద్వారా) ఏకాంతమునందు నీ పాదమును అన్వేషించుచుం దురు (ధ్యానించుచుందురు). తమ ఉదకములచే పాపములను పోగొట్టే నదులలో ముందు యెన్నదగిన గంగ నీ పాదమునుండి పుట్టినది. అట్టి పర మపావనమగు నీ పాదమును మేము శరణు జొచ్చుచున్నాము.

యచ్ఛ్రద్ధయా శ్రుతవత్యా చ భక్త్యా
సంసృజ్యమానే హృదయేఽవధాయ ।
జ్ఞానేన వైరాగ్యబలేన ధీరా
వ్రజేమ తత్తేఽంఘ్రిసరోజపీఠమ్ ॥ 41

యత్ = దేనిని, శ్రద్ధయా = శ్రద్ధతో, చ = మరియు, శ్రుతవత్యా = శ్రవణముతో కూడిన, భక్త్యా = భక్తితో, సంసృజ్యమానే = శుద్ధము చేయబడి న, హృదయే = హృదయమునందు, అవధాయ = ధ్యానించి, జ్ఞానేన = జ్ఞానముచే, వైరాగ్యబలేన = వైరాగ్యముయొక్క బలముచే, ధీరాః = జ్ఞానులు అగుదురో, తత్ = అట్టి, తే = నీయొక్క, అంఘ్రిసరోజపీఠమ్ = పాదపద్మములను పెట్టే పీటను, వ్రజేమ = పొందెదము.

సాధకులు శ్రద్ధతో నీ లీలలను శ్రవణము చేసి నీయందు భక్తిని పరి పుష్టము చేసుకొనెదరు. దానిచే, వారి అంతఃకరణము శుద్ధమగును. అట్టి శుద్ధమగు హృదయమునందు వారు నీ పాదమును ధ్యానించి, తద్ద్వారా జ్ఞానమును, వైరాగ్యబలమును సంపాదించి జీవన్ముక్తులగుదురు. అట్టి నీ పద్మములవంటి పాదముల పీఠమును మేము ఆశ్రయించుచున్నాము.

విశ్వస్య జన్మస్థితిసంయమార్థే
కృతావతారస్య పదాంబుజం తే ।
వ్రజేమ సర్వే శరణం యదీశ
స్మృతం ప్రయచ్ఛత్యభయం స్వపుంసామ్ ॥ 42

విశ్వస్య = జగత్తుయొక్క, జన్మస్థితిసంయమ-అర్థే = సృష్టిస్థితిలయములు అనే ప్రయోజనమునందు, కృత-అవతారస్య = చేయబడిన అవతారములు గల, తే = నీ, పద-అంబుజమ్ = పాదపద్మమును, సర్వే = మేము అందరము, శరణమ్ = శరణును, వ్రజేమ = పొందుచున్నాము, ఈశ = ఓ ఈశ్వరా!, యత్ = ఏ నీ పాదము, స్మృతమ్ = స్మరించబడినదై, స్వపుంసామ్ = తనవారలకు, అభయమ్ = అభయమును, ప్రయచ్ఛతి = అనుగ్రహించునో.

ఓ ఈశ్వరా! నీవు జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను నిర్వహించుట కొరకై అవతరించుచుందువు. అట్టి నీ పాదపద్మమును మేమందరము శరణు వేడుచున్నాము. నీ పాదము స్మరించిన భక్తులకు అభయమునొసంగును గదా!

యత్సానుబంధేఽసతి దేహగేహే
మమాహమిత్యూఢదురాగ్రహాణామ్ ।
పుంసాం సుదూరం వసతోఽపి పుర్యాం
భజేమ తత్తే భగవన్ పదాబ్జమ్ ॥ 43

భగవన్ = ఓ ఈశ్వరా! యత్ = ఏది, స-అనుబంధే = ఉపకరణములతో కూడిన, అసతి = మిథ్యాభూతమగు, దేహగేహే = దేహము అనే ఇంటియందు, మమ = నాది, అహమ్ = నేను, ఇతి = అని, ఊఢదుర్-ఆగ్రహాణామ్ = గట్టిగా పాతుకొనిన తప్పుడు పట్టుదల గల, పుంసామ్ = మానవులకు, పుర్యామ్ = అదే దేహమునందు, వసతః అపి = నివసించియున్ననూ, సుదూరమ్ = మిక్కిలి దూరమునందుండునో, తత్ = అట్టి, తే = నీ, పద-అబ్జమ్ = పాదపద్మమును, భజేమ = సేవించెదము.

ఓ ఈశ్వరా! జీవులు దేహము అనే ఇంట్లో నివసిస్తూ, ఆ దేహమునందు, దానితో ముడిపడియున్న బంధువర్గమునందు, ఇల్లు మొదలగు పరికరములయందు, నేను నాది అనే తప్పుడు భావనను దృఢముగా నిలుపుకొని యుందురు. ఈ సర్వము మిథ్య అని వారు యెరుగరు. నీవు కూడ అదే దేహములో ఆత్మచైతన్యరూపముగా నిలిచియున్ననూ, అజ్ఞానులగు

టచే వారికి నీ పాదము బహుదూరమే. అట్టి నీ పాదపద్మమును మేము సేవించెదము.

తాన్ వై హ్యసద్వృత్తిభిరక్షిభిర్యే
పరాహృతాంతర్మనసః పరేశ ।
అథో న పశ్యంత్యురుగాయ నూనం
యే తే పదన్యాసవిలాసలక్ష్మ్యాః ॥ 44

పరేశ = ఓ పరమేశ్వరా!, యే = ఎవరైతే, అసద్-వృత్తిభిః = మిథ్యాభూతమగు జగత్తునందు సంచరించే, అక్షిభిః = ఇంద్రియములచే, పర-ఆహృత-అంతః-మనసః = నీనుండి దూరముగా లాగివేయబడిన అంతరింద్రియమగు మనస్సు గలవారో వారు, అథో = ఆ కారణము చేతనే, నూనమ్ = నిశ్చయముగా, తాన్ = వారిని, న పశ్యంతి = చూడరు, ఉరుగాయ = అధికముగా కీర్తించబడువాడా!, యే = ఎవరైతే, తే = నీయొక్క, పదన్యాసవిలాసలక్ష్మ్యాః = నడకయొక్క విలాసముయొక్క శోభ గలవారో.

ప్రకృతిని నియంత్రించే ఓ దేవా! మానవులు ఇంద్రియముల ద్వారా మిథ్యాభూతమగు జగత్తునందు సంచరిస్తూ బహిర్ముఖులై యుందురు. ఆ ఇంద్రియములు వారి అంతఃకరణములను నీనుండి దూరముగా లాగివేయును. భక్తులచే అధికముగా గానము చేయబడే కీర్తి గల ఓ దేవా! కావుననే, వారు నీ నడకయొక్క విలాసమును ఉపాసించి ప్రకాశించే (నీ పాదములను శరణు జొచ్చి నిశ్చింతతో శోభిల్లే) భక్తులను నిశ్చయముగా కనజాలరు.

పానేన తే దేవ కథాసుధాయాః
ప్రవృద్ధభక్త్యా విశదాశయా యే ।
వైరాగ్యసారం ప్రతిలభ్య బోధం
యథాంజసాన్వీయురకుంఠధిష్ణ్యమ్ ॥ 45

దేవ = ఓ దేవా!, యథా = ఏ విధముగానైతే, తే = నీయొక్క, కథాసుధాయాః = గాథలు అనే అమృతముయొక్క, పానేన = పానము చేయుట

చే, ప్రవృద్ధభక్త్యా = విశేషముగా వర్ధిల్లిన భక్తిచే, యే = ఎవరైతే, విశద-ఆశయాః = స్వచ్ఛమగు అంతఃకరణము గలవారో వారు, వైరాగ్యసారమ్ = వైరాగ్యమే సారముగా గల, బోధమ్ = జ్ఞానమును, ప్రతిలభ్య = పొంది, అను = వెంటనే, అంజసా = తేలికగా, అకుంఠధిష్ణ్యమ్ = వైకుంఠధామమును (అప్రతిహతమగు ఆత్మస్వరూపమును), ఈయుః = పొందెదరు.

ఓ దేవా! నీ గాథలు అనే అమృతమును పానము చేయుట వలన సాధకులలో భక్తి విశేషముగా వర్ధిల్లి అంతఃకరణము స్వచ్ఛమగు ఎ. అట్టి అంతఃకరణములో వైరాగ్యమే సారముగా గల ఆత్మజ్ఞానము ఉ యించును. వెనువెంటనే వారు అనాయాసముగా వైకుంఠలోకమును ంందెదరు; అనగా, అప్రతిహతమగు స్వరూపమునందు నిష్ఠను ెగి, వన్ముక్తులై యుందురు.

తథాపరే చాత్మసమాధియోగ-
బలేన జిత్వా ప్రకృతిం బలిష్ఠామ్ ।
త్వామేవ ధీరాః పురుషం విశంతి
తేషాం శ్రమస్స్యాన్న తు సేవయా తే ॥ 46

తథా = అదే విధముగా, ధీరాః = నిత్యానిత్యవస్తువివేకము గల, అపరే చ = మరికొందరు, ఆత్మసమాధియోగబలేన = చిత్తవృత్తినిరోధము అనే ఉపాయముయొక్క బలముచే, బలిష్ఠామ్ = బలీయమైన, ప్రకృతిమ్ = మాయను, జిత్వా = జయించి, పురుషమ్ = పూర్ణుడవగు, త్వాం ఏవ = నిన్ను మాత్రమే, విశంతి = ప్రవేశించుచున్నారు, తేషామ్ = వారికి, శ్రమః = శ్రమ, స్యాత్ = కలుగును, తు = కాని, తే = నీ, సేవయా = సేవచే, న = శ్రమ లేదు.

అదే విధముగా వివేకవంతులగు మరికొందరు సాధకులు చిత్తవృత్తులను నిరోధించుట అనే ఉపాయముచే బలీయమగు మాయను జయించి పూర్ణుడవగు నిన్ను పొందుచున్నారు. కాని, వారికి శ్రమ అధికము. నీ సేవ చేయు భక్తులకైతే మోక్షము సులభము.

తత్తే వయం లోకసిసృక్షయాఽఽద్య
త్వయానుసృష్టాస్త్రిభిరాత్మభిస్స్మ ।
సర్వే వియుక్తాస్స్వవిహారతంత్రం
న శక్నుమస్తత్ప్రతిహర్తవే తే ॥ 47

ఆద్య = ఆదికారణుడవగు ఓ ఈశ్వరా!, తత్ = అందువలన, లోక సిసృక్షయా = లోకములను సృష్టించవలెననే కోరికతో, త్వయా = నీచే, అనుసృష్టాః స్మ = సృష్టించబడితిమి, త్రిభిః = మూడు, ఆత్మభిః = స్వభావ ములచే, సర్వే = మేము అందరము, వియుక్తాః = విడిపోయి ఉన్నాము, స్వవిహారతంత్రమ్ = నీ విహారమునకు ఉపకరణమగు, తత్ = ఆ బ్రహ్మాండ మును, తే = నీ కొరకు, ప్రతిహర్తవే = సమర్పించుట కొరకు, న శక్నుమః = సమర్థులము కాకున్నాము.

ఓ ఆదిదేవా! నీవు లోకములను సృజించగోరి మమ్ములను సృష్టిం చినావు. కాని, సత్త్వరజస్తమోగుణములు అనే మూడు విభిన్నస్వభావ ములు గలవారమై విడిపోయి ఉన్నాము. ఆ కారణముగా నీవు విహరించు టకు యోగ్యమగు బ్రహ్మాండమును నిర్మించి నీకు సమర్పించే సామ ర్థ్యము మాలో కొరవడినది.

యావద్బలిం తేఽజ హరామ కాలే
యథా వయం చాన్నమదామ యత్ర ।
యథోభయేషాం త ఇమే హి లోకా
బలిం హరంతోఽన్నమదంత్యనూహాః ॥ 48

అజ = పుట్టుక లేనివాడా!, యథా = ఏ ప్రకారముగానైతే, కాలే = సరియగు సమయమునందు, తే = నీ కొరకు, బలిమ్ = భోగమును, యావత్ = పూర్తిగా, హరామ = సమర్పించెదమో, చ = మరియు, వయమ్ = మేము, యత్ర = ఏ స్థానమునందు, అన్నమ్ = ఆహారమును, అదామ = భక్షించెదమో, యథా = ఏ విధముగానైతే, తే = ఆ, ఇమే = ఈ, లోకాః హి = జీవులు కూడా, అనూహాః = విఘ్నములు లేనివారై (సందేహములు లేని

వారై), ఉభయేషామ్ = నీకు మాకు ఇద్దరికీ, బలిమ్ = భాగమును, హరంతః = సమర్పించువారై, అన్నమ్ = అన్నమును, అదంతి = భక్షించెదరో.

పుట్టుక లేని ఓ దేవా! మేము సరియగు కాలములో నీకు పూర్ణభోగమును సమర్పించవలెను. మరియు, మేము కూడ మా స్థానమునందున్న వారమై ఆహారమును భక్షించవలెను. ఇంతేగాక, ఈ జీవులు కూడ విఘ్నములకు, సంశయములకు దూరముగా నున్నవారై, నీకు మాకు ఇద్దరికీ భాగములనర్పిస్తూ, తమ తమ అన్నమును భక్షించవలెను. ఇవి అన్నీ జరిగే ఉపాయమును నీవు చేయుము.

త్వం నస్సురాణామసి సాన్వయానాం
కూటస్థ ఆద్యః పురుషః పురాణః ।
త్వం దేవ శక్త్యాం గుణకర్మయోనౌ
రేతస్త్వజాయాం కవిమాదధేఽజః ॥ 49

స-అన్వయానామ్ = కార్యవర్గముతో గూడిన, సురాణామ్ = దేవతలమగు, నః = మాకు, కూటస్థః = నిర్వికారుడవు, పురుషః = పూర్ణుడగు అంతర్యామివి, పురాణః = సనాతనుడవు అగు, త్వమ్ = నీవు, ఆద్యః = కారణము, అసి = అగుచున్నావు, దేవ = ఓ దేవా!, అజః = పుట్టుక లేని నీవు, గుణకర్మయోనౌ = సత్త్వరజస్తమోగుణములకు మరియు జన్మ మొదలగు క్రియలకు కారణమగు, అజాయామ్ = పుట్టుక లేని, శక్త్యామ్ = మాయాశక్తియందు, కవిమ్ = సర్వజ్ఞము (మహత్తత్త్వరూపము) అగు, రేతః = జగద్బీజమును, ఆదధే = ఉంచినావు.

నిర్వికారుడవు, పూర్ణుడవు, సకలప్రాణులకు అంతర్యామివి, సనాతనుడవు అగు నీవే సకలకార్యవర్గముతో కూడియున్న మా దేవతలకు ఆదికారణుడవు. ఓ దేవా! నీకు పుట్టుక లేదు. సత్త్వరజస్తమోగుణములకు మరియు జన్మ మొదలగు క్రియలకు కారణమగు మాయాశక్తికి కూడ పుట్టుక లేదు. నీవు అట్టి మాయాశక్తియందు మహత్తత్త్వము (సమష్టి చిదాభాస రూపము) అనే జగద్బీజమును కల్పించినావు. నీవు మాయాశక్తియందు చిదాభాస అనే జగద్బీజమును ఉంచినావు.

తతో వయం సత్ప్రముఖా యదర్థే
బభూవిమాత్మన్ కరవామ కిం తే ।
త్వం నస్స్వచక్షుః పరిదేహి శక్త్యా
దేవ క్రియార్థే యదనుగ్రహాణామ్ ॥ 50

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
పంచమోఽధ్యాయః ॥

ఆత్మన్ = ఓ ఆత్మస్వరూపుడా!, తతః = అందువలన, సత్-ప్రముఖాః = మహత్తత్త్వము మొదలగు, వయమ్ = మేము, తే = నీ కొరకు, కిమ్ = దేనిని, కరవామ = చేయుదుము గాక!, యత్-అర్థే = ఏ ప్రయోజనమునందు, బభూవిమ = జన్మించితిమో, దేవ = ఓ దేవా!, త్వమ్ = నీవు, శక్త్యా = శక్తితో కూడిన, స్వచక్షుః = నీ జ్ఞానమును, యత్-అనుగ్రహాణామ్ = ఏ నీ అనుగ్రహమునకు పాత్రులమగు, నః = మాకు, క్రియా-అర్థే = బ్రహ్మాండ రచన అనే ప్రయోజనమునందు, పరిదేహి = ఇమ్ము.

ఆత్మస్వరూపుడవగు ఓ దేవా! మహత్తత్త్వము మొదలగు మేము ఏ కార్యము కొరకు పుట్టితిమో, దాని విషయములో నీకు మేము ఏమి చేయదగును? మమ్ములను అనుగ్రహించువాడవు నీవే. బ్రహ్మాండ రచన కొరకై నీవు మాకు నీ క్రియాశక్తితో కూడియున్న నీ జ్ఞానశక్తిని కూడ ఇమ్ము.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
అయిదవ అధ్యాయము ముగిసినది (5).

* * * * *

# అథ షష్ఠోऽధ్యాయః

## విరాట్ శరీరము

ఋషిరువాచ ।
ఇతి తాసాం స్వశక్తీనాం సతీనామసమేత్య సః ।
ప్రసుప్తలోకతంత్రాణాం నిశామ్య గతిమీశ్వరః ॥ 1

ఋషిః = మైత్రేయ మహర్షి, ఉవాచ = పలికెను, ఇతి = ఈ విధముగా, అసమేత్య = మేలనము లేకుండా, సతీనామ్ = ఉన్నవి, ప్రసుప్తలోకతంత్రాణామ్ = ఉద్బుద్ధము కాని బ్రహ్మాండరచన గలవి అగు, తాసామ్ = ఆ, స్వశక్తీనామ్ = తన శక్తుల, గతిమ్ = స్థితిని, నిశామ్య = చూచి, ఈశ్వరః = పరమేశ్వరుడు.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా మహత్తత్త్వము మొదలగు తన శక్తులు ఒకదానితో మరియొకటి కలియకపోవుటచే వాటియందు బ్రహ్మాండమును రచించే సామర్థ్యము ఉద్బుద్ధము కాలేదు. ఆ పరిస్థితిని భగవానుడు చూచెను.

కాలసంజ్ఞాం తదా దేవీం బిభ్రచ్ఛక్తిమురుక్రమః ।
త్రయోవింశతితత్త్వానాం గణం యుగపదావిశత్ ॥ 2

తదా = అప్పుడు, కాలసంజ్ఞామ్ = కాలము అను పేరు గల (కాలముచే ఉద్బోధమును పొందునది), దేవీమ్ = ప్రకాశనశీలము గలది అగు, శక్తిమ్ = శక్తిని, బిభ్రత్ = ధరించినవాడై, ఉరుక్రమః = సర్వశక్తిమంతుడగు భగవానుడు, త్రయోవింశతితత్త్వానామ్ = ఇరువది మూడు తత్త్వముల, గణమ్ = గణమును, యుగపత్ = ఒకే సారిగా, ఆవిశత్ = ఆవేశించెను.

అప్పుడు సర్వశక్తిమంతుడగు ఆ భగవానుడు కాలము అనే పేరు గల (యోగ్యమగు కాలమునందు ఉద్బుద్ధమయ్యే) దైవీశక్తిని స్వీకరించి, మహత్తత్త్వము, అహంకారము, అయిదు సూక్ష్మభూతములు, అయిదు స్థూలభూతములు, అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు, మనస్సు అనే ఇరువది మూడు తత్త్వముల సముదాయమునందు ఒకేసారి ప్రవేశించెను.

సోఽనుప్రవిష్టో భగవాంశ్చేష్టారూపేణ తం గణమ్ ।
భిన్నం సంయోజయామాస సుప్తం కర్మ ప్రబోధయన్ ॥ 3

సః = ఆ, భగవాన్ = భగవానుడు, తమ్ = ఆ, భిన్నమ్ = విడివడియున్న, గణమ్ = తత్త్వసమూహమును, చేష్టారూపేణ = క్రియాశక్తితో కూడి, అనుప్రవిష్టః = ప్రవేశించినవాడై, సుప్తమ్ = నిద్రాణమైయున్న, కర్మ = క్రియను (విలీనమైయున్న జీవుల కర్మాశయమును), ప్రబోధయన్ = ఉజ్జీవింప జేయువాడై, సంయోజయామాస = కలిపెను.

ఆ భగవానుడు ఆ విధముగా విడివడియున్న తత్త్వసమూహమును ప్రవేశించి, వాటిలో నిద్రాణముగా పడియున్న క్రియాశక్తిని ఉజ్జీవింప జేసి, వాటి మధ్యలో సంయోగమును కలిగించెను. ఆయన ఈ విధముగా విలీనమైయున్న జీవుల కర్మాశయమును ఫలమునిచ్చుట కొరకై ఉజ్జీవింప జేసెను.

ప్రబుద్ధకర్మా దైవేన త్రయోవింశతికో గణః ।
ప్రేరితోఽజనయత్స్వాభిర్మాత్రాభిరధిపూరుషమ్ ॥ 4

దైవేన = ఈశ్వరునిచే, ప్రబుద్ధకర్మా = ఉజ్జీవింప జేయబడిన క్రియ గల, త్రయోవింశతికః = ఇరువది మూడు తత్త్వములకు సంబంధించిన, గణః = సమూహము, ప్రేరితః = ప్రేరేపించబడినదై, స్వాభిః = తమ, మాత్రాభిః = అంశలచే, అధిపూరుషమ్ = విరాట్ పురుషుని, అజనయత్ = ఉత్పన్నము చేసెను.

ఈశ్వరుడు ప్రవేశించి తత్త్వములలో నిద్రాణమై యున్న క్రియాశక్తిని ఉజ్జీవింప జేసి, జీవుల కర్మ ఫలోన్ముఖమగునట్లు చేసెను గదా! ఆ విధముగా ఈశ్వరునిచే ప్రేరితమైన ఆ ఇరువది మూడు తత్త్వములు తమ తమ అంశలతో విరాట్ పురుషుని ఉత్పన్నము చేసినవి.

పరేణ విశతా స్వస్మిన్ మాత్రయా విశ్వసృగ్గణః ।
చుక్షోభాన్యోన్యమాసాద్య యస్మింల్లోకాశ్చరాచరాః ॥ 5

పరేణ = పరమేశ్వరుడు, స్వస్మిన్ = తనయందు, మాత్రయా = అంశరూపముగా, విశతా = ప్రవేశించిన కారణముగా, విశ్వసృక్-గణః = జగత్తును సృష్టించే తత్త్వముల సముదాయము, అన్యోన్యమ్ = ఒకదానితో మరియొకటి, ఆసాద్య = కలిసి, చుక్షోభ = సంచలనమును పొందెను, యస్మిన్ = దేనియందు, చర-అచరాః = కదిలేవి మరియు కదలనివి అగు, లోకాః = ప్రాణులు గలవో.

పరమేశ్వరుడు తనయందు అంశరూపముగా ప్రవేశించగానే, జగత్తును సృష్టించే ఆ తత్త్వములు ఒకదానితో మరియొకటి కలిసి క్షోభను పొంది, చరాచరములగు ప్రాణులకు ఆశ్రయమగు విరాట్ పురుషుని సృష్టించినవి.

హిరణ్మయస్స పురుషస్సహస్రపరివత్సరాన్ ।
ఆండకోశ ఉవాసాప్సు సర్వసత్త్వోపబృంహితః ॥ 6

సర్వసత్త్వ-ఉపబృంహితః = సకలజీవులతో కూడియున్న, హిరణ్మయః = తేజోమయుడగు, సః = ఆ, పురుషః = విరాట్ పురుషుడు, సహస్రపరివత్సరాన్ = వేయి సంవత్సరములు, అప్సు = జలములయందు, ఆండకోశే = అండాకారపు ఆధారమునందు, ఉవాస = నివసించెను.

తేజోమయుడగు ఆ విరాట్ పురుషుడు (హిరణ్యగర్భుడు) సకలజీవులతో కూడియున్నవాడై వేయి సంవత్సరములు జలములలో అండాకారములోనున్న ఆశ్రయమునందు నివసించెను.

స వై విశ్వసృజాం గర్భో దేవకర్మాత్మశక్తిమాన్ ।

విబభాజాత్మనాఽఽత్మానమేకధా దశధా త్రిధా ॥ 7

దేవకర్మ-ఆత్మశక్తిమాన్ = జ్ఞానశక్తి క్రియాశక్తి రూపముగా ప్రకట మయ్యే స్వీయశక్తిని కలిగియున్న, సః = ఆ, విశ్వసృజామ్ = జగత్తును సృష్టించే తత్త్వముల, గర్భః = (సంతాన) కార్యరూపమగు విరాట్ పురుషుడు, ఆత్మనా = తనచే, ఆత్మానమ్ = తనను, ఏకధా = ఒక ప్రకారముగా, దశధా = పది ప్రకారములుగా, త్రిధా = మూడు ప్రకారములుగా, విబభాజ = విభజించుకొనెను.

పరమేశ్వరుని మాయాశక్తియే జ్ఞానశక్తి మరియు క్రియాశక్తి అనే రూపములలో ప్రకటమగును. జగత్తును సృష్టించే మహత్తు మొదలగు తత్త్వముల కార్యము అగు హిరణ్యగర్భునియందు ఆ శక్తులు గలవు. ఆయన వాటి ద్వారా తనను ఒక రూపముగను, మూడు రూపములుగను మరియు పది రూపములుగను విభజించుకొనెను.

ఏష హ్యశేషసత్త్వానామాత్మాంశః పరమాత్మనః ।
ఆద్యోఽవతారో యత్రాసౌ భూతగ్రామో విభావ్యతే ॥ 8

అశేషతత్త్వానామ్ = సకల జీవులకు, ఆత్మా = ఆత్మ, పరమ-ఆత్మనః = పరమేశ్వరుని, అంశః = అంశయగు, ఏషః హి = ఈ హిరణ్యగర్భుడే, ఆద్యః = మొట్టమొదటి, అవతారః = అవతారము, యత్ర = ఎవనియందు, అసౌ = ఈ, భూతగ్రామః = సకల పదార్థ సమూహము, విభావ్యతే = ప్రకాశింప జేయబడుచున్నదో.

పరమేశ్వరుని అంశ మరియు మొట్టమొదటి అవతారము (ప్రథమ జీవుడు) అగు ఈ హిరణ్యగర్భుడే (బ్రహ్మాండశరీరము దృష్ట్యా విరాట్) సకలప్రాణులకు ఆత్మ. ఆయనయందే చరాచరజగత్తు అంతయు భాసించుచున్నది (వాస్తవముగా లేకున్ననూ ఉన్నట్లు కానవచ్చుచున్నది, ఊహింపబడుచున్నది).

సాధ్యాత్మస్సాధిదైవశ్చ సాధిభూత ఇతి త్రిధా ।
విరాట్ ప్రాణో దశవిధ ఏకధా హృదయేన చ ॥ 9

స-అధ్యాత్మః = దేహమును ఆశ్రయించి ఉండే ఇంద్రియములతో కూడినవాడు, స-అధిదైవః = ఆదిత్యమండలము మొదలగు వాటియందు ఉండే ఆదిత్యుడు మొదలగు దేవతలతో కూడినవాడు, చ = మరియు, స-అధిభూతః = పంచభూతములయందు ఉండే శబ్దము మొదలగు విష యములతో కూడినవాడు అగు, విరాట్ = విరాట్ పురుషుడు, ఇతి = ఈ విధముగా, త్రిధా = మూడు రూపములుగా, ప్రాణః = ప్రాణవృత్తిరూపుడై, దశవిధః = పది రూపములు గలవాడుగను, చ = మరియు, హృదయేన = బుద్ధి రూపముగా, ఏకధా = ఒక విధముగను ఉన్నాడు.

విరాట్ పురుషుడు సకలప్రాణులలో ఇంద్రియముల రూపము (అ ధ్యాత్మము) గను, ఆదిత్యమండలము మొదలగువాటియందు దేవతారూప ము (అధిదైవము) గను, పంచభూతములలో శబ్దము మొదలగు విషయ ముల రూపము (అధిభూతము) గను తనను తాను మూడు ప్రకారము లుగా విభజించుకొనెను. ఇంతేగాక, ఆయన ప్రాణ-అపాన-వ్యాన-ఉదాన-సమానములు, నాగ-కూర్మ-కృకర-దేవదత్త-ధనంజయులు అనే పది ప్రాణ వృత్తుల రూపముగను, హృదయము అనే ఒక ప్రకారముగను కూడ ఉన్నా డు.

స్మరన్ విశ్వసృజామీశో విజ్ఞాపితమధోక్షజః ।
విరాజమతపత్స్వేన తేజసైషాం వివృత్తయే ॥ 10

ఈశః = సర్వేశ్వరుడగు, అధోక్షజః = శ్రీమహావిష్ణువు, విశ్వసృ జామ్ = విశ్వమును సృజించే తత్త్వముల, విజ్ఞాపితమ్ = విన్నపమును, స్మరన్ = స్మరించుచున్నవాడై, ఏషామ్ = ఈ తత్త్వములకు, వివృత్తయే = వివిధవ్యాపారములు లభించుట కొరకై, విరాజమ్ = విరాట్ పురుషుని, స్వేన = తన, తేజసా = చిచ్ఛక్తితో, అతపత్ = ప్రకాశింప జేసెను.

సర్వేశ్వరుడగు శ్రీమహావిష్ణువు జగత్తును సృష్టించే ఈ మహత్తు మొదలగు తత్త్వములు చేసిన విన్నపమును స్మరించెను. ఆయన వాటికి వివిధవ్యాపారములను చేసే సామర్థ్యమును కలిగించుట కొరకై, విరాట్ పురుషుని తన చిచ్ఛక్తితో ప్రకాశింప జేసెను.

అథ తస్యాభితప్తస్య కతి చాయతనాని హ ।
నిరభిద్యంత దేవానాం తాని మే గదతః శృణు ॥ 11

అథ = తరువాత, అభితప్తస్య = ప్రకాశింప జేయబడిన, తస్య = ఆ విరాట్ పురుషునకు, కతి = ఎన్ని, దేవానామ్ = దేవతల, ఆయతనాని = స్థానములు, నిరభిద్యంత = ప్రకటమైనవో, తాని = వాటిని గురించి, మే = నేను, గదతః = చెప్పుచుండగా, శృణు = వినుము.

తరువాత ఆ విధముగా చైతన్యదీప్తిని పొందిన విరాట్ పురుషుని యందు వివిధదేవతల స్థానములు ప్రకటమైనవి. ఆ వివరములను నేను చెప్పెదను. వినుము.

తస్యాగ్నిరాస్యం నిర్భిన్నం లోకపాలోఽవిశత్పదమ్ ।
వాచా స్వాంశేన వక్తవ్యం యయాసౌ ప్రతిపద్యతే ॥ 12

తస్య = ఆ విరాట్ పురుషునకు, ఆస్యమ్ = నోరు అనే, పదమ్ = స్థానము, నిర్భిన్నమ్ = ప్రకటమయ్యెను, లోకపాలః = లోకపాలకుడగు, అగ్నిః = అగ్ని, స్వ-అంశేన = తన అంశయగు, వాచా = వాగింద్రియముతో, అవిశత్ = ప్రవేశించెను, యయా = ఏ వాక్కుచే, అసౌ = ఈ జీవుడు, వక్తవ్యం ప్రతిపద్యతే = మాటలాడుచున్నాడో.

ఆ విరాట్ పురుషునకు నోరు అనే స్థానము ప్రకటము కాగానే, లోకపాలకుడగు అగ్ని దానిని తన అంశయగు వాగింద్రియముతో సహా ప్రవేశించెను. దాని వలననే, ఈ జీవుడు మాటలాడుచున్నాడు.

నిర్భిన్నం తాలు వరుణో లోకపాలోఽవిశద్ధరేః ।
జిహ్వయాంశేన చ రసం యయాసౌ ప్రతిపద్యతే ॥ 13

హరేః = విరాట్ పురుషునకు, తాలు = దవడ, నిర్భిన్నమ్ = విడివడెను, లోకపాలః = లోకపాలకుడగు, వరుణః = వరుణుడు, అంశేన = తన అంశయగు, జిహ్వయా = రసనేంద్రియముతో గూడి, అవిశత్ = ప్రవేశించెను, యయా = దేనిచే, అసౌ = ఈ జీవుడు, రసమ్ = రసమును, ప్రతిపద్యతే = పొందుచున్నాడో.

ఆ విరాట్ పురుషునకు దవడ ప్రకటము కాగానే, లోకపాలకుడగు వరుణుడు తన అంశయగు రసనేంద్రియముతో గూడి దానియందు ప్రవేశించెను. ఆ ఇంద్రియముతో ఈ జీవుడు రసమును ఆస్వాదించుచున్నాడు.

నిర్భిన్నే అశ్వినౌ నాసే విష్ణోరావిశతాం పదమ్ ।
ఘ్రాణేనాంశేన గంధస్య ప్రతిపత్తిర్యతో భవేత్ ॥ 14

విష్ణోః = సర్వవ్యాపకుడగు విరాట్ పురుషునకు, నాసే = ముక్కు పుటములు, నిర్భిన్నే = విడివడినవి, అశ్వినౌ = అశ్వినీ దేవతలు, అంశేన = తమ అంశయగు, ఘ్రాణేన = ఘ్రాణేంద్రియముతో గూడి, పదమ్ = ఆ స్థానమును, ఆవిశతామ్ = ప్రవేశించిరి, యతః = దేనివలన, గంధస్య = గంధము యొక్క, ప్రతిపత్తిః = జ్ఞానము, భవేత్ = కలుగునో.

సర్వవ్యాపకుడగు విరాట్ పురుషునకు ముక్కు పుటములు ప్రకటము కాగానే, ఆ స్థానమును అశ్వినీ దేవతలు తమ అంశయగు ఘ్రాణేంద్రియముతో గూడి ప్రవేశించిరి. ఆ ఇంద్రియము జీవులకు గంధజ్ఞానమును కలిగించుచున్నది.

నిర్భిన్నే అక్షిణీ త్వష్టా లోకపాలోఽవిశద్విభోః ।
చక్షుషాంశేన రూపాణాం ప్రతిపత్తిర్యతో భవేత్ ॥ 15

విభోః = సర్వవ్యాపకుడగు ఆ విరాట్ పురుషునకు, అక్షిణీ = కన్నులు, నిర్భిన్నే = ప్రకటమయ్యెను, లోకపాలః = లోకములకు ప్రభువగు, త్వష్టా = సూర్యుడు, అంశేన = తన అంశయగు, చక్షుషా = నేత్రేంద్రియముతో గూడి, అవిశత్ = ప్రవేశించెను, యతః = దేనివలన, రూపాణామ్ = రూపముల, ప్రతిపత్తిః = జ్ఞానము, భవేత్ = కలుగునో.

సర్వవ్యాపకుడగు ఆ విరాట్ పురుషునకు కన్నులు ప్రకటము కాగానే, లోకములకు ప్రభువగు సూర్యుడు తన అంశయగు చక్షురింద్రియముతో సహా ఆ స్థానమును ప్రవేశించెను. జీవులు చక్షురింద్రియముచే రూపములను తెలుసుకొనుచున్నారు.

నిర్భిన్నాన్యస్య చర్మాణి లోకపాలోఽనిలోఽవిశత్ ।

ప్రాణేనాంశేన సంస్పర్శం యేనాసౌ ప్రతిపద్యతే ॥ 16

అస్య = ఈ విరాట్ పురుషునకు, చర్మాణి = చర్మరంధ్రములు, నిర్భిన్నాని = ప్రకటమైనవి, లోకపాలః = లోకపాలకుడగు, అనిలః = వాయువు, అంశేన = తన అంశయగు, ప్రాణేన = త్వగింద్రియముతో గూడి, అవిశత్ = ప్రవేశించెను, యేన = దేనిచే, అసౌ = ఈ జీవుడు, సంస్పర్శమ్ = స్పర్శను, ప్రతిపద్యతే = తెలుసుకొనుచున్నాడో.

ఈ విరాట్ పురుషునకు చర్మము ప్రకటము కాగానే, లోకపాలకుడగు వాయువు తన అంశయగు త్వగింద్రియముతో గూడి దానిని ప్రవేశించెను. జీవుడు త్వగింద్రియముతో స్పర్శను తెలియుచున్నాడు.

కర్ణావస్య వినిర్భిన్నౌ ధిష్ణ్యం స్వం వివిశుర్దిశః ।
శ్రోత్రేణాంశేన శబ్దస్య సిద్ధిం యేన ప్రపద్యతే ॥ 17

అస్య = ఈ విరాట్ పురుషునకు, కర్ణౌ = చెవి దొప్పలు, వినిర్భిన్నౌ = విడివడినవి, దిశః = దిక్కులు, అంశేన = తమ అంశయగు, శ్రోత్రేణ = శ్రోత్రేంద్రియముతో గూడి, స్వమ్ = తమ, ధిష్ణ్యమ్ = స్థానమును, వివిశుః = ప్రవేశించినవి, యేన = దేనిచే, శబ్దస్య = శబ్దముయొక్క, సిద్ధిమ్ = జ్ఞానమును, ప్రపద్యతే = పొందుచున్నాడో.

ఈ విరాట్ పురుషునకు చెవి దొప్పలు విడివడగానే, దిక్కులు (దిగ్దేవత) తమ అంశయగు శ్రోత్రేంద్రియముతో గూడి ఆ తమ స్థానమును ప్రవేశించినవి. ఆ ఇంద్రియముతో జీవుడు శబ్దములను తెలియుచున్నాడు.

త్వచమస్య వినిర్భిన్నాం వివిశుర్ధిష్ణ్యమోషధీః ।
అంశేన రోమభిః కండూం యైరసౌ ప్రతిపద్యతే ॥ 18

అస్య = ఈ విరాట్ పురుషునకు, వినిర్భిన్నామ్ = ప్రకటమైన, త్వచమ్ = చర్మమును, ఓషధీః = ఓషధులు, అంశేన = తమ అంశయగు, రోమభిః = రోమములతో బాటు, ధిష్ణ్యమ్ = స్థానమును, వివిశుః = ప్రవేశించినవి, యైః = వేటిచే, అసౌ = ఈ జీవుడు, కండూమ్ = దురదను, ప్రతిపద్యతే = తెలుసుకొనుచున్నాడో.

ఈ విరాట్ పురుషునకు చర్మము ప్రకటమయ్యెను. ఓషధుల అభిమాన దేవతలు తమ అంశయగు రోమములతో గూడి ఆ స్థానమును ప్రవేశించినవి. ఆ రోమముల ద్వారా జీవుడు దురదననుభవించుచున్నాడు.

మేఢ్రం తస్య వినిర్భిన్నం స్వధిష్ణ్యం క ఉపావిశత్ ।
రేతసాంశేన యేనాసావానందం ప్రతిపద్యతే ॥ 19

తస్య = ఆ విరాట్ పురుషునకు, మేఢ్రమ్ = మేఢ్రము, వినిర్భిన్నమ్ = ప్రకటమయ్యెను, కః = ప్రజాపతి, అంశేన = తన అంశయగు, రేతసా = రేతస్సుతో గూడి, స్వధిష్ణ్యమ్ = తన స్థానమును, ఉపావిశత్ = ప్రవేశించెను, యేన = దేనిచే, అసౌ = ఈ జీవుడు, ఆనందమ్ = ఆనందమును, ప్రతిపద్యతే = అనుభవించుచున్నాడో.

ఆ విరాట్ పురుషునకు మేఢ్రము ప్రకటమయ్యెను. ప్రజాపతి తన అంశయగు రేతస్సుతో గూడి ఆ తన స్థానమును ప్రవేశించెను. దాని వలననే, జీవుడు ఆనందముననుభవించుచున్నాడు.

గుదం పుంసో వినిర్భిన్నం మిత్రో లోకేశ ఆవిశత్ ।
పాయునాంశేన యేనాసౌ విసర్గం ప్రతిపద్యతే ॥ 20

పుంసః = విరాట్ పురుషునకు, గుదమ్ = గుదము, వినిర్భిన్నమ్ = ప్రకటమయ్యెను, లోక-ఈశః = లోకపాలకుడగు, మిత్రః = మిత్రుడు, అంశేన = తన అంశయగు, పాయునా = విసర్జనేంద్రియముతో గూడి, ఆవిశత్ = ప్రవేశించెను, యేన = దేనిచే, అసౌ = ఈ జీవుడు, విసర్గమ్ = విసర్జనమును, ప్రతిపద్యతే = చేయుచున్నాడో.

విరాట్ పురుషునకు గుదము ప్రకటమయ్యెను. లోకపాలకుడగు మిత్రుడు తన అంశయగు విసర్జనేంద్రియముతో గూడి దానిని ప్రవేశించెను. దానిచే జీవుడు విసర్జన కర్మను చేయుచున్నాడు.

హస్తావస్య వినిర్భిన్నావింద్రస్స్వర్పతిరావిశత్ ।
వార్తయాంశేన పురుషో యయా వృత్తిం ప్రపద్యతే ॥ 21

అస్య = ఈ విరాట్ పురుషునకు, హస్తౌ = రెండు చేతులు, విని ర్భిన్నౌ = ప్రకటమయ్యెను, స్వర్పతిః = స్వర్గమునకు ప్రభువగు, ఇంద్రః = ఇంద్రుడు, అంశేన = తన అంశయగు, వార్తయా = పట్టుకొనుట అను రూప ములో నుండే శక్తితో గూడి, ఆవిశత్ = ప్రవేశించెను, యయా = దేనిచే, పురుషః = మానవుడు, వృత్తిమ్ = జీవికను, ప్రపద్యతే = పొందుచున్నాడో.

ఈ విరాట్ పురుషునకు రెండు చేతులు ప్రకటమయ్యెను. స్వర్గము నకు ప్రభువగు ఇంద్రుడు పట్టుకొనుటకు అవసరమయ్యే బలముతో గూడి వాటిలో ప్రవేశించెను. మానవుడు ఆ శక్తి చేతనే జీవికను సంపాదించుకొను చున్నాడు.

పాదావస్య వినిర్భిన్నౌ లోకేశో విష్ణురావిశత్ ।
గత్యా స్వాంశేన పురుషో యయా ప్రాప్యం ప్రపద్యతే ।। 22

అస్య = ఈ విరాట్ పురుషునకు, పాదౌ = రెండు పాదములు, విని ర్భిన్నౌ = ప్రకటమయ్యెను, లోక-ఈశః = లోకములకు ప్రభువగు, విష్ణుః = విష్ణువు, స్వ-అంశేన = తన అంశయగు, గత్యా = గతిశక్తి ద్వారా, ఆవిశత్ = ప్రవేశించెను, యయా = ఏ గతిశక్తిచే, పురుషః = మానవుడు, ప్రాప్యమ్ = గమ్యస్థానమును, ప్రపద్యతే = చేరుచున్నాడో.

ఈ విరాట్ పురుషునకు పాదములు ప్రకటము కాగానే, లోకనాథు డగు విష్ణువు తన అంశయగు గతిశక్తితో కూడి వాటియందు ప్రవేశించెను. మానవుడు ఆ గతిశక్తి చేతనే తాను చేరవలసిన స్థానమును చేరుచున్నాడు.

బుద్ధిం చాస్య వినిర్భిన్నాం వాగీశో ధిష్ణ్యమావిశత్ ।
బోధేనాంశేన బోద్ధవ్యప్రతిపత్తిర్యతో భవేత్ ।। 23

అస్య = ఈ విరాట్ పురుషునకు, వినిర్భిన్నామ్ = ప్రకటమైన, బుద్ధిమ్ = బుద్ధి అనే, ధిష్ణ్యమ్ = స్థానమును, వాక్-ఈశః = బ్రహ్మ, అంశేన = తన అంశయగు, బోధేన = బుద్ధిశక్తితో కూడి, ఆవిశత్ = ప్రవేశించెను, యతః = దేని వలన, బోద్ధవ్యప్రతిపత్తిః = తెలియదగిన దాని జ్ఞానము, భవేత్ = కలుగునో.

ఈ విరాట్ పురుషునకు బుద్ధి ప్రకటము కాగానే, బ్రహ్మ ఆ స్థానమును తన అంశయగు బుద్ధిశక్తితో గూడి ప్రవేశించెను. మానవుడు ఈ బుద్ధిశక్తిచేతనే తెలియదగిన విషయములను తెలియుచున్నాడు.

హృదయం చాస్య నిర్భిన్నం చంద్రమా ధిష్ణ్యమావిశత్ ।
మనసాంశేన యేనాసౌ విక్రియాం ప్రతిపద్యతే ।। 24

చ = మరియు, అస్య = ఈ విరాట్ పురుషునకు, హృదయమ్ = హృదయము, నిర్భిన్నమ్ = ప్రకటమయ్యెను, ధిష్ణ్యమ్ = ఆ స్థానమును, చంద్రమాః = చంద్రుడు, అంశేన = తన అంశయగు, మనసా = మనస్సుతో గూడి, ఆవిశత్ = ప్రవేశించెను, యేన = ఏ మనస్సుచే, అసౌ = ఈ మానవుడు, విక్రియామ్ = వికారమును, ప్రతిపద్యతే = పొందుచున్నాడో.

ఆ విరాట్ పురుషునకు హృదయము ప్రకటము కాగానే, ఆ స్థానమును చంద్రుడు తన అంశయగు మనస్సుతో గూడి ప్రవేశించెను. మానవుడు ఆ మనశ్శక్తి చేతనే సంకల్పవికల్పములు మొదలగు వికారములను పొందుచున్నాడు.

ఆత్మానం చాస్య నిర్భిన్నమభిమానోఽవిశత్పదమ్ ।
కర్మణాంశేన యేనాసౌ కర్తవ్యం ప్రతిపద్యతే ।। 25

చ = మరియు, అస్య = ఈ విరాట్ పురుషునకు, నిర్భిన్నమ్ = ప్రకటమైన, ఆత్మానమ్ = అహంకారము అనే, పదమ్ = స్థానమును, అభిమానః = అభిమానము (రుద్రుడు), అంశేన = తన అంశయగు, కర్మణా = క్రియాశక్తితో గూడి, అవిశత్ = ప్రవేశించెను, యేన = దేనిచే, అసౌ = ఈ మానవుడు, కర్తవ్యమ్ = చేయదగిన పనిని, ప్రతిపద్యతే = స్వీకరించుచున్నాడో.

ఈ విరాట్ పురుషునకు అహంకారము ప్రకటమయ్యెను. ఆ స్థానమును అభిమానము (రుద్రుడు) తన అంశయగు క్రియాశక్తితో గూడి ప్రవేశించెను. ఆ శక్తిచేతనే మానవుడు తనయందు కర్తృత్వమును భావించి తాను చేయదగిన పనులను చేబట్టుచున్నాడు.

సత్త్వం చాస్య వినిర్భిన్నం మహాన్ ధిష్ణ్యముపావిశత్ ।
చిత్తేనాంశేన యేనాసౌ విజ్ఞానం ప్రతిపద్యతే ॥ 26

చ = మరియు, అస్య = ఈ విరాట్ పురుషునకు, సత్త్వమ్ = చిత్తము, వినిర్భిన్నమ్ = ప్రకటమయ్యెను, ధిష్ణ్యమ్ = ఆ స్థానమును, మహాన్ = మహత్తత్త్వము (బ్రహ్మ), అంశేన = తన అంశయగు, చిత్తేన = చిత్తశక్తితో గూడి, ఉపావిశత్ = ప్రవేశించెను, యేన = దేనిచే, అసౌ = ఈ జీవుడు, విజ్ఞానమ్ = విజ్ఞానమును, ప్రతిపద్యతే = పొందుచున్నాడో.

ఈ విరాట్ పురుషునకు చిత్తము ప్రకటమయ్యెను. ఆ స్థానమును మహత్తత్త్వము (బ్రహ్మ) తన అంశయగు చిత్తశక్తితో గూడి ప్రవేశించెను. ఆ సమష్టిబుద్ధిశక్తియొక్క అనుగ్రహము చేతనే మానవుడు విజ్ఞానమును పొందుచున్నాడు.

శీర్ష్ణోఽస్య ద్యౌర్ధరా పద్భ్యాం ఖం నాభేరుదపద్యత ।
గుణానాం వృత్తయో యేషు ప్రతీయంతే సురాదయః ॥ 27

అస్య = ఈ విరాట్ పురుషునియొక్క, శీర్ష్ణః = శిరస్సునుండి, ద్యౌః = ద్యులోకము, పద్భ్యామ్ = పాదములనుండి, ధరా = పృథివి, నాభేః = నాభినుండి, ఖమ్ = అంతరిక్షము, ఉదపద్యత = ప్రకటమయ్యెను, యేషు = వేటియందు, గుణానామ్ = సత్త్వరజస్తమోగుణముల, వృత్తయః = పరిణామములగు, సుర-ఆదయః = దేవతలు మొదలగువారు, ప్రతీయంతే = కానవచ్చుచున్నారో.

ఈ విరాట్ పురుషుని శిరస్సునుండి స్వర్గలోకము, నాభినుండి అంతరిక్షము, పాదములనుండి పృథివి పుట్టినవి. వాటియందు సత్త్వరజస్తమోగుణముల పరిణామములగు దేవతలు మొదలగువారు కానవచ్చుచున్నారు.

ఆత్యంతికేన సత్త్వేన దివం దేవాః ప్రపేదిరే ।
ధరాం రజస్స్వభావేన పణయో యే చ తానను ॥ 28

దేవాః = దేవతలు, ఆత్యంతికేన = అతిశయించిన, సత్త్వేన = సత్త్వ గుణముచే, దివమ్ = స్వర్గమును, ప్రపేదిరే = పొందిరి, రజః-స్వభావేన = రజోగుణస్వభావముచే, పణయః = మానవులు, చ = మరియు, యే = ఏ ప్రాణులు, తాన్ = వారిని, అను = అనుసరించియుండునో అవి, ధరామ్ = భూమిని (పొందిరి).

అతిశయించిన సత్త్వగుణము కారణముగా దేవతలు స్వర్గలోకమును, రజోగుణము ప్రధానమగుటచే మానవులు మరియు వారిని అనుసరించి యుండే గోవులు మొదలగు ప్రాణులు భూలోకమును పొందిరి.

తార్తీయేన స్వభావేన భగవన్నాభిమాశ్రితాః ।
ఉభయోరంతరం వ్యోమ యే రుద్రపార్షదాం గణాః ॥ 29

తార్తీయేన = మూడవదియగు తమోగుణమునకు సంబంధించిన, స్వభావేన = స్వభావముచే, రుద్రపార్షదామ్ = రుద్రుని అనుచరుల, గణాః = గణములు, భగవత్-నాభిమ్ = భగవానుని నాభియగు, ఉభయోః = స్వర్గలోకభూలోకముల, అంతరమ్ = మధ్యలోనుండే, వ్యోమ = అంతరిక్షమును, ఆశ్రితాః = ఆశ్రయించినారు.

గుణములలో మూడవది తమస్సు. రుద్రుని అనుచరులైన భూతగణములలో అది ప్రధానముగా నుండును. భగవంతుని నాభియగు అంతరిక్షము భూలోక స్వర్గలోకములకు నడుమన ఉన్నది. వారు దాని యందు నివసించెదరు.

ముఖతోఽవర్తత బ్రహ్మ పురుషస్య కురూద్వహ ।
యస్త్వున్ముఖత్వాద్వర్ణానాం ముఖ్యోఽభూద్బ్రాహ్మణో గురుః॥30

కురు-ఉద్వహ = కురువంశ శ్రేష్ఠా!, పురుషస్య = విరాట్ పురుషుని యొక్క, ముఖతః = ముఖమునుండి, బ్రహ్మ = వేదము (బ్రాహ్మణుడు), అవర్తత = ఉదయించెను, యః = ఏ, బ్రాహ్మణః తు = బ్రాహ్మణుడైతే, ఉత్-ముఖత్వాత్ = ముఖమునుండి పుట్టుట వలన, వర్ణానామ్ = వర్ణములలో, ముఖ్యః = ప్రముఖుడు, గురుః = గురువు, అభూత్ = ఆయెనో.

కురువంశ శ్రేష్ఠుడవగు ఓ విదురా! విరాట్ పురుషుని ముఖము నుండి వేదముతో బాటు బ్రాహ్మణుడు పుట్టెను. ముఖమునుండి పుట్టుటచే బ్రాహ్మణుడు వర్ణములలో ముఖ్యుడు మరియు గురువు అగుచున్నాడు.

బాహుభ్యోఽవర్తత క్షత్త్రం క్షత్రియస్తదనువ్రతః ।
యో జాతస్త్రాయతే వర్ణాన్ పౌరుషః కంటకక్షతాత్ ॥ 31

బాహుభ్యః = బాహువులనుండి, క్షత్త్రమ్ = పాలించే వృత్తి, తత్ = ఆ వృత్తిని, అనువ్రతః = అవలంబించే, క్షత్రియః = క్షత్రియుడు, అవర్తత = ఉదయించెను, పౌరుషః = విరాట్ పురుషుని అంశయగు, యః = ఏ క్షత్రియుడు, జాతః = పుట్టినవాడై, కంటకక్షతాత్ = చోరులు మొదలగువారి ఉపద్రవమునుండి, వర్ణాన్ = వర్ణములను, త్రాయతే = రక్షించునో.

విరాట్ పురుషుని బాహువులనుండి పాలకవృత్తి, దానిని అవలంబించే క్షత్రియుడు పుట్టెను. ఆ పురుషుని అంశయై పుట్టిన క్షత్రియుడు వర్ణముల వారిని చోరులు మొదలగు ఉపద్రవములనుండి రక్షించును.

విశోఽవర్తంత తస్యోర్వోర్లోకవృత్తికరీర్విభోః ।
వైశ్యస్తదుద్భవో వార్తాం నృణాం యస్సమవర్తయత్ ॥ 32

తస్య = ఆ, విభోః = విరాట్ పురుషుని, ఊర్వోః = ఊరువులనుండి, లోకవృత్తికరీః = జనుల జీవికకు హేతువులగు, విశః = వైశ్యులు, అవర్తంత = ఉదయించిరి, తత్-ఉద్భవః = ఆ విరాట్ పురుషునినుండి పుట్టిన, యః = ఏ, వైశ్యః = వైశ్యుడు, నృణామ్ = మానవుల, వార్తామ్ = కృషి మొదలగు జీవికను, సమవర్తయత్ = సంపాదించెనో.

ఆ విరాట్ పురుషుని ఊరువులనుండి జనుల జీవికకు హేతువగు వైశ్యవృత్తి ఉదయించెను. ఆ విధముగా ఉదయించిన వైశ్యుడు కృషి గోరక్షణము మొదలగు కార్యములను నడిపించి మానవులకు జీవికను సంపాదించుచున్నాడు.

పద్భ్యాం భగవతో జజ్ఞే శుశ్రూషా ధర్మసిద్ధయే ।

తస్యాం జాతః పురా శూద్రో యద్వృత్త్యా తుష్యతే హరిః ॥ 33

భగవతః = విరాట్ భగవానుని, పద్భ్యామ్ = పాదములనుండి, ధర్మసిద్ధయే = ధర్మము సిద్ధించుట కొరకై, శుశ్రూషా = సేవాధర్మము, జజ్ఞే = పుట్టెను, పురా = పూర్వము, తస్యామ్ = ఆ సేవాధర్మమునందు, శూద్రః = శూద్రుడు, జాతః = పుట్టెను, యత్-వృత్త్యా = ఏ సేవావృత్తిచే, హరిః = శ్రీహరి, తుష్యతే = సంతోషించునో.

విరాట్ భగవానుని పాదములనుండి సకలధర్మములను సిద్ధింపజేయుట కొరకై సేవాధర్మము పుట్టెను. పూర్వము ఆ ధర్మమునందు శూద్రుడు పుట్టెను. ఆ సేవాధర్మము శ్రీహరికి ప్రీతికరము.

ఏతే వర్ణాస్స్వధర్మేణ యజంతి స్వగురుం హరిమ్ ।
శ్రద్ధయాఽఽత్మవిశుద్ధ్యర్థం యజ్జాతాస్సహ వృత్తిభిః ॥ 34

ఏతే = ఈ, వర్ణాః = వర్ణములు, స్వధర్మేణ = తమ ధర్మముచే, స్వగురుమ్ = తమకు తండ్రియగు, హరిమ్ = శ్రీహరిని, ఆత్మవిశుద్ధి-అర్థమ్ = అంతఃకరణశుద్ధి కొరకై, శ్రద్ధయా = శ్రద్ధతో, యజంతి = ఆరాధించెదరు, యత్ = ఏలయనగా, వృత్తిభిః సహ = వృత్తులతో బాటుగా, జాతాః = పుట్టినారో.

వృత్తులతో సహా శ్రీహరినుండి జన్మించిన ఈ వర్ణముల వారు తమకు గురువగు శ్రీహరిని తమ ధర్మమును శ్రద్ధతో అనుష్ఠించుట ద్వారా ఆరాధించి అంతఃకరణశుద్ధిని పొందెదరు.

ఏతత్ క్షత్తర్భగవతో దైవకర్మాత్మరూపిణః ।
కశ్శ్రద్దధ్యాదుపాకర్తుం యోగమాయాబలోదయమ్ ॥ 35

క్షత్తః = ఓ విదురా!, దైవకర్మ-ఆత్మరూపిణః = కాలము కర్మ మరియు తన స్వభావమగు శక్తి గల, భగవతః = భగవానుని, యోగమాయాబల-ఉదయమ్ = త్రిగుణాత్మికయగు మాయయొక్క బలముచే పుట్టిన, ఏతత్ = ఈ విరాట్ రూపమును, ఉపాకర్తుమ్ = పూర్తిగా వర్ణించుటకు, కః = ఎవ్వాడు, శ్రద్దధ్యాత్ = కోరును?

ఓ విదురా! కాలము, జీవుల కర్మ మరియు తన స్వభావమగు శక్తి అనువాటితో కూడియున్న భగవానుడు తన యోగమాయయొక్క ప్రభావముచే ఈ విరాట్ రూపముగా ప్రకటమయ్యెను. దీనిని సాకల్యముగా వర్ణించే సాహసమును ఎవడు చేయును?

అథాపి కీర్తయామ్యంగ యథామతి యథాశ్రుతమ్ ।
కీర్తిం హరేస్స్వాం సత్కర్తుం గిరమన్యాభిధాసతీమ్ ।  36

అంగ = ఓ విదురా!, అథాపి = అయినప్పటికీ, హరేః = శ్రీహరి యొక్క, కీర్తిమ్ = కీర్తిని, యథామతి = నా బుద్ధికి తోచినంతమటుకు, యథా శ్రుతమ్ = విన్నదానిని అతిక్రమించకుండగా, అన్య-అభిధా-అసతీమ్ = ఇతరప్రసంగములచే మలినమైన, స్వామ్ = స్వీయమైన, గిరమ్ = వాక్కును, సత్కర్తుమ్ = పవిత్రముగా చేయుటకు, కీర్తయామి = కీర్తించుచున్నాను.

ఓ విదురా! అయినప్పటికీ, నేను గురుముఖమునుండి విన్నదానిని అతిక్రమించకుండగా, నా బుద్ధికి తోచినంత మటుకు శ్రీహరియొక్క కీర్తిని వర్ణించెదను. అట్లు చేయుట వలన, ఇతరప్రసంగములచే మలినమైన నా వాగింద్రియము పవిత్రమగును.

ఏకాంతలాభం వచసో ను పుంసాం
సుశ్లోకమౌలేర్గుణవాదమాహుః ।
శ్రుతేశ్చ విద్వద్భిరుపాకృతాయాం
కథాసుధాయాముపసంప్రయోగమ్ ॥  37

పుంసామ్ = మానవులకు, సుశ్లోకమౌలేః = పవిత్రమగు కీర్తిగలవారిలో మొదటివాడగు పరమేశ్వరుని, గుణవాదమ్ = గుణముల గానము, వచసః = వాక్కునకు, చ = మరియు, విద్వద్భిః = విద్వాంసులచే, ఉపాకృతాయామ్ = వర్ణించబడే, కథాసుధాయామ్ = కథామృతమునందు, ఉపసంప్రయోగమ్ = సన్నిధిలో సమర్పించుట, శ్రుతేః = చెవికి, ఏకాంతలాభమ్ = సునిశ్చితమైన లాభము అని, ఆహుః ను = చెప్పుచున్నారు గదా!

పవిత్రమగు కీర్తి గలవారిలో శిఖామణియగు భగవానుని గుణము లను గానము చేయుట మానవుల వాక్కునకు, విద్వాంసులు వర్ణించుచుం డగా చెవులను ఆ భగవద్గాథ అనే అమృతమునకు అప్పగించుట చెవులకు సునిశ్చితమగు లాభమని మహాత్ములు చెప్పుచున్నారు గదా!

ఆత్మనోఽవసితో వత్స మహిమా కవినాఽఽదినా ।
సంవత్సరసహస్రాంతే ధియా యోగవిపక్వయా । 38

వత్స = ప్రియమైన ఓ విదురా!, ఆదినా కవినా = ఆదికవియగు బ్రహ్మగారిచే, సంవత్సరసహస్ర-అంతే = వేయి సంవత్సరముల తరువాత, యోగవిపక్వయా = తపస్సుచే పరిపక్వమైన, ధియా = బుద్ధిచే, ఆత్మనః = ఆత్మరూపుడగు శ్రీహరియొక్క, మహిమా = మహిమ, అవసితః = నిశ్చ యించబడినదా యేమి?

ప్రియమైన ఓ విదురా! ఆదికవియగు బ్రహ్మగారు వేయి సంవత్స రములు యోగసాధనను చేసి దానిచే పరిపక్వమైన బుద్ధి గలవాడై, అప్పు డైననూ ఆత్మరూపుడగు శ్రీహరియొక్క మహిమను ఖచ్చితముగా తెలు సుకొన గల్గినాడా? లేదు.

అతో భగవతో మాయా మాయినామపి మోహినీ ।
యత్స్వయం చాత్మవర్త్మాత్మా న వేద కిముతాపరే ।। 39

అతః = ఇందువలన, భగవతః = భగవానుని, మాయా = మాయ, మాయినాం అపి = మాయావులకు కూడ, మోహినీ = మోహమును కలిగిం చునది, యత్ = ఏలయనగా, స్వయమ్ = స్వయముగా, ఆత్మా = ఆత్మరూ పుడగు శ్రీహరి కూడ, ఆత్మవర్త్మ = తన మాయయొక్క గతిని, న వేద = తెలియకున్నాడో, అపరే = ఇతరులు, కిం ఉత = చెప్పునదేమున్నది?

కావున, భగవానుని మాయ మాయావులకు కూడ మోహమును కలిగించును. ఏలయనగా, ఆత్మరూపుడగు శ్రీహరి కూడ స్వయముగా తన మాయయొక్క గతిని తెలియలేకున్నాడు. ఇతరులను గురించి ఇక చెప్పునదేమున్నది?

యతోఽప్రాప్య నివర్తంతే వాచశ్చ మనసా సహ ।
అహం చాన్య ఇమే దేవాస్తస్మై భగవతే నమః ॥ 40

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
షష్ఠోఽధ్యాయః ॥

యతః = దేనియందు, అప్రాప్య = చేరలేక, వాచః = వాక్కులు, మనసా సహ = మనస్సుతో గూడి, న్యవర్తంత = వెనుదిరిగినవో, అహమ్ = అహంకారాధిష్ఠాతయగు రుద్రుడు, ఇమే = ఈ, దేవాః = దేవతలు, చ = కూడ, తస్మై = అట్టి, భగవతే = భగవానుని కొరకు, నమః = నమస్కారము.

భగవానుని స్వరూపమును వర్ణించబూని వాక్కు విఫలమైనది. దానిని ఊహించబూనిన మనస్సు కూడ విఫలమైనది. అహంకారాభిమాని యగు రుద్రుడు మరియు ఇతరదేవతలు కూడ భగవానుని మహిమను అంచనా వేయలేకున్నారు. అట్టి శ్రీహరి భగవానునకు నమస్కారము.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధమునందు
ఆరవ అధ్యాయము ముగిసినది (6).

* * * * *

# అథ సప్తమోఽధ్యాయః

## విదురుని ప్రశ్న

శ్రీశుక ఉవాచ ।
ఏవం బ్రువాణం మైత్రేయం ద్వైపాయనసుతో బుధః ।
ప్రీణయన్నివ భారత్యా విదురః ప్రత్యభాషత ॥ 1

శ్రీశుకః = శ్రీశుక మహర్షి, ఉవాచ = పలికెను, బుధః = విద్వాంసుడు, ద్వైపాయనసుతః = వ్యాసమహర్షి పుత్రుడు అగు, విదురః = విదురుడు, ఏవమ్ = ఈ విధముగా, బ్రువాణమ్ = పలుకుచున్న, మైత్రేయమ్ = మైత్రేయుని, భారత్యా = తన మాటతో, ప్రీణయన్ ఇవ = సంతోషపెట్టుచున్నాడా యన్నట్లు, ప్రత్యభాషత = పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- విద్వాంసుడు, వ్యాసనందనుడు అగు విదురుడు మైత్రేయుని ఈ వచనములను విని, తన పలుకులతో ఆయనకు ముదమును గొల్పుతూ ఇట్లు పలికెను.

విదుర ఉవాచ ।
బ్రహ్మన్ కథం భగవతశ్చిన్మాత్రస్యావికారిణః ।
లీలయా చాపి యుజ్యేరన్నిర్గుణస్య గుణాః క్రియాః ॥ 2

బ్రహ్మన్ = ఓ మహాత్మా!, చిన్మాత్రస్య = శుద్ధచైతన్యస్వరూపుడు, అవికారిణః = వికారములు (మార్పులు) లేనివాడు, నిర్గుణస్య = గుణములు లేనివాడు అగు, భగవతః = శ్రీహరి భగవానునకు, లీలయా చ అపి = లీల చేనైననూ, గుణాః = గుణములు, క్రియాః = క్రియలు, కథమ్ = ఏ విధముగా, యుజ్యేరన్ = జతగూడును?

ఓ మహాత్మా! భగవానుడు శుద్ధచైతన్యమే స్వరూపముగా గలవాడు. ఆయనయందు వికారములేమియు లేవు. ఆయన నిర్గుణుడు. అట్టి భగవానునకు లీలామాత్రముగానైననూ గుణములతో మరియు క్రియలతో సంబంధము ఎట్లు పొసగును?

క్రీడాయాముద్యమోఽర్భస్య కామశ్చిక్రీడిషాన్యతః ।
స్వతస్తృప్తస్య చ కథం నివృత్తస్య సదాన్యతః ॥ 3

అర్భస్య = పిల్లవానికి, క్రీడాయామ్ = ఆటయందు, ఉద్యమః = ప్రయత్నము, కామః = కోరిక, అన్యతః = ఇతరమగు ఆటవస్తువుతో (మరియొక పిల్లవానితో), చిక్రీడిషా = ఆటలాడాలనే కోరిక, స్వతః = తనంతతానుగా, తృప్తస్య = తృప్తిని చెందియున్నవాడు, చ = మరియు, సదా = ఎల్లవేళలా, అన్యతః నివృత్తస్య = ఇతరము లేనివాడు అగు భగవానునకు, కథమ్ = ఎట్లు?

పిల్లలకు ఆటలయందు ప్రీతి ఉండును. వారు ఆటవస్తువులను ముందు వేసుకొని, లేదా మరికొందరు పిల్లలతో కలిసి ఆడుకొనే యత్నములో మునిగియుందురు. కాని, భగవానుడు ఆత్మతృప్తుడు. ఆయనకు ఆడుకొనుటకై తనకంటె భిన్నముగా ఇతరవస్తువులు గాని, ఇతరవ్యక్తులు గాని లేరు. అట్టి అసంగునకు ఆటలాడుటయందు కోరిక, దానిని అనుసరించి ప్రయత్నము, ఇతరములగు క్రీడోపకరణములయందు మరియు వ్యక్తులయందు ప్రవృత్తి ఎట్లు పొసగును?

అస్రాక్షీద్భగవాన్ విశ్వం గుణమయ్యాఽఽత్మమాయయా ।
తయా సంస్థాపయత్యేతద్భూయః ప్రత్యపిధాస్యతి ॥ 4

భగవాన్ = భగవానుడు, గుణమయ్యా = త్రిగుణాత్మికయగు, ఆత్మమాయయా = తన మాయాశక్తిచే, విశ్వమ్ = జగత్తును, అస్రాక్షీత్ = సృష్టించెను, తయా = దానిచేతనే, ఏతత్ = ఈ జగత్తును, సంస్థాపయతి = రక్షించుచున్నాడు, భూయః = మరల, ప్రత్యపిధాస్యతి = ఉపసంహరించగలడు.

భగవానుడు సత్త్వరజస్తమోగుణాత్మకమగు తన మాయాశక్తిని ఆసరాగా చేసుకొని ఈ జగత్తును సృష్టించినాడు; ఆ శక్తితోనే దీనిని పాలించుచున్నాడు; మరల ఆయన ప్రళయమునందు దీనిని తనలోనికి ఉపసంహరించగలడు.

దేశతః కాలతో యోఽసావవస్థాతస్స్వతోఽన్యతః ।
అవిలుప్తావబోధాత్మా స యుజ్యేతాజయా కథమ్ ॥ 5

యః = ఏ, అసౌ = ఈ భగవానుడు, దేశతః = దేశముచే, కాలతః = కాలముచే, అవస్థాతః = అవస్థచే, స్వతః = తానే నిమిత్తమగుటచే, అన్యతః = మరియొక నిమిత్తముచే, అవిలుప్త-అవబోధ-ఆత్మా = లోపించని జ్ఞానమే స్వరూపముగా గలవాడో, సః = అట్టి భగవానుడు, కథమ్ = ఏ విధముగా, అజయా = అవిద్యతో, యుజ్యేత = సంయోగమును పొందును?

భగవానుడు నిర్విశేష జ్ఞానస్వరూపుడు. ఆయన స్వరూపమగు జ్ఞానమునందు దేశముచే గాని, కాలముచే గాని, జాగ్రత్తు మొదలగు అవస్థచే గాని, తనంత తానుగా గాని, మరియొక నిమిత్తముచే గాని, లోపము కలుగదు. అట్టి భగవానునకు అవిద్యతో సంయోగము ఎట్లు పొసగును?

భగవానేక ఏవైష సర్వ క్షేత్రేష్వవస్థితః ।
అముష్య దుర్భగత్వం వా క్లేశో వా కర్మభిః కుతః ॥ 6

ఏకః = అద్వితీయుడగు, ఏషః = ఈ, భగవాన్ ఏవ = భగవానుడు మాత్రమే, సర్వ క్షేత్రేషు = దేహములన్నింటియందు, అవస్థితః = ఉన్నాడు, అముష్య = ఇట్టి క్షేత్రజ్ఞునకు, దుర్భగత్వమ్ = ఆనందమునకు దూరమగుట, కర్మభిః = కర్మలచే, క్లేశః వా = క్లేశము గాని, కుతః = దేనివలన?

అద్వితీయుడగు భగవానుడు మాత్రమే దేహములన్నింటియందు క్షేత్రజ్ఞుని రూపములో ఉన్నాడు గదా! అట్టి స్థితిలో ఈ క్షేత్రజ్ఞుడు ఆనందమునకు దూరుడై కర్మలతో క్లేశమునునుభవించుటకు కారణమేమి?

ఏతస్మిన్మే మనో విద్వన్ ఖిద్యతేఽజ్ఞానసంకటే ।

తన్నః పరాణుద విభో కశ్మలం మానసం మహత్ || 7

విద్వన్ = ఓ విద్వాంసుడా!, ఏతస్మిన్ = ఈ, అజ్ఞానసంకటే = అజ్ఞానమనే సంకటమునందు, మే = నా, మనః = మనస్సు, ఖిద్యతే = ఖేదమును పొందుచున్నది, విభో = ఓ ప్రభూ!, నః = మాయొక్క, తత్ = అట్టి, మానసమ్ = మనస్సునకు సంబంధించిన, మహత్ = పెద్ద, కశ్మలమ్ = దోషమును, పరాణుద = తొలగించుము.

ఓ ప్రభూ! నీవు విద్వాంసుడవు. నా మనస్సు అజ్ఞానము అనే ఈ సంకటములో పడి చాల ఖేదముననుభవించుచున్నది. నీవు ఈ పెద్ద మానసిక దోషమును దూరము చేయుము.

శ్రీశుక ఉవాచ |
స ఇత్థం చోదితః క్షత్త్రా తత్త్వజిజ్ఞాసునా మునిః |
ప్రత్యాహ భగవచ్చిత్తస్స్మయన్నివ గతస్మయః || 8

ఇత్థమ్ = ఈ విధముగా, తత్త్వజిజ్ఞాసునా = తత్త్వమ్మును తెలియగోరే, క్షత్త్రా = విదురునిచే, చోదితః = ప్రేరేపించబడినవాడై, గతస్మయః = తొలగిన అహంకారము గల, సః = ఆ, మునిః = మైత్రేయ మహర్షి, భగవత్-చిత్తః = భగవంతునియందు లగ్నమైన మనస్సు గలవాడై, స్మయన్ ఇవ = చిరునవ్వు గలవాడై, ప్రత్యాహ = సమాధానమును చెప్పెను.

శ్రీశుకమహర్షి ఇట్లు పలికెను -- తత్త్వమును తెలియగోరే విదురుడు ఈ విధముగా ప్రేరేపించగా, అహంకారము లేని ఆ మైత్రేయుడు భగవంతుని స్మరించి చిరునవ్వుతో ఇట్లు సమాధానమును చెప్పెను.

మైత్రేయ ఉవాచ |
సేయం భగవతో మాయా యన్నయేన విరుధ్యతే |
ఈశ్వరస్య విముక్తస్య కార్పణ్యముత బంధనమ్ || 9

విముక్తస్య = నిత్యముక్తుడగు, ఈశ్వరస్య = ఈశ్వరునకు, కార్పణ్యమ్ = దైన్యము, ఉత = మరియు, బంధనమ్ = బంధము, యత్ = ఏదై

తే, నయేన = యుక్తితో, విరుధ్యతే = విరోధించుచున్నదో, సా = అట్టి, ఇయమ్ = ఇది, భగవతః = భగవానుని, మాయా = మాయ.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- నిత్యముక్తుడగు ఈశ్వరుడు జీవ రూపములో బద్ధుడై దీనుడై ఉండుట అనే ఈ యుక్తివిరుద్ధమగు స్థితి భగవానుని ఆ మాయ మాత్రమే.

యదర్థేన వినాముష్య పుంస ఆత్మవిపర్యయః ।
ప్రతీయత ఉపద్రష్టుస్స్వశిరశ్ఛేదనాదికః ॥ **10**

యత్ = ఏ విధముగానైతే, ఉపద్రష్టుః = స్వప్నమును చూచువానికి, స్వశిరః-ఛేదన-ఆదికః = తన తల తెగగొట్టబడుట మొదలగునది, అర్థేన వినా = వాస్తవికత లేకున్ననూ, ప్రతీయతే = కానవచ్చుచున్నదో, అముష్య = ఈ, పుంసః = పురుషునకు, ఆత్మవిపర్యయః = తన స్వరూపము వ్యత్యాసమగుట.

ఈ మానవునకు స్వప్నములో తన తల తెగినట్లుగా కానవచ్చును. కాని, అది యథార్థము కాదు. అదే విధముగా, ఈ మానవునకు తాను బద్ధుడు కాకున్ననూ, బద్ధుడనైతిని అని తన స్వరూపమునకు భిన్నముగా భాసించును. అది అజ్ఞానకల్పితము మాత్రమే.

యథా జలే చంద్రమసః కంపాదిస్తత్కృతో గుణః ।
దృశ్యతేఽసన్నపి ద్రష్టురాత్మనోఽనాత్మనో గుణాః ॥ **11**

యథా = ఏ విధముగానైతే, జలే = నీటియందలి, చంద్రమసః = చంద్రునకు, తత్-కృతః = ఆ నీటిచే చేయబడిన, కంప-ఆదిః = కదులుచుండుట మొదలగు, గుణః = గుణము, అసన్ అపి = లేకున్ననూ, దృశ్యతే = కానవచ్చుచున్నదో, ద్రష్టుః = ద్రష్టయగు, ఆత్మనః = ఆత్మకు, అనాత్మనః = ఆత్మ కానిదాని, గుణాః = గుణములు.

నీటిలో చంద్రుడు ప్రతిఫలించినప్పుడు ఆ నీటికి గల కదలిక మొదలగు గుణములు, ఆ చంద్రునియందు వాస్తవముగా లేకున్ననూ, ఉన్నట్లు కన్పట్టును. అదే విధముగా దృక్ స్వరూపమగు ఆత్మయందు

దేహము మొదలగు అనాత్మల గుణములు వాస్తవముగా లేకున్ననూ, ఉన్నట్లు కానవచ్చుచున్నవి.

స వై నివృత్తిధర్మేణ వాసుదేవానుకంపయా ।
భగవద్భక్తియోగేన తిరోధత్తే శనైరిహ ॥ **12**

సః = ఆ ప్రతీతి ( ఆ అనాత్మగుణము), నివృత్తిధర్మేణ = క్రియల నుండి ఉపరతి అనే ధర్మముచే, వాసుదేవ-అనుకంపయా = ఆ వాసుదేవుని కృపచే, భగవద్-భక్తియోగేన = భగవంతునిపై భక్తి అనే ఉపాయముచే, శనైః = మెల్లగా, వై = నిశ్చయముగా, తిరోధత్తే = అంతర్ధానమగును.

జిజ్ఞాసువు క్రియలనుండి (కర్తృత్వమునుండి) ఉపరతిని చెంది, వాసుదేవుని అనుగ్రహమును బడసి, ఆ భగవానునియందు భక్తిని చేసిన నాడు, ఆత్మయందు అనాత్మధర్మముల ఆ అధ్యాస మెల్లగా, కాని నిశ్చితముగా దూరమగును.

యదేంద్రియోపరామోఽథ ద్రష్ట్రాత్మని పరే హరౌ ।
విలీయంతే తదా క్లేశాస్సంసుప్తస్యేవ కృత్స్నశః ॥ **13**

యదా = ఏ కాలమునందు, ద్రష్టృ-ఆత్మని = ద్రష్టయొక్క స్వరూపమైన, పరే = పరమాత్మయగు, హరౌ = శ్రీహరియందు, ఇంద్రియ-ఉపరామః = ఇంద్రియముల ఉపరతి కలుగునో, అథ = వెనువెంటనే, తదా = ఆ సమయమునందు, సంసుప్తస్య ఇవ = గాఢనిద్రలోనున్నవానికి వలె, క్లేశాః = చిత్తమలములు, కృత్స్నశః = పూర్తిగా, విలీయంతే = నశించును.

మానవుని చిత్తములో అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము అనే క్లేశములు (మలములు) గలవు. ఏ కాలములో ఇంద్రియములు సంసారమునుండి విరమించి ద్రష్టయగు జీవుని స్వరూపమైన శ్రీహరి పరమాత్మయందు విలీనమగునో, అదే క్షణములో మానవుని క్లేశములు, గాఢనిద్రలో నున్నవానికి వలె, నాశమును పొందును.

అశేషసంక్లేశశమం విధత్తే గుణానువాదశ్రవణం మురారేః ।

కుతః పునస్తచ్చరణారవిందపరాగసేవారతిరాత్మలబ్ధా ॥ 14

ముర-అరేః = ముర అనే రాక్షసుని సంహరించిన శ్రీహరియొక్క, గుణ-అనువాదశ్రవణమ్ = గుణములను వినుట మరియు కీర్తించుట, అశేష సంక్లేశశమమ్ = సకలక్లేశముల శాంతిని, విధత్తే = చేయుచున్నది, తత్-చరణ-అరవిందపరాగసేవారతిః = ఆయన పాదపద్మముల పరాగమును సేవించుటయందలి ప్రీతి, ఆత్మలబ్ధా = మనస్సునందు పొందబడినది, కుతః పునః = ఇక చెప్పునదేమున్నది?

మురారి గుణములను కీర్తించుట, వినుట వలన క్లేశములన్నియు శాంతించును. ఇట్టి స్థితిలో, మనస్సునకు ఆయన పాదపద్మములను సేవించుటయందు ప్రీతి యేర్పడినచో, ఇక చెప్పునదేమున్నది?

విదుర ఉవాచ ।
సంఛిన్నస్సంశయో మహ్యం తవ సూక్తాసినా విభో ।
ఉభయత్రాపి భగవన్మనో మే సంప్రధావతి ॥ 15

విభో = ఓ ప్రభూ!, తవ = నీ, సూక్త-అసినా = మంచి పలుకులు అనే కత్తిచే, మహ్యమ్ = నా కొరకు, సంశయః = సందేహము, సంఛిన్నః = పూర్తిగా ఛేదించబడినది, భగవన్ = ఓ పూజ్యా!, మే = నా, మనః = మనస్సు, ఉభయత్ర అపి = ఈశ్వరుని స్వాతంత్ర్యము జీవుని పరతంత్రత్వము (బంధ మోక్షములు) అనే రెండింటియందు, సంప్రధావతి = చక్కగా ప్రవేశించుచున్నది.

ఓ ప్రభూ! నీ పలుకులు అనే చురకత్తి నా సందేహములను ఛేదించివేసినది. ఓ పూజ్యా! ఈశ్వరుని స్వతంత్రత, జీవుని పరతంత్రత మరియు కల్పితమగు బంధము, నిత్యమగు మోక్షము అనే రెండు అంశములయందు ఇప్పుడు నా మనస్సు చక్కగా ప్రవేశించుచున్నది; అనగా, విరోధాభాసలతో ఇబ్బంది పడుట లేదు.

సాధ్వేతద్వ్యాహృతం విద్వన్నాత్మమాయాయనం హరేః ।
ఆభాత్యపార్థం నిర్మూలం విశ్వమూలం న యద్బహిః ॥ 16

విద్వన్ = ఓ విద్వాంసుడా!, ఏతత్ = ఇది, సాధు = చక్కగా, వ్యాహృతమ్ = చెప్పబడినది, హరేః = శ్రీహరియొక్క, ఆత్మమాయా-అయనమ్ = తన మాయయే ఆశ్రయముగా గల, విశ్వమూలమ్ = జగత్తునకు మూలమగు, అప-అర్థమ్ = ఉనికి లేకున్ననూ భాసించే జీవత్వము, నిర్మూలమ్ = స్వయముగా మూలము లేనిదియై, బహిః = బాహ్యమునందు, న = లేనిది, ఆభాతి = భాసించుచున్నది అని, యత్ = దేనిని పలికితివో.

ఓ విద్వాంసుడా! నీవు చక్కగా చెప్పితివి. మానవునకు తనలో భాసించే క్లేశములు మొదలగు వాటికి శ్రీహరియొక్క మాయయే కారణము. ఆత్మకంటె భిన్నము కాని జగత్తు భిన్నముగా నున్నట్లు, మిథ్యాభూతమగు జగత్తు యథార్థమా యన్నట్లు భాసించుటకు మూలములో జీవుని ఆ అజ్ఞానమే ఉన్నది.

యశ్చ మూఢతమో లోకే యశ్చ బుద్ధేః పరం గతః ।
తావుభౌ సుఖమేధేతే క్లిశ్యత్యంతరితో జనః ॥ 17

లోకే = లోకమునందు, యః = ఎవడైతే, మూఢతమః = మిక్కిలి మూర్ఖుడో, చ = మరియు, యః = ఎవడైతే, బుద్ధేః = బుద్ధికి, పరమ్ = అతీతమగు ఆత్మను, గతః = తెలుసుకున్నాడో, తౌ = ఆ, ఉభౌ = ఇద్దరు, సుఖమ్ = సుఖముగా, ఏధేతే = వర్ధిల్లుచున్నారు, అంతరితః = మధ్యలోనున్న, జనః = మానవుడు, క్లిశ్యతి = క్లేశమును పొందుచున్నాడు.

ఈ లోకములో పరమమూర్ఖుడు మరియు బుద్ధికి అతీతమగు ఆత్మయొక్క సాక్షాత్కారము గల జ్ఞాని అనే ఇద్దరు సుఖముగా వర్ధిల్లుచున్నారు. ఈ రెండు అవస్థలకు మధ్యలో సంశయముతో వ్రేలాడే జనులు మాత్రము క్లేశముల ననుభవించుచున్నారు.

అర్థాభావం వినిశ్చిత్య ప్రతీతస్యాపి నాత్మనః ।
తాం చాపి యుష్మచ్చరణసేవయాహం పరాణుదే ॥ 18

ప్రతీతస్య అపి = భాసించుచున్నదే అయినప్పటికీ, నాత్మనః = అనాత్మకు, అర్థ-అభావమ్ = వస్తుత్వము లేకుండుటను, వినిశ్చిత్య = నిశ్చ

యించుకొని, తాం చ అపి = ఆ ప్రతీతి (కనబడుట) ని కూడ, అహమ్ = నేను, యుష్మత్-చరణసేవయా = మీ పాదముల సేవచే, పరాణుదే = నెట్టి వేసెదను.

అనాత్మ (ఆత్మ కానిది) వస్తువు (యథార్థమగు ఉనికి గలది) కాదు. అయిననూ, అది వస్తువు వలె కనబడుచున్నది. నేను మీ పాదములను సేవించి, దాని ప్రభావముచే ఈ ప్రతీతిని కూడ తొలగించుకొనెదను.

యత్సేవయా భగవతః కూటస్థస్య మధుద్విషః ।
రతిరాసో భవేత్తీవ్రః పాదయోర్వ్యసనార్దనః ॥ 19

యత్-సేవయా = ఏ నీ పాదముల సేవచే, కూటస్థస్య = నిర్వికారుడు, మధుద్విషః = మధు అనే రాక్షసుని సంహరించినవాడు (రాగమును పోగొట్టువాడు) అగు, భగవతః = శ్రీకృష్ణ భగవానుని, పాదయోః = పాదములయందు, వ్యసన-అర్దనః = దుఃఖములను పోగొట్టే, తీవ్రః = ఉత్కటమగు, రతిరాసః = ప్రేమోత్సవము, భవేత్ = కలుగునో.

నీ పాదములను సేవించుటచే, నిర్వికారుడు మరియు మధు అనే రాక్షసుని (సంసారమునందలి ఆసక్తిని) దునుమాడినవాడు అగు శ్రీహరి భగవానుని పాదములయందు తీవ్రమగు ప్రేమ కలిగి, ఆ ప్రేమ ఉత్సవముగా వర్ధిల్లి, క్లేశములు దూరమగును.

దురాపా హ్యల్పతపసస్సేవా వైకుంఠవర్త్మసు ।
యత్రోపగీయతే నిత్యం దేవదేవో జనార్దనః ॥ 20

అల్పతపసః = అల్పమగు తపస్సు గలవానికి, వైకుంఠవర్త్మసు = శ్రీహరి మార్గము అయినవారియందు, సేవా = సేవ, దురాపా హి = పొంద శక్యము కానిది గదా!, యత్ర = ఎవరు ఉండగా, నిత్యమ్ = నిత్యము, దేవదేవః = దేవదేవుడు, జన-అర్దనః = దుష్టజనులను పీడించువాడు అగు భగవానుడు, ఉపగీయతే = కీర్తింపబడుచున్నాడో.

మహాత్ములు శ్రీహరిని చేరే మార్గము వంటి వారు. చిన్న తపస్సును చేసిన వారికి వారి సేవ దుర్లభము. వారి సన్నిధిలో ఎల్లవేళలా దేవదేవుడగు జనార్దనుడు కీర్తింపబడుచుండును.

సృష్ట్వాగ్రే మహదాదీని సవికారాణ్యనుక్రమాత్ ।
తేభ్యో విరాజముద్ధృత్య తమను ప్రావిశద్విభుః ॥ 21

అగ్రే = సృష్టికి పూర్వమునందు, సవికారాణి = పంచభూతములు మొదలగు వికారములతో గూడిన, మహత్-ఆదీని = మహత్తత్త్వము మొదలగు వాటిని, అనుక్రమాత్ = వరుసగా, సృష్ట్వా = సృష్టించి, తేభ్యః = వాటి నుండి, విరాజమ్ = విరాట్ పురుషుని, ఉద్ధృత్య = ఉత్పన్నము చేసి, అను = తరువాత, విభుః = సర్వవ్యాపకుడగు పరమేశ్వరుడు, తమ్ = ఆ విరాట్ పురుషుని, ప్రావిశత్ = ప్రవేశించెను.

సర్వతత్త్వములను వ్యాపించియుండే భగవానుడు సృష్ట్యాదియందు పంచభూతములు మొదలగు వికారములతో గూడిన మహత్తత్త్వము మొదలగు వాటిని సృష్టించి, వాటి అంశలతో విరాట్ పురుషుని ప్రకటింప జేసి, తరువాత ఆయన ఆ పురుషునియందు సత్తా (ఉనికి)-స్ఫురణము (తెలివి) ల రూపముగా ప్రవేశించెను; అనగా ఉపలభ్యుడగుచున్నాడు.

యమాహురాద్యం పురుషం సహస్రాంఘ్ర్యూరుబాహుకమ్ ।
యత్ర విశ్వ ఇమే లోకాస్సవికాసం సమాసతే ॥ 22

సహస్ర-అంఘ్రి-ఊరుబాహుకమ్ = అనంతములగు పాదములు ఊరువులు మరియు బాహువులు గల, యమ్ = ఏ విరాట్ పురుషుని, అద్యమ్ = మొట్టమొదటి, పురుషమ్ = పురుషుడని, ఆహుః = చెప్పుచున్నారో, యత్ర = ఎవనియందు, ఇమే = ఈ, విశ్వే = అన్ని, లోకాః = లోకములు (ప్రాణులు), సవికాసమ్ = విస్తరించిన రూపము కలుగునట్లుగా, సమాసతే = నిలిచియున్నవో.

విరాట్ పురుషుడు ఆది పురుషుడు. ఆయనకు అనంతములగు పాదములు ఊరువులు మరియు బాహువులు గలవని మహాత్ములు చెప్పు

చున్నారు. ఈ సమస్తలోకములు, వాటిలోని సకలప్రాణులు ఆయనయందు సంకోచము లేకుండగా, తమ తమ విస్తృతరూపములతో ఇమిడియున్నవి.

యస్మిన్ దశవిధః ప్రాణస్సేంద్రియార్థేంద్రియస్త్రివృత్ ।
త్వయేరితో యతో వర్ణాస్తద్విభూతీర్వదస్వ నః ॥ 23

యస్మిన్ = ఏ విరాట్ పురుషునియందు, స-ఇంద్రియ-అర్థ-ఇంద్రియః = ఇంద్రియగోచరములగు విషయములతో మరియు ఇం ద్రియములతో గూడిన, దశవిధః = పదిరకముల, త్రివృత్ = మూడు శక్తుల గా ప్రకటమయ్యే, ప్రాణః = ప్రాణము, యతః = ఎవనినుండి, వర్ణాః = వర్ణ ములు పుట్టినవో, త్వయా = నీచే, ఈరితః = చెప్పబడినాడు, తత్-విభూ ః = ఆయన మహిమలను, నః = మా కొరకు, వదస్వ = చెప్పుము.

నీవు విరాట్ పురుషుని వర్ణించియుంటి ). ఇంద్రియములు, వాటికి గోచరమయ్యే శబ్దము మొదలగు విషయములు మరియు వాటి అధిష్ఠాన దేవతలతో సహా పది విధముల ప్రాణము ఆయనయందే ఉన్నది. ఇచ్ఛా-జ్ఞాన-క్రియా శక్తుల రూపములో ప్రకటమయ్యే ప్రాణశక్తి ఆయనయందు నెలకొని యున్నది. వర్ణములు ఆయననుండియే పుట్టినవి. ఆయన విభూతులను మాకు చెప్పుము.

యత్ర పుత్రైశ్చ పౌత్రైశ్చ నప్తృభిస్సహ గోత్రజైః ।
ప్రజా విచిత్రాకృతయ ఆసన్ యాభిరిదం తతమ్ ॥ 24

యత్ర = ఎవనియందు, విచిత్ర-ఆకృతయః = అనేకవిధముల దేహములు గల, ప్రజాః = ప్రజ (సంతానము) లు, పుత్రైః = పుత్రులతో, చ = మరియు, పౌత్రైః = పౌత్రులతో, చ = మరియు, నప్తృభిః = మనుమరాండ్లతో (మునిమనుమలతో), గోత్రజైః = సగోత్రీకులతో, సహ = కూడి, ఆసన్ = ఉండిరో, యాభిః = ఎవరిచే, ఇదమ్ = ఈ జగత్తు, తతమ్ = వ్యాప్తమై యున్నదో.

అనేక విధముల దేహములు గల ప్రాణులు తమ పుత్రులతో, పౌత్రులతో, మనుమరాండ్లతో, మునిమనుమలతో మరియు తమ వంశీయు

లతో కలిసి ఆ విరాట్ పురుషునియందు మాత్రమే ఉనికిని కలిగియున్నారు. వీరిచే ఈ జగత్తు అంతయు నిండియున్నది.

ప్రజాపతీనాం స పతిశ్చక్లృపే కాన్ ప్రజాపతీన్ ।
సర్గాంశ్చైవానుసర్గాంశ్చ మనూన్మన్వంతరాధిపాన్ ॥ 25

ప్రజాపతీనామ్ = ప్రజాపతులకు, పతిః = ప్రభువగు, సః = ఆ విరాట్ పురుషుడు, కాన్ = ఏ, ప్రజాపతీన్ = ప్రజాపతులను, సర్గాన్ = సర్గములను, చ ఏవ = మరియు, అనుసర్గాన్ = తరువాత వచ్చిన సర్గములను, మన్వంతర-అధిపాన్ = మన్వంతరములకు ప్రభువులగు, మనూన్ = మనువులను, చక్లృపే = సృష్టించెను?

మరీచి మొదలగు ప్రజాపతులకు కూడ ప్రభువగు ఆ విరాట్ పురుషుడు ఏయే ప్రజాపతులను, సర్గములను, అనుసర్గములను మరియు మన్వంతరాధిపతులగు స్వాయంభువాది మనువులను సృష్టించినాడు?

ఏతేషామపి వంశాంశ్చ వంశానుచరితాని చ ।
ఉపర్యధశ్చ యే లోకా భూమేర్మిత్రాత్మజాసతే ॥ 26

మిత్రాత్మజ = ఓ మైత్రేయా!, ఏతేషామ్ = ఈ మనువుల, వంశాన్ = వంశములను, చ = మరియు, వంశ-అనుచరితాని చ = ఆ వంశములకు చెందిన రాజుల చరిత్రలను, భూమేః = భూమికి, ఉపరి = పైన, చ = మరియు, అధః = క్రింద, యే = ఏ, లోకాః = లోకములు, ఆసతే = ఉన్నవో.

ఓ మైత్రేయా! ఆ మనువుల వంశములను, ఆ వంశములకు చెందిన రాజుల చరిత్రలను, భూమికి పైన క్రింద ఉన్న లోకములను కూడ వర్ణించుము.

తేషాం సంస్థాం ప్రమాణం చ భూర్లోకస్య చ వర్ణయ ।
తిర్యఙ్మానుషదేవానాం సరీసృపపతత్త్రిణామ్ ।
వద నస్సర్గసంవ్యూహం గార్భస్వేదద్విజోద్భిదామ్ ॥ 27

తేషామ్ = ఆ లోకములయొక్క, చ = మరియు, భూర్లోకస్య చ = భూలోకముయొక్క, సంస్థామ్ = సన్నివేశము (స్థితి) ను, ప్రమాణమ్ = విస్తారమును, వర్ణయ = వర్ణించుము, తిర్యక్-మానుషదేవానామ్ = పశుపక్ష్యాదులు మానవులు దేవతలు అనువారి, సరీసృపపతత్త్రిణామ్ = సరీసృపముల పక్షుల, గార్భస్వేదద్విజ-ఉద్భిదామ్ = గర్భమునుండి స్వేదమునుండి గ్రుడ్డునుండి మరియు నేలనుండి పుట్టే ప్రాణుల, సర్గసంవ్యూహమ్ = సృష్టివిభాగమును, నః = మా కొరకు, వద = చెప్పుము.

భూలోకముతో బాటు ఆ లోకముల సన్నివేశమును, విస్తారమును వర్ణించుము. పశువులు, మానవులు, దేవతలు, సరీసృపములు (పాము మొదలగు ప్రాకే జంతువులు), పక్షులు, తల్లి గర్భమునుండి పుట్టే ప్రాణులు, స్వేదమునుండి పుట్టే పేలు మొదలగు ప్రాణులు, గ్రుడ్డునుండి పుట్టే కోడి మొదలగు ప్రాణులు, నేలను చీల్చుకొని పుట్టే మొక్కలు అనువాటి సృష్టిలోని విభాగమును మాకు బోధించుము.

గుణావతారైర్విశ్వస్య సర్గస్థిత్యప్యయాశ్రయమ్ ।
సృజతశ్శ్రీనివాసస్య వ్యాచక్ష్వోదారవిక్రమమ్ ॥ 28

గుణ-అవతారైః = సత్త్వరజస్తమోగుణములు ప్రధానముగా గల అవతారములచే, సృజతః = సృష్టిని చేయుచున్న, శ్రీనివాసస్య = శ్రీనివాసుని, విశ్వస్య = జగత్తుయొక్క, సర్గస్థితి-అప్యయ-ఆశ్రయమ్ = సృష్టిస్థితిలయములకు ఆధారమైన, ఉదారవిక్రమమ్ = గొప్ప లీలను, వ్యాచక్ష్వ = వివరించి చెప్పుము.

ఆదికారణుడగు శ్రీనివాసుడు రజస్సత్త్వతమోగుణములను ఉపాధిగా చేసుకొని బ్రహ్మ-విష్ణు-రుద్రరూపములను దాల్చి జగత్తును క్రముగా సృష్టించి పాలించి సంహరించుచున్నాడు. ఈ జగత్కార్యమునకు సంబంధించి ఆ శ్రీనివాసుని గొప్ప లీలలను వివరముగా చెప్పుము.

వర్ణాశ్రమవిభాగాంశ్చ రూపశీలస్వభావతః ।
ఋషీణాం జన్మకర్మాది వేదస్య చ వికర్షణమ్ ॥ 29

రూపశీలస్వభావతః = వేషము శీలము మరియు స్వభావములను బట్టి, వర్ణ-ఆశ్రమవిభాగాన్ = వర్ణాశ్రమవిభాగములను, చ = మరియు, ఋషీణామ్ = మహర్షుల, జన్మకర్మ-ఆది = పుట్టుక క్రియలు మొదలగువాటిని, వేదస్య = వేదముయొక్క, వికర్షణమ్ = విభాగమును (చెప్పుము).

వేషము, శీలము మరియు స్వభావము అనువాటిని బట్టి వర్ణాశ్రమముల విభాగమును, మహర్షుల పుట్టుకను, వారు చేసిన కర్మలను, మరియు వేదవిభాగమును వర్ణింపుము.

యజ్ఞస్య చ వితానాని యోగస్య చ పథః ప్రభో ।
నైష్కర్మ్యస్య చ సాంఖ్యస్య తంత్రం వా భగవత్స్మృతమ్ ॥30

ప్రభో = ఓ ప్రభూ!, చ = మరియు, యజ్ఞస్య = యజ్ఞముయొక్క, వితానాని = విస్తారములను, యోగస్య = కర్మయోగముయొక్క, నైష్కర్మ్యస్య = కర్మసన్న్యాసపూర్వక జ్ఞాననిష్ఠయొక్క, చ = మరియు, సాంఖ్యస్య = ప్రకృతిపురుషవివేకముయొక్క, పథః = మార్గములను, భగవత్-స్మృతమ్ = భగవంతునిచే నిర్మించబడిన, తంత్రం వా = తంత్రమును కూడ (చెప్పుము).

ఓ ప్రభూ! ఇంతేగాక, యజ్ఞముయొక్క విస్తారమును, కర్మయోగమార్గమును, సర్వకర్మసన్న్యాసపూర్వకమగు జ్ఞాననిష్ఠను, ప్రకృతిపురుషవివేకముయొక్క మార్గమును మాత్రమే గాక, భగవంతునిచే సృష్టించబడిన నారదపాంచరాత్రము మొదలగు తంత్రములను కూడ వర్ణించి చెప్పుము.

పాఖండపథవైషమ్యం ప్రతిలోమనివేశనమ్ ।
జీవస్య గతయో యాశ్చ యావతీర్గుణకర్మజాః ॥ 31

పాఖండపథవైషమ్యమ్ = వేదబహిష్కృతమగు మార్గముల వలన కలిగే విషమత (కల్లోలము) ను, ప్రతిలోమనివేశనమ్ = వివిధజాతుల మధ్య కలిగే సంపర్కమును, జీవస్య = జీవునియొక్క, గుణకర్మజాః = గుణములనుండి కర్మలనుండి పుట్టే, యావతీః = ఎన్ని, చ = మరియు, యాః = ఏ, గతయః = గతులు గలవో (వాటిని చెప్పుము).

వేదముచే తిరస్కరించబడిన మార్గములను అనుసరించువారు సమాజములో సృష్టించే కల్లోలములను గురించి చెప్పుము. వివిధజాతుల మధ్య సంబంధముల పరిణామమును కూడ వర్ణించుము. జీవులు తమ తమ గుణములకు మరియు కర్మలకు అనురూపమగు గతులను పొందు చుందురు. అవి యెన్ని రకములు? వాటి వివరములు ఎట్టివి?

ధర్మార్థకామమోక్షాణాం నిమిత్తాన్యవిరోధతః ।
వార్తాయా దండనీతేశ్చ శ్రుతస్య చ విధిం పృథక్ ॥ 32

ధర్మ-అర్థకామమోక్షాణామ్ = ధర్మార్థకామమోక్షముల, నిమిత్తాని = ఉపాయములను, అవిరోధతః = పరస్పరవిరోధము లేని విధముగా, వార్తాయాః = వాణిజ్యముయొక్క, దండనీతేః = దండనీతియొక్క, చ = మరియు, శ్రుతస్య = శాస్త్రశ్రవణముయొక్క, విధిం చ = విధిని కూడా.

మానవుడు ఒకదానితో మరియొకదానికి విరోధము లేని విధముగా ధర్మార్థకామమోక్షములనే పురుషార్థములను సంపాదించుకొన వలెను గదా! ఆ విధానమును చెప్పుము. వాణిజ్యము, దండనీతి మరియు శాస్త్రశ్రవణము అనువాటి విధానమును కూడ వర్ణించి చెప్పుము.

శ్రాద్ధస్య చ విధిం బ్రహ్మన్ పిత్ర్యాణాం సర్గమేవ చ ।
గ్రహనక్షత్రతారాణాం కాలావయవసంస్థితిమ్ ॥ 33

బ్రహ్మన్ = ఓ మహాత్మా!, శ్రాద్ధస్య = శ్రాద్ధముయొక్క, విధిమ్ = విధానమును, పిత్ర్యాణామ్ = పితృదేవతల, సర్గం ఏవ చ = సృష్టిని కూడ, చ = మరియు, గ్రహనక్షత్రతారాణామ్ = గ్రహములు, నక్షత్రములు, తారకలు అనువాటి, కాల-అవయవసంస్థితిమ్ = కాలచక్రములో భాగములై ఉన్న విధానమును (చెప్పుము).

ఓ మహాత్మా! శ్రాద్ధవిధిని, పితృదేవతల సృష్టిని వివరించుము. కాలచక్రములో గ్రహములు, నక్షత్రములు, తారకలు ఏ విధముగా భాగమై యున్నవో వివరించుము.

దానస్య తపసో వాపి యచ్చేష్టాపూర్తయోః ఫలమ్ ।

ప్రవాసస్థస్య యో ధర్మో యశ్చ పుంస ఉతాపది ॥ 34

దానస్య = దానమునకు, తపసః వా = మరియు తపస్సునకు, చ = మరియు, ఇష్టాపూర్తయోః = ఇష్టాపూర్తములనే కర్మలకు, యత్ = ఏ, ఫలమ్ = ఫలము గలదో దానిని, ప్రవాసస్థస్య = పరదేశములోనున్నవానికి, యః = ఏ, ధర్మః = ధర్మము గలదో, ఉత = మరియు, ఆపది = ఆపదయందు, పుంసః = పురుషునకు, యః చ = ఏ ధర్మము గలదో (దానిని చెప్పుము).

దానమునకు, తపస్సునకు, యజ్ఞయాగాది కర్మలకు, నూతులను చెరువులను త్రవ్వించుట మొదలగు ప్రజాహితకార్యములను చేయుటకు లభించే పుణ్యఫలము ఎట్టిది? పరదేశములోనున్న వానికి, ఆపదలోనున్న వానికి ఏది ధర్మము?

యేన వా భగవాంస్తుష్యేద్ధర్మయోనిర్జనార్దనః ।
సంప్రసీదతి వా యేషామేతదాఖ్యాహి మేఽనఘ ॥ 35

ధర్మయోనిః = ధర్మమునకు మూలము, జన-అర్దనః = అధర్మాత్ములను శిక్షించువాడు అగు, భగవాన్ = శ్రీకృష్ణ భగవానుడు, యేన వా = ఏ మార్గముచే, తుష్యేత్ = సంతోషించును?, యేషాం వా = ఎట్టివారికి, సంప్రసీదతి = చక్కగా ప్రసన్నుడగును?, అనఘ = ఓ పుణ్యాత్మా!, మే = నా కొరకు, ఏతత్ = ఈ విషయమును, ఆఖ్యాహి = చెప్పుము.

ఓ పుణ్యాత్మా! ధర్మమునకు మూలమగు ఆ శ్రీకృష్ణ భగవానుడు అధర్మాత్ములను శిక్షించును. సాధకుడు ఏ మార్గమునను సరించినచో, ఆయన సంతసిల్లును? ఎట్టివారిపై ఆయన ప్రసన్నుడగును? నాకీ విషయమును చెప్పుము.

అనువ్రతానాం శిష్యాణాం పుత్రాణాం చ ద్విజోత్తమ ।
అనాపృష్టమపి బ్రూయుర్గురవో దీనవత్సలాః ॥ 36

ద్విజ-ఉత్తమ = ఓ బ్రాహ్మణశ్రేష్ఠా!, అనువ్రతానామ్ = నిష్ఠగా సేవించే, శిష్యాణామ్ = శిష్యులకు, చ = మరియు, పుత్రాణామ్ = పుత్రుల

కు, దీనవత్సలాః = దీనులపై దయగల, గురవః = గురువులు, అనాపృష్టం అపి = అడుగబడక పోయిననూ, బ్రూయుః = చెప్పెదరు.

ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! గురువులు దీనులపై దయను కలిగియుందురు. వారు నిష్ఠగా సేవించే శిష్యులకు మరియు తమ పుత్రులకు అడుగకుండగనే జ్ఞానమును ఇచ్చెదరు.

తత్త్వానాం భగవంస్తేషాం కతిధా ప్రతిసంక్రమః ।
తత్రేమం క ఉపాసీరన్ క ఉ స్విదనుశేరతే ।। 37

భగవన్ = ఓ పూజ్యా!, తేషామ్ = ఆ, తత్త్వానామ్ = మహత్తు మొదలగు తత్త్వముల, ప్రతిసంక్రమః = ప్రళయము, కతిధా = ఎన్ని విధములుగా నున్నది?, తత్ర = ఆ ప్రళయమునందు, ఇమమ్ = ఈ భగవానుని, కే = ఏ తత్త్వములు, ఉపాసీరన్ = సేవించును?, కే ఉ స్విత్ = మరి ఏవి, అనుశేరతే = అనుసరించి నిద్రించును?

ఓ పూజ్యా! మహత్తు మొదలగు ఆ తత్త్వముల ప్రళయము ఎన్ని విధములు? ప్రళయములో భగవానుని ఏ తత్త్వములు సేవించును? ఏ తత్త్వములు యోగనిద్రను పొందియున్న భగవానుని అనుసరించి తాము కూడ విలీనమగును?

పురుషస్య చ సంస్థానం స్వరూపం వా పరస్య చ ।
జ్ఞానం చ నైగమం యత్తద్గురుశిష్యప్రయోజనమ్ ।। 38

పురుషస్య = జీవుని, సంస్థానమ్ = తత్త్వమును, చ = మరియు, పరస్య = పరమేశ్వరుని, స్వరూపం వా = స్వరూపమును, చ = మరియు, నైగమమ్ = ఉపనిషత్తులకు చెందిన, జ్ఞానమ్ = జ్ఞానమును, యత్ = ఏ, గురుశిష్యప్రయోజనమ్ = గురుశిష్యుల ప్రయోజనము గలదో, తత్ = దానిని (చెప్పుము).

జీవుని తత్త్వమేమి? పరమేశ్వరుని స్వరూపమేమి? ఉపనిషత్తుల జ్ఞానమును, గురుశిష్యుల పరస్పరప్రయోజనమును కూడ చెప్పుము.

నిమిత్తాని చ తస్యేహ ప్రోక్తాన్యనఘ సూరిభిః ।
స్వతో జ్ఞానం కుతః పుంసాం భక్తిర్వైరాగ్యమేవ వా ॥ 39

అనఘ = ఓ పుణ్యాత్మా!, ఇహ = ఈ విషయములో, తస్య = ఆ జ్ఞానమునకు, సూరిభిః = విద్వాంసులచే, ప్రోక్తాని = చెప్పబడిన, నిమిత్తాని = సాధనములను (చెప్పుము), పుంసామ్ = మానవులకు, స్వతః = తమంత తాముగా, జ్ఞానమ్ = జ్ఞానము గాని, భక్తిః = భక్తి గాని, వైరాగ్యం ఏవ వా = వైరాగ్యము గాని, కుతః = ఎక్కడిది?

ఓ అనఘా! ఆ జ్ఞానమును పొందుటకు విద్వాంసులు ఏయే సాధనములను చెప్పినారు? ఏలయనగా, సాధన లేకుండగా, మానవులకు భక్తి జ్ఞానవైరాగ్యములు తమంత తాముగా ఎట్లు కలుగును?

ఏతాన్మే పృచ్ఛతః ప్రశ్నాన్ హరేః కర్మవివిత్సయా ।
బ్రూహి మేఽజ్ఞస్య మిత్రత్వాదజయా నష్టచక్షుషః ॥ 40

అజ్ఞస్య = అజ్ఞానిని, అజయా = అనాదియగు అవిద్యచే, నష్టచక్షుషః = నశింపజేయబడిన జ్ఞాననేత్రము గలవాడను, హరేః = శ్రీహరియొక్క, కర్మవివిత్సయా = లీలలను తెలియవలెననే కోరికతో, ఏతాన్ = ఈ, ప్రశ్నాన్ = ప్రశ్నలను, పృచ్ఛతః = అడుగుచున్న, మే = నాకు, మిత్రత్వాత్ = మిత్రుడవగుట వలన, మే = నా కొరకు, బ్రూహి = చెప్పుము.

నేను అనాదియగు అవిద్యచే మూసివేయబడిన జ్ఞాననేత్రము గల అజ్ఞానిని. కాని, నేను శ్రీహరియొక్క లీలలను తెలియగోరుచున్నాను. నీవు నా మిత్రుడవు. కావున, నేను అడిగిన ప్రశ్నలకు ఉత్తరమును చెప్పుము.

సర్వే వేదాశ్చ యజ్ఞాశ్చ తపో దానాని చానఘ ।
జీవాభయప్రదానస్య న కుర్వీరన్ కలామపి ॥ 41

అనఘ = ఓ పుణ్యాత్మా!, సర్వే = అన్ని, వేదాః = వేదములు, యజ్ఞాః = యజ్ఞములు, దానాని = దానములు, చ = మరియు, తపః = తపస్సు, జీవ-అభయప్రదానస్య = జీవునకు అభయమునిచ్చుటయొక్క, కలాం అపి = అంశమునైననూ, న కుర్వీరన్ = చేయవు.

ఓ పుణ్యాత్మా! సకల వేదములు, యజ్ఞములు, దానములు మరియు తపస్సులు జీవునకు ధర్మమును బోధించి అభయమునిచ్చుట అనే పుణ్యకార్యముయొక్క అంశముతో అయిననూ సరిగావు.

శ్రీశుక ఉవాచ ।
స ఇత్థమాపృష్టపురాణకల్పః
కురుప్రధానేన మునిప్రధానః ।
ప్రవృద్ధహర్షో భగవత్కథాయాం
సంచోదితస్తం ప్రహసన్నివాహ ।। 42

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
సప్తమోఽధ్యాయః ।।

ఇత్థమ్ = ఈ విధముగా, కురుప్రధానేన = కురువంశశ్రేష్ఠుడగు విదురునిచే, ఆపృష్టపురాణకల్పః = ప్రశ్నించబడిన పురాణములలోని గొప్ప అర్థము గల, సః = ఆ, మునిప్రధానః = మైత్రేయ మహర్షి, భగవత్-కథాయామ్ = భగవంతుని గాథయందు, సంచోదితః = ప్రేరేపించబడినవాడై, ప్రవృద్ధహర్షః = వర్ధిల్లిన హర్షము గలవాడై, ప్రహసన్ ఇవ = చిరునవ్వు గలవాడై, తమ్ = ఆ విదురుని ఉద్దేశించి, ఆహ = పలికెను.

ఈ విధముగా కురువంశ శ్రేష్ఠుడగు విదురుడు మైత్రేయ మహర్షిని పురాణరహస్యమును గురించి ప్రశ్నించెను. భగవంతుని గాథను చెప్పుమని ప్రేరేపించిన కారణముగా ఆయన హృదయము ఆనందముతో నిండిపోయెను. ఆయన చిరునవ్వుతో విదురునితో నిట్లనెను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
ఏడవ అధ్యాయము ముగిసినది (7).

* * * * *

# అథ దశమోఽధ్యాయః

## పది రకముల సృష్టిని వర్ణించుట

విదుర ఉవాచ ।
అంతర్హితే భగవతి బ్రహ్మా లోకపితామహః ।
ప్రజాస్ససర్జ కతిధా దైహికీర్మానసీర్విభుః ।। 1

విదురః = విదురుడు, ఉవాచ = పలికెను, భగవతి = శ్రీహరి భగవానుడు, అంతర్హితే = అంతర్ధానమును చెందగా, లోకపితామహః = లోకములకు పితామహుడు, విభుః = అధీశ్వరుడు అగు, బ్రహ్మా = బ్రహ్మ గారు, దైహికీః = దేహమునుండి పుట్టినవారు, మానసీః = మనస్సునుండి పుట్టినవారు అగు, ప్రజాః = ప్రాణులను, కతిధా = ఎన్ని ప్రకారములుగా, ససర్జ = సృష్టించెను?

విదురుడు ఇట్లు పలికెను --- శ్రీహరి భగవానుడు అంతర్ధానమైన పిదప ముల్లోకములకు అధీశ్వరుడు మరియు పితామహుడు అగు బ్రహ్మ గారు తన దేహమునుండి మరియు మనస్సునుండి ప్రాణులను ఎన్ని ప్రకారములుగా సృష్టించినాడు?

యే చ మే భగవన్ పృష్టాస్త్వయ్యర్థా బహువిత్తమ ।
తాన్ వదస్వానుపూర్వ్యేణ ఛింధి నస్సర్వసంశయాన్ ।। 2

భగవన్ = ఓ పూజ్యా!, బహువిత్తమ = జ్ఞానాధికులలో శ్రేష్ఠుడా!, చ = మరియు, త్వయి = నీయందు, యే = ఏ, అర్థాః = విషయములు, పృష్టాః = ప్రశ్నించబడినవో, తాన్ = వాటిని, మే = నా కొరకు, ఆనుపూర్వ్యేణ = యథాక్రమముగా, వదస్వ = చెప్పుము, నః = మాయొక్క, సర్వసంశయాన్ = సంశయముల నన్నింటినీ, ఛింధి = ఛేదించుము.

సః = అట్టి, అహమ్ = నేను, క్షుల్లసుఖాయ = అల్పమగు సుఖము కొరకు, మహత్ = పెద్ద, దుఃఖమ్ = దుఃఖమును, గతానామ్ = పొందియున్న, నృణామ్ = మానవుల, తస్య = ఆ దుఃఖముయొక్క, విరమాయ = తొలగిపోవుటకై, భాగవతమ్ = భాగవతమనే, పురాణమ్ = పురాణమును, ప్రవర్తయే = ఆరంభించుచున్నాను, యత్ = దేనిని, భగవాన్ = భగవానుడు, సాక్షాత్ = స్వయముగా, ఋషిభ్యః = మహర్షుల కొరకు, ఆహ = చెప్పెనో.

మానవులు అల్పసుఖమును సంపాదించే ప్రయత్నములో పుట్టెడు దుఃఖమును పొందుచుందురు. వారి ఆ దుఃఖమును పోగొట్టుట కొరకై, నీచే ఈ విధముగా ప్రశ్నించబడిన నేను, భాగవత పురాణమునారంభించి చెప్పెదను. దీనిని సాక్షాత్తుగా భగవానుడే మహర్షులకు చెప్పినాడు.

ఆసీనముర్వ్యాం భగవంతమాద్యం
సంకర్షణం దేవమకుంఠసత్త్వమ్ ।
వివిత్సవస్తత్త్వమతః పరస్య
కుమారముఖ్యా మునయోఽన్వపృచ్ఛన్ ॥ 3

ఉర్వ్యామ్ = భూమియందు, ఆసీనమ్ = కూర్చున్నట్టియు, భగవంతమ్ = షడ్గుణసంపన్నుడైనట్టియు, ఆద్యమ్ = సర్వకారణుడైనట్టియు, అకుంఠసత్త్వమ్ = అఖండజ్ఞానస్వరూపుడైనట్టియు, సంకర్షణం దేవమ్ = సంకర్షణ భగవానుని, అతః = ఈయననుండి, పరస్య = పరబ్రహ్మయొక్క, తత్త్వమ్ = యథార్థస్వరూపమును, వివిత్సవః = తెలియగోరిన, కుమారముఖ్యాః = సనత్కుమారుడు మొదలగు, మునయః = మునులు, అను = యథావిధిగా సమీపించిన తరువాత, అపృచ్ఛన్ = ప్రశ్నించిరి.

ఐశ్వర్యము వీర్యము యశస్సు శ్రీ జ్ఞానము మరియు వైరాగ్యము అనే ఆరు గుణములు పూర్ణముగా గలవాడు, సర్వకారణుడు, అఖండజ్ఞాన స్వరూపుడు అగు సంకర్షణ దేవుడు పాతాళ లోకములో ఉండెను. అప్పుడు సనత్కుమారుడు మొదలగు మునులు పరబ్రహ్మ తత్త్వమును తెలియగోరి, ఆయనను యథావిధిగా సమీపించి, ఇట్లు ప్రశ్నించిరి.

స్వమేవ ధిష్ణ్యం బహు మానయంతం
యం వాసుదేవాభిధమామనంతి ।
ప్రత్యగ్ధృతాక్షాంబుజకోశమీష-
దున్మీలయంతం విబుధోదయాయ ॥ 4

స్వమ్ = తనదైన, ధిష్ణ్యమ్ = ఆధారమును, బహు = అధికముగా, మానయంతమ్ = పూజించుచున్నట్టియు, యమ్ = దేనిని, వాసుదేవ-అభిధమ్ = వాసుదేవుడు అను పేరు గలదానినిగా, ఆమనంతి = చెప్పుచున్నారో, ప్రత్యక్-ధృత-అక్ష-అంబుజకోశమ్ = అంతర్ముఖము చేయబడిన పద్మపు మొగ్గ వంటి కన్నులు గలవాడు, విబుధ-ఉదయాయ = సనత్కుమారుడు మొదలగు జ్ఞానుల అభ్యుదయము కొరకై, ఈషత్ = కొంచెము, ఉత్-మీలయంతమ్ = కన్నులను తెరచి చూచువాడు.

సంకర్షణ దేవుడు తనకు ఆశ్రయమగు శ్రీహరిని ధ్యానములో భావించి గొప్పగా పూజించుచుండెను. మహర్షులు ఆ శ్రీహరిని వాసుదేవుడు (సర్వజగన్నివాసుడు మరియు చైతన్యస్వరూపుడు) అని వర్ణించుచుందురు. ఆయన అంతర్ముఖుడై కన్నులను మూసుకొని యుండగా అవి పద్మపు మొగ్గలవలె విరాజిల్లెను. జ్ఞానులగు సనత్కుమారుడు మొదలగువారు ప్రశ్నించగా, ఆయన వారిని అనుగ్రహించుట కొరకై కన్నులను కొద్దిగా తెరచి చూచెను.

స్వర్ధున్యుదార్ద్రైస్స్వజటాకలాపై-
రుపస్పృశంతశ్చరణోపధానమ్ ।
పద్మం యదర్చంత్యహిరాజకన్యాః
స్సప్రేమ నానాబలిభిర్వరార్థాః ॥ 5

స్వర్ధునీ-ఉద-ఆర్ద్రైః = గంగయొక్క నీటితో తడిసియున్న, స్వజటాకలాపైః = తమ జటల సమూహములచే, చరణ-ఉపధానమ్ = పాదపీఠమగు, యత్-పద్మమ్ = ఏ సంకర్షణుని పద్మమును, ఉపస్పృశంతః = స్పృశించుచున్నారో, అహిరాజకన్యాః = నాగరాజుయొక్క కన్యలు, వర

-అర్థాః = వరుని కోరువారై, సప్రేమ = ప్రేమతో కూడియున్న విధముగా, నానాబలిభిః = అనేకములగు ఉపహారములతో, అర్చంతి = పూజిస్తున్నారో.

సనత్కుమారుడు మొదలగు ఆ మహర్షులు గంగాజలములలో స్నానమాడి, తడిగా నున్న తమ జటల సమూహములతో ఆ సంకర్షణ దేవుని పాదపీఠమైన పద్మమును స్పృశించుచున్నారు. నాగరాజకన్యలు తమకు నచ్చిన వరుని పొందగోరి, ఆ పద్మమును ప్రేమతో అనేకములగు ఉపహారములను సమర్పించి పూజించుచున్నారు.

ముహుర్గృణంతో వచసానురాగస్ఖలత్పదేనాస్య కృతాని తజ్జ్ఞాః।
కిరీటసాహస్రమణిప్రవేకప్రద్యోతితోద్దామఫణాసహస్రమ్ ॥ 6

తద్-జ్ఞాః = ఆ సంకర్షణుని లీలలనెరింగిన ఆ మునులు, అనురాగ స్ఖలత్-పదేన = ప్రేమచే తడబడుచున్న పదములు గల, వచసా = వాక్కుతో, అస్య = ఈ సంకర్షణదేవుని, కృతాని = కర్మలను, ముహుః = అనేకపర్యాయములు, గృణంతః = గానము చేయుచున్నవారై, కిరీటసాహస్రమణి ప్రవేకప్రద్యోతిత-ఉద్దామఫణాసహస్రమ్ = వేయి కిరీటములయందలి శ్రేష్ఠమగు మణులచే గొప్పగా ప్రకాశింపజేయబడే పైకి ఎత్తి ఉంచబడిన వేయి పడగలు గల ఆయనను (ప్రశ్నించిరి).

సంకర్షణ దేవుని వేయి కిరీటములలోని శ్రేష్ఠమగు మణుల కాంతులు పైకి ఎత్తి ఉంచబడిన వేయి పడగలను గొప్పగా ప్రకాశింపజేయుచున్నవి. ఆయన లీలలు సనత్కుమారుడు మొదలగు మహర్షులకు తెలిసినవే. ఆయనయందలి భక్త్యావేశముచే వారి మాటలు తడబడుచుండెను. వారాయన లీలలను పలు మార్లు గానము చేసి, ఆయనను ప్రశ్నించిరి.

ప్రోక్తం కిలైతద్భగవత్తమేన
నివృత్తిధర్మాభిరతాయ తేన ।
సనత్కుమారాయ స చాహ పృష్ట-
స్సాంఖ్యాయనాయాంగ ధృతవ్రతాయ ॥ 7

అంగ = ఓ విదురా!, తేన = ఆ, భగవత్తమేన = సంకర్షణ భగవాను నిచే, ఏతత్ = ఈ భాగవతము, నివృత్తిధర్మ-అభిరతాయ = నివృత్తిధర్మము నందు పరాయణుడగు, సనత్కుమారాయ = సనత్కుమారుని కొరకు, ప్రోక్తం కిల = ఉపదేశించ బడెను, పృష్టః = ప్రశ్నించబడిన, సః చ = ఆయన కూడ, ధృతవ్రతాయ = దృఢమగు నిష్ఠగల, సాంఖ్యాయనాయ = సాంఖ్యా యనుని కొరకు, ఆహ = చెప్పెను.

ఓ విదురా! సంకర్షణ భగవానుడు నివృత్తిధర్మపరాయణుడగు సన త్కుమారునకు ఈ భాగవతమును ఉపదేశించెను. సాంఖ్యాయన ముని ఆయన వద్దకు వెళ్లి ప్రశ్నించగా, ఆయన దానిని దృఢవ్రతుడగు ఆ మునికి ఉపదేశించెను.

సాంఖ్యాయనః పారమహంస్యముఖ్యో
వివక్షమాణో భగవద్విభూతీః ।
జగాద సోఽస్మద్గురవేఽన్వితాయ
పరాశరాయాథ బృహస్పతేశ్చ ।। 8

అథ = తరువాత, పారమహంస్యముఖ్యః = సర్వకర్మసన్న్యాసపూ ర్వక జ్ఞాననిష్ఠ అనే ధర్మమే ప్రధానముగా గల, సః = ఆ, సాంఖ్యాయనః = సాంఖ్యాయన మహర్షి, భగవద్-విభూతీః = భగవానుని మహిమలను, వివ క్షమాణః = చెప్పగోరువాడై, అస్మద్-గురవే = మా గురువు, అన్వితాయ = అనుచరుడు అగు, పరాశరాయ = పరాశర మహర్షి కొరకు, చ = మరియు, బృహస్పతేః = బృహస్పతికి, జగాద = చెప్పెను.

సర్వకర్మసన్న్యాసపూర్వక జ్ఞాననిష్ఠ అనే పరమహంసల ధర్మము నందు ఆ సాంఖ్యాయనుడు దిట్ట. తరువాతి కాలములో ఆయన భగవానుని మహిమలను వర్ణించగోరి, ఆ భాగవతమును అనుంగు శిష్యుడగు పరాశరు నకు, బృహస్పతికి చెప్పెను. ఆ పరాశర మహర్షియే మా గురువు.

ప్రోవాచ మహ్యాం స దయాలురుక్తో
మునిః పులస్త్యేన పురాణమాద్యమ్ ।

సోఽహం తవైతత్కథయామి వత్స
శ్రద్ధాలవే నిత్యమనువ్రతాయ ॥ 9

దయాలుః = దయామయుడగు, సః = ఆ, మునిః = పరాశర మహర్షి, పులస్త్యేన = పులస్త్యునిచే, ఉక్తః = చెప్పబడినవాడై, ఆద్యం పురాణమ్ = ఆదిపురాణమగు భాగవతమును, మహ్యామ్ = నా కొరకు, ప్రోవాచ = చెప్పెను, వత్స = ఓ కుమారా!, సః = అట్టి, అహమ్ = నేను, శ్రద్ధాలవే = శ్రద్ధ గలవాడవు, నిత్యమ్ = నిత్యము, అనువ్రతాయ = నిష్ఠతో శుశ్రూషను చేయువాడవు అగు, తవ = నీకు, ఏతత్ = ఈ భాగవతమును, కథయామి = చెప్పుచున్నాను.

పులస్త్య మహర్షి కోరిక ననుసరించి, దయామయుడగు శ్రీ పరాశర మహర్షి ఆదిపురాణమగు భాగవతమును నాకు చెప్పెను. వత్సా! నీవు శ్రద్ధ గలవాడవు, నన్ను నిత్యము నిష్ఠతో సేవిస్తున్నావు. ఆ విధముగా పరాశరమహర్షినుండి నేను వినియున్న ఆ పురాణమును నీకు చెప్పుచున్నాను.

ఉదాఽఽప్లుతం విశ్వమిదం తదాఽఽసీద్
యన్నిద్రయాఽమీలితదృజ్ న్యమీలయత్ ।
అహీంద్రతల్పేఽధిశయాన ఏకః
కృతక్షణస్స్వాత్మరతౌ నిరీహః ॥ 10

యత్ = ఏ కాలమునందైతే, ఏకః = అద్వితీయుడగు నారాయణుడు, స్వ-ఆత్మరతౌ = తన స్వరూపమగు ఆనందమునందు, కృతక్షణః = చేయబడిన ఉత్సాహము గలవాడై, నిరీహః = క్రియ లేనివాడై, అమీలితదృక్ = లోపించని చైతన్యము గలవాడై, అహి-ఇంద్రతల్పే = శేషశయ్యయందు, అధిశయానః = అధిష్ఠించి పరుండియున్నవాడై, నిద్రయా = నిద్రచే, న్యమీలయత్ = కన్నులను మూసుకొనెనో, తదా = అప్పుడు, ఇదమ్ = ఈ, విశ్వమ్ = జగత్తు, ఉదా = నీటిచే, ఆప్లుతమ్ = వ్యాపించబడియుండెను.

సృష్ట్యాదియందు అద్వితీయుడగు నారాయణుడు శేషశయ్యను అధిష్ఠించి పరున్నవాడై యోగనిద్రను ఆశ్రయించి కన్నులను మూసుకొనె

ను. ఆయన సృష్టివ్యాపారమునుండి విరమించి, తన స్వరూపమగు ఆనందమునందు వేడుక గలవాడై యుండెను. ఆయన యోగనిద్రయందు ఉన్ననూ, లోపించని చైతన్యశక్తి గలవాడే. ఆ సమయములో ఈ బ్రహ్మాండమంతయు నీటిచే వ్యాపించబడి యుండెను.

సోఽంతశ్శరీరేఽర్పితభూతసూక్ష్మః
కాలాత్మికాం శక్తిముదీరయాణః ।
ఉవాస తస్మిన్ సలిలే పదే స్వే
యథానలో దారుణి రుద్ధవీర్యః ॥ 11

అంతః-శరీరే = శరీరము లోపల, అర్పితభూతసూక్ష్మః = ఉంచబడిన సూక్ష్మభూతములు గల, సః = ఆ నారాయణుడు, కాల-ఆత్మికామ్ = కాలము రూపములోనుండే, శక్తిమ్ = తన శక్తిని, ఉదీరయాణః = ప్రేరేపించుచున్నవాడై, స్వే = తనదైన, పదే = స్థానమగు, తస్మిన్ = ఆ, సలిలే = నీటియందు, రుద్ధవీర్యః = నిరోధించబడిన శక్తిగల, అనలః = అగ్ని, దారుణి యథా = కట్టెయందు వలె, ఉవాస = నివసించెను.

ఆ నారాయణుడు, తన శక్తిని ప్రకటము చేయకుండగా కట్టెయందు దాగియున్న అగ్నివలె, సూక్ష్మభూతములను తన శరీరమునందు దాచి యుంచెను. ఆయన తన స్థానమగు ఆ జలములయందు నివసించియుండెను. సృష్ట్యాదియందు ఆయన కాలము అనే తన శక్తిని ప్రేరేపించును.

చతుర్యుగానాం చ సహస్రమప్సు
స్వపన్ స్వయోదీరితయా స్వశక్త్యా ।
కాలాఖ్యయాఽఽసాదితకర్మతంత్రో
లోకానపీతాన్ దదృశే స్వదేహే ॥ 12

చ = మరియు, చతుర్యుగానామ్ = మహాయుగముల, సహస్రమ్ = వేయి, అప్సు = జలములయందు, స్వశక్త్యా = తన చిచ్ఛక్తితో గూడి, స్వపన్ = నిద్రించుచున్నవాడై, స్వయా = తనదైన, ఉదీరతయా = ప్రేరేపించబడిన, కాల-అఖ్యయా = కాలము అనే శక్తిచే, ఆసాదితకర్మతంత్రః =

పొందించబడిన సృష్టిక్రియాకలాపము (జీవుల కర్మప్రవృత్తి) గలవాడై, స్వదేహే = తన దేహమునందు, అపీతాన్ = విలీనమై యున్న, లోకాన్ = లోకములను (జీవులను), దదృశే = చూచెను.

ఈ విధముగా నారాయణుడు తన చిచ్ఛక్తితో కూడి ఆ జలముల యందు వేయి మహాయుగములు నిద్రించెను. తరువాత కాలము అనే ఆయన శక్తి సృష్టిక్రియద్వారా జీవుల కర్మఫలములు ప్రకటమయ్యే వ్యాపారమును ఆయనకు కలిగించెను. అపుడాయన తన శరీరమునందు విలీనమై యున్న లోకములను (జీవులను) చూచెను.

తస్యార్థసూక్ష్మాభినివిష్టదృష్టేరంతర్గతోఽర్థో రజసా తనీయాన్ ।
గుణేన కాలానుగతేన విద్ధస్సూష్యంస్తదాభిద్యత నాభిదేశాత్ ॥13

అర్థసూక్ష్మ-అభినివిష్టదృష్టేః = సూక్ష్మభూతములయందు గట్టిగా నిలిచియున్న చూపు గల, తస్య = ఆ నారాయణునియొక్క, అంతర్గతః = లోపలనున్న, తనీయాన్ = మిక్కిలి సూక్ష్మమగు, అర్థః = సూక్ష్మతత్త్వముల వర్గము, కాల-అనుగతేన = కాలముచే వికసింపజేయబడిన, రజసా గుణేన = రజోగుణముచే, విద్ధః = క్షోభింపజేయబడినదై, సూష్యన్ = ఉద్భవింప బోవుచున్నదై, తదా = అప్పుడు, నాభిదేశాత్ = నాభిస్థానమునుండి, అభిద్యత = ఉద్భవించెను.

నారాయణుడు తన సంకల్పరూపమగు దృష్టిని తనలో విలీనమైయున్న సూక్ష్మతత్త్వములపైకి సారించెను. అప్పుడు ఆ సూక్ష్మతత్త్వముల వర్గము ప్రకటము కాబోతూ, కాలశక్తిచే వికసించియున్న రజోగుణముచే క్షోభింపజేయబడి, ఆయన నాభిస్థానమునుండి ప్రకటమయ్యెను.

స పద్మకోశస్సహసోదతిష్ఠత్
కాలేన కర్మప్రతిబోధనేన ।
స్వరోచిషా తత్సలిలం విశాలం
విద్యోతయన్నర్క ఇవాత్మయోనిః ॥ 14

కర్మప్రతిబోధనేన = జీవుల అదృష్టమును జాగృతము చేసే, కాలేన = కాలముచే, ఆత్మయోనిః = పరమాత్మయే కారణముగా గల, సః = ఆ సూక్ష్మతత్త్వముల వర్గము, పద్మకోశః = పద్మకోశము రూపముగా, సహసా = ఒక్కసారిగా, స్వరోచిషా = తన కాంతిచే, తత్ = ఆ, విశాలమ్ = విశాలమగు, సలిలమ్ = నీటిని, అర్కః ఇవ = సూర్యుడు వలె, విద్యోతయన్ = ప్రకాశింప జేయుచూ, ఉదతిష్ఠత్ = ఉద్భవించెను.

జీవుల కర్మాదృష్టమును జాగృతము చేసే కాలము సంప్రాప్తము కాగానే, సూక్ష్మతత్త్వ సముదాయము పరమాత్మనుండి పద్మకోశరూపములో ఒక్కసారి ప్రకటమయ్యెను. సూర్యుని వలె ప్రకాశించే ఆ పద్మము తన కాంతులతో ఆ విశాలమగు జలరాశిని గొప్పగా ప్రకాశింప జేసెను.

తల్లోకపద్మం స ఉ ఏవ విష్ణుః
ప్రావీవిశత్సర్వగుణావభాసమ్ ।
తస్మిన్ స్వయం వేదమయో విధాతా
స్వయంభువం యం స్మ వదంతి సోఽభూత్ ॥15

ఉ = ఓయీ!, సర్వగుణ-అవభాసమ్ = గుణములనన్నింటినీ ప్రకాశింపజేసే, తత్ = ఆ, లోకపద్మమ్ = ముల్లోకములనే పద్మమును, సః = ఆ, విష్ణుః ఏవ = విష్ణువే, ప్రావీవిశత్ = ప్రవేశించెను, తస్మిన్ = దానియందు, స్వయమ్ = స్వయముగా, వేదమయః = వేదమూర్తియగు, సః = ఆ, విధాతా = బ్రహ్మగారు, అభూత్ = ప్రకటమయ్యెను, యమ్ = ఎవనిని, స్వయంభువమ్ = స్వయంభువుడని, వదంతి స్మ = చెప్పెదరో.

ఓయీ విదురా! ముల్లోకముల రూపములోనున్న ఆ పద్మము జీవులకు భోగ్యములైన పదార్థజాతమునంతనూ ప్రకాశింపజేయుచున్నది. ఆ పద్మమును స్వయముగా విష్ణువు అంతర్యామి రూపముగా ప్రవేశించెను. దానియందు సాక్షాత్తుగా వేదమూర్తియగు బ్రహ్మగారు ప్రకటమయ్యెను. ఆ బ్రహ్మగారు స్వయంభువుడని కీర్తించబడుచున్నాడు.

తస్యాం స చాంభోరుహకర్ణికాయామవస్థితో లోకమపశ్యమానః ।

పరిక్రమన్వ్యోమ్ని వివృత్తనేత్రశ్చత్వారి లేభేఽనుదిశం ముఖాని॥16

చ = మరియు, తస్యామ్ = ఆ, అంభోరుహకర్ణికాయామ్ = పద్మ ముయొక్క కర్ణిక (దుద్దు) యందు, అవస్థితః = ఉన్న, సః = ఆ బ్రహ్మ, లోకమ్ = ప్రపంచమును, అపశ్యమానః = కననివాడై, వ్యోమ్ని = ఆకాశము నందు, వివృత్తనేత్రః = విస్తరించబడిన (త్రిప్పబడిన) కన్నులు గలవాడై, పరి క్రమన్ = చుట్టూ తిరుగుచున్నవాడై, అనుదిశమ్ = దిక్కుల వరుసననుసరిం చి, చత్వారి = నాలుగు, ముఖాని = ముఖములను, లేభే = పొందెను.

ఆ పద్మముయొక్క కర్ణికయందున్న బ్రహ్మగారికి ప్రపంచము కాన రాలేదు. ఆయన ఆ పద్మము లోపల చుట్టూ తిరుగుతూ ఆకాశమునందు కళ్లను సారించి త్రిప్పుచూ నాల్గు దిక్కులను చూడగా, దిక్కునకు ఒకటి చొప్పున ఆయనకు నాలుగు ముఖములు లభించెను.

తస్మాద్యుగాంతశ్వసనావఘూర్ణజలోర్మిచక్రాత్సలిలాద్విరూఢమ్ ।
ఉపాశ్రితః కంజము లోకతత్త్వం నాత్మానమద్ధావిదదాదిదేవః ॥17

తస్మాత్ = ఆ, యుగ-అంతశ్వసన-అవఘూర్ణజల-ఊర్మిచక్రాత్ = ప్రళయకాలమునందలి వాయువుచే కల్లోలితము చేయబడిన నీటియందలి తరంగముల సమూహముగల, సలిలాత్ = జలరాశినుండి, విరూఢమ్ = పుట్టిన, కంజమ్ = బ్రహ్మాండపద్మమును, ఉపాశ్రితః = అధిష్ఠించియున్నవా డై, ఆదిదేవః = ఆదిదేవుడగు బ్రహ్మగారు, లోకతత్త్వమ్ = లోకతత్త్వముల రూపములోనున్న ఆ పద్మమును, ఆత్మానమ్ = తనను, అద్ధా = ఉన్నది ఉన్నట్లుగా, న అవిదత్ = తెలుసుకొన లేకపోయెను, ఉ = ఆశ్చర్యము!

ప్రళయకాలవాయువుల తాకిడికి ఆ జలరాశియందు గొప్ప కెరట ములు పుట్టుచుండెను. ఆ కెరటముల మధ్యనుండి ప్రకటమైన ఆ పద్మ మును బ్రహ్మగారు అధిష్ఠించి యుండెను. కాని, ఆశ్చర్యమేమనగా, పద్మము రూపములో ప్రకటమైన ఆ లోకతత్త్వము గురించి గాని, తన గురించి గాని ఆయనకు ఏమీ తెలియకుండెను.

క ఏష యోఽసావహమబ్జపృష్ఠ

ఏతత్కుతో వాబ్జమనన్యదప్సు ।
అస్తి హ్యధస్తాదిహ కించనైత-
దధిష్ఠితం యత్ర సతా ను భావ్యమ్ ।। 18

అబ్జపృష్ఠే = పద్మముయొక్క కర్ణికయందు, ఏషః = వీడు, కః = ఎవడు?, యః = ఎవడైతే, అసౌ = ఈ, అహమ్ = నేను (అయి ఉన్నాడో), అప్సు = జలములయందు, అనన్యాత్ = ఒకే ఒక, ఏతత్ = ఈ, అబ్జమ్ = పద్మము, కుతః = ఎక్కడిది?, ఇహ = ఇచట, అధస్తాత్ = క్రింద, కించన = ఏదో ఒకటి, అస్తి = ఉన్నది, హి = ఏలయనగా, సతా = వస్తువుచే, అనుభావ్యమ్ = ఉండబడవలెను, యత్ర = దేనియందైతే, ఏతత్ = ఈ పద్మము, అధిష్ఠితమ్ = ఆశ్రయించి ఉన్నదో.

ఇది నేను అనే ప్రత్యయము గలవాడనై ఈ పద్మముయొక్క కర్ణికయందు ఉన్న నేను ఎవరినై యుందును? ఈ జలములలో ఈ ఒక్క పద్మము తక్క మరియేదీ లేదు. ఇది ఎక్కడనుండి పుట్టియుండును? దీని క్రింద ఏదో ఒక వస్తువు ఉన్నది. ఎందుకంటే, ఈ పద్మమునకు ఆశ్రయముగా ఉండే వస్తువు ఏదో ఒకటి ఉండి తీరవలెను గదా!

స ఇత్థముద్వీక్ష్య తదబ్జనాలనాడీభిరంతర్జలమావివేశ ।
నార్వాగ్గతస్తత్ఖరనాలనాలనాభిం విచిన్వంస్తదవిందతాజః ।। 19

సః = ఆ బ్రహ్మ, ఇత్థమ్ = ఈ విధముగా, ఉద్వీక్ష్య = ఊహించి, తత్-అబ్జనాలనాడీభిః = ఆ పద్మముయొక్క తూడులోని రంధ్రములగుండా, అంతః-జలమ్ = నీటిలోనికి, ఆవివేశ = ప్రవేశించెను, సః = ఆ విధముగా ప్రవేశించిన, అజః వై = బ్రహ్మగారు, తత్-ఖరనాలనాలనాభిమ్ = ఆ కఠినమగు నాళము గల పద్మముయొక్క నాళమునకు ఉండే ఆధారస్థానమును, విచిన్వన్ = వెదుకుచున్నవాడై, తత్ = ఆ సమయములో, అర్వాక్ = దగ్గరగా, గతః = వెళ్లినవాడై, న అవిందత = తెలియలేక పోయెను.

ఆ బ్రహ్మ ఈ విధముగా ఊహించి, ఆ పద్మముయొక్క కఠినమగు నాళములలోని రంధ్రముల గుండా నీటిలోనికి ప్రవేశించెను. ఆయన

అచట వెదుకుతూ ఆ నాళమునకు ఆధారమగు నాభికి దగ్గరకు చేరిననూ, దానిని తెలుసుకొనలేక పోయెను.

తమస్యపారే విదురాత్మసర్గం
విచిన్వతోఽభూత్సుమహాంస్త్రిణేమిః ।
యో దేహభాజాం భయమీరయాణః
పరిక్షిణోత్యాయురజస్య హేతిః ॥ 20

విదుర = ఓ విదురా!, అపారే = అంతు లేని, తమసి = చీకటియందు, ఆత్మసర్గమ్ = తాను పుట్టిన స్థానమును, విచిన్వతః = వెదుకుచున్న బ్రహ్మకు, సుమహాన్ = చాల పెద్ద, త్రిణేమిః = భూతభవిష్యద్వర్తమానములనే మూడు ధారలు గల కాలము, అభూత్ = ఆయెను, అజస్య = భగవానుని, హేతిః = ఆయుధమగు, యః = ఏ కాలమైతే, దేహభాజామ్ = జీవులకు, భయమ్ = భయమును, ఈరయాణః = కలిగించుచున్నదై, ఆయుః = ఆయుర్దాయమును, పరిక్షిణోతి = క్షీణింపజేయుచున్నదో.

ఆ అంతు లేని చీకటిలో బ్రహ్మగారు తన ఉత్పత్తి స్థానమును వెదుకుచుండగా, చాల కాలము గడిచిపోయెను. భూతభవిష్యద్వర్తమానములనే మూడు రూపములు గల ఈ కాలము ఆ భగవానుని చేతిలోని ఆయుధము. అది దేహాత్మభావము గల జీవులకు భయమును గొల్పుచూ, వారి ఆయుర్దాయమును హరించి వేయుచుండును.

తతో నివృత్తోఽప్రతిలబ్ధకామస్స్వధిష్ణ్యమాసాద్య పునస్స దేవః ।
శనైర్జితశ్వాసనివృత్తచిత్తో న్యషీదదారూఢసమాధియోగః ॥ 21

అప్రతిలబ్ధకామః = పొందబడని కామన గల, సః = ఆ, దేవః = బ్రహ్మదేవుడు, తతః = ఆ అన్వేషణమునుండి, నివృత్తః = విరమించుకున్నవాడై, పునః = మరల, స్వధిష్ణ్యమ్ = తన స్థానమును, ఆసాద్య = చేరుకొని, శనైః = మెల్లగా, జితశ్వాసనివృత్తచిత్తః = జయింపబడిన శ్వాస గలవాడగుటచే నియంత్రించబడిన మనస్సు గలవాడై, ఆరూఢసమాధియోగః = ఆశ్రయించబడిన సమాధియోగము గలవాడై, న్యషీదత = కూర్చుండెను.

ఆ బ్రహ్మగారి కోరిక తీరలేదు. ఆయన ఆ ప్రయత్నమునుండి విర మించుకొని మరల తన స్థానమగు పద్మకర్ణికను చేరుకొని, దానియందు కూర్చుండి మెల్లమెల్లగా శ్వాసను జయించి, మనోవృత్తులను నిరోధించి, సమాధిస్థితిని చేరుకొని యుండెను.

కాలేన సోఽజః పురుషాయుషాభి-
ప్రవృత్తయోగేన విరూఢబోధః ।
స్వయం తదంతర్హృదయేఽవభాత-
మపశ్యతాపశ్యత యన్న పూర్వమ్ ॥ 22

సః = ఆ, అజః = బ్రహ్మగారు, పురుష-ఆయుషా = వంద సంవత్స రముల, కాలేన = కాలముచే, అభిప్రవృత్తయోగేన = చక్కగా సాగిన సమాధియోగముచే, విరూఢబోధః = విశేషముగా కలిగిన జ్ఞానము గలవా డై, అంతః-హృదయే = హృదయము లోపల, స్వయమ్ = తనంత తానుగా, అవభాతమ్ = సాక్షాత్కరించిన, తత్ = ఆ తన కారణమును, అప శ్యత = చూచెను, యత్ = దేనినైతే, పూర్వమ్ = ఇదివరలో, న అపశ్యత = చూడలేదో.

ఆ బ్రహ్మగారు ఈ విధముగా పురుషాయుర్దాయమగు వంద సంవ త్సరముల కాలము సమాధియోగమును చక్కగా కొనసాగించగా, ఆయ నకు విశేషమగు జ్ఞానము ఉదయించెను. అపుడాయనకు ఇదివరలో ఎంత వెదికిననూ కానరాని తన కారణము తన హృదయము లోపల ప్రకాశిస్తూ తనంత తానుగా సాక్షాత్కరించెను.

మృణాలగౌరాయతశేషభోగపర్యంక
ఏకం పురుషం శయానమ్ ।
ఫణాతపత్రాయుతమూర్ధరత్న-
ద్యుభిర్హతధ్వాంతయుగాంతతోయే ॥ 23

ఫణ-ఆతపత్ర-అయుతమూర్ధరత్నద్యుభిః = గొడుగులవంటి పది వేల పడగల తల్లలపై ఉన్న రత్నముల కాంతులచే, హతధ్వాంతయుగ

-అంతతోయే = నశింపజేయబడిన చీకట్లు గల ప్రళయజలమునందు, మృణాలగౌర-ఆయతశేషభోగపర్యంకే = తామరతూడువలె తెల్లని విశాల మైన ఆదిశేషుని దేహమనే శయ్యయందు, శయానమ్ = నడుము వాల్చి యున్న, ఏకమ్ = ఒక, పురుషమ్ = పురుషుని (చూచెను).

ఆదిశేషుని పదివేల పడగలు గొడుగుల వలె నున్నవి. వాటి తల లపై నున్న రత్నములు తమ కాంతులచే ఆ ప్రళయజలమునందలి చీక ట్లను పారద్రోలుచున్నవి. తామరతూడువలె తెల్లనైన ఆ ఆదిశేషుని విశాల మగు దేహమే శయ్య కాగా, ఒక పురుషుడు దానిపై నడుము వాల్చియుం డెను. బ్రహ్మగారు ఒంటరిగానున్న ఆ పురుషోత్తమ భగవానుని కనుగొనెను.

ప్రేక్షాం క్షిపంతం హరితోపలాద్రేః
సంధ్యాభ్రనీవేరురురుక్మమూర్ధ్నః ।
రత్నోదధారౌషధిసౌమనస్య-
వనస్రజో వేణుభుజాంఘ్రిపాంఘ్రేః ॥ 24

సంధ్యా-అభ్రనీవేః = సంధ్యాకాలమునందలి మేఘములే కట్టువస్త్ర ముగా గల, ఉరురుక్మమూర్ధ్నః = అనేకములగు బంగరు శిఖరములు గల, రత్న-ఉదధారా-ఓషధిసౌమనస్యవనస్రజః = రత్నములు నీటిధారలు ఓషధి మొక్కలు మరియు పుష్పములు అనువాటిచే కూర్చబడిన వనమాల గల, వేణుభుజ-అంఘ్రిప-అంఘ్రేః = వెదుళ్లే భుజములుగా మరియు వృక్షములే పాదములుగా గల, హరిత-ఉపల-అద్రేః = మరకతమాణిక్య (పచ్చల) పర్వ తముయొక్క, ప్రేక్షామ్ = శోభను, క్షిపంతమ్ = తిరస్కరించుచున్నవాడు.

ఆ పురుషోత్తమ భగవానుని దేహకాంతి, వెదుళ్లే భుజములుగా మరియు వృక్షములే పాదములుగా గల మరకతమాణిక్యపర్వతుని శోభను తిరస్కరించుచున్నది. ఆ పర్వతమునకు సంధ్యాకాలమునందలి మేఘ ములే కట్టువస్త్రములన్నచో, వాటిని ఆ పురుషుని పీతవస్త్రము తలదన్ను చున్నది. అనేకములగు బంగరు శిఖరములే ఆ పర్వతమునకు కిరీటముల న్నచో, ఆ పురుషుని కిరీటము వాటి శోభను అతిశయించుచున్నది. ఆ పర్వ తమునకు రత్నములు, నీటిధారలు, ఓషధి మొక్కలు మరియు పుష్ప

ములు కలిసి వనమాలను సమగూర్చుచున్నవన్నచో, ఆయన దాల్చిన వన మాల ఆ మాలను తన శోభచే పరాస్తము చేయుచున్నది.

ఆయామతో విస్తరతస్స్వమానదేహేన లోకత్రయసంగ్రహేణ ।
విచిత్రదివ్యాభరణాంశుకానాం కృతశ్రియాపాశ్రితవేషదేహమ్ ॥25

లోకత్రయసంగ్రహేణ = ముల్లోకములను తనయందు ఇముడ్చుకున్నట్టియు, విచిత్రదివ్య-ఆభరణ-అంశుకానామ్ = రంగు రంగుల దివ్యమగు ఆభరణములకు మరియు వస్త్రములకు, కృతశ్రియా = చేకూర్చబడిన శోభ గలిగినట్టియు, ఆయామతః = పొడవును బట్టి, విస్తరతః = వైశాల్యమును బట్టి, స్వమానదేహేన = తనకు తగిన ప్రమాణము గల దేహముతో, ఆశ్రిత వేషదేహమ్ = స్వీకరించబడిన అలంకారము గల దేహము గలవాడు.

ఆ పురుషుని దేహము పొడవులో మరియు వైశాల్యములో తనకు తానే సాటియై తనకు అనురూపమైన ప్రమాణమును కలిగి ముల్లోకములను తనలో ఇముడ్చుకొని యుండెను. ఆ దేహము రంగు రంగుల దివ్యములగు వస్త్రములకు మరియు ఆభరణములకు శోభను కలిగించుచుండెను. ఇట్లు అలంకరించబడిన దేహము గల ఆ పురుషుని బ్రహ్మ చూచెను.

పుంసాం స్వకామాయ వివిక్తమార్గైః
అభ్యర్చతాం కామదుఘాంఘ్రిపద్మమ్ ।
ప్రదర్శయంతం కృపయా నఖేందు-
మయూఖభిన్నాంగులిచారుపత్రమ్ ॥ 26

నఖ-ఇందుమయూఖభిన్న-అంగులిచారుపత్రమ్ = గోళ్లు అనే చంద్రవంకల కిరణములచే కలిసియున్న వ్రేళ్లు అనే సుందరమగు రేకులు గల్గినట్టియు, స్వకామాయ = తాము కోరే ఫలము కొరకు, వివిక్తమార్గైః = వేదమునందు నిర్దేశించబడిన శుద్ధమగు ఉపాయములచే, అభ్యర్చతామ్ = చక్కగా ఆరాధించే, పుంసామ్ = మానవులకు, కామదుఘ-అంఘ్రిపద్మమ్ = కోరికలనీడేర్చే పాదపద్మమును, కృపయా = దయతో, ప్రదర్శయంతమ్ = దర్శనమిచ్చుచున్న (పురుషుని చూచెను).

భగవానుని పద్మమువంటి పాదమునకు చంద్రవంకలవంటి నఖముల కాంతులతో ప్రకాశించే వ్రేళ్లు పద్మపత్రములవలె నున్నవి. మానవులు తమ కోరికలు ఈడేరుట కొరకై ఆ పాదమును వేదములో నిర్దేశించబడిన శుద్ధమగు వేర్వేరు ఉపాయములతో చక్కగా ఆరాధించగా, వారికి ఆ పాదము కోరికలను సుసంపన్నము చేయును. అట్టి పాదపద్మమును దయతో దర్శనమిచ్చుచున్న పురుషోత్తముని బ్రహ్మగారు చూచెను.

ముఖేన లోకార్తిహరస్మితేన
పరిస్ఫురత్కుండలమండితేన ।
శోణాయితేనాధరబింబభాసా
ప్రత్యర్హయంతం సునసేన సుభ్వ్రా ॥ 27

లోక-ఆర్తిహరస్మితేన = జనుల దుఃఖమును పోగొట్టే చిరునవ్వు గల్గినట్టియు, పరిస్ఫురత్-కుండలమండితేన = ఇటునటు కదులుతూ ప్రకాశించే కుండలములచే అలంకరించబడినట్టియు, అధరబింబభాసా = దొండపండువంటి క్రింది పెదవియొక్క కాంతిచే, శోణాయితేన = ఎఱ్ఱని నిప్పువలెనున్నట్టియు, సునసేన = అందమైన ముక్కు గలిగినట్టియు, సుభ్వ్రా = చక్కని కనుబొమలు గల, ముఖేన = ముఖముతో, ప్రత్యర్హయంతమ్ = సమ్మానించుచున్న (పురుషుని చూచెను).

ఆయన చిరునవ్వు ముఖము జనుల దుఃఖమును పోగొట్టును. అందమైన ముక్కు, చక్కని కనుబొమలు గల ఆ ముఖము ఇటునటు కదులుతూ ప్రకాశించే కుండలములతో నలరారుచుండెను. ఎఱ్ఱని క్రింది పెదవి దొండపండువలె శోభిల్లెను. అట్టి ముఖముతో ఆయన తనను పూజించు భక్తులను సమ్మానించుచుండెను.

కదంబకింజల్కపిశంగవాససా స్వలంకృతం మేఖలయా నితంబే ।
హారేణ చానంతధనేన వత్స శ్రీవత్సవక్షఃస్థలవల్లభేన ॥ 28

వత్స = ఓ కుమారా!, నితంబే = నడుమునందు, కదంబకింజల్కపిశంగవాససా = కడిమి పువ్వుల పుప్పొడి వలె పసుపు వన్నె గల వస్త్రము

తో, మేఖలయా = మొలనూలుతో, చ = మరియు, అనంతధనేన = విలువ కట్టలేని, శ్రీవత్సవక్షఃస్థలవల్లభేన = శ్రీవత్సము అనే మచ్చతో కూడిన వక్షఃస్థలమునకు తగియున్న, హారేణ = హారముచే, సు-అలంకృతమ్ = చక్కగా అలంకరించబడి యున్న (పురుషుని చూచెను).

ఓ ప్రియవిదురా! ఆ పురుషోత్తముని నడుము కడిమి పువ్వుల పుప్పొడి వలె పసుపు వన్నెగల వస్త్రముతో మరియు మొలనూలుతో ప్రకాశించుచుండెను. ఆయన శ్రీవత్సము అనే మచ్చగల తన వక్షఃస్థలమునకు తగియున్న అమూల్యమగు హారముతో శోభిల్లుచుండెను.

> పరార్థ్యకేయూరమణిప్రవేక-
> పర్యస్తదోర్దండసహస్రశాఖమ్ ।
> అవ్యక్తమూలం భువనాంఘ్రిపేంద్ర-
> మహీంద్రభోగైరధివీతవల్శమ్ ॥ 29

పరార్థ్యకేయూరమణిప్రవేకపర్యస్తదోర్దండసహస్రశాఖమ్ = మిక్కిలి విలువైన అంగదములతో మరియు ఉత్తమమగు మణులతో అంతటా అలంకరించబడిన భుజదండములే అనంతములగు శాఖలుగా గలది, అవ్యక్తమూలమ్ = పరబ్రహ్మ మూలముగా (కనబడని తల్లివేరు) గలది, అహి-ఇంద్రభోగైః = శేషుని పడగలచే, అధివీతవల్శమ్ = చుట్టువారబడియున్న భుజస్కంధములు గల, భువన-అంఘ్రిప-ఇంద్రమ్ = భువనము అనే గొప్ప వృక్షమును (చూచెను).

జగత్కారణుడగు ఆ పురుషోత్తముడు గొప్ప చందనవృక్షము వలె నున్నాడు. జగద్రూపముగా ప్రకటమైన ఆయనయే జగత్తు అనే వృక్షము రూపములో నున్నాడు. ఆయన భుజదండములే ఆ వృక్షముయొక్క అనంతములగు శాఖలు. ఆ భుజములయందు ప్రకాశించే విలువైన అంగదములు మరియు ఉత్తమమగు మణులు చందనవృక్షముయొక్క ఫలపుష్పములతో నిండిన కొమ్మలను స్మరింపజేయుచున్నవి. జగత్తు అనే వృక్షమునకు అవ్యక్తము అనబడే మాయాశక్తి గాని, లేక అవ్యక్తశబ్దవాచ్యమగు పరబ్రహ్మ గాని మూలమై యుండుట ప్రసిద్ధమే. చెట్టుయొక్క తల్లివేరు కనబ

డకుండుట అందరికీ తెలిసినదే. ఆ పురుషోత్తముని భుజస్కంధములను ఆదిశేషుని పడగలు చుట్టువారియున్నవి. ఆ విధముగా ఆయన పాములకు నివాసమగు చందనవృక్షమును పోలియున్నాడు.

చరాచరౌకో భగవన్మహీధ్రమహీంద్రబంధుం సలిలోపగూఢమ్ ।
కిరీటసాహస్రహిరణ్యశృంగమావిర్భవత్కౌస్తుభరత్నగర్భమ్ ॥ 30

చర-అచర-ఓకః = జంగమస్థావరాత్మకమగు జగత్తునకు స్థానమైన ట్టియు, అహి-ఇంద్రబంధుమ్ = ఆదిశేషునకు (గొప్ప పాములకు) బంధువు అయినట్టియు, సలిల-ఉపగూఢమ్ = ప్రళయజలములచే (నీటిచే) చుట్టువా రబడి యున్నట్టియు, కిరీటసాహస్రహిరణ్యశృంగమ్ = అసంఖ్యాకములగు కిరీటములే బంగరు శిఖరములుగా గలిగినట్టియు, ఆవిర్భవత్-కౌస్తుభరత్న గర్భమ్ = స్పష్టముగా కానవచ్చే కౌస్తుభమాణిక్యము దేహమునకు మధ్యలో నున్న, భగవత్-మహీధ్రమ్ = పురుషోత్తముడనే పర్వతమును.

ప్రళయజలములచే చుట్టువారబడియున్న ఆ భగవానుడు నీటిలో మునిగియున్న పర్వతమువలె నున్నాడు. పర్వతము చెట్టుచేమలకు ఇతర ప్రాణులకు ఆశ్రయమై యుండగా, ఆయన స్థావరజంగమాత్మకమగు జగ త్తునకంతకూ నివాసస్థానము. పర్వతము గొప్ప పాములకు నిలయము కాగా, ఆయన ఆదిశేషునకు బంధువు. ఆదిశేషుని పడగలపైనుండే అసం ఖ్యాకములగు బంగరు కిరీటములు పర్వతశిఖరములవలె నొప్పారుచున్న వి. పర్వతములో రత్నములుండుననే ప్రసిద్ధి గలదు. ఆ పురుషోత్తముని వక్షఃస్థలమునందు కౌస్తుభమాణిక్యము చక్కగా ప్రకాశించుచుండెను.

నివీతమామ్నాయమధువ్రతశ్రియా
స్వకీర్తిమయ్యా వనమాలయా హరిమ్ ।
సూర్యేందువాయ్వగ్న్యగమం త్రిధామభిః
పరిక్రమత్ప్రాధనికైర్దురాసదమ్ ॥ 31

ఆమ్నాయమధువ్రతశ్రియా = వేదములనే భ్రమరములచే శోభిల్లే, స్వకీర్తిమయ్యా = తన కీర్తియే స్వరూపముగా గల, వనమాలయా = వనమా

లతో, నివీతమ్ = వ్యాపించబడి యున్నట్టియు, సూర్య-ఇందువాయు-అగ్ని-అగమమ్ = సూర్యుడు చంద్రుడు వాయువు అగ్ని అను వారిచే పొంద శక్యము కానట్టియు, త్రిధామభిః = మూడు కాలములయందు (ముల్లోకములయందు) ప్రకాశించే, పరిక్రమత్-ప్రాధనికైః = చుట్టూ తిరుగుచున్న సుదర్శనము మొదలగు ఆయుధములచే, దురాసదమ్ = సమీపించ శక్యము కాని, హరిమ్ = శ్రీహరిని (చూచెను).

శ్రీహరి మెడలో విరాజిల్లే వనమాల చుట్టూ వేదములే భ్రమరములై తిరుగుతూ ఆయన కీర్తిని గానము చేయుచున్నవి. సూర్యుడు, చంద్రుడు, అగ్ని మొదలగు జ్యోతిర్మండలములు ఆ శ్రీహరియొక్క ప్రకాశము ముందు వెలవెలపోవును. వాయువు ఆయనను సమీపించలేడు. ముల్లోకములలో మూడు కాలములలో తమ తేజస్సుచే దుర్నిరీక్ష్యములై ఆయన చుట్టూ తిరుగుతూ ఉండే సుదర్శనము మొదలగు ఆయుధములు కూడ ఆయనను సమీపించలేకున్నవి. వాటి కారణముగా ఇతరమేదియు ఆయనను సమీపించలేదు.

తర్హ్యేవ తన్నాభిసరస్సరోజమాత్మానమంభశ్శ్వసనం వియచ్ఛ ।
దదర్శ దేవో జగతో విధాతా నాతః పరం లోకవిసర్గదృష్టిః ।। 32

లోకవిసర్గదృష్టిః = లోకములను సృష్టించుటకై జ్ఞానము (ఇచ్ఛ) గల, జగతః = జగత్తునకు, విధాతా = కర్తయగు, దేవః = బ్రహ్మదేవుడు, తర్హి ఏవ = అదే కాలమునందు, తత్-నాభిసరః-సరోజమ్ = ఆ భగవానుని నాభి అనే సరస్సునుండి పుట్టిన పద్మమును, ఆత్మానమ్ = తనను, అంభః = ప్రళయజలమును, శ్వసనమ్ = ప్రళయవాయువును, చ = మరియు, వియత్ = ఆకాశమును, దదర్శ = చూచెను, అతః పరమ్ = ఇంతకు మించి, న = చూడలేదు.

లోకములను సృష్టించుటకు కావలసిన జ్ఞానము, సృష్టించాలనే ఇచ్ఛ గల ఆ జగద్విధాతయగు బ్రహ్మదేవునకు శ్రీహరిని చూచిన ఆ సమయములో, ఆయన నాభిసరస్సునుండి పుట్టిన పద్మము, తన శరీరము,

ప్రళయ జలములు, ప్రళయ వాయువు మరియు ఆకాశము అనే ఈ అయిదు తక్క మరేదీ కానరాలేదు.

స కర్మబీజం రజసోపరక్తః ప్రజాస్సిసృక్షన్నియదేవ దృష్ట్వా ।
అస్తౌద్విసర్గాభిముఖస్తమీడ్యమవ్యక్తవర్త్మన్యభివేశితాత్మా ॥ 33

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
అష్టమోఽధ్యాయః ॥

రజసా = రజోగుణముచే, ఉపరక్తః = రంజింపజేయబడినవాడై, అవ్యక్తవర్త్మని = మాయయొక్క విలాసమునందు, అభివేశిత-ఆత్మా = ఆగ్రహముతో గూడిన చిత్తము గలవాడై, సః = ఆ బ్రహ్మ, ప్రజాః = ప్రజలను, సిసృక్షన్ = సృష్టించ గోరినవాడై, ఇయత్ ఏవ = ఇంత మాత్రమునే, కర్మబీజమ్ = సృష్టికర్మకు కారణమైనదానిని, దృష్ట్వా = చూచి, విసర్గ-అభిముఖః = విభిన్నరకముల సృష్టులయందు అభిముఖముగానున్న మనస్సు గలవాడై, ఈడ్యమ్ = కొనియాడదగిన, తమ్ = శ్రీహరిని, అస్తౌత్ = స్తుతించెను.

ఆ బ్రహ్మగారి మనస్సు రజోగుణముచే రంజితమై (వ్యాప్తమై) యుండెను. కావుననే, ఆయనకు మనస్సులో మాయాశక్తియొక్క విలాసమునందు అభినివేశము (పట్టుదల) పెరిగెను. ఆయన వివిధరకముల సర్గముల ద్వారా ప్రజలను సృష్టించగోరి, ఆ సృష్టికి కారణము కాగల తత్త్వముల కొరకు పరికించగా, కేవలము ఆ అయిదు మాత్రమే ఆయనకు కానవచ్చెను. అపుడాయన కొనియాడదగిన శ్రీహరిని స్తుతించెను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధమునందు
ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (8).

* * * * *

# అథ నవమోऽధ్యాయః

## బ్రహ్మగారు శ్రీహరిని స్తుతించుట

బ్రహ్మోవాచ ।

జ్ఞాతోऽసి మేऽద్య సుచిరాన్నను దేహభాజాం
న జ్ఞాయతే భగవతో గతిరిత్యవద్యమ్ ।
నాన్యత్త్వదస్తి భగవన్నపి తన్న శుద్ధం
మాయాగుణవ్యతికరాద్యదురుర్విభాసి ॥ 1

బ్రహ్మ = బ్రహ్మగారు, ఉవాచ = పలికెను, భగవన్ = ఓ భగవానుడా!, సుచిరాత్ = చాల కాలము తరువాత, అద్య = ఈనాడు, మే = నాకు, జ్ఞాతః = తెలియబడినవాడవు, అసి = అగుచున్నావు, నను = అయ్యో!, దేహభాజామ్ = దేహధారులకు, భగవతః = భగవానుని, గతిః = తత్త్వము, న జ్ఞాయతే = తెలియబడుట లేదు, ఇతి = అనునది, అవద్యమ్ = దోషము, త్వత్ = నీకంటె, అన్యత్ = భిన్నమైనది, న అస్తి = లేదు, అపి = భాసించిననూ, తత్ = అది, శుద్ధమ్ = శుద్ధమగు సత్త (స్వతంత్రమగు ఉనికి), న = కాదు, యత్ = ఏలయనగా, మాయాగుణవ్యతికరాత్ = మాయాశక్తి యొక్క గుణములయందలి సంక్షోభముచే, ఉరుః = అనేకరూపములుగా, విభాసి = ప్రకాశించుచున్నావు.

బ్రహ్మగారు ఇట్లు పలికెను --- ఓ భగవాన్! ఇంతకాలము తరువాత ఈనాడు నేను నిన్ను తెలుసుకున్నాను. అయ్యో! దేహాభిమానము గల జీవులు భగవానుని స్వరూపము తెలియకుండుట అనే దోషమును కలిగియున్నారు. నీకంటె భిన్నముగా ఏదీ లేదు. ఉన్నట్లు భాసించేది స్వతంత్రమగు సత్త (ఉనికి) గలది కాదు. ఏలయనగా, త్రిగుణాత్మికయగు నీ

మాయాశక్తిలో కలిగిన సంక్షోభముచే నీవే వివిధరూపములలో భాసించుచు న్నావు.

రూపం యదేతదవబోధరసోదయేన
శశ్వన్నివృత్తతమసస్సదనుగ్రహాయ ।
ఆదౌ గృహీతమవతారశతైకబీజం
యన్నాభిపద్మభవనాదహమావిరాసమ్ ॥ 2

అవబోధరస-ఉదయేన = చైతన్యశక్తియొక్క ఆవిర్భావముచే, శశ్వత్ = శాశ్వతకాలము, నివృత్తతమసః = తొలగియున్న అజ్ఞానము గల నీ, ఏతత్ = ఈ, అవతారశత-ఏకబీజమ్ = వందలాది అవతారములకు ఏకైకకారణమైన, రూపమ్ = రూపము, యత్ = ఏది గలదో అది, సత్-అనుగ్రహాయ = సత్పురుషుల అనుగ్రహము కొరకే ఆదౌ = మున్ముందుగా, గృహీతమ్ = స్వీకరించబడినది, యత్-నాభిపద్మభవనాత్ = ఏ రూపము యొక్క నాభినుండి పుట్టిన పద్మము అనే భవనమునుండి, అహమ్= నేను, ఆవిరాసమ్ = ఆవిర్భవించితినో.

నీ చైతన్యశక్తియొక్క ప్రకాశముచే అజ్ఞానము సర్వదా నీకు దూరముగా నున్నది. నీవు ఈ రూపమును సత్పురుషులను అనుగ్రహించుట కొరకై స్వీకరించితివి. నీ ఈ రూపము వందలాది అవతారములకు మూలకారణము అగుచున్నది. నీ ఈ విగ్రహముయొక్క నాభినుండి పుట్టిన పద్మము అనే భవనమునుండి నేను ఆవిర్భవించితిని.

నాతః పరం పరమ యద్భవతస్స్వరూప-
మానందమాత్రమవికల్పమవిద్ధవర్చః ।
పశ్యామి విశ్వసృజమేకమవిశ్వమాత్మన్
భూతేంద్రియాత్మకమదస్త ఉపాశ్రితోఽస్మి ॥ 3

పరమ = ప్రకృతికి అతీతమైనవాడా!, ఆత్మన్ = ఆత్మస్వరూపుడా!, ఆనందమాత్రమ్ = ఆనందఘనము, అవికల్పమ్ = భేదములు లేనిది, అవిద్ధవర్చః = ఆవృతము కాని ప్రకాశము గలది అగు, భవతః = నీయొక్క,

యత్ = ఏ, స్వరూపమ్ = స్వరూపము గలదో అది, అతః = ఈ రూపము కంటె, పరమ్ = భిన్నమైనదిగా, న పశ్యామి = చూడజాలను, విశ్వసృజమ్ = జగత్తును సృష్టించునట్టియు, ఏకమ్ = ఉపాస్యములగు రూపములలో ప్రముఖమైనట్టియు, అవిశ్వమ్ = జగత్తుకంటె విలక్షణమైనట్టియు, భూత-ఇంద్రియ-ఆత్మకమ్ = భూతములకు ఇంద్రియములకు అధిష్ఠానమైన, తే = నీ, అదః = ఈ రూపమును, ఉపాశ్రితః = శరణు పొందినవాడను, అస్మి = అగుచున్నాను.

ప్రకృతికి అతీతమైనవాడా! ఓ ఆత్మరూపుడా! నీ చైతన్యస్వరూపమునకు అజ్ఞానముయొక్క ఆవరణము లేదు. ఆ నీ ఆనందఘనస్వరూపమునందు భేదములేమియు లేవు. నీ ఈ రూపము దానికంటె భిన్నమైనదని నేను అనుకోను. అద్వితీయమగు ఈ నీ రూపము జగత్తును సృష్టించిననూ జగత్తునకు అతీతముగనే యున్నది. సకలభూతములకు, ఇంద్రియములకు అధిష్ఠానమగు ఈ నీ రూపమును నేను శరణు వేడుచున్నాను.

తద్వా ఇదం భువనమంగల మంగలాయ
ధ్యానే స్మ నో దర్శితం త ఉపాసకానామ్ ।
తస్మై నమో భగవతేఽనువిధేమ తుభ్యం
యోఽనాదృతో నరకభాగ్భిరసత్ప్రసంగైః ॥ 4

భువనమంగల = జగత్తునకు కల్యాణమును చేకూర్చువాడా!, తత్ = అట్టి, ఇదం వై = ఈ నీ రూపమే, తే = నీ, ఉపాసకానామ్ = ఉపాసకులమగు, నః = మాయొక్క, మంగలాయ = కల్యాణము కొరకు, ధ్యానే = ధ్యానమునందు, దర్శితం స్మ = చూపబడినది, తస్మై = అట్టి, భగవతే = భగవానుడవగు, తుభ్యమ్ = నీ కొరకు, నమః = నమస్కారమును, అనువిధేమ = పలుమార్లు చేయుచున్నాము, యః = ఏ నీవు, అసత్-ప్రసంగైః = మిథ్యాభూతమగు జగత్తునందు తీవ్రమగు ఆసక్తి (కుతర్కములు) గల, నరకభాగ్భిః = నరకమును పొందే జనులచే, అనాదృతః = ఉపేక్షించ బడుదువో.

జగత్తునకు కల్యాణమైనవాడా! నీ ఉపాసకుడనగు నాకు కల్యాణమును చేయుట కొరకై నీవు అట్టి ఈ నీ రూపమును నాకు ధ్యానములో

దర్శనమిచ్చితివి. భగవానుడవగు నీకు నేను పలుమార్లు నమస్కరించుచు న్నాను. అజ్ఞానులు మిథ్యాభూతమగు జగత్తునందు తీవ్రమగు ఆసక్తి గలవా రై, కుతర్కములయందు నిష్ఠను కలిగి, నిన్ను ఉపేక్ష చేసి నరకమును పొందుచున్నారు.

యే తు త్వదీయచరణాంబుజకోశగంధం
జిఘ్రంతి కర్ణవివరైశ్శ్రుతివాతనీతమ్ ।
భక్త్యా గృహీతచరణః పరయా చ తేషాం
నాపైషి నాథ హృదయాంబురుహాత్స్వపుంసామ్ । 5

నాథ = ఓ నాథా!, యే తు = ఎవరైతే, శ్రుతివాతనీతమ్ = వేదము లనే వాయువుచే గొనిరాబడిన, త్వదీయచరణ-అంబుజకోశగంధమ్ = నీ పాదములనే పద్మపు మొగ్గల పరిమళమును, కర్ణవివరైః = చెవి రంధ్రముల ద్వారా, జిఘ్రంతి = ఆఘ్రాణించెదరో, స్వపుంసామ్ = నీ భక్తులగు, తేషామ్ = వారియొక్క, పరయా = సర్వాతిశాయియగు, భక్త్యా = భక్తిచే, గృహీతచ రణః = కట్టివేయబడిన పాదములు గల నీవు, హృదయ-అంబురుహాత్ = హృదయపద్మమునుండి, న అపైషి = తొలగిపోవు.

ఓ నాథా! వేదములు నీ పాదముల మహిమను కీర్తించుచున్నవి. నీ భక్తులు వేదములనే వాయువుచే గొనిరాబడిన నీ పాదములనే పద్మపు మొగ్గల పరిమళమును తమ చెవి రంధ్రముల ద్వారా ఆఘ్రాణించెదరు. వారు తమయొక్క సర్వాతిశాయియగు భక్తితో నీ పాదములను కట్టివేసెద రు. అట్టి నీ భక్తుల హృదయపద్మమునుండి నీవు దూరము కావు.

తావద్భయం ద్రవిణగేహసుహృన్నిమిత్తం
శోకస్స్పృహా పరిభవో విపులశ్చ లోభః ।
తావన్మమేత్యసదవగ్రహ ఆర్తిమూలం
యావన్న తేఽంఘ్రిమభయం ప్రవృణీత లోకః ।। 6

లోకః = మానవుడు, యావత్ = ఎంతవరకైతే, తే = నీ, అభయమ్ = అభయస్థానమగు, అంఘ్రిమ్ = పాదమును, న ప్రవృణీత = ఆశ్రయించ

డో, తావత్ = అంతవరకు, ద్రవిణగేహసుహృత్-నిమిత్తమ్ = ధనము ఇల్లు బంధువులు కారణముగా గల, భయమ్ = భయము, శోకః = దుఃఖము, స్పృహా = తృష్ణ, పరిభవః = అవమానము, చ = మరియు, విపులః = విస్తార మగు, లోభః = లోభము, తావత్ = అంతవరకు, ఆర్తిమూలమ్ = దుఃఖము నకు ఏకైకకారణమగు, మమ = నాది, ఇతి = అనే, అసత్-అవగ్రహః = దురా గ్రహము.

మానవుడు ఎంతవరకు అభయస్థానమగు నీ పాదమును ఆశ్రయిం చడో, అంతవరకు వానికి డబ్బు ఇల్లు బంధువులు అనునవి ఉన్నప్పుడు కలిగే భయము, పోయినప్పుడు కలిగే దుఃఖము, తృష్ణ, అవమానము, అతిశయించిన లోభము తప్పవు; అంతవరకు వానికి, ఇది నాది అనే దుర భిమానము ఉండును. జనుల దుఃఖమునకు అట్టి దురాగ్రహమే ఏకైకకారణ ము అగుచున్నది.

దైవేన తే హతధియో భవతః ప్రసంగాత్
సర్వాశుభోపశమనాద్విముఖేంద్రియా యే ।
కుర్వంతి కామసుఖలేశలవాయ దీనా
లోభాభిభూతమనసోఽకుశలాని శశ్వత్ ॥ 7

యే = ఎవరైతే, సర్వ-అశుభ-ఉపశమనాత్ = అన్ని అమంగళము లను పోగొట్టే, భవతః = నీయొక్క, ప్రసంగాత్ = ప్రస్తావమునుండి, విముఖ-ఇంద్రియాః = విముఖములగు ఇంద్రియములు గలవారో, తే = వారు, దైవేన = దైవముచే, హతధియః = నశింపజేయబడిన బుద్ధి గలవారు, లోభ -అభిభూతమనసః = లోభముచే తిరస్కరించబడిన మనస్సులు గల, దీనాః = ఆ దీనులు, కామసుఖలేశలవాయ = ఇంద్రియభోగముల వలన కలిగే పిసరంత సుఖము కొరకు, శశ్వత్ = నిరంతరముగా, అకుశలాని = హానిని కలిగించే పనులను, కుర్వంతి = చేయుచుందురు.

శ్రవణకీర్తనరూపమగు నీ ప్రసంగము మానవులకు అమంగళము లనన్నింటినీ పోగొట్టును. కాని దైవవశముచే నష్టమైన బుద్ధిగల జనులు వాటియందు విముఖమైన ఇంద్రియములతో జీవించుచుందురు. వారి

మనస్సు తృష్ణకు వశమై స్వాతంత్ర్యమును కోల్పోయి యుండును. ఆ దీనులు విషయభోగముల వలన కలిగే పిసరంత సుఖము కొరకు ప్రాకులాడుచూ నిరంతరముగా అమంగళకరమగు కర్మలను చేయుచుందురు.

క్షుత్తృట్త్రిధాతుభిరిమా ముహురర్ద్యమానాః
శీతోష్ణవాతవర్షైరితరేతరాచ్చ ।
కామాగ్నినాచ్యుత రుషా చ సుదుర్భరేణ
సంపశ్యతో మన ఉరుక్రమ సీదతే మే ॥ 8

అచ్యుత = ఓ అచ్యుతా!, ఉరుక్రమ = విస్తారమైన పాదవిక్షేపము గలవాడా!, క్షుత్-తృట్-త్రిధాతుభిః = ఆకలి దప్పికలచే మరియు వాతపిత్తశ్లేష్మములచే, శీత-ఉష్ణవాతవర్షైః = చలి వేడి గాలి వర్షము అనువాటిచే, చ = మరియు, ఇతర-ఇతరాత్ = ఒకరి వలన మరియొకరు, కామ-అగ్నినా = కామనలు అనే అగ్నిచే, సుదుర్భరేణ = మిక్కిలి భరించ శక్యము కాని, రుషా = క్రోధముచే, ముహుః = మాటిమాటికీ, అర్ద్యమానాః = పీడించబడే, ఇమాః = ఈ జీవులను, సంపశ్యతః = చూచుచున్న, మే = నా, మనః = మనస్సు, సీదతే = ఖేదమును పొందుచున్నది.

అనంతశక్తి గల ఓ అచ్యుతా! ఈ జీవులను ఆకలి దప్పికలు, వాత పిత్తశ్లేష్మములనే ధాతువులలో వచ్చే వైషమ్యము వలన కలిగే రోగములు, చలి, వేడి, గాలి, వర్షము, కామము అనే అగ్ని మరియు మిక్కిలి భరించ శక్యము కాని కోపము నిరంతరముగా పీడించుచున్నవి. పైగా, వీరు ఒకరిని మరియొకరు పీడించుచున్నారు. ఇట్టి వీరిని చూచుచున్న నా మనస్సు క్రుంగిపోవుచున్నది.

యావత్పృథక్త్వమిదమాత్మన ఇంద్రియార్థ-
మాయాబలం భగవతో జన ఈశ పశ్యేత్ ।
తావన్న సంసృతిరసౌ ప్రతిసంక్రమేత
వ్యర్థాపి దుఃఖనివహం వహతీ క్రియార్థా ॥ 9

ఈశ = ఓ ఈశ్వరా!, యావత్ = ఎంతవరకైతే, జనః = మానవుడు, భగవతః = భగవానుని, ఇదమ్ = ఈ, ఇంద్రియ-అర్థమాయాబలమ్ = ఇంద్రియగోచరములగు విషయములు అనే రూపములోనున్న మాయయొక్క ఆధిక్యము గల, ఆత్మనః = ఆత్మకంటె, పృథక్త్వమ్ = భిన్నమగు దేహాదిభావమును, (ఆత్మనః = ఆత్మకు, భగవతః = భగవంతుని కంటె, పృథక్త్వమ్ = భిన్నత్వమును), పశ్యేత్ = దర్శించునో, తావత్ = అంతవరకు, క్రియా-అర్థా = కర్మల ఫలము గల, దుఃఖనివహమ్ = దుఃఖముల సమూహమును, వహతీ = కలిగించే, వ్యర్థా = నిరర్థకమగు, అసౌ = ఈ, సంసృతిః = సంసారము, న ప్రతిసంక్రమేత = వెనుకకు మళ్లదు.

ఓ ఈశ్వరా! భగవానుని మాయాశక్తియే జీవునియందు ఇంద్రియ రూపముగా, జగత్తునందు ఆ ఇంద్రియములకు గోచరమయ్యే విషయముల (శబ్దరూపరసస్పర్శగంధములు) రూపముగా విస్తరించి బలముగా బంధించియున్నది. ఆ బంధములోనున్న జీవుడు తాను చేసుకున్న కర్మల ఫలమును అనుభవిస్తూ జననమరణప్రవాహరూపమగు సంసారములో పడియున్నాడు. నిరర్థకము (మిథ్య) అగు ఈ సంసారము వానికి పలు దుఃఖములను తెచ్చి పెట్టుచున్నది. మానవుడు ఏనాటి వరకైతే దేహేంద్రియాదులకంటె విలక్షణమైన తన స్వరూపము (ఆత్మ) భగవానుని కంటె వేరుగా లేదనే సత్యమును దర్శించడో, అంతవరకు వానికి ఈ సంసారము తొలగిపోదు.

> అహ్న్యాపృతార్తకరణా నిశి నిశ్శయానా
> నానామనోరథధియా క్షణభగ్ననిద్రాః ।
> దైవాహతార్థరచనా ఋషయోఽపి దేవ
> యుష్మత్ప్రసంగవిముఖా ఇహ సంసరంతి ॥ 10

దేవ = ఓ దేవా!, యుష్మత్-ప్రసంగవిముఖాః = నీ ప్రసంగమునందు విముఖులైన, ఋషయః అపి = మహర్షులైననూ, అహ్ని = పగటియందు, ఆపృత-ఆర్తకరణాః = వివిధవ్యాపారములయందు తగుల్కొనియున్నవై క్లేశమును పొందియున్న ఇంద్రియములు గలవారై, నిశి = రాత్రి

యందు, నిశ్శయానాః = చక్కగా నిద్రించినవారై, నానామనోరథధియా = నానావిధములగు కామనలయందలి బుద్ధిచే, క్షణభగ్ననిద్రాః = క్షణకాలములో చెడిపోయిన నిద్ర గలవారై, దైవ-ఆహత-అర్థరచనాః = దైవముచే విఘాతము చేయబడిన అర్థము కొరకైన ప్రయత్నములు గలవారై, ఇహ= ఈ లోకములో, సంసరంతి = జననమరణప్రవాహములో కొట్టుకొని పోవుచుందురు.

ఓ దేవా! నీ లీలలను విని గానము చేయుటయందు ప్రీతి లేని జనులు మహర్షులే అయిననూ, వారి ఇంద్రియములు మరియు మనస్సు పగలు వివిధవ్యాపారములయందు తగుల్కొని క్లేశమును పొందుచుండును. రాత్రి వారు నిద్రించుచున్న సమయములోనైననూ నానావిధములగు కామనలు మనోవిజృంభణరూపమగు స్వప్నములో ప్రకటమగుటచే, క్షణకాలములో వారి నిద్ర చెడిపోవుచుండును. వారు ధనకనకవస్తువాహనాదులను సంపాదించుటకు చేసే ప్రయత్నములకు దైవము విఘాతము కలిగించుచుండును. వారీ విధముగా జననమరణప్రవాహరూపమగు ఈ సంసారములో పడి కొట్టుకొని పోవుచుందురు.

త్వం భావయోగపరిభావితహృత్సరోజ
ఆస్సే శ్రుతేక్షితపథో నను నాథ పుంసామ్ ।
యద్యద్ధియా త ఉరుగాయ విభావయంతి
తత్తద్వపుః ప్రణయసే సదనుగ్రహాయ ॥ **11**

నాథ = ఓ ప్రభూ!, శ్రుత-ఈక్షితపథః = శ్రవణముచే దర్శించబడే మార్గము గల, త్వమ్ = నీవు, పుంసామ్ = మానవుల, భావయోగపరిభావితహృత్-సరోజే = భక్తియోగముచే శోధితమైన హృదయపద్మమునందు, ఆస్సే నను = నిశ్చయముగా నున్నావు, ఉరుగాయ = పవిత్రమగు కీర్తి గలవాడా!, తే = వారు, యత్ యత్ = ఏయే, వపుః = రూపమును, విభావయంతి = భావన చేసెదరో, తత్ తత్ = ఆయా రూపమును, సత్-అనుగ్రహాయ = సత్పురుషులను అనుగ్రహించుటకై, ప్రణయసే = ప్రకటించెదవు.

పవిత్రమైన కీర్తి గల ఓ ప్రభూ! నీ లీలలను శ్రవణము చేయుటచే నీ మార్గము తెలియబడును. నీవు మానవులయొక్క భక్తియోగముచే పవిత్రమైన హృదయపద్మములో నిశ్చయముగా నివసించి యున్నావు. నీ భక్తులగు సత్పురుషులు ఏయే రూపమును ధ్యానించెదరో, వారిని అనుగ్రహించుట కొరకై, నీవు ఆయా రూపములను ప్రకటించెదవు.

నాతిప్రసీదతి తథోపచితోపచారై-
రారాధితస్సురగణైర్హృది బద్ధకామైః ।
యత్సర్వభూతదయయాసదలభ్యయైకో
నానాజనేష్వవహితస్సుహృదంతరాత్మా ॥ 12

ఏకః = అద్వితీయుడవు, నానాజనేషు = సకలప్రాణులయందు, అవహితః = ఉన్నవాడవు, సుహృత్ = హితకారివి, అంతరాత్మా = అంతరాత్మవు అగు నీవు, అసత్-అలభ్యయా = భక్తులు కానివారిచే పొందబడని, సర్వభూతదయయా = సకలప్రాణులయందలి దయచే, యత్ = ఏ విధముగా, అతిప్రసీదతి = మిక్కిలి ప్రసన్నుడవగుచున్నావో, తథా = ఆ విధముగా, హృది = హృదయమునందు, బద్ధకామైః = గట్టిగా ఉంచబడిన కామనలు గల, సురగణైః = దేవతాగణములచే, ఉపచిత-ఉపచారైః = విపులమగు సామగ్రులచే, ఆరాధితః = ఆరాధింపబడినవాడవై, న = ప్రసన్నుడవు కావు.

అద్వితీయ పరబ్రహ్మవగు నీవు సకలప్రాణుల అంతఃకరణముల యందు అంతరాత్మరూపుడవై యుండి హితమును చేయుచున్నావు. అట్టి నీవు సాధకులయందు ఉండే సకలప్రాణులయందలి దయచే చాల ప్రసన్నుడవగుదువు. దేవతాగణములు తమ హృదయములలో దృఢమగు కామనలు గలవారై విపులమగు సామగ్రులతో నిన్ను ఆరాధించినప్పుడు కూడ నీకు అంతటి ప్రసన్నత కలుగదు. అట్టి భూతదయ నీ భక్తులు కాని దుష్టులకు దుర్లభము.

పుంసామతో వివిధకర్మభిరధ్వరాద్యైః
దానేన చోగ్రతపసా వ్రతచర్యయా చ ।
ఆరాధనం భగవతస్తవ సత్క్రియార్థో

ధర్మోఽర్పితః కర్హిచిన్మ్రియతే న యత్ర ॥ 13

అతః = ఇందువలన, పుంసామ్ = మానవులకు, అధ్వర-ఆద్యైః = యజ్ఞము మొదలగు, వివిధకర్మభిః = వివిధములగు కర్మలచే, దానేన = దానముచే, ఉగ్రతపసా = కఠోరమగు తపస్సుచే, చ = మఱియు, వ్రతచర్యయా = వ్రతములననుష్ఠించుటచే, భగవతః = భగవానుడవగు, తవ = నీ, ఆరాధనమ్ = ఆరాధనమే, సత్-క్రియా-అర్థః = శ్రేష్ఠమగు కర్మకు ఫలము, యత్ర = ఏ నీయందు, అర్పితః = సమర్పించబడిన, ధర్మః = ధర్మము, కర్హిచిత్ = ఏ కాలమునందైననూ, న మ్రియతే = నశించదో.

కావున, మానవులు యజ్ఞము మొదలగు వివిధకర్మలను, దానమును, కఠోరమగు తపస్సును మరియు వ్రతములను చేసి నిన్ను ఆరాధించుట (నిన్ను ప్రసన్నుని చేసుకొనుట) యే ఆ సత్కర్మలకు మహాఫలము. ఏలయనగా, నీయందు సమర్పించబడిన ధర్మమునకు ఏ కాలమునందైననూ నాశము లేదు.

శశ్వత్స్వరూపమహసైవ నిపీతభేద-
మోహాయ బోధధిషణాయ నమః పరస్మై ।
విశ్వోద్భవస్థితిలయేషు నిమిత్తలీలా-
రాసాయ తే నమ ఇదం చకృమేశ్వరాయ ॥ 14

శశ్వత్ = శాశ్వతముగా, స్వరూపమహసా ఏవ = స్వరూపభూతమగు చైతన్యము చేతనే, నిపీతభేదమోహాయ = త్రోసిపుచ్చబడిన భేదభ్రమ గలిగిన, బోధధిషణాయ = జ్ఞానమునకు అధిష్ఠానమైన, పరస్మై = పరమేశ్వరుని కొరకు, నమః = నమస్కారము, విశ్వ-ఉద్భవస్థితిలయేషు = జగత్తు యొక్క సృష్టిస్థితిప్రళయములయందు, నిమిత్తలీలారాసాయ = కారణమగు మాయాశక్తి లీలలే క్రీడగా గల, ఈశ్వరాయ = శాసకుడవగు, తే = నీ కొరకు, ఇదమ్ = ఈ, నమః = నమస్కారమును, చకృమ = చేయుచున్నాము.

జ్ఞానమునకు అధిష్ఠానమగు నీవు నీ స్వరూపమగు చైతన్యము యొక్క మహిమ చేతనే మానవులలోని భేదభ్రమను శాశ్వతముగా త్రోసిపుచ్చెదవు. జగత్తుయొక్క సృష్టిస్థితిప్రళయములకు నిమిత్తమగు నీ మాయా

శక్తియొక్క విలాసము నీ క్రీడయే. నీవే జగన్నాథుడవు, పరమేశ్వరుడవు. ఇదిగో! నీకు పలు పర్యాయములు నమస్కరించుచున్నాను.

యస్యావతారగుణకర్మవిడంబనాని
నామాని యేఽసువిగమే వివశా గృణంతి ।
తే నైకజన్మశమలం సహసైవ హిత్వా
సంయాంత్యపావృతమృతం తమజం ప్రపద్యే ॥ 15

యస్య = ఏ పరమేశ్వరుని, అవతారగుణకర్మవిడంబనాని = అవతారముల గుణములను మరియు కర్మలను అనుకరించే, నామాని = నామములను, యే = ఎవరైతే, అసువిగమే = ప్రాణము పోయే సమయమునందు, వివశాః = పరవశులై యున్ననూ, గృణంతి = ఉచ్చరించెదరో, తే = వారు, నైకజన్మశమలమ్ = అనేకజన్మల పాపమును, సహసా ఏవ = వెను వెంటనే, హిత్వా = విడిచిపెట్టి, అపావృతమ్ = తొలగిన ఆవరణము గల, ఋతమ్ = పరబ్రహ్మను, సంయాంతి = పొందుచున్నారో, తమ్ = అట్టి, అజమ్ = పుట్టుక లేని పరమేశ్వరుని, ప్రపద్యే = శరణు వేడుచున్నాను.

ఎవరైతే ప్రాణము పోయే సమయమునందు పరవశులై యుండియూ పరమేశ్వరుని అవతారములలోని గుణములను మరియు కర్మలను సూచించే ఆయన నామములను ఉచ్చరించెదరో, వారు అనేకజన్మల పాపమును వెంటనే విడిచిపెట్టి, అజ్ఞానముయొక్క ఆవరణము లేని బ్రహ్మపదమును పొందుచున్నారు. అట్టి అజుడగు ఆ పరమేశ్వరుని శరణు వేడుచున్నాను.

యో వా అహం చ గిరిశశ్చ విభుస్స్వయం చ
స్థిత్యుద్భవప్రలయహేతవ ఆత్మమూలమ్ ।
భిత్త్వా త్రిపాద్వవృధ ఏక ఉరుప్రరోహః
తస్మై నమో భగవతే భువనద్రుమాయ ॥ 16

యః వై = ఏ, ఏకః = అద్వితీయుడగు పరమేశ్వరుడు, ఆత్మమూలమ్ = తానే అధిష్ఠానముగా గల మాయాశక్తిని, భిత్త్వా = విడగొట్టి, స్థితి-ఉ

ద్భవప్రలయహేతవః = సృష్టిస్థితిలయములకు కారణములగు, అహమ్ = నేను, గిరిశః = శివుడు, చ = మరియు, స్వయమ్ = స్వయముగా, విభుః చ = విష్ణుప్రభుడు అయి, త్రిపాత్ = ఆ మూడు మూర్తులే మూడు ప్రూను లుగా గలవాడై, ఉరుప్రరోహః = మరీచి మనువు మొదలైన అనేకములగు కొమ్మలు గలవాడై, వవృధే = వర్ధిల్లెనో, తస్మై = అట్టి, భువనద్రుమాయ = జగత్తు అనే వృక్షము రూపములోనున్న, భగవతే = భగవానుని కొరకు, నమః = నమస్కారము.

అద్వితీయుడగు ఆ పరమేశ్వరుడు తనను అధిష్ఠించియున్న తన మాయాశక్తిని రజస్సత్త్వతమోగుణములు అనే భేదముచే విడగొట్టి, క్రమముగా ఆ గుణములను ఉపాధులుగా చేసుకొని, బ్రహ్మ విష్ణువు రుద్రుడు అనే మూడు మూర్తులను దాల్చి, క్రమముగా జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను చేయుచున్నాడు. ఆ మాయశక్తియే ఇంకనూ పరిణమించి, మరీచి మనువు మొదలగు ప్రజాపతులకు ఉపాధి అగుచున్నది. ఈ విధముగా త్రిమూర్తులే ప్రూనులు కాగా, ప్రజాపతులు మొదలగువారు శాఖోపశాఖలు కాగా, ఆ పరమేశ్వరుడు జగత్తు అనే వృక్షము రూపములో ప్రకటమైనాడు. ఆ భగవానునకు నమస్కారము.

లోకో వికర్మనిరతః కుశలే ప్రమత్తః
కర్మణ్యయం త్వదుదితే భవదర్చనే స్వే ।
యస్తావదస్య బలవానిహ జీవితాశాం
సద్యశ్ఛినత్త్యనిమిషాయ నమోఽస్తు తస్మై ॥ 17

లోకః = మానవుడు, వికర్మనిరతః = నిషిద్ధకర్మలయందు ఆసక్తి గలవాడై, త్వత్-ఉదితే = నీచే బోధించబడిన, స్వే = స్వధర్మమైన, భవత్-అర్చనే = నిన్ను అర్చించుట అనే, కుశలే = హితకరమగు, కర్మణి = కర్మయందు, ప్రమత్తః = శ్రద్ధ లేనివాడు, తావత్ = అంతలో, అస్య = ఈ మానవుని, ఇహ = ఈ లోకమునందు, జీవిత-ఆశామ్ = జీవితమునందలి ఆశను, బలవాన్ = బలశాలియగు, యః = ఏ కాలము, సద్యః = వెంటనే, ఛినత్తి =

తెగగొట్టుచున్నదో, తస్మై = అట్టి, అనిమిషాయ = కాలస్వరూపుడగు, తస్మై = ఆ భగవానుని కొరకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక!

భగవదారాధనము మానవునకు హితకరమగు స్వధర్మము. దానిని భగవానుడే బోధించియున్నాడు. కాని, ఏ మానవుడు దానియందు శ్రద్ధ లేనివాడై, నిషిద్ధమగు కర్మలను ఆచరించునో, వానికి ఈ లోకములో జీవించాలనే ఆశను కాలము వెంటనే తెగగొట్టుచుండును. కాలము చాల బలీయమైనది. అట్టి కాలమే స్వరూపముగా గల భగవానునకు నమస్కారము.

యస్మాద్బిభేమ్యహమపి ద్విపరార్ధధిష్ణ్య-
మధ్యాసితస్సకలలోకనమస్కృతం యత్ ।
తేపే తపో బహుసవోఽవరురుత్సమానః
తస్మై నమో భగవతేఽధిమఖాయ తుభ్యమ్ ॥ 18

సకలలోకనమస్కృతమ్ = సకలలోకములచే పూజించబడునది, ద్విపరార్ధధిష్ణ్యమ్ = రెండు పరార్ధముల కాలము వరకు నిలిచియుండు స్థానము అగు, యత్ = ఏ బ్రహ్మలోకమును, అధ్యాసితః = అధిష్ఠించియున్న, అహం అపి = నేను కూడా, యస్మాత్ = ఏ కాలము వలన, బిభేమి = భయపడెదనో, అవరురుత్సమానః = (నిన్ను) పొందగోరువాడనై, బహుసవః = అనేకములగు యజ్ఞములు (సంవత్సరములు) గలవాడనై, తపః = తపస్సును, తేపే = చేసితినో, తస్మై = అట్టి, అధిమఖాయ = యజ్ఞమునకు అధిష్ఠానమగు, భగవతే = భగవానుడవగు, తుభ్యమ్ = నీ కొరకు, నమః = నమస్కారము.

బ్రహ్మలోకమును ఇతరలోకములలోని జీవులందరు నమస్కరింతురు. అది రెండు పరార్ధముల కాలము (వెయ్యి మహాయుగములు ఒక పగలు అనే లెక్కలో వేయి సంవత్సరములు పరార్ధమగును) వరకు నిలిచియుండును. ఆ బ్రహ్మలోకమునకు అధీశ్వరుడనగు నేను కూడా కాలమునకు భయపడుచుందును. నేను నిన్ను పొందగోరి, అనేకములగు యజ్ఞములను చేసి, అనేక సంవత్సరముల కాలము తపస్సును సలిపితిని. అట్టి

యజ్ఞములకు అధిష్ఠానమగు పురుషుడవు నీవే. ఆ కాలము భగవానుడవగు నీ స్వరూపమే. అట్టి నీకు నమస్కారము.

తిర్యఙ్మనుష్యవిబుధాదిషు జీవయోని-
ష్వాత్మేచ్ఛయాఽఽత్మకృతసేతుపరీప్సయా యః ।
రేమే నిరస్తరతిరప్యవరుద్ధదేహః
తస్మై నమో భగవతే పురుషోత్తమాయ ॥ 19

యః = ఏ భగవానుడు, నిరస్తరతిః అపి = త్రోసిపుచ్చబడిన విషయ సుఖములయందలి ఇచ్ఛ గలవాడే అయిననూ, తిర్యక్-మనుష్యవిబుధ-ఆదిషు = పశుపక్ష్యాదులు మనుష్యులు దేవతలు మొదలగు, జీవయోనిషు = జీవయోనులయందు, ఆత్మేచ్ఛయా = స్వేచ్ఛచే, అవరుద్ధదేహః = స్వీకరించబడిన దేహములు గలవాడై, ఆత్మకృతసేతుపరీప్సయా = తనచే నిర్మించబడిన కర్మమర్యాదను పాలించే కోరికతో, రేమే = రమించినాడో, తస్మై = అట్టి, పురుషోత్తమాయ భగవతే = పురుషోత్తమ భగవానునకు, నమః = నమస్కారము.

భగవానునకు విషయసుఖములయందు ఆసక్తి లేశమైననూ లేదు. అయిననూ, ఆయన పశువులు పక్షులు మనుష్యులు దేవతలు మొదలగు జీవయోనులయందు తన ఇచ్ఛచే శరీరములను దాల్చి, తాను నిర్మించిన ధర్మమర్యాదను పాలించే కోరికతో రమించెను. అట్టి పురుషోత్తమ భగవానునకు నమస్కారము.

యోఽవిద్యయానుపహతోఽపి దశార్ధవృత్త్యా
నిద్రాముువాహ జఠరీకృతలోకయాత్రః ।
అంతర్జలేఽహికశిపుస్పర్శానుకూలాం
భీమోర్మిమాలిని జనస్య సుఖం వివృణ్వన్ ॥ 20

జఠరీకృతలోకయాత్రః = తన జఠరమునందు ఉంచబడిన లోకస్థితి గల, యః = ఏ భగవానుడు, దశ-అర్ధవృత్త్యా = అవిద్య (మోహము) అస్మిత రాగము ద్వేషము అభినివేశము అనే అయిదు వ్యాపారములు గల,

అవిద్యయా = అవిద్యచే, అనుపహతః అపి = పరాభూతుడు కాకున్ననూ, భీమ-ఊర్మిమాలిని = భయంకరమగు తరంగముల వరుసలు గల, అంత ర్జలే = జలములయందు, జనస్య = మానవునకు, సుఖమ్ = సుఖమును, వివృణ్వన్ = ప్రదర్శించుచున్నవాడై (కలిగించుచున్నవాడై), అహికశిపుస్ప ర్శ-అనుకూలామ్ = ఆదిశేషుడనే శయ్యయొక్క స్పర్శచే అనుకూలము గానున్న, నిద్రామ్ = నిద్రను, ఉవాహ = పొందెనో.

భగవానుడు ప్రళయకాలములో సకలప్రాణులను తన ఉదరము నందు నిలిపి యుంచినాడు. అవిద్య అస్మిత రాగము ద్వేషము అభినివే శము (మరణభయము) అనే అయిదు చిత్తక్లేశములు భగవానుని నిర్జించలే వు. అయిననూ, ఆయన తనలోని ప్రాణులకు నిద్రాసుఖమును కలిగించు వాడై, భయంకరమగు తరంగముల పంక్తులతో గూడియున్న ప్రళయకాలజ లములయందు, మెత్తని స్పర్శతో అనుకూలముగానుండే ఆదిశేషుడనే తల్పముపై యోగనిద్రను స్వీకరించెను.

యన్నాభిపద్మభవనాదహమాసమీడ్య
లోకత్రయోపకరణో యదనుగ్రహేణ ।
తస్మై నమస్త ఉదరస్థభవాయ యోగ-
నిద్రావసానవికసన్నలినేక్షణాయ ॥ 21

ఈడ్య = ఓ కొనియాడదగినవాడా!, లోకత్రయ-ఉపకరణః = ముల్లోకములకు ఉపకరించే, అహమ్ = నేను, యత్-అనుగ్రహేణ = ఎవని అనుగ్రహముచే, యత్-నాభిపద్మభవనాత్ = ఎవని నాభియందలి పద్మము అనే గృహమునుండి, ఆసమ్ = జన్మించితినో, ఉదరస్థభవాయ = ఉదరము నందున్న ప్రపంచము గల, యోగనిద్రా-అవసానవికసత్-నలిన-ఈక్షణాయ = యోగనిద్రయొక్క అంతమునందు తెరుచుకొనుచున్న కలువలవంటి కన్నులు గల, తస్మై = అట్టి, తే = నీ కొరకు, నమః = నమస్కారము.

ఓ కొనియాడదగినవాడా! ముల్లోకములకు సృష్టికార్యము ద్వారా ఉపకరించే నేను నీ అనుగ్రహముచే నీ నాభియందలి పద్మము అనే ఇంటి నుండి జన్మించితిని. ఈ ప్రపంచమంతయు నీ ఉదరమునందు నిలిచియు

న్నది. ఇప్పుడిప్పుడే నీ యోగనిద్ర అంతమగుచున్నది. కలువలవంటి నీ కన్నులు తెరుచుకొనుచున్నవి. అట్టి నీకు నమస్కారము.

సోఽయం సమస్తజగతాం సుహృదేక ఆత్మా
సత్త్వేన యన్మృడయతే భగవాన్ భగేన ।
తేనైవ మే దృశమనుస్పృశతాద్యథాహం
స్రక్ష్యామి పూర్వవదిదం ప్రణతప్రియోఽసౌ ॥ 22

సః = అట్టి, సమస్తజగతామ్ = జగత్తులన్నింటికీ, సుహృత్ = హితకారి, ఏకః = అద్వితీయుడు, ఆత్మా = ఆత్మరూపుడు అగు, అయమ్ = ఈ, భగవాన్ = శ్రీహరి భగవానుడు, యత్ = ఏ, సత్త్వేన = జ్ఞానముచే, భగేన = ఐశ్వర్యముచే, ఇదమ్ = ఈ జగత్తును, మృడయతే = సుఖింపజేయుచున్నాడో, తేన ఏవ = దానిచే మాత్రమే, మే = నా, దృశమ్ = ప్రజ్ఞను, అనుస్పృశతాత్ = కలుపుగాక!, యథా = ఏ విధముగానైతే, అహమ్ = నేను, పూర్వవత్ = పూర్వమునందు వలెనే, స్రక్ష్యామి = సృష్టించగలనో, అసౌ = ఈ శ్రీహరి, ప్రణతప్రియః = శరణు జొచ్చినవారికి ప్రీతిని చేయువాడు.

సకలజగత్తులకు హితకారి, అద్వితీయుడు, ఆత్మరూపుడు అగు అట్టి ఈ శ్రీహరి భగవానుడు ఏ జ్ఞానముతో మరియు ఐశ్వర్యముతో జగత్తునకు ఆనందమును కలిగించుచున్నాడో, అదే జ్ఞానమును మరియు ఐశ్వర్యమును నా బుద్ధికి సమకూర్చుగాక! దాని వలన, నేను పూర్వమునందు వలెనే జగత్తును సృష్టించగల్గుదును. ఈ శ్రీహరి శరణు జొచ్చినవారికి ప్రీతిని కలిగించును.

ఏష ప్రపన్నవరదో రమయాఽఽత్మశక్త్యా
యద్యత్కరిష్యతి గృహీతగుణావతారః ।
తస్మిన్ స్వవిక్రమమిదం సృజతోఽపి చేతో
యుంజీత కర్మశమలం చ యథా విజహ్యామ్ ॥ 23

ప్రపన్నవరదః = శరణు జొచ్చినవారికి వరములనిచ్చే, ఏషః = ఈ శ్రీహరి, ఆత్మశక్త్యా = తన శక్తిస్వరూపిణియగు, రమయా = లక్ష్మీదేవితో

గూడి, గృహీతగుణ-అవతారః = స్వీకరించబడిన గుణములను ప్రకటించే అవతారములు గలవాడై, యత్ యత్ = ఏయే లీలను, కరిష్యతి = చేయబో వుచున్నాడో, తస్మిన్ = దానియందు, స్వవిక్రమమ్ = నీ ప్రభావమే గల, ఇదమ్ = ఈ జగత్తును, సృజతః = సృష్టించుచున్న నా, చేతః అపి = మనస్సు కూడా, యుంజీత = నిలిచియుండుగాక!, యథా = ఏ విధ ముగానైతే, కర్మశమలమ్ = కర్మదోషమును, విజహ్యామ్ = విడిచిపెట్టెదనో.

ఈ శ్రీహరి శరణు జొచ్చినవారికి వరములనిచ్చును. ఆయన తన శక్తిస్వరూపిణియగు లక్ష్మీదేవితో గూడి అవతారములను స్వీకరించి, వాటి యందు తన దివ్యగుణములను ప్రకటిస్తూ లీలలను నెరపబోవుచున్నాడు. నా ఈ సృష్టిక్రియ కూడ ఆయన ప్రభావమే. సృష్టిని చేయుచున్న నా మనస్సు కూడ ఆయనయొక్క ఆయా లీలలయందు నిలిచియుండుగాక! దాని వలన, నాకు కర్తృత్వాభిమానము అనే కర్మదోషము దూరమగును.

నాభిహ్రదాదిహ సతోఽంభసి యస్య పుంసో
విజ్ఞానశక్తిరహమాసమనంతశక్తేః ।
రూపం విచిత్రమిదమస్య వివృణ్వతో మే
మా రీరిషీష్ట నిగమస్య గిరాం విసర్గః ॥ 24

ఇహ = ఈ, అంభసి = నీటియందు, సతః = ఉన్న, యస్య = ఏ, అనంతశక్తేః = అనంతమగు శక్తిగల, పుంసః = పురుషుని, నాభిహ్రదాత్ = నాభి అనే సరోవరమునుండి, విజ్ఞానశక్తిః = జ్ఞానశక్తిస్వరూపుడనగు, అహమ్ = నేను, ఆసమ్ = పుట్టితినో, అస్య = ఈ పురుషుని, ఇదమ్ = ఈ, విచిత్రమ్ = నానావిధమగు, రూపమ్ = జగద్రూపమును, వివృణ్వతః = విస్త రింపజేసే, మే = నాకు, నిగమస్య = వేదముయొక్క, గిరామ్ = వాక్కుల యొక్క, విసర్గః = ఉచ్చారణము, మా రీరిషీష్ట = క్షీణించకుండుగాక!

ఈ ప్రళయజలమునందు శయనించియున్న అనంతశక్తిమంతు డగు పురుషోత్తముని నాభికమలమునుండి నేను పుట్టితిని. నేను ఆ పురు షుని విజ్ఞానశక్తి స్వరూపుడనే. నేను ఇప్పుడు నానావిధమగు జగత్తును

సృష్టించబోవుచున్నాను. ఈ జగత్తు కూడ ఆ పురుషుని రూపమే. అట్టి నాకు వేదవాక్కుల ఉచ్చారణము క్షీణించకుండుగాక!

సోఽసావదభ్రకరుణో భగవాన్ వివృద్ధ-
ప్రేమస్మితేన నయనాంబురుహం విజృంభన్ ।
ఉత్థాయ విశ్వవిజయాయ చ నో విషాదం
మాధ్వ్యా గిరాపనయతాత్పురుషః పురాణః ॥ 25

అదభ్రకరుణః = గొప్ప దయ గలవాడు, పురాణః పురుషః = ఆదిపురుషుడు అగు, సః = అట్టి, అసౌ = ఈ, భగవాన్ = భగవానుడు, వివృద్ధప్రేమస్మితేన = వర్ధిల్లిన ప్రేమగల చిరునగవుతో, నయన-అంబురుహమ్ = పద్మమువంటి నేత్రమును, విజృంభన్ = వికసింపజేయుచున్నవాడై, విశ్వవిజయాయ చ = జగత్తుయొక్క సృష్టి కొరకు కూడా, ఉత్థాయ = నిద్ర లేచి, మాధ్వ్యా = తేనెలొలికే, గిరా = వాక్కుతో, నః = మా, విషాదమ్ = దుఃఖమును, అపనయతాత్ = దూరము చేయును గాక!

పురాణపురుషుడవగు నీవు గొప్ప దయగల భగవానుడవు. నీవు ప్రేమతో నిండిన చిరునగవుతో పద్మములవంటి కన్నులను వికసింపజేయుచూ, నిద్ర లెమ్ము. అప్పుడు మాత్రమే జగత్తుయొక్క సృష్టి సంభవమగును. లేచి, నీ తేనెలొలికే మాటలతో నా దుఃఖమును దూరము చేయుము.

మైత్రేయ ఉవాచ ।
స్వసంభవం నిశామ్యైవం తపోవిద్యాసమాధిభిః ।
యావన్మనోవచః స్తుత్వా విరరామ స ఖిన్నవత్ ॥ 26

ఏవమ్ = ఈ విధముగా, తపోవిద్యాసమాధిభిః = తపస్సు ఉపాసన చిత్తైకాగ్రత అనువాటి ద్వారా, స్వసంభవమ్ = తన తండ్రిని, నిశామ్య = చూచి, యావత్-మనోవచః = తన మనస్సునకు వాక్కునకు అనురూపముగా, స్తుత్వా = స్తుతించి, సః = ఆ బ్రహ్మ, ఖిన్నవత్ = అలసినవాని వలె, విరరామ = విరమించెను.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- ఈ విధముగా బ్రహ్మగారు తపస్సును చేసి, భగవానుని ఉపాసించి ఏకాగ్రమగు చిత్తముతో ఆయనను దర్శించెను. తరువాత బ్రహ్మ ఆయనను తన మనస్సునకు వాక్కునకు చేతనైనంత వరకు స్తుతించి, అలసినాడా యన్నట్లు విరమించెను.

అథాభిప్రేతమన్వీక్ష్య బ్రహ్మణో మధుసూదనః ।
విషణ్ణచేతసం తేన కల్పవ్యతికరాంభసా ॥ 27

లోకసంస్థానవిజ్ఞాన ఆత్మనః పరిఖిద్యతః ।
తమాహాగాధయా వాచా కశ్మలం శమయన్నివ ॥ 28

అథ = తరువాత, మధుసూదనః = మధుసూదన భగవానుడు, ఆత్మనః = తనయొక్క, లోకసంస్థానవిజ్ఞానే = లోకముల రచనకు సంబంధించిన విజ్ఞానము విషయములో, పరిఖిద్యతః = చాల ఖేదమును పొందియున్న, బ్రహ్మణః = బ్రహ్మయొక్క, అభిప్రేతమ్ = అభిప్రాయమును, అన్వీక్ష్య = ఆలకించి, తేన = ఆ, కల్పవ్యతికర-అంభసా = ప్రళయకాలజలముచే, విషణ్ణచేతసమ్ = విషాదముతో నిండిన మనస్సు గల, తమ్ = ఆ బ్రహ్మను ఉద్దేశించి, కశ్మలమ్ = మోహమును, శమయన్ ఇవ = పోగొట్టుచున్నాడా యన్నట్లు, అగాధయా = గంభీరమగు, వాచా = వాక్కుతో, ఆహ = పలికెను.

బ్రహ్మ తాను సృష్టించవలసిన లోకముల రచన విషయములో విజ్ఞానము లేక చాల ఖేదముననుభవించుచుండెను. పైగా, ఆయన ఆ ప్రళయకాలజలములను చూచి మనస్సులో విషాదమును పొందుచుండెను. అట్టి బ్రహ్మగారి అభిప్రాయమును విన్న మధుసూదన భగవానుడు ఆ బ్రహ్మయొక్క మోహమును తొలగిస్తూ, గంభీరమగు వచనముతో ఆయనతో ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
మా వేదగర్భ గాస్తంద్రీం సర్గ ఉద్యమమావహ ।
తన్మయాఽఽపాదితం హ్యగ్రే యన్మాం ప్రార్థయతే భవాన్ ॥ 29

వేదగర్భ = వేదములకు నిధియైన ఓ బ్రహ్మ!, తంద్రీమ్ = అలసత్వమును, మా గాః = పొందకుము, సర్గే = సృష్టియందు, ఉద్యమమ్ = ప్రయత్నమును, ఆవహ = చేపట్టుము, హి = ఏలయనగా, యత్ = దేనిని, మామ్ = నన్ను, భవాన్ = నీవు, ప్రార్థయతే = ప్రార్థించుచున్నావో, తత్ = అది, మయా = నాచే, అగ్రే = ముందే, ఆపాదితమ్ = సంపాదించబడినది.

శ్రీభగవానుడు ఇట్లు పలికెను --- ఓ బ్రహ్మ! నీవు వేదనిధివి. దుఃఖమును, అలసత్వమును పొందకుము. సృష్టిప్రయత్నమును చేపట్టుము. ఏలయనగా, నీవు కోరేదానిని నేను ముందే భద్రము చేసితిని.

భూయస్త్వం తప ఆతిష్ఠ విద్యాం చైవ మదాశ్రయామ్ ।
తాభ్యామంతర్హృది బ్రహ్మన్ లోకాన్ ద్రక్ష్యస్యపావృతాన్ ॥ 30

బ్రహ్మన్ = ఓ బ్రహ్మ!. త్వమ్ = నీవు, భూయః = మరల, తపః = తపస్సును, మత్-ఆశ్రయామ్ = నేను ఆశ్రయముగా గల, విద్యాం చ ఏవ = ఉపాసనను కూడ, ఆతిష్ఠ = అనుష్ఠించుము, తాభ్యామ్ = వాటిచే, అంతర్హృది = అంతఃకరణమునందు, అపావృతాన్ = సుస్పష్టమైన, లోకాన్ = లోకములను, ద్రక్ష్యసి = చూడగలవు.

ఓ బ్రహ్మ! నీవు మరల తపస్సును చేసి, నన్ను ఉపాసించుము. ఆ తపస్సుచే మరియు ఉపాసనలచే నీవు అంతఃకరణమునందు లోకములను సుస్పష్టముగా చూడగల్గుదువు.

తత ఆత్మని లోకే చ భక్తియుక్తస్సమాహితః ।
ద్రష్టాసి మాం తతం బ్రహ్మన్మయి లోకాంస్త్వమాత్మనః ॥ 31

బ్రహ్మన్ = ఓ బ్రహ్మ!, తతః = తరువాత, భక్తియుక్తః = భక్తితో గూడినవాడవై, సమాహితః = ఏకాగ్రచిత్తము గలవాడవై, త్వమ్ = నీవు, ఆత్మని = నీయందు, చ = మరియు, లోకే = జగత్తునందు, తతమ్ = వ్యాపించియున్న, మామ్ = నన్ను, మయి = నాయందు, ఆత్మనః = నీ, లోకాన్ = లోకములను, ద్రష్టాసి = చూడగలవు.

ఓ బ్రహ్మా! తరువాత భక్తిగల నీవు ఏకాగ్రచిత్తుడవై నీయందు జగత్తునందు వ్యాపించియున్న నన్ను, మరియు నాయందు నీచే సృష్టించబడిన లోకములను చూడగలవు.

యదా తు సర్వభూతేషు దారుష్వగ్నిమివ స్థితమ్ ।
ప్రతిచక్షీత మాం లోకో జహ్యాత్తర్హ్యేవ కశ్మలమ్ ॥ 32

యదా తు = ఏ కాలమునందైతే, లోకః = మానవుడు, సర్వభూతేషు = సకలప్రాణులయందు, దారుషు = కట్టెలయందు, అగ్నిం ఇవ = అగ్నివలె, స్థితమ్ = ఉన్న, మామ్ = నన్ను, ప్రతిచక్షీత = చూచునో, తర్హి ఏవ = అదే కాలమునందు, కశ్మలమ్ = మోహమును, జహ్యాత్ = విడిచిపెట్టును.

నేను సకలప్రాణులలో కట్టెలలో నిప్పు వలె వ్యాపించియున్నాను. ఈ సత్యమును మానవుడు ఏ సమయములో దర్శించునో, అదే సమయములో వాని అజ్ఞానమాలిన్యము తొలగిపోవును.

యదా రహితమాత్మానం భూతేంద్రియగుణాశయైః ।
స్వరూపేణ మయోపేతం పశ్యన్ స్వారాజ్యమృచ్ఛతి ॥ 33

యదా = ఏ కాలములో, భూత-ఇంద్రియగుణ-ఆశయైః = పంచభూతములు ఇంద్రియములు గుణములు మరియు అంతఃకరణము అనువాటిచే, రహితమ్ = కూడుకొనని, స్వరూపేణ = స్వరూపముచే, మయా = నాచే, ఉపేతమ్ = కూడుకొనియున్న, ఆత్మానమ్ = ఆత్మను, పశ్యన్ = చూచుచున్నాడో, స్వారాజ్యమ్ = మోక్షపదమును, ఋచ్ఛతి = పొందును.

పంచభూతములు, ఇంద్రియములు, సత్త్వరజస్తమోగుణములు మరియు అంతఃకరణము అనువాటికంటె విలక్షణుడనగు నేను ప్రత్యగభిన్నమగు (ఆత్మ-అభిన్నమగు) పరబ్రహ్మస్వరూపుడను అని మానవుడు ఏ కాలములో దర్శించునో, అదే క్షణములో ఆతడు మోక్షసామ్రాజ్యమును అధిష్ఠించును.

నానాకర్మవితానేన ప్రజా బహ్వీస్సిసృక్షతః ।

నాత్మావసీదత్యస్మింస్తే వర్షీయాన్మదనుగ్రహః ॥ 34

నానాకర్మవితానేన = అనేకకర్మల విస్తారముచే, బహ్వీః = అనేకుల గు, ప్రజాః = ప్రాణులను, సిసృక్షతః = సృష్టించగోరే, తే = నీ, ఆత్మా = అంతఃకరణము, అస్మిన్ = ఈ విషయమునందు, న అవసీదతి = వ్యామోహమును చెందదు, మత్-అనుగ్రహః = నా అనుగ్రహము, వర్షీయాన్ = అత్యధికము.

నీవు అనేకులగు ప్రాణులను వారి వారి వివిధములగు కర్మల విస్తారమునను సరించి సృష్టించగోరుచున్నావు. ఈ కార్యములో నీ అంతఃకరణము వ్యామోహమును పొందదు. ఏలయనగా, నీపై నా అతిశయించిన అనుగ్రహము గలదు.

ఋషిమాద్యం న బధ్నాతి పాపీయాంస్త్వాం రజోగుణః ।
యన్మనో మయి నిర్బద్ధం ప్రజాస్సంసృజతోఽపి తే ॥ 35

పాపీయాన్ = పాపభూయిష్ఠమగు, రజోగుణః = రజోగుణము, ఆద్యమ్ = మొట్టమొదటి, ఋషిమ్ = మంత్రద్రష్టవగు, త్వామ్ = నిన్ను, న బధ్నాతి = బంధించదు, యత్ = ఏలయనగా, ప్రజాః = ప్రాణులను, సృజతః అపి = సృష్టించుచున్నవాడవే అయిననూ, తే = నీ, మనః = మనస్సు, మయి = నాయందు, నిర్బద్ధమ్ = దృఢముగా నిలిచియున్నది.

నీవు మొట్టమొదటి మంత్రద్రష్టవు. పాపభూయిష్ఠమగు రజోగుణము నిన్ను బంధించదు. ఏలయనగా, నీవు ప్రాణులను సృష్టించుచున్ననూ, నీ మనస్సు నాపై దృఢముగా నిలిచియున్నది.

జ్ఞాతోఽహం భవతా త్వద్య దుర్విజ్ఞేయోఽపి దేహినామ్ ।
యన్మాం త్వం మన్యసేఽయుక్తం భూతేంద్రియగుణాత్మభిః ॥ 36

దేహినామ్ = ప్రాణులకు, దుర్విజ్ఞేయః అపి = చాల క్లేశముచే మాత్రమే తెలియదగినవాడనే అయిననూ, అహమ్ = నేను, అద్య = ఇపుడు, భవతా తు = నీచేనైతే, జ్ఞాతః = తెలియబడినాను, యత్ = ఏలయనగా, త్వమ్ = నీవు, మామ్ = నన్ను, భూత-ఇంద్రియగుణ-ఆత్మభిః = పంచభూ

తములు ఇంద్రియులు సత్త్వరజస్తమోగుణములు మరియు అంతఃకరణము అనువాటిచే, అయుక్తమ్ = కూడియుండనివానినిగా, మన్యసే = తెలియుచున్నావో.

మానవులు నన్ను చాల క్లేశముచే మాత్రమే తెలియగల్గుదురు. అట్టి నన్ను నీవిపుడు తెలుసుకున్నావు. ఏలయనగా, నేను పంచభూతములకు ఇంద్రియములకు సత్త్వరజస్తమోగుణములకు మరియు అంతఃకరణమునకు అతీతుడనని నీవు తెలుసుకున్నావు.

తుభ్యం మద్విచికిత్సాయామాత్మా మే దర్శితోఽబహిః ।
నాలేన సలిలే మూలం పుష్కరస్య విచిన్వతః ॥ 37

సలిలే = ప్రళయజలమునందు, నాలేన = తూడు గుండా, పుష్కరస్య = పద్మముయొక్క, మూలమ్ = మూలమును, విచిన్వతః = అన్వేషించుచున్న, తుభ్యమ్ = నీకు, మద్-విచికిత్సాయామ్ = నా విషయములో సంశయము ఉండగా, మే = నాయొక్క, ఆత్మా = స్వరూపము, అబహిః = అంతఃకరణమునందు, దర్శితః = చూపించబడినది.

నాకు ఆశ్రయము ఎవరైనా ఉన్నారా లేదా అను సంశయములో పడిన నీవు తూడుగుండా పద్మముయొక్క మూలమును అన్వేషించుచుండగా, నేను నా స్వరూపమును నీకు అంతఃకరణమునందు మాత్రమే చూపించితిని.

యచ్చకర్థాంగ మత్స్తోత్రం మత్కథాభ్యుదయాంకితమ్ ।
యద్వా తపసి తే నిష్ఠా స ఏష మదనుగ్రహః ॥ 38

అంగ = ఓ వత్సా!, మత్-కథా-అభ్యుదయ-అంకితమ్ = నా గాథల వైభవముతో కూడియున్న, మత్-స్తోత్రమ్ = నా స్తోత్రమును, చకర్థ యత్ = చేసితివి అనే విషయమేది గలదో, తే = నీకు, తపసి = తపస్సునందు, నిష్ఠా = నిష్ఠ అనునది, యత్ వా = ఏది కూడ గలదో, సః = ఆ, ఏషః = ఇది, మత్-అనుగ్రహః = నా అనుగ్రహమే.

ఓ వత్సా! నీవు నా గాథల వైభవముతో గూడియున్న నా స్తోత్రమును చేసితివి. పైగా, నీకు తపస్సునందు నిష్ఠ గలదు. ఇదంతా నా అనుగ్రహమే.

ప్రీతోఽహమస్తు భద్రం తే లోకానాం విజయేచ్ఛయా ।
యదస్తౌషీర్గుణమయం నిర్గుణం మానువర్ణయన్ ॥ 39

లోకానామ్ = లోకముల, విజయ-ఇచ్ఛయా = సృష్టించాలనే కోరికతో, గుణమయమ్ = గుణసంపన్నుడను, నిర్గుణమ్ = స్వరూపముచే గుణరహితుడను అగు, మా = నన్ను, అనువర్ణయన్ = వర్ణించుచున్నవాడవై, అస్తౌషీః యత్ = స్తుతించితివి అనునది యేది గలదో దానిచే, అహమ్ = నేను, ప్రీతః = ప్రసన్నుడనైతిని, తే = నీ కొరకు, భద్రమ్ = మంగళము, అస్తు = అగుగాక!

నీవు లోకములను సృష్టించవలెననే కోరికతో నన్ను స్తుతించితివి. నేను స్వరూపముచే నిర్గుణుడనే అయిననూ, గుణసంపన్నుని వలె భాసించుచున్నాను. ఈ విషయమును నీవు వర్ణించితివి. నీపై నేను ప్రసన్నుడనైతివి. నీకు మంగళమగు గాక!

య ఏతేన పుమాన్నిత్యం స్తుత్వా స్తోత్రేణ మాం భజేత్ ।
తస్యాశు సంప్రసీదేయం సర్వకామవరేశ్వరః ॥ 40

యః = ఏ, పుమాన్ = మానవుడు, నిత్యమ్ = నిత్యము, ఏతేన = ఈ, స్తోత్రేణ = స్తోత్రముతో, మామ్ = నన్ను, స్తుత్వా = స్తుతించి, భజేత్ = సేవించునో, సర్వకామవర-ఈశ్వరః = కోరబడే అన్ని వరములను ఇచ్చే అధీశ్వరుడనగు నేను, తస్య = వానికి, ఆశు = శీఘ్రముగా, సంప్రసీదేయమ్ = చక్కగా ప్రసన్నుడనగుదును.

ఏ మానవుడైతే నిత్యము నన్నీ స్తోత్రముతో స్తుతించి సేవించునో, వానికి ఈశ్వరుడనగు నేను చక్కగా ప్రసన్నుడనై కోరబడే వరములనన్నింటినీ ఇచ్చెదను.

పూర్తేన తపసా యజ్ఞైర్దానైర్యోగసమాధినా ।

రాద్ధం నిఃశ్రేయసం పుంసాం మత్ప్రీతిస్తత్త్వవిన్మతమ్ ॥ 41

పూర్తేన = సమాజసేవచే, తపసా = తపస్సుచే, యజ్ఞైః = యజ్ఞములచే, దానైః = దానములచే, యోగసమాధినా = యోగాభ్యాసముచే మరియు సమాధిచే, పుంసామ్ = మానవులకు, రాద్ధమ్ = సిద్ధించే, నిఃశ్రేయసమ్ = సర్వోత్కృష్టమగు శ్రేయస్సు, మత్-ప్రీతిః = నా ప్రసన్నతయేనని, తత్త్వవిత్-మతమ్ = తత్త్వవేత్తల సిద్ధాంతము.

సమాజసేవ, తపస్సు, యజ్ఞములు, దానములు, యోగాభ్యాసము మరియు సమాధి అనువాటిచే మానవులకు లభించే సర్వోత్కృష్టమైన శ్రేయస్సు నేను ప్రసన్నుడనగుటయేనని తత్త్వవేత్తల సిద్ధాంతము.

అహమాత్మాఽఽత్మనాం ధాతః ప్రేష్ఠస్సన్ ప్రేయసామపి ।
అతో మయి రతిం కుర్యాద్దేహాదిర్యత్కృతే ప్రియః ॥ 42

ధాతః = ఓ బ్రహ్మా!, ప్రేయసాం అపి = అతిశయించి ప్రీతిని గొలిపే వాటిలో కూడ, ప్రేష్ఠః = ప్రియతమమై, సన్ = ఉన్న (సద్రూపమైన), ఆత్మనామ్ = జీవుల, ఆత్మా = ఆత్మ, అహమ్ = నేనే, యత్-కృతే = ఏ ఆత్మ కొరకై, దేహ-ఆదిః = దేహము మొదలైనది, ప్రియః = ప్రియమగుచున్నదో, అతః = ఇందువలన, మయి = నాయందు, రతిమ్ = ప్రీతిని, కుర్యాత్ = చేయవలెను.

ఓ బ్రహ్మా! ఈ లోకములో జీవులకు ప్రీతిని గొలుపు విషయములు అనేకములు గలవు. కాని, సద్ఘనమగు ఆత్మ అన్నింటికంటె అతిశయించి ప్రియమై ఉన్నది. ఆత్మయందలి ప్రీతియే దేహము మొదలగు వాటియందు ప్రతిఫలించుటచే అవి ప్రీతిపాత్రములగుచున్నవి. అట్టి ఆత్మను నేనే. కావున, మానవుడు నాయందు భక్తిని చేయవలెను.

సర్వవేదమయేనేదమాత్మనాఽఽత్మాఽఽత్మయోనినా ।
ప్రజాస్సృజ యథాపూర్వం యాశ్చ మయ్యనుశేరతే ॥ 43

ఆత్మా = నీవు, ఆత్మయోనినా = ఆత్మనగు నేను కారణముగా గల, సర్వవేదమయేన = సకలవేదముల రూపములోనున్న, ఆత్మనా = స్వరూప

ముచే, యథాపూర్వమ్ = పూర్వకల్పమునందు వలెనే, ఇదమ్ = ఈ జగత్తును, ప్రజాః చ = ప్రాణులను కూడ, సృజ = సృష్టించుము, యాః = ఏ ప్రాణులు, మయి = నాయందు, అనుశేరతే = విలీనులై నిద్రించుచున్నారో.

సకలప్రాణులు ఈ సమయములో నాయందు విలీనమై నిద్రించుచున్నవి. సకలవేదస్వరూపుడవగు నీవు నానుండియే ఆవిర్భవించినావు. నీవీ జగత్తును మరియు ప్రాణులను గడచిన కల్పమునందు వలెనే మరల నీ స్వరూపమునందు మాత్రమే ఆవిర్భవింప జేయుము.

మైత్రేయ ఉవాచ ।
తస్మా ఏవం జగత్స్రష్ట్రే ప్రధానపురుషేశ్వరః ।
వ్యజ్యేదం స్వేన రూపేణ కంజనాభస్తిరోదధే ॥ 44

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
నవమోఽధ్యాయః ॥

కంజనాభః = పద్మము నాభియందు గలవాడు, ప్రధానపురుష-ఈశ్వరః = ప్రకృతిని జీవులను నియంత్రించువాడు అగు శ్రీహరి, జగత్-స్రష్ట్రే = జగత్తును సృష్టించే, తస్మై = ఆ బ్రహ్మగారి కొరకు, ఏవమ్ = ఈ విధముగా, ఇదమ్ = ఈ జగత్తును, వ్యజ్య = ప్రకాశింపజేసి, స్వేన రూపేణ = తన రూపముచే, తిరోదధే = అంతర్ధానమును చెందెను.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- పద్మము నాభియందు గలవాడు, ప్రకృతిని జీవులను నియంత్రించువాడు అగు శ్రీహరి ఈ విధముగా సృష్టించవలసిన జగత్తును గురించి సృష్టికర్తయగు బ్రహ్మగారికి తెలుపుడు జేసి, తన రూపమును అంతర్ధానము చేసెను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధమునందు
తొమ్మిదవ అధ్యాయము ముగిసినది (9).



# అథ అష్టమోఽధ్యాయః

## బ్రహ్మగారు ఆవిర్భవించుట

మైత్రేయ ఉవాచ ।
సత్సేవనీయో బత పూరువంశో యల్లోకపాలో భగవత్ప్రధానః ।
బభూవిథేహాజితకీర్తిమాలాం పదే పదే నూతనయస్యభీక్ష్ణమ్ ॥ 1

మైత్రేయః = మైత్రేయుడు, ఉవాచ = పలికెను, బత = అహో!, పూరువంశః = పూరువంశము, సత్-సేవనీయః = సత్పురుషులకు సేవించ దగినది, యత్ = ఏలయనగా, ఇహ = ఈ వంశమునందు, భగవత్-ప్రధానః = భగవానుడే ప్రముఖముగా గల, లోకపాలః = లోకపాలుడవగు నీవు, బభూవిథ = జన్మించితివి, అజితకీర్తిమాలామ్ = పరమేశ్వరుని కీర్తియొక్క మాలను, పదే పదే = ప్రతి పదమునందు, అభీక్ష్ణమ్ = సుతరాము, నూతనయసి = నూతనముగా చేయుచున్నావు.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- ఆశ్చర్యము! భగవద్భక్తాగ్రగణ్యుడవు, లోకపాలుడగు యముని అంశచే జన్మించినవాడవు అగు నీవు జన్మించుటచే పూరువంశము సత్పురుషులకు సేవించదగినదిగా అయినది. నీవు ప్రతి పదమునందు ఆ శ్రీహరియొక్క కీర్తిమాలను నిత్యనూతనముగా చేయుచున్నావు.

సోఽహం నృణాం క్షుల్లసుఖాయ
దుఃఖం మహద్గతానాం విరమాయ తస్య ।
ప్రవర్తయే భాగవతం పురాణం
యదాహ సాక్షాద్భగవానృషిభ్యః ॥ 2

ఓ పూజ్యా! నీవు జ్ఞానాధికులలో శ్రేష్ఠుడవు. నేను ఇంతేగాక నిన్ను మరికొన్ని విషయములను కూడ ప్రశ్నించియుంటిని. వాటిని నీవు ఒక క్రమములో నాకు చెప్పి, మా సంశయములనన్నింటినీ తొలగించుము.

సూత ఉవాచ ।
ఏవం సంచోదితస్తేన క్షత్త్రా కౌషారవో మునిః ।
ప్రీతః ప్రత్యాహ తాన్ ప్రశ్నాన్ హృదిస్థానథ భార్గవ ॥ 3

భార్గవ = ఓ శౌనకమహర్షీ!, ఏవమ్ = ఈ విధముగా, క్షత్త్రా = విదురునిచే, సంచోదితః = ప్రేరేపించబడిన, కౌషారవః మునిః = మైత్రేయ మహర్షి, ప్రీతః = సంతోషించినవాడై, అథ = తరువాత, హృదిస్థాన్ = తన హృదయమునందున్న, తాన్ = ఆ, ప్రశ్నాన్ = ప్రశ్నలను ఉద్దేశించి, ప్రత్యాహ = సమాధానమును చెప్పెను.

సూతుడు ఇట్లు పలికెను --- ఓ శౌనక మహర్షీ! అప్పుడు విదురునిచే ఈ విధముగా ప్రేరేపించబడిన మైత్రేయ మహర్షి సంతోషించి, తన హృదయములోనున్న ఆ ప్రశ్నలకు సమాధానమును చెప్పెను.

మైత్రేయ ఉవాచ ।
విరించోఽపి తథా చక్రే దివ్యం వర్షశతం తపః ।
ఆత్మన్యాత్మానమావేశ్య యదాహ భగవానజః ॥ 4

విరించః అపి = బ్రహ్మ కూడా, తథా = అదే విధముగా, ఆత్మానమ్ = బుద్ధిని, ఆత్మని = ఆత్మచైతన్యమునందు, ఆవేశ్య = నిలిపియుంచి, దివ్యం వర్షశతమ్ = వంద దివ్యసంవత్సరముల కాలము, తపః = తపస్సును, చక్రే = చేసెను, యత్ = ఏ విధముగానైతే, అజః = పుట్టుక లేని, భగవాన్ = శ్రీహరి భగవానుడు, ఆహ = చెప్పినాడో.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- అజుడగు శ్రీహరి భగవానుడు చెప్పిన విధముగానే, బ్రహ్మకూడ తన బుద్ధిని ఆత్మచైతన్యములో విలీనము చేసి, వంద దివ్యసంవత్సరముల కాలము తపస్సును చేసెను.

తద్విలోక్యాబ్జసంభూతో వాయునా యదధిష్ఠితః ।
పద్మమంభశ్చ తత్కాలకృతవీర్యేణ కంపితమ్ ॥ 5

అబ్జసంభూతః = పద్మమునుండి పుట్టిన బ్రహ్మ, తత్-కాలకృతవీర్యేణ = ఆ ప్రళయకాలముచే కలిగించబడిన వ్యాపారము గల, వాయునా = వాయువుచే, కంపితమ్ = కంపింపజేయబడిన, యత్-అధిష్ఠితః = ఏ పద్మమును అధిష్ఠించియున్నాడో, తత్ = ఆ, పద్మమ్ = పద్మమును, చ = మరియు, అంభః = నీటిని, విలోక్య = చూచి.

ఆ ప్రళయకాలము వాయువునకు గొప్ప శక్తిని కలిగించెను. అట్టి వాయువు ఆ ప్రళయజలములను మరియు బ్రహ్మగారిచే అధిష్ఠించబడియున్న పద్మమును కంపింప జేయుచుండెను. పద్మమునుండి పుట్టిన బ్రహ్మగారు ఈ సంగతిని గమనించెను.

తపసా హ్యేధమానేన విద్యయా చాత్మసంస్థయా ।
వివృద్ధవిజ్ఞానబలో న్యపాద్వాయుం సహాంభసా ॥ 6

ఏధమానేన = వృద్ధిని చెందుచున్న, తపసా = తపస్సుచే, చ = మరియు, ఆత్మసంస్థయా = హృదయమునందున్న, విద్యయా = ఆత్మజ్ఞానముచే, వివృద్ధవిజ్ఞానబలః = విశేషముగా వర్ధిల్లిన విజ్ఞానశక్తి గల బ్రహ్మ, వాయుమ్ = వాయువును, అంభసా సహ = జలముతో సహా, న్యపాత్ = త్రాగివేసెను.

ఉత్తరోత్తరాభివృద్ధి గల తపస్సుచే మరియు హృదయమునందు నెలకొన్న ఆత్మజ్ఞానముచే బ్రహ్మగారి విజ్ఞానశక్తి విశేషముగా వర్ధిల్లియుండెను. ఆయన ఆ వాయువును నీటిని కూడ త్రాగివేసెను.

తద్విలోక్య వియద్వ్యాపి పుష్కరం యదధిష్ఠితమ్ ।
అనేన లోకాన్ ప్రాగ్లీనాన్ కల్పితాస్మీత్యచింతయత్ ॥ 7

వియత్-వ్యాపి = ఆకాశమును వ్యాపించియున్న, యత్ = ఏ, పుష్కరమ్ = పద్మము, అధిష్ఠితమ్ = అధిష్ఠించబడియున్నదో, తత్ = దానిని, విలోక్య = చూచి, అనేన = దీనిచే, ప్రాక్ = పూర్వకల్పముయొక్క అంత

మునందు, లీనాన్ = విలీనమైన, లోకాన్ = లోకములను, కల్పితాస్మి = కల్పించెదను, ఇతి = అని, అచింతయత్ = ఆలోచించెను.

ఆకాశమును వ్యాపించియున్న పద్మమునందు ఆసీనుడై యున్న బ్రహ్మ ఆ పద్మమును చూచి, దీనితోనే నేను గడచిన కల్పముయొక్క అంతమునందు విలీనమై పోయిన లోకములను మరల సృష్టించెదను అని తలపోసెను.

> పద్మకోశం తదాऽऽవిశ్య భగవత్కర్మచోదితః ।
> ఏకం వ్యభాంక్షీదురుధా త్రిధా భావ్యం ద్విసప్తధా ।। 8

భగవత్-కర్మచోదితః = శ్రీహరి భగవానునిచే కర్తవ్యకర్మయందు నియోగించబడిన బ్రహ్మ, తదా = అప్పుడు, పద్మకోశమ్ = పద్మపు మొగ్గను, ఆవిశ్య = అధిష్ఠించి, ద్విసప్తధా = పదునాలుగు భువనములుగా, ఉరుధా = అనేకములుగా, భావ్యమ్ = అగుటకు యోగ్యమైన, ఏకమ్ = ఆ ఒక్కదానిని, త్రిధా = మూడుగా, వ్యభాంక్షీత్ = విభాగము చేసెను.

శ్రీహరి భగవానుడు బ్రహ్మను కర్తవ్యకర్మయగు సృష్టియందు నియోగించెను. అపుడా బ్రహ్మ పదునాలుగు భువనములుగా గాని, అంతకంటె అధికముగా గాని అగుటకు శక్తి గల ఆ పద్మకోశమును అధిష్ఠించి, దానిని మూడుగా విభాగము చేసెను.

> ఏతావాన్ జీవలోకస్య సంస్థాభేదస్సమాహృతః ।
> ధర్మస్య హ్యనిమిత్తస్య విపాకః పరమేష్ఠ్యసౌ ।। 9

జీవలోకస్య = ప్రాణుల భోగస్థానముయొక్క, సంస్థాభేదః = రచనా విశేషము, ఏతావాన్ = ఈ మూడు లోకముల రూపముగా నున్నదిగా, సమాహృతః = చెప్పబడినది, అసౌ = ఈ, పరమేష్ఠీ = బ్రహ్మ (బ్రహ్మలోకము), అనిమిత్తస్య = కామన లేని, ధర్మస్య = ధర్మముయొక్క, విపాకః = ఫలరూపము.

జీవులు తమ కర్మఫలమును అనుభవించే స్థానములు ఈ ముల్లోక ములేనని శాస్త్రములలో చెప్పబడినది. మానవుడు నిష్కామకర్మను ఆచ రించినచో, దాని ఫలరూపముగా బ్రహ్మలోకమును పొందును.

విదుర ఉవాచ ।
యదాత్థ బహురూపస్య హరేరద్భుతకర్మణః ।
కాలాఖ్యం లక్షణం బ్రహ్మన్ యథా వర్ణయ నః ప్రభో ।। 10

ప్రభో= ఓ ప్రభూ!, బ్రహ్మన్ = ఓ మహర్షీ!, అద్భుతకర్మణః = ఆశ్చ ర్యకరమగు లీలలు గల, బహురూపస్య = అనేకరూపములలో ప్రకటమ య్యే, హరేః = శ్రీహరియొక్క, యత్ = ఏ, కాల-ఆఖ్యమ్ = కాలము అనే పేరుగల, లక్షణమ్ = రూపమును, ఆత్థ = చెప్పితివో దానిని, యథా = యథాతథముగా, నః = మా కొరకు, వర్ణయ = వర్ణించుము.

విదురుడు ఇట్లు పలికెను --- ఓ ప్రభూ! మైత్రేయ మహర్షీ! ఆశ్చ ర్యకరమగు లీలలను చేయుచూ అనేకరూపములలో ప్రకటమయ్యే శ్రీహరి యొక్క కాలము అనే శక్తిని గురించి నీవు చెప్పియుంటివి. దానిని మాకు యథాతథముగా వివరించి చెప్పుము.

మైత్రేయ ఉవాచ ।
గుణవ్యతికరాకారో నిర్విశేషోఽప్రతిష్ఠితః ।
పురుషస్తదుపాదానమాత్మానం లీలయాసృజత్ ।। 11

గుణవ్యతికర-ఆకారః = సత్త్వరజస్తమోగుణముల పరిణామమే ఆకారముగా గలది, నిర్విశేషః = విశేషములు లేనిది, అప్రతిష్ఠితః = మొదలు తుది లేనిది అగు కాలము, గుణవ్యతికర-ఆకారః = సత్త్వరజస్త మోగుణముల పరిణామమే రూపముగా గలవాడు, నిర్విశేషః = స్వరూప ముచే ఏ రూపము లేనివాడు, అప్రతిష్ఠితః = తనకంటె భిన్నమగు ఆశ్ర యము లేనివాడు అగు, పురుషః = పరమేశ్వరుడు, తత్-ఉపాదానమ్ = ఆ కాలమే ఉపాదానముగా గల, ఆత్మానమ్ = తనను, లీలయా = లీలచే, అసృజత్ = సృష్టించెను.

సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతిలో వచ్చే మార్పె కాలము యొక్క రూపము. ఆద్యంతములు లేని ఆ కాలమునందు విశేషములు (అవయవములు) వాస్తవముగా లేవు. భగవానుడు స్వరూపముచే రూపము లేనివాడే అయిననూ, ప్రకృతియొక్క పరిణామమును ఉపాధిగా స్వీకరించి సగుణ సాకారుడగుచున్నాడు. తన మహిమయందు ప్రతిష్ఠితుడైన ఆ భగవానునకు మరియొక ప్రతిష్ఠ (ఆశ్రయము) లేదు. ఆయన ఆ కాలమును ఉపాదానము (ముడిసరుకు) గా చేసుకొని లీలచే తనను తానే జగద్రూపముగా ప్రకటించుచున్నాడు.

విశ్వం వై బ్రహ్మ తన్మాత్రం సంస్థితం విష్ణుమాయయా ।
ఈశ్వరేణ పరిచ్ఛిన్నం కాలేనావ్యక్తమూర్తినా ॥ 12

విష్ణుమాయయా = భగవానుని మాయచే, సంస్థితమ్ = లీనమైన, విశ్వమ్ = విశ్వము, బ్రహ్మతన్మాత్రమ్ = బ్రహ్మ రూపముగా మాత్రమే నుండెను, ఈశ్వరేణ = ఆ భగవానునిచే, అవ్యక్తమూర్తినా = స్వయముగా నిర్విశేషమగు స్వరూపము గల, కాలేన = కాలముచే, పరిచ్ఛిన్నమ్ = భిన్నముగా ప్రకటితమైనది.

విష్ణుభగవానుని మాయచే ఈ విశ్వము విలీనమై బ్రహ్మగారి రూపములో మాత్రమే నుండెను. ఆయన స్వయముగా నిర్విశేషమగు స్వరూపము గల కాలము ద్వారా దానిని భిన్నముగా ప్రకటింప జేసెను.

యథేదానీం తథాగ్రే చ పశ్చాదప్యేతదీదృశమ్ ।
సర్గో నవవిధస్తస్య ప్రాకృతో వైకృతస్తు యః ॥ 13

ఇదానీమ్ = ఇప్పుడు, ఏతత్ = ఈ జగత్తు, యథా = ఏ విధముగా నున్నదో, తథా = అదే విధముగా, అగ్రే చ = పూర్వమునందు కూడ ఉండెను, పశ్చాత్ అపి = తరువాత కూడ, ఈదృశమ్ = ఇటులనే ఉండగలదు, తస్య = దానియొక్క, ప్రాకృతః = ప్రాకృతము, వైకృతః తు = వైకృతము అనే, యః = ఏ, సర్గః = సృష్టి గలదో అది, నవవిధః = తొమ్మిది విధములుగా నున్నది.

ఈ జగత్తు ఇప్పుడు ఏ విధముగా నున్నదో, పూర్వమునందు కూడ అటులనే ఉండెడిది; భవిష్యత్తులో కూడ అటులనే ఉండగలదు. దీని సృష్టి ప్రాకృతము మరియు వైకృతము అను భేదముచే తొమ్మిది విధములుగా నున్నది (ఉభయాత్మకమగు పదవ భేదము కూడ గలదు).

కాలద్రవ్యగుణైరస్య త్రివిధః ప్రతిసంక్రమః ।
ఆద్యస్తు మహతస్సర్గో గుణవైషమ్యమాత్మనః ॥ **14**

అస్య = ఈ సృష్టికి, కాలద్రవ్యగుణైః = కాలము ద్రవ్యము మరియు గుణములు అనువాటి ద్వారా, త్రివిధః = మూడు విధముల, ప్రతిసంక్రమః = ప్రళయము, ఆత్మనః = ఆత్మనుండి, మహతః = మహత్తత్త్వముయొక్క, సర్గః తు = సృష్టి అయితే, ఆద్యః = మొట్టమొదటిది, గుణవైషమ్యమ్ = సత్త్వరజస్తమోగుణముల పాళ్లలో తేడాయే దాని లక్షణము.

ఈ సృష్టికి కాలము ద్రవ్యము మరియు గుణములు అనువాటి ద్వారా క్రమముగా నిత్య నైమిత్తిక ప్రాకృత ప్రళయములు అనే మూడు విధముల ప్రళయములు కలుగును. బ్రహ్మాత్మనుండి మాయాశక్తియొక్క సత్త్వ రజస్తమోగుణముల సామ్యావస్థలో వచ్చిన వైషమ్యము కారణముగా మొట్టమొదట మహత్తత్త్వము (సమష్టి జ్ఞానశక్తి క్రియాశక్తుల సమాహారము) పుట్టినది.

ద్వితీయస్త్వహమో యత్ర ద్రవ్యజ్ఞానక్రియోదయః ।
భూతసర్గస్తృతీయస్తు తన్మాత్రో ద్రవ్యశక్తిమాన్ ॥ **15**

అహమః = అహంకారముయొక్క (సృష్టి), ద్వితీయః = రెండవది, యత్ర = దేనినుండి, ద్రవ్యజ్ఞానక్రియా-ఉదయః = పంచభూతములు జ్ఞానేంద్రియములు మరియు కర్మేంద్రియముల పుట్టుకయో, తృతీయః తు = మూడవదైతే, తన్మాత్రః = కేవలము ఒక్కొక్కటిగా మాత్రమే ఉండే, ద్రవ్యశక్తిమాన్ = అయిదు స్థూలమహాభూతములను ప్రకటించే శక్తి గల, భూతసర్గః = అయిదు సూక్ష్మమహాభూతముల సృష్టి.

అహంకార సృష్టి రెండవది. పంచభూతములు జ్ఞానేంద్రియములు మరియు కర్మేంద్రియములు ఆ అహంకారమునుండి పుట్టినవి. మూడవది అయిదు సూక్ష్మమహాభూతముల సృష్టి. ఈ సూక్ష్మభూతములలో ఈ స్థాయిలో ఇంకనూ పరస్పర సమ్మేళనము లేదు. పృథివి జలము అగ్ని వాయువు ఆకాశము అనే అయిదు స్థూలమహాభూతములను ప్రకటింప జేసే శక్తి ఈ సూక్ష్మభూతములయందు గలదు.

చతుర్థ ఐంద్రియస్సర్గో యస్తు జ్ఞానక్రియాత్మకః ।
వైకారికో దేవసర్గః పంచమో యన్మయం మనః ।। 16

ఐంద్రియః = ఇంద్రియములకు చెందిన, సర్గః = సృష్టి, చతుర్థః = నాల్గవది, యః తు = ఏదైతే, జ్ఞానక్రియాత్మకః = జ్ఞానము మరియు క్రియ స్వరూపముగా గలదియో, వైకారికః = సాత్త్వికాహంకారమునుండి వచ్చిన, దేవసర్గః = ఇంద్రియాధిష్ఠాన దేవతల సృష్టి, పంచమః = అయిదవది, మనః = మనస్సు, యత్-మయమ్ = ఏ వైకారికమగు అహంకారముయొక్క కార్యమో.

జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల సృష్టి నాల్గవది. ప్రకృతివికారమగు అహంకారముయొక్క సాత్త్వికాంశమునుండి ఇంద్రియాధిష్ఠాన దేవతలు మరియు మనస్సు ప్రకటమగును. ఇది అయిదవ సృష్టి.

షష్ఠస్తు తమసస్సర్గో యస్త్వబుద్ధికృతః ప్రభో ।
షడిమే ప్రాకృతాస్సర్గా వైకృతానపి మే శృణు ।। 17

ప్రభో = ఓ విదురా!, యః తు = ఏదైతే, అబుద్ధికృతః = జీవులకు ఆవరణము మరియు విక్షేపము అనువాటిని కలిగించే, తమసః = అవిద్య నుండి వచ్చిన, సర్గః తు = సృష్టి గలదో అది, షష్ఠః = ఆరవది, ఇమే = ఈ, షట్ = ఆరు, ప్రాకృతాః = ప్రాకృతసర్గములు, మే = నా (వచనములను బట్టి), వైకృతాన్ అపి = వైకృతసర్గములను కూడ, శృణు = వినుము.

ఓ విదురా! జీవులకు ఆవరణము (ఉన్నది కానరాకుండుట) మరియ విక్షేపము (లేనిది కానవచ్చుట) లను కలిగించే అవిద్యనుండి

ఆరవ సృష్టి (తామిస్రము మొదలైనవి) వచ్చినది. ఈ ఆరు ప్రాకృత (త్రిగుణాత్మికయగు ప్రకృతికి చెందిన) సర్గములు. నేనిప్పుడు వైకృత (సమష్టి స్వరూపుడగు బ్రహ్మగారి) సర్గములను చెప్పెదను. వినుము.

రజోభాజో భగవతో లీలేయం హరిమేధసః ।
సప్తమో ముఖ్యసర్గస్తు షడ్విధస్తస్థుషాం చ యః ॥ 18

ఇయమ్ = ఇది, హరిమేధసః = సంసారమును పోగొట్టే బుద్ధిలో విషయమగువాడు, రజోభాజః = రజోగుణమును ఉపాధిగా స్వీకరించిన వాడు అగు, భగవతః = బ్రహ్మ రూపములోనున్న శ్రీహరి భగవానుని, లీలా = లీల, తస్థుషామ్ = స్థావరముల (కదలని వృక్షముల), ముఖ్యసర్గః తు = ముఖ్యసర్గమైతే, సప్తమః = ఏడవది, యః చ = ఏది, షడ్-విధః = ఆరు ప్రకారములుగా నున్నదో.

శ్రీహరిని బుద్ధిలో చింతించువారలకు సంసారము హరించిపోవును. ఆయన రజోగుణమును ఉపాధిగా స్వీకరించి బ్రహ్మరూపములో ఈ సృష్టి అనే లీలను చేసినాడు. ఇక ఏడవది చెట్టుచేమల సృష్టి. మానవునకు ముఖము వలె ఇది వైకృతసర్గములలో మొట్టమొదటిది గనుక, ముఖ్యసర్గ మనబడుచున్నది. ఇది ఆరు విధములుగా నున్నది.

వనస్పత్యోషధిలతాత్వక్సారా వీరుధో ద్రుమాః ।
ఉత్స్రోతసస్తమఃప్రాయా అంతస్స్పర్శా విశేషిణః ॥ 19

వనస్పతి-ఓషధిలతాత్వక్-సారాః = వనస్పతులు ఓషధులు లతలు త్వక్సారములు, వీరుధః = వీరుధములు, ద్రుమాః = వృక్షములు, ఉత్-స్రోతసః = రసముయొక్క ఊర్ధ్వప్రవాహము గలవి, తమఃప్రాయాః = తమోగుణప్రధానమైనవి, అంతఃస్పర్శాః = లోపలనే స్పర్శగుణము గలవి, విశేషిణః = అనేకభేదములు గలవి.

ముఖ్యసర్గములో వనస్పతులు (పువ్వు లేకుండగనే ఫలముల నిచ్చే రావి మొదలగు చెట్లు), ఓషధులు (ఫలములు పక్వమగుట తోడనే నశించే వరి మొదలగు మొక్కలు), లతలు (ఏదో ఒక చెట్టు మొదలగు

ఆసరాను ఆశ్రయించుకొని పెరిగే మల్లె మొదలగు తీగలు), త్వక్సార ములు (బలమైన బెరడు గల వెదురు మొదలగు ఆశ్రయమునపేక్షించని తీగలు), వీరుధములు (పొదలు) మరియు ద్రుమములు (పువ్వు కాయ అనే వరుసలో ఫలించే మామిడి మొదలగు చెట్లు) అనే ఆరు రకములు గలవు. వీటి అన్నిటియందు పోషకరసము క్రింద నేలనుండి పైకి ప్రవహిం చును. వీటియందు తమోగుణము ప్రధానమగుటచే, అంతఃకరణవికాసము చాల తక్కువగా నుండును. ఇవి తమ లోపల స్పర్శగుణమునను భవించు ను. వీటిలో అనేకభేదములు ఉండుటయే గాక, ప్రతి దానియందు ఏదో ఒక విశేషగుణము ఉండును.

తిరశ్చామష్టమస్సర్గస్సోऽష్టావింశద్విధో మతః ।
అవిదో భూరితమసో ఘ్రాణజ్ఞా హృద్యవేదినః ॥ 20

తిరశ్చామ్ = పశుపక్ష్యాదుల, సర్గః = సృష్టి, అష్టమః = ఎనిమిదవ ది, సః = అది, అష్టావింశత్-విధః = ఇరవై ఎనిమిది విధములు అని, మతః = తెలియబడినది, అవిదః = కాలజ్ఞానము లేనివి, భూరితమసః = అధికమగు తమోగుణము గలవి, ఘ్రాణజ్ఞాః = ఘ్రాణేంద్రియము చేతనే పదార్థములను గురించి తెలుసుకొనేవి, హృద్యవేదినః = బుద్ధియందలి సుఖము మొదలగు వాటిని తెలియునవి (హృది = బుద్ధియందు, అవేదినః = విచారశక్తి లేనివి).

పశుపక్ష్యాదుల సృష్టి ఎనిమిదవది. దీనియందు ఇరవై ఎనిమిది రకములు గలవు. ఈ ప్రాణులలో తమోగుణము అధికముగా నుండుటచే, వీటికి కాలముయొక్క అనుభవము ఉండదు. ఇవి ఘ్రాణేంద్రియముతో మాత్రమే పదార్థములను తెలుసుకొనును. వీటికి బుద్ధియందు సుఖము మొదలగునవి తెలిసిననూ, విచారశక్తి ఉండదు.

గౌరజో మహిషః కృష్ణస్సూకరో గవయో రురుః ।
ద్విశఫాః పశవశ్చేమే అవిరుష్ట్రశ్చ సత్తమ ॥ 21

సత్తమ = ఓ సాధుపురుషా!, గౌః = గోవు, అజః = మేక, మహిషః = గేదె, కృష్ణః = కృష్ణమృగము, సూకరః = పంది, గవయః = గురుపోతు,

రురుః = దుప్పి, అవిః = గొర్రె, చ = మరియు, ఉష్ట్రః = ఒంటె అనే, ఇమే = ఈ, పశవః = పశువులు, ద్విశఫాః = రెండు డెక్కలు గలవి.

ఓ సాధుపురుషా! విదురా! ఆవు (ఎద్దు), మేక, గేదె (దున్న), కృష్ణ మృగము (నల్ల యిర్రి), పంది, గురుపోతు, దుప్పి, గొర్రె మరియు ఒంటె అనే ఈ తొమ్మిది పశువుల కాళ్లకు రెండు డెక్కలు ఉండును.

ఖరోఽశ్వోఽశ్వతరో గౌరశ్శరభశ్చమరీ తథా ।
ఏతే చైకశఫాః క్షత్తః శృణు పంచనఖాన్ పశూన్ ।। 22

క్షత్తః = ఓ విదురా!, ఖరః = గాడిద, అశ్వః = గుర్రము, అశ్వతరః = కంచరగాడిద, గౌరః = గౌరమృగము, శరభః = శరభము, తథా = అదే విధముగా, చమరీ = చమరీ మృగము అనే, ఏతే = ఇవి, ఏకశఫాః = ఒకే గిట్ట గలవి, పంచనఖాన్ = అయిదు గోళ్లు గల, పశూన్ = పశువులను గురించి, శృణు = వినుము.

ఓ విదురా! గాడిద, గుర్రము, కంచరగాడిద, గౌరము (గేదెవంటి ఒక మృగము), శరభము (ఎనిమిది కాళ్లు గల మృగము), చమరీ అనే ఆరు మృగములు ఒక గిట్ట గలవి. ఇపుడు ఒక కాలికి అయిదు గోళ్లు గల మృగములను (పంచనఖములు) చెప్పెదను. వినుము.

శ్వా సృగాలో వృకో వ్యాఘ్రో మార్జారశ్శశశల్లకౌ ।
సింహః కపిర్గజః కూర్మో గోధా చ మకరాదయః ।। 23

కంకగృధ్రవటశ్యేనభాసభల్లకబర్హిణః ।
హంససారసచక్రాహ్వకాకోలూకాదయః ఖగాః ।। 24

శ్వా = కుక్క, సృగాలః = నక్క, వృకః = తోడేలు, వ్యాఘ్రః = పెద్ద పులి, మార్జారః = పిల్లి, శశశల్లకౌ = చెవుల పిల్లి మరియు ఏదుపంది, సింహః = సింహము, కపిః = కోతి, గజః = ఏనుగు, కూర్మః = తాబేలు, గోధా = ఉడుము, చ = మరియు, మకర-ఆదయః = మొసలి మొదలైనవి, కంకగృధ్రవటశ్యేనభాసభల్లకబర్హిణః = రాబులుగు గద్ద గవ్వపక్షి డేగ

రాబందు భల్లూకము నెమలి, హంససారసచక్రాహ్వకాక-ఉలూక-ఆదయః = హంస బెగ్గురు జక్కవపిట్ట కాకి గుడ్లగూబ మొదలగు, ఖగాః= పక్షులు.

కుక్క, నక్క, తోడేలు, పెద్దపులి, పిల్లి, చెవుల పిల్లి, ఏదుపంది, సింహము, కోతి, ఏనుగు, తాబేలు, ఉడుము అనే పన్నెండు భూచరము లగు పంచనఖములు. మొసలి మొదలగు జలచరములు, రాబులుగు, గద్ద, గవ్వపక్షి, డేగ, రాబందు, భల్లూకము, నెమలి, హంస, బెగ్గురు, జక్కవపిట్ట, కాకి, గుడ్లగూబ మొదలగు పక్షులు కలిసి భూచరములు కాని ఇరవై ఎనిమి దవ వరము.

అర్వాక్స్రోతస్తు నవమః క్షత్తరేకవిధో నృణామ్ ।
రజోఽధికాః కర్మపరా దుఃఖే చ సుఖమానినః ।। 25

క్షత్తః = ఓ విదురా!, నృణామ్ = మానవుల, అర్వాక్-స్రోతః తు = నోటినుండి క్రిందకు ఆహారముయొక్క ప్రవాహము గల సృష్టి అయితే, ఏక విధః = ఒకే విధముగానుండే, నవమః = తొమ్మిదవది, రజః-అధికాః = రజో గుణము అధికముగా గలవారు, కర్మపరాః = కర్మలయందు ఆసక్తి గలవా రు, చ = మరియు, దుఃఖే = దుఃఖమునందు, సుఖమానినః = సుఖమును భావన చేయువారు.

ఓ విదురా! మానవులలో ఆహారప్రవాహము నోటినుండి క్రిందకు ఉండుటచే ఈ తొమ్మిదవ సర్గము అర్వాక్-స్రోతస్సు అనబడును. మానవు లందరు ఒకే విధముగా నున్నారు. మానవులు రజోగుణము అధికముగా గలవారగుటచే కర్మలలో మునిగి తేలుచుందురు. మానవులు దుఃఖాత్మక ములగు విషయభోగములయందు సుఖమున్నదని తలపోయుచుందురు.

వైకృతాస్త్రయ ఏవైతే దేవసర్గశ్చ సత్తమ ।
వైకారికస్తు యః ప్రోక్తః కౌమారస్తూభయాత్మకః ।। 26

ఏతే = ఈ, త్రయః = మూడు, వైకృతాః ఏవ = వైకృత సర్గములే, సత్తమ = ఓ సాధుపురుషా!, దేవసర్గః చ = దేవసర్గము కూడ వైకృతమే, వైకారికః = సాత్త్వికాహంకారమునుండి వచ్చిన ఇంద్రియ సర్గము, యః =

ఏది గలదో అది, ప్రోక్తః = చెప్పబడినది, కౌమారః తు = కౌమారసర్గమైతే, ఉభయ-ఆత్మకః = ప్రాకృత వైకృతములనే రెండు కోవలకు చెందును.

ఓ సాధుపురుషా! విదురా! పైన చెప్పిన మూడు సర్గములు వైకారిక సర్గములు. దేవసర్గము కూడ వైకారిక సర్గమే. సాత్త్వికాహంకారము నుండి వచ్చిన ఇంద్రియాధిష్ఠాన దేవతల సర్గము (ప్రాకృతము) పూర్వమే చెప్పబడినది. కౌమారసర్గము వైకృత మరియు ప్రాకృత అనే రెండు కోవలకు చెందినది.

దేవసర్గశ్చాష్టవిధో విబుధాః పితరోఽసురాః ।
గంధర్వాప్సరసస్సిద్ధా యక్షరక్షాంసి చారణాః ॥ 27

భూతప్రేతపిశాచాశ్చ విద్యాధ్రాః కిన్నరాదయః ।
దశైతే విదురాఖ్యాతాస్సర్గాస్తే విశ్వసృక్కృతాః ॥ 28

దేవసర్గః చ = దేవసర్గము కూడ, అష్టవిధః = ఎనిమిది విధములుగా నున్నది, విబుధాః = దేవతలు, పితరః = పితృదేవతలు, అసురాః = అసురులు, గంధర్వ-అప్సరసః = గంధర్వులు మరియు అప్సరసలు, సిద్ధాః = సిద్ధులు, యక్షరక్షాంసి = యక్షులు మరియు రాక్షసులు, చారణాః = చారణులు, భూతప్రేతపిశాచాః = భూతములు ప్రేతములు మరియు పిశాచములు, చ = మరియు, విద్యాధ్రాః = విద్యాధరులు, కిన్నర-ఆదయః = కిన్నరులు మొదలగువారు, విదుర = ఓ విదురా!, విశ్వసృక్-కృతాః = బ్రహ్మగారిచే చేయబడిన, ఏతే = ఈ, దశ = పది, సర్గాః = సర్గములు, తే = నీ కొరకు, ఆఖ్యాతాః = చెప్పబడినవి.

దేవతలు, పితృదేవతలు, అసురులు, గంధర్వాప్సరసలు, యక్షరాక్షసులు, సిద్ధచారణవిద్యాధరులు, భూతప్రేతపిశాచములు, కిన్నరకింపురుషాదులు అని దేవసర్గము ఎనిమిది విధములుగా నున్నది. విదురా! ఈ విధముగా బ్రహ్మగారిచే చేయబడిన పది విధముల సృష్టిని నీకు చెప్పితిని.

అతః పరం ప్రవక్ష్యామి వంశాన్ మన్వంతరాణి చ ।
ఏవం రజఃప్లుతస్స్రష్టా కల్పాదిష్వాత్మభూర్హరిః ।

సృజత్యమోఘసంకల్ప ఆత్మైవాత్మానమాత్మనా ॥ 29

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
దశమోఽధ్యాయః ॥

అతఃపరమ్ = ఇటుపైన, వంశాన్ = వంశములను, చ = మరియు, మన్వంతరాణి = మన్వంతరములను, ప్రవక్ష్యామి = చెప్పగలను, ఏవమ్ = ఈ విధముగా, కల్ప-ఆదిషు = కల్పముల ఆరంభములయందు, అమోఘ సంకల్పః = అమోఘమగు సంకల్పము కల, హరిః = శ్రీహరి, రజః-ప్లుతః = రజోగుణముచే వ్యాపించబడినవాడై, స్రష్టా = సృష్టిని చేయు, ఆత్మభూః = స్వయంభువుడగు బ్రహ్మయై, ఆత్మా ఏవ = తానే, ఆత్మనా = తనచే, ఆత్మానమ్ = తనను, సృజతి = సృష్టించుచున్నాడు.

ఇటుపైన నేను వంశములను మరియు మన్వంతరములను వర్ణించెదను. కల్పముల ఆదియందు సత్యసంకల్పుడగు శ్రీహరి రజోగుణమును ఉపాధిగా స్వీకరించి, సృష్టికర్త మరియు స్వయంభువుడు అగు బ్రహ్మ రూపములో ఈ సృష్టిని తన ఇచ్ఛచే తనయందు ప్రకటించును.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధమునందు
పదవ అధ్యాయము ముగిసినది (10).

* * * * *

# అథ ఏకాదశోऽధ్యాయః

## మన్వంతరములు మొదలగు కాలవిభాగమును వర్ణించుట

మైత్రేయ ఉవాచ ।
చరమస్సద్విశేషాణామనేకోऽసంయుతస్సదా ।
పరమాణుస్స విజ్ఞేయో నృణామైక్యభ్రమో యతః ॥ 1

మైత్రేయః = మైత్రేయుడు, ఉవాచ = పలికెను, సత్-విశేషాణామ్ = కార్యవర్గముయొక్క అంశములలో, చరమః = మిక్కిలి సూక్ష్మమైనది, అనేకః = కార్యావస్థను పొందనిది, అసంయుతః = సంయోగమును పొందనిది, సదా = ఎల్లప్పుడు ఉండునది ఏది గలదో, సః = అది, పరమాణుః = పరమాణువు అని, విజ్ఞేయః = తెలియదగును, యతః = వేటివలన, నృణామ్ = మానవులకు, ఐక్యభ్రమః = అవయవములకంటె భిన్నముగా ఒక అవయవి గలదనే భ్రాంతి కలుగుచున్నదో.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- పృథివి మొదలగు కార్యవర్గము యొక్క మిక్కిలి సూక్ష్మమగు (ఇంకనూ విడదీయ శక్యము కాని) అంశ యేది గలదో అది పరమాణువు అనబడును. ఈ పరమాణువు ఇంకనూ కార్యావస్థను పొందనిదై, మరియు ఇతర పరమాణువులతో సంయోగ మును పొందనిదై నిలిచియుండును. ఇట్టి పరమాణువులు కొన్ని కలిసిన ప్పుడు మానవులకు అట్టి సముదాయము కంటె భిన్నమగు మరియొక అవ యవి ఒకటి గలదనే భ్రాంతి కలుగుచుండును.

సత ఏవ పదార్థస్య స్వరూపావస్థితస్య యత్ ।
కైవల్యం పరమమహానవిశేషో నిరంతరః ॥ 2

సతః = కార్యమాత్రము అయినట్టియు, స్వరూప-అవస్థితస్య = వికారములు లేకుండగా తన స్వరూపమునందు నిలిచియున్న, పదార్థస్య= పదార్థముయొక్క, యత్ = ఏ, కైవల్యం ఏవ = ఐక్యము (సమగ్రరూపము) గలదో అదియే, పరమమహాన్ = నిరతిశయముగా పెద్దది, అవిశేషః = అవస్థాభేదము గాని కాలభేదము గాని లేనిది, నిరంతరః = పదార్థభేదము లేనిది.

ఈ పరమాణువులు వేటి సూక్ష్మతమమగు అంశలో, అట్టి పృథివి మొదలగు కార్యరూపములోనున్న పదార్థములు తమ స్వరూపమునందు వికారములు లేకుండగా నిలిచి యుండగా, వాటి సమగ్రరూపము అతిశయించిన మహత్త్వము గలది (పెద్దది). ఆ ఐక్యావస్థయందు సృష్టి ప్రళయము మొదలగు అవస్థాభేదము గాని, కొత్త పాత అనే కాలభేదము గాని, సూర్యుడు చంద్రుడు మొదలగు పదార్థభేదము గాని లేవు.

ఏవం కాలోऽప్యనుమితస్సౌక్ష్మ్యే స్థౌల్యే చ సత్తమ ।
సంస్థానభుక్త్యా భగవానవ్యక్తో వ్యక్తభుగ్విభుః ।। 3

సత్తమ = సాధువులలో శ్రేష్ఠుడైన ఓ విదురా!, సౌక్ష్మ్యే = సూక్ష్మావస్థయందు, చ = మరియు, స్థౌల్యే = స్థూలావస్థయందు, విభుః = సమర్థమైనది, అవ్యక్తః = స్వరూపముచే వ్యక్తము కానిది, భగవాన్ = శ్రీహరి యొక్క శక్తిరూపమైనది, వ్యక్తభుక్ = వ్యక్తమైన పదార్థజాతమును వ్యాపించి పరిచ్ఛేదము చేయునది అగు, కాలః అపి = కాలము కూడా, సంస్థానభుక్త్యా = పరమాణువు మొదలగు అవస్థయొక్క ప్రాప్తిచే, అనుమితః = ఊహింపబడినది.

సాధుపురుషులలో శ్రేష్ఠుడవగు ఓ విదురా! పదార్థములో అతిస్వల్పమగు పరమాణువు మరియు పరమమహత్తు ఉన్నట్లుగానే, పరమాణువు మొదలగు అవస్థయొక్క లాభముచే కాలమునందు కూడ మిక్కిలి అల్పమగు అంశమును మరియు మిక్కిలి పెద్ద అంశమును మనము ఊహించవచ్చును. భగవానుని శక్తియగు కాలము కూడ భగవానుడే. సర్వ

సమర్థమగు ఈ కాలము సృష్టించబడిన పదార్థజాతమునంతనూ వ్యాపించి దానిని పరిచ్ఛిన్నము చేయును.

స కాలః పరమాణుర్వై యో భుంక్తే పరమాణుతామ్ ।
సతోఽవిశేషభుగ్యస్తు స కాలః పరమో మహాన్ ।। 4

సతః = సత్కార్యమగు ప్రపంచముయొక్క, పరమాణుతామ్ = పరమాణు-అవస్థను, యః = ఏ కాలము, భుంక్తే = వ్యాపించునో, సః = అట్టి, కాలః = కాలము, పరమాణుః వై = మిక్కిలి సూక్ష్మమైనది, తు = దీనికి భిన్నముగా, యః = ఏ కాలము, అవిశేషభుక్ = అన్ని అవస్థలను వ్యాపించి యుండునో, సః = ఆ, కాలః = కాలము, పరమః = అతిశయించిన, మహాన్ = పెద్దది.

సత్కార్యమగు ప్రపంచముయొక్క అతిసూక్ష్మమగు పరమాణువును వ్యాపించియుండు కాలము ఏది కలదో, అది కాలముయొక్క మిక్కిలి చిన్నదియగు మానము. ప్రపంచముయొక్క సృష్టి మొదలుకొని ప్రళయము వరకు వ్యాపించియుండు కాలము అతిశయించిన మహత్త్వము గలది (పెద్దది).

అణుర్ద్వౌ పరమాణూ స్యాత్త్రసరేణుస్త్రయస్స్మృతః ।
జాలార్కరశ్మ్యవగతః ఖమేవానుపతన్నగాత్ ।। 5

ద్వౌ = రెండు, పరమాణూ = పరమాణువులు, అణుః = అణువు, స్యాత్ = అగును, త్రయః = మూడు, త్రసరేణుః = త్రసరేణువు, స్మృతః = అగునని చెప్పబడినది, జాల-అర్కరశ్మి-అవగతః = కిటికీయందలి సూర్యకిరణములయందు తెలియబడునది, ఖం ఏవ = ఆకాశమును మాత్రమే, అనుపతన్ = అనుసరించి ఎగురుచున్నదై, అగాత్ = వెళ్లెను (వెళ్లును).

రెండు పరమాణువులు ఒక అణువు అగును. మూడు అణువులు ఒక త్రసరేణువు అగును. కిటికీకి కట్టిన వలలోని చిన్న చిల్లుల గుండా చీకటి గదిలోనికి ప్రవేశించే కాంతికిరణముల పంక్తియందు ఆకాశములో ఎగురుతూ వెళ్లే (చాల తేలికయైన) ఈ త్రసరేణువును మనము కానవచ్చును.

త్రసరేణుత్రికం భుంక్తే యః కాలస్స త్రుటిస్స్మృతః ।
శతభాగస్తు వేధస్స్యాత్తైస్త్రిభిస్తు లవస్స్మృతః ॥ 6

యః = ఏ, కాలః = కాలము, త్రసరేణుత్రికమ్ = మూడు త్రసరేణువులను, భుంక్తే = వ్యాపించియుండునో, సః = ఆ కాలము, త్రుటిః = త్రుటియని, స్మృతః = చెప్పబడినది, శతభాగః తు = త్రుటి వందవ అంశముగాగల కాలమైతే, వేధః = వేధ, స్యాత్ = అగును, త్రిభిః = మూడు, తైః తు = వాటిచేనైతే, లవః = లవము, స్మృతః = చెప్పబడినది.

మూడు త్రసరేణువులను వ్యాపించియుండు (అంతటి దూరమును కాంతి పయనించే) కాలమునకు త్రుటి అని పేరు. వంద త్రుటులు ఒక వేధ యగును. మూడు వేధలు ఒక లవము అగును.

నిమేషస్త్రిలవో జ్ఞేయ ఆమ్నాతస్తే త్రయః క్షణః ।
క్షణాన్ పంచ విదుః కాష్ఠాం లఘు తా దశ పంచ చ ॥ 7

త్రిలవః = మూడు లవముల కలయిక, నిమేషః = నిమేషము అని, జ్ఞేయః = తెలియదగును, త్రయః = మూడు, తే = ఆ నిమేషములు, క్షణః = క్షణము అని, ఆమ్నాతః = చెప్పబడినది, పంచ = అయిదు, క్షణాన్ = క్షణములను, కాష్ఠామ్ = కాష్ఠనుగా, విదుః = తెలియుచున్నారు, తాః = ఆ కాష్ఠలు, దశ చ పంచ = పదిహేను, లఘు = లఘువు.

మూడు లవములు నిమేషము. మూడు నిమేషములు క్షణము. అయిదు క్షణములు కాష్ఠ. పదిహేను కాష్ఠలు లఘువు.

లఘూని వై సమామ్నాతా దశ పంచ చ నాడికా ।
తే ద్వే ముహూర్తః ప్రహరష్షడ్యామస్సప్త వా నృణామ్ ॥ 8

దశ చ పంచ = పదిహేను, లఘూని వై = లఘువులు, నాడికా = ఘటికయని, సమామ్నాతా = చెప్పబడినది, ద్వే = రెండు, తే = ఆ ఘటికలు, ముహూర్తః = ముహూర్తము, షట్ = ఆరు గాని, సప్త వా = ఏడు గాని, నృణామ్ = మానవులకు, ప్రహరః = ప్రహరము, యామః = యామము.

పదిహేను లఘువులు ఘటిక. రెండు ఘటికలు ముహూర్తము. ఒకప్పుడు పగలు చిన్నదిగను, మరియొకప్పుడు పెద్దదిగను ఉండును. దానిని బట్టి ఆరు గాని, ఏడు గాని ముహూర్తములు మానవుల కాలమానములో ప్రహరము అనియు, యామము అనియు అనబడును.

ద్వాదశార్ధపలోన్మానం చతుర్భిశ్చతురంగులైః ।
స్వర్ణమాషైః కృతచ్ఛిద్రం యావత్ప్రస్థజలప్లుతమ్ ॥ 9

చతురంగులైః = నాలుగు అంగుళములు పొడవు గల, చతుర్భిః = నాలుగు, స్వర్ణమాషైః = బంగరు మాషములచే, కృతచ్ఛిద్రమ్ = చేయబడిన చిల్లుగల, ద్వాదశ-అర్ధపల-ఉన్మానమ్ = ఆరు పలముల కొలత పాత్ర, యావత్ = ఎంతలో, ప్రస్థజలప్లుతమ్ = ఒక ప్రస్థము జలముచే నిండునో.

ఆరు పలముల బరువు గల రాగి పాత్రకు అడుగున, నాలుగు అంగుళముల పొడవు కలిగి నాలుగు మాషముల బంగారముచే చేయబడిన తీగతో చిల్లును చేసి, ఆ పాత్రను నీటిలో ఉంచవలెను. అప్పుడు ఆ పాత్రలో ఒక ప్రస్థము నీరు నిండి నీటిలో మునిగి పోవుటకు పట్టే సమయమునకు నాడిక అని పేరు.

యామాశ్చత్వారశ్చత్వారో మర్త్యానామహనీ ఉభే ।
పక్షః పంచదశాహాని శుక్లః కృష్ణశ్చ మానద ॥ 10

మానద = మర్యాదను ఇచ్చువాడా!, మర్త్యానామ్ = మానవులకు, చత్వారః చత్వారః = నాలుగు నాలుగు, యామాః = యామములు, ఉభే అహనీ = రాత్రింబగళ్లు, పంచదశ = పదిహేను, అహాని = రోజులు, పక్షః = పక్షము, శుక్లః = శుక్లపక్షము, చ = మరియు, కృష్ణః = కృష్ణపక్షము.

ఇతరులను మన్నించే ఓ విదురా! మానవులకు నాలుగు యామములు పగలు, నాలుగు యామములు రాత్రి. పగలు, రాత్రి కలిసి ఒక దినము కాగా, అట్టి పదిహేను దినములు ఒక పక్షము. పక్షములో శుక్లపక్షము, కృష్ణపక్షము అనే విభాగము గలదు.

తయోస్సముచ్చయో మాసః పితౄణాం తదహర్నిశమ్ ।

ద్వౌ తావృతుష్షడయనం దక్షిణం చోత్తరం దివి ॥ 11

అయనే చాహనీ ప్రాహుర్వత్సరో ద్వాదశ స్మృతః ।
సంవత్సరశతం నృణాం పరమాయుర్నిరూపితమ్ ॥ 12

తయోః = ఆ రెండింటియొక్క, సముచ్చయః = కలయిక, మాసః = నెల, తత్ = అది, పితౄణామ్ = పితృదేవతలకు, అహర్నిశమ్ = ఒక దినము, ద్వౌ = రెండు, తౌ = ఆ నెలలు, ఋతుః = ఋతువు, షట్ = ఆరు, అయనమ్ = అయనము, దక్షిణమ్ = దక్షిణము, చ = మరియు, ఉత్తరమ్ = ఉత్తరము, దివి = స్వర్గమునందు, అయనీ = రెండు అయనములు, అహనీ = రాత్రింబగళ్లు అని, ప్రాహుః = చెప్పుచున్నారు, ద్వాదశ = పన్నెండు మాసములు, వత్సరః = సంవత్సరమని, స్మృతః = చెప్పబడినది, నృణామ్ = మానవులకు, సంవత్సరశతమ్ = వంద సంవత్సరములు, పరమాయుః = పూర్ణాయుర్దాయమని, నిరూపితమ్ = చెప్పబడినది.

రెండు నెలలు ఒక ఋతువు. మానవుల ఒక నెల పితృదేవతలకు ఒక దినము. రెండు నెలలు ఒక ఋతువు. ఆరు నెలలు ఒక అయనము. అయనమునందు దక్షిణాయనము, ఉత్తరాయణము అనే విభాగము గలదు. ఈ రెండు అయనములు కలిసి దేవతలకు ఒక దినము అగును. పన్నెండు నెలలు ఒక సంవత్సరము. మానవుల పూర్ణాయుర్దాయము వంద సంవత్సరములని వేదములు చెప్పుచున్నవి.

గ్రహర్క్షతారాచక్రస్థః పరమాణ్వాదినా జగత్ ।
సంవత్సరావసానేన పర్యేత్యనిమిషో విభుః ॥ 13

గ్రహ-ఋక్షతారాచక్రస్థః = గ్రహములు అశ్విని మొదలగు నక్షత్రములు మరియు ఇతర నక్షత్రములతో కూడియున్న ఖగోళచక్రమునందు నిలిచియుండువాడు, అనిమిషః = కాలస్వరూపుడు, విభుః = ఈశ్వరుడు అగు సూర్యుడు, పరమాణు-ఆదినా = సూక్ష్మతమమగు కాలాంశముతో మొదలిడి, సంవత్సర-అవసానేన = సంవత్సరముతో అంతమయ్యే కాలమానముతో, జగత్ = జగత్తును, పర్యేతి = పర్యటించుచున్నాడు.

గురువు మొదలగు గ్రహములు, అశ్వినీ మొదలగు నక్షత్రములు మరియు ఇతరములగు నక్షత్రములతో కూడియున్న ఖగోళచక్రమునందు ఉండే కాలస్వరూపుడగు సూర్యుడు సర్వమును శాసిస్తూ జగత్తును పర్యటించుచున్నాడు. ఆయనయొక్క ఈ పరిభ్రమణము వలన మిక్కిలి సూక్ష్మమగు కాలాంశముతో మొదలిడి సంవత్సరముతో అంతమయ్యే కాలచక్రము నిరూపించ బడుచున్నది.

సంవత్సరః పరివత్సర ఇడావత్సర ఏవ చ ।
అనువత్సరో వత్సరశ్చ విదురైవం ప్రభాష్యతే ॥ 14

విదుర = ఓ విదురా!, సంవత్సరః = సంవత్సరము, పరివత్సరః = పరివత్సరము, ఇడావత్సరః = ఇడావత్సరము, అనువత్సరః = అనువత్సరము, చ = మరియు, వత్సరః ఏవ చ = వత్సరము, ఏవమ్ = ఈ విధముగా, ప్రభాష్యతే = చెప్పబడుచున్నది.

ఓ విదురా! ఈ కాలమునకే సంవత్సరము (సూర్యుడు రాశిచక్రమును చుట్టి వచ్చుటకు పట్టే కాలము, 372 రోజులు), పరివత్సరము (గురువు రాశిచక్రములోని ఒక రాశినుండి మరియొక రాశికి పయనించుటకు పట్టే కాలము), ఇడావత్సరము (అన్ని నెలలకు సమానముగా 30, వెరసి 360 రోజుల కాలము), అనువత్సరము (చంద్రగతిని బట్టి అమావాస్యతో అంతమయ్యే 12 నెలలు) మరియు వత్సరము (చంద్రుడు నక్షత్రములలో సంచరించే 27 రోజులు మాత్రమే ఒక నెల, అట్టి 12 నెలలు) అనే పేర్లు కలుగుచున్నవి.

యస్సృజ్యశక్తిమురుధోచ్ఛ్వసయన్ స్వశక్త్యా
పుంసోఽభ్రమాయ దివి ధావతి భూతభేదః ।
కాలాఖ్యయా గుణమయం క్రతుభిర్వితన్వన్
తస్మై బలిం హరత వత్సరపంచకాయ ॥ 15

సృజ్యశక్తిమ్ = సృజింపబడే పదార్థములకు సంబంధించి కారణమునందు గల శక్తిని, కాల-ఆఖ్యయా = కాలము అనే, స్వశక్త్యా = తన శక్తి

చే, ఉరుధా = అనేకవిధములుగా, ఉచ్ఛ్వసయన్ = పైకి ప్రకటింప జేయు చున్నవాడై, యః = ఏ, భూతభేదః = మహాభూతవిశేషము, పుంసః = మాన వుని, అభ్రమాయ = మోహనివారణ కొరకై, క్రతుభిః = యజ్ఞములచే, గుణ మయమ్ = మంగళమయమగు స్వర్గాది ఫలమును, వితన్వన్ = విస్తరింప జేయుచున్నవాడై, దివి = ద్యులోకమునందు, ధావతి = సంచరించుచున్నా డో, వత్సరపంచకాయ = అయిదు రకముల సంవత్సరముల రూపములో నుండే, తస్మై = అట్టి సూర్యుని కొరకు, బలిమ్ = ఉపహారమును, హరత = సమర్పించుడు.

ఓ మానవులారా! (ఓ విదురా!) పంచభూతములలో విశేషమగు తేజస్సే రూపముగా గల ఈ సూర్యుడు కాలమనే తన శక్తిచే సకలకారణత త్త్వములయందలి బీజశక్తిని పలువిధములుగా కార్యోన్ముఖము చేయుచు న్నవాడై, మానవుల (చీకటి వలన, లేదా అజ్ఞానము వలన కలిగే) వ్యామో హమును పోగొట్టుతూ, ద్యులోకమునందు సంచరించుచున్నాడు. ఆయన యజ్ఞముల ద్వారా ఆరాధించే జనులకు స్వర్గము మొదలైన మంగళ ఫల ములను ఇచ్చుచున్నాడు. అయిదు రకముల సంవత్సరముల రూపములో ఆయనయే ఉన్నాడు. ఆయనకు పూజలను చేయుడు.

విదుర ఉవాచ ।
పితృదేవమనుష్యాణామాయుః పరమిదం స్మృతమ్ ।
పరేషాం గతిమాచక్ష్వ యే స్యుః కల్పాద్బహిర్విదః ॥ 16

పితృదేవమనుష్యాణామ్ = పితరులు దేవతలు మరియు మను ష్యుల, ఇదమ్ = ఈ, పరం ఆయుః = పూర్ణాయుర్దాయము, స్మృతమ్ = చెప్పబడినది, విదః = జ్ఞానులగు, పరేషామ్ = ఇతరుల, గతిమ్ = ఆయుర్దా యమును, ఆచక్ష్వ = చెప్పుము, యే = ఎవరు, కల్పాత్ బహిః = ముల్లోక ములకంటె బయట (కల్పముకంటె అధికకాలము), స్యుః = ఉందురో.

విదురుడు ఇట్లు పలికెను --- నీవు పితృదేవతలు, దేవతలు మరియు మనుష్యులు అనువారల ఆయుఃప్రమాణమును వర్ణించితివి.

ముల్లోకములకు అతీతులై కల్పముకంటె అధికకాలము నిలిచియుండే ఇతరజ్ఞానుల ఆయుఃప్రమాణమును గురించి చెప్పుము.

భగవాన్ వేద కాలస్య గతిం భగవతో నను ।
విశ్వం విచక్షతే ధీరా యోగరాద్ధేన చక్షుషా ।। 17

భగవాన్ = పూజ్యుడవగు నీవు, భగవతః = భగవత్స్వరూపమగు కాలముయొక్క, గతిమ్ = గతిని, వేద = తెలియుచున్నావు, నను = నిశ్చయము, ధీరాః = జ్ఞానులు, యోగరాద్ధేన = యోగముచే సిద్ధించిన, చక్షుషా = దృష్టితో, విశ్వమ్ = జగత్తును, విచక్షతే = దర్శించుచున్నారు.

పూజ్యుడవగు నీకు భగవత్స్వరూపమగు కాలముయొక్క గతి తెలియును. ఇది నిశ్చయము. జ్ఞానులు యోగముచే సిద్ధించిన జ్ఞాననేత్రముతో జగత్తును దర్శించెదరు.

మైత్రేయ ఉవాచ ।
కృతం త్రేతా ద్వాపరం చ కలిశ్చేతి చతుర్యుగమ్ ।
దివ్యైర్ద్వాదశభిర్వర్షైస్సావధానం నిరూపితమ్ ।। 18

కృతమ్ = కృతయుగము, త్రేతా = త్రేతాయుగము, ద్వాపరమ్ = ద్వాపరయుగము, చ = మరియు, కలిః = కలియుగము, ఇతి = అనే, స-అవధానమ్ = సంధ్య మరియు సంధ్యాంశములతో కూడిన, చతుః-యుగమ్ = నాలుగు యుగముల సముదాయము, ద్వాదశభిః = పన్నెండు, దివ్యైః వర్షైః = దివ్యసంవత్సరములచే, నిరూపితమ్ = నిరూపించబడినది.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- కృతత్రేతాద్వాపరకలియుగములు అనే నాలుగు యుగములు వాటి సంధ్య (యుగమునకు ఆరంభములో ఉండే సంధి, అనగా రెండు యుగముల మధ్యకాలము) లు మరియు సంధ్యాంశము (యుగమునకు అంతములో ఉండే సంధి కాలము) లతో కలిపి పన్నెండు వేల దివ్యసంవత్సరములగునని చెప్పబడినది.

చత్వారి త్రీణి ద్వే చైకం కృతాదిషు యథాక్రమమ్ ।

సంఖ్యాతాని సహస్రాణి ద్విగుణాని శతాని చ ॥ 19

కృత-ఆదిషు = కృతయుగము మొదలగువాటియందు, యథాక్రమమ్ = వరుసగా, చత్వారి = నాలుగు, త్రీణి = మూడు, ద్వే = రెండు, చ = మరియు, ఏకమ్ = ఒకటి, సహస్రాణి = వేలు, చ = మరియు, ద్విగుణాని = రెండు రెట్లు, శతాని = వందలు, సంఖ్యాతాని = లెక్కించబడినవి.

కృతయుగమునకు నాలుగు వేల దివ్యసంవత్సరములు, త్రేతాయుగమునకు మూడువేలు, ద్వాపరయుగమునకు రెండు వేలు, కలియుగమునకు ఒక వెయ్యి దివ్యసంవత్సరములు ఉండును. ఒక దివ్యసంవత్సరము **360** మనుష్య సంవత్సరములకు సమానము. కృతయుగమునకు సంధ్య మరియు సంధ్యాంశములు కలిపి **800**, త్రేతాయుగమునకు **600**, ద్వాపరయుగమునకు **400**, కలియుగమునకు **200** దివ్యసంవత్సరములు ఉండును.

సంధ్యాంశయోరంతరేణ యః కాలశ్శతసంఖ్యయోః ।
తమేవాహుర్యుగం తజ్ఞా యత్ర ధర్మో విధీయతే ॥ 20

శతసంఖ్యయోః = వందల సంఖ్యలోనుండే, సంధ్యా-అంశయోః = సంధ్యాంశలకు, అంతరేణ = మధ్యలో, యః = ఏ, కాలః = కాలము గలదో, తం ఏవ = దానినే, తత్-జ్ఞాః = యుగముల పరిజ్ఞానము గలవారు, యుగమ్ = యుగముగా, ఆహుః = చెప్పుచున్నారు, యత్ర = ఏ కాలమునందు, ధర్మః = ధర్మము, విధీయతే = విధింపబడుచున్నదో.

సంధ్యకు, సంధ్యాంశమునకు మధ్యలో ఉండే కాలము యుగమనబడునని యుగవేత్తలు చెప్పుచున్నారు. ఈ సంధి కాలములు వందల దివ్యసంవత్సరములలో పరిగణించబడినవి. ప్రతి యుగమునకు ఒక విశిష్ట ధర్మము విధించబడినది.

ధర్మశ్చతుష్పాన్మనుజాన్ కృతే సమనువర్తతే ।
స ఏవాన్యేష్వధర్మేణ వ్యేతి పాదేన వర్ధతా ॥ 21

చతుష్పాత్ = నాలుగు పాదములు గల, ధర్మః = ధర్మము, కృతే = కృతయుగమునందు, మనుజాన్ = మానవులను, సమనువర్తతే = చక్కగా ప్రవర్తిల్లును, సః ఏవ = ఆ ధర్మమే, అన్యేషు = ఇతరయుగములయందు, వర్ధతా = పెరిగే, అధర్మేణ = అధర్మముచే, పాదేన = పాదముచే, వ్యేతి = క్షీణించును.

కృతయుగములో మానవులయందు ధర్మము నాలుగు పాదములతో చక్కగా ప్రవర్తిల్లును. కాని, మిగిలిన యుగములలో క్రమముగా అధర్మము ఒక్కొక్క పాదము పెరుగుచుండుట వలన, ఆ మేరకు ధర్మము క్షీణించుచుండును.

త్రిలోక్యా యుగసాహస్రం బహిరాబ్రహ్మణో దినమ్ ।
తావత్యేవ నిశా తాత యన్నిమీలతి విశ్వసృక్ ॥ 22

తాత = వత్సా!, త్రిలోక్యాః = ముల్లోకములకంటె, బహిః = బయట, ఆబ్రహ్మణః = బ్రహ్మలోకము వరకు, యుగసాహస్రమ్ = వేయి చతుర్యుగములు, దినమ్ = పగలు, నిశా = రాత్రి, తావతీ ఏవ = అంతే, యత్ = ఏ రాత్రియందు, విశ్వసృక్ = సృష్టికర్త, నిమీలతి = నిద్రించునో.

ఓ విదురా! ముల్లోకములకు పైన మహర్లోకమునుండి బ్రహ్మలోకము వరకు ఒక పగలు మానవలోకములోని వేయి చతుర్యుగములకు సమానము. అంతే కాలము రాత్రి కూడ ఉండును. ఆ కాలములో సృష్టికర్త నిద్రించును.

నిశావసాన ఆరబ్ధో లోకకల్పోఽనువర్తతే ।
యావద్దినం భగవతో మనూన్ భుంజంశ్చతుర్దశ ॥ 23

నిశా-అవసానే = రాత్రి ముగిసిన కాలమునందు, ఆరబ్ధః = ఆరంభించబడిన, లోకకల్పః = లోకముల సృష్టి, చతుర్దశ = పదునాలుగు, మనూన్ = మనువులను, భుంజన్ = వ్యాపించుచున్నదై, భగవతః = బ్రహ్మగారి, యావత్ దినమ్ = పగలు ఉన్నంత వరకు, అనువర్తతే = కొనసాగును.

ఆ రాత్రి ముగియగానే ఈ లోకముల సృష్టి ఆరంభమై బ్రహ్మగారి పగలు కాలమంతయు కొనసాగును. ఆ కాలములో పదునలుగురు మనువులు గతించెదరు.

స్వం స్వం కాలం మనుర్భుంక్తే సాధికాం హ్యేకసప్తతిమ్ ।
మన్వంతరేషు మనవస్తద్వంశ్యా ఋషయస్సురాః ।
భవంతి చైవ యుగపత్సురేశాశ్చాను యే చ తాన్ ॥ 24

మనుః = మనువు, స-అధికామ్ = కొంచెము అధికాంశము గల, ఏకసప్తతిమ్ = డెబ్బది ఒక్క చతుర్యుగముల, స్వం స్వమ్ = తన తన, కాలమ్ = కాలమును, భుంక్తే = అనుభవించును, మన్వంతరేషు : మన్వంతరముల (ముందటి మనువునుండి తరువాతి మనువు వరకు గల కాలముల) యందు, మనవః = మనువులు, తత్-వంశ్యాః = ఆ మనువుల వంశములకు చెందిన రాజులు, ఋషయః = మహర్షులు, సురాః = దేవతలు, సుర-ఈశాః = దేవతలకు ప్రభువులగు ఇంద్రుడు మొదలగువారు, చ = మరియు, యే = ఎవరైతే, తాన్ = వారిని, అను చ = అనుసరించి యుందురో వారు కూడ, యుగపత్ ఏవ = ఒకే కాలమునందు, భవంతి చ = పాలించెదరు.

ప్రతి ఒక్క మనువు సుమారు డెబ్బది ఒక్క చతుర్యుగముల కాలము అధికారముననుభవించును. మన్వంతరములయందు ఆయా మనువులు, వారి వంశములకు చెందిన రాజులు, మహర్షులు, దేవతలు, వారికి ప్రభువులగు ఇంద్రాదులు, వారి అనుయాయులగు గంధర్వులు మొదలగు వారు ఏకకాలమునందు తమ తమ అధికారములయందున్నవారై, లోకములను ఏలెదరు.

ఏష దైనందినస్సర్గో బ్రాహ్మస్త్రైలోక్యవర్తనః ।
తిర్యఙ్నృపితృదేవానాం సంభవో యత్ర కర్మభిః ॥ 25

ఏషః = ఇది, బ్రాహ్మః = బ్రహ్మగారికి సంబంధించిన, దైనందినః = ప్రతిదినము జరిగే, త్రైలోక్యవర్తనః = ముల్లోకముల రచన గల, సర్గః = సృష్టి, యత్ర = దేనియందైతే, కర్మభిః = కర్మలచే, తిర్యక్-నృపితృదేవా

నామ్ = పశుపక్ష్యాదులు మానవులు పితృదేవతలు మరియు దేవతల, సంభవః = ఉత్పత్తి కలుగునో.

ఇది బ్రహ్మగారు ప్రతిదినము చేసే సృష్టి. ముల్లోకములు దీనిలో అంతర్భాగములై యున్నవి. జీవులు తమ కర్మలననుసరించి దీనిలో పశుపక్ష్యాదులు, మానవులు, పితృదేవతలు మరియు దేవతలు అనే యోనులలో జన్మించెదరు.

మన్వంతరేషు భగవాన్ బిభ్రత్సత్త్వం స్వమూర్తిభిః ।
మన్వాదిభిరిదం విశ్వమవత్యుదితపౌరుషః ॥ 26

ఉదితపౌరుషః = ప్రకటింపజేయబడిన పౌరుషము గల, భగవాన్ = భగవానుడు, మన్వంతరేషు = మన్వంతరములయందు, సత్త్వమ్ = సత్త్వ గుణమును, బిభ్రత్ = ఆశ్రయించినవాడై, మను-ఆదిభిః = మనువు మొదలు గాగల, స్వమూర్తిభిః = తన మూర్తులచే, ఇదమ్ = ఈ, విశ్వమ్ = జగత్తును, అవతి = రక్షించుచున్నాడు.

భగవానుడు తన పౌరుషమును ప్రకటిస్తూ ఈ మన్వంతరముల యందు సత్త్వగుణమునాశ్రయించినవాడై, మనువు మొదలగు తన మూర్తుల ద్వారా ఈ జగత్తును రక్షించుచున్నాడు.

తమోమాత్రాముపాదాయ ప్రతిసంరుద్ధవిక్రమః ।
కాలేనానుగతాశేష ఆస్తే తూష్ణీం దినాత్యయే ॥ 27

దిన-అత్యయే = దినముయొక్క అంతమునందు, తమోమాత్రామ్ = తమోగుణముయొక్క లేశమును, ఉపాదాయ = స్వీకరించి, ప్రతిసంరుద్ధ విక్రమః = ఉపసంహరించబడిన విక్రమము గలవాడై, కాలేన = కాలముచే, అనుగత-అశేషః = తనలోనికి తీసుకొనబడిన సర్వము గలవాడై, తూష్ణీమ్ = నిశ్చేష్టముగా, ఆస్తే = ఉండును.

దినముయొక్క అంతమునందు బ్రహ్మగారు తమోగుణము యొక్క లేశమును స్వీకరించినవాడై (తమోగుణము ఉపాధిగా గలవాడై),

సృష్టివ్యాపారమును విరమించి, నిశ్చేష్టుడై యుండును. అపుడు కాలము యొక్క ప్రభావముచే సర్వము ఆయనయందు విలీనమగును.

తమేవాన్వపిధీయంతే లోకా భూరాదయస్త్రయః ।
నిశాయామనువృత్తాయాం నిర్ముక్తశశిభాస్కరమ్ ॥ 28

నిశాయామ్ = రాత్రి, అనువృత్తాయామ్ = ప్రవర్తిల్లుచుండగా, భూః-ఆదయః = భూః మొదలైన, త్రయః = మూడు, లోకాః = లోకములు, నిర్ముక్తశశిభాస్కరమ్ = సూర్యచంద్రులు లేని విధముగా, తం ఏవ అను = ఆయనను అనుసరిస్తూనే, అపిధీయంతే = విలీనమగును.

బ్రహ్మగారి ఆ రాత్రియందు ప్రళయము జరిగి సర్వము ఆయనయందు ఉపసంహరించబడును. ఆ రాత్రియందు సూర్యచంద్రులు సైతము ఉండరు. భూర్భువస్సువర్లోకములు మూడు కూడ ఆయనలో విలీనమగును.

త్రిలోక్యాం దహ్యమానాయాం శక్త్యా సంకర్షణాగ్నినా ।
యాంత్యూష్మణా మహర్లోకాజ్జనం భృగ్వాదయోऽర్దితాః ॥29

శక్త్యా = భగవానుని శక్తియే రూపముగా గల, సంకర్షణ-అగ్నినా = సంకర్షణుని ముఖమునుండి పుట్టిన అగ్నిచే, త్రిలోక్యామ్ = ముల్లోకములు, దహ్యమానాయామ్ = దహింపబడుచుండగా, ఊష్మణా = తాపముచే, అర్దితాః = పీడించబడిన, భృగు-ఆదయః = భృగుమహర్షి మొదలగువారు, మహః-లోకాత్ = మహర్లోకమునుండి, జనమ్ = జనలోకమును గురించి, యాంతి = వెళ్లెదరు.

భగవానుని శక్తి ఆదిశేషుని ముఖమునుండి అగ్ని రూపములో వెలువడును. దానిచే ముల్లోకములు దహింపబడుచుండగా, ఆ తాపముచే పీడింపబడిన భృగుమహర్షి మొదలగువారు మహర్లోకమునుండి జనలోకమునకు వెళ్లెదరు.

తావత్త్రిభువనం సద్యః కల్పాంతైధితసింధవః ।

ప్లావయంత్యుత్కటాటోపచండవాతేరితోర్మయః ॥ 30

తావత్ = అంతలో, ఉత్కట-ఆటోపచండవాత-ఈరిత-ఊర్మయః = అత్యధికమగు సంక్షోభము గలవి మరియు ప్రచండమగు వాయువుచే ప్రేరితములైనవి అగు కెరటములు గల, కల్ప-అంత-ఏధితసింధవః = కల్పముయొక్క అంతమునందు వర్ధిల్లజేయబడిన సముద్రములు, త్రిభువనమ్ = ముల్లోకముల సమూహమును, సద్యః = వెనువెంటనే, ప్లావయంతి = ముంచెత్తును.

అంతలోనే కల్పముయొక్క అంతమునందు సముద్రములలో కెరటములు పెద్ద సంక్షోభముచే ఉవ్వెత్తున లేచిపడుచుండును. ప్రచండమగు వాయువులు వీచుటచే ఆ కెరటములు చెలియలి కట్టలను తెంచుకొని ముల్లోకములను క్షణములో ముంచివేయును.

అంతస్స తస్మిన్ సలిల ఆస్తేఽనంతాసనో హరిః ।
యోగనిద్రానిమీలాక్షః స్తూయమానో జనాలయైః ॥ 31

తస్మిన్ = ఆ, సలిలే = నీటిలో, అంతః = మధ్యలో, అనంత-ఆసనః = ఆదిశేషుడే ఆసనముగా గల, హరిః = శ్రీహరి, యోగనిద్రానిమీల-అక్షః = యోగనిద్రచే మూయబడిన కన్నులు గలవాడై, జన-ఆలయైః = జనలోకనివాసులచే, స్తూయమానః = స్తుతించబడుచున్నవాడై, ఆస్తే = ఉండును.

ఆ నీటి మధ్యలో శ్రీహరి ఆదిశేషునిపై శయనించి యోగనిద్రచే కన్నులను మూసియుండును. అపుడు జనలోకనివాసులు ఆయనను స్తుతించుచుందురు.

ఏవంవిధైరహోరాత్రైః కాలగత్యోపలక్షితైః ।
అపక్షితమివాస్యాపి పరమాయుర్వయశ్శతమ్ ॥ 32

కాలగత్యా = కాలముయొక్క గమనముచే, ఉపలక్షితైః = నిశ్చయించబడిన, ఏవంవిధైః = ఇటువంటి, అహోరాత్రైః = రాత్రింబగళ్లచే, అస్య అపి = ఈ బ్రహ్మగారికి కూడా, పరమ్ = సర్వాధికమగు, ఆయుః = ఆ

యుర్దాయమగు, వయః-శతమ్ = వందసంవత్సరముల కాలము, అపక్షితం ఇవ = క్షీణించి పోయినట్లే ఉన్నది.

బ్రహ్మగారి ఆయుర్దాయము ఈ సృష్టిలో సర్వాధికమైనది. బ్రహ్మ లోకమానమును బట్టి అది వంద సంవత్సరములు. కాలగమనమును బట్టి రాత్రింబగళ్లు గడచుచునే యున్నవని ఊహించవచ్చును. ఆ విధముగా అంతటి ఆయుర్దాయము క్షీణించిపోయినదా యన్నట్లు ఉండెను.

యదర్ధమాయుషస్తస్య పరార్ధమభిధీయతే ।
పూర్వః పరార్ధోఽపక్రాంతో హ్యపరోఽద్య ప్రవర్తతే ॥ 33

తస్య = ఆ బ్రహ్మయొక్క, ఆయుషః = ఆయుర్దాయముయొక్క, యత్ = ఏ, అర్ధమ్ = సగభాగము గలదో అది, పరార్ధమ్ = పరార్ధమని, అభిధీయతే = చెప్పబడుచున్నది, పూర్వః = మొదటి, పరార్ధః = పరార్ధము, అపక్రాంతః = గడచిపోయినది, అద్య = ఇప్పుడు, అపరః = రెండవది, ప్రవర్తతే = జరుగుచున్నది.

బ్రహ్మగారి ఆయుర్దాయములో సగభాగమునకు పరార్ధమని పేరు. దానిలో మొదటి పరార్ధము గడచిపోయినది. ఇప్పుడు రెండవ పరార్ధము జరుగుచున్నది.

పూర్వస్యాదౌ పరార్ధస్య బ్రాహ్మో నామ మహానభూత్ ।
కల్పో యత్రాభవద్బ్రహ్మ శబ్దబ్రహ్మేతి యం విదుః ॥ 34

పూర్వస్య = మొదటి, పరార్ధస్య = పరార్ధముయొక్క, ఆదౌ = ఆరంభమునందు, బ్రాహ్మః నామ = బ్రాహ్మకల్పము అని ప్రసిద్ధిని గాంచిన, మహాన్ = గొప్ప, కల్పః = కల్పము, అభూత్ = ఉండెను, యత్ర = దేనియందైతే, బ్రహ్మ = బ్రహ్మ, అభవత్ = ప్రకటమయ్యెనో, యమ్ = ఎవనిని, శబ్దబ్రహ్మ = శబ్దబ్రహ్మ, ఇతి = అని, విదుః = తెలియుచున్నారో.

మొదటి పరార్ధముయొక్క ఆరంభమునందు వచ్చిన గొప్ప కల్పమునకు బ్రాహ్మకల్పమని ప్రసిద్ధి. ఏలయనగా, ఆ కల్పమునందే శబ్దబ్రహ్మ అని పేరు గాంచిన వేదమయుడగు బ్రహ్మ ప్రకటమయ్యెను.

తస్యైవ చాంతే కల్పోఽభూద్యం పాద్మమభిచక్షతే ।
యద్ధరేర్నాభిసరస ఆసీల్లోకసరోరుహమ్ ॥ 35

తస్య = ఆ పరార్ధముయొక్క, అంతే ఏవ = అంతమునందే, కల్పః = కల్పము, అభూత్ = ఉండెను, యమ్ = దేనిని, పాద్మమ్ = పాద్మకల్పమని, అభిచక్షతే = చెప్పుచున్నారో, యత్ = దేనియందు, హరేః = శ్రీహరియొక్క, నాభిసరసః = సరస్సువంటి నాభినుండి, లోకసరోరుహమ్ = లోకమనే పద్మము, ఆసీత్ = ప్రకటమయ్యేనో.

అదే పరార్ధముయొక్క ఆఖరి కల్పమునకు పాద్మకల్పమని పేరు. ఏలయనగా, ఆ కల్పమునందు శ్రీహరియొక్క సరస్సువంటి నాభినుండి లోకమనే పద్మము ప్రకటమయ్యేను.

అయం తు కథితః కల్పో ద్వితీయస్యాపి భారత ।
వారాహ ఇతి విఖ్యాతో యత్రాసీత్సూకరో హరిః ॥ 36

భారత = భరతవంశీయుడవగు ఓ విదురా!, అయమ్ = ఈ, కల్పః తు = కల్పమైతే, ద్వితీయస్య = రెండవ పరార్ధమునకు చెందినదని, కథితః = చెప్పబడినది, వారాహః = వారాహకల్పము, ఇతి = అని, విఖ్యాతః = ప్రఖ్యాతిని గాంచినది, యత్ర = దేనియందైతే, హరిః = శ్రీహరి, సూకరః = వరాహరూపుడై, ఆసీత్ = అవతరించినాడో.

భరతవంశీయుడవగు ఓ విదురా! రెండవ పరార్ధమునకు చెందిన ఈ (ఇప్పుడు నడచుచున్న) మొట్టమొదటి కల్పమునకు వారాహకల్పమని పేరు. ఏలయనగా, ఈ కల్పమునందు శ్రీహరి వరాహమూర్తియై అవతరించినాడు.

కాలోఽయం ద్విపరార్ధాఖ్యో నిమేష ఉపచర్యతే ।
అవ్యాకృతస్యానంతస్య అనాదేర్జగదాత్మనః ॥ 37

అయమ్ = ఈ, ద్విపరార్ధ-ఆఖ్యః = రెండు పరార్ధములు అనబడే, కాలః = కాలము, అవ్యాకృతస్య = కార్యమగు ఉపాధి లేనివాడు, అనంతస్య

= అనంతుడు, అనాదేః = ఆది (కారణము) లేనివాడు, జగత్-ఆత్మనః = జగత్తుయొక్క సారతత్త్వమైనవాడు అగు శ్రీహరికి, నిమేషః = కనురెప్పపాటు కాలము అని, ఉపచర్యతే = లాక్షణికముగా చెప్పబడుచున్నది.

శ్రీహరి సర్వకారణకారణుడు. ఆయనకు ఆది గాని, అంతము గాని లేవు. ఆయన కార్యోపాధికి కట్టుబడినవాడు కాదు. ఈ జగత్తునకు ఆత్మ (సారభూతమగు సత్త) ఆయనయే. ఈ రెండు పరార్ధముల కాలము ఆయనకు ఒక కనురెప్పపాటు కాలమని ఆలంకారికముగా చెప్పుచున్నారు (అనగా, అది ఆయనకు ఆయుర్దాయమును లెక్క వేయుట కాదని అభిప్రాయము).

కాలోఽయం పరమాణ్వాదిర్ద్విపరార్ధాంత ఈశ్వరః ।
నైవేశితుం ప్రభుర్భూమ్న ఈశ్వరో ధామమానినామ్ । 38

పరమాణు-ఆదిః = అతిసూక్ష్మమగు కాలాంశము మొదలుగా గలది, ద్విపరార్ధ-అంతః = రెండు పరార్ధములతో అంతమగునది అగు, అయమ్ = ఈ, కాలః = కాలము, ఈశ్వరః = సమర్థమే అయిననూ, భూమ్నః = పరిపూర్ణుడగు శ్రీహరికి, ఈశితుమ్ = పెత్తనమును చెలాయించుటకు, న ఏవ = ప్రభుః సమర్థము కానే కాదు, ధామమానినామ్ = దేహము ఇల్లు అను వాటియందు అభిమానము గలవారికి, ఈశ్వరః = శాసించునది.

అతిసూక్ష్మమగు కాలాంశముతో మొదలు పెట్టి రెండు పరార్ధముల వరకు వ్యాపించియున్న ఈ కాలము సర్వసమర్థమే. కాని, ఆ పరబ్రహ్మపై దీని పెత్తనము లేదు, అనగా పరబ్రహ్మ కాలపరిచ్ఛేదము లేనివాడు. దేహము, ఇల్లు అనువాటియందు అభిమానము గల అజ్ఞానులను ఈ కాలము శాసించును.

వికారైః షోడశైర్యుక్తో విశేషాదిభిరావృతః ।
అండకోశో బహిరయం పంచాశత్కోటివిస్తృతః ॥ 39

దశోత్తరాధికైర్యత్ర ప్రవిష్టః పరమాణువత్ ।

లక్ష్యతేఽంతర్గతాశ్చాన్యే కోటిశో హ్యాండరాశయః ॥ 40

తదాహురక్షరం బ్రహ్మ సర్వకారణకారణమ్ ।
విష్ణోర్ధామ పరం సాక్షాత్పురుషస్య మహాత్మనః ॥ 41

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
ఏకాదశోఽధ్యాయః ॥

షోడశైః = పదునారు, వికారైః = వికారములతో, యుక్తః = కూడిన ది, దశ-ఉత్తర-అధికైః = పదిరెట్లు ఉత్తరోత్తరమగు ఆధిక్యము గల, విశేష-ఆదిభిః = పృథివి మొదలగువాటిచే, బహిః = బాహ్యమునందు, ఆవృతః = చుట్టువారబడియున్నది అగు, అయమ్ = ఈ, అండకోశః = బ్రహ్మాండకోశ ము, పంచాశత్-కోటివిస్తృతః = ఏబై కోట్ల యోజనముల విస్తారము గలది, యత్ర = ఏ పరబ్రహ్మయందు, ప్రవిష్టః = అంతర్లీనమై, పరమాణువత్ = పర మాణువు వలె, లక్ష్యతే = కానవచ్చునో, చ = మరియు, అన్యే = ఇతరముల గు, అండరాశయః = బ్రహ్మాండముల రాశులు, కోటిశః హి = కోట్ల సంఖ్య లో, అంతర్గతాః = అంతర్గతములై యున్నవో, తత్ = అట్టి, అక్షరమ్ = వినా శము లేని, బ్రహ్మ = పరబ్రహ్మ, సర్వకారణకారణమ్ = మహత్తు మొదలగు కారణములన్నింటికీ కారణమనియు, మహాత్మనః = పరమాత్మయగు, పురు షస్య = పూర్ణుడగు, విష్ణోః = విష్ణువుయొక్క, సాక్షాత్ = సాక్షాత్తుగా, పరమ్ = శ్రేష్ఠమగు, ధామ = ధామము (స్వరూపము) అనియు, ఆహుః = చెప్పు చున్నారు.

ఏబై కోట్ల యోజనముల విస్తారము గల ఈ బ్రహ్మాండకోశము పది ఇంద్రియములు, మనస్సు మరియు పంచభూతములు అనే పదునారు వికారములతో కూడియున్నది. దీనికి బయట పృథివితో మొదలిడి వరుసగా ఒకదానికంటె మరియొకటి పదిరెట్లు ఆధిక్యము గలవై నీరు, అగ్ని, వాయు వు, ఆకాశము అనే సూక్ష్మపంచభూతములు, అహంకారము, మహత్తత్త్వ ము, ప్రకృతి అను తత్త్వములు చుట్టువారి యున్నవి. ఇంతటి బ్రహ్మాం డము ఆ పరబ్రహ్మయందు విలీనమై పరమాణువు వలె కనప్పట్టును. అవినా శియగు ఆ పరబ్రహ్మ మహత్తత్త్వము మొదలగు కారణములన్నింటికీ కార

ణము. దానియందు ఇట్టి బ్రహ్మాండముల రాశులు ఇంకనూ కోట్ల సంఖ్యలో నున్నవి. పరమాత్మ, పూర్ణుడు అగు విష్ణువుయొక్క ధామము (స్వరూపము) సాక్షాత్తుగా ఈ పరబ్రహ్మయే.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధమునందు
పదునొకండవ అధ్యాయము ముగిసినది (**11**).

* * * * *

# అథ ద్వాదశోఽధ్యాయః

## సృష్టి విస్తారమును వర్ణించుట

మైత్రేయ ఉవాచ ।
ఇతి తే వర్ణితః క్షత్తః కాలాఖ్యః పరమాత్మనః ।
మహిమా వేదగర్భోఽథ యథాస్రాక్షీన్నిబోధ మే ॥ 1

మైత్రేయః = మైత్రేయ మహర్షి, ఉవాచ = పలికెను, క్షత్తః = ఓ విదురా!, ఇతి = ఈ విధముగా, పరమాత్మనః = పరమేశ్వరునియొక్క, కాల -ఆఖ్యః = కాలము అనబడే, మహిమా = మహిమ, తే = నీ కొరకు, వర్ణితః = వర్ణించబడినది, అథ = తరువాత, వేదగర్భః = వేదములను తనయందు కలిగియున్న బ్రహ్మగారు, యథా = ఏ విధముగా, అస్రాక్షీత్ = సృష్టించెనో, మే = నాయొక్క (వచనములనుండి), నిబోధ = తెలుసుకొనుము.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఓ విదురా! పరమేశ్వరుని కాలము అనే విభూతిని నేను నీకు ఇంతవరకు వర్ణించి చెప్పితిని. వేదములకు నిధియగు బ్రహ్మగారు సృష్టిని చేసిన విధమును గురించి ఇప్పుడు చెప్పెదను. వినుము.

ససర్జాగ్రేఽంధతామిస్రమథ తామిస్రమాదికృత్ ।
మహామోహం చ మోహం చ తమశ్చాజ్ఞానవృత్తయః ॥ 2

అగ్రే = ఆరంభములో, ఆదికృత్ = సృష్టికర్తయగు బ్రహ్మగారు, అంధతామిస్రమ్ = అంధతామిస్రమును, తామిస్రమ్ = తామిస్రమును, మహామోహమ్ = మహామోహమును, మోహమ్ = మోహమును, చ = మరియు, తమః చ = తమస్సును కూడ, ససర్జ = సృష్టించెను, అజ్ఞానవృత్తయః = అజ్ఞానముయొక్క వికారములు.

సృష్టికర్తయగు బ్రహ్మగారు మొట్టమొదట అంధతామిస్రము (మరణము వలని భయము అనే అభినివేశము), తామిస్రము (ద్వేషము), మహామోహము (రాగము), మోహము (అహంకారము, లేక అస్మిత) మరియు తమస్సు (తన స్వరూపము తెలియకుండుట అనే అవిద్య) అనే అయిదు అజ్ఞానవికారములను సృష్టించెను.

దృష్ట్వా పాపీయసీం సృష్టిం నాత్మానం బహ్వమన్యత ।
భగవద్ధ్యానపూతేన మనసాన్యాం తతోఽసృజత్ ॥ 3

పాపీయసీమ్ = పాపభూయిష్ఠమగు, సృష్టిమ్ = సృష్టిని, దృష్ట్వా = చూచి, ఆత్మానమ్ = తనను, న బహు అమన్యత = మెచ్చుకొనలేదు, తతః = తరువాత, భగవద్-ధ్యానపూతేన = భగవంతుని ధ్యానముచే పవిత్రమైన, మనసా = మనస్సుతో, అన్యామ్ = మరియొక సృష్టిని, అసృజత్ = సృష్టించెను.

బ్రహ్మగారు పాప (అజ్ఞాన) భూయిష్ఠమగు ఈ సృష్టిని చూచి తనను తాను మెచ్చుకొనలేదు. అపుడాయన భగవంతుని ధ్యానించుట ద్వారా తన మనస్సును పవిత్రము చేసుకొని, మరియొక సృష్టిని చేసెను.

సనకం చ సనందం చ సనాతనమథాత్మభూః ।
సనత్కుమారం చ మునీన్నిష్క్రియానూర్ధ్వరేతసః ॥ 4

అథ = అపుడు, ఆత్మభూః = స్వయంభువుడగు బ్రహ్మగారు, సనకమ్ = సనకుడు, సనందమ్ = సనందుడు, సనాతనమ్ = సనాతనుడు, చ = మరియు, సనత్కుమారం చ = సనత్కుమారుడు అనే, నిః-క్రియాన్ = సర్వకర్మలను సన్న్యసించిన, ఊర్ధ్వరేతసః = ఊర్ధ్వరేతస్కులగు, మునీన్ = మునులను (సృష్టించెను).

అపుడు స్వయంభువుడగు బ్రహ్మగారు సనక, సనందన, సనాతన, సనత్కుమారులనే మహర్షులను సృష్టించెను. వారందరు సర్వకర్మసన్న్యాసపూర్వకమగు ఆత్మజ్ఞానమునందు నిష్ఠగల బ్రహ్మచారులు.

తాన్ బభాషే స్వభూః పుత్రాన్ ప్రజాః సృజత పుత్రకాః

తన్నైచ్ఛన్మోక్షధర్మాణో వాసుదేవపరాయణాః ॥ 5

స్వభూః = స్వయంభువుడగు బ్రహ్మగారు, తాన్ = ఆ, పుత్రాన్ = పుత్రులను ఉద్దేశించి, బభాషే = పలికెను, పుత్రకాః = ఓ కుమారులారా!, ప్రజాః = సంతానమును, సృజత = సృష్టించుడు, మోక్షధర్మాణః = మోక్షధర్మమగు ఆత్మజ్ఞానమునందు నిష్ఠగలవారు, వాసుదేవపరాయణాః = వాసుదేవుడే పరమగమ్యముగా గలవారు అగు ఆ మహర్షులు, తత్ = దానిని, న ఐచ్ఛన్ = ఇచ్ఛగించకుండిరి.

మీరు సంతానమును గనుడని స్వయంభువుడగు బ్రహ్మగారు ఆ తన పుత్రులతో చెప్పెను. కాని, మోక్షధర్మమగు ఆత్మజ్ఞానమునందు నిష్ఠ గలవారు, వాసుదేవునియందు అనన్యమగు భక్తి గలవారు అగు ఆ మునులకు అట్టి ప్రవృత్తి మార్గము నచ్చలేదు.

సోఽవధ్యాతస్సుతైరేవం ప్రత్యాఖ్యాతానుశాసనైః ।
క్రోధం దుర్విషహం జాతం నియంతుముపచక్రమే ॥ 6

ప్రత్యాఖ్యాత-అనుశాసనైః = నిరాకరించబడిన ఆదేశము గల, సుతైః = పుత్రులచే, ఏవమ్ = ఈ విధముగా, అవధ్యాతః = తిరస్కరించబడిన, సః = ఆ బ్రహ్మగారు, జాతమ్ = పుట్టిన, దుర్విషహమ్ = మిక్కిలి సహించ శక్యము గాని, క్రోధమ్ = కోపమును, నియంతుమ్ = నియంత్రించుటకు, ఉపచక్రమే = ప్రయత్నించెను.

ఈ విధముగా కొడుకులు తన మాటను కాదని తనను తిరస్కరించగా, ఆ బ్రహ్మగారికి పట్టరానంత కోపము కలిగెను. ఆయన ఆ కోపమును ఆపుకొనుటకు ప్రయత్నించెను.

ధియా నిగృహ్యమాణోఽపి భ్రువోర్మధ్యాత్ప్రజాపతేః ।
సద్యోఽజాయత తన్మన్యుః కుమారో నీలలోహితః ॥ 7

తత్-మన్యుః = ఆ బ్రహ్మగారి కోపము, ధియా = బుద్ధిచే, నిగృహ్యమాణః అపి = నియంత్రించబడుచున్ననూ, ప్రజాపతేః = ఆ ప్రజాపతి యొక్క, భ్రువోః = కనుబొమల, మధ్యాత్ = మధ్యనుండి, సద్యః = వెనువెం

టనే, నీలలోహితః = నలుపు ఎరుపు రంగులు గల, కుమారః = కుమారుని గా, అజాయత = పుట్టెను.

బ్రహ్మగారు ఆపుకొనే ప్రయత్నమును చేయుచున్ననూ, ఆ కోపము ఆయన కనుబొమల మధ్యనుండి నలుపు ఎరుపు రంగులు గల కుమారుని రూపములో ఆవిర్భవించెను.

స వై రురోద దేవానాం పూర్వజో భగవాన్ భవః ।
నామాని కురు మే ధాతః స్థానాని చ జగద్గురో ।। 8

దేవానామ్ = దేవతలలో, పూర్వజః = ముందుగా పుట్టిన, సః = ఆ, భగవాన్ భవః = రుద్రభగవానుడు, రురోద = దుఃఖపూర్వకముగా పలికెను, ధాతః = ఓ బ్రహ్మ!, జగద్-గురో = జగత్తునకు తండ్రి (గురువు) అయిన వాడా!, మే = నాకు, నామాని = పేర్లను, చ = మరియు, స్థానాని = స్థానములను, కురు = ఏర్పాటు చేయుము.

దేవతలందరికంటె ముందు పుట్టిన ఆ రుద్రభగవానుడు రోదిస్తూ ఇట్లు పలికెను --- జగత్తునకు తండ్రియగు ఓ బ్రహ్మ! నాకు పేర్లను పెట్టి స్థానములను నిర్దేశించుము.

ఇతి తస్య వచః పాద్మో భగవాన్ పరిపాలయన్ ।
అభ్యధాద్భద్రయా వాచా మా రోదీస్తత్కరోమి తే ।। 9

పాద్మః = పద్మమునుండి పుట్టిన, భగవాన్ = బ్రహ్మ భగవానుడు, తస్య = ఆ రుద్రుని, ఇతి = ఈ విధమగు, వచః = మాటను, పరిపాలయన్ = పాటించువాడై, భద్రయా = మధురమగు, వాచా = వాక్కుతో, అభ్యధాత్ = పలికెను, మా రోదీః = రోదించకుము, తే = నీ కొరకు, తత్ = ఆ పనిని, కరోమి = చేయుచున్నాను.

పద్మమునుండి పుట్టిన బ్రహ్మభగవానుడు ఆ రుద్రుని ఆ వచనమును మన్నించి మధురమగు వాక్కుతో ఇట్లు పలికెను --- రోదించకుము. అటులనే చేయగలను.

యదరోదీస్సురశ్రేష్ఠ సోద్వేగ ఇవ బాలకః ।
తతస్త్వామభిధాస్యంతి నామ్నా రుద్ర ఇతి ప్రజాః ॥ 10

సురశ్రేష్ఠ = దేవతలలో శ్రేష్ఠమైనవాడా!, బాలకః ఇవ = చిన్న పిల్ల వాని వలె, స-ఉద్వేగః = భయముతో కూడినవాడవై, యత్ = ఏ కారణము చే, అరోదీః = రోదించితివో, తతః = ఆ కారణము వలన, ప్రజాః = జనులు, త్వామ్ = నిన్ను, రుద్రః = రుద్రుడు, ఇతి = అనే, నామ్నా = పేరుతో, అభిధా స్యంతి = నిర్దేశించగలరు.

దేవతలలో శ్రేష్ఠుడవగు ఓ భవుడా! నీవు బాలకుని వలె భయ ముతో రోదించిన కారణముచే జనులు నిన్ను రుద్రుడను పేరుతో వ్యవహ రించెదరు.

హృదింద్రియాణ్యసుర్వ్యోమ వాయురగ్నిర్జలం మహీ ।
సూర్యశ్చంద్రస్తపశ్చైవ స్థానాన్యగ్రే కృతాని మే ॥ 11

హృత్ = హృదయము, ఇంద్రియాణి = ఇంద్రియములు, అసుః = ప్రాణము, వ్యోమ = ఆకాశము, వాయుః = వాయువు, అగ్నిః = అగ్ని, జలమ్ = నీరు, మహీ = భూమి, సూర్యః = సూర్యుడు, చంద్రః = చంద్రుడు, చ = మరియు, తపః ఏవ = నిశ్చయముగా తపస్సు అను, స్థానాని = స్థానము లు, మే = నాచే, అగ్రే = ముందే, కృతాని = చేయబడినవి.

హృదయము, ఇంద్రియములు, ప్రాణము, ఆకాశము, వాయువు, అగ్ని, నీరు, భూమి, సూర్యుడు, చంద్రుడు మరియు తపస్సు అను స్థాన ములను నేను నీ కొరకై ముందే ఏర్పాటు చేసితిని.

మన్యుర్మనుర్మహినసో మహాఞ్ఛివ ఋతుధ్వజః ।
ఉగ్రరేతా భవః కాలో వామదేవో ధృతవ్రతః ॥ 12

మన్యుః = మన్యువు, మనుః = మనువు, మహినసః = మహినసు డు, మహాన్ = మహాన్, శివః = శివుడు, ఋతుధ్వజః = ఋతుధ్వజుడు, ఉగ్రరేతాః = ఉగ్రరేతస్కుడు, భవః = భవుడు, కాలః = కాలుడు, వామదేవః = వామదేవుడు, ధృతవ్రతః = ధృతవ్రతుడు.

మన్యువు (ప్రళయమునందు కోపము ఉన్నట్లు కానవచ్చువాడు), మనువు (మనువుల రూపములో ప్రకటమగువాడు, లేక జ్ఞానస్వరూపుడు), మహినసుడు (గొప్ప శక్తి గలవాడు), మహాన్ (నిరతిశయమగు విస్తారము గలవాడు), శివుడు (మంగళ స్వరూపుడు), ఋతుధ్వజుడు (ప్రకాశించే రూపము గలవాడు), ఉగ్రరేతసుడు (భయంకరమగు శక్తి గలవాడు), భవుడు (జగత్కారణుడు), కాలుడు (కాల స్వరూపుడు, లేక మృత్యుస్వరూపుడు), వామదేవుడు (సుందరుడు మరియు స్వయంప్రకాశ స్వరూపుడు), ధృతవ్రతః (గొప్ప వ్రతనిష్ఠ గలవాడు) అనునవి రుద్రుని పేర్లు.

ధీర్వృత్తిరుశనోమా చ నియుత్సర్పిరిలాంబికా ।
ఇరావతీ సుధా దీక్షా రుద్రాణ్యో రుద్ర తే స్త్రియః ॥ 13

రుద్ర = ఓ రుద్రా!, ధీః = ధీ, వృత్తిః = వృత్తి, ఉశనా = ఉశన, ఉమా = ఉమ, నియుత్ = నియుత్, సర్పిః = సర్పి, ఇలా = ఇల, అంబికా = అంబిక, ఇరావతీ = ఇరావతి, సుధా = సుధ, చ = మరియు, దీక్షా = దీక్ష అనే, రుద్రాణ్యః = రుద్రాణులు, తే = నీ, స్త్రియః = భార్యలు.

ఓ రుద్రా! ధీ (బుద్ధి), వృత్తి (క్రియాశీలము), ఉశన (హర్షము), నియుత్ (వాయువుయొక్క అశ్వము, గమనశక్తి), సర్పి (ఆహుతినిచ్చే ద్రవ్యము), ఇల (వాక్కు), అంబిక (జగన్మాత), ఇరావతి (అమృతధారిణి), సుధ (అమృతస్వరూపిణి), దీక్ష అను స్త్రీలు నీకు భార్యలు (శక్తులు) కాగలరు.

గృహాణైతాని నామాని స్థానాని చ సయోషణః ।
ఏభిస్సృజ ప్రజా బహ్వీః ప్రజానామసి యత్పతిః ॥ 14

సయోషణః = భార్యలతో కూడినవాడవై, ఏతాని = ఈ, నామాని = పేర్లను, చ = మరియు, స్థానాని = స్థానములను, గృహాణ = స్వీకరించుము, ఏభిః = వీటితో గూడి, బహ్వీః = అధికులగు, ప్రజాః = ప్రాణులను, సృజ = సృష్టించుము, యత్ = ఏలయనగా, ప్రజానామ్ = ప్రాణులకు, పతిః = ప్రభుడవు, అసి = అగుచున్నావో.

నీవు భార్యలతో గూడి ఈ పేర్లను మరియు స్థానములను స్వీకరించి, అధికముగా ప్రజాసృష్టిని చేయుము. ఏలయన, నీవు ప్రజాపతివి.

ఇత్యాదిష్టస్స గురుణా భగవాన్నీలలోహితః ।
సత్త్వాకృతిస్వభావేన ససర్జాత్మసమాః ప్రజాః ॥ 15

ఇతి = ఈ విధముగా, గురుణా = తండ్రియగు బ్రహ్మగారిచే, ఆదిష్టః = ఆదేశించబడిన, నీలలోహితః = నలుపు ఎరుపు రంగులు గల, సః = ఆ, భగవాన్ = రుద్రభగవానుడు, సత్త్వ-ఆకృతిస్వభావేన = బలము ఆకారము మరియు స్వభావము అనువాటితో, ఆత్మసమాః = తనతో సమానులగు, ప్రజాః = ప్రాణులను, ససర్జ = సృష్టించెను.

తన తండ్రియగు బ్రహ్మగారు ఈ విధముగా ఆదేశించగా ఆ నీల లోహిత భగవానుడు, బలము ఆకారము మరియు స్వభావము అనువాటిలో తనతో సమానులగు సంతానమును సృష్టించెను.

రుద్రాణాం రుద్రసృష్టానాం సమంతాద్గ్రసతాం జగత్ ।
నిశామ్యాసంఖ్యశో యూథాన్ ప్రజాపతిరశంకత ॥ 16

రుద్రసృష్టానామ్ = రుద్రునిచే సృష్టించబడినట్టియు, జగత్ = జగత్తును, సమంతాత్ = అంతటా, గ్రసతామ్ = భక్షించుచున్న, రుద్రాణామ్ = రుద్రుల, అసంఖ్యశః = లెక్క లేనన్ని, యూథాన్ = గణములను, నిశామ్య = చూచి, ప్రజాపతిః = బ్రహ్మగారు, అశంకత = శంకించెను.

రుద్రునిచే సృష్టించబడిన రుద్రులు లెక్క లేనన్ని గణములుగా నున్నవారై జగత్తునంతనూ భక్షించ మొదలిడిరి. వారిని చూచిన బ్రహ్మగారికి శంక కలిగెను.

అలం ప్రజాభిస్సృష్టాభిరీదృశీభిస్సురోత్తమ ।
మయా సహ దహంతీభిర్దిశశ్చక్షుర్భిరుల్బణైః ॥ 17

సుర-ఉత్తమ = దేవతలలో శ్రేష్ఠమైనవాడా!, ఉల్బణైః = క్రూరములగు, చక్షుర్భిః = కన్నులతో, మయా సహ = నాతో సహా, దిశః = దిక్కుల

ను, దహంతీభిః = కాల్చి వేయుచున్న, సృష్టాభిః = సృష్టించబడిన, ఈదృశీభిః = ఇటువంటి, ప్రజాభిః = సంతానములచే, అలమ్ = చాలును.

దేవతలలో శ్రేష్ఠుడవగు ఓ రుద్రా! నీచే సృష్టించబడిన ఈ రుద్రులు నాతో సహా దిక్కులను తమ క్రూరములగు చూపులతో కాల్చివేయుచున్నారు. ఈ సృష్టి చాలును. ఇట్టి వారిని ఇంక సృష్టించవలదు.

తప ఆతిష్ఠ భద్రం తే సర్వభూతసుఖావహమ్ ।
తపసైవ యథా పూర్వం స్రష్టా విశ్వమిదం భవాన్ ॥ 18

సర్వభూతసుఖ-ఆవహమ్ = సకలప్రాణులకు సుఖమును కలిగించే, తపః = తపస్సును, ఆతిష్ఠ = అనుష్ఠించుము, తే = నీ కొరకు, భద్రమ్ = మంగళమగుగాక!, భవాన్ = నీవు, తపసా ఏవ = తపస్సుచే మాత్రమే, ఇదమ్ = ఈ, విశ్వమ్ = జగత్తును, యథాపూర్వమ్ = పూర్వమునందు వలెనే, స్రష్టా = సృష్టించగలవు.

నీవు సకలప్రాణులకు సుఖమును కలిగించే తపస్సును చేయుము. నీకు మంగళమగుగాక! ఆ తపస్సుయొక్క ప్రభావముచే నీవు పూర్వమునందు వలెనే సృష్టిని చేయగలవు.

తపసైవ పరం జ్యోతిర్భగవంతమధోక్షజమ్ ।
సర్వభూతగుహావాసమంజసా విందతే పుమాన్ ॥ 19

పుమాన్ = మానవుడు, పరం జ్యోతిః = సర్వమును ప్రకాశింపజేసే చైతన్యస్వరూపుడు, సర్వభూతగుహ-ఆవాసమ్ = సకలప్రాణుల బుద్ధిగుహయందు నివసించువాడు, అధోక్షజమ్ = ప్రత్యక్షాది ప్రమాణములకు లభ్యము కానివాడు అగు, భగవంతమ్ = శ్రీహరి భగవానుని, తపసా ఏవ = తపస్సుచే మాత్రమే, అంజసా = సాక్షాత్తుగా, విందతే = పొందును.

సర్వమును ప్రకాశింపజేసే చైతన్యస్వరూపుడు, సకలప్రాణుల బుద్ధిగుహయందు చైతన్యరూపముగా ఉపలభ్యమగువాడు, ప్రత్యక్షాది ప్రమాణములకు దొరకనివాడు అగు శ్రీహరి భగవానుని మానవుడు తపస్సుచే మాత్రమే సాక్షాత్తుగా (ఆత్మరూపముగా) దర్శించగల్గును.

మైత్రేయ ఉవాచ ।
ఏవమాత్మభువాదిష్టః పరిక్రమ్య గిరాం పతిమ్ ।
బాఢమిత్యమువామంత్ర్య వివేశ తపసే వనమ్ ।। 20

ఆత్మభువా = స్వయంభువుడగు బ్రహ్మచే, ఏవమ్ = ఈ విధముగా, ఆదిష్టః = ఆదేశించబడిన ఆ రుద్రుడు, గిరాం పతిమ్ = వాక్పతియగు బ్రహ్మను, పరిక్రమ్య = ప్రదక్షిణము చేసి, బాఢమ్ = సరే, ఇతి = అని, అముమ్ = ఈ బ్రహ్మను, ఆమంత్ర్య = అనుమతిని తీసుకొని, తపసే = తపస్సు కొరకు, వనమ్ = అడవిని, వివేశ = ప్రవేశించెను.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- స్వయంభువుడు, వేదరూపములగు వాక్కులకు ప్రభువు అగు బ్రహ్మ ఈ విధముగా ఆదేశించగా, ఆ రుద్రుడు సరే అని అంగీకరించి, ఆయనవద్ద సెలవు తీసుకొని, తపస్సును చేయుట కొరకై అడవికి వెళ్లెను.

అథాభిధ్యాయతస్సర్గం దశ పుత్రాః ప్రజజ్ఞిరే ।
భగవచ్ఛక్తియుక్తస్య లోకసంతానహేతవః ।। 21

అథ = తరువాత, భగవత్-శక్తియుక్తస్య = శ్రీహరి భగవానుని శక్తితో కూడియున్నవాడై, సర్గమ్ = సృష్టిని గురించి, అభిధ్యాయతః = చింతిల్లుచున్న బ్రహ్మకు, లోకసంతానహేతవః = లోకములను (ప్రాణులను) సృష్టించుటకు కారణభూతులైన, దశ = పదిమంది, పుత్రాః = పుత్రులు, ప్రజజ్ఞిరే = పుట్టిరి.

బ్రహ్మగారు లోకములను సృష్టించే శక్తిని శ్రీహరి భగవానుని నుండి పొందియుండెను. ఆయన సృష్టిని గురించి ఆలోచించుచుండగా, ఆయనకు పదిమంది పుత్రులు కలిగిరి. వారు వివిధప్రాణుల (లోకముల) సృష్టికి కారణభూతులైరి.

మరీచిరత్ర్యంగిరసౌ పులస్త్యః పులహః క్రతుః ।
భృగుర్వసిష్ఠో దక్షశ్చ దశమస్తత్ర నారదః ।। 22

మరీచిః = మరీచి, అత్రి-అంగిరసౌ = అత్రి మరియు అంగిరసుడు, పులస్త్యః = పులస్త్యుడు, పులహః = పులహుడు, క్రతుః = క్రతువు, భృగుః = భృగువు, వసిష్ఠః = వసిష్ఠుడు, చ = మరియు, దక్షః = దక్షుడు, తత్ర = వారిలో, నారదః = నారదుడు, దశమః = పదవ వాడు.

మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, భృగువు, వసిష్ఠుడు, దక్షుడు మరియు నారదుడు అనునవి ఆ పదిమంది పుత్రుల పేర్లు.

ఉత్సంగాన్నారదో జజ్ఞే దక్షోఽంగుష్ఠాత్స్వయంభువః ।
ప్రాణాద్వసిష్ఠస్సంజాతో భృగుస్త్వచి కరాత్క్రతుః ॥ 23

నారదః = నారదుడు, స్వయంభువః = స్వయంభువుడగు బ్రహ్మ యొక్క, ఉత్సంగాత్ = ఒడినుండి, దక్షః = దక్షుడు, అంగుష్ఠాత్ = బొటనవ్రేలినుండి, జజ్ఞే = పుట్టెను, ప్రాణాత్ = ప్రాణమునుండి, వసిష్ఠః = వసిష్ఠుడు, భృగుః = భృగువు, త్వచి = చర్మమునందు, కరాత్ = చేతినుండి, క్రతుః = క్రతువు, సంజాతః = పుట్టినాడు.

స్వయంభువుడగు బ్రహ్మగారి ఒడినుండి నారదుడు, బొటనవ్రేలి నుండి దక్షుడు, ప్రాణమునుండి వసిష్ఠుడు, చర్మమునుండి భృగువు, చేతి నుండి క్రతువు పుట్టిరి.

పులహో నాభితో జజ్ఞే పులస్త్యః కర్ణయోరృషిః ।
అంగిరా ముఖతోఽక్ష్ణోఽత్రిర్మరీచిర్మనసోఽభవత్ ॥ 24

నాభితః = బొడ్డునుండి, పులహః = పులహుడు, పులస్త్యః ఋషిః = పులస్త్యమహర్షి, కర్ణయోః = చెవులయందు, జజ్ఞే = పుట్టెను, అంగిరాః = అంగిరసుడు, ముఖతః = నోటినుండి, అక్ష్ణః = కంటినుండి, అత్రిః = అత్రి, మరీచిః = మరీచి, మనసః = మనస్సునుండి, అభవత్ = పుట్టెను.

బొడ్డునుండి పులహుడు, చెవులనుండి పులస్త్యుడు, నోటినుండి అంగిరసుడు, కంటినుండి అత్రి, మనస్సునుండి మరీచి పుట్టిరి.

ధర్మః స్తనాద్దక్షిణతో యత్ర నారాయణస్స్వయమ్ ।
అధర్మః పృష్ఠతో యస్మాన్మృత్యుర్లోకభయంకరః ॥ 25

ధర్మః = ధర్ముడు, దక్షిణతః స్తనాత్ = కుడి స్తనమునుండి, యత్ర = ఎవని వలన, నారాయణః = నారాయణుడు, స్వయమ్ = స్వయముగా (జన్మించెనో), అధర్మః = అధర్మము, పృష్ఠతః = వీపునుండి, యస్మాత్ = ఏ అధర్మమునుండి, లోకభయంకరః = జనులకు భయమును గొల్పే, మృత్యుః = మృత్యువు (పుట్టెనో).

బ్రహ్మగారి కుడి స్తనమునుండి ధర్మప్రజాపతి పుట్టెను. నారాయణుడు స్వయముగా ఆయనకు కుమారుడై అవతరించెను. బ్రహ్మగారి వీపునుండి అధర్మము పుట్టెను. ఆ అధర్మమునుండి లోకములకు భయమును గొల్పే మృత్యుదేవత పుట్టెను.

హృది కామో భ్రువః క్రోధో లోభశ్చాధరదచ్ఛదాత్ ।
ఆస్యాద్వాక్సింధవో మేఢ్రాన్నిరృతిః పాయోరఘాశ్రయః ॥26

హృది = హృదయమునందు, కామః = కాముడు, భ్రువః = కనుబొమనుండి, క్రోధః = కోపము, చ = మరియు, అధరదచ్ఛదాత్ = క్రింది పెదవినుండి, లోభః = లోభము, ఆస్యాత్ = ముఖమునుండి, వాక్ = వాక్కు (వాగ్దేవి), మేఢ్రాత్ = మేఢ్రమునుండి , సింధవః = సముద్రములు, పాయోః = విసర్జనేంద్రియమునుండి, అఘాశ్రయః = పాపమునకు నివాసమగు, నిరృతిః = నిరృతి.

హృదయమునుండి కామము, కనుబొమనుండి క్రోధము, క్రింది పెదవినుండి లోభము, ముఖమునుండి వాక్కు, మేఢ్రమునుండి సముద్రములు, విసర్జనేంద్రియమునుండి పాపనిలయుడగు నిరృతి జన్మించిరి.

ఛాయాయాః కర్దమో జజ్ఞే దేవహూత్యాః పతిః ప్రభుః ।
మనసో దేహతశ్చేదం జజ్ఞే విశ్వకృతో జగత్ ॥ 27

దేవహూత్యాః = దేవహూతియొక్క, పతిః = భర్త, ప్రభుః = సర్వసమర్థుడు అగు, కర్దమః = కర్దమ ప్రజాపతి, విశ్వకృతః = జగత్తును సృష్టిం

చిన బ్రహ్మగారి, ఛాయాయాః = నీడ (దేహకాంతి) నుండి, జజ్ఞే = పుట్టెను, చ = మరియు, ఇదమ్ = ఈ, జగత్ = విశ్వము, దేహతః = దేహమునుండి, మనసః = మనస్సునుండి, జజ్ఞే = పుట్టెను.

దేవహూతియొక్క భర్తయగు కర్దమ ప్రజాపతి సృష్టికర్తయొక్క నీడ (దేహకాంతి) నుండి పుట్టెను. ఈ జగత్తు ఆయన దేహమునుండి మరియు మనస్సునుండి పుట్టినది.

వాచం దుహితరం తన్వీం స్వయంభూర్హరతీం మనః ।
అకామాం చకమే క్షత్తస్సకామ ఇతి నః శ్రుతమ్ ॥ 28

క్షత్తః = ఓ విదురా!, సకామః = కామముతో కూడియున్న, స్వయంభూః = బ్రహ్మగారు, దుహితరమ్ = కుమార్తె, తన్వీమ్ = సుకుమారి, మనః = మనస్సును, హరతీమ్ = దోచివేయుచున్నది, అకామామ్ = కామము లేనిది అగు, వాచమ్ = వాగ్దేవిని, చకమే = కామించెను, ఇతి = అని, నః = మాకు, శ్రుతమ్ = వినబడినది.

ఓ విదురా! వాగ్దేవి తన సౌకుమార్యముచే మనస్సును దోచివేయు చుండెను. కాని, ఆమెయందు కామన లేదు. కాముకుడైన బ్రహ్మ ఆమెను కామించెనని మేము వినియుంటిమి.

తమధర్మే కృతమతిం విలోక్య పితరం సుతాః ।
మరీచిముఖ్యా మునయో విశ్రంభాత్ప్రత్యబోధయన్ ॥ 29

సుతాః = పుత్రులు, మునయః = మహర్షులు అగు, మరీచిముఖ్యాః = మరీచి మొదలగువారు, అధర్మే = అధర్మమునందు, కృతమతిమ్ = లగ్నమైయున్న బుద్ధి గల, తమ్ = ఆ, పితరమ్ = తండ్రిని, విలోక్య = చూచి, విశ్రంభాత్ = నమ్మకము వలన, ప్రత్యబోధయన్ = నచ్చజెప్పిరి.

బ్రహ్మగారి పుత్రులగు మరీచి మొదలైన మహర్షులు తమ తండ్రి మనస్సు అధర్మమునందు లగ్నమైయుండుటను చూచిరి. ఆయన తమ మాటను కాదనడనే నమ్మకముతో వారు ఆయనకు నచ్చజెప్పిరి.

నైతత్పూర్వైః కృతం త్వద్యే న కరిష్యంతి చాపరే ।
యస్త్వం దుహితరం గచ్ఛేరనిగృహ్యాంగజం ప్రభుః ॥ 30

ఏతత్ = ఇది, పూర్వైః = పూర్వజులచే, న కృతమ్ = చేయబడలేదు, యే = ఎవరైతే, త్వత్ = నీకంటె (పూర్వమునందలి వారో), చ = మరియు, అపరే = తరువాతి వారు, న కరిష్యంతి = చేయబోరు, ప్రభుః = సర్వసమర్థుడవగు, యః = ఏ, త్వమ్ = నీవు, అంగజమ్ = మన్మథుని, అనిగృహ్య = నిగ్రహించకుండగా, దుహితరమ్ = కుమార్తెను, గచ్ఛేః = కామించుచున్నావో.

అయ్యా! మీ కంటె పూర్వమునందున్న వారు (బ్రహ్మలు) ఇట్టి పనిని చేయలేదు. మీ తరువాత రాబోయే బ్రహ్మలు కూడ ఇట్టి పనిని చేయబోరు. మీరు సర్వసమర్థులై ఉండియు, కామమును నిగ్రహించకుండగా, కుమార్తెను కామించుచున్నారు.

తేజీయసామపి హ్యేతన్న సుశ్లోక్యం జగద్గురో ।
యద్వృత్తమనుతిష్ఠన్ వై లోకః క్షేమాయ కల్పతే ॥ 31

జగద్-గురో = జగత్తునకు తండ్రి (గురువు) అగు ఓ బ్రహ్మ!, ఏతత్ = ఇది, తేజీయసాం అపి = తేజశ్శాలురకు కూడ, సుశ్లోక్యమ్ = మంచి కీర్తిని తెచ్చేది, న = కాదు, హి = ఏలయనగా, యద్-వృత్తమ్ = ఏ తేజశ్శాలుర ప్రవర్తనను, అనుతిష్ఠన్ = అనుష్ఠించే, లోకః = మానవుడు, వై = నిశ్చయముగా, క్షేమాయ = క్షేమము కొరకు, కల్పతే = సమర్థుడగుచున్నాడో.

తండ్రీ! నీవు లోకములకు తండ్రివి, జ్ఞానప్రదాతవు. నీవంటి మహాతేజశ్శాలురకైననూ ఈ పని మంచి కీర్తిని తెచ్చిపెట్టదు. ఏలయనగా, నీవంటి వారి ప్రవర్తనను లోకులు అనుసరించి, తమకు క్షేమమును కలిగించుకొనెదరు.

తస్మై నమో భగవతే య ఇదం స్వేన రోచిషా ।
ఆత్మస్థం వ్యంజయామాస స ధర్మం పాతుమర్హతి ॥ 32

తస్మై = ఆ, భగవతే = భగవానుని కొరకు, నమః = నమస్కారము, యః = ఎవడైతే, ఆత్మస్థమ్ = తనయందున్న, ఇదమ్ = ఈ జగత్తును, స్వేన = తన, రోచిషా = జ్ఞానప్రకాశముచే (శక్తిచే), వ్యంజయామాస = ప్రకటము చేసెనో, సః = ఆ భగవానుడు, ధర్మమ్ = ధర్మమును, పాతుమ్ = రక్షించుటకు, అర్హతి = తగుచున్నాడు.

భగవానుడు తనయందు అవ్యక్తముగానున్న జగత్తును సంకల్పమాత్రముచే తన శక్తినుండి వెలయించినాడు. అయనకు మేము నమస్కరించుచున్నాము. ఆయనయే ధర్మమును రక్షించుటకు సమర్థుడు.

స ఇత్థం గృణతః పుత్రాన్ పురో దృష్ట్వా ప్రజాపతీన్ ।
ప్రజాపతిపతిస్తన్వం తత్యాజ వ్రీడితస్తదా ।
తాం దిశో జగృహుర్ఘోరాం నీహారం యద్విదుస్తమః ।। 33

పురః = తన యెదుట, ఇత్థమ్ = ఈ విధముగా, గృణతః = పలుకుచున్న, ప్రజాపతీన్ = ప్రజాపతులగు, పుత్రాన్ = పుత్రులను, దృష్ట్వా = చూచి, సః = ఆ, ప్రజాపతిపతిః = ప్రజాపతులకు తండ్రియగు బ్రహ్మగారు, తదా = అప్పుడు, వ్రీడితః = సిగ్గు పడినవాడై, తన్వమ్ = శరీరమును, తత్యాజ = విడిచి పెట్టెను, ఘోరామ్ = భయంకరమగు, తామ్ = ఆ శరీరమును, దిశః = దిక్కులు, జగృహుః = స్వీకరించినవి, యత్ = దేనిని, నీహారమ్ = పొగమంచు అనియు, తమః = చీకటి అనియు, విదుః = వ్యవహరించుచున్నారో.

తన యెదుట తన పుత్రులగు ప్రజాపతులు ఇట్లు పలుకగా, ఆ ప్రజాపతులకు తండ్రియగు బ్రహ్మగారు సిగ్గుపడి ఆ దేహమును విడిచిపెట్టెను. అధర్మసంసర్గముచే భయమును గొల్పే ఆ దేహమును దిక్కులు స్వీకరించినవి. అదియే పొగమంచు అనియు, చీకటి అనియు వ్యవహరింపబడుచున్నది.

కదాచిద్ధ్యాయతస్స్రష్టుర్వేదా ఆసంశ్చతుర్ముఖాత్ ।
కథం స్రక్ష్యామ్యహం లోకాన్ సమవేతాన్ యథా పురా ।। 34

అహమ్ = నేను, యథా పురా = పూర్వమునందు వలెనే, సమవేతాన్ = చక్కని రచన గల, లోకాన్ = లోకములను, కథమ్ = ఏ విధముగా, స్రక్ష్యామి = సృష్టించగలను? అని, కదాచిత్ = ఒకనాడు, ధ్యాయతః = ధ్యానించుచున్న, స్రష్టుః = బ్రహ్మగారి, చతుర్ముఖాత్ = నాలుగు ముఖముల సమూహమునుండి, వేదాః = వేదములు, ఆసన్ = ఆవిర్భవించినవి.

నేను పూర్వమునందు వలెనే చక్కని రచనాసౌష్ఠవము గల లోకములను ఏ విధముగా సృష్టించ గల్గుదును? అని ఆలోచించుచున్న సృష్టి కర్తయగు బ్రహ్మగారి నాలుగు ముఖములనుండి నాలుగు వేదములు ఆవిర్భవించినవి.

చాతుర్హోత్రం కర్మతంత్రముపవేదనయైస్సహ ।
ధర్మస్య పాదాశ్చత్వారస్తథైవాశ్రమవృత్తయః ॥ 35

చాతుర్హోత్రమ్ = నలుగురు ఋత్విక్కుల కర్మ, కర్మతంత్రమ్ = యజ్ఞము మొదలగు కర్మల విస్తారము, ఉపవేదనయైః సహ = ఉపవేదములతో మరియు నీతిశాస్త్రముతో బాటు, ధర్మస్య = ధర్మముయొక్క, చత్వారః = నాలుగు, పాదాః = పాదములు, తథా ఏవ = అదే విధముగా, ఆశ్రమవృత్తయః = ఆశ్రమములలోని ప్రవృత్తులు.

హోత, ఉద్గాత, అధ్వర్యుడు మరియు బ్రహ్మ అనే నలుగురు ఋత్విక్కుల కర్మలు, యజ్ఞము మొదలగు వైదికకర్మల విస్తారము, నాలుగు ఉపవేదములు, నీతిశాస్త్రము, ధర్మముయొక్క నాలుగు పాదములు, బ్రహ్మచర్యము గార్హస్థ్యము వానప్రస్థము సన్న్యాసము అనే నాలుగు ఆశ్రమములు మరియు వాటి ధర్మములు అనునవి కూడ ఆవిర్భవించెను.

విదుర ఉవాచ ।
స వై విశ్వసృజామీశో వేదాదీన్ ముఖతోఽసృజత్ ।
యద్యద్యేనాసృజద్దేవస్తన్మే బ్రూహి తపోధన ॥ 36

తపోధన = తపస్సే ధనముగా గలవాడా!, విశ్వసృజామ్ = జగత్తును సృష్టించిన ప్రజాపతులకు ప్రభువగు, సః = ఆ బ్రహ్మగారు, ముఖతః

= ముఖములనుండి, వేద-ఆదీన్ = వేదములు మొదలగువాటిని, వై = నిశ్చయముగా, అసృజత్ = సృష్టించెను, దేవః = ఆ దేవుడు, యత్ యత్ = దేనిని దేనిని, యేన = దేనిచే, అసృజత్ = సృష్టించెనో, తత్ = దానిని, మే = నా కొరకు, బ్రూహి = చెప్పుము.

విదురుడు ఇట్లు పలికెను --- తపస్సే ధనముగా గల ఓ మైత్రేయా! జగత్కర్తలగు ప్రజాపతులకు తండ్రియగు ఆ బ్రహ్మగారు తన ముఖములనుండి వేదములు మొదలగు వాటిని సృష్టించెను గదా! ఆయన దేనిని దేనిని ఏ ముఖమునుండి సృష్టించెను? ఆ వివరములను నాకు చెప్పుము.

మైత్రేయ ఉవాచ ।
ఋగ్యజుస్సామాథర్వాఖ్యాన్ వేదాన్ పూర్వాదిభిర్ముఖైః ।
శస్త్రమిజ్యాం స్తుతిస్తోమం ప్రాయశ్చిత్తం వ్యధాత్క్రమాత్ ।। 37

క్రమాత్ = క్రమముగా, పూర్వ-ఆదిభిః = తూర్పు మొదలైన, ముఖైః = ముఖములచే, ఋక్-యజుః-సామ-అథర్వ-అఖ్యాన్ = ఋగ్వేదము యజుర్వేదము సామవేదము అథర్వవేదము అనే, వేదాన్ = వేదములను, శస్త్రమ్ = శస్త్రమును, ఇజ్యామ్ = ఇజ్యను, స్తుతిస్తోమమ్ = స్తుతిస్తోమమును, ప్రాయశ్చిత్తమ్ = ప్రాయశ్చిత్తమును, వ్యధాత్ = నిర్మించెను.

బ్రహ్మగారు తూర్పు ముఖమునుండి ఋగ్వేదమును, దక్షిణముఖమునుండి యజుర్వేదమును, పశ్చిమముఖమునుండి సామవేదమును, ఉత్తరముఖమునుండి అథర్వవేదమును ఆవిర్భవింప జేసెను. అదే వరుసలో శస్త్రము (హోత పఠించే ఋగ్వేదములోని దేవతాస్తుతి) ను, ఇజ్య (అధ్వర్యుని కర్మ) ను, స్తుతిస్తోమము (దేవతలను స్తుతిస్తూ ఉద్గాత చేసే సామగానము) ను మరియు ప్రాయశ్చిత్తము (బ్రహ్మ చేసే కర్మ) ను ప్రకాశింప జేసెను.

ఆయుర్వేదం ధనుర్వేదం గాంధర్వం వేదమాత్మనః ।
స్థాపత్యం చాసృజద్వేదం క్రమాత్పూర్వాదిభిర్ముఖైః ।। 38

ఆత్మనః = తనయొక్క, పూర్వ-ఆదిభిః = తూర్పు మొదలగు ముఖములచే, క్రమాత్ = క్రమముగా, ఆయుర్వేదమ్ = ఆయుర్వేదమును, ధనుర్వేదమ్ = ధనుర్వేదమును, గాంధర్వం వేదమ్ = గాంధర్వవేదమును, స్థాపత్యం వేదం చ = స్థాపత్యవేదమును కూడ, అసృజత్ = సృష్టించెను.

బ్రహ్మగారు తన తూర్పు ముఖమునుండి ఆయుర్వేదము (వైద్య శాస్త్రము) ను, దక్షిణముఖమునుండి ధనుర్వేదము (యుద్ధశాస్త్రము) ను, పశ్చిమముఖమునుండి గాంధర్వవేదము (సంగీతశాస్త్రము) ను, ఉత్తరము ఖమునుండి స్థాపత్యవేదము (శిల్పశాస్త్రము) ను సృష్టించెను.

ఇతిహాసపురాణాని పంచమం వేదమీశ్వరః ।
సర్వేభ్య ఏవ వక్త్రేభ్యస్ససృజే సర్వదర్శనః ॥ 39

ఈశ్వరః = జగన్నియంత, సర్వదర్శనః = సర్వజ్ఞుడు అగు ఆ బ్రహ్మగారు, సర్వేభ్యః = అన్ని, వక్త్రేభ్యః ఏవ = ముఖములనుండియు, ఇతిహాసపురాణాని = ఇతిహాసములు మరియు పురాణములు అనే, పంచ మమ్ = అయిదవ, వేదమ్ = వేదమును, ససృజే = సృష్టించెను.

జగన్నియంత మరియు సర్వజ్ఞుడు అగు బ్రహ్మగారు ఇతిహాస ములు మరియు పురాణములు అనే అయిదవ వేదమును తన అన్ని ముఖ ములనుండియు సృష్టించెను.

షోడశ్యుక్థౌ పూర్వవక్త్రాత్పురీష్యగ్నిష్టుతావథ ।
అప్తోర్యామాతిరాత్రౌ చ వాజపేయం సగోసవమ్ ॥ 40

పూర్వవక్త్రాత్ = తూర్పు ముఖమునుండి, షోడశీ-ఉక్థౌ = షోడశి మరియు ఉక్థము అనే యాగములను, అథ = తరువాత, పురీషి-అగ్నిష్టుతౌ = చయనమును మరియు అగ్నిష్టోమమును, అప్తోర్యామ-అతిరాత్రౌ = అప్తోర్యామమును అతిరాత్రమును, చ = మరియు, సగోసవమ్ = గోసవ ముతో కూడిన, వాజపేయమ్ = వాజపేయమును.

బ్రహ్మగారు తూర్పు ముఖమునుండి షోడశి మరియు ఉక్థము అనే యాగములను, దక్షిణముఖమునుండి అగ్నిచయనము మరియు అగ్ని

ష్టోమము అనే యాగములను, పశ్చిమముఖమునుండి అప్తోర్యామ-అతిరా
త్రములను, ఉత్తరముఖమునుండి గోసవ-వాజపేయములను సృష్టించెను.

విద్యా దానం తపస్సత్యం ధర్మస్యేతి పదాని చ ।
ఆశ్రమాంశ్చ యథాసంఖ్యమసృజత్సహ వృత్తిభిః ॥ 41

విద్యా = విద్య, దానమ్ = దానము, తపః = తపస్సు, చ = మరి
యు, సత్యమ్ = సత్యము, ఇతి = అనే, ధర్మస్య = ధర్మముయొక్క, పదాని
= పాదములను, చ = మరియు, వృత్తిభిః సహ = జీవికలతో కూడిన, ఆశ్ర
మాన్ = ఆశ్రమములను, యథాసంఖ్యమ్ = అదే క్రమమును తప్పకుండగా,
అసృజత్ = సృష్టించెను.

విద్య దానము తపస్సు మరియు సత్యము అనే నాలుగు పాదము
లతో కూడిన ధర్మమును, ఆశ్రమములను, వాటి వాటి జీవిక (వృత్తి) లను
బ్రహ్మగారు అదే వరుసలో సృష్టించెను.

సావిత్రం ప్రాజాపత్యం చ బ్రాహ్మం చాథ బృహత్తథా ।
వార్తాసంచయశాలీనశిలోంఛ ఇతి వై గృహే ॥ 42

సావిత్రమ్ = సావిత్రము, ప్రాజాపత్యమ్ = ప్రాజాపత్యము,
బ్రాహ్మమ్ = బ్రాహ్మము, అథ = తరువాత, బృహత్ చ = బృహత్, తథా =
అదే విధముగా, వార్తాసంచయశాలీనశిలోంఛః = వార్త సంచయము శాలీ
నము మరియు శిలోంఛము, ఇతి = అనునవి, గృహే వై = గృహస్థాశ్రమము
నందు వృత్తులు.

సావిత్రము (ఉపనయనమైన తరువాత బ్రహ్మచారి చేసే మూడు
రోజుల వ్రతము), ప్రాజాపత్యము (సంవత్సరకాలము బ్రహ్మచారి చేసే
వ్రతము), బ్రాహ్మము (వేదాధ్యయనము పూర్తియగు వరకు బ్రహ్మచారి
చేసే వ్రతము), బృహత్ (జీవించియున్నంత వరకు బ్రహ్మచారి చేసే వ్రత
ము) అను నాలుగు బ్రహ్మచర్యాశ్రమమునకు చెందిన వృత్తులు. వార్త
(పంటలను పండించుట మొదలగు శాస్త్రవిహితమగు జీవనోపాయము),
సంచయము (యజ్ఞములు మొదలగు వైదికకర్మలకు యాజకత్వము

వహించి తద్ద్వారా జీవికను సంపాదించుకొనుట), శాలీనము (యాచించకుండగా లభించే దానితో జీవించుట) మరియు శిలోంఛము (పంటను కోసిన తరువాత అచట నేలపై పడియున్న గింజలను మరియు ధాన్యమును విక్రయించే స్థలములలో పడియున్న గింజలను ఏరుకొని వాటితో పొట్టపోసుకొనుట) అనునవి గృహస్థాశ్రమమునకు సంబంధించిన వృత్తులు.

వైఖానసా వాలఖిల్యౌదుంబరాః ఫేనపా వనే ।
న్యాసే కుటీచకః పూర్వం బహూదో హంసనిష్క్రియౌ ।। 43

వైఖానసాః = వైఖానసులు, వాలఖిల్య-ఔదుంబరాః = వాలఖిల్యులు మరియు ఔదుంబరులు, ఫేనపాః = ఫేనపులు, వనే = వానప్రస్థాశ్రమమునందు గలరు, న్యాసే = సన్న్యాసాశ్రమమునందు, పూర్వమ్ = ముందుగా, కుటీచకః = కుటీచకుడు, బహూదః = బహూదకుడు, హంసనిష్క్రియౌ = హంస మరియు పరమహంస అనువారలు గలరు.

వానప్రస్థాశ్రమమునందు వైఖానసులు (దున్నని భూమినుండి లభించే ఆహారమును తినువారు), వాలఖిల్యులు (కొత్త ఆహారము లభించిన వెంటనే అంతకు ముందు తమవద్ద నున్న ఆహారమును ఇతరులకు ఇచ్చివేయువారు), ఔదుంబరులు (ఉదయము నిద్ర లేచినప్పుడు ముఖము ఏ దిక్కువైపు ఉంటే ఆ దిక్కులో లభించే ఆహారముతో జీవించువారు) మరియు ఫేనపులు (తమంత తాముగా రాలిన పళ్లను తిని బ్రతుకువారు) అనువారలు గలరు. సన్న్యాసాశ్రమమునందు వరుసగా కుటీచకుడు (ఒకే చోట స్థిరముగా ఒక పూరింటిలో నుంటూ ఆశ్రమధర్మములను పాలించువాడు), బహూదకుడు (కర్మను కొద్దిగా మాత్రమే చేస్తూ జ్ఞాననిష్ఠను ప్రధానముగా చేసుకొని జీవించువాడు), హంస (జ్ఞానాభ్యాసమునందు నిష్ఠ గలవాడు) మరియు పరమహంస (జ్ఞాని) అనువారలు గలరు.

ఆన్వీక్షికీ త్రయీ వార్తా దండనీతిస్తథైవ చ ।
ఏవం వ్యాహృతయశ్చాసన్ ప్రణవో హ్యస్య దహ్రతః ।। 44

ఆన్వీక్షికీ = మోక్షమునిచ్చే ఆత్మవిద్య, త్రయీ = స్వర్గము మొదలగు ఫలములనిచ్చే కర్మశాస్త్రము, వార్తా = కృషివాణిజ్యశాస్త్రము, చ =

మరియు, దండనీతిః = రాజనీతి, తథా ఏవ = అదే విధముగా పుట్టినవి, ఏవమ్ = ఇదే విధముగా, వ్యాహృతయః = భూః భువః సువః భూర్భువస్సువః (లేదా మహః) అనే నాలుగు వ్యాహృతులు, చ = మరియు, అస్య = ఈ బ్రహ్మగారి, దహ్రతః = హృదయాకాశమునుండి, ప్రణవః = ఓంకారము, ఆసన్ = ఉద్భవించినవి.

బ్రహ్మగారి తూర్పు ముఖము మొదలగు క్రమములోనే ఆన్వీక్షికీ (మోక్షమునిచ్చే ఆత్మవిద్య), త్రయీ (స్వర్గాది ఫలములనిచ్చే కర్మశాస్త్రము), వార్త (కృషివాణిజ్యాది విద్య) మరియు రాజనీతి శాస్త్రము ఉదయించినవి. అంతేగాక, భూః భువః సువః భూర్భువస్సువః (లేదా మహః) అనే నాలుగు వ్యాహృతులు కూడ అదే క్రమములో ఉదయించినవి. మరియు ఓంకారము ఈ బ్రహ్మగారి హృదయాకాశమునుండి ప్రకటమైనది.

తస్యోష్ణిగాసీల్లోమభ్యో గాయత్రీ చ త్వచో విభోః ।
త్రిష్టుమ్మాంసాత్స్నుతోఽనుష్టుబ్జగత్యస్థ్నః ప్రజాపతేః ॥ 45

విభోః = సర్వసమర్థుడగు, తస్య = ఆ, ప్రజాపతేః = బ్రహ్మగారి, లోమభ్యః = రోమములనుండి, ఉష్ణిక్ = ఉష్ణిక్ అనే ఛందస్సు, త్వచః = చర్మమునుండి, గాయత్రీ = గాయత్రీచ్ఛందస్సు, మాంసాత్ = మాంసమునుండి, త్రిష్టుప్ = త్రిష్టుప్ఛందస్సు, స్నుతః = నరమునుండి, అనుష్టుప్ = అనుష్టుప్ ఛందస్సు, అస్థ్నః = ఎముకనుండి, జగతీ = జగతీచ్ఛందస్సు, ఆసీత్ = ప్రకటమయ్యెను.

సర్వశక్తిమంతుడగు ఆ ప్రజాపతియొక్క రోమములనుండి ఉష్ణిక్, చర్మమునుండి గాయత్రి, మాంసమునుండి త్రిష్టుప్, నరములనుండి అనుష్టుప్ మరియు ఎముకలనుండి జగతి అనే ఛందస్సులు ఉదయించినవి.

మజ్జాయాః పంక్తిరుత్పన్నా బృహతీ ప్రాణతోఽభవత్ ।
స్పర్శస్తస్యాభవజ్జీవస్స్వరో దేహ ఉదాహృతః ॥ 46

తస్య = ఆ బ్రహ్మగారి, మజ్జాయాః = మజ్జనుండి, పంక్తిః = పంక్తిచ్ఛందస్సు, ఉత్పన్నా = పుట్టెను, ప్రాణతః = ప్రాణములనుండి, బృహతీ =

బృహతీఛందస్సు, అభవత్ = పుట్టెను, జీవః = జీవుడు, స్పర్శాః = హల్లు, అభవత్ = ఆయెను, దేహః = దేహము, స్వరః = అచ్చు అని, ఉదాహృతః = చెప్పబడినది.

ఆ బ్రహ్మగారి మజ్జనుండి పంక్తిచ్ఛందస్సు, ప్రాణములనుండి బృహతీఛందస్సు పుట్టినవి. ఆయనయొక్క జీవుడే (జీవకార్యము) హల్లులు కాగా, దేహము అచ్చులు ఆయెను.

ఊష్మాణమింద్రియాణ్యాహురంతఃస్థా బలమాత్మనః ।
స్వరాస్సప్త విహారేణ భవంతి స్మ ప్రజాపతేః ॥ 47

ఊష్మాణమ్ = ఊష్మవర్ణమును, ఆత్మనః = బ్రహ్మగారి, ఇంద్రియాణి = ఇంద్రియములని, ఆహుః = చెప్పచున్నారు, అంతఃస్థాః = అంతఃస్థ వర్ణములు, బలమ్ = బలము, ప్రజాపతేః = బ్రహ్మగారి, విహారేణ = విహారముచే, సప్త = ఏడు, స్వరాః = స్వరములు, భవంతి స్మ = పుట్టినవి.

శ ష స హ అనే ఊష్మవర్ణములు బ్రహ్మగారి ఇంద్రియములనియు, య ర ల వ అనే అంతఃస్థ వర్ణములు బలము అనియు చెప్పెదరు. ఆయన విహారమునుండి నిషాదము, ఋషభము, గాంధారము, షడ్జము, మధ్యమము, దైవతము, పంచమము అనే ఏడు స్వరములు పుట్టెను.

శబ్దబ్రహ్మాత్మనస్తస్య వ్యక్తావ్యక్తాత్మనః పరః ।
బ్రహ్మావభాతి వితతో నానాశక్త్యుపబృంహితః ॥ 48

వ్యక్త-అవ్యక్త-ఆత్మనః = వ్యక్తము మరియు అవ్యక్తము అనే రూపములు గలవాడు, శబ్దబ్రహ్మ-ఆత్మనః = శబ్దరూపములోని బ్రహ్మయే స్వరూపముగా గలవాడు అగు, తస్య = ఆ బ్రహ్మగారికి, పరః = సర్వాతీతము, వితతః = పూర్ణము, నానాశక్తి-ఉపబృంహితః = అనేకశక్తులచే విస్తరిల్ల జేయబడినది అగు, బ్రహ్మ = నిర్గుణ పరబ్రహ్మ, అవభాతి = ప్రకాశించును.

వ్యక్తము (వర్ణముల రూపములో ప్రకటమైనది, వైఖరి), అవ్యక్తము (వర్ణములకు కారణమై విశిష్టరూపములో ప్రకటము కానిది, పరాపశ్యంతీమధ్యమా రూపము లేక ఓంకారము) అని శబ్దము రెండు విధములుగా నున్న

ది. ఆ బ్రహ్మగారు అట్టి శబ్దమే స్వరూపముగా గలవాడు. స్వయముగా సర్వమునకు అతీతమై యున్ననూ, అనేకవిధములగు శక్తిచే సర్వరూపముగా విస్తరించియున్న పూర్ణపరబ్రహ్మ ఆయనకు బుద్ధియందు ప్రకాశించుచుండును. లేదా, ఆ పరబ్రహ్మ సర్వజగద్రూపముగా భాసిల్లుచున్నది.

తతోఽపరాముపాదాయ స సర్గాయ మనో దధే ।
ఋషీణాం భూరివీర్యాణామపి సర్గమవిస్తృతమ్ ॥ 49

తతః = తరువాత, సః = ఆ బ్రహ్మగారు, అపరామ్ = మరియొక శరీరమును, ఉపాదాయ = స్వీకరించి, సర్గాయ = జగద్విస్తృతి కొరకు, మనః దధే = సంకల్పించెను, భూరివీర్యాణామ్ = అధికమగు శక్తిగ ›, ఋషీణామ్ = మరీచి మొదలగు మహర్షుల, సర్గం అపి = సృష్టి కూడ, అవిస్తృతమ్ = విస్తరించలేదు.

శబ్దసృష్టి అయిన తరువాత ఆ బ్రహ్మగారు (కామాసక్తమైన దేహమును విడిచి) మరియొక దేహమును స్వీకరించి, జగత్తును విస్తరింపజేయవలెనని సంకల్పించెను. మరీచి మొదలగు మహర్షులు గొప్ప శక్తి గలవారే అయిననూ, వారిద్వారా సృష్టి విస్తరిల్లలేదు.

జ్ఞాత్వా తద్ధృదయే భూయశ్చింతయామాస కౌరవ ।
అహో అద్భుతమేతన్మే వ్యాపృతస్యాపి నిత్యదా ॥ 50

న హ్యేధంతే ప్రజా నూనం దైవమత్ర విఘాతకమ్ ।
ఏవం యుక్తకృతస్తస్య దైవం చావేక్షతస్తదా ॥ 51

కస్య రూపమభూద్ద్వేధా యత్కాయమభిచక్షతే ।
తాభ్యాం రూపవిభాగాభ్యాం మిథునం సమపద్యత ॥ 52

కౌరవ = ఓ విదురా!, తత్ = ఆ విషయమును, జ్ఞాత్వా = తెలుసుకొని, భూయః = మరల, హృదయే = హృదయమునందు, చింతయామాస = ఆలోచించెను, అహో= ఆశ్చర్యము!, ఏతత్ = ఇది, అద్భుతమ్ = అద్భుతము, మే-నేను, నిత్యదా = సర్వకాలములయందు, వ్యాపృతస్య అపి =

పనిని చేయుచున్ననూ, ప్రజాః = ప్రాణులు, న హి ఏధంతే = వర్ధిల్లకున్నారు గదా! అత్ర = ఈ విషయములో, దైవమ్ = దైవము, విఘాతకమ్ = ప్రతిబంధకము, నూనమ్ = నిశ్చయము, ఏవమ్ = ఈ విధముగా, యుక్తకృతః = ఉచితమగు ప్రయత్నమును చేసిన, చ = మరియు, దైవమ్ = భగవదనుగ్రహమును, అవేక్షతః = భావన చేయుచున్న, తస్య = ఆ, కస్య = బ్రహ్మగారి, రూపమ్ = రూపము, తదా = అప్పుడు, ద్వేధా = రెండు భాగములుగా, అభూత్ = ఆయెను, యత్ = దేనిని, కాయమ్ = కాయము అని, అభిచక్షతే = వ్యవహరించుచున్నారో, తాభ్యామ్ = ఆ, రూపవిభాగాభ్యామ్ = విడివడిన రూపములనుండి, మిథునమ్ = స్త్రీపురుషుల జంట, సమపద్యత = ప్రకటమయ్యేను.

ఓ విదురా! ఆ విషయమును గమనించి బ్రహ్మగారు తన హృదయములో మరల ఇట్లు తలపోసెను: అహో! ఇది అద్భుతము! నేను సర్వకాలములలో ప్రయత్నమును చేయుచునే యున్నాను. అయిననూ, ఈ ప్రాణులు వర్ధిల్లకున్నారు. దీనియందు దైవము ప్రతిబంధకమగుచున్నది. ఇది నిశ్చయము. ఈ విధముగా ఆ బ్రహ్మగారు సముచితమగు ప్రయత్నమును చేయుచూ దైవానుగ్రహమును భావనచేయుచుండెను. అపుడు ఆయన రూపము రెండుగా విడిపోయి, స్త్రీపురుషుల జంట ప్రకటమయ్యేను. కః అనగా బ్రహ్మ. ఆయన రూపము విడివడి ఏర్పడిన కారణముగా ఆ జంట దేహములకు కాయము అని పేరు వచ్చెను.

యస్తు తత్ర పుమాన్ సోఽభూన్మనుస్స్వాయంభువస్స్వరాట్।
స్త్రీ యాఽఽసీచ్ఛతరూపాఖ్యా మహిష్యస్య మహాత్మనః ।। 53

తత్ర = వారిద్దరిలో, యః తు = ఎవడైతే, పుమాన్ = పురుషుడో, సః = ఆ పురుషుడు, స్వరాట్ = సార్వభౌముడగు, స్వాయంభువః మనుః = స్వాయంభువ మనువు, అభూత్ = ఆయెను, యా = ఏ, శతరూప-ఆఖ్యా = శతరూప అని ప్రసిద్ధి చెందిన, స్త్రీ = స్త్రీ గలదో ఆమె, అస్య = ఈ, మహాత్మనః = మహాత్ముడగు స్వాయంభువ మనువుయొక్క, మహిషీ = భార్య.

ఆ జంటలో పురుషుడు స్వాయంభువ మనువు. ఆయన ఈ లోకమునకు సార్వభౌముడు ఆయెను. స్త్రీ పేరు శతరూప. ఆమె ఆ మహాత్ముని భార్య ఆయెను.

తదా మిథునధర్మేణ ప్రజా హ్యేధాంబభూవిరే ।
స చాపి శతరూపాయాం పంచాపత్యానజీజనత్ ॥ 54

ప్రియవ్రతోత్తానపాదౌ తిస్రః కన్యాశ్చ భారత ।
ఆకూతిర్దేవహూతిశ్చ ప్రసూతిరితి సత్తమ ॥ 55

భారత = ఓ విదురా!, సత్తమ = ఓ మహానుభావా!, తదా = అప్పుడు, మిథునధర్మేణ = స్త్రీపురుషసంభోగముచే, ప్రజాః = ప్రాణులు, ఏధాం బభూవిరే = వర్ధిల్లిరి, సః చ అపి = ఆ స్వాయంభువ మనువు కూడ, శతరూపాయామ్ = శతరూపయందు, ప్రియవ్రత-ఉత్తానపాదౌ = ప్రియవ్రతుడు ఉత్తానపాదుడు, చ = మరియు, ఆకూతిః = ఆకూతి, దేవహూతిః = దేవహూతి, చ = మరియు, ప్రసూతిః = ప్రసూతి, ఇతి = అనే, తిస్రః = ముగ్గురు, కన్యాః = కన్యలు, పంచ = అయిదుగురు, అపత్యాన్ = పిల్లలను, అజీజనత్ = కనెను.

అప్పటినుండియు మిథునధర్మముచే ప్రాణులు వర్ధిల్లజొచ్చెను. స్వాయంభువ మనువునకు శతరూపయందు ప్రియవ్రతుడు ఉత్తానపాదుడు అనే ఇద్దరు కొడుకులు, ఆకూతి దేవహూతి ప్రసూతి అనే ముగ్గురు కుమార్తెలు, వెరసి అయిదుగురు సంతానము కలిగిరి.

ఆకూతిం రుచయే ప్రాదాత్కర్దమాయ తు మధ్యమామ్
దక్షాయాదాత్ప్రసూతిం చ యత ఆపూరితం జగత్ ॥ 56

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
ద్వాదశోఽధ్యాయః ॥

ఆకూతిమ్ = ఆకూతిని, రుచయే = రుచి ప్రజాపతి కొరకు, మధ్యమామ్ = మధ్య కుమార్తెయగు దేవహూతిని, కర్దమాయ = కర్దముని కొరకు,

ప్రాదాత్ = ఇచ్చెను, చ = మరియు, ప్రసూతిమ్ = ప్రసూతిని, దక్షాయ = దక్షుని కొరకు, అదాత్ = ఇచ్చెను, యతః = ఎవరి వలన, జగత్ = జగత్తు, ఆపూరితమ్ = పూర్తిగా నిండెనో.

ఆయన ఆకూతిని రుచి ప్రజాపతికి, దేవహూతిని కర్దమునకు, ప్రసూతిని దక్షునకు ఇచ్చి వివాహము చేసెను. వారి సంతానముచే జగత్తు అంతయు నిండెను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధమునందు
పన్నెండవ అధ్యాయము ముగిసినది (**12**).

* * * * *

# అథ త్రయోదశోఽధ్యాయః

## వరాహావతార వర్ణనము

శ్రీశుక ఉవాచ ।
నిశమ్య వాచం వదతో మునేః పుణ్యతమాం నృప ।
భూయః పప్రచ్ఛ కౌరవ్యో వాసుదేవకథాదృతః ॥ 1

శ్రీశుకః = శ్రీశుకమహర్షి, ఉవాచ = పలికెను, నృప = ఓ రాజా!, వదతః = ఈ విధముగా చెప్పుచున్న, మునేః = మైత్రేయ మహర్షియొక్క, పుణ్యతమామ్ = మిక్కిలి పవిత్రమగు, వాచమ్ = వాక్కును, నిశమ్య = విని, వాసుదేవకథా-ఆదృతః = వాసుదేవుని గాథయందు ఆదరము గల, కౌరవ్యః = కురువంశీయుడగు విదురుడు, భూయః = మరల, పప్రచ్ఛ = ప్రశ్నించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! మైత్రేయ మహర్షి ఈ విధముగా చెప్పుచుండగా వినిన విదురుడు మరల ఆయనను ఇట్లు ప్రశ్నించెను. కౌరవవంశీయులలో శ్రేష్ఠుడగు విదురునకు వాసుదేవుని గాథలయందు ఆదరము మెండు.

విదుర ఉవాచ ।
స వై స్వాయంభువస్సమ్రాట్ ప్రియః పుత్రస్స్వాయంభువః ।
ప్రతిలభ్య ప్రియాం పత్నీం కిం చకార తతో మునే ॥ 2

మునే = ఓ మహర్షీ!, స్వయంభువః = స్వయంభువుడగు బ్రహ్మగారికి, ప్రియః = ప్రీతిపాత్రుడైన, పుత్రః = పుత్రుడగు, సః వై = ఆ ప్రఖ్యాతిని గాంచిన, సమ్రాట్ = సార్వభౌముడగు, స్వాయంభువః = స్వాయంభువ మనువు, ప్రియామ్ = ప్రియురాలగు, పత్నీమ్ = భార్యను, ప్రతిలభ్య = పొంది, తతః = తరువాత, కిం చకార = ఏమి చేసెను?

ఓ మహర్షీ! బ్రహ్మగారి ప్రియపుత్రుడు, ప్రసిద్ధిని గాంచిన సార్వభౌముడు అగు ఆ స్వాయంభువ మనువు ప్రియురాలగు భార్యను పొందెను గదా! ఆ తరువాత ఆయన ఏమి చేసెను?

చరితం తస్య రాజర్షేరాదిరాజస్య సత్తమ ।
బ్రూహి మే శ్రద్దధానాయ విష్వక్సేనాశ్రయో హ్యసౌ ॥ 3

సత్తమ = ఓ మహానుభావా!, ఆదిరాజస్య = మొట్టమొదటి చక్రవర్తి, రాజ-ఋషేః = రాజ్యమును పాలిస్తూనే ఋషివలె జీవించిన, తస్య = ఆ మనువుయొక్క, చరితమ్ = చరితమును, శ్రద్దధానాయ = శ్రద్ధావంతుడనగు, మే = నా కొరకు, బ్రూహి = చెప్పుము, హి = ఏలయనగా, అసౌ = ఈ స్వాయంభువ మనువు, విష్వక్సేన-ఆశ్రయః = శ్రీహరి (అంతటా వ్యాపించిన సేన అనగా శక్తి గలవాడు) యే ఆశ్రయముగా గలవాడు.

ఓ మహాత్మా! ఆదిరాజగు ఆ స్వాయంభువ మనువు రాజర్షి. ఆయన చరితమును నాకు చెప్పుము. ఆయన శ్రీహరిని శరణు జొచ్చిన భక్తుడు. కావుననే, నాకు ఆయన చరితమును వినవలెననే శ్రద్ధ మెండు.

శ్రుతస్య పుంసాం సుచిరశ్రమస్య
నన్వంజసా సూరిభిరీడితోऽర్థః ।
యత్తద్గుణానుశ్రవణం ముకుంద-
పాదారవిందం హృదయేషు యేషామ్ ॥ 4

యేషామ్ = ఎవరియొక్క, హృదయేషు = హృదయములయందు, ముకుందపాద-అరవిందమ్ = శ్రీహరియొక్క పాదపద్మము గలదో, తద్-గుణ-అనుశ్రవణమ్ = వారి గుణములను వినుట అనునది, యత్ = ఏది గలదో అది, సుచిరశ్రమస్య = చిరకాలపు శ్రమను కలిగియున్న, పుంసామ్ = మానవుల, శ్రుతస్య = అధ్యయనమునకు, అంజసా = యథార్థముగా, అర్థః = ప్రయోజనము, నను = నిశ్చయముగా, సూరిభిః = విద్వాంసులచే, ఈడితః = కొనియాడబడినది.

మానవులు చిరకాలము శ్రమించి శాస్త్రమును అధ్యయనము చేయుదురు. కాని, ఎవరి హృదయములలో శ్రీహరియొక్క పాదపద్మములు నివాసముండునో, అట్టి భక్తజనుల గుణములను శ్రవణము చేయుటయే నిశ్చయముగా అట్టి శాస్త్రాధ్యయనమునకు యథార్థమగు ఫలమని విద్వాంసులు కొనియాడుచున్నారు.

శ్రీశుక ఉవాచ ।
ఇతి బ్రువాణం విదురం వినీతం
సహస్రశీర్ష్ణశ్చరణోపధానమ్ ।
ప్రహృష్టరోమా భగవత్కథాయాం
ప్రణీయమానో మునిరభ్యచష్ట ॥ 5

ఇతి = ఈ విధముగా, బ్రువాణమ్ = పలుకుచున్నట్టియు, వినీతమ్ = వినయము కలిగినట్టియు, సహస్రశీర్ష్ణః = అనంతములగు శిరస్సులు గల భగవానుని, చరణ-ఉపధానమ్ = పాదములు ఆశ్రయముగా గల, విదురమ్ = విదురుని ఉద్దేశించి, భగవత్-కథాయామ్ = భగవంతుని గాథయందు, ప్రణీయమానః = ప్రవర్తిల్లజేయబడుచున్న, మునిః = ఆ మైత్రేయ మహర్షి, ప్రహృష్టరోమాః = ఆనందముచే రోమాంచము గలవాడై, అభ్యచష్ట = చెప్పెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- విదురుడు అనంతములగు శిరస్సులు గల శ్రీహరి భగవానుని పాదములను శరణు జొచ్చిన భక్తుడు మరియు వినయము గలవాడు. ఆయన ఇట్లు పలికి మైత్రేయుని భగవంతుని గాథయందు ప్రేరేపించుచుండగా, ఆయనకు ఆనందముచే రోమాంచము కలుగుచుండెను. అపుడా మహర్షి విదురునితో ఇట్లు పలికెను.

మైత్రేయ ఉవాచ ।
యదా స్వభార్యయా సాకం జాతస్స్వాయంభువో మనుః ।
ప్రాంజలిః ప్రణతశ్చేదం వేదగర్భమభాషత ॥ 6

యదా = ఏ కాలములో, స్వాయంభువః మనుః = స్వాయంభువ మనువు, స్వభార్యయా సాకమ్ = తన భార్యయగు శతరూపతో గూడి, జాతః = పుట్టినాడో అప్పుడు, ప్రణతః = నమస్కరించినవాడై, చ = మరియు, ప్రాంజలిః = చేతులను జోడించినవాడై, వేదగర్భమ్ = వేదస్వరూపుడగు బ్రహ్మగారిని ఉద్దేశించి, అభాషత = పలికెను.

స్వాయంభువ మనువు తన భార్యయగు శతరూపతో గూడి జన్మించిన సమయములో ఆయన వేదనిధియగు బ్రహ్మగారికి చేతులను జోడించి నమస్కరించి ఇట్లు పలికెను.

త్వమేకస్సర్వభూతానాం జన్మకృద్వృత్తిదః పితా ।
అథాపి నః ప్రజానాం తే శుశ్రూషా కేన వా భవేత్ ॥ 7

సర్వభూతానామ్ = సకలప్రాణులకు, జన్మకృత్ = జన్మను ఇచ్చువాడవు, వృత్తిదః = పోషించువాడవు అగు, పితా = తండ్రివి, త్వమ్ = నీవు, ఏకః = ఒక్కడివే, అథ అపి = అయినప్పటికీ, ప్రజానామ్ = నీ సంతానమగు, నః = మాకు, తే = నీయొక్క, శుశ్రూషా = సేవ, కేన వా = ఏ ఉపాయముచే, భవేత్ = కలుగును?

సకలప్రాణులకు జన్మనిచ్చి పోషించే ఒకే ఒక తండ్రివి నీవే. అయినప్పటికీ, నీ సంతానమగు మాకు నిన్ను సేవించే భాగ్యము ఏ విధముగా కలుగును?

తద్విధేహి నమస్తుభ్యం కర్మస్విడ్యాత్మశక్తిషు ।
యత్కృత్వేహ యశో విష్వగముత్ర చ భవేద్గతిః । 8

= కొనియాడ దగినవాడా!, తుభ్యమ్ = నీ కొరకు, నమః = నమస్కారము, ఆత్మశక్తిషు = మాకు శక్తి గల, కర్మసు = కర్మలయందు, తత్ = దానిని, విధేహి = విధించుము, యత్ = దేనిని, కృత్వా = చేసి, ఇహ = ఈ లోకమునందు, విష్వక్ = అంతటా, యశః = కీర్తి, చ = మరియు, అముత్ర = పరలోకమునందు, గతిః = పుణ్యగతి, భవేత్ = కలుగునో.

ఓ స్తుతించదగిన బ్రహ్మ! మేము చేయగలిగే కర్మలలో ఒక దానిని మాకు నిర్దేశించుము. దానిని చేసి మేము ఈ లోకములో అంతటా కీర్తిని, మరణించిన తరువాత పుణ్యగతిని పొందగలగాలి. అట్టి కర్మను నిర్ణయించి చెప్పుము. నీకు నమస్కారమగుగాక!

బ్రహ్మోవాచ ।
ప్రీతస్తుభ్యమహం తాత స్వస్తి స్తాద్వాం క్షితీశ్వర ।
యన్నిర్వ్యలీకేన హృదా శాధి మేత్యాత్మనార్పితమ్ ।। 9

తాత = వత్సా!, అహమ్ = నేను, తుభ్యమ్ = నీ కొరకు, ప్రీతః = సంతసించితిని, క్షితి-ఈశ్వర = భూమికి సార్వభౌముడవగు ఓ స్వాయంభువా!, వామ్ = మీకిద్దరి కొరకు, స్వస్తి = మంగళము, స్తాత్ = కలుగుగాక! యత్ = ఏలయనగా, నిర్వ్యలీకేన = నిష్కపటమగు, హృదా = హృదయముతో, మా = నన్ను, శాధి = ఆజ్ఞాపించుము, ఇతి = అని, ఆత్మనా = స్వయముగా, అర్పితమ్ = నివేదించబడినదో.

బ్రహ్మగారు ఇట్లు పలికెను --- ఓ వత్సా! నేను నీపై ప్రసన్నుడనైతిని. ఏలయనగా, నీవు నిష్కపటమగు హృదయముతో స్వయముగా నాతో, నన్ను శాసించుము అని విన్నవించి, నావద్ద ఆత్మసమర్పణమును చేసినావు. ఓ చక్రవర్తీ! మీకిద్దరికి మంగళము కలుగుగాక!

ఏతావత్యాత్మజైర్వీర కార్యా హ్యపచితిర్గురౌ ।
శక్త్యాప్రమత్తైర్గృహ్యేత సాదరం గతమత్సరైః ।। 10

వీర = ఓ వీరుడా!, గురౌ = తండ్రి విషయములో, ఆత్మజైః = పుత్రులచే, ఏతావతీ = ఇంతమాత్రము, అపచితిః = పూజ (సేవ), కార్యా హి = చేయదగినది కదా!, అప్రమత్తైః = సావధానులు, గతమత్సరైః = ఈర్ష్యాభావము లేనివారు అగు పుత్రులచే, సాదరమ్ = సాదరముగా, శక్త్యా = శక్తిననుసరించి, గృహ్యేత = స్వీకరించబడునో.

ఓ వీరుడా! తండ్రి విషయములో కొడుకులు ఇంతమాత్రము సేవను చేయవలెను. అది యేదనగా, ఇతరులు చేయని సేవను మేమేల

చేయవలెను అనే ఈర్ష్యాభావమును వారు దరికి చేరనీయరాదు. వారు సావధానచిత్తులై తమ శక్తి మేరకు తండ్రియొక్క ఆజ్ఞను ఆదరపూర్వకముగా స్వీకరించవలెను.

స త్వమస్యామపత్యాని సదృశాన్యాత్మనో గుణైః ।
ఉత్పాద్య శాస ధర్మేణ గాం యజ్ఞైః పురుషం యజ ॥ 11

సః = అట్టి, త్వమ్ = నీవు, అస్యామ్ = ఈమెయందు, గుణైః = గుణములచే, ఆత్మనః = నీకు, సదృశాని = తగిన, అపత్యాని = పిల్లలను, ఉత్పాద్య = కని, గామ్ = భూమిని, ధర్మేణ = ధర్మముచే, శాస = పాలించుము, యజ్ఞైః = యజ్ఞములచే, పురుషమ్ = శ్రీహరిని, యజ= పూజించుము.

నా ఆజ్ఞను కోరే నీవు ఈ నీ భార్యయగు శతరూపయందు, నీతో గుణములతో తులదూగే సంతానమును కనుము. ఈ భూమిని ధర్మబద్ధముగా పాలించుము. యజ్ఞములను చేసి శ్రీహరిని ఆరాధించుము.

పరం శుశ్రూషణం మహ్యం స్యాత్ప్రజారక్షయా నృప ।
భగవాంస్తే ప్రజాభర్తుర్హృషీకేశోఽనుతుష్యతి ॥ 12

నృప = ఓ మహారాజా!, ప్రజారక్షయా = ప్రాణులను రక్షించుటచే, మహ్యమ్ = నా కొరకు, పరమ్ = గొప్ప, శుశ్రూషణమ్ = సేవ, స్యాత్ = అగును, ప్రజాభర్తుః = ప్రాణులను పోషించే, తే = నీకు, హృషీకేశః = ఇంద్రియాధిపతియగు, భగవాన్ = శ్రీహరి, అనుతుష్యతి = ప్రసన్నుడు కాగలడు.

ఓ మహారాజా! నీవు ప్రాణులను రక్షించుచున్నచో, అదియే నాకు గొప్ప సేవ యగును. ప్రాణులను పోషించే నీపై హృషీకేశుడగు శ్రీహరి భగవానుడు ప్రసన్నుడు కాగలడు.

యేషాం న తుష్టో భగవాన్ యజ్ఞలింగో జనార్దనః ।
తేషాం శ్రమో హ్యపార్థాయ యదాత్మా నాదృతస్స్వయమ్ ॥ 13

యజ్ఞలింగః = యజ్ఞస్వరూపుడు, జన-అర్దనః = దుష్టజనులను శిక్షించువాడు అగు, భగవాన్ = శ్రీహరి, యేషామ్ = ఎవరికి, న తుష్టః =

ప్రసన్నుడు కాడో, తేషామ్ = వారి, శ్రమః = శ్రమ, అప-అర్థాయ హి = వ్యర్థము కొరకు మాత్రమే గదా!, యత్ = ఏలయనగా, స్వయమ్ = స్వయముగా, ఆత్మా = ఆత్మయే, న ఆదృతః = ఆదరింపబడలేదో.

శ్రీహరి యజ్ఞస్వరూపుడు. దుష్టులను శిక్షించే ఆ భగవానుడు ఎవరి విషయములో ప్రసన్నుడు కాడో, వారు పడే శ్రమ అంతా వ్యర్థము. ఏలయనగా, శ్రీహరి ఆత్మస్వరూపుడై యుండుటచే, వారు తమను తామే తృణీకరించుకొనుచున్నారు.

మనురువాచ ।
ఆదేశేఽహం భగవతో వర్తేయామీవసూదన ।
స్థానం త్విహానుజానీహి ప్రజానాం మమ చ ప్రభో ॥ 14

ప్రభో = ఓ ప్రభూ!, అమీవసూదన = పాపములను నశింపజేయువాడా!, అహమ్ = నేను, భగవతః = పూజ్యుడవగు నీ, ఆదేశే = ఆజ్ఞయందు, వర్తేయ = ఉండెదను, తు = కాని, ఇహ = ఈ జగత్తునందు, ప్రజానామ్ = ప్రాణులకు, చ = మరియు, మమ = నాకు, స్థానమ్ = స్థానమును, అనుజానీహి = నిర్దేశించుము.

మనువు ఇట్లు పలికెను --- ఓ ప్రభూ! నీవు పాపములను నశింపజేసెదవు. పూజ్యుడవగు నీ ఆజ్ఞను నేను శిరసా వహించెదను. కాని, ఈ జగత్తులో నాకు మరియు ప్రాణులకు నివాసస్థానమును అనుగ్రహించుము.

యదోకస్సర్వసత్త్వానాం మహీ మగ్నా మహాంభసి ।
అస్యా ఉద్ధరణే యత్నో దేవ దేవ్యా విధీయతామ్ ॥ 15

దేవ = ఓ దేవా!, మహీ = భూమి, మహా-అంభసి = విశాలమగు నీటియందు, మగ్నా = మునిగియున్నది, యత్ = ఏది, సర్వసత్త్వానామ్ = సకలప్రాణులకు, ఓకః = నివాసస్థానమో, అస్యాః = ఈ, దేవ్యాః = భూదేవి యొక్క, ఉద్ధరణే = పైకి లేవదీయుటయందు, యత్నః = ప్రయత్నము, విధీయతామ్ = చేయబడుగాక!

ఓ దేవా! సకలప్రాణులకు నివాసస్థానమగు ఈ భూమి విశాలమగు ప్రళయజలరాశిలో మునిగియున్నది. ఈ భూదేవిని పైకి తీసుకు వచ్చే ప్రయత్నమును చేయదగును.

మైత్రేయ ఉవాచ ।
పరమేష్ఠీ త్వపాం మధ్యే తథా సన్నామవేక్ష్య గామ్ ।
కథమేనాం సమున్నేష్య ఇతి దధ్యౌ ధియా చిరమ్ ॥ **16**

అపామ్ = నీళ్లయొక్క, మధ్యే = మధ్యలో, తథా = ఆ విధముగా, సన్నామ్ = మునిగియున్న, గామ్ = భూమిని, అవేక్ష్య = చూచి, పరమేష్ఠీ తు = బ్రహ్మగారైతే, ఏనామ్ = ఈ భూమిని, కథమ్ = ఏ విధముగా, సమున్నేష్యే = పైకి తీసుకురాగలను?, ఇతి = అనే, ధియా = బుద్ధితో, చిరమ్ = చాలసేపు, దధ్యౌ = ఆలోచించెను.

ఆ తీరున నీటి మధ్యలో మునిగియున్న భూమిని చూచి, దీనిని పైకి తీసుకువచ్చే ఉపాయమేది? అని బ్రహ్మగారు తన మనస్సులో చాల సేపు ఆలోచించెను.

సృజతో మే క్షితిర్వార్భిః ప్లావ్యమానా రసాం గతా ।
అథాత్ర కిమనుష్ఠేయమస్మాభిస్సర్గయోజితైః ।
యస్యాహం హృదయాదాసం స ఈశో విదధాతు మే ॥ **17**

మే = నేను, సృజతః = సృష్టిని చేయుచుండగా, క్షితిః = భూమి, వార్భిః = జలములచే, ప్లావ్యమానా = ముంచివేయబడుచున్నదై, రసామ్ = రసాతలమును గూర్చి, గతా = వెళ్లినది, అథ = అట్టి స్థితిలో, అత్ర = ఈ విషయములో, సర్గయోజితైః = సృష్టికార్యమునందు నియోగించబడిన, అస్మాభిః = మాచే, కిమ్ = ఏమి, అనుష్ఠేయమ్ = చేయబడవలెను?, అహమ్ = నేను, యస్య = ఎవని, హృదయాత్ = సంకల్పము వలన, ఆసమ్ = జన్మించితినో, సః = అట్టి, ఈశః = శ్రీహరి భగవానుడు, మే = నాకు, విదధాతు = చేయుగాక!

నేను సృష్టికార్యములో నిమగ్నమై యుండగా, ఈ భూమి నీటిచే ముంచివేయబడి రసాతలమునకు వెళ్లిపోయినది. ఇప్పుడు దీని విషయములో మేము ఏమి చేయదగును? నేను శ్రీహరి భగవానుని సంకల్పమాత్రముచే ఆయనకు పుత్రుడనై జన్మించితిని. ఆయనయే నాకు ఈ పనిని చేసిపెటు గాక!

ఇత్యభిధ్యాయతో నాసావివరాత్సహసానఘ ।
వరాహతోకో నిరగాదంగుష్ఠపరిమాణకః ।। 18

అనఘ = నిష్పాపుడవగు ఓ విదురా!, ఇతి = ఈ విధముగా, అభిధ్యాయతః = ఆలోచించుచున్న బ్రహ్మగారి, నాసావివరాత్ = ముక్కు రంధ్రమునుండి, సహసా = వెనువెంటనే, అంగుష్ఠపరిమాణకః = బొటనవ్రేలంత నిడివి గల, వరాహతోకః = చిన్న వరాహము, నిరగాత్ = బయటకు వచ్చెను.

పాపమునెరుంగని ఓ విదురా! ఈ విధముగా బ్రహ్మగారు ఆలోచించుచుండగనే, వెంటనే ఆయన ముక్కు రంధ్రమునుండి బొటనవ్రేలంత వరాహశిశువు బయట పడెను.

తస్యాభిపశ్యతః ఖస్థః క్షణేన కిల భారత ।
గజమాత్రః ప్రవవృధే తదద్భుతమభూన్మహత్ ।। 19

భారత = ఓ విదురా!, తస్య = ఆ బ్రహ్మగారు, అభిపశ్యతః = తేరిపార చూచుచుండగనే, ఖస్థః = ఆకాశమునందున్న ఆ వరాహము, క్షణేన కిల = క్షణమాత్రముచే, గజమాత్రః = ఏనుగు పరిమాణము గలదిగా, ప్రవవృధే = పెరిగెను, తత్ = అది, మహత్ = గొప్ప, అద్భుతమ్ = అద్భుతము, అభూత్ = ఆయెను.

జ్ఞానమునందు ప్రీతిగల ఓ విదురా! బ్రహ్మగారు ఆకాశములోనున్న ఆ వరాహము కేసి తేరిపార చూచుచుండగనే, అది ఏనుగు పరిమాణములోనికి పెరిగెను. ఆ పెరుగుట గొప్ప ఆశ్చర్యమును కలిగించెను.

మరీచిప్రముఖైర్విప్రైః కుమారైర్మనునా సహ ।

దృష్ట్వా తత్సౌకరం రూపం తర్కయామాస చిత్రధా ॥ 20

మరీచిప్రముఖైః = మరీచి మొదలగు, విప్రైః = మహర్షులతో, కుమారైః = సనకుడు మొదలగు వారితో, మనునా సహ = స్వాయంభువ మనువుతో గూడి, తత్ = ఆ, సౌకరం రూపమ్ = వరాహమూర్తిని, దృష్ట్వా = చూచి, చిత్రధా = అనేకవిధములుగా, తర్కయామాస = తలపోసెను.

మరీచి మొదలగు మహర్షులతో, సనకుడు మొదలగు బ్రహ్మవేత్తలతో మరియు స్వాయంభువ మనువుతో గూడియున్న బ్రహ్మగారు ఆ వరాహమూర్తిని చూచి, పలు విధములుగా తలపోసెను.

కిమేతత్సౌకరవ్యాజం సత్త్వం దివ్యమవస్థితమ్ ।
అహో బతాశ్చర్యమిదం నాసాయా మే వినిస్సృతమ్ ॥ 21

సౌకరవ్యాజమ్ = వరాహరూపము అనే మిషగల, ఏతత్ = ఈ, దివ్యమ్ = అలౌకికమగు, సత్త్వమ్ = ప్రాణి, కిమ్ = ఏమి?, అవస్థితమ్ = ఎదుటనున్నది, అహో బత = ఆశ్చర్యము!, ఇదమ్ = ఇది, మే = నా, నాసాయాః = ముక్కునుండి, వినిస్సృతమ్ = బయటకు వచ్చినది.

వరాహరూపములోనున్న ఈ దివ్యప్రాణి ఏమై యుండును? ఇది నా యెదుట నిలిచియున్నది. ఆశ్చర్యము! ఇది నా ముక్కునుండి బయటకు వచ్చినది.

దృష్టోఽంగుష్ఠశిరోమాత్రః క్షణాద్గండశిలాసమః ।
అపి స్విద్భగవానేష యజ్ఞో మే ఖేదయన్మనః ॥ 22

అంగుష్ఠశిరోమాత్రః = బొటనవ్రేలు కొన పరిమాణము గలదిగా, దృష్టః = కనబడినదై, క్షణాత్ = క్షణములో, గండశిలాసమః = పెద్ద రాయితో సమానముగా అయినది, ఏషః = ఇది, మే = నా, మనః = మనస్సును, ఖేదయన్ = మోహపెట్టుచున్న, భగవాన్ యజ్ఞః అపి స్విత్ = విష్ణుభగవానుడే అయి ఉండును!

బొటన వ్రేలు కొన అంత ఉన్న ఈ వరాహము చూచుచుండగనే క్షణకాలములో పెద్ద రాయితో సమముగా పెరిగినది. విష్ణుభగవానుడే ఈ రూపములో వచ్చి నా మనస్సును మోహపెట్టుట లేదు గదా! (మోహపెట్టుచున్నాడు సుమా!)

ఇతి మీమాంసతస్తస్య బ్రహ్మణస్సహ సూనుభిః ।
భగవాన్ యజ్ఞపురుషో జగర్జాగేంద్రసన్నిభః ॥ 23

ఇతి = ఈ విధముగా, సూనుభిః సహ = పుత్రులతో గూడి, తస్య = ఆ, బ్రహ్మణః = బ్రహ్మగారు, మీమాంసతః = చర్చించుచుండగా, అగ-ఇంద్రసన్నిభః = గొప్ప పర్వతమును బోలియున్న, భగవాన్ యజ్ఞపురుషః = యజ్ఞవరాహ భగవానుడు, జగర్జ = గర్జించెను.

ఈ విధముగా బ్రహ్మగారు తన కొడుకులతో చర్చించుచుండగా, పెద్ద పర్వతమును బోలియున్న యజ్ఞవరాహ భగవానుడు గర్జించెను.

బ్రహ్మాణం హర్షయామాస హరిస్తాంశ్చ ద్విజోత్తమాన్ ।
స్వగర్జితేన కకుభః ప్రతిస్వనయతా విభుః ॥ 24

విభుః = సర్వశక్తిమంతుడగు, హరిః = శ్రీహరి, కకుభః = దిక్కులను, ప్రతిస్వనయతా = ప్రతిధ్వనింప జేయుచున్న, స్వగర్జితేన = తన గర్జనచే, బ్రహ్మాణమ్ = బ్రహ్మగారిని, చ = మరియు, తాన్ = ఆ, ద్విజ-ఉత్తమాన్ = బ్రాహ్మణోత్తములను, హర్షయామాస = సంతోషపెట్టెను.

సర్వశక్తిమంతుడగు ఆ వరాహమూర్తి దిక్కులయందు ప్రతిధ్వనించే తన గర్జనతో బ్రహ్మగారికి, మరియు మరీచి మొదలగు ఆ మహర్షులకు ఆనందమును కలిగించెను.

నిశమ్య తే ఘర్ఘరితం స్వఖేదక్షయిష్ణు మాయామయసూకరస్య ।
జనస్తపస్సత్యనివాసినస్తే త్రిభిః పవిత్రైర్మునయోఽగృణన్ స్మ ॥ 25

మాయామయసూకరస్య = మాయాశక్తిసమేతుడగు వరాహభగవానుని, స్వఖేదక్షయిష్ణు = తమ దుఃఖమును తొలగించే, ఘర్ఘరితమ్ = ఘుర

ఘుర ఘుర శబ్దమును, నిశమ్య = విని, తే = ఆ బ్రహ్మ మొదలగువారు, జనస్తపః సత్యనివాసినః = జనలోకమునందు తపోలోకమునందు మరియు సత్యలోకమునందు నివసించే, తే = ఆ, మునయః = మునులు, త్రిభిః = మూడు, పవిత్రైః = పవిత్రములగు వేదమంత్రములతో, అగృణన్ స్మ = స్తుతించిరి.

మాయాశక్తిసమేతుడగు ఆ వరాహభగవానుడు చేసిన ఘురఘుర ధ్వనిని వినగానే బ్రహ్మ మొదలగువారి ఖేదము దూరమయ్యెను. వారితో పాటు, జనతపస్సత్యలోకములలో నివసించే మునులు కూడ ఆయనను పవిత్రములగు ఋగ్యజుస్సామవేదముల మంత్రములతో స్తుతించిరి.

తేషాం సతాం వేదవితానమూర్తిః
బ్రహ్మావధార్యాత్మగుణానువాదమ్ ।
వినద్య భూయో విబుధోదయాయ
గజేంద్రలీలో జలమావివేశ ॥ **26**

వేదవితానమూర్తిః = వేదములచే విస్తారముగా కీర్తించబడిన స్వరూపము గల (వేదముల విస్తారమే స్వరూపముగా గల) ఆ వరాహభగవానుడు, తేషామ్ = ఆ, సతామ్ = మహాత్ముల, ఆత్మగుణ-అనువాదమ్ = తన గుణముల వర్ణనరూపములోనున్న, బ్రహ్మ = వేదమును, అవధార్య = ఆలకించి, విబుధ-ఉదయాయ = దేవతల శ్రేయస్సు కొరకై, భూయః = మరల, వినద్య = గొప్ప నాదమును చేసి, గజ-ఇంద్రలీలః = గొప్ప ఏనుగు యొక్క విలాస గలవాడై, జలమ్ = నీటిని, ఆవివేశ = ప్రవేశించెను.

బ్రహ్మగారి ముక్కునుండి ప్రకటమైన ఆ వరాహభగవానుడు తన నిశ్వాసరూపమగు వేదములే స్వరూపముగా గలవాడు; ఆ వేదములు ఆయన గుణములను విస్తారముగా వర్ణించుచున్నవి. ఆ మహాత్ములు పఠించిన వేదమంత్రములను ఆయన ఆలకించి, దేవతల శ్రేయస్సు కొరకై మరియొకసారి గర్జించెను. అపుడాయన గొప్ప ఏనుగుయొక్క విలాస గలవాడై, నీటిలో ప్రవేశించెను.

ఉత్క్షిప్తవాలః ఖచరః కఠోరః

సటా విధున్వన్ ఖరరోమశత్వక్ ।
ఖురాహతాభ్రస్సితదంష్ట్ర ఈక్షా-
జ్యోతిర్బభాసే భగవాన్మహీధ్రః ॥ 27

ఉత్-క్షిప్తవాలః = పైకి యెత్తబడిన తోక గలవాడు, ఖచరః = ఆకాశమునందు సంచరించువాడు, కఠోరః = కఠినమగు అవయవములు గలవాడు, సటాః = మెడయందలి కేశములను, విధున్వన్ = విదల్చుచున్నవాడు, ఖరరోమశత్వక్ = కర్కశములగు రోమములతో గూడిన చర్మము గలవాడు, ఖుర-ఆహత-అభ్రః = డెక్కలచే చెల్లాచెదరు చేయబడిన మేఘములు గలవాడు, సితదంష్ట్రః = తెల్లని రెండు కోరలు గలవాడు, ఈక్షాజ్యోతిః = ప్రకాశించే కన్నులు గలవాడు, మహీధ్రః = మట్టిని పెకిలించువాడు (పర్వతాకారుడు) అగు, భగవాన్ = వరాహ భగవానుడు, బభాసే = ప్రకాశించెను.

కఠినములగు అవయవములు గల వరాహ భగవానుడు తోకను పైకెత్తి మెడమీది జూలును విదలుస్తూ ఆకాశములో సంచరించెను. ఆయన చర్మము మీది వెంట్రుకలు మిక్కిలి వాడిగా నుండెను. ఆయన డెక్కలతో మేఘములను చెల్లాచెదరు చేయుచుండెను. మట్టిని పెకిలించే వరాహము రూపములో అవతరించిన ఆ భగవానుడు తెల్లని రెండు కోరలతో వెలిగిపోయే కన్నులతో ప్రకాశించెను. ఆయన పర్వతాకారుడై యుండెను.

ఘ్రాణేన పృథ్వ్యాః పదవీం విజిఘ్రన్
క్రోడాపదేశస్స్వయమధ్వరాంగః ।
కరాలదంష్ట్రోఽప్యకరాలదృగ్భ్యా-
ముద్వీక్ష్య విప్రాన్ గృణతోఽవిశత్కమ్ ॥ 28

ఘ్రాణేన = ముక్కుతో, పృథ్వ్యాః = భూమియొక్క, పదవీమ్ = స్థానమును, విజిఘ్రన్ = ఆఘ్రాణించుచున్నవాడు, స్వయమ్ = స్వయముగా, అధ్వర-అంగః = యజ్ఞస్వరూపుడు, క్రోడ-అపదేశః = మాయామయమగు వరాహరూపము గలవాడు అగు ఆ భగవానుడు, కరాలదంష్ట్రః అపి = భయంకరమగు కోరలు గలవాడే అయిననూ, అకరాలదృగ్భ్యామ్ = దయతో నిండిన చూపులతో, గృణతః = స్తోత్రములను చేయుచున్న

విప్రాన్ = మరీచ్యాది మహర్షులను, ఉద్వీక్ష్య = తలను పైకెత్తి చూచి, కమ్ = నీటిని, అవిశత్ = ప్రవేశించెను.

మాయామయమగు వరాహరూపమును దాల్చిన యజ్ఞమూర్తి యగు శ్రీహరి తన ముక్కుతో భూమియొక్క స్థానమును అఘ్రాణించి అన్వేషించుచుండెను. ఆయన కోరలు భయమును గొల్పుచున్ననూ, చూపులు దయతో నిండియుండెను. ఆయన ఆ విధముగా తనను స్తుతిం చుచున్న మహర్షులను తలను పైకెత్తి చూచి, నీటిలో ప్రవేశించెను.

స వజ్రకూటాంగనిపాతవేగవిశీర్ణకుక్షిః స్తనయన్నుదన్వాన్ ।
ఉత్సృష్టదీర్ఘోర్మిభుజైరివార్తశ్చుక్రోశ యజ్ఞేశ్వర పాహి మేతి ।। 29

వజ్రకూట-అంగనిపాతవేగవిశీర్ణకుక్షిః = వజ్రపర్వతమువంటి శరీర ముయొక్క పడుటయందలి వేగముచే మిక్కిలి శిథిలమైన లోతులు గల, ఉదన్వాన్ = సముద్రుడు, ఆర్తః ఇవ = ఆపదలోనున్నవాడు వలె, స్తనయన్ = శబ్దమును చేస్తున్నవాడై, ఉత్సృష్టదీర్ఘ-ఊర్మిభుజైః = సారించబడిన పొడ వాటి తరంగములనే భుజములు గలవాడై, యజ్ఞేశ్వర = ఓ యజ్ఞేశ్వరా!, మా = నన్ను, పాహి = రక్షించుము, ఇతి = అని, చుక్రోశ = ఆక్రోశించెను.

వరాహ భగవానుని వజ్రపర్వతము వంటి దేహము పడిన వేగము నకు సముద్రుని ఉదరము శిథిలమై పోయెను. ఆయన తరంగములనే పొడ వాటి భుజములనే సారించి, శబ్దమును చేయుచూ, ఆపదలో నున్నవాడు వలె, ఓ యజ్ఞేశ్వరా! నన్ను రక్షించుము అని ఆక్రోశించెను.

ఖురైః క్షురప్రైర్దరయంస్తదాఽఽప
ఉత్పారపారం త్రిపరూ రసాయామ్ ।
దదర్శ గాం తత్ర సుషుప్సురగ్రే
యాం జీవధానీం స్వయమభ్యధత్త ।। 30

తదా = అప్పుడు, త్రిపరుః = మూడు పర్వాలు గల యజ్ఞమే స్వరూపముగా గల వరాహ భగవానుడు, క్షురప్రైః = పొడవాటి కత్తులవం టి, [illegible]రైః డెక్కలతో, ఆపః = నీళ్లను, ఉత్పారపారమ్ = అపారములే

అయిననూ ఆవలి వైపునకు చేరునట్లుగా, దరయన్ = చీల్చుచున్నవాడై, తత్ర = అక్కడ, రసాయామ్ = పాతాళమునందు, గామ్ = భూమిని, దదర్శ = చూచెను, అగ్రే = ప్రళయకాలమునందు, సుషుప్సుః = నిద్రించగోరువాడై, జీవధానీమ్ = ప్రాణులకు ఆధారమైన, యామ్ = ఏ భూమిని, స్వయమ్ = స్వయముగా, అభ్యధత్త = ధరించినాడో.

అప్పుడు ప్రాతస్సవన మాధ్యందినసవన సాయంసవనములనే మూడు పర్వాలు గల యజ్ఞమే స్వరూపముగా గల ఆ వరాహభగవానుడు పొడవాటి కత్తులవంటి తన డెక్కలతో అపారమగు ఆ జలరాశిని ఒకవైపునకు నెట్టివేసి, దానిలో పాతాళమునందు భూమిని కనుగొనెను. ప్రళయకాలమునందు నిద్రించగోరిన భగవానుడు ఆ భూమిని తానే స్వయముగా తనయందు ధరించియుండెను.

స్వదంష్ట్రయోద్ధృత్య మహీం నిమగ్నాం
స ఉత్థితస్సంరురుచే రసాయాః ।
తత్రాపి దైత్యం గదయాఽఽపతంతం
సునాభసందీపితతీవ్రమన్యుః ॥ 31

జఘాన రుంధానమసహ్యవిక్రమం
స లీలయేభం మృగరాడివాంభసి ।
తద్రక్తపంకాంకితగండతుండో
యథా గజేంద్రో జగతీం విభిందన్ ॥ 32

సః = ఆ వరాహ భగవానుడు, స్వదంష్ట్రయా = తన కోరతో, నిమగ్నామ్ = మునిగిపోయిన, మహీమ్ = భూమిని, ఉద్ధృత్య = పైకి యెత్తి, రసాయాః = పాతాళమునుండి, ఉత్థితః = పైకి లేచినవాడై, సంరురుచే = అతిశయముగా ప్రకాశించెను, అపి = మరియు, తత్ర = ఆ, అంభసి = నీటియందు, గదయా = గదతో, ఆపతంతమ్ = మీదకు వచ్చుచున్న, రుంధానమ్ = దారికి అడ్డు వచ్చుచున్న, అసహ్యవిక్రమమ్ = సహింప శక్యముకాని పరాక్రమము గల, దైత్యమ్ = హిరణ్యాక్షుని, సునాభసందీపితతీవ్ర

మన్యుః = చక్రము వలె ఉద్దీపింప జేయబడిన తీవ్రమగు కోపము గల, సః = ఆ వరాహ భగవానుడు, ఇభమ్ = ఏనుగును, మృగరాట్ ఇవ = సింహము వలె, లీలయా = అవలీలగా, జఘాన = సంహరించెను, తత్-రక్తపంక-అంకిత-గండతుండః = వాని రక్తపు బురదచే ముద్రించబడిన గండస్థలములు మరియు మూతి గల ఆ వరాహ భగవానుడు, జగతీమ్ = కొండచరియను, విభిందన్ = రాపిడి చేయుచున్న, గజ-ఇంద్రః యథా = గొప్ప ఏనుగు వలె నుండెను.

ఆ వరాహ భగవానుడు తన కోరతో నీటిలో మునిగియున్న భూమిని పైకి ఎత్తి పాతాళమునుండి పైకి వస్తూ గొప్పగా ప్రకాశించెను. ఇంతే గాక, ఆ నీటిలో సహింప శక్యము కాని పరాక్రమము గల హిరణ్యాక్షుడనే రాక్షసుడు గదను చేతబట్టి ఆయన మీదకు దుముకుతూ దారికి అడ్డు వచ్చెను. వానిని చూచుట తోడనే ఆయన తీవ్రమగు కోపముతో సుదర్శన చక్రము వలె మండిపడెను. సింహము ఏనుగును దెబ్బ తీసే విధముగా, ఆయన వానిని అవలీలగా సంహరించెను. చెక్కిళ్లు మరియు పొడవైన మూతి ముద్ద గట్టిన వాని రక్తపు చారలతో చిహ్నితమై యుండగా, ఆయన గైరికాది ధాతువులతో గూడిన కొండ చరియను తన గండస్థలముతో రాపిడి చేసిన పెద్ద ఏనుగు వలె ప్రకాశించెను.

తమాలనీలం సితదంతకోట్యా
క్ష్మాముత్క్షిపంతం గజలీలయాఙ్గ ।
ప్రజ్ఞాయ బద్ధాంజలయోఽనువాకైః
విరించిముఖ్యా ఉపతస్థురీశమ్ ॥ 33

అంగ = ఓ విదురా!, తమాలనీలమ్ = తమాలవృక్షము (చీకటి మ్రాకు) వలె నీలవర్ణము గల, సితదంతకోట్యా = తెల్లని దంతపు కొనతో, క్ష్మామ్ = భూమిని, గజలీలయా = ఏనుగుయొక్క విలాసచే, ఉత్క్షిపంతమ్ = పైకి యెత్తిన, ఈశమ్ = వరాహ భగవానుని, ప్రజ్ఞాయ = కనుగొని, బద్ధ-అంజలయః = చేతులను జోడించిన, విరించిముఖ్యాః = బ్రహ్మ మొదలగువారు, అనువాకైః = వైదికసూక్తములచే, ఉపతస్థుః = స్తుతించిరి.

ఓ విదురా! తమాలవృక్షము వలె నల్లనైన వరాహ భగవానుడు తెల్లని తన దంతపు కొనతో భూమిని ఎత్తుతూ, కలువను తన కోరతో పైకి ఎత్తే ఏనుగు వలె భాసించెను. ఆయనను చూచి బ్రహ్మ మొదలగు వారు చేతులను జోడించి, వైదికసూక్తములచే స్తుతించిరి.

ఋషయ ఊచుః ।
జితం జితం తేఽజిత యజ్ఞభావన
త్రయీం తనుం స్వాం పరిధున్వతే నమః ।
యద్రోమగర్తేషు నిలిల్యురధ్వరాః
తస్మై నమః కారణసూకరాయ తే॥ 34

అజిత = జయింపబడని వాడా!, యజ్ఞభావన = యజ్ఞములను పాలించువాడా!, తే = నీకు, జితమ్ = జయము, జితమ్ = జయము, స్వామ్ = తన, త్రయీమ్ = వేదమయమగు, తనుమ్ = దేహమును, పరిధున్వతే = విదల్చుచున్న, తుభ్యమ్ = నీ కొరకు, నమః = నమస్కారము, యత్-రోమగర్తేషు = ఎవని రోమకూపములయందు, అధ్వరాః = యజ్ఞములు, నిలిల్యుః = పూర్తిగా లీనమై యున్నవో, తస్మై = అట్టి, కారణసూకరాయ = భూమిని ఉద్ధరించుట అనే నిమిత్తము వలన వరాహ రూపమును దాల్చిన, తే = నీ కొరకు, నమః = నమస్కారము.

పరాజయమునెరుంగని వాడా! నీవు యజ్ఞములను పాలించెదవు. నీకు జయము, జయము. నీవు ఋగ్వేద యజుర్వేద సామవేదమయమగు నీ దేహమును విదల్చుచున్నావు. నీకు నమస్కారము. నీ రోమకూపముల యందు యజ్ఞములు విలీనమై యున్నవి. నీవు భూమిని ఉద్ధరించుట కొరకై ఈ వరాహ రూపమును దాల్చినావు. అట్టి నీకు నమస్కారము.

రూపం తవైతన్నను దుష్కృతాత్మనాం
దుర్దర్శనం దేవ యదధ్వరాత్మకమ్ ।
ఛందాంసి యస్య త్వచి బర్హిరోమ-
స్వాజ్యం దృశి త్వంఘ్రిషు చాతుర్హోత్రమ్ ॥ 35

దేవ = ఓ దేవా!, ఏతత్ = ఈ, తవ = నీ, రూపమ్ = రూపము, దుష్కృత-ఆత్మనామ్ = దుష్టమగు బుద్ధి గలవారికి, నను దుర్దర్శనమ్ = నిశ్చయముగా దర్శింప శక్యము కానిది గదా!, యత్ = ఏ రూపమైతే, అధ్వర-ఆత్మకమ్ = యజ్ఞమే స్వరూపముగా గలదియో, యస్య = ఏ వరాహ భగవానుని, త్వచి = చర్మమునందు, ఛందాంసి = వైదికములగు ఛందస్సులు, రోమసు = రోమములయందు, బర్హి = దర్భలు, దృశి = కంటి యందు, ఆజ్యమ్ = ఆజ్యము, అంఘ్రిషు తు = పాదములయందైతే, చాతుర్హోత్రమ్ = హోత మొదలగు నాలుగు రకముల కర్మ (గలవో).

ఓ దేవా! నీ ఈ యజ్ఞమయమగు రూపమును దుష్టబుద్ధి గలవారు దర్శించుట నిశ్చయముగా సంభవము కాదు. నీ చర్మమునందు వైదిక ఛందస్సులు, రోమములయందు దర్భలు, కంటియందు ఆజ్యము, పాదములయందు హోత ఉద్గాత అధ్వర్యుడు మరియు బ్రహ్మ అనే నలుగురు ఋత్విక్కుల కర్మసముదాయము గలవు.

స్రుక్తుండ ఆసీత్స్రువ ఈశ నాసయోః
　　ఇడోదరే చమసాః కర్ణరంధ్రే ।
ప్రాశిత్రమాస్యే గ్రసనే గ్రహాస్తు తే
　　యచ్చర్వణం తే భగవన్నగ్నిహోత్రమ్ ॥ 36

ఈశ = ఓ ఈశ్వరా!, తే = నీ, తుండే = ముట్టెయందు, స్రుక్ = స్రుక్కు (హోమమును చేసే గరిటె వంటి సాధనము), ఆసీత్ = ఉండెను, నాసయోః = ముక్కు పుటములయందు, స్రువః = స్రువము (అట్టిదియే), ఉదరే = ఉదరమునందు, ఇడా = హవిస్సును భక్షించే పాత్ర, కర్ణరంధ్రే = చెవి రంధ్రమునందు, చమసాః = సోమరసమునుంచే పాత్రలు, ఆస్యే = నోటియందు, ప్రాశిత్రమ్ = బ్రహ్మభాగపాత్ర, గ్రసనే తు = కంఠవివరమునందైతే, గ్రహాః = గ్రహములనబడే సోమరసపాత్రలు, భగవన్ = ఓ భగవానుడా!, తే = నీ, యత్ = ఏ, చర్వణమ్ = భక్షించుట గలదో అది, అగ్నిహోత్రమ్ = అగ్నిహోత్రము.

ఓ ఈశ్వరా! వరాహ భగవాన్! నీ ముట్టెయందు స్రుక్కు, ముక్కు రంధ్రములయందు స్రువము, పొట్టయందు ఇడాపాత్ర, చెవి చిల్లులయందు చమసపాత్రలు, నోటియందు బ్రహ్మభాగపాత్ర, కంఠవివరమునందు గ్రహములు గలవు. నీ భక్షణమే అగ్నిహోత్రము.

దీక్షానుజన్మోపసదశ్శిరోధరం
త్వం ప్రాయణీయోదయనీయదంష్ట్రః ।
జిహ్వా ప్రవర్గ్యస్తవ శీర్షకం క్రతోః
సభ్యావసథ్యం చితయోఽసవో హి తే ॥ 37

దీక్షా = దీక్షణీయేష్టి, అనుజన్మ = మరల మరల అవతరించుట, ఉపసదః = ఉపసత్తులు అనే ఇష్టులు, శిరోధరమ్ = మెడ, త్వమ్ = నీవు, ప్రాయణీయ-ఉదయనీయదంష్ట్రః = ప్రాయణీయేష్టి ఉదయనీయేష్టి కోరలుగా గలవాడవు, క్రతోః = క్రతుస్వరూపుడవగు, తవ = నీ, జిహ్వా = నాలుక, ప్రవర్గ్యః = ప్రవర్గ్య, శీర్షకమ్ = తల, సభ్య-ఆవసథ్యమ్ = సభ్యాగ్ని మరియు ఔపాసనాగ్నుల సమాహారము, తే = నీ, అసవః = ప్రాణములు, చితయః హి = ఇష్టకాచయనములు సుమా!

యజ్ఞస్వరూపుడవగు నీవు మరల మరల అవతరించుటయే యజ్ఞములోని దీక్షణీయేష్టి. ఉపసత్తులు అనే మూడు ఇష్టులు నీ మెడ. ప్రాయణీయేష్టి (దీక్ష తరువాతిది), ఉదయనీయేష్టి (యజ్ఞమునకు ఆఖరులో చేసేది) నీ కోరలు. ప్రవర్గ్య (ఉపసత్తునకు ముందు చేయబడే కర్మ) నీ నాలుక. సభ్యాగ్ని (హోమము లేని అగ్ని), ఔపాసనాగ్ని నీ తల. ఇష్టకా (యజ్ఞములో వాడే ఇటుక) చయనములే నీ ప్రాణములు.

సోమస్తు రేతస్సవనాన్యవస్థితిస్సంస్థావిభేదాస్తవ దేవ ధాతవః ।
సత్రాణి సర్వాణి శరీరసంధిస్త్వం సర్వయజ్ఞక్రతురిష్టిబంధనః ॥38

దేవ = ఓ దేవా!, సోమః తు = సోమరసమైతే, రేతః = రేతస్సు, సవనాని = సవనములు, అవస్థితిః = అవస్థ, సంస్థావిభేదాః = అగ్నిష్టోమము మొదలగు వివిధ సోమయాగములు, తవ = నీ, ధాతవః = మజ్జ మొదలగు

ధాతుపులు, సర్వాణి = అన్ని, సత్రాణి = సత్రయాగములు, శరీరసంధిః = శరీరముయొక్క కీలు, త్వమ్ = నీవు, సర్వయజ్ఞక్రతుః = అన్ని యజ్ఞములు క్రతువులు స్వరూపముగా గలవాడవు, ఇష్టిబంధనః = ఇష్టులే అవయవము లను కలిపి ఉంచే కండరములు.

ఓ దేవా! సోమరసము నీ రేతస్సు. ప్రాతస్సవనము, మాధ్యందిన సవనము, సాయం సవనము అనునవి నీకు బాల్యము మొదలగు (లేదా, జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అనే) అవస్థలు. అగ్నిష్టోమము, అత్యగ్నిష్టో మము, ఉక్థము, షోడశి, వాజపేయము, అతిరాత్రము, ఆప్తోర్యామము అను ఏడు సోమయాగ విశేషములు నీకు చర్మము మాంసము మజ్జ మొద లగు ఏడు ధాతువులు. సత్రయాగములన్నీ నీ శరీరములోని కీళ్లు. సకలయ జ్ఞములు (సోమరసము లేని యాగములు) మరియు క్రతువులు (సోమర సము గలవి) నీ స్వరూపమే. ఇష్టులు నీ శరీరములోని అవయవములను కలిపి ఉంచే కండరములు.

నమో నమస్తేఽఖిలమంత్రదేవతా-
ద్రవ్యాయ సర్వక్రతవే క్రియాత్మనే ।
వైరాగ్యభక్త్యాత్మజయానుభావిత-
జ్ఞానాయ విద్యాగురవే నమో నమః ॥ 39

అఖిలమంత్రదేవతాద్రవ్యాయ = అన్ని మంత్రములు దేవతలు మరియు ఆజ్యము మొదలగు ద్రవ్యములు గలవాడు, సర్వక్రతవే = అన్ని క్రతువులు స్వరూపమైన వాడు, క్రియా-ఆత్మనే = వైదికకర్మ రూపములో నుండువాడు, వైరాగ్యభక్తి-ఆత్మజయ-అనుభావితజ్ఞానాయ = వైరాగ్యము భక్తి మనోజయము అనువాటిచే సాక్షాత్కరించబడిన జ్ఞానముయొక్క రూప ములో నుండువాడు, విద్యాగురవే = జ్ఞానమునిచ్చే గురువు అగు నీకు, నమో నమః నమో నమః = అనేక నమస్కారములు.

సకల మంత్రములు, దేవతలు, ఆజ్యము మొదలగు యజ్ఞద్రవ్య ములు, సకల క్రతువులు, సకలవైదికకర్మలు నీ స్వరూపమే. వైరాగ్యము

భక్తి మనోజయము అనువాటి వలన సాక్షాత్కరించే ఆత్మజ్ఞానము నీ స్వరూపమే. ఆ జ్ఞానమునిచ్చే గురువు నీవే. నీకు అనేక నమస్కారములు.

దంష్ట్రాగ్రకోట్యా భగవంస్త్వయా ధృతా
విరాజతే భూధర భూస్సభూధరా ।
యథా వనాన్నిస్సరతో దతా ధృతా
మతంగజేంద్రస్య సపత్రపద్మినీ ॥ 40

భూధర భగవన్ = భూమిని ధరించిన వరాహ భగవానుడా!, త్వయా = నీచే, దంష్ట్రాగ్రకోట్యా = కోరల వాడి కొనలయందు, ధృతా = ధరించబడిన, సభూధరా = పర్వతములతో కూడియున్న, భూః = భూమి, వనాత్ = నీటినుండి, నిస్సరతః = బయటకు వచ్చుచున్న, మతంగజ-ఇంద్రస్య = గొప్ప ఏనుగుయొక్క, దతా = దంతముచే, ధృతా = ధరించబడిన, సపత్రపద్మినీ = ఆకులతో కూడిన పద్మపు మొక్క వలె, విరాజతే = ప్రకాశించుచున్నది.

భూమిని ధరించిన వరాహ మూర్తీ! ఓ భగవాన్! నీవు నీ వాడి కోరల కొనపై పర్వతములతో కూడియున్న భూమిని ధరించియున్నావు. నీటిలోనుండి బయటకు వస్తూ ఉన్న గొప్ప ఏనుగుయొక్క దంతముచే ఆకులతో సహా పట్టుకొనబడిన పద్మపు మొక్క వలె ఆ భూమి ప్రకాశించు చున్నది.

త్రయీమయం రూపమిదం చ సౌకరం
భూమండలేనాథ దతా ధృతేన తే ।
చకాస్తి శృంగోఢఘనేన భూయసా
కులాచలేంద్రస్య యథైవ విభ్రమః ॥ 41

అథ చ = మరియు, తే = నీ, దతా = దంతముచే, ధృతేన = ధరించబడిన, భూమండలేన = భూమండలముతో, ఇదమ్ = ఈ, త్రయీమయమ్ = వేదరూపమగు, సౌకరం రూపమ్ = వరాహ రూపము, భూయసా = పెద్ద, శృంగ-ఊఢఘనేన = శిఖరముపై ధరించబడిన మేఘముతో కూడి

న, కుల-అచల-ఇంద్రస్య = గొప్ప కులపర్వతముయొక్క, విభ్రమః యథా ఏవ = విలాస వలె, చకాస్తి = ప్రకాశించుచున్నది.

వేదాత్మకమగు నీ ఈ వరాహరూపము కోరలపై భూమండల మును దాల్చియుండగా, తన శిఖరముపై పెద్ద మేఘమును ధరించిన గొప్ప కులపర్వతముయొక్క విలాసను పోలి ప్రకాశించుచున్నది.

సంస్థాపయైనాం జగతాం సతస్థుషాం
లోకాయ పత్నీమసి మాతరం పితా ।
విధేమ చాస్యై నమసా సహ త్వయా
యస్యాం స్వతేజోఽగ్నిమివారణావధాః ॥ 42

సతస్థుషామ్ = స్థావరము (కదలని ప్రాణి) లతో కూడిన, జగతామ్ = జంగమము (కదిలే ప్రాణి) లయొక్క, లోకాయ = నివాస స్థానము కొరకై, పత్నీమ్ = నీ భార్య అయినట్టియు, మాతరమ్ = ప్రాణులకు తల్లియగు, ఏనామ్ = ఈ భూమిని, సంస్థాపయ = చక్కగా నిలబెట్టుము, పితా = తండ్రి వి, అసి = అగుచున్నావు, చ = మరియు, త్వయా. సహ = నీతో సహా, అస్యై = ఈమెకు, నమసా = నమస్కారముతో, విధేమ = సేవించెదము, యస్యామ్ = ఏ భూమియందు, అరణౌ = అరణియందు, అగ్నిం ఇవ = అగ్నిని వలె, స్వతేజః = నీ తేజస్సును, అధాః = ధరించుచున్నావో.

ఈ భూమి స్థావర జంగమాత్మకమగు ప్రాణులకు నివాసస్థానము. ఈమె నీకు భార్య, మాకు తల్లి. నీవు మా తండ్రివి. నీవీ భూమిని చక్కగా నిలబెట్టుము. అప్పుడు మేము ఆమెకు, నీకు నమస్కరించి సేవను చేసెద ము. యజ్ఞములో అరణి (నిప్పును మథించే కట్టె) యందు యాజ్ఞికులు అగ్నిని ధరించిన విధముగా, నీవీ భూమియందు నీ తేజస్సును (ప్రాణు లను ధరించే శక్తి) . ధరించుచున్నావు.

కః శ్రద్దధీతాన్యతమస్తవ ప్రభో
రసాం గతాయా భువ ఉద్వీబర్హణమ్ ।
న విస్మయోఽసౌ త్వయి విశ్వవిస్మయే

యో మాయయేదం ససృజే ऽతివిస్మయమ్ ॥ 43

ప్రభో = ఓ ప్రభూ!, రసామ్ = పాతాళమును, గతాయాః = పొంది యున్న, భువః = భూమియొక్క, తవ = నీ, ఉద్వ్యబర్హణమ్ = పైకి ఎత్తుటను, అన్యతమః = మరియొకడు, కః = ఎవడు, శ్రద్ధధీత = చేయ సంకల్పించును?, విశ్వవిస్మయే = అన్నియు ఆశ్చర్యములే అయి ఉన్న, త్వయి = నీ విషయములో, అసౌ = ఇది, న విస్మయః = ఆశ్చర్యము కాదు, యః = ఎవడైతే, అతివిస్మయమ్ = మిక్కిలి ఆశ్చర్యమును కలిగించే, ఇదమ్ = ఈ జగత్తును, మాయయా = తన మాయాశక్తిచే, ససృజే = సృష్టించెనో.

ఓ ప్రభూ! పాతాళములోనున్న భూమిని నీవు పైకి తీసుకు వచ్చితివి. ఈ పనిని నీవు తక్క మరియొకడు ఎవడైననూ చేయుటకు సంకల్పించుట కూడ సంభవము కాదు. కాని, ఈ పని నీ విషయములో ఆశ్చర్యము కాదు. ఏలయన, నీయందు ఉన్న సర్వము ఆశ్చర్యజనకమే. నీవు మిక్కిలి అచ్చెరువును గొలిపే ఈ జగత్తును నీ మాయాశక్తిచే సృష్టించినావు.

విధున్వతా వేదమయం నిజం వపుః
జనస్తపస్సత్యనివాసినో వయమ్ ।
సటాశిఖోద్భూతశివాంబుబిందుభిః
విమృజ్యమానా భృశమీశ పావితాః ॥ 44

ఈశ = ఓ ఈశ్వరా!, వేదమయమ్ = వేదమయమగు, నిజమ్ = నీ, వపుః = శరీరమును, విధున్వతా = విదల్చుచున్న నీచే, జనస్తపః-సత్యనివాసినః = జనలోకమునందు తపోలోకమునందు మరియు సత్యలోకమునందు నివసించే, వయమ్ = మేము, సటాశిఖా-ఉద్భూతశివ-అంబుబిందుభిః = మెడమీది జూలుయొక్క కొనలనుండి జారే మంగళకరమగు నీటి బిందువులచే, విమృజ్యమానాః = చల్లబడినవారమై, భృశమ్ = మిక్కిలి, పావితాః = పవిత్రము చేయబడితిమి.

ఓ ఈశ్వరా! నీవు నీ వేదమయమగు దేహమును విదల్చినప్పుడు నీ మెడమీది జూలుయొక్క కొనలనుండి జారిన నీరు మాపై చల్లబడినది.

మంగళకరమగు ఆ నీరు, జనలోక తపోలోక సత్యలోకములయందు నివసించే మునులను ఎంతయూ పవిత్రులను చేసినది.

స వై బత భ్రష్టమతిస్తవైషతే
యః కర్మణాం పారమపారకర్మణః ।
యద్యోగమాయాగుణయోగమోహితం
విశ్వం సమస్తం భగవన్ విధేహి శమ్ ॥ 45

భగవన్ = ఓ వరాహ భగవానుడా!, సః = వాడు, భ్రష్టమతిః వై = నిశ్చయముగా భ్రష్టమైన బుద్ధి గలవాడు, బత = అయ్యో!, యః = ఎవడైతే, అపారకర్మణః = అంతు లేని కర్మలు గల, తవ = నీ, పారమ్ = అంతమును, ఏషతే = తెలియగోరుచున్నాడో, సమస్తమ్ = సకలమగు, విశ్వమ్ = జగత్తు, యత్-యోగమాయాగుణయోగమోహితమ్ = ఎవని యోగమాయయొక్క గుణములతోడి సంబంధముచే మోహింప జేయబడుచున్నదో, శమ్ = మంగళమును, విధేహి = కలిగించుము.

నీవు వెలయించిన కర్మలకు అంతము లేదు. కాని, అయ్యో!, ఎవడైతే అట్టి నీ కర్మల అంతమును తెలియగోరునో, వాడు నిశ్చయముగా భ్రష్టు పట్టిన బుద్ధి గలవాడే. ఏలయనగా, నీ యోగమాయయొక్క గుణములతోడి సంబంధముచే ఈ సకలజగత్తు వ్యామోహమును పొందియున్నది. ఓ వరాహ భగవానుడా! వానికి నీవు మంగళమును కలిగించుము.

మైత్రేయ ఉవాచ ।
ఇత్యుపస్థీయమానస్తైర్మునిభిర్బ్రహ్మవాదిభిః ।
సలిలే స్వఖురాక్రాంత ఉపాధత్తావితావనిమ్ ॥ 46

ఇతి = ఈ విధముగా, బ్రహ్మవాదిభిః = వేదవేత్తలగు, తైః = ఆ, మునిభిః = మునులచే, ఉపస్థీయమానః = స్తుతించబడుచున్నవాడై, అవితా = రక్షకుడగు భగవానుడు, స్వఖుర-ఆక్రాంతే = తన కాలి డెక్కలచే ఆక్రమించబడియున్న, సలిలే = నీటియందు, అవనిమ్ = భూమిని, ఉపాధత్త = స్థాపించెను.

ఈ విధముగా బ్రహ్మవాదులగు ఆ మునులు స్తుతించగా, రక్షకుడగు వరాహ భగవానుడు భూమిని తన కాలి డెక్కలచే ఆక్రమించబడియున్న నీటియందు స్థాపించెను.

స ఇత్థం భగవానుర్వీం విష్వక్సేనః ప్రజాపతిః ।
రసాయా లీలయోన్నీతామప్సు న్యస్య యయౌ హరిః ॥ 47

విష్వక్సేనః = అంతటా వ్యాపించిన సేనగలవాడు, ప్రజాపతిః = ప్రాణులకు పాలకుడు అగు, భగవాన్ హరిః = శ్రీహరి భగవానుడు, ఇత్థమ్ = ఈ విధముగా, రసాయాః = పాతాళమునుండి, లీలయా = అవలీలగా, ఉన్నీతామ్ = పైకి తీసుకురాబడిన, ఉర్వీమ్ = భూమిని, అప్సు = నీళ్లయందు, న్యస్య = ఉంచి, యయౌ = వెళ్లెను.

ఆదిత్యరూపములోనున్న నారాయణుని సేనలు (కిరణములు) జగత్తునంతనూ వ్యాపించియున్నవి. అట్టి విష్వక్సేనుడు, సకలప్రాణులకు ప్రభువు అగు శ్రీహరి భగవానుడు పాతాళమునుండి భూమిని అవలీలగా పైకి తీసుకువచ్చి, నీటియందు ఉంచి అంతర్ధానమాయెను.

య ఏవమేతాం హరిమేధసో హరేః
కథాం సుభద్రాం కథనీయమాయినః ।
శృణ్వీత భక్త్యా శ్రవయేత వోశతీం
జనార్దనోఽస్యాశు హృది ప్రసీదతి ॥ 48

యః = ఎవడైతే, హరిమేధసః = బుద్ధియందు నిలిచి పాపమును దుఃఖమును పోగొట్టే, కథనీయమాయినః = కీర్తించదగిన లీలలు గల, హరేః = శ్రీహరియొక్క, ఏవమ్ = ఇట్టి, సుభద్రామ్ = మంగళకరమగు, ఉశతీమ్ = కమనీయమైన, ఏతామ్ = ఈ, కథామ్ = గాథను, భక్త్యా = భక్తితో, శృణ్వీత = వినునో, వా = లేదా, శ్రవయేత = వినిపించునో, హృది = హృదయమునందు ఉండే, జన-అర్దనః = దుష్టులను శిక్షించే శ్రీహరి, అస్య = అట్టి వీనికి, ఆశు = వెంటనే, ప్రసీదతి = ప్రసన్నుడగును.

శ్రీహరిని బుద్ధియందు నిలిపినచో, పాపములు తాపములు దూర మగును. ఆయన లీలలు కీర్తించదగినవి. ఆయన ప్రాణుల హృదయములో నిలిచియున్నాడు. అట్టి శ్రీహరియొక్క ఈ విధమగు ఈ గాథ మిక్కిలి మంగళకరము, కమనీయము. దీనిని ఎవడైతే వినునో, లేదా వినిపించునో, వాని హృదయములో శ్రీహరి వెంటనే ప్రసన్నుడగును.

తస్మిన్ ప్రసన్నే సకలాశిషాం ప్రభౌ
కిం దుర్లభం తాభిరలం లవాత్మభిః ।
అనన్యదృష్ట్యా భజతాం గుహాశయః
స్వయం విధత్తే స్వగతిం పరః పరామ్ ॥ 49

సకల-ఆశిషామ్ = కామనలన్నింటికీ, ప్రభౌ = ప్రభువగు, తస్మిన్ = ఆ శ్రీహరి, ప్రసన్నే = ప్రసన్నుడు కాగా, కిమ్ = ఏది, దుర్లభమ్ = లభించ శక్యము కానిది?, లవ-ఆత్మభిః = అల్పములగు, తాభిః = ఆ కామనలచే, అలమ్ = చాలును, గుహా-ఆశయః = బుద్ధిగుహయందు నివసించే, పరః = పరమేశ్వరుడు, అనన్యదృష్ట్యా = అభేదభావముచే, భజతామ్ = సేవించు వారలకు, పరామ్ = సర్వోత్కృష్టమైన, స్వగతిమ్ = తన పరమపదమును, స్వయమ్ = స్వయముగా, విధత్తే = ఇచ్చుచున్నాడు.

శ్రీహరి కామనలన్నింటికీ ప్రభువు. ఆయన ప్రసన్నుడైనచో, దుర్ల భమేమి గలదు? కాని, అల్పములగు ఈ కామనలు చాలును. బుద్ధిగుహ యందు ఆత్మరూపముగా నివసించే ఆ పరమేశ్వరుడు తనను అభేదభావ ముతో సేవించే భక్తులకు సర్వోత్కృష్టమగు తన పరమపదమును స్వయ ముగానే అనుగ్రహించుచున్నాడు.

కో నామ లోకే పురుషార్థసారవిత్
పురాకథానాం భగవత్కథాసుధామ్ ।
ఆపీయ కర్ణాంజలిభిర్భవాపహా-
మహో విరజ్యేత వినా నరేతరమ్ ॥ 50

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే

త్రయోదశోऽధ్యాయః ॥

లోకే = లోకమునందు, నర-ఇతరం వినా = పశువును మినహా యించి, పురుష-అర్థసార్థవిత్ = పురుషార్థముల సారమునెరింగిన వాడు, కః నామ = ఎవ్వాడు, పురాకథానామ్ = పూర్వమునందలి గాథలలో, భవ-అప హామ్ = సంసారమును తొలగించే, భగవత్-కథాసుధామ్ = భగవంతుని కథ యొక్క అమృతమును, కర్ణ-అంజలిభిః = దోసెళ్లవంటి చెవులతో, ఆపీయ = నిండుగా త్రావి, విరజ్యేత = విరక్తిని పొందును?, అహో = ఆహా!

భగవానుడు పూర్వమునందు చేసిన లీలలలో ఏ ఒక్క గాథనైననూ చెవులు అనే దోసిళ్లతో నిండుగా త్రాగినచో, ఆ అమృతము వలన, సంసారము దూరమగును. ఆహా! ఈ లోకములో పురుషార్థముల సారమునెరింగిన ఎవ్వాడు అట్టి కథామృతపానమునందు విరక్తిని చెందును? కేవలము పశుప్రాయులగు జనులు మాత్రమే ఈ గాథలకు దూరముగా నుండెదరు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు మూడవ స్కంధములో
పదమూడవ అధ్యాయము ముగిసినది (13).

* * * * *

# అథ చతుర్దశోఽధ్యాయః

## దితి గర్భమును ధరించుట

శ్రీశుక ఉవాచ ।
నిశమ్య కౌషారవిణోపవర్ణితాం
హరేః కథాం కారణసూకరాత్మనః ।
పునస్స పప్రచ్ఛ తముద్యతాంజలిః
న చాతితృప్తో విదురో ధృతవ్రతః ॥ 1

శ్రీశుకః = శ్రీశుకమహర్షి, ఉవాచ = పలికెను, కౌషారవిణా = మైత్రేయునిచే, ఉపవర్ణితామ్ = వర్ణించబడిన, కారణసూకర-ఆత్మనః = విశిష్టప్రయోజనము కొరకై వరాహరూపుడై అవతరించిన, హరేః = శ్రీహరియొక్క, కథామ్ = గాథను, నిశమ్య = విని, ధృతవ్రతః = దృఢమగు వ్రతనిష్ఠ గల, సః = ఆ, విదురః = విదురుడు, న చ అతితృప్తః = మిక్కిలి తృప్తిని పొందనివాడై, ఉద్యత-అంజలిః = చేతులను జోడించినవాడై, పునః = మరల, తమ్ = ఆయనను, పప్రచ్ఛ = ప్రశ్నించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శ్రీహరి భూమిని ఉద్ధరించుట కొరకై వరాహావతారమును దాల్చిన గాథను ఈ విధముగా మైత్రేయ మహర్షి వర్ణించి చెప్పగా విదురుడు వినెను. అయిననూ, దృఢమగు వ్రత నిష్ఠ గల విదురునకు పూర్ణమగు తృప్తి కలుగలేదు. అపుడాయన చేతులను జోడించి, మరల మైత్రేయుని ఇట్లు ప్రశ్నించెను.

విదుర ఉవాచ ।
తేనైవ తు మునిశ్రేష్ఠ హరిణా యజ్ఞమూర్తినా ।
ఆదిదైత్యో హిరణ్యాక్షో హత ఇత్యనుశుశ్రుమ ॥ 2

మునిశ్రేష్ఠ = ఓ మహర్షీ!, యజ్ఞమూర్తినా = యజ్ఞవరాహ రూపుడగు, తేన = ఆ, హరిణా ఏవ = శ్రీహరి చేతనే, ఆదిదైత్యః = మొట్టమొదటి దితి సంతానమగు, హిరణ్యాక్షః తు = హిరణ్యాక్షుడైతే, హతః = చంపబడినాడు, ఇతి = అని, అనుశుశ్రుమ = నీవే చెప్పగా వింటిమి.

ఓ మహర్షీ! యజ్ఞవరాహ రూపుడగు శ్రీహరియే మొట్టమొదటి దైత్యుడగు హిరణ్యాక్షుని చంపెనని నీవు చెప్పగా నేను వినియుంటిని.

తస్య చోద్ధరతః క్షోణీం స్వదంష్ట్రాగ్రేణ లీలయా ।
దైత్యరాజస్య చ బ్రహ్మన్ కస్మాద్ధేతోరభూన్మృధః ॥ 3

బ్రహ్మన్ = ఓ మహర్షీ!, స్వదంష్ట్రా-అగ్రేణ = తన కోరయొక్క కొనతో, క్షోణీమ్ = భూమిని, లీలయా = అవలీలగా, ఉద్ధరతః = పైకి యెత్తుచున్న, తస్య = ఆ వరాహ భగవానునకు, దైత్యరాజస్య = రాక్షసరాజగు హిరణ్యాక్షునకు, కస్మాత్ = ఏ, హేతోః = కారణము వలన, మృధః = యుద్ధము, అభూత్ = ఆయెను?

ఓ మహర్షీ! తన కోరయొక్క కొనపై అవలీలగా భూమిని పైకి యెత్తుచున్న వరాహ భగవానునకు రాక్షసరాజగు హిరణ్యాక్షునితో యుద్ధము జరుగుటకు కారణమేమి?

మైత్రేయ ఉవాచ ।
సాధు వీర త్వయా పృష్టమవతారకథాం హరేః ।
యత్త్వం పృచ్ఛసి మర్త్యానాం మృత్యుపాశవిశాతనీమ్ ॥ 4

వీర = ఓ ధర్మవీరుడా!, త్వయా = నీచే, సాధు = బాగుగా, పృష్టమ్ = ప్రశ్నించబడినది, యత్ = ఏలయనగా, త్వమ్ = నీవు, మర్త్యానామ్ = మానవులకు, మృత్యుపాశవిశాతనీమ్ = మరణము అనే పాశమును తెగగొట్టే, హరేః = శ్రీహరియొక్క, అవతారకథామ్ = అవతారగాథను గురించి, పృచ్ఛసి = ప్రశ్నించుచున్నావో.

ఓ విదురా! ధర్మవీరుడవగు నీవు చక్కగా ప్రశ్నించితివి. ఏలయనగా, మానవుల మరణపాశమును తెగగొట్టే శ్రీహరియొక్క అవతారగాథను గురించి నీవు ప్రశ్నించుచున్నావు.

యయోత్తానపదః పుత్రో మునినా గీతయార్భకః ।
మృత్యోః కృత్వైవ మూర్ధ్న్యంఘ్రిమారురోహ హరేః పదమ్ ।। 5

ఉత్తానపదః = ఉత్తానపాదుని, అర్భకః = చిన్న పిల్లవాడగు, పుత్రః = కుమారుడు, మునినా = నారద మహర్షిచే, గీతయా = గానము చేయబడిన, యయా = ఏ హరిగాథచే, మృత్యోః = మృత్యువుయొక్క, మూర్ధ్ని ఏవ = శిరస్సునందే, అంఘ్రిమ్ = పాదమును, కృత్వా = ఉంచి, హరేః = శ్రీహరియొక్క, పదమ్ = స్థానమును, ఆరురోహ = అధిష్ఠించెనో.

ఉత్తానపాదుని పుత్రుడగు ధ్రువుడు చిన్న పిల్లవాడు. కాని, ఆతడు నారదుని వలన శ్రీహరి మహిమను విని, ఉపదేశమును పొంది, దాని ప్రభావముచే మృత్యువును జయించి, శ్రీహరియొక్క స్థానమగు ధ్రువపదమును పొందెను.

అథాత్రాపీతిహాసోఽయం శ్రుతో మే వర్ణితః పురా ।
బ్రహ్మణా దేవదేవేన దేవానామనుపృచ్ఛతామ్ ।। 6

అథ = ప్రశ్నకు సమాధానముగా, అత్ర అపి = ఈ విషయములో, పురా = పూర్వము, అనుపృచ్ఛతామ్ = ప్రశ్నను వేసిన, దేవానామ్ = దేవతలకు, దేవదేవేన = దేవదేవుడగు, బ్రహ్మణా = బ్రహ్మచే, వర్ణితః = వర్ణించబడిన, అయమ్ = ఈ, ఇతిహాసః = గాథ, మే = నాచే, శ్రుతః = వినబడినది.

ఓ విదురా! నీ ప్రశ్నకు సమాధానమును చెప్పుచున్నాను. పూర్వము ఇదే విషయమును గురించి దేవతలు ప్రశ్నించగా, దేవదేవుడగు బ్రహ్మగారు ఒక వృత్తాంతమును వర్ణించి చెప్పినారు. అపుడు నేను దానిని వినియుంటిని.

దితిర్దాక్షాయణీ క్షత్తర్మారీచ్యం కశ్యపం పతిమ్ ।

అపత్యకామా చకమే సంధ్యాయాం హృచ్ఛయార్దితా ।। 7

క్షత్తః = ఓ విదురా!, దాక్షాయణీ = దక్షుని కుమార్తెయగు, దితిః = దితి, అపత్యకామా = సంతానమును కోరునదై, సంధ్యాయామ్ = సంధ్యాకాలమునందు, హృచ్ఛయ-అర్దితా = కామముచే పీడించబడినదై, మారీచ్యమ్ = మరీచి మహర్షి పుత్రుడగు, పతిమ్ = భర్తయగు, కశ్యపమ్ = కశ్యపుని, చకమే = ప్రార్థించెను.

ఓ విదురా! దక్షుని కుమార్తెయగు దితి మరీచి మహర్షియొక్క పుత్రుడగు కశ్యపుని భార్య. ఆమెకు సంతానమునందు ప్రీతి ఉండెను. ఆమె ఒకనాడు సంధ్యాకాలములో కామపీడితురాలై తన భర్తను ప్రార్థించెను.

ఇష్ట్వాగ్నిజిహ్వం పయసా పురుషం యజుషాం పతిమ్ ।
నిమ్లోచత్యర్క ఆసీనమగ్న్యగారే సమాహితమ్ ।। 8

యజుషామ్ = యజ్ఞములకు, పతిమ్ = ప్రభువు, అగ్నిజిహ్వమ్ = అగ్నియే జిహ్వగా గలవాడు అగు, పురుషమ్ = పరమేశ్వరుని, పయసా ఇష్ట్వా = పాలను (పాల పరమాన్నమును) హోమము చేసి ఆరాధించి, అర్కే = సూర్యుడు, నిమ్లోచతి = అస్తమించుచుండగా, అగ్ని-అగారే = అగ్నిహోత్రశాలయందు, సమాహితమ్ = ధ్యానములోనున్న కశ్యపుని (ప్రార్థించెను).

కశ్యప ప్రజాపతి అగ్ని అనే జిహ్వ ద్వారా హవిస్సులను స్వీకరించే యజ్ఞపతియగు పరమేశ్వరుని పయోహోమముచే ఆరాధించి, సూర్యుడు అస్తమించుచుండగా, అగ్నిహోత్రశాలయందు ధ్యానమగ్నుడై యుండెను. అప్పుడు దితి ఆయనను ప్రార్థించెను.

దితిరువాచ ।
ఏష మాం త్వత్కృతే విద్వన్ కామ ఆత్తశరాసనః ।
దునోతి దీనాం విక్రమ్య రంభామివ మతంగజః ।। 9

విద్వన్ = ఓ విద్వాంసుడా!, ఏషః = ఈ, కామః = మన్మథుడు, ఆత్తశర-ఆసనః = ఎక్కుపెట్టబడిన ధనస్సు గలవాడై, త్వత్-కృతే = నీతో

పొందు కొరకై, దీనామ్ = దీనురాలనగు, మామ్ = నన్ను, మతంగజః = ఏనుగు, రంభాం ఇవ = అరటి చెట్టును వలె, విక్రమ్య = పరాక్రమించి, దునోతి = పీడించుచున్నాడు.

ఓ విద్వాంసుడా! ఈ మన్మథుడు తన ధనస్సును ఎక్కుపెట్టి నీతో పొందు కొరకై దీనురాలనై యున్న నాపై పరాక్రమించి, ఏనుగు అరటి చెట్టును వలె, పీడించుచున్నాడు.

తద్భవాన్దహ్యమానాయాం సపత్నీనాం సమృద్ధిభిః ।
ప్రజావతీనాం భద్రం తే మయ్యాయుంక్ష్వామనుగ్రహమ్ ।। **10**

తత్ = అందువలన, ప్రజావతీనామ్ = సంతానము గల, సపత్నీనామ్ = సవతుల, సమృద్ధిభిః = సమృద్ధులచే, దహ్యమానాయామ్ = దహించివేయ బడుచున్న, మయి = నాయందు, అనుగ్రహమ్ = అనుగ్రహమును, ఆయుంక్ష్వామ్ = అన్ని విధములుగా చేసెదవు గాక!, తే = నీ కొరకు, భద్రమ్ = మంగళమగు గాక!

నా సవతులు సంతానవతులు. వారి విభవమును చూచిన నా హృదయము దహించుకు పోవుచున్నది. కావున, నీవు నాయందు అన్ని విధములుగా అనుగ్రహమును చూపదగును. నీకు మంగళమగు గాక!

భర్తర్యాప్తోరుమానానాం లోకానావిశతే యశః ।
పతిర్భవద్విధో యాసాం ప్రజయా నను జాయతే ।। **11**

భర్తరి = భర్త విషయములో, ఆప్త-ఉరుమానానామ్ = పొందబడిన అధికమగు ఆదరము గల స్త్రీల, యశః = కీర్తి, లోకాన్ = లోకములను, ఆవిశతే నను = ప్రసరించుచున్నది గదా!, యాసామ్ = ఏ స్త్రీలకు, భవద్-విధః = నీవంటి, పతిః = భర్త, ప్రజయా = సంతానము రూపముగా, జాయతే = జన్మించునో.

ఏ స్త్రీల కడుపున నీ వంటి భర్తలు పుత్రరూపములో జన్మించెదరో, వారు తమ భర్త విషయములో గొప్ప ఆదరమును పొందెదరు. వారి కీర్తి నిశ్చయముగా లోకములో అంతటా వ్యాపించును.

పురా పితా నో భగవాన్ దక్షో దుహితృవత్సలః ।
కం వృణీత వరం వత్సా ఇత్యపృచ్ఛత నః పృథక్ ॥ 12

పురా = పూర్వము, దుహితృవత్సలః = కుమార్తెలయందు వాత్సల్యము గల, భగవాన్ = పూజ్యుడగు, నః = మాయొక్క, పితా = తండ్రియగు, దక్షః = దక్షుడు, వత్సాః = అమ్మాయిలూ!, కమ్ = ఎవనిని, వరమ్ = భర్తగా, వృణీత = వరించెదరు?, ఇతి = అని, నః = మమ్ములను, పృథక్ = వేర్వేరుగా, అపృచ్ఛత = ప్రశ్నించెను.

మా నాయనగారు పూజ్యుడగు దక్షుడు పుత్రికలపై గొప్ప ప్రేమ గలవాడు. ఆయన పూర్వము, అమ్మాయిలూ! మీరు ఎవనిని భర్తగా వరించెదరు? అని మమ్ములను వేర్వేరుగా ప్రశ్నించెను.

స విదిత్వాఽఽత్మజానాం నో భావం సంతానభావనః ।
త్రయోదశాదదత్తాసాం యాస్తే శీలమనువ్రతాః ॥ 13

సంతానభావనః = సంతానముయొక్క హితమును కోరే, సః = ఆయన, ఆత్మజానామ్ = తన కుమార్తెలమగు, నః = మాయొక్క, భావమ్ = అభిప్రాయమును, విదిత్వా = తెలుసుకొని, తాసామ్ = వారిలో, త్రయోదశ = పదముగ్గురిని, అదదత్ = ఇచ్చెను, యాః = ఎవరైతే, తే = నీయొక్క, శీలమ్ = స్వభావమును గుణమును, అనువ్రతాః = అనుసరించినారో.

సంతానముయొక్క హితమును కోరే ఆయన కుమార్తెలమగు మా అభిప్రాయమును తెలుసుకొని, దానికి తగ్గ విధముగా నీ గుణమును స్వభావమును ఇష్టపడిన తన పదముగ్గురు కుమార్తెలను నీకు ఇచ్చి వివాహమును చేసెను.

అథ మే కురు కల్యాణ కామం కంజవిలోచన ।
ఆర్తోపసర్పణం భూమన్నమోఘం హి మహీయసి ॥ 14

కల్యాణ = మంగళమూర్తీ!, కంజవిలోచన = కలువ కన్నులవాడా!, భూమన్ = మహాత్మా!, అథ = కావున, మే = నా, కామమ్ = కోరికను, కురు = సఫలము చేయుము, హి = ఏలయనగా, మహీయసి = గొప్పవానియం

డు, ఆర్త-ఉపసర్పణమ్ = కష్టములోనున్న వ్యక్తి సమీపించుట, అమోఘమ్ = వ్యర్థము కాదు.

ఓ మంగళమూర్తీ! కలువ కన్నులవాడా! మహాత్మా! కావున, నీవు నా కోరికను సఫలము చేయుము. కష్టములోనున్న వ్యక్తి మహాత్ముని సమీపించి కోరినచో, ఆ కోరిక వ్యర్థము కాదు.

ఇతి తాం వీర మారీచః కృపణాం బహుభాషిణీమ్ ।
ప్రత్యాహానునయన్ వాచా ప్రవృద్ధానంగకశ్మలామ్ ॥ 15

వీర = ఓ విదురా!, మారీచః = మరీచిపుత్రుడగు కశ్యపుడు, ఇతి = ఈ విధముగా, కృపణామ్ = దీనురాలైనట్టియు, ప్రవృద్ధ-అనంగకశ్మలామ్ = వర్ధిల్లిన మన్మథునిచే మోహమును పొందియున్నట్టియు, బహుభాషిణీమ్ = అనేకములగు వచనములను పలుకుచున్న, తామ్ = ఆ దితిని, వాచా = వాక్కుతో, అనునయన్ = నచ్చజెప్పుచున్నవాడై, ప్రతి-ఆహ = బదులు చెప్పెను.

ఆ దితి ఈ విధముగా కామోద్రేకముచే మోహితురాలై దైన్యముతో అధికముగా ప్రసంగించుచుండగా, మరీచిపుత్రుడగు కశ్యపుడు ఆమెను మంచి మాటలతో ఓదారుస్తూ ఇట్లు బదులు చెప్పెను.

ఏష తేఽహం విధాస్యామి ప్రియం భీరు యదిచ్ఛసి ।
తస్యాః కామం న కః కుర్యాత్సిద్ధిస్త్రైవర్గికీ యతః ॥ 16

భీరు = ఓ భయస్వభావము గలదానా!, ఏషః = ఈ, అహమ్ = నేను, తే = నీయొక్క, ప్రియమ్ = ప్రియమును, విధాస్యామి = నెరవేర్చెదను, యత్ = దేనిని, ఇచ్ఛసి = కోరుచున్నావో, తస్యాః = ఆమెయొక్క, కామమ్ = కోరికను, కః = ఎవడు, న కుర్యాత్ = నెరవేర్చకుండును?, యతః = ఏ భార్య వలన, త్రైవర్గికీ = ధర్మార్థకామములకు సంబంధించిన, సిద్ధిః = కృతార్థత కలుగునో.

ఓ భయస్వభావము గలదానా! నీకు ప్రియమైన కోరికను నీచే ప్రార్థించబడిన నేను నెరవేర్చెదను. మానవుడు భార్య మూలకముగా

ధర్మార్థకామములనే పురుషార్థములలో కృతార్థుడగును. అట్టి భార్యయొక్క కోరికను ఎవడు నెరవేర్చకుండును?

> సర్వాశ్రమానుపాదాయ స్వాశ్రమేణ కలత్రవాన్ ।
> వ్యసనార్ణవమత్యేతి జలయానైర్యథార్ణవమ్ ॥ 17

కలత్రవాన్ = భార్య గల పురుషుడు, స్వ-ఆశ్రమేణ = తనదగు గృహస్థాశ్రమముతో బాటు, సర్వ-ఆశ్రమాన్ = అన్ని ఆశ్రమములను, ఉపాదాయ = నిర్వాహమును చేసి, జలయానైః = నౌకలచే, అర్ణవం ఇవ = సముద్రమును వలె, వ్యసన-అర్ణవమ్ = ఆకలి దప్పికల దుఃఖము అనే సముద్రమును, అతి-ఏతి = దాటివేయును.

నావికుడు నౌక సాయముతో తాను సముద్రమును దాటుటయే గాక, ఇతరులను కూడ దాటించును. అదే విధముగా గృహస్థుడు భార్యయొక్క సాయముతో ఆకలి దప్పికలు అనే దుఃఖసముద్రమును తాను దాటుటయే గాక, మిగిలిన మూడు ఆశ్రమముల వారిని కూడ దాటించును (వారికి కూడ ఆహారాదులను సమకూర్చును).

> యామాహురాత్మనో హ్యర్ధం శ్రేయస్కామస్య మానిని ।
> యస్యాం స్వధురమధ్యస్య పుమాంశ్చరతి విజ్వరః ॥ 18

మానిని = ఓ అభిమానవతీ!, యామ్ = ఏ భార్యను, శ్రేయస్కామస్య = శ్రేయస్సును కోరే పురుషుని, ఆత్మనః = దేహముయొక్క, అర్ధమ్ = సగభాగమని, ఆహుః = చెప్పుచున్నారో, యస్యామ్ = ఏ భార్యయందు, స్వధురమ్ = తన భారమును, అధ్యస్య = ఉంచి, పుమాన్ = మానవుడు, విజ్వరః = తొలగిన బెంగ గలవాడై, చరతి = సంచరించుచున్నాడో.

ఓ అభిమానవతీ! శ్రేయస్సును కోరే మానవునకు భార్య తన దేహములో సగభాగమని మహర్షులు చెప్పుచున్నారు. మానవుడు తన బరువును భార్యకు అప్పజెప్పి నిశ్చింతగా తిరుగును.

> యామాశ్రిత్యేంద్రియారాతీన్దుర్జయానితరాశ్రమైః ।

వయం జయేమ హేలాభిర్దస్యూన్దుర్గపతిర్యథా || 19

యామ్ = ఏ భార్యను, ఆశ్రిత్య = ఆశ్రయించి, వయమ్ = మేము, ఇతర-ఆశ్రమైః = ఇతరములగు ఆశ్రమముల వారిచే, దుర్జయైః = జయించ శక్యము కాని, ఇంద్రియ-అరాతీః = ఇంద్రియములనే శత్రువులను, దుర్గ పతిః = దుర్గాధిపతి, దస్యూన్ యథా = బందిపోటు దొంగలను వలె, హేలాభిః = హావభావములచే (అవలీలగా), జయేమ = జయించెదమో.

దుర్గముయొక్క రక్షణను కలిగియున్న దుర్గాధిపతి బందిపోటు దొంగలను అవలీలగా జయించ గల్గును. అదే విధముగా, గృహస్థులమగు మేము ఇంద్రియములనే శత్రువులను శాస్త్రీయమైన భార్యతోడి విలాససం భోగముల ద్వారా జయించెదము. కాని, ఇంద్రియజయము ఇతరములగు ఆశ్రమముల వారికి తేలిక కాదు.

న వయం ప్రభవస్తాం త్వామనుకర్తుం గృహేశ్వరి |
అప్యాయుషా వా కార్త్స్న్యేన యే వాన్యే గుణగృధ్నవః || 20

గృహ-ఈశ్వరి = గృహమునకు ప్రభ్వియగు ఓ దితీ!, తామ్ = అట్టి, త్వామ్ = నిన్ను, అనుకర్తుమ్ = అనుకరించుటకు, కార్త్స్న్యేన = పూర్తి, ఆయుషా అపి = ఆయుర్దాయముచేతనైననూ, వయమ్ = మేము, న ప్రభవః = సమర్థులము కాము, చ = మరియు, అన్యే = ఇతరులగు, గుణగృ ధ్నవః = గుణమును గ్రహించే పురుషులు గలరో.

ఓ దితీ! గృహమునకు ప్రభ్వివి నీవు. అట్టి నీవు చేసిన సేవకు తగిన ప్రతిసేవను చేయుటకు మాకు గాని, గుణగ్రాహులగు ఇతర పురుషు లెవ్వరికైననూ గాని, పూర్తి ఆయుర్దాయము కూడ చాలదు.

అథాపి కామమేతం తే ప్రజాత్యై కరవాణ్యలమ్ |
యథా మాం నాతిరోచంతి ముహూర్తం ప్రతిపాలయ || 21

అథ అపి = అయినప్పటికీ, తే = నీ, ఏతమ్ = ఈ, ప్రజాత్యై = సంతానము కొరకై, కామమ్ = కోరికను, అలం కరవాణి = నెరవేర్చెదను గాక!, ముహూర్తమ్ = ముహూర్తకాలము, ప్రతిపాలయ = వేచియుండుము,

యథా = ఏ విధముగానైతే, మా = నన్ను, న అతివోచంతి = నిందించకుం దురు గాక!

నీకు ప్రత్యుపకారమును చేయగల్గుట అసంభవమే అయినప్పటికీ, నేను సంతానము కావాలనే ఈ నీ కోరికను నెరవేర్చెదను. నీవు ఒక గంట సేపు వేచియుండుము. దాని వలన, జనులు నన్ను నిందించకుందురు.

ఏషా ఘోరతమా వేలా ఘోరాణాం ఘోరదర్శనా ।
చరంతి యస్యాం భూతాని భూతేశానుచరాణి హ ॥ 22

ఏషా = ఈ, ఘోరదర్శనా = భయంకరమగు దర్శనము గల, ఘోరతమా = మిక్కిలి భయంకరమగు సంధ్య, ఘోరాణామ్ = భయంకరా కారులయొక్క, వేలా = సమయము, యస్యామ్ = ఏ సంధ్యాకాలమునం దు, భూత-ఈశ-అనుచరాణి = భూతములకు ప్రభువగు రుద్రుని అనుచరు లగు, భూతాని = భూతములు, చరంతి హ = సంచరించునో.

ఈ ఘోరమగు సంధ్యాసమయము చూచుటకైననూ భయమును గొల్పును. ఇది భయంకరాకారులగు రాక్షసులు మొదలగు వారికి చెందిన కాలము. ఈ కాలమునందు భూతములకు ప్రభువగు రుద్రుని అనుచరు లగు భూతప్రేతపిశాచాదులు సంచరించుచుండును.

ఏతస్యాం సాధ్వి సంధ్యాయాం భగవాన్ భూతభావనః ।
పరీతో భూతపర్షద్భిర్వృషేణాటతి భూతరాట్ ॥ 23

సాధ్వి = ఓ పతివ్రతా!, ఏతస్యామ్ = ఈ, సంధ్యాయామ్ = సంధ్యా కాలమునందు, భూతభావనః = సకలప్రాణులను రక్షించే, భూతరాట్ = భూతములకు ప్రభువగు, భగవాన్ = రుద్ర భగవానుడు, భూతపర్షద్భిః = భూతసమూహములచే, పరీతః = చుట్టువారబడియున్నవాడై, వృషేణ = వృషభముచే, అటతి = సంచరించుచున్నాడు.

ఓ సాధ్వీ! ఈ సంధ్యాకాలమునందు సకలప్రాణులకు రక్షకుడు, భూతప్రేతాదులకు ప్రభువు అగు రుద్ర భగవానుడు వృషభమునధిష్ఠించి సంచరించును. భూతసమూహములు ఆయనను చుట్టువారి యుండును.

శ్మశానచక్రానిలధూలిధూమ్రవికీర్ణవిద్యోతజటాకలాపః ।
భస్మావగుంఠామలరుక్మదేహో దేవస్త్రిభిః పశ్యతి దేవరస్తే ॥ 24

శ్మశానచక్ర-అనిలధూలిధూమ్రవికీర్ణవిద్యోతజటాకలాపః = శ్మశానమునందలి సుడిగాలియందలి ధూళిచే బూడిద రంగు గల చెల్లాచెదరుగా నున్న ప్రకాశించే జటాజూటము గలవాడు, భస్మ-అవగుంఠ-అమలరుక్మదేహః = భస్మచే పూయబడిన స్వచ్ఛమగు బంగరు కాంతి గల దేహము గలవాడు, తే = నీకు, దేవరః = బావగారు అగు, దేవః = రుద్రదేవుడు, త్రిభిః = మూడు కన్నులతో, పశ్యతి = చూచుచుండును.

రుద్రుని ప్రకాశించే జటాజూటము శ్మశానమునందలి సుడిగాలిచే చెల్లాచెదరై బూడిద నిండి యుండును. ఆయన తన బంగరు కాంతి గల స్వచ్ఛమగు దేహమునంతా భస్మను పూసుకొనియుండును. ఆయన నీ సోదరి సతీదేవి భర్త. ఆయన సూర్యుడు, చంద్రుడు, అగ్ని అనే తన మూడు కన్నులతో అందరినీ చూచుచుండును.

న యస్య లోకే స్వజనః పరో వా
నాత్యాదృతో నోత కశ్చిద్విగర్హ్యః ।
వయం వ్రతైర్యచ్చరణాపవిద్ధా-
మాశాస్మహేஉజాం బత భుక్తభోగామ్ ॥ 25

యస్య = ఎవనికి, లోకే = లోకమునందు, స్వజనః = తన వ్యక్తి గాని, పరః వా = పరాయి వ్యక్తి గాని, న = లేడో, కశ్చిత్ = ఒకానొకడు, అతి-ఆదృతః = అతిశయించి ప్రేమించబడేవాడు, న = లేడో, ఉత = మరియు, విగర్హ్యః = నిందించబడేవాడు, న = లేడో, వయమ్ = మేము, వ్రతైః = వ్రతములచే, యత్-చరణ-అపవిద్ధామ్ = ఎవని చరణములచే నిరాకరించబడిన, భుక్తభోగామ్ = అనుభవించబడిన భోగము గల, అజామ్ = మాయాశక్తిని, ఆశాస్మహే బత = ప్రార్థించుచున్నామో.

ఆ మహాదేవునకు లోకములో తన వాడు గాని, పరాయి వాడు గాని లేడు. ఒకడు మిక్కిలి ఆదరించ దగినవాడు, మరియొకడు నిందనీ

యుడు అనే భేదము ఆయన దృష్టిలో సుతరాము లేదు. మేము అనేకవ్రత ములను చేసి ఆయన మాయాశక్తిని ప్రార్థించుచుందుము. కాని, దానిని ఆయన అనుభవించి, పాదముల వద్ద దూరముగా నుంచినాడు.

యస్యానవద్యాచరితం మనీషిణో
గృణంత్యవిద్యాపటలం బిభిత్సవః ।
నిరస్తసామ్యాతిశయోఽపి యత్స్వయం
పిశాచచర్యామచరద్గతిస్సతామ్ ॥ 26

అవిద్యాపటలం = అజ్ఞానముచే కలిగిన ఆత్మయొక్క ఆవరణము ను గురించి, బిభిత్సవః = భయపడ గోరే, మనీషిణః = విద్వాంసులు, యస్య = ఎవని, అనవద్య-ఆచరితమ్ = దోషములను పోగొట్టే ఆచరణము ను గురించి, గృణంతి = కీర్తించుచున్నారో, సతామ్ = సత్పురుషులకు, గతిః = ఆశ్రయమగు, యత్ = ఏ మహాదేవుడు, నిరస్తసామ్య-అతిశయః అపి = నిరాకరించబడిన సమానమైనవాడు మరియు అధికుడు గలవాడే అయిననూ, పిశాచచర్యామ్ = పిశాచముల చర్యను బోలిన ఆచరణమును, అచరత్ = చరించెనో.

అజ్ఞానము మానవునకు ఆత్మస్వరూపము తెలియకుండగా కప్పి వేయును. అట్టి ఆవరణము విషయములో భయమును కలిగియుండుటయే అభిలషణీయము. కనుకనే, విద్వాంసులు అట్టి అజ్ఞానభయమును కోరెద రు. అట్టి వివేకులు అజ్ఞాననివృత్తి కొరకై ఆ మహాదేవుని చరితమును గానము చేయుదురు. ఆయన సత్పురుషులకు ఆశ్రయము. ఆయనతో సమానుడు గాని, అధికుడు గాని లేడు. అయిననూ, ఆయన పిశాచముల చేష్టలవలె భాసించే చేష్టలను కలిగియున్నాడు.

హసంతి యస్యాచరితం హి దుర్భగాః
స్వాత్మన్ రతస్యావిదుషస్సమీహితమ్ ।
యైర్వస్త్రమాల్యాభరణానులేపనైః
శ్వభోజనం స్వాత్మతయోపలాలితమ్ ॥ 27

స్వ-ఆత్మన్ = తన స్వరూపమునందు, రతస్య = రమించే, యస్య = ఎవని, సమీహితమ్ = అభిప్రాయమును, అవిదుషః = ఎరుంగని, దుర్భగాః = మందభాగ్యులు, ఆచరితమ్ = చేష్టను ఉద్దేశించి, హసంతి = పరిహసించెదరో, యైః = ఎవరిచే, వస్త్రమాల్య-ఆభరణ-అనులేపనైః = వస్త్రములు మాలలు అభరణములు మరియు సుగంధద్రవ్యములు అను వాటిచే, శ్వభోజనమ్ = కుక్కలకు భోజనము అయ్యే దేహము, ఆత్మతయా = ఆత్మరూపముగా, ఉపలాలితమ్ = పాలించి లాలించబడెనో.

రుద్రుడు తన స్వరూపమునందు రమిస్తూ మానవులకు నేర్పుట కొరకై కొన్ని చేష్టలను చేయును. కాని, ఆయన అభిప్రాయమునెరుంగని మందభాగ్యులు ఆయన చేష్టలను పరిహసించెదరు. అదే సమయములో వారు, మరణించిన తరువాత కుక్కలకు నక్కలకు భోజనము కాదగిన దేహమునందు ఆత్మబుద్ధి గలవారై, దానిని వస్త్రములతో పుష్పమాలలతో మరియు ఆభరణములతో అలంకరించి, దానికి సుగంధద్రవ్యములను అలిమి లాలించుచుందురు.

> బ్రహ్మాదయో యత్కృతసేతుపాలా
> యత్కారణం విశ్వమిదం చ మాయా ।
> ఆజ్ఞాకరీ తస్య పిశాచచర్యా
> అహో విభూమ్నశ్చరితం విడంబనమ్ ॥ **28**

బ్రహ్మ-ఆదయః = బ్రహ్మ మొదలగువారు, యత్-కృతసేతు పాలాః = ఏ రుద్రునిచే చేయబడిన మర్యాదలను పాలించుచుందురో, ఇదమ్ = ఈ, విశ్వమ్ = జగత్తు, యత్-కారణమ్ = ఏ రుద్రుడు కారణముగా గలదియో, చ = మరియు, మాయా = మాయాశక్తి, ఆజ్ఞాకరీ = ఆజ్ఞను పాటించునో, తస్య = ఆ రుద్రునకు, పిశాచచర్యా = పిశాచము వలె ఆచరించుట, అహో= ఆశ్చర్యము!, విభూమ్నః = సర్వేశ్వరుడగు రుద్రుని, చరితమ్ = చేష్ట, విడంబనమ్ = అనుకరణము మాత్రమే.

బ్రహ్మాదులు కూడ ఆ రుద్రుడు ఏర్పాటు చేసిన మర్యాదలను పాలించుచుందురు. ఈ జగత్తునకు అధిష్ఠానము ఆయనయే. మాయాశక్తి

ఆయన చెప్పుచేతలలో మెలగును. ఆశ్చర్యము! సర్వవ్యాపకుడు, సర్వే శ్వరుడు అగు అట్టి రుద్రుడు పిశాచము వలె ప్రవర్తించుట కేవలము అనుక రణము మాత్రమే. ఆ అద్భుతలీల మనకు తెలియవచ్చుట లేదు.

మైత్రేయ ఉవాచ ।
సైవం సంవిదితే భర్త్రా మన్మథోన్మథితేంద్రియా ।
జగ్రాహ వాసో బ్రహ్మర్షేర్వృషలీవ గతత్రపా ॥ 29

భర్త్రా = భర్తయగు కశ్యపునిచే, ఏవమ్ = ఈ విధముగా, సంవిదితే = నచ్చజెప్ప బడినప్పటికీ, మన్మథ-ఉన్మథిత-ఇంద్రియా = మన్మథునిచే కల్లోలితము చేయబడిన మనస్సు గల, సా = ఆమె, వృషలీ ఇవ = వేశ్య వలె, గతత్రపా = తొలగిన లజ్జ గలదై, బ్రహ్మ-ఋషేః = ఆ బ్రహ్మర్షియొ క్క, వాసః = వస్త్రమును, జగ్రాహ = పట్టుకొనెను.

మైత్రేయుడిట్లు పలికెను --- భర్తయగు కశ్యప మహర్షి ఈ విధ ముగా నచ్చజెప్పెను. అయిననూ, ఆమె మనస్సు మన్మథునిచే కల్లోలి తము చేయబడి యుండెను. ఆమె వేశ్య వలె సిగ్గును విడిచి ఆ బ్రహ్మర్షి యొక్క వస్త్రమును పట్టుకొనెను.

స విదిత్వాథ భార్యాయాస్తం నిర్బంధం వికర్మణి ।
నత్వా దిష్టాయ రహసి తయాథోపవివేశ హ ॥ 30

అథ = తరువాత, సః = ఆ కశ్యపుడు, భార్యాయాః = భార్యయొ క్క, తమ్ = ఆ, వికర్మణి = నిషిద్ధకర్మయందలి, నిర్బంధమ్ = పట్టుదలను, విదిత్వా = గమనించి, దిష్టాయ = పరమేశ్వరుని కొరకు, నత్వా = నమస్క రించి, అథ = తరువాత, తయా = ఆమెతో గూడి, రహసి = ఏకాంతమునం దు, ఉపవివేశ హ = కూర్చుండెను.

తరువాత ఆ కశ్యప మహర్షి తన భార్యకు నిషిద్ధమగు కర్మ యందు గల ఆ పట్టుదలను గమనించి, పరమేశ్వరునకు నమస్కరించి, ఏకాంతమునందు ఆమెతో గడిపెను.

అథోపస్పృశ్య సలిలం ప్రాణానాయమ్య వాగ్యతః ।

ధ్యాయన్ జజాప విరజం బ్రహ్మ జ్యోతిస్సనాతనమ్ ॥ 31

అథ = తరువాత, సలిలం ఉపస్పృశ్య = నీటియందు స్నానమును చేసి, ప్రాణాన్ ఆయమ్య = ప్రాణాయామమును చేసి, వాక్-యతః = మౌనమును పాటించుచున్నవాడై, విరజమ్ = వికారములు లేనట్టియు, జ్యోతిః = జ్ఞానరూపమైనట్టియు, సనాతనమ్ = నిత్యమగు, బ్రహ్మ = పరమాత్మను, ధ్యాయన్ = ధ్యానించుచున్నవాడై, జజాప = జపమును చేసెను.

తరువాత ఆయన స్నానమును చేసి, ప్రాణాయామమును చేసి, మౌనమును దాల్చెను. వికారములు లేనివాడు, స్వయంప్రకాశస్వరూపుడు, సనాతనుడు అగు పరమాత్మను ధ్యానిస్తూ ఆయన జపమును చేసెను.

దితిస్తు వ్రీడితా తేన కర్మావద్యేన భారత ।
ఉపసంగమ్య విప్రర్షిమధోముఖ్యభ్యభాషత ॥ 32

భారత = భరతవంశీయుడవగు ఓ విదురా!, దితిః తు = దితియైతే, తేన = ఆ, కర్మ-అవద్యేన = కర్మదోషముచే, వ్రీడితా = సిగ్గు పడినదై, విప్రర్షిమ్ = కశ్యప మహర్షిని, ఉపసంగమ్య = సమీపించి, అధోముఖీ = తలను వాల్చుకున్నదై, అభ్యభాషత = పలికెను.

భరతవంశీయుడవగు ఓ విదురా! దితి ఆ కర్మదోషముచే సిగ్గుపడి ఆ మహర్షి వద్దకు వచ్చి తలను వంచుకొని ఇట్లు పలికెను.

దితిరువాచ ।
మా మే గర్భమిమం బ్రహ్మన్ భూతానామృషభో వధీత్ ।
రుద్రః పతిర్హి భూతానాం యస్యాకరవమంహసమ్ ॥ 33

బ్రహ్మన్ = ఓ మహర్షీ!, ఇమమ్ = ఈ, మే = నా, గర్భమ్ = గర్భమును, భూతానామ్ = ప్రమథగణములు మొదలగు వాటికి, ఋషభః = ప్రభువగు రుద్రుడు, మా వధీత్ = సంహరించుకుండు గాక!, రుద్రః = రుద్రుడు, భూతానామ్ = భూతములకు, పతిః హి = పాలకుడు గదా!, యస్య = ఎవనికి, అంహసమ్ = దోషమును, అకరవమ్ = చేసితినో.

దితి ఇట్లు పలికెను --- ఓ మహర్షీ! ప్రమథగణాధిపతి, భూతములను పాలించువాడు అగు రుద్రుడు నా ఈ గర్భమును సంహరించకుండు గాక! నేను ఆయన విషయములో అపరాధమును చేసితిని.

నమో రుద్రాయ మహతే దేవాయోగ్రాయ మీఢుషే ।
శివాయ న్యస్తదండాయ ధృతదండాయ మన్యవే ।। 34

మహతే దేవాయ = మహాదేవుడు, ఉగ్రాయ = భయంకరుడు, మీఢుషే = కోరికలను వర్షించువాడు, శివాయ = మంగళ స్వరూపుడు, న్యస్తదండాయ = విడువబడిన దండించవలెననే భావము గలవాడు, ధృత దండాయ = ధరించబడిన దండము గలవాడు, మన్యవే = కోపమూర్తి అగు, రుద్రాయ = రుద్రుని కొరకు, నమః = నమస్కారము.

మహాదేవుడు, దుష్టులకు భయంకరుడై కోపమూర్తియై శిక్షను విధించువాడు, సత్పురుషుల విషయములో దండించవలెననే భావనను సైతము దూరముగా పెట్టి వారికి కోరికలను వర్షించువాడు, మంగళస్వరూపుడు అగు రుద్రునకు నమస్కారము.

స నః ప్రసీదతాం భామో భగవానుర్వనుగ్రహః ।
వ్యాధస్యాప్యనుకంప్యానాం స్త్రీణాం దేవస్సతీపతిః ।। 35

భామః = బావగారు, ఉరు-అనుగ్రహః = గొప్ప అనుగ్రహము గల వాడు, సతీపతిః = సతీదేవి భర్త, దేవః = మహాదేవుడు అగు, సః = ఆ, భగ వాన్ = రుద్రభగవానుడు, వ్యాధస్య అపి = మిక్కిలి క్రూరునకైననూ, అను కంప్యానామ్ = దయను చూపదగిన, స్త్రీణామ్ = స్త్రీలమగు, నః = మాకు, ప్రసీదతామ్ = ప్రసన్నుడగు గాక!

ఎంతటి క్రూరులైననూ స్త్రీలపై దయను చూపెదరు. సతీదేవికి భర్త, నాకు బావగారు, గొప్ప దయ గలవాడు, మహాదేవుడు అగు ఆ రుద్ర భగవానుడు నాపై ప్రసన్నుడగుగాక!

మైత్రేయ ఉవాచ ।

స్వసర్గస్యాశిషం లోక్యామాశాసానాం ప్రవేపతీమ్ ।
నివృత్తసంధ్యానియమో భార్యామాహ ప్రజాపతిః ॥ 36

స్వసర్గస్య = తన గర్భమునకు, లోక్యామ్ = ఇహపరలోకములకు సంబంధించిన, ఆశిషమ్ = శుభమును, ఆశాసానామ్ = ప్రార్థించుచున్న, ప్రవేపతీమ్ = వణికి పోవుచున్న, భార్యామ్ = భార్యను గురించి, నివృత్తసంధ్యానియమః = తొలగిన సంధ్యాకాల నియమము గల, ప్రజాపతిః = కశ్యప ప్రజాపతి, ఆహ = పలికెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- దితి తన సంతానమునకు ఇహపరలోకములలో శుభమును కోరి భగవానుని ప్రార్థించుచుండెను. ఆమె తాను అపరాధమును చేసితిననే భయముతో వణికిపోవుచుండెను. ఇంతలో కశ్యప ప్రజాపతి సంధ్యాకాల నియమమును పూర్తి చేసుకొని, ఆమెతో నిట్లనెను.

కశ్యప ఉవాచ ।
అప్రాయత్యాదాత్మనస్తే దోషాన్మౌహూర్తికాదుత ।
మన్నిదేశాతిచారేణ దేవానాం చైవ హేలనాత్ ॥ 37.
భవిష్యతస్తవాభద్రాదభద్రే జాఠరాధమౌ ।
లోకాన్ సపాలాంస్త్రీంశ్చండి ముహురాక్రందయిష్యతః ॥38

అభద్రే = అమంగళ స్వరూపురాలా!, చండి = కోపస్వభావము గలదానా!, తే = నీ, ఆత్మనః = మనస్సుయొక్క, అప్రాయత్యాత్ = అశుచి యగుట వలన, మౌహూర్తికాత్ = సంధ్యాముహూర్తమునకు సంబంధించిన, దోషాత్ = దోషము వలన, ఉత = మరియు, మత్-నిదేశ-అతిచారేణ = నా ఆజ్ఞను ఉల్లంఘించుటచేత, దేవానామ్ = రుద్రుని అనుచరులగు దేవతల, హేలనాత్ చ ఏవ = అవమానించుట వలన కూడ, అభద్రౌ = అమంగళ స్వరూపులగు, జాఠర-అధమౌ = అధములగు పుత్రులు ఇద్దరు, భవిష్యతః = జన్మించగలరు, సపాలాన్ = లోకపాలకులతో కూడిన, త్రీన్ = మూడు, లోకాన్ = లోకములను, ముహుః = పలుమార్లు, ఆక్రందయిష్యతః = ఏడిపించెదరు.

కశ్యప ప్రజాపతి ఇట్లు పలికెను --- ఓ అమంగళ స్వరూపురాలా! కోపస్వభావము గలదానా! నీ మనస్సు స్వచ్ఛమైనది కాదు. నీకు సంధ్యా సమయమునందు అట్టి భావన కలుగుట దోషము. నీవు నా ఆదేశమును కూడ ఉల్లంఘించితివి. పైగా, రుద్రుని అనుచరులగు దేవతలను నిశ్చయముగా అవమానించితివి. ఇన్ని కారణములచే, నీకు నిశ్చయముగా అమంగళ స్వరూపులగు ఇద్దరు అధములు పుత్రులై జన్మించెదరు. వారు లోకపాలకులతో సహా ముల్లోకములను పలుమార్లు ఏడిపించెదరు.

ప్రాణినాం హన్యమానానాం దీనానామకృతాగసామ్ ।
స్త్రీణాం నిగృహ్యమానానాం కోపితేషు మహాత్మసు ॥ 39
తదా విశ్వేశ్వరః క్రుద్ధో భగవాన్ లోకభావనః ।
హనిష్యత్యవతీర్యాసౌ యథాద్రీన్ శతపర్వధృక్ ॥ 40

అకృత-ఆగసామ్ = చేయబడని అపరాధము గల, దీనానామ్ = దీనులగు, ప్రాణినామ్ = ప్రాణులు, హన్యమానానామ్ = సంహరించ బడుచుండగా, స్త్రీణామ్ = స్త్రీలు, నిగృహ్యమానానామ్ = చెర పట్టబడుచుండగా, మహాత్మసు = మహాత్ములు, కోపితేషు = కోపము గలవారు కాగా, తదా = అప్పుడు, విశ్వ-ఈశ్వరః = జగన్నాథుడు, లోకభావనః = లోకములను పాలించువాడు అగు, అసౌ = ఈ, భగవాన్ = శ్రీహరి భగవానుడు, క్రుద్ధః = కోపించినవాడై, అవతీర్య = అవతరించి, శతపర్వధృక్ = వజ్రమును ధరించిన ఇంద్రుడు, అద్రీన్ యథా = పర్వతములను వలె, హనిష్యతి = సంహరించ గలడు.

వారు నిరపరాధులు, దీనులు అగు ప్రాణులను హింసించెదరు. స్త్రీలను చెరపట్టెదరు. అప్పుడు మహాత్ములు కోపించెదరు. అప్పుడు జగన్నాథుడు, జగత్పాలకుడు అగు ఈ శ్రీహరి భగవానుడు అవతరించి, ఇంద్రుడు వజ్రమును చేతబట్టి పర్వతముల రెక్కలను నరికిన విధముగా, వారినిద్దరినీ సంహరించగలడు.

దితిరువాచ ।
వధం భగవతా సాక్షాత్సునాభోదారబాహునా ।

ఆశాసే పుత్రయోర్మహ్యం మా క్రుద్ధాద్బ్రాహ్మణాద్విభో ।। 41

సాక్షాత్ = సాక్షాత్తుగా, సునాభ-ఉదారబాహునా = సుదర్శన చక్రముచే అలంకరించబడిన చేయి గల, భగవతా = శ్రీహరి భగవానునిచే, మహ్యమ్ = నా, పుత్రయోః = కుమారులిద్దరికీ, వధమ్ = వధను, ఆశాసే = ప్రార్థించుచున్నాను, విభో = ఓ ప్రభూ!, క్రుద్ధాత్ = కోపించిన, బ్రాహ్మణాత్ = బ్రాహ్మణుని వలన, మా = కలుగకుండు గాక!

దితి ఇట్లు పలికెను --- ఓ ప్రభూ! నా పుత్రులిద్దరు వధించబడే పక్షములో, సాక్షాత్తుగా శ్రీహరి భగవానుడు తన సుందరమగు చేతిలో సుదర్శన చక్రమును పట్టి వారిని సంహరించుగాక! అంతేగాని, వారు కోపించిన బ్రాహ్మణుల శాపముచే మరణించరాదని నా ప్రార్థన.

న బ్రహ్మదండదగ్ధస్య న భూతభయదస్య చ ।
నారకాశ్చానుగృహ్ణంతి యాం యాం యోనిమసౌ గతః ।। 42

బ్రహ్మదండదగ్ధస్య = బ్రాహ్మణుని శాపముచే మరణించిన వానికి, నారకాః చ = నరకమునందుండే వారు కూడ, న అనుగృహ్ణంతి = అనుగ్రహమును చూపరు, చ = మరియు, భూతభయదస్య = ప్రాణులకు భయమును కలిగించువానికి, న = అనుగ్రహమును చూపరు, యాం యామ్ = ఏయే, యోనిమ్ = జన్మను, అసౌ = వీడు, గతః = పొందినాడో.

బ్రాహ్మణుని శాపముచే మరణించిన వానికి, ప్రాణులకు భయమును కలిగించు వానికి నరకమునందలి వారు కూడ అనుగ్రహమును చూపరు. అట్టివాడు ఏయే జన్మను పొందిననూ, అక్కడ కూడ ఆయా ప్రాణులు వాని విషయములో అనుగ్రహమును చూపవు.

కశ్యప ఉవాచ ।
కృతశోకానుతాపేన సద్యః ప్రత్యవమర్శనాత్ ।
భగవత్యురుమానాచ్చ భవే మయ్యపి చాదరాత్ ।। 43
పుత్రస్యైవ తు పుత్రాణాం భవితైకస్సతాం మతః ।
గాస్య[illegible] యద్యశశ్శుద్ధం భగవద్యశసా సమమ్ ।। 44

కృతశోక-అనుతాపేన = చేయబడిన పనిచే కలిగిన శోకము వలన ఉదయించిన పశ్చాత్తాపముచే, సద్యః = వెనువెంటనే, ప్రతి-అవమర్శనాత్ = యుక్తాయుక్తములను విచారించుట వలన, భగవతి = భగవంతునియందు, ఉరుమానాత్ = గొప్ప ఆదరము వలన, చ = మరియు, భవే= శివుని యందు, మయి అపి = నాయందు కూడ, ఆదరాత్ = ఆదరము వలన, పుత్రస్య = పుత్రునియొక్క, పుత్రాణాం తు = పుత్రులలోనైతే, ఏకః = ఒకడు, సతామ్ = సత్పురుషులకు, మతః = కొనియాడబడువాడు, భవితా జన్మించగలడు, భగవద్-యశసా = భగవంతుని కీర్తితో, సమమ్ = సమా మైనది, శుద్ధమ్ = పవిత్రమైనది అగు, యద్-యశః = ఎవని కీర్తిని, గా స్యంతి = గానము చేయగలరో.

నీవు చేసిన పనికి దుఃఖించి పశ్చాత్తాపమును పొందినావు. పనిని చేసిన వెంటనే అది ఉచితమా, కాదా అని విమర్శించుచున్నావు. పైగా, శ్రీహరి భగవానునియందు, శివునియందు మరియు నాయందు గొప్ప ఆదరమును చూపినావు. కావున, నీ పుత్రులలో ఒకనికి సత్పురుషులచే కొనియాడబడే కొడుకు ఒకడు జన్మించగలడు. పవిత్రమైన వాని కీర్తిని జనులు భగవంతుని కీర్తితో సమానముగా గానము చేయగలరు.

యోగైర్హేమేవ దుర్వర్ణం భావయిష్యంతి సాధవః ।
నిర్వైరాదిభిరాత్మానం యచ్ఛీలమనువర్తితుమ్ ॥ 45

దుర్వర్ణమ్ = మెరుగును కోల్పోయిన, హేమ = బంగారమును, యోగైః ఇవ = పుటము పెట్టుట మొదలగు ఉపాయములచేతను వలె, యత్-శీలమ్ = ఎవని శీలమును, అనువర్తితుమ్ = అనుకరించుటకై, సాధవః = సాధు పురుషులు, నిర్వైర-ఆదిభిః = వైరబుద్ధి లేకుండుట మొదలగు లక్షణములచే, ఆత్మానమ్ = అంతఃకరణమును, భావయిష్యంతి = శుద్ధి చేసుకొనగలరో.

మెరుగును కోల్పోయిన బంగారమును పుటము పెట్టుట మొదలగు ఉపాయములచే శుద్ధి చేయుదురు. అదే విధముగా సాధుజనులు

వైరము లేకుండుట మొదలగు లక్షణములతో కూడిన వాని స్వభావమున నుకరించి, తమ అంతఃకరణమును శుద్ధి చేసుకొనెదరు.

యత్ప్రసాదాదిదం విశ్వం ప్రసీదతి యదాత్మకమ్ ।
స స్వదృగ్భగవాన్ యస్య తోష్యతేఽనన్యయా దృశా ॥ 46

యత్-ఆత్మకమ్ = ఏ భగవానుడే అధిష్ఠానముగా గల, ఇదమ్ = ఈ, విశ్వమ్ = జగత్తు, యత్-ప్రసాదాత్ = ఎవని అనుగ్రహము వలన, ప్రసీదతి = అనుగ్రహమును చేయుచున్నదో, సః = అట్టి, స్వదృక్ = స్వయంప్రకాశుడగు, భగవాన్ = శ్రీహరి భగవానుడు, యస్య = ఎవనియొక్క, అనన్యయా = భేదము లేని, దృశా = జ్ఞానముచే, తోష్యతే = సంతోషించగలడో.

ఈ జగత్తునకు అధిష్ఠానము భగవానుడే. భగవానుని అనుగ్రహమున్నచో, జగత్తుయొక్క అనుగ్రహము కూడ లభించును. అట్టి స్వయంప్రకాశస్వరూపుడగు శ్రీహరి భగవానుడు ఆ నీ పౌత్రుని అభేదజ్ఞానము (ఏకాంతభక్తి) చే సంతోషించగలడు.

స వై మహాభాగవతో మహాత్మా
మహానుభావో మహతాం మహిష్ఠః ।
ప్రవృద్ధభక్త్యా హ్యనుభావితాశయే
నివేశ్య వైకుంఠమిమం విహాస్యతి ॥ 47

మహాభాగవతః = గొప్ప భగవద్భక్తుడు, మహాత్మా = విశాలహృదయుడు, మహా-అనుభావః = గొప్ప ప్రభావము గలవాడు, మహతామ్ = గొప్పవారిలో, మహిష్ఠః = చాల గొప్పవాడు అగు, సః = ఆ బాలకుడు, ప్రవృద్ధభక్త్యా = బాగుగా వర్ధిల్లిన భక్తిచే, అనుభావిత-ఆశయే = పవిత్రము చేయబడిన హృదయమునందు, వైకుంఠమ్ = శ్రీహరిని, నివేశ్య = నిలిపి, ఇమమ్ = ఈ దేహాభిమానమును, విహాస్యతి = విడువగలడు.

ఆ బాలకుడు గొప్ప భగవద్భక్తుడు కాగలడు. ఆతడు విశాలమగు హృదయము గలవాడై, గొప్ప ప్రభావశీలియై, గొప్పవారిలోకెల్లా గొప్పవా

డుగా వెలుగొందగలడు. ఆతడు అతిశయించిన భక్తిచే పవిత్రమైన తన హృదయములో శ్రీహరిని నిలిపి దేహాభిమానమును అధిగమించగలడు.

అలంపటశ్శీలధరో గుణాకరో హృష్టః పరర్ధ్యా వ్యథితో దుఃఖితేషు।
అభూతశత్రుర్జగతశ్శోకహర్తా నైదాఘికం తాపమివోడురాజః ।। 48

అలంపటః = ఇంద్రియభోగములయందు తృష్ణ లేనివాడు, శీలధరః = శీలము గలవాడు, గుణ-ఆకరః = సద్గుణములకు నిలయము, పర-ఋద్ధ్యా = ఇతరుల సంపదచే, హృష్టః = ఆనందించువాడు, దుఃఖితేషు = ఇతరులు దుఃఖమును పొందియుండగా, వ్యథితః = దుఃఖించువాడు, అభూతశత్రుః = శత్రువులు లేనివాడు, నైదాఘికమ్ = వేసవికాలపు, తాపమ్ = తాపమును, ఉడురాజః ఇవ = చంద్రుడు వలె, జగతః = జగత్తుయొక్క, శోకహర్తా = శోకమును పోగొట్టువాడు.

జితేంద్రియుడగు ఆతనియందు చక్కని శీలము, సకలసద్గుణములు నివాసము చేయును. ఇతరులు అభివృద్ధిని చెందినపుడు ఆతడు చూచి ఆనందించును. కాని, ఇతరులు దుఃఖముననుభవించుచుండగా చూచి ఆతడు కూడ ఖేదమును పొందును. ఆతడు అజాతశత్రువు కాగలడు. వేసవికాలపు తాపమును చంద్రుడు తొలగించినట్లుగా, ఆతడు జనుల శోకమును బాపగలడు.

అంతర్బహిశ్చామలమబ్జనేత్రం
స్వపూరుషేచ్ఛానుగృహీతరూపమ్ ।
పౌత్రస్తవ శ్రీలలనాలలామం
ద్రష్టా స్ఫురత్కుండలమండితాననమ్ ।। 49

అమలమ్ = స్వచ్ఛమైనవాడు, అబ్జనేత్రమ్ = పద్మమువంటి కన్నులు గలవాడు, స్వపూరుష-ఇచ్ఛా-అనుగృహీతరూపమ్ = తన భక్తుల ఇచ్ఛకు తగ్గట్లుగా స్వీకరించబడిన రూపము గలవాడు, శ్రీలలనాలలామమ్ = లక్ష్మీదేవికి అలంకారమైనవాడు, స్ఫురత్-కుండలమండిత-ఆననమ్ = మెరిసిపోయే కుండలములచే అలంకరించబడిన ముఖము గల

వాడు అగు శ్రీహరిని, తవ = నీ, పౌత్రః = మనుమడు, అంతః = లోపల, చ = మరియు, బహిః = బయట, ద్రష్టా = దర్శించగలడు.

స్వచ్ఛమైనవాడు, పద్మమువంటి కన్నులు గలవాడు అగు శ్రీహరి తన భక్తుల కోరికననుసరించి అవతారములనెత్తుచుండును. ఆయన లక్ష్మీదేవియొక్క శోభను కూడ తన దివ్యరూపముచే ఇనుమడింపజేయుచుండును. మెరిసే కుండలములు ఆయన ముఖమునకు అలంకారములై ఒప్పారును. అట్టి శ్రీహరిని నీ మనుమడు తన హృదయములో మాత్రమే గాక సర్వజగత్తునందు (అధిష్ఠానరూపముగా) దర్శించగలడు.

మైత్రేయ ఉవాచ ।
శ్రుత్వా భాగవతం పౌత్రమమోదత దితిర్భృశమ్ ।
పుత్రయోశ్చ వధం కృష్ణాద్విదిత్వాఽఽసీన్మహామనాః 50

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
చతుర్దశోఽధ్యాయః ॥

భాగవతమ్ = భగవద్భక్తుడగు, పౌత్రమ్ = మనుమని గురించి, శ్రుత్వా = విని, దితిః = దితి, భృశమ్ = మిక్కిలి, అమోదత = సంతోషించెను, చ = మరియు, కృష్ణాత్ = శ్రీహరి భగవానుని వలన, పుత్రయోః = తన ఇద్దరు కుమారుల, వధమ్ = వధను గురించి, విదిత్వా = తెలుసుకొని, మహామనాః = ఉత్సాహముతో నిండిన మనస్సు గలది, ఆసీత్ = ఆయెను.

తన మనుమడు గొప్ప భగవద్భక్తుడు కాగలడని విని దితి చాల సంతోషించెను. అంతేగాక, తన ఇద్దరు పుత్రులు శ్రీహరి భగవానునిచే వధించబడెదరని తెలుసుకొని, ఆమె చాల ఉత్సాహమును పొందెను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
పదునాలుగవ అధ్యాయము ముగిసినది (14).



# అథ పంచదశోఽధ్యాయః

## జయ విజయులు శాపగ్రస్తులగుట

మైత్రేయ ఉవాచ ।
ప్రాజాపత్యం తు తత్తేజః పరతేజోహనం దితిః ।
దధార వర్షాణి శతం శంకమానా సురార్దనాత్ ॥ 1

మైత్రేయః = మైత్రేయ మహర్షి, ఉవాచ = పలికెను, పరతేజోహనమ్ = ఇతరుల తేజస్సును నశింపజేసే, తత్ = ఆ, ప్రాజాపత్యమ్ = కశ్యప ప్రజాపతికి సంబంధించిన, తేజః = తేజస్సును, దితిః తు = దితియైతే, సుర-అర్దనాత్ = దేవతలకు కలిగే పీడ వలన, శంకమానా = శంక గలదియై, శతమ్ = వంద, వర్షాణి = సంవత్సరములను, దధార = ధరించెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- కశ్యప ప్రజాపతియొక్క ఆ తేజస్సు ఇతరుల తేజస్సును నశింపజేయునది. దాని వలన దేవతలకు పీడ కలుగునేమో యను శంకచే దితి దానిని వంద సంవత్సరముల కాలము ధరించి యుండెను.

లోకే తేన హతాలోకే లోకపాలా హతౌజసః ।
న్యవేదయన్ విశ్వసృజే ధ్వాంతవ్యతికరం దిశామ్ ॥ 2

లోకే = లోకము, తేన = ఆ గర్భముచే, హత-ఆలోకే = నశింపజేయబడిన ప్రకాశము గలది కాగా, హత-ఓజసః = నశింప జేయబడిన సామర్థ్యము గల, లోకపాలాః = లోకపాలకులు, దిశామ్ = దిక్కులయొక్క, ధ్వాంతవ్యతికరమ్ = చీకటిచే తేడా తెలియక పోవుటను గురించి, విశ్వసృజే = సృష్టికర్తయగు బ్రహ్మగారి కొరకు, న్యవేదయన్ = విన్నవించిరి.

ఆ గర్భమునందలి శిశువుయొక్క తేజస్సుచే లోకముల తేజస్సు మరియు లోకపాలకుల సామర్థ్యము నశించెను. దిక్కులలో తూర్పు పడమర అనే తేడా తెలియకుండా పోయెను. అపుడు లోకపాలకులు ఈ అవ్యవస్థను గురించి సృష్టికర్తయగు బ్రహ్మగారికి విన్నవించిరి.

దేవా ఊచుః ।
తమ ఏతద్విభో వేత్థ సంవిగ్నా యద్వయం భృశమ్ ।
న హ్యవ్యక్తం భగవతః కాలేనాస్పృష్టవర్త్మనః ॥ 3

విభో = ఓ ప్రభూ!, ఏతత్ = ఈ, తమః = చీకటిని, వేత్థ = నీవు తెలియుచునే యున్నావు, యత్ = దేనివలన, వయమ్ = మేము, భృశమ్ = మిక్కిలి, సంవిగ్నాః = భయపడి యున్నామో, హి = ఏలయనగా, కాలేన = కాలముచే, అస్పృష్టవర్త్మనః = కప్పివేయబడని జ్ఞానమార్గము గల, భగవతః = పూజ్యుడవగు నీకు, అవ్యక్తమ్ = తెలియనిది, న = లేదు.

ఓ ప్రభూ! ఈ చీకటిని నీవు చూచుచునే యున్నావు. ఇది మాకు చాల భయమును గొల్పుచున్నది. నీ జ్ఞానశక్తి కాలమున మరుగున పడేది కాదు. నీకు తెలియనిది ఏదీ లేదు గదా!

దేవదేవ జగద్ధాతర్లోకనాథశిఖామణే ।
పరేషామపరేషాం త్వం భూతానామసి భావవిత్ ॥

దేవదేవ = ఓ దేవదేవా!, జగద్ధాతః = జగత్తును సృష్టించువాడా!, లోకనాథశిఖామణే= లోకపాలకులకు కూడ ఆదరింప దగినవాడా!, త్వమ్ = నీవు, పరేషామ్ = ఉత్కృష్టమైన, అపరేషామ్ = నికృష్టమైన, భూతానామ్ = ప్రాణులయొక్క, భావవిత్ = అభిప్రాయమునెరింగిన వాడవు.

ఓ దేవదేవా! నీవు జగత్తును సృష్టించినవాడవు. లోకపాలకులు సైతము నిన్ను పూజించెదరు. ఉత్కృష్టమైనవి, నికృష్టమైనవి అగు సకల ప్రాణుల అభిప్రాయములు నీకు తెలియుచుండును.

నమో విజ్ఞానవీర్యాయ మాయయేదముపేయుషే ।

గృహీతగుణభేదాయ నమస్తేఽవ్యక్తయోనయే ॥ 5

విజ్ఞానవీర్యాయ = చైతన్యశక్తియే బలముగా గలవాడు, గృహీతగుణభేదాయ = స్వీకరించబడిన గుణములలో ఒకటియగు రజోగుణము గలవాడు, మాయయా = మాయాశక్తిచే, ఇదమ్ = ఈ బ్రహ్మదేహమును, ఉపేయుషే = పొందినవాడు, అవ్యక్తయోనయే = పరబ్రహ్మయొక్క మాయాశక్తినుండి ఉత్పన్నమైనవాడు అగు, తే = నీ కొరకు, నమః నమః = అనేక నమస్కారములు.

చైతన్యశక్తియే నీ బలము. గుణములలో ఒకటియగు రజోగుణమును ఉపాధిగా స్వీకరించి, నీవీ చతుర్ముఖరూపమును పొందితివి. పరబ్రహ్మయొక్క మాయాశక్తినుండి ప్రకటమైన నీకు అనేక నమస్కారములు.

యే త్వానన్యేన భావేన భావయంత్యాత్మభావనమ్ ।
ఆత్మని ప్రోతభువనం పరం సదసదాత్మకమ్ ॥ 6

తేషాం సుపక్వయోగానాం జితశ్వాసేంద్రియాత్మనామ్ ।
లబ్ధయుష్మత్ప్రసాదానాం న కుతశ్చిత్పరాభవః ॥ 7

ఆత్మభావనమ్ = జీవులను పాలించువాడు, ఆత్మని = తనయందు, ప్రోతభువనమ్ = పడుగు పేకగా కలిసిపోయి ఉన్న భువనములు గలవాడు, పరమ్ = సర్వాధికుడు, సత్-అసత్-ఆత్మకమ్ = కార్యకారణరూపముగా నున్నవాడు అగు, త్వా = నిన్ను, యే = ఎవరైతే, అనన్యేన = భేదమునెరుంగని (మరియొకటి లేని), భావేన = భక్తితో, భావయంతి = ధ్యానించెదరో, సుపక్వయోగానామ్ = మిక్కిలి పరిణతి చెందిన సాధన గల, జితశ్వాస-ఇంద్రియ-ఆత్మనామ్ = జయించబడిన శ్వాస ఇంద్రియములు మరియు మనస్సు గల, లబ్ధయుష్మత్-ప్రసాదానామ్ = పొందబడిన నీ అనుగ్రహము గల, తేషామ్ = వారికి, కుతశ్చిత్ = దేనివలనైననూ, పరాభవః = పరాభవము, న = లేదు.

ఈ భువనములు నీయందు ఓతప్రోత భావముచే నిలిచియున్నవి. జీవులనందరిని పాలించువాడవు నీవే. నీవు సర్వాధికుడవు. కారణము నీ

రూపమే, కార్యము నీ రూపమే. అట్టి నిన్ను ఎవరైతే అభేదభావనతో కూడిన (నిష్కామ) భక్తితో ధ్యానించెదరో, వారి యోగసాధన పక్వమగును. వారు తమ శ్వాసను ప్రాణాయామము ద్వారా, ఇంద్రియములను ప్రత్యాహారము ద్వారా, మనస్సును ధారణ ద్వారా వశము చేసుకొని, నీ అనుగ్రహమునకు పాత్రులగుదురు. అట్టి వారికి ఈ జగత్తులో దేనివలనైననూ పరాభవము లేదు.

యస్య వాచా ప్రజాస్సర్వా గావస్తంత్యేవ యంత్రితాః ।
హరంతి బలిమాయత్తాస్తస్మై ముఖ్యాయ తే నమః ।। 8

యస్య = ఎవనియొక్క, వాచా = వేదరూపమగు వాక్కుచే, సర్వాః = అందరు, ప్రజాః = జనులు, తంత్యా = త్రాటిచే, గావః ఇవ = ఎద్దులు వలె, యంత్రితాః = నియంత్రించబడుచున్నారో, ఆయత్తాః = నీకు అధీనులై (సావధానులై), బలిమ్ = పూజను, హరంతి = సమర్పించుచున్నారో, తస్మై = అట్టి, ముఖ్యాయ = ప్రాణస్వరూపుడవగు, తే = నీ కొరకు, నమః = నమస్కారము.

నీ వేదరూపమగు వాక్కు జనులను, త్రాడు ఎద్దులను వలె, ధర్మాధర్మములకు బద్ధులను చేసి నియంత్రించుచున్నది. జనులు నీకు అధీనులై సావధానమనస్కులై నీకు పూజాదికమును సమర్పించుచున్నారు. నీవు ప్రాణులలో ముఖ్య (ముఖమునందు శ్వాస రూపముగా వ్యక్తమయ్యే) ప్రాణము రూపములో నున్నావు. నీకు నమస్కారము.

స త్వం విధత్స్వ శం భూమంస్తమసా లుప్తకర్మణామ్ ।
అదభ్రదయయా దృష్ట్యా ఆపన్నానర్హసీక్షితుమ్ ।। 9

భూమన్ = ఓ పరబ్రహ్మ స్వరూపుడా!, సః = అట్టి, త్వమ్ = నీవు, తమసా = చీకటిచే, లుప్తకర్మణామ్ = లోపించిన కర్మలు గల జనులకు, శమ్ = సుఖమును, విధత్స్వ = కలిగించుము, ఆపన్నాన్ = ఆపదలో నున్న వారిని, అదభ్రదయయా = గొప్ప దయ గల, దృష్ట్యా = చూపుతో, ఈక్షితుమ్ = చూచుటకు, అర్హసి = తగుదువు.

ఓ పరబ్రహ్మ స్వరూపుడా! అట్టి నీవు జనులకు సుఖమును కలిగించుము. ఈ చీకటిచే వారి కర్మానుష్ఠానము మూతపడినది. ఆపదలో చిక్కుకున్న మమ్ములను నీవు గొప్ప దయతో నిండిన చూపుతో చూడవలెను.

ఏష దేవ దితేర్గర్భ ఓజః కాశ్యపమర్పితమ్ ।
దిశస్తిమిరయన్ సర్వా వర్ధతేऽగ్నిరివైధసి ॥ 10

దేవ = ఓ దేవా!, కాశ్యపమ్ = కశ్యప ప్రజాపతికి చెందిన, అర్పితమ్ = ఆయనచే స్థాపించబడిన, ఓజః = తేజస్సు అగు, ఏషః = ఈ, దితేః = దితియొక్క, గర్భః = గర్భము, సర్వాః = అన్ని, దిశః = దిక్కులను, తిమిరయన్ = చీకటిగా చేయుచున్నదై, ఏధసి = కట్టెయందు, అగ్నిః ఇవ = అగ్నివలె, వర్ధతే = పెరుగుచున్నది.

ఓ దేవా! కశ్యప ప్రజాపతి తన తేజస్సును దితియందు స్థాపించినాడు. ఆమెయొక్క ఆ గర్భము, ఎండు కట్టెయందలి అగ్ని వలె వర్ధిల్లుతూ, దిక్కులను వెలవెల బోవునట్లు చేయుచున్నది.

మైత్రేయ ఉవాచ ।
స ప్రహస్య మహాబాహో భగవాన్ శబ్దగోచరః ।
ప్రత్యాచష్టాత్మభూర్దేవాన్ ప్రీణన్ రుచిరయా గిరా ॥ 11

మహాబాహో = ఓ విదురా!, శబ్దగోచరః = వేదశబ్దములచే తెలియబడే, ఆత్మభూః = స్వయంభువుడగు, సః = ఆ, భగవాన్ = బ్రహ్మ భగవానుడు, ప్రహస్య = నవ్వి, రుచిరయా = మధురమగు, గిరా = వాక్కుతో, దేవాన్ = దేవతలను, ప్రీణన్ = సంతోషపెట్టుచున్నవాడై, ప్రతి-ఆచష్ట = ప్రత్యుత్తరమునిచ్చెను.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- ఓ విదురా! స్వయంభువుడగు బ్రహ్మ భగవానుని స్వరూపము వేదశబ్దములచే మాత్రమే తెలియబడుచున్నది. ఆయన నవ్వి తన మధురమగు వాక్కుతో దేవతలకు సంతోషమును కలిగిస్తూ, ఇట్లు బదులు చెప్పెను.

బ్రహ్మోవాచ ।
మానసా మే సుతా యుష్మత్పూర్వజా సనకాదయః ।
చేరుర్విహాయసా లోకాన్ లోకేషు విగతస్పృహాః ॥ 12

యుష్మత్-పూర్వజాః = మీకంటె ముందు జన్మించిన, సనక-ఆదయః = సనకుడు మొదలగు, మే = నా, మానసాః సుతాః = సంకల్పముచే జన్మించిన పుత్రులు, లోకేషు = లోకములయందు, విగతస్పృహాః = తొలగిన కోరికలు గలవారై, విహాయసా = ఆకాశమార్గముచే, లోకాన్ = లోకములను, చేరుః = సంచరించిరి.

మీరు పుట్టుటకు ముందే నా సంకల్పమునుండి సనకుడు మొదలగు మహర్షులు జన్మించినారు. వారికి ఈ లోకములలో పొందదగిన కోరికలు ఏమియు లేవు. వారు ఆకాశమార్గము గుండా లోకములను సంచరించుచుండిరి.

త ఏకదా భగవతో వైకుంఠస్యామలాత్మనః ।
యయుర్వైకుంఠనిలయం సర్వలోకనమస్కృతమ్ ॥ 13

తే = వారు, ఏకదా = ఒకనాడు, అమల-ఆత్మనః = శుద్ధచైతన్యమే స్వరూపముగా గల, వైకుంఠస్య భగవతః = శ్రీహరి భగవానునియొక్క, సర్వలోకనమస్కృతమ్ = అన్ని లోకముల వారిచే నమస్కరించబడే, వైకుంఠనిలయమ్ = వైకుంఠలోకమును గురించి, యయుః = వెళ్ళిరి.

శ్రీహరి ప్రాణుల సత్త్వగుణప్రధానమగు బుద్ధిగుహయందు శుద్ధచైతన్యరూపముగా వెలుగొందుచుండును. ఆయనయే వైకుంఠలోకమునందు నివసించును. సకలలోకముల వారు ఆ వైకుంఠలోకమును నమస్కరించెదరు. ఒకనాడు ఆ సనకాదులు వైకుంఠలోకమునకు వెళ్ళిరి.

వసంతి యత్ర పురుషాస్సర్వే వైకుంఠమూర్తయః ।
యేఽనిమిత్తనిమిత్తేన ధర్మేణారాధయన్ హరిమ్ ॥ 14

యత్ర = ఎక్కడనైతే, సర్వే = అందరు, వైకుంఠమూర్తయః = శ్రీహరియొక్క రూపమువంటి రూపము గల, పురుషాః = పురుషులు, అనిమిత్తనిమిత్తేన = నిష్కామభావమే ప్రేరణగా గల, ధర్మేణ = ధర్మముచే, హరిమ్ = శ్రీహరిని, ఆరాధయన్ = ఆరాధిస్తూ, వసంతి = నివసించెదరో.

ఆ వైకుంఠమునందలి పురుషులు అందరు శ్రీహరిని బోలిన రూపమును కలిగియుందురు. శ్రీహరిని నిష్కామభావముతో ఆరాధించుటయే వారు పాటించే ధర్మము.

యత్ర చాద్యః పుమానాస్తే భగవాన్ శబ్దగోచరః ।
సత్త్వం విష్టభ్య విరజం స్వానాం నో మృడయన్ వృషః ।। 15

చ = మరియు, యత్ర = ఎక్కడనైతే, శబ్దగోచరః = వేదశబ్దములు అనే ప్రమాణమునకు మాత్రమే గోచరమగువాడు, ఆద్యః = కారణరహితుడు, పుమాన్ = పూర్ణుడు, వృషః = ధర్మస్వరూపుడు (కోరికలను వర్షించువాడు) అగు, భగవాన్ = శ్రీహరి భగవానుడు, విరజమ్ = రజోగుణ సంబంధము లేని, సత్త్వమ్ = సత్త్వగుణమును, విష్టభ్య = ఉపాధిగా చేసుకొని, స్వానామ్ = తన భక్తులగు, నః = మనలకు, మృడయన్ = సుఖమును కలిగించువాడై, ఆస్తే = ఉన్నాడో.

సకలకారణుడు, పూర్ణుడు, వేదములచే ప్రతిపాదించబడువాడు, ధర్మమూర్తి అగు శ్రీహరి భగవానుడు రజోగుణ సంబంధము లేని సత్త్వగుణమును ఉపాధిగా చేసుకొని, అచట తన భక్తులగు మనలకు సుఖమును కలిగిస్తూ ఆ వైకుంఠమునందు విరాజిల్లుచున్నాడు.

యత్ర నైఃశ్రేయసం నామ వనం కామదుఘైర్ద్రుమైః ।
సర్వర్తుశ్రీభిర్విభ్రాజత్కైవల్యమివ మూర్తిమత్ ।। 16

యత్ర = ఎక్కడనైతే, నైఃశ్రేయసం నామ = నైఃశ్రేయసమని ప్రసిద్ధి గాంచిన, వనమ్ = వనము, సర్వ-ఋతుశ్రీభిః = అన్ని ఋతువుల శోభలు గల, కామదుఘైః = కోరికలనీడేర్చే, ద్రుమైః = వృక్షములతో, మూర్తిమత్ = రూపు దాల్చిన, కైవల్యం ఇవ = మోక్షము వలె, విభ్రాజత్ = ప్రకాశించునో.

ఆ వైకుంఠమునందు నైఃశ్రేయసమని ప్రసిద్ధిని గాంచిన వనము గలదు. అది అన్ని ఋతువులకు సంబంధించిన వృక్షముల శోభతో ప్రకాశించుచుండును. కోరికలను వర్షించే ఆ వృక్షములతో ఆ వనము రూపు దాల్చిన మోక్షము వలె నొప్పారుచుండును.

వైమానికాస్సలలనాశ్చరితాని యత్ర
గాయంతి లోకశమలక్షపణాని భర్తుః ।
అంతర్జలేఽనువికసన్మధుమాధవీనాం
గంధేన ఖండితధియోఽప్యనిలం క్షిపంతః ॥ 17

యత్ర = ఎక్కడనైతే, సలలనాః = భార్యలతో గూడిన, వైమానికాః = విమానములలో సంచరించే జనులు, అంతఃజలే = నీటి లోపల, అనువికసత్-మధుమాధవీనామ్ = వికసించి ప్రసరించే తేనెలు గల మాధవీ (పూవుల గురువింద) లతల, గంధేన = సుగంధముచే, ఖండితధియః అపి = విఘ్నము కలిగించబడిన బుద్ధి గలవారే అయిననూ, అనిలమ్ = ఆ గాలిని, క్షిపంతః = నిందించుచున్నవారై, భర్తుః = ప్రభువగు శ్రీహరియొక్క, లోకశమలక్షపణాని = జనుల పాపములను పోగొట్టే, చరితాని = లీలలను, గాయంతి = గానము చేయుచున్నారో.

ఆ వనములో సరస్సునందలి నీటి లోపల మకరందమును వర్షించే మాధవీ లతలు వికసించి తేనెలను ప్రసరింప జేయుచుండును. వాటి పరిమళము బుద్ధియొక్క ఏకాగ్రతకు భంగము కలిగించే అవకాశము గలదు. అయిననూ, తమ భార్యలతో గూడి విమానములలో సంచరించే గంధర్వులు ఆ విధమగు బుద్ధిచాంచల్యమును విడనాడి, ఆ పరిమళమును మోసుకువచ్చే వాయువును నిందించుచుందురు. వారా విధముగా చేయుచూ, ప్రభువగు శ్రీహరియొక్క లీలలను గానము చేయుచుందురు. ఆ గాథలు జనుల హృదయములోని పాపములను నశింపజేయును.

పారావతాన్యభృతసారసచక్రవాక-
దాత్యూహహంసశుకతిత్తిరిబర్హిణాం యః ।
కోలాహలో విరమతేఽచిరమాత్రముచ్చైః

భృంగాధిపే హరికథామివ గాయమానే ॥ 18

పారావత-అన్యభృతసారసచక్రవాకదాత్యూహహంసశుకతిత్తిరిబర్హిణామ్ = పావురము కోకిల బెగ్గురుపక్షి భరతపక్షి హంస చిలుక తీతువు నెమలి అను పక్షులయొక్క, యః = ఏ, కోలాహలః = కోలాహలము గలదో అది, భృంగ-అధిపః = శ్రేష్ఠమగు తుమ్మెద, హరికథాం ఇవ = హరికథను వలె, ఉచ్చైః = బిగ్గరగా, గాయమానే = గానము చేయుచుండగా, అచిరమాత్రమ్ = కొద్ది సేపు మాత్రమే, విరమతే = ఆగిపోవుచున్నది.

ఆ వనములో పావురము కోకిల బెగ్గురుపక్షి భరతపక్షి హంస చిలుక తీతువు నెమలి అనే పక్షులు కోలాహలము చేయుచుండును. కాని, శ్రేష్ఠమగు తుమ్మెద హరికథను గానము చేయుచున్నదా యన్నట్లు ఝుంకారమును చేయుట అరంభించగానే, కనీసము కొద్దిసేపు ఆ పక్షుల కోలాహలము ఆగిపోవును.

మందారకుందకురవోత్పలచంపకార్ణ-
పున్నాగనాగబకులాంబుజపారిజాతాః ।
గంధేఽర్చితే తులసికాభరణేన తస్యా
యస్మింస్తపస్సుమనసో బహు మానయంతి ॥19

యస్మిన్ = ఏ వనమునందు, మందారకుందకురవ-ఉత్పలచంపక-అర్ణపున్నాగనాగవకుల-అంబుజపారిజాతాః = మందారము మల్లె గోరింట కలువ సంపెంగ అర్ణపుష్పము సురపొన్న నాగకేసరము పొగడ పద్మము పారిజాతము అనే, సుమనసః = పుష్పజాతులు, తులసిక-ఆభరణేన = తులసిని అలంకరించుకునే శ్రీహరిచే, తస్యాః = ఆ తులసియొక్క, గంధే = పరిమళము, అర్చితే = ఆదరించబడగా, తపః = తపస్సును, బహు = అధికమని, మానయంతి = ఆదరించుచున్నవో.

శ్రీహరి తులసిని అలంకరించుకొనును. ఆయనకు దాని గంధమునందు ఆదరము మెండు. వైకుంఠమునందలి ఆ వనములో ఉండే మందారము, మల్లె, గోరింట, కలువ, సంపెంగ, అర్ణపుష్పము, సురపొన్న, నాగకే

సరము, పొగడ, పద్మము, పారిజాతము అనే పుష్పజాతులు తులసి చేసు కున్న తపస్సును గొప్పగా కొనియాడుచుండును.

యత్సంకులం హరిపదానతిమాత్రదృష్టైః
వైదూర్యమారకతహేమమయైర్విమానైః ।
యేషాం బృహత్కటితటాస్స్మితశోభిముఖ్యః
కృష్ణాత్మనాం న రజ ఆదధురుత్స్మయాద్యైః॥20

యత్ = ఏ వైకుంఠము, హరిపద-అనతిమాత్రదృష్టైః = శ్రీహరి యొక్క పాదములకు చేయబడే నమస్కారముచే మాత్రమే చూడబడే, వైదూర్యమారకతహేమమయైః = వైడూర్యములు పచ్చలు మరియు బంగా రము అనువాటితో నిండియుండే, విమానైః = విమానములచే, సంకులమ్ = రద్దీగా నుండునో, బృహత్కటితటాః = విశాలమగు కటిభాగములు గల, స్మితశోభిముఖ్యః = చిరునవ్వుతో ప్రకాశించే ముఖములు గల స్త్రీలు, యేషామ్ = ఏ, కృష్ణ-ఆత్మనామ్ = శ్రీహరియే మనస్సులయందు గల జనులకు, ఉత్స్మయ-ఆద్యైః = పరిహాసము మొదలగు వాటిచే, రజః = రజోగుణమునుండి పుట్టే కామవికారమును, న ఆదధుః = కలిగించలేరో.

వైదూర్యములు, పచ్చలు మరియు బంగారము అనువాటితో నిండియున్న విమానములతో ఆ వైకుంఠము రద్దీగా నుండును. కేవలము శ్రీహరియొక్క పాదములకు ప్రణమిల్లిన వారికి మాత్రమే వాటిని చూచే భాగ్యము కలుగును. ఆ విమానములలో అధిరోహించే జనుల హృదయ ములో శ్రీహరి సర్వదా నిలిచియుండును. కావుననే, విశాలమగు కటిభాగ ములు కలిగి చిరునవ్వుతో శోభిల్లే ముఖములు గల స్త్రీలు కూడ పరిహా సము మొదలగు వాటిచే వారి మనస్సులలో రజోగుణమునుండి పుట్టే కామవికారములను కలిగించలేరు.

శ్రీ రూపిణీ క్వణయతీ చరణారవిందం
లీలాంబుజేన హరిసద్మని ముక్తదోషా ।
సంలక్ష్యతే స్ఫటికకుడ్య ఉపేతహేమ్ని

సమ్మార్జతీవ యదనుగ్రహణేऽన్యయత్నః ॥ 21

రూపిణీ = సుందరియగు, శ్రీః = లక్ష్మీదేవి, స్ఫటికకుడ్యే = స్ఫటిక మయములగు గోడలు గల, ఉపేతహేమ్ని = జతగూడిన బంగారము గల, హరిసద్మని = శ్రీహరియొక్క నివాసగృహమునందు, ముక్తదోషా = విడిచిపెట్టబడిన చాంచల్యము అనే దోషము గలదై, చరణ-అరవిందమ్ = పద్మము వంటి పాదమును, క్వణయతీ = గణగణ మ్రోయించుచున్నదై, లీలా-అంబుజేన = విలాస కొరకైన పద్మముతో, సమ్మార్జతీవ = ఊడ్చుచున్నది వలె నున్నది, యత్-అనుగ్రహణే = ఏ లక్ష్మీదేవియొక్క అనుగ్రహమును పొందుటయందు, అన్యయత్నః = ఇతరుల ప్రయత్నము గలదో.

శ్రీహరియొక్క నివాసము బంగారముతో నిర్మించబడినది. దాని లోని గోడలు స్ఫటికమయములు. సుందరియగు లక్ష్మీదేవి ఆ ప్రాసాదము నందు తన చాంచల్యదోషమును విడిచిపెట్టి (స్థిరముగా నున్నదై), కాలి నూపురముల మువ్వలు గణగణలాడుచుండగా ఇటునటు సంచరించుచుం డును. ఆమె చేతిలో విలాస కొరకై పద్మమును ధరించియుండును. ఆమె తిరుగుచున్నప్పుడు గోడలో ప్రతిబింబము పడి, ఆమె పద్మముతో నేలను ఊడ్చుచున్నదా యనిపించును. ఆమె అనుగ్రహము కొరకై జగత్తులోని ఇతరులు ప్రయత్నించుచుందురు.

వాపీషు విద్రుమతటాస్వమలామృతాప్సు
ప్రేష్యాన్వితా నిజవనే తులసీభిరీశమ్ ।
అభ్యర్చతీ స్వలకమున్నసమీక్ష్య వక్త్ర-
ముచ్ఛేషితం భగవతేత్యమతాంగ యచ్ఛ్రీః ॥22

అంగ = ఓ దేవతలారా!, యత్ = ఏ వైకుంఠమునందు, ప్రేష్యా-అన్వితా = పరిచారికలతో కూడియున్న, శ్రీః = లక్ష్మీదేవి, నిజవనే = తన ఉద్యానమునందు, తులసీభిః = తులసీ దళములతో, ఈశమ్ = శ్రీహరిని, అభ్యర్చతీ = శ్రద్ధగా పూజించుచున్నదై, విద్రుమతటాసు = పగడముల గట్టులు గల, అమల-అమృత-అప్సు = స్వచ్ఛమైన అమృతమువంటి నీరు (అమృతమే నీరుగా) గల, వాపీషు = దిగుడు బావులయందు, స్వలకమ్ =

అందమైన కేశములు గల, ఉత్-నసమ్ = ఎత్తైన ముక్కు గల, వక్త్రమ్ = ముఖమును, ఈక్ష్య = చూచి, భగవతా = శ్రీహరి భగవానునిచే, ఉచ్ఛ్వషితమ్ = చుంబించబడినది, ఇతి = అని, అమత = తలచెనో.

ఓ ప్రియమైన దేవతలారా! ఆ వైకుంఠమునందు లక్ష్మీదేవి తన పరిచారికలతో గూడి తన ఉద్యానవనమునందు తులసీ దళములతో శ్రీహరి భగవానుని శ్రద్ధతో అర్చించుచుండెను. ఆ వనములో అమృతము వంటి నీరు (అమృతమే నీరుగా) గల దిగుడు బావులు గలవు. వాటి గట్లు పగడములతో కూర్చబడి యుండెను. ఆమె అందమైన ముంగురులతో మరియు ఎత్తైన ముక్కుతో గూడియున్న తన ముఖమును ఆ నీటిలో చూచి, శ్రీహరి తనను చుంబించుటను స్మరించెను.

యన్న వ్రజంత్యఘభిదో రచనానువాదా-
చ్ఛృణ్వంతి యేఽన్యవిషయాః కుకథా మతిఘ్నీః ।
యాస్తు శ్రుతా హతభగైర్నృభిరాత్తసారాః
తాంస్తాన్ క్షిపంత్యశరణేషు తమస్సు హంత ॥23

యే = ఎవరైతే, అఘభిదః = పాపములను పోనాడే శ్రీహరియొక్క, రచనా-అనువాదాత్ = సృష్టి అనే లీలయొక్క వర్ణనము కంటె, అన్యవిషయాః = ఇతరములగు విషయములు గల, మతిఘ్నీః = బుద్ధిని వినాశము చేసే, కుకథాః = చెడు ప్రసంగములను, శృణ్వంతి = వినెదరో వారు, యత్ = ఏ వైకుంఠమును, న వ్రజంతి = పొందరో, హంత = అయ్యో!, ఆత్తసారాః = తీసివేయబడిన సారము గల, యాః తు = ఏ ప్రసంగములైతే, హతభగైః = నశించిన భాగ్యము గల, నృభిః = మానవులచే, శ్రుతాః = వినబడినవై, తాన్ తాన్ = వారిని వారిని, అశరణేషు = రక్షించే వారు లేని, తమస్సు = నరకములయందు, క్షిపంతి = పారవేయుచున్నవో.

మందభాగ్యులగు జనులు పాపములను పోనాడే శ్రీహరియొక్క జగద్రచన మొదలగు లీలలను వినరు. వారు నిస్సారములగు ఇతరవిషయములతో కూడి బుద్ధిని వినాశము చేసే చెడు ప్రసంగములను వినుచుందు

రు. వారా వైకుంఠమును పొందలేరు. అయ్యో! ఆ ప్రసంగములు వారిని నరకములలోనికి త్రోసివేయును. అచట వారిని రక్షించువారు ఉండరు.

యేఽభ్యర్థితామపి చ నో నృగతిం ప్రపన్నా
జ్ఞానం చ తత్త్వవిషయం సహధర్మ యత్ర ।
నారాధనం భగవతో వితరంత్యముష్య
సంమోహితా వితతయా బత మాయయా తే ।। 24

నః అపి = మాకు కూడ, అభ్యర్థితామ్ = కోరబడే, నృగతిమ్ = మనుష్యజన్మను, యే = ఎవరైతే, ప్రపన్నాః చ = పొందినారో, యత్ర = ఏ మనుష్యజన్మయందు, సహధర్మ = ధర్మముతో కూడిన, తత్త్వవిషయమ్ = యథార్థవస్తువునకు సంబంధించిన, జ్ఞానమ్ = జ్ఞానము గలదో, భగవతః = శ్రీహరి భగవానుని, ఆరాధనమ్ = ఆరాధనను, న వితరంతి = చేయరో, తే = వారు, అముష్య = ఈ భగవానుని, వితతయా = విస్తృతమగు, మాయయా = మాయచే, సంమోహితాః = మోహింప జేయబడుదురు, బత = అయ్యో!

మనుష్యజన్మలో ధర్మమునాచరించుటకు, యథార్థవస్తువు అగు బ్రహ్మయొక్క జ్ఞానమును పొందుటకు అవకాశము గలదు. కావుననే, మేము (బ్రహ్మ మొదలగు దేవతలు) కూడ దానిని కోరుచుందుము. కాని, అయ్యో! ఎవరైతే అట్టి మానవజన్మను పొందియు శ్రీహరి భగవానుని ఆరాధించరో, వారు ఆ భగవానుని విస్తృతమగు మాయచే మోహింప జేయబడుదురు.

యచ్చ వ్రజంత్యనిమిషామృషభానువృత్త్యా
దూరేయమా హ్యుపరి నస్స్పృహణీయశీలాః ।
భర్తుర్మిథస్సుయశసః కథనానురాగ-
వైక్లబ్యబాష్పకలయా పులకీకృతాంగాః ।। 25

అనిమిషామ్ = దేవతలలో, ఋషభ-అనువృత్త్యా = శ్రేష్ఠుడగు శ్రీహరిని సర్వదా స్మరించుటచే, దూరేయమాః = యముడు దూరముగా

నున్నవారు, నః = మాకు కూడ, ఉపరి = పైన, స్పృహణీయశీలాః = కోరదగిన శీలము గలవారు, మిథః = వారిలో వారు, భర్తుః = ప్రభువగు శ్రీహరి యొక్క, సుయశసః = పవిత్రమగు కీర్తియొక్క, కథన-అనురాగవైక్లబ్యబాష్పకలయా = కీర్తనమునందలి ప్రేమచే కలిగిన విహ్వలతచే కలిగే కన్నీటితో, పులకీకృత-అంగాః = పులకాంకురములు గల అవయవములు గలవారు, యత్ చ = ఏ వైకుంఠమును, వ్రజంతి = పొందుచున్నారో.

భక్తులు దేవాధిదేవుడగు శ్రీహరిని సర్వదా స్మరిస్తూ మృత్యువును అధిగమించెదరు. వారు బ్రహ్మాది దేవతల కంటె కూడ ఉత్కృష్టమైనవారు. దేవతలు కూడ వారి శీలము వంటి శీలము తమకు ఉండవలెనని కోరుచుందురు. వారిలో వారు శ్రీహరి ప్రభుని పవిత్రమగు కీర్తిని గానము చేసి దాని వలన ఉదయించిన ప్రేమచే మనస్సులో విహ్వలురై కన్నుల వెంబడి నీటిని గార్చుచూ శరీరమంతయు గగుర్పాటును పొందెదరు. అట్టి భక్తులు ఆ వైకుంఠమును పొందెదరు.

తద్విశ్వగుర్వధికృతం భువనైకవంద్యం
దివ్యం విచిత్రవిబుధాగ్ర్యవిమానశోచిః ।
ఆపుః పరాం ముదమపూర్వముపేత్య
యోగమాయాబలేన మునయస్తదథో వికుంఠమ్ ॥ 26

విశ్వగురు-అధికృతమ్ = జగత్తునకు తండ్రియగు శ్రీహరిచే అధిష్ఠించబడినది, భువన-ఏకవంద్యమ్ = భువనములలో ముఖ్యముగా నమస్కరించబడునది, దివ్యమ్ = అప్రాకృతమైనది, విచిత్రవిబుధ-అగ్ర్యవిమానశోచిః = రంగు రంగుల దేవశ్రేష్ఠుల విమానముల ప్రకాశము గలది, అపూర్వమ్ = ఇంతకు ముందు చూడబడనిది అగు, వికుంఠమ్ = వైకుంఠమును, మునయః = సనకాది మహర్షులు, యోగమాయాబలేన = యోగశక్తియొక్క ప్రభావముచే, ఉపేత్య = చేరుకొని, అథో = తరువాత, పరామ్ = సర్వోత్కృష్టమగు, ముదమ్ = ఆనందమును, ఆపుః = పొందిరి.

సకలభువనములలోని జనులచే నమస్కరించబడే అప్రాకృతమగు వైకుంఠమునందు జగత్తునకు తండ్రియగు శ్రీహరి నివసించియుండును.

అచట దేవశ్రేష్ఠుల రంగు రంగుల విమానములు ప్రకాశించుచుండును. సనకాది మహర్షులు ఇదివరలో వైకుంఠమును చూచియుండలేదు. వారు యోగశక్తియొక్క మహిమచే అక్కడకు చేరి మహానందమును పొందిరి.

తస్మిన్నతీత్య మునయష్షడసజ్జమానాః
కక్షాస్సమానవయసావథ సప్తమాయామ్ ।
దేవావచక్షత గృహీతగదౌ పరార్ధ్య-
కేయూరకుండలకిరీటవిటంకవేషౌ ॥ 27

తస్మిన్ = ఆ వైకుంఠమునందు, మునయః = సనకాది మహర్షులు, షట్ = ఆరు, కక్షాః = ప్రాకారద్వారములను, అతీత్య = దాటి, అసజ్జమానాః = (వైకుంఠముయొక్క శోభను తిలకించుటయందు) ఆసక్తిని చూపనివారై (అడ్డుకొనబడని వారై), అథ = తరువాత, సప్తమాయామ్ = ఏడవ ద్వారమునందు, సమానవయసౌ = సమానమగు వయస్సు గలవారు, గృహీతగదౌ = పట్టుకొనబడిన గదలు గలవారు, పరార్ధ్యకేయూరకుండలకిరీటవిటంకవేషౌ = మిక్కిలి విలువైన బాహుపురులు కుండలములు కిరీటములు అను ఆభరణములచే సుందరమైన వేషములు గలవారు అగు, దేవౌ = దేవతలను ఇద్దరినీ, అచక్షత = చూచిరి.

ఆ సనకాది మహర్షులు ఆరు ప్రాకారద్వారములను దాటిరి. వారు శ్రీహరిని దర్శించవలెననే ఉత్కంఠచే వైకుంఠశోభను దర్శించుటలో ఆసక్తిని చూపకుండిరి. వారిని ఆరు ద్వారముల వద్ద ద్వారపాలకులు అడ్డుకొనలేదు. తరువాత వారు ఏడవ ద్వారము వద్ద గదలను పట్టుకొని పహరా కాయుచున్న ఇద్దరు దేవతలను చూచిరి. సమానమగు వయస్సు గల వారిద్దరు మిక్కిలి విలువైన బాహుపురులు కుండలములు కిరీటములు అనే ఆభరణములను సుందరమగు వేషములను దాల్చియుండిరి.

మత్తద్విరేఫవనమాలికయా నివీతౌ
విన్యస్తయాసితచతుష్టయబాహుమధ్యే ।
వక్త్రం భ్రువా కుటిలయా స్ఫుటనిర్గమాభ్యాం

రక్తేక్షణేన చ మనాగ్రభసం దధానౌ ॥ 28

అసితచతుష్టయబాహుమధ్యే = నీలవర్ణము గల నాలుగు బాహువుల మధ్యయందు, విన్యస్తయా = ఉంచబడిన, మత్తద్విరేఫవనమాలికయా = మదించిన తుమ్మెదలు గల వనమాలచే, నివీతౌ = కంఠమునందు అలంకరించబడినవారు, కుటిలయా = వంకరగానున్న, భ్రువా = కనుబొమచే, స్ఫుటనిర్గమాభ్యామ్ = ఉబ్బియున్న ముక్కుపుటములచే, చ = మరియు, రక్త-ఈక్షణేన = ఎర్రని కన్నుతో, మనాక్ = కొంచెము, రభసమ్ = క్షోభను కలిగియున్న, వక్త్రమ్ = ముఖమును, దధానౌ = ధరించియున్నవారు (అగు ద్వారపాలకులనిద్దరిని వారు చూచిరి).

ఆ ద్వారపాలకులిద్దరు మదించిన తుమ్మెదలను తన వద్దకు ఆకర్షించుచున్న వనమాలను నీలవర్ణము గల నాలుగు భుజముల మధ్యలో వచ్చునట్లుగా మెడలో ధరించిరి. ముడివడిన కనుబొమలతో, ఉబ్బియున్న ముక్కుపుటములతో, ఎర్రని కన్నులతో కూడియున్న వారి ముఖములలో కొంచెము చికాకు కనబడుచుండెను.

ద్వార్యేతయోర్నివివిశుర్మిషతోరపృష్ట్వా
పూర్వా యథా పురటవజ్రకపాటికా యాః ।
సర్వత్ర తేఽవిషమయా మునయస్స్వదృష్ట్యా
యే సంచరంత్యవిహతా విగతాభిశంకాః ॥ 29

ఏతయోః = వీరిద్దరు, మిషతోః = చూచుచుండగా, అపృష్ట్వా = అడుగకుండగా, యాః = ఏ, పూర్వాః = గడచిపోయిన, పురటవజ్రకపాటికాః యథా = బంగారము పొదిగిన వజ్రపు ద్వారములు గలవో వాటిని వలె, తే = ఆ, మునయః = మహర్షులు, నివివిశుః = ప్రవేశించిరి, యే = ఏ మునులు, అవిహతాః = అడ్డు లేని వారై, అవిషమయా = తేడాలు లేని, స్వదృష్ట్యా = తమ చూపు కారణముగా, విగత-అభిశంకాః = తొలగిన శంక గలవారై, సర్వత్ర = అంతటా (అన్ని కాలములలో), సంచరంతి = సంచరించెదరో.

ఆ ద్వారములన్నియు బంగారముతో చేసినవే. వాటియందు వజ్రములు పొదగబడి యుండెను. ఆ సనకాది మహర్షులు తమను చూచు

చున్న ఆ ఇద్దరు ద్వారపాలకులను లెక్కచేయకుండగా, వారి అనుమతి కొరకు ఎదురు చూడకుండగా ఆ ద్వారము లోపల ప్రవేశించిరి. వారు ముందటి ఆరు ద్వారములను కూడ అదే విధముగా దాటి వచ్చిరి. ఆ మహర్షులు సర్వత్ర సమదృష్టి గలవారు. వారు ఏ కాలమునందైననూ శంకను ఎరుగరు. వారిని ఎవ్వరైననూ అడ్డుకొనరు. వారు అంతటా అదే విధముగా సంచరించుచుందురు.

తాన్వీక్ష్య వాతరశనాంశ్చతురః కుమారాన్
వృద్ధాన్ దశార్ధవయసో విదితాత్మతత్త్వాన్ ।
వేత్రేణ చాస్ఖలయతామతదర్హణాంస్తౌ
తేజో విహస్య భగవత్ప్రతికూలశీలౌ ॥ 30

భగవత్-ప్రతికూలశీలౌ = శ్రీహరి భగవానునకు విరుద్ధమగు స్వభావము గల, తౌ = వారిద్దరు, వాతరశనాన్ = వాయువు మాత్రమే వస్త్రముగా గలవారు (దిగంబరులు), వృద్ధాన్ = పెద్దవారే అయినా, దశ-అర్ధవయసః = అయిదు సంవత్సరముల వయస్సు గలవారివలె కన్పట్టుచున్నవారు, విదిత-ఆత్మతత్త్వాన్ = తెలియబడిన ఆత్మతత్త్వము గలవారు, అతదర్హణాన్ = అట్లు అడ్డుకొనుటకు తగనివారు అగు, తాన్ = ఆ, చతురః = నలుగురు, కుమారాన్ = సనత్కుమారుడు మొదలగు మహర్షులను, వీక్ష్య = చూచి, తేజః = తేజస్సును, విహస్య = పరిహసించి, చ = మరియు, వేత్రేణ = బెత్తముతో, అస్ఖలయతామ్ = అడ్డుకొనిరి.

ఆ సనకాది మహర్షులు నలుగురు దిగంబరులు. వారు పెద్దవారే అయినా అయిదు సంవత్సరముల బాలకులవలె కన్పట్టుచుండిరి. వారు ఆత్మతత్త్వమునెరింగిన వారు. వారిని అడ్డుకొనుట ద్వారపాలకులకు తగదు. కాని, ఆ ద్వారపాలకులిద్దరు శ్రీహరి భగవానునకు విరుద్ధమైన స్వభావము గలవారగుటచే, ఆ మహర్షుల తేజస్సును పొగరుమోతుతనముగా భావించి వారిని పరిహసించి, బెత్తముతో వారిని అడ్డగించిరి.

తాభ్యాం మిషత్స్వనిమిషేషు నిషిధ్యమానాః
స్వర్హత్తమా హ్యపి హరేః ప్రతిహారపాభ్యామ్ ।

ఊచుస్సుహృత్తమదిదృక్షితభంగ ఈషత్
కామానుజేన సహసా త ఉపప్లుతాక్షాః ॥ 31

తే = ఆ మహర్షులు, సు-అర్హత్తమాః అపి = పూజకు ఎంతయూ అర్హులే అయినప్పటికీ, అనిమిషేషు = దేవతలు, మిషత్సు = చూచుచుండ గా, హరేః = శ్రీహరియొక్క, ప్రతిహారపాభ్యామ్ = ద్వారపాలకులగు, తాభ్యామ్ = వారిద్దరిచే, నిషిధ్యమానాః = అడ్డుకొనబడుచున్నవారై, సుహృ త్తమదిదృక్షితభంగే= అతిశయించిన ప్రీతికి భాజనమగు శ్రీహరిని చూడా లనే కోరికకు భంగము కలుగగా, ఈషత్ = కొంచెము, కామ-అనుజేన = కామమును అంటిపెట్టుకొని ఉండే క్రోధముచే, సహసా = వెంటనే, ఉపప్లుత -అక్షాః = వ్యాపించబడిన కన్నులు గలవారై, ఊచుః = పలికిరి.

ఆ మహర్షులు మర్యాదకు ఎంతయూ తగినవారు. కాని వైకుంఠ మునందలి ఇతరదేవతలు చూచుచుండగా, శ్రీహరియొక్క ద్వారమునకు కాపలా కాసే వారిద్దరు వారిని అడ్డుకొనినారు. తమకు అత్యంతప్రీతిపాత్రు డగు భగవానుని దర్శించవలెననే ఆ మహర్షుల కోరికకు ఆ విధముగా భంగము కలిగెను. కామమును అంటిపెట్టుకొని ఉండే కోపము వారిలో కొద్దిగా ప్రవేశించెను. వారి కన్నులలో ఆ కోపము వ్యాపించుచుండెను. వారు అపుడు ఇట్లు పలికిరి.

మునయ ఊచుః ।
కో వామిహైత్య భగవత్పరిచర్యయోచ్చైః
తద్ధర్మిణాం నివసతాం విషమస్స్వభావః ।
తస్మిన్ ప్రశాంతపురుషే గతవిగ్రహే వాం
కో వాఽఽత్మవత్కుహకయోః పరిశంకనీయః ॥ 32

ఉచ్చైః = ఉన్నతమగు, భగవత్-పరిచర్యయా = భగవానుని సేవ చే, ఏత్య = వచ్చి, ఇహ = ఇచట, నివసతామ్ = నివసించుచున్న, తత్-ధ ర్మిణామ్ = ఆ భగవానుని ధర్మములు గల, వామ్ = మీకిద్దరికీ, విషమః = విరుద్ధమగు, స్వభావః = స్వభావము, కః = ఎట్టిది?, ప్రశాంతపురుషే = ప్రశాంతస్వభావము గల పూర్ణుడైన, గతవిగ్రహే = తొలగిన విరోధము గల,

తస్మిన్ = ఆ భగవానునియందు, కుహకయోః = కుటిలమగు చిత్తము గల, వామ్ = మీకిద్దరికీ, ఆత్మవత్ = తమ వలె, పరిశంకనీయః = శంకించ దగిన వాడు, కః వా = ఎవడు గలడు?

మునులు ఇట్లు పలికిరి --- మీరు భగవానుని గొప్పగా ఆరాధించి ఇచటకు వచ్చి నివసించుచున్నారు. కావున, మీయందు ఆ భగవానుని ధర్మములుండదగును. భగవానుడు సమదర్శి. కాని మీరు దానికి విరుద్ధ మగు విషమస్వభావమును కలిగియున్నారు. ఇది మీకు ఎట్లు కలిగినది? పూర్ణుడగు ఆ భగవానుడు పరమశాంతస్వరూపుడు. ఆయనయందు కల హము లేనే లేదు. అట్టి స్థితిలో, శంకించదగిన వారు ఇచట ఎవరు గలరు? మీరిద్దరు కపటస్వభావము గలవారు. కావుననే, మీరు ఇతరులయందు దోషమును చూచి శంకించుచున్నారు.

న హ్యంతరం భగవతీహ సమస్తకుక్షా-
వాత్మానమాత్మని నభో నభసీవ ధీరాః ।
పశ్యంతి యత్ర యువయోస్సురలింగినోః కిం
వ్యుత్పాదితం హ్యుదరభేది భయం యతోఽస్య ॥ 33

ఇహ = ఈ వైకుంఠమునందు, సమస్తకుక్షౌ = సకలవిశ్వము తన ఉదరమునందు గల, ఆత్మని = ఆత్మస్వరూపుడగు, యత్ర = ఏ, భగవతి = భగవానునియందు, ఆత్మానమ్ = ఆత్మను, నభసి = ఆకాశమునందు, నభః ఇవ = ఆకాశమును వలె, ధీరాః = జ్ఞానులు, అంతరమ్ = భేదమును, న పశ్యంతి హి = చూడరు గదా!, సురలింగినోః = దేవతల వేషము గల, యువయోః = మీకిద్దరికి, అస్య = ఈ పరమేశ్వరునకు, ఉదరభేది = దేహ మునకు హాని కలుగుననే (అల్పమైననూ భేదము గల), భయమ్ = భయ ము, యతః = ఏ కారణము వలన, వ్యుత్పాదితమ్ = అధికముగా శంకించ బడినదో అది, కిమ్ = ఏది?

సకలవిశ్వము భగవానుని ఉదరమునందు గలదు. ఆయన సకల ప్రాణులలో ఆత్మరూపముగా నున్నాడు. జ్ఞానులు ఆ పరమేశ్వరుని ఆత్మ రూపునిగా దర్శించి, ఘటాకాశమును మహాకాశమునందు వలె, తమ జీవ

భావమును ఆయనయందు విలీనము చేసెదరు. వారు తమ యథార్థస్వ రూపమునకు ఈశ్వరునకు మధ్యలో భేదమును చూడరు. మీరు ఈ వైకుం ఠములో దేవతల వేషములను దాల్చియున్నారు. ఇతరులెవరో వచ్చి అట్టి ఆ భగవానుని దేహమునకు హాని కలిగించెదరేమో యని మీరు శంకించి భయపడుచున్నారు. అల్పమైననూ భేదమును దర్శించినచో, భయము కలుగును. మీకు ఈ శంక ఎక్కడనుండి వచ్చినది? మీకీ భయము కలుగు టకు కారణమేమి?

తద్వామముష్య పరమస్య వికుంఠభర్తుః
కర్తుం ప్రకృష్టమిహ ధీమహి మందధీభ్యామ్ ।
లోకానితో వ్రజతమంతరభావదృష్ట్యా
పాపీయసస్త్రయ ఇమే రిపవోఽస్య యత్ర ॥ 34

తత్ = అందువలన, వికుంఠభర్తుః = వైకుంఠాధిపతి (సత్త్వగుణప్ర ధానమగు బుద్ధికి అధీక్షకుడు) యగు, అముష్య = ఈ, పరమస్య = పరబ్ర హ్మయగు శ్రీహరికి చెందిన, మందధీభ్యామ్ = మందబుద్ధి గల, వామ్ = మీ కొరకు, ప్రకృష్టమ్ = ఉన్నతిని, కర్తుమ్ = చేయుట కొరకై, ఇహ = ఈ సమయములో, ధీమహి = భావించుచున్నాము, అంతరభావదృష్ట్యా = భేద భావమును దర్శించుటచే, ఇతః = ఇక్కడనుండి, పాపీయసః = పాపభూయి ష్ఠమగు, లోకాన్ = లోకములను గురించి (జన్మల గురించి), వ్రజతమ్ = వెళ్లుడు, యత్ర = ఏ లోకములయందు, అస్య = ఈ జీవునకు, ఇమే = ఈ, త్రయః = ముగ్గురు, రిపవః = శత్రువులు గలరో.

వైకుంఠాధిపతియగు ఈ శ్రీహరి సత్త్వగుణప్రధానమగు బుద్ధికి అధ్యక్షుడై ఆత్మస్వరూపముగా వెలుగొందే పరబ్రహ్మ. కాని, మందబుద్ధులగు మీరు ఆయనకు భయమును శంకించుచున్నారు. కావున, మీకు గొప్ప మంగళమును చేయవలెనని మేము ఈ సందర్భములో భావించుచున్నా ము. మీరు భేదదృష్టిని కలిగియున్న కారణముగా, ఈ వైకుంఠమును వదిలి పాపభూయిష్ఠమగు లోకములను (యోనులను) పొందుడు. అచట జీవు లకు కామక్రోధలోభములనే ముగ్గురు శత్రువులు గలరు.

తేషామితీరితముభావవధార్య ఘోరం
తం బ్రహ్మదండమనివారణమస్త్రపూగైః ।
సద్యో హరేరనుచరావురు బిభ్యతస్తత్-
పాదగ్రహావపతతామతికాతరేణ ॥ 35

తేషామ్ = ఆ మహర్షుల, ఇతి = ఈ విధమగు, ఈరితమ్ = వచన రూపమగు, అస్త్రపూగైః = అస్త్రముల సమూహముచే, అనివారణమ్ = నివారింప శక్యము కాని, తమ్ = ఆ, ఘోరమ్ = భయంకరమగు, బ్రహ్మ దండమ్ = బ్రాహ్మణశాపమును, అవధార్య = విని, ఉభౌ = వారిద్దరు, (బి భ్యతః = భయపడే), హరేః = శ్రీహరియొక్క, అనుచరౌ = సేవకులు, ఉరు = అధికముగా, బిభ్యతః = భయపడుచున్నవారై (భయపడిరి), సద్యః = వెనువెంటనే, అతికాతరేణ = అతిశయించిన దైన్యముతో, తత్-పాదగ్రహౌ = వారి పాదములను పట్టుకున్నవారై, అపతతామ్ = నేలపై బడిరి.

ఆ మహర్షులు ఈ విధముగా పలికిరి. వారి వాక్కుల రూపములో నున్న భయంకరమగు ఆ బ్రహ్మదండము (బ్రాహ్మణశాపము) ను ఎన్ని అస్త్రములైననూ నివారించలేవు. బ్రహ్మదండమునకు సాక్షాత్తు శ్రీహరి కూడ భయపడును. శ్రీహరియొక్క అనుచరులగు వారిద్దరు ఆ మహర్షుల శాపమును విని చాల భయపడిరి. వారు వెంటనే అతిశయించిన దైన్య ముతో నేలపై బడి వారి పాదములను పట్టుకొనిరి.

భూయాదఘోని భగవద్భిరకారి దండో
యో నౌ హరేత సురహేలనమప్యశేషమ్ ।
మా వోఽనుతాపకలయా భగవత్స్మృతిఘ్నో
మోహో భవేదిహ తు నౌ వ్రజతోరధోఽధః ॥ 36

అఘోని = అపరాధియందు, భగవద్భిః = పూజ్యులగు మీచే, దండః = శిక్ష, అకారి = వేయబడినది, భూయాత్ = అది అటులనే యగు గాక!, యః = ఏ దండము, నౌ = మా ఇద్దరి, సురహేలనం అపి = దేవత లగు మిమ్ములను పరిహసించుట వలన కలిగిన దోషమును కూడ, అశే షమ్ = పూర్తిగా, హరేత = పోగొట్టునో, తు = కాని, వః = మీయొక్క, అను

తాపకలయా = ఇబ్బందియొక్క లేశముచే, అధః అధః = అధమయోనిలోని కి, ప్రజతః = పోవుచున్న, నౌ = మా ఇద్దరికి, ఇహ = ఈ అధమయోనియం దు, భగవత్-స్మృతిఘ్నః = భగవంతుని స్మరణమునకు విఘాతము కలిగించే, మోహః = మోహము, మా భవేత్ = కలుగకుండు గాక!

అపరాధికి పూజ్యులగు మీరు శిక్షను విధించితిరి. అది అటులనే యగుగాక! మేము దేవతలమగు మిమ్ములను పరిహసించితిమి. మీరు విధించిన శిక్షను అనుభవించుట వలన ఆ దోషము పూర్తిగా దూరమగును. మేమిపుడు ఇక్కడనుండి అధమయోని లోనికి పోవుచున్నాము. మేము మీకు క్లేశమును కలిగించితిమి. ఆ పాపములో లేశమైననూ మాకు ఈ అధమయోనిలో భగవంతుని స్మరణమునకు విఘాతము కలిగించే మోహమును ఈయగలదు. కాని, మాకు అట్లు కారాదని కోరుచున్నాము.

ఏవం తదైవ భగవానరవిందనాభః
స్వానాం విబుధ్య సదతిక్రమమార్యహృద్యః ।
తస్మిన్ యయౌ పరమహంసమహామునీనా-
మన్వేషణీయచరణౌ చలయన్ సహశ్రీః ॥ 37

ఏవమ్ = ఈ విధముగా, స్వానామ్ = తన సేవకుల, సత్-అతిక్రమమ్ = మహాత్ములను అధిక్షేపించుటను, తదా ఏవ = అదే సమయము లో, విబుధ్య = తెలుసుకొని, ఆర్యహృద్యః = మహాత్ముల హృదయములో నివసించే, అరవిందనాభః = పద్మము నాభియందు గల, భగవాన్ = శ్రీహరి భగవానుడు, సహశ్రీః = లక్ష్మీదేవితో కూడినవాడై, పరమహంసమహామునీనామ్ = పరమహంసలగు మహర్షులకు, అన్వేషణీయచరణౌ = ధ్యానించదగిన పాదములను, చలయన్ = కదల్చుచున్నవాడై, తస్మిన్ = ఆ స్థానము నందు, యయౌ = వెళ్లెను.

ఈ విధముగా తన సేవకులు మహాత్ములగు సనకాదుల విషయములో అపరాధమును చేసినారనే విషయమును పద్మనాభుడగు శ్రీహరి భగవానుడు అదే క్షణములో తెలుసుకొనెను. వెంటనే మహాత్ముల హృదయములలో నిలిచియుండే ఆయన లక్ష్మీదేవితో గూడి అచటకు నడచి

వచ్చెను. పరమహంస (ఆత్మజ్ఞాని) లగు మహర్షులు తమ ధ్యానములో ఆయన పాదములను అన్వేషించుచుందురు.

తం త్వాగతం ప్రతిహృతౌపయికం స్వపుంభిః
తేఽచక్షతాక్షవిషయం స్వసమాధిభాగ్యమ్ ।
హంసశ్రియోర్వ్యజనయోశ్శివవాయులోల-
చ్ఛుభ్రాతపత్రశశికేసరశీకరాంబుమ్ ॥ 38

తే తు = ఆ మహర్షులైతే, ఆగతమ్ = వచ్చినట్టియు, స్వపుంభిః = తన సేవకులచే, ప్రతిహృత-ఔపయికమ్ = తీసుకువచ్చి సమర్పించబడిన పూజాసాధనములు గలిగినట్టియు, అక్షవిషయమ్ = కన్నులకు గోచరమైనట్టియు, స్వసమాధిభాగ్యమ్ = తమ సమాధియొక్క భాగ్యము అయినట్టియు, హంసశ్రియోః = హంసల శోభ గల, వ్యజనయోః = రెండు వింజామరలయొక్క, శివవాయులోలత్-శుభ్ర-ఆతపత్రశశికేసరశీకర-అంబుమ్ = మంగళకరమగు వాయువుచే కదలాడే స్వచ్ఛమగు చంద్రునివంటి గొడుగుయొక్క వ్రేలాడే పూసలనుండి పడుచున్న నీటి బిందువులు గల, తమ్ = ఆ శ్రీహరిని, అచక్షత = చూచిరి.

సేవకులు పూజాద్రవ్యములను వెంట గొనిరాగా శ్రీహరి అచటకు వచ్చి ఆ మహర్షులకు కనబడెను. వారు చేసిన సమాధియోగము రూపుకట్టి వారి ముందు నిలబడెను. ఆయనకు ఇరువైపులా రాజహంసలను బోలియున్న వింజామరలు వీచబడుచుండెను. ఆయన శిరస్సుపై చంద్రునివలె ప్రకాశించే గొడుగు పట్టబడెను. వింజామరలనుండి వచ్చే మంగళకరమగు వాయువుచే ఆ గొడుగు కొనలనుండి వ్రేలాడే ముత్యాల సరాలు కదలి చంద్రుని వెన్నెలలనే అమృతకణములు ఆయనపై పడుచున్నవాయన్నట్లు భాసించెను.

కృత్స్నప్రసాదసుముఖం స్పృహణీయధామ
స్నేహావలోకకలయా హృది సంస్పృశంతమ్ ।
శ్యామే పృథావురసి శోభితయా శ్రియా స్వ-

శ్చూడామణిం సుభగయంతమివాత్మధిష్ణ్యమ్ ॥ 39

కృత్స్నప్రసాదసుముఖమ్ = అందరినీ అనుగ్రహించుటయందు సుముఖముగా నున్నట్టియు, స్పృహణీయధామ = కోరదగిన గుణములకు నిలయమైనట్టియు, స్నేహ-అవలోకకలయా = ప్రేమపూర్వకమైన చూపును ప్రసరింపజేయుటచే, హృది = హృదయమునందు, సంస్పృశంతమ్ = చక్కగా స్పృశించుచున్నట్టియు (ప్రవేశించుచున్నట్టియు), శ్యామే = నీలవర్ణము గల, పృథౌ = విశాలమగు, ఉరసి = వక్షఃస్థలమునందు, శోభితయా = శోభిల్లే, శ్రియా = లక్ష్మీదేవితో, స్వః-చూడామణిమ్ = స్వర్లోకమునకు చూడామణియగు, ఆత్మధిష్ణ్యమ్ = తన స్థానమగు వైకుంఠమును, సుభగయంతం ఇవ = శోభిల్లజేయుచున్నవాని వలె ఉన్న శ్రీహరిని (వారు చూచిరి).

కోరదగిన సద్గుణములకు నిలయమగు ఆ శ్రీహరి అక్కడనున్న మహాత్ములను మాత్రమే గాక ద్వారపాలకులను కూడ అనుగ్రహించుటకు సుముఖుడై యుండెను. ఆయన ప్రేమతో నిండిన తన చూపులను వారిపై ప్రసరింప జేసి వారి హృదయములను స్పృశించెను: వారాయనను తమ హృదయములలో భావించుచుండిరి. నీలవర్ణము గల ఆయన విశాలమగు వక్షఃస్థలముపై లక్ష్మీదేవి శోభిల్లుచుండగా ఆమెతో ఆయన స్వర్లోకమునకు చూడామణివంటి తన ధామమగు వైకుంఠమును శోభిల్లజేయుచున్నాడా యన్నట్లు ఉండెను.

పీతాంశుకే పృథునితంబిని విస్ఫురంత్యా
కాంచ్యాలిభిర్విరుతయా వనమాలయా చ ।
వల్గుప్రకోష్ఠవలయం వినతాసుతాంసే
విన్యస్తహస్తమితరేణ ధునానమబ్జమ్ ॥ 40

పృథునితంబిని = విశాలమైన నితంబము ఆశ్రయముగా గల, పీత-అంశుకే = పచ్చని వస్త్రముపై, విస్ఫురంత్యా = ప్రకాశించుచున్న, కాంచ్యా = మొలనూలుచే, చ = మరియు, అలిభిః = తుమ్మెదలచే, విరుతయా = ధ్వనిని కలిగియున్న, వనమాలయా = వనమాలచే, వల్గుప్రకోష్ఠవ

లయమ్ = సుందరమగు ముంజేతులయందు కంకణములు గలిగినట్టియు, వినతాసుత-అంసే = వినతయొక్క పుత్రుడగు గరుత్మంతుని భుజముపై, విన్యస్తహస్తమ్ = ఉంచబడిన చేయి గలిగినట్టియు, ఇతరేణ = మరియొక చేతితో, అబ్జమ్ = పద్మమును, ధునానమ్ = త్రిప్పుచున్న (శ్రీహరిని చూచిరి).

శ్రీహరియొక్క విశాలమగు నితంబమునందు పీతాంబరము, దానిపై మొలనూలు ప్రకాశించుచుండెను. ఆయన కంఠమునందలి వనమాల చుట్టూ తుమ్మెదలు చేరి ఝుంకారమును చేయుచుండెను. ఆయన ముంజేతులయందు కంకణములు సుందరముగా నుండెను. ఆయన ఒక చేతిని వినతాకుమారుడగు గరుడునిపై వేసి, మరియొక చేతితో పద్మమును విలాసముగా త్రిప్పుచుండెను.

విద్యుత్క్షిపన్మకరకుండలమండనార్హ-
గండస్థలోన్నసముఖం మణిమత్కిరీటమ్ ।
దోర్దండషండవివరే హరతా పరార్ధ్య-
హారేణ కంధరగతేన చ కౌస్తుభేన ॥ 41

విద్యుత్క్షిపత్-మకరకుండలమండన-అర్హగండస్థల-ఉన్నసముఖమ్ = మెరుపును తిరస్కరించే మకరాకారములోనుండే కుండలముల అలంకారమునకు తగిన చెక్కిళ్లు మరియు ఎత్తైన ముక్కు గల ముఖము గలిగినట్టియు, మణిమత్-కిరీటమ్ = మణులు పొదిగిన కిరీటము గలిగినట్టియు, దోర్దండషండవివరే = భుజదండముల సమూహమునకు మధ్యలో, హరతా = విహరించుచున్న, పరార్ధ్యహారేణ = చాల గొప్ప హారముచే, చ = మరియు, కంధరగతేన = మెడనుండి వక్షఃస్థలమునకు వ్రేలాడుచున్న, కౌస్తుభేన = కౌస్తుభమాణిక్యముచే (ప్రకాశించుచున్న శ్రీహరిని చూచిరి).

శ్రీహరియొక్క చెవులకు గల మకరాకారపు కుండలములు తమ కాంతిచే మెరుపులను తల దన్నుచూ చెక్కిళ్లకు శోభను చేగూర్చుచుండెను. ముఖము ఎత్తైన ముక్కుతో ప్రకాశించుచుండెను. ఆయన మణులను పొదిగిన కిరీటమును దాల్చియుండెను. నాలుగు భుజదండముల మధ్యలో

చాల గొప్ప హారము విహరించుచుండెను. మెడనుండి త్రాటితో వ్రేలాడే కౌస్తుభమాణిక్యముతో వక్షఃస్థలము ప్రకాశించుచుండెను.

అత్రోపసృష్టమితి చోత్స్మితమిందిరాయాః
స్వానాం ధియా విరచితం బహుసౌష్ఠవాఢ్యమ్ ।
మహ్యం భవస్య భవతాం చ భజంతమంగం
నేముర్నిరీక్ష్య న వితృప్తదృశో ముదా కైః ।। 42

ఇందిరాయాః = లక్ష్మీదేవియొక్క, ఉత్స్మితమ్ = సౌందర్యగర్వము, అత్ర = ఈ భగవానుని విషయములో, ఉపసృష్టమ్ = తొలగిపోయినది, ఇతి = అని, స్వానామ్ = తన భక్తుల, ధియా = బుద్ధిచే, విరచితమ్ = భావన చేయబడినట్టియు, మహ్యమ్ = నా కొరకు, భవస్య = శివునికి, చ = మరియు, భవతామ్ = మీకు, బహుసౌష్ఠవ-ఆఢ్యమ్ = అతిశయించిన సౌందర్యముచే కూడియున్న, అంగమ్ = రూపమును, భజంతమ్ = ప్రకటించుచున్న శ్రీహరిని, నిరీక్ష్య = చూచి, న వితృప్తదృశః = విశేషముగా తృప్తిని పొందని చూపులు గలవారై, ముదా = ఆనందముతో, కైః = శిరస్సులతో, నేముః = నమస్కరించిరి.

లక్ష్మీదేవికి తన సౌందర్యము విషయములో గల గర్వము భగవానుని యెదుట తొలగిపోయినదని ఆయన భక్తులు భావన చేయుచుందురు. నాకు, శివునకు, మీకు ఉపాసన కొరకై ఆయన అతిశయించిన సౌందర్యముతో కూడిన రూపమును ప్రకటించినాడు. అట్టి శ్రీహరిని ఆ మహర్షులు చూచిరి. కాని, ఎంత చూచినా వారికి తనివి తీరలేదు. వారు తలలను వంచి ఆయనకు ఆనందముతో నమస్కరించిరి.

తస్యారవిందనయనస్య పదారవింద-
కింజల్కమిశ్రతులసీమకరందవాయుః ।
అంతర్గతస్స్వవివరేణ చకార తేషాం
సంక్షోభమక్షరజుషామపి చిత్తతన్వోః ।। 43

అరవిందనయనస్య = పద్మము వంటి కన్నులు గల, తస్య = ఆ శ్రీహరియొక్క, పద-అరవిందకింజల్కమిశ్రతులసీమకరందవాయుః = పద్మములవంటి పాదముల కేసరములవంటి వ్రేళ్లతో కలిసిన తులసి యొక్క మకరందముయొక్క వాయువు, స్వవివరేణ = ముక్కు పుటముల ద్వారా, అంతః-గతః = లోపల ప్రవేశించినదై, అక్షరజుషాం అపి = బ్రహ్మ నిష్ఠ గలవారే అయిననూ, తేషామ్ = వారియొక్క, చిత్తతన్వోః = మనస్సు నకు దేహమునకు, సంక్షోభమ్ = సంక్షోభమును, చకార = చేసెను.

పద్మములవంటి కన్నులు గల ఆ శ్రీహరియొక్క పాదములు పద్మములను, కాలి వ్రేళ్లు ఆ పద్మముల కేసరములను పోలి యుండెను. ఆ పాదపద్మముల మకరందముతో కూడిన తులసీగంధమును మోసుకొని వచ్చిన వాయువు ఆ మహర్షుల ముక్కు పుటముల గుండా లోపలికి ప్రవేశించెను. వారు బ్రహ్మనిష్ఠ గలవారే అయిననూ, అది వారి మనస్సులకు ఆనందాతిశయమును, దేహములకు రోమాంచమును కలిగించెను.

తే వా అముష్య వదనాసితపద్మకోశ-
ముద్వీక్ష్య సుందరతరాధరకుందహాసమ్ ।
లబ్ధాశిషః పునరవేక్ష్య తదీయమంఘ్రి-
ద్వంద్వం నఖారుణమణిశ్రయణం నిదధ్యుః ॥44

తే వై = ఆ మహర్షులు, అముష్య = ఈ శ్రీహరియొక్క, సుందరతర-అధరకుందహాసమ్ = మిక్కిలి అందమైన క్రింది పెదవియందలి మల్లెల వంటి చిరునవ్వు గల, వదన-అసితపద్మకోశమ్ = ముఖము అనే నల్లకలువ మొగ్గను, ఉద్వీక్ష్య వై = నిశ్చయముగా తలను పైకెత్తి చూచి, లబ్ధ-ఆశిషః = పొందబడిన మనోరథము గలవారై, పునః = మరల, తదీయమ్ = ఆయ నకు చెందిన, నఖ-అరుణమణిశ్రయణమ్ = గోళ్లు అనే పద్మరాగమాణిక్య ములకు ఆశ్రయమైన, అంఘ్రిద్వంద్వమ్ = పాదముల జంటను, అవేక్ష్య = తలను క్రిందకు దించి చూచి, నిదధ్యుః = ధ్యానించిరి.

ఆ మహర్షులు శ్రీహరియొక్క మిక్కిలి అందమగు క్రింది పెదవిని, దానిపై విరిసే మల్లెలవంటి చిరునవ్వును, నల్లకలువ మొగ్గవంటి ముఖ

మును తలలను పైకెత్తి చూచిరి. వారి మనోరథము ఈడేరెను. మరల, పద్మరాగమాణిక్యములవంటి గోళ్లను, వాటికి ఆశ్రయమగు రెండు పాదములను తలలను క్రిందికి దించి చూచిరి. తరువాత వారాయనను ధ్యానించిరి.

పుంసాం గతిం మృగయతామిహ యోగమార్గైః
ధ్యానాస్పదం బహు మతం నయనాభిరామమ్ ।
పౌంస్నం వపుర్దర్శయానమనన్యసిద్ధైః
ఔత్పత్తికైస్సమగృణన్ యుతమష్టభోగైః ॥ 45

ఇహ = ఈ లోకమునందు, యోగమార్గైః = యోగమార్గములచే, గతిమ్ = మోక్షమును, మృగయతామ్ = అన్వేషించే, పుంసామ్ = మానవులకు, ధ్యాన-ఆస్పదమ్ = ధ్యానమునకు విషయము అయినట్టియు, నయన-అభిరామమ్ = కన్నులకు పండువ అయినట్టియు, బహుమతమ్ = మిక్కిలి ఆదరింపబడునట్టియు, పౌంస్నం వపుః = పురుషరూపమును, దర్శయానమ్ = చూపించుచున్న, అనన్యసిద్ధైః = ఇతరులయందు లభించని, ఔత్పత్తికైః = సహజసిద్ధములగు, అష్టభోగైః = అష్టైశ్వర్యములచే, యుతమ్ = కూడియున్న భగవానుని, సమగృణన్ = చక్కగా స్తుతించిరి.

ఈ లోకములో మానవులు యోగమార్గముల ద్వారా మోక్షమును పొందగోరి కన్నులకు పండువయగు ఆ పురుషోత్తముని రూపమును అత్యాదరముతో ధ్యానించుచుందురు. శ్రీహరి అట్టి రూపమును ఆ మహర్షులకు దర్శనమిచ్చెను. ఇతరులలో కానరాని అణిమ మొదలగు అష్టైశ్వర్యములు ఆయనలో సహజసిద్ధముగా నున్నవి. అట్టి భగవానుని ఆ మహర్షులు చక్కగా స్తుతించిరి.

కుమారా ఊచుః ।
యోఽంతర్హితో హృది గతోఽపి దురాత్మనాం త్వం
సోఽద్యైవ నో నయనమూలమనంత రాద్ధః ।
యర్హ్యేవ కర్ణవివరేణ గుహాం గతో నః
పిత్రానువర్ణితరహా భవదుద్భవేన ॥ 46

అనంత = ఓ అనంతుడా!, యః = ఏ, త్వమ్ = నీవు, దురాత్మ నామ్ = దుష్టులకు, హృది = హృదయమునందు, గతః అపి = నిలిచియు న్ననూ, అంతర్హితః = దాగియుందువో, సః = అట్టి నీవు, అద్య ఏవ = ఈనాడు, నః = మాకు, నయనమూలమ్ = కన్నులకు గోచరమగుటను, రాద్ధః = పొందితివి, యర్హి ఏవ = ఏ కాలమునందైతే, భవత్-ఉద్భవేన = నీనుండి జన్మను పొందిన, నః = మా, పిత్రా = తండ్రిగారిచే, అనువర్ణిత రహః = వర్ణించబడిన రహస్యము గలవాడవైనావో (అదే కాలమున), కర్ణవి వరేణ = చెవుల రంధ్రముగుండా, గుహామ్ = హృదయగుహను గతః = పొందితివి.

కుమారులు ఇట్లు పలికిరి --- ఓ అనంతుడా! నీవు దుష్టులకు హృదయమునందే భాసించుచున్ననూ దాగియుందువు. అట్టి నీవు ఈనాడు మా కన్నులకు కానవచ్చుచున్నావు. నీనుండి జన్మను పొందిన మా తండ్రిగారు ఏనాడు నీ స్వరూపముయొక్క రహస్యమును మాకు వర్ణించి చెప్పినారో, ఆనాడే నీవు చెవి రంధ్రముల గుండా మా హృదయ (బుద్ధి) గుహలో ప్రవేశించియున్నావు.

తం త్వాం విదామ భగవన్ పరమాత్మతత్త్వం
సత్త్వేన సంప్రతి రతిం రచయంతమేషామ్ ।
యత్తేఽనుతాపవిదితైర్దృఢభక్తియోగైః
ఉద్గ్రంథయో హృది విదుర్మునయో విరాగాః ॥47

భగవన్ = ఓ భగవానుడా!, సత్త్వేన = శుద్ధసత్త్వస్వరూపముచే, సంప్రతి = ఇప్పుడు, ఏషామ్ = ఈ నీ భక్తులకు, రతిమ్ = ప్రీతిని, రచయం తమ్ = కలిగించుచున్న, త్వామ్ = నిన్ను, తమ్ = ఆ, పరమ్ = ఉత్కృష్టమ గు, ఆత్మతత్త్వమ్ = ఆత్మస్వరూపముగా, విదామ = తెలియుచున్నాము, యత్ = ఏ పరమాత్మతత్త్వమును, ఉత్-గ్రంథయః = అజ్ఞానగ్రంథి (అహం కారము) లేని, విరాగాః = విరాగులగు, మునయః = మునులు, తే = నీ, అనుతాపవిదితైః = కృపచే తెలియబడే, దృఢభక్తియోగైః = దృఢమగు భక్తి యోగముల ద్వారా, హృది = హృదయమునందు, విదుః = తెలియుదురో.

ఓ భగవానుడా! నీవిప్పుడు నీ భక్తులమగు మా యెదుట నీ శుద్ధ సత్త్వప్రధానమగు సగుణరూపమును దర్శనమిచ్చి ప్రీతిని కలిగించినావు. ఈ సగుణరూపమే శాస్త్రప్రసిద్ధమైన ఉత్కృష్టమగు ఆత్మతత్త్వమని మేము గుర్తించుచున్నాము. అహంకారము, రాగము లేని మననశీలురగు భక్తులు నీ అనుగ్రహముచే దృఢమగు భక్తియోగమును పొందినవారై, ఆ ఆత్మత త్త్వమును తమ హృదయములో సాక్షాత్కరించుకొనుచున్నారు.

నాత్యంతికం విగణయంత్యపి తే ప్రసాదం
కింత్వన్యదర్పితభయం భువ ఉన్నయైస్తే ।
యేఽంగ త్వదంఘ్రిశరణా భవతః కథాయాః
కీర్తన్యతీర్థయశసః కుశలా రసజ్ఞాః ॥ 48

అంగ = ఓ శ్రీహరీ!, తే = వారు, ప్రసాదమ్ = అనుగ్రహమైన, ఆత్యంతికం అపి = మోక్షమును కూడ, న విగణయంతి = లెక్క చేయరు, తే = నీ, భ్రువః = కనుబొమయొక్క, ఉన్నయైః = విరుపులచే, అర్పితభయమ్ = కలిగించబడిన భయము గల, అన్యత్ = ఇంద్రపదవి మొదలగు ఇతరమును, న విగణయంతి కిం తు = లెక్కచేయరని వేరుగా చెప్పవలయునా?, కుశలాః = నేర్పరులగు (వివేకము గలవారు), యే = ఎవరైతే, త్వత్-అంఘ్రిశరణాః = నీ పాదములే శరణుగా గలవారై, కీర్తన్యతీర్థయశసః = కీర్తించదగిన పవిత్రమగు కీర్తి గల, భవతః = నీయొక్క, కథాయాః = గాథ యొక్క, రసజ్ఞాః = రసమునెరింగినవారో.

ఓ శ్రీహరీ! నీ భక్తులు ధర్మాధర్మ (నిత్యానిత్య) వివేకము గల నేర్పరులు. వారు కేవలము నీ పాదములను మాత్రమే శరణు జొచ్చియుందురు. కీర్తించదగిన పవిత్రమగు కీర్తి గల నీ గాథల రసము వారికి యెరుకయే. వారు నీ అనుగ్రహముచే లభించే మోక్షమునైననూ లెక్కచేయరు. నీ కనుబొమల విరుపులచే గడగడలాడే (కాలమునకు లోబడియుండే) ఇంద్రాదుల పదవులను వారు లెక్క చేయరని వేరుగా చెప్పవలయునా?

కామం భవస్స్వవృజినైర్నిరయేషు నః స్తా-
చ్చేతోఽలివద్యది ను తే పదయో రమేత ।

వాచశ్చ నస్తులసివద్యది తేఽంఘ్రిశోభాః
పూర్యేత తే గుణగణైర్యది కర్ణరంధ్రః ॥ 49

చేతః ను = మనస్సైనతే, అలివత్ = తుమ్మెద వలె, తే = నీ, పదయోః = పాదములయందు, రమేత యది = రమించే పక్షములో, నః = మా, వాచః = వాక్కులు, తులసివత్ = తులసి వలె, తే = నీ, అంఘ్రిశోభాః యది = పాదములచే శోభను పొందే పక్షములో, చ = మరియు, కర్ణరంధ్రః = చెవి రంధ్రము, తే = నీ, గుణగణైః = గుణముల సమూహములచే, యది పూర్యేత = పూరింపబడే పక్షములో, నః = మాకు, స్వవృజినైః = మా పాప ములచే, నిరయేషు = నరకములయందు, భవః = పుట్టుక, కామమ్ = యథే చ్ఛగా, స్తాత్ = కలుగుగాక!

మా మనస్సులు తుమ్మెదల వలె నీ పాదపద్మములయందు మాత్రమే రమించే పక్షములో, మా వాక్కులు తులసి వలె నీ పాదముల సంబంధముచే (వర్ణనలచే) శోభిల్లే పక్షములో, మా చెవుల రంధ్రములు నీ గుణగణముల గానముచే పూరించబడే పక్షములో, మాకు మా పాపముల నిమిత్తముగా యథేచ్ఛగా నరకములో జన్మ కలుగుగాక! అట్టి జన్మకు మా అభ్యంతరము లేదు.

ప్రాదుశ్చకర్థ యదిదం పురుహూత రూపం
తేనేశ నిర్వృతిమవాపురలం దృశో నః ।
తస్మా ఇదం భగవతే నమ ఇద్విధేమ
యోఽనాత్మనాం దురుదయో భగవాన్ ప్రతీతః ॥ 50

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
పంచదశోఽధ్యాయః ॥

పురుహూత = విపులమగు కీర్తి గలవాడా!, ఈశ = ఓ పరమేశ్వరా!, యత్ = ఏ, ఇదమ్ = ఈ, రూపమ్ = రూపమును, ప్రాదుశ్చకర్థ = ఆవిర్భ వింప జేసితివో, తేన = దానిచే, నః = మా, దృశః = కన్నులు, అలమ్ = అధి కముగా, నిర్వృతిమ్ = ఆనందమును, అవాపుః = పొందినవి, ఇత్ = ఈ విధ

ముగా, ప్రతీతః = కానవచ్చుచున్నావు, తస్మై = అట్టి, భగవతే = భగవానుడవగు నీ కొరకు, ఇదమ్ = ఈ, నమః = నమస్కారమును, విధేమ = చేయుచున్నాము, యః = ఏ, భగవాన్ = భగవానుడవగు నీవు, అనాత్మనామ్ = మనోజయము లేనివారికి, దురుదయః = తెలియ శక్యము కానివాడవో.

విపులమగు కీర్తి గల ఓ పరమేశ్వరా! నీవు నీ ఈ రూపమును మా యెదుట ఆవిర్భవింప జేసితివి. భగవానుడవగు నీవు ఈ విధముగా మా యెదుట ప్రత్యక్షమైతివి. మా కన్నులు అతిశయించిన ఆనందమును పొందినవి. మనోజయము లేనివారు నిన్ను తెలియజాలరు. ఇదిగో ! చేతులెత్తి నీకు నమస్కరించుచున్నాము.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధమునందు
పదునైదవ అధ్యాయము ముగిసినది (**15**).



# అథ షోడశోऽధ్యాయః

## జయ విజయులు వైకుంఠమునుండి పతితులగుట

బ్రహ్మోవాచ ।
ఇతి తద్గృణతాం తేషాం మునీనాం యోగధర్మిణామ్ ।
ప్రతినంద్య జగాదేదం వికుంఠనిలయో విభుః ॥ 1

బ్రహ్మా = బ్రహ్మగారు, ఉవాచ = పలికెను, ఇతి = ఈ విధముగా, గృణతామ్ = స్తుతించుచున్న, తేషామ్ = ఆ, యోగధర్మిణామ్ = జ్ఞానమే ధర్మముగా గల, మునీనామ్ = సనకాది మహర్షుల, తత్ = ఆ స్తోత్రమును, ప్రతినంద్య = అభినందించి, వికుంఠనిలయః = వైకుంఠాధిపతియగు, విభుః = శ్రీహరి విభుడు, ఇదమ్ = ఈ మాటను, జగాద = పలికెను.

బ్రహ్మగారు ఇట్లు పలికిరి --- ఆత్మజ్ఞాననిష్ఠయే ధర్మముగా గల ఆ మహర్షులు చేసిన ఈ స్తోత్రమును వైకుంఠాధిపతియగు (శుద్ధమగు బుద్ధియందు ఆత్మరూపముగా ప్రకాశించే) శ్రీహరి విభుడు అభినందించి, వారితో ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
ఏతౌ తౌ పార్షదౌ మహ్యాం జయో విజయ ఏవ చ ।
కదర్థీకృత్య మాం యద్వో బహ్వక్రాతామతిక్రమమ్ ॥ 2

తౌ = అట్టి, ఏతౌ = ఈ, జయః = జయుడు, విజయః ఏవ చ = విజయుడు అనువారలు, మహ్యామ్ = నా కొరకు, పార్షదౌ = అనుచరులు, వః = మీకు, బహు = అధికముగా, యత్ = ఏ, అతిక్రమమ్ = అపరాధమును, అక్రాతామ్ = చేసిరో దానిని, మామ్ = నన్ను, కదర్థీకృత్య = అవమానించి (చేసిరి).

మీ శాపమునకు గురియైన ఈ జయవిజయులనే వారిద్దరు నా అనుచరులు. వీరు మీ విషయములో పెద్ద అపరాధమును చేసినారు. అట్లు చేయుటలో, వారు నన్ను కూడ అవమానించినారు.

యస్త్వేతయోర్ధృతో దండో భవద్భిర్మామనువ్రతైః ।
స ఏవానుమతోఽస్మాభిర్మునయో దేవహేలనాత్ ॥ 3

మునయః = ఓ మహర్షులారా!, మామ్ = నన్ను, అనువ్రతైః = భక్తితో ఆరాధించే, భవద్భిః = మీచే, దేవహేలనాత్ = దేవతాస్వరూపులగు మిమ్ములను పరిహసించుట నిమిత్తముగా, ఏతయోః = వీరిద్దరికి, యః = ఏ, దండః = శిక్ష, ధృతః = విధించబడినదో, సః ఏవ = అదియే, అస్మాభిః = మాచే, అనుమతః = అంగీకరించబడినది.

ఓ మహర్షులారా! దేవతాస్వరూపులగు మిమ్ములను పరిహసించుట ద్వారా వీరు నన్ను కూడ పరిహసించినట్లే అయినది. నన్ను భక్తితో ఆరాధించే మీరు వీరిద్దరికి విధించిన శిక్షను నేను కూడ ఆమోదిస్తున్నాను.

తద్వః ప్రసాదయామ్యద్య బ్రహ్మ దైవం పరం హి మే ।
తద్ధీత్యాత్మకృతం మన్యే యత్స్వపుంభిరసత్కృతాః ॥ 4

తత్ = అందువలన, అద్య = ఇప్పుడు, వః = మిమ్ములను, ప్రసాదయామి = ప్రసన్నులు కండని ప్రార్థించుచున్నాను, హి = ఏలయనగా, మే = నాకు, బ్రహ్మ = బ్రాహ్మణుడు, పరమ్ = సర్వాతిశాయియగు, దైవమ్ = దైవము, స్వపుంభిః = నా అనుచరులచే, అసత్-కృతాః యత్ = అవమానించబడిరనేది యేది గలదో, తత్ = అది, ఆత్మకృతం హి = నాచే చేయబడినదే, ఇతి = అని, మన్యే = తలంచుచున్నాను.

కావున, నేనిప్పుడు మిమ్ములను ప్రసన్నులు కండని ప్రార్థించుచున్నాను. ఏలయనగా, నాకు బ్రహ్మవేత్త పరమదైవము. నా అనుచరులు మిమ్ములను అవమానించినచో, అది నేను మిమ్ములను అవమానించినట్లే యగును.

యన్నామాని చ గృహ్ణాతి లోకో భృత్యే కృతాగసి ।

సోఽసాధువాదస్తత్కీర్తిం హంతి త్వచమివామయః ॥ 5

లోకే = లోకమునందు, భృత్యే = సేవకుడు, కృత-ఆగసి = చేయబడిన అపరాధము గలవాడు కాగా, యత్-నామాని = ఏ స్వామియొక్క పేర్లను, గృహ్ణాతి = స్వీకరించునో, సః = అట్టి, అసాధువాదః = నిందావచనము, తత్-కీర్తిమ్ = వాని కీర్తిని, ఆమయః = వ్యాధి, త్వచం ఇవ = చర్మమునువలె, హంతి = పాడుచేయును.

లోకములో సేవకుడు అపరాధము చేసినప్పుడు జనులు వాని స్వామిని నిందించెదరు. దాని వలన ఆ స్వామి యొక్క కీర్తి, చర్మరోగముచే చర్మము పాడైన విధముగా, చెడిపోవును.

యస్యామృతామలయశఃశ్రవణావగాహః
సద్యః పునాతి జగదా శ్వపచాద్వికుంఠః ।
సోఽహం భవద్భ్య ఉపలబ్ధసుతీర్థకీర్తిః
ఛింద్యాం స్వబాహుమపి వః ప్రతికూలవృత్తిమ్॥6

యస్య = ఎవనియొక్క, అమృత-అమలయశఃశ్రవణ-అవగాహః = అమృతమువంటి స్వచ్ఛమైన కీర్తియందు వినుటద్వారా మునుగుట, సద్యః = వెంటనే, ఆ శ్వపచాత్ = పరమకిరాతకుని వరకు, జగత్ = జగత్తును, పునాతి = పవిత్రము చేయునో, సః = అట్టి, వికుంఠః = మొక్కవోని సామర్థ్యము గల, భవద్భ్యః = మీనుండి, ఉపలబ్ధసుతీర్థకీర్తిః = పొందబడిన గొప్ప పవిత్రము చేసే కీర్తి గల, అహమ్ = నేను, వః = మీకు, ప్రతికూలవృత్తిమ్ = ప్రతికూలమగు వ్యాపారము గల, స్వబాహుం అపి = నా చేతినైననూ, ఛింద్యామ్ = తెగగొట్టెదను.

ఈ లోకములో నా నిర్మలమైన యశస్సు అనే అమృతవాహినియందు శ్రవణము అనే మునకను వేయువాడు ఎవడైనా, పరమకిరాతకుడే అయినా, వెంటనే పవిత్రుడగును. అట్టి గొప్ప పావనమగు కీర్తి నాకు మీవంటి మహాత్ముల వలననే లభించినది. మొక్కవోని సామర్థ్యము గల అట్టి నేను, మీకు ప్రతికూలముగా వ్యవహరించినచో, నా చేతినైననూ తెగగొట్టెదను.

యత్సేవయా చరణపద్మపవిత్రరేణుం
సద్యః క్షతాఖిలమలం ప్రతిలబ్ధశీలమ్ ।
న శ్రీర్విరక్తమపి మాం విజహాతి యస్యాః
ప్రేక్షాలవార్థ ఇతరే నియమాన్ వహంతి ॥ 7

యత్-సేవయా = ఏ బ్రహ్మవేత్తల సేవచే, చరణపద్మపవిత్రరేణుమ్ = పద్మములవంటి పాదముల పావనమగు ధూళిని కలిగియున్నట్టియు, సద్యః = వెనువెంటనే, క్షపిత-అఖిలమలమ్ = నశింపజేయబడిన సకలదోషములు కలిగినట్టియు, ప్రతిలబ్ధశీలమ్ = పొందబడిన సచ్ఛీలము కలిగినట్టియు, విరక్తం అపి = విరాగినే అయిననూ, మామ్ = నన్ను, శ్రీః = లక్ష్మీదేవి, న విజహాతి = విడిచిపెట్టుట లేదో, యస్యాః = ఏ లక్ష్మియొక్క, ప్రేక్షాలవ-అర్థే = ఒక్క చూపు అనే ప్రయోజనమునందు, ఇతరే = ఇతరులు, నియమాన్ = నియమములను, వహంతి = పాటించుచున్నారో.

బ్రహ్మవేత్తలగు మిమ్ములను సేవించుటచే మీ పాదపద్మముల ధూళి నన్ను పవిత్రునిగా చేసి, నాలోని సకలదోషములను పారద్రోలినది (బ్రహ్మవేత్తలగు మిమ్ములను సేవించుటచే నా పాదపద్మముల ధూళికి సేవించువారిని పవిత్రము చేసే మహిమ అబ్బినది; లేదా, బ్రహ్మవేత్తలగు మిమ్ములను సేవించినప్పుడు మీ పాదపద్మముల ధూళి సోకుటచే జగత్తును పావనము చేసే శక్తి నాకు లభించినది). పైగా, మీ సేవ వలన నాకు సుందరమగు శీలము అబ్బినది. దాని ప్రభావము చేతనే, నేను విరక్తుడనే అయిననూ, లక్ష్మీదేవి నన్ను విడువకున్నది. ఆ లక్ష్మీదేవియొక్క అనుగ్రహముతో కూడిన ఒక్క చూపు తమపై ప్రసరించుటకై ఇంద్రాదులు వ్రతనియమములను పాటిస్తూ, కష్టపడి తపస్సును చేయుచున్నారు.

నాహం తథాద్మి యజమానహవిర్వితానే
శ్చ్యోతద్ఘృతప్లుతమదన్ హుతభుఙ్ముఖేన ।
యద్బ్రాహ్మణస్య ముఖతశ్చరతోఽనుఘాసం
తుష్టస్య మయ్యవహితైర్నిజకర్మపాకైః ॥ 8

అహమ్ = నేను, వితానే = యజ్ఞమునందు, శ్చ్యోతద్-ఘృతప్లుతమ్ = కారుచున్న నేతితో నిండియున్న, యజమానహవిః = యజ్ఞము చేయువాని హవిస్సును, హుతభుక్-ముఖేన = అగ్ని అనే నోటితో, అదన్ = తినుచున్నవాడనై, తథా = ఆ విధముగా, న అద్మి = తినను, యత్ = ఏ విధముగానైతే, శ్చ్యోతద్-ఘృతప్లుతమ్ = కారుచున్న నేతితో నిండిన, అనుఘాసమ్ = ప్రతిముద్దను, చరతః = భక్షించుచున్నట్టియు, మయి = నాయందు, అవహితైః = సమర్పించబడిన, నిజకర్మపాకైః = తన కర్మల ఫలములచే, తుష్టస్య = సంతుష్టుడైన, బ్రాహ్మణస్య = బ్రహ్మవేత్తయొక్క, ముఖతః = నోటిగుండా, అశ్నామి = తినుచున్నానో.

యజ్ఞములో యజమానుడు కారుచున్న నేతితో నిండియున్న పురోడాశము మొదలగు హవిస్సును సమర్పించినప్పుడు నేను దానిని అగ్ని అనే నోటితో భక్షించెదను. అంతేగాక, తాను చేసిన కర్మల ఫలమును నాకు సమర్పించి సంతుష్టుడై యున్న బ్రహ్మవేత్త నేతితో నిండియున్న ప్రతి ముద్దను భక్షించుచుండగా, ఆయన నోటిద్వారా ఆ అన్నమును భక్షించేది కూడ నేనే. కాని, ఆ బ్రహ్మవేత్త నోటిగుండా భక్షించినంత తృప్తిగా నేను యజ్ఞములోని హవిస్సులను కూడ భక్షించుట లేదు.

యేషాం బిభర్మ్యహమఖండవికుంఠయోగ-
మాయావిభూతిరమలాంఘ్రిరజః కిరీటైః ॥
విప్రాంస్తు కో న విషహేత యదర్హణాంభః
సద్యః పునాతి సహచంద్రలలామలోకాన్ ॥ 9

అఖండవికుంఠయోగమాయావిభూతిః = భేదము లేనిది. మొక్కవోనిది అగు యోగమాయయొక్క మహిమ గల, అహమ్ = నేను, కిరీటైః = కిరీటములచే, యేషామ్ = ఏ బ్రహ్మవేత్తల, అమల-అంఘ్రిరజః = పవిత్రమగు పాదముల ధూళిని, బిభర్మి = ధరించెదనో అట్టి, విప్రాన్ తు = బ్రాహ్మణులనైతే, కః = ఎవ్వాడు, న విషహేత = సహించకుండును?, యత్-అర్హణ-అంభః = ఏ బ్రాహ్మణుల (ఏ నా) పాదోదకము, సహచంద్రల

లామలోకాన్ = చంద్రుడు శిరోభూషణముగా గల శివునితో సహా లోకముల ను, సద్యః = వెనువెంటనే, పునాతి = పవిత్రము చేయుచున్నదో.

నా యోగమాయ అఖండమైనది. దానికి మొక్కవోని మహిమ గల దు. నా పాదోదకరూపమగు గంగ చంద్రుడు శిరోభూషణముగా గల శివు నితో సహా సమస్తలోకములను పవిత్రము చేయుచున్నది. అట్టి నేను కూడ బ్రహ్మవేత్తల పవిత్రమగు పాదధూళిని కిరీటముపై దాల్చెదను. వారి పాద ధూళి చంద్రశేఖరునితో సహా లోకములనన్నింటినీ పావనము చేయ దగి యున్నది. అట్టి బ్రాహ్మణులను ఎవడు సహించకుండును?

యే మే తనూర్ద్విజవరాన్ దుహతీర్మదీయా
భూతాన్యలబ్ధశరణాని చ భేదబుద్ధ్యా ।
ద్రక్ష్యంత్యఘక్షతదృశో హ్యహిమన్యవస్తాన్
గృధ్రా రుషా మమ కుషంత్యధిదండనేతుః ॥ **10**

అఘక్షతదృశః = పాపముచే చెడగొట్టబడిన దృష్టి గల, అహిమ న్యవః = పాము కోపమువంటి కోపము గల, యే = ఎవరైతే, మే = నాయొ క్క, తనూః = శరీరములైన, ద్విజవరాన్ = బ్రాహ్మణశ్రేష్ఠులను, మదీయాః = నాకు చెందిన, దుహతీః = పాలిచ్చే ఆవులను, చ = మరియు, అలబ్ధశర ణాని = రక్షకుడు లభించని, భూతాని = ప్రాణులను, భేదబుద్ధ్యా = నాకంటె వేరు అనే బుద్ధితో, ద్రక్ష్యంతి = చూచెదరో, తాన్ = వారిని, మమ = నాయొ క్క, అధిదండనేతుః = అధికారము ఈయబడి శిక్షను విధించే యముని, అహిమన్యవః = పాము కోపము వంటి కోపము గల, గృధ్రాః = గద్దల రూప ములోనుండే కింకరులు, రుషా = కోపముతో, కుషంతి = చీల్చెదరు.

బ్రాహ్మణశ్రేష్ఠులు, గోవులు మరియు రక్షకుడు లేని ప్రాణులు నా శరీరములోని భాగములు. వారికి నాకు భేదము లేదు. కాని, కొందరు పాము వలె కోపిష్ఠులై పాపకార్యములచే చెడగొట్టబడిన బుద్ధి గలవారై, వారిని నాకంటె వేరుగా భావించెదరు. అట్టి వారిని శిక్షించే అధికారమును నేను యమునకు ఇచ్చినాను. కోపముతో బుసలు కొట్టే పాముల వంటి ఆ యముని కింకరులు కోపించి గ్రద్దల రూపములో వారిని చీల్చివేసెదరు.

యే బ్రాహ్మణాన్మయి ధియా క్షిపతోఽర్చయంతః
తుష్యద్ధృదస్స్మితసుధోక్షితపద్మవక్త్రాః ।
వాణ్యానురాగకలయాఽఽత్మజవద్గృణంతః
సంబోధయంత్యహమివాహముపాహృతస్తైః ॥11

యే = ఎవరైతే, క్షిపతః = తిరస్కరించుచున్నవారే అయిననూ, బ్రాహ్మణాన్ = బ్రహ్మవేత్తలను, మయి = నాయందు, ధియా = బుద్ధిచే, అర్చయంతః = పూజించుచున్నవారై, తుష్యత్-హృదః = సంతోషముతో నిండిన హృదయములు గలవారై, స్మితసుధా-ఉక్షితపద్మవక్త్రాః = చిరునవ్వు అనే అమృతముతో తడుపబడిన ముఖపద్మములు గలవారై, అనురాగకలయా = ప్రేమచే మధురమైన, వాణ్యా = వాక్కుతో, అహం ఇవ = నేను వలె, ఆత్మజవత్ = పుత్రుడు వలె, గృణంతః = స్తుతించుచున్నవారై, సంబోధయంతి = సంతోషపెట్టెదరో, తైః = వారిచే, అహమ్ = నేను, ఉపాహృతః = వశము చేసుకొనబడుదును.

బ్రహ్మవేత్తలు నిందించిననూ మానవులు నాయందు బుద్ధిని నిలిపి, సంతోషముతో నిండిన హృదయము గలవారై, వారిని పూజించవలెను. మానవులు చిరునవ్వు అనే అమృతమును చిలికించే ముఖపద్మములు గలవారై, ప్రేమతో మధురమైన వాక్కుతో వారిని స్తుతించవలెను. కోపించిన తండ్రితో యోగ్యుడగు కొడుకు వలె, ప్రియుడగు పుత్రునితో తండ్రి వలె, మానవుడు వారిని సంతోషపెట్టవలెను. నేను మీ విషయములో అటులనే చేయుచున్నాను. అట్లు చేయు మానవులకు నేను వశుడనగుదును.

తన్మే స్వభర్తురవసాయమలక్షమాణౌ
యుష్మద్వ్యతిక్రమగతిం ప్రతిపద్య సద్యః ।
భూయో మమాంతికమితాం తదనుగ్రహో మే
యత్కల్పతామచిరతో భృతయోర్వివాసః ॥ 12

తత్ = అందువలన, స్వభర్తుః = తమకు ప్రభువగు, మే = నాయొక్క, అవసాయమ్ = నిశ్చయమును, అలక్షమాణౌ = తెలియనివారై, యుష్మద్-వ్యతిక్రమగతిమ్ = మీయందలి అపరాధమునకు ఫలమును,

సద్యః = వెనువెంటనే, ప్రతిపద్య = పొంది, భూయః = మరల, మమ = నా, అంతికమ్ = సమీపమును, ఇతామ్ = పొందెదరు గాక!, తత్ = అదియే, మే = నా కొరకు (నాయొక్క) , అనుగ్రహః = అనుగ్రహము, యత్ = ఏదైతే, భృతయోః = ఈ ఇద్దరు సేవకుల, వివాసః = వియోగము, అచిరతః = తొందరగా, కల్పతామ్ = సమాప్తమగు గాక!

కావున, వీరిద్దరు తమ ప్రభువగు నా నిశ్చయమును తెలియజాలక, మీ విషయములో అపరాధమును చేసి, వెంటనే దాని ఫలమును పొందుచున్నారు. ఈ ఇద్దరు సేవకులకు నా వియోగము తొందరలో సమాప్తమగునట్లు మీరు అనుగ్రహించుడు. వీరు మరల నన్ను చేరుకొనునట్లు మీరు నన్ను అనుగ్రహించుడు. వారు అట్లు నన్ను చేరునట్లు నేను వారిని అనుగ్రహించుచున్నాను.

బ్రహ్మోవాచ ।
అథ తస్యోశతీం దేవీమృషికుల్యాం సరస్వతీమ్ ।
నాస్వాద్య మన్యుదష్టానాం తేషామాత్మాప్యతృప్యత ॥ 13

అథ = అప్పుడు, తస్య = ఆ శ్రీహరియొక్క, ఉశతీమ్ = మిక్కిలి మధురమైనది, దేవీమ్ = పూజించదగినది, ఋషికుల్యామ్ = మహర్షుల గణములకు హితమైనది అగు, సరస్వతీమ్ = వాక్కును, ఆస్వాద్య = ఆస్వాదించి, మన్యుదష్టానామ్ = కోపము అనే పాముచే కరవబడిన, తేషామ్ = వారి, ఆత్మా అపి = బుద్ధి కూడ, న అతృప్యత = తృప్తిని చెందలేదు.

బ్రహ్మ ఇట్లు పలికెను --- శ్రీహరి మిక్కిలి మధురమైన, సమ్మానార్హమైన, ఆ మహర్షులకు హితమును కలిగించే మాటలను పలికెను. వారి మనస్సులు కోపము అనే సర్పముచే కరువబడియున్ననూ, వారా మాటలను అమృతమును వలె ఆస్వాదించిరి. కాని, వారి బుద్ధికి తృప్తి కలుగలేదు. (పరమపవిత్రమైనది, సాధుజనులకు ప్రీతికరమైనది అగు సరస్వతీ నదియొక్క తియ్యని జలమును ఎంత త్రాగిననూ, పాము కరిచిన వానికి దాహము తీరదు).

సతీం వ్యాదాయ శృణ్వంతో లఘ్వీం గుర్వర్థగహ్వరామ్ ।

విగాహ్యాగాధగంభీరాం న విదుస్తచ్చికీర్షితమ్ ॥ 14

సతీమ్ = శ్రేష్ఠమైన, లఘ్వీమ్ = అల్పమైన, గురు-అర్థగహ్వారామ్ = గొప్ప అర్థముతో తెలియుటకు కష్టముగానున్న, అగాధగంభీరామ్ = అతిశయించిన గాంభీర్యము గల వాక్కును, వ్యాదాయ = చెవులను రిక్కించి, శృణ్వంతః = వినుచున్నవారై, విగాహ్య = లోతుగా ఆలోచించి, తత్-చికీర్షితమ్ = ఆ శ్రీహరి చేయగోరినదానిని, న విదుః = తెలియజాలకుండిరి.

శ్రీహరి శ్రేష్ఠమైన కొద్ది పలుకులను మాత్రమే పలికెను. కాని, వాటి గొప్ప అర్థమును తెలియుట తేలిక కాదు. ఆ పలుకులలో అతిశయించిన గాంభీర్యము ఉండెను. ఆ మహర్షులు ఆ పలుకులను చెవులను రిక్కించి విని, వాటిని గురించి గాఢముగా ఆలోచించిరి. అయిననూ, వారికి భగవానుడు ఏమి చేయదలచుకున్నాడో తెలియలేదు.

తే యోగమాయయాఽఽరబ్ధపారమేష్ఠ్యమహోదయమ్ ।
ప్రోచుః ప్రాంజలయో విప్రాః ప్రహృష్టాః క్షుభితత్వచః ॥ 15

యోగమాయయా = యోగమాయచే, ఆరబ్ధపారమేష్ఠ్యమహా-ఉదయమ్ = ఆవిష్కరించబడిన పరమైశ్వర్యముయొక్క గొప్ప ఉత్కర్ష గల శ్రీహరిని ఉద్దేశించి, ప్రహృష్టాః = గొప్ప ఆనందమును పొందియున్న, క్షుభితత్వచః = గగుర్పాటుతో కూడిన శరీరము గల, తే = ఆ, విప్రాః = మహర్షులు, ప్రాంజలయః = చేతులను జోడించినవారై, ప్రోచుః = పలికిరి.

శ్రీహరి యోగమాయచే తన పరమైశ్వర్యముయొక్క ఉత్కర్షను ప్రకటించినాడు. ఆయనను చూచుటచే ఆ మహర్షులకు పరమానందము కలిగి, వారి శరీరములు గగుర్పాటును పొందినవి. వారు చేతులను జోడించి ఆయనతో నిటనిరి.

ఋషయ ఊచుః ।
న వయం భగవన్ విద్మస్తవ దేవ చికీర్షితమ్ ।
కృతో మేఽనుగ్రహశ్చేతి యదధ్యక్షః ప్రభాషసే ॥ 16

భగవన్ = ఓ భగవానుడా!, దేవ = ఓ దేవా!, తవ = నీ, చికీర్షితమ్ = చేయగోరుదానిని, వయమ్ = మేము, న విద్మః = తెలియకున్నాము, యత్ = ఏలయనగా, మే = నా కొరకు, అనుగ్రహః = అనుగ్రహము, కృతః = చేయబడినది, ఇతి = అని, అధ్యక్షః = జగదధ్యక్షుడవగు నీవు, ప్రభాషసే = పలుకుచున్నావో.

ఆ మహర్షులు ఇట్లు పలికిరి --- ఓ భగవానుడా! దేవా! నీవు జగదధ్యక్షుడవై యుండియు, మీరు నన్ను అనుగ్రహించినారని మాతో పలుకుచున్నావు. మాకు నీవు చేయదలచుకున్న కృత్యము (నీ అభిప్రాయము) తెలియకున్నది.

బ్రహ్మణ్యస్య పరం దైవం బ్రాహ్మణాః కిల తే ప్రభో ।
విప్రాణాం దేవదేవానాం భగవానాత్మదైవతమ్ ॥ **17**

ప్రభో = ఓ ప్రభూ!, బ్రహ్మణ్యస్య = బ్రహ్మవేత్తలకు హితకరుడవగు, తే = నీకు, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, పరం దైవం కిల = పరమదైవము గదా!, విప్రాణామ్ = బ్రాహ్మణులకు, దేవదేవానామ్ = దేవాధిదేవులగు బ్రహ్మాదులకు, భగవాన్ = భగవానుడవగు నీవు, ఆత్మదైవతమ్ = ఆత్మవు మరియు ఆరాధ్యుడవు.

ఓ ప్రభూ! బ్రహ్మవేత్తలకు నీవు హితకారివి. వారిని నీవు పరమదైవముగా భావించుచున్నావు. కాని వాస్తవములో, బ్రాహ్మణులకు, దేవాధిదేవులగు బ్రహ్మాదులకు కూడ నీవే ఆత్మవు, మరియు ఆరాధ్యుడవు.

త్వత్తస్సనాతనో ధర్మో రక్ష్యతే తనుభిస్తవ ।
ధర్మస్య పరమో గుహ్యో నిర్వికారో భవాన్మతః ॥ **18**

సనాతనః = శాశ్వతమగు, ధర్మః = ధర్మము, త్వత్తః = నీనుండియే (ప్రవర్తిల్లుచున్నది), తవ = నీ, తనుభిః = అవతారములచే, రక్ష్యతే = రక్షింపబడుచున్నది, ధర్మస్య = ధర్మముయొక్క, పరమః = ఫలరూపమగు, గుహ్యః = సర్వవేదముల సారమగు, నిర్వికారః = నిర్వికల్ప పరబ్రహ్మ, భవాన్ = నీవే అని, మతః = శాస్త్రములచే సిద్ధాంతము చేయబడినది.

సనాతన ధర్మము నీనుండియే ప్రవర్తిల్లుచున్నది. నీవే అవతరించి దానిని రక్షించుచున్నావు. ధర్మముయొక్క సర్వోత్కృష్టమగు ఫలము సర్వ వేదసారమగు పరబ్రహ్మ. అది నీవే యని శాస్త్రములు నిర్ధారించినవి.

తరంతి హ్యాంజసా మృత్యుం నివృత్తా యదనుగ్రహాత్ ।
యోగినస్స భవాన్ కింస్విదనుగృహ్యేత యత్పరైః ॥ **19**

నివృత్తాః = నివృత్తిధర్మమునందు నిష్ఠ గల, యోగినః = జ్ఞానులు, యత్-అనుగ్రహాత్ = ఎవని అనుగ్రహము వలన, అంజసా = తేలికగా, మృత్యుమ్ = మృత్యువును, తరంతి = దాటెదరో, సః = అట్టి, భవాన్ = నీవు, పరైః = ఇతరులచే, అనుగృహ్యేత యత్ = అనుగ్రహింపబడ గలెననేది యేది గలదో అది, కింస్విత్ = ఎట్టి మాట?

ఆత్మజ్ఞాననిష్ఠులగు మహాత్ములు నీ అనుగ్రహముచే జన్మమృత్యుప్రవాహరూపమగు సంసారమును తరించెదరు. అట్టి నిన్ను ఇతరులు ఎవరు అనుగ్రహించ గలరు?

యం వై విభూతిరుపయాత్యనువేలమన్యైః
అర్థార్థిభిస్స్వశిరసా ధృతపాదరేణుః ।
ధన్యార్పితాంఘ్రితులసీనవదామధామ్నో
లోకం మధువ్రతపతేరివ కామయానా ॥ **20**

అన్యైః = ఇతరులగు, అర్థ-అర్థిభిః = ఐశ్వర్యము మొదలగు వాటిని కోరువారిచే, స్వశిరసా = తమ శిరస్సుచే, ధృతపాదరేణుః = ధరించబడిన పాదధూళి గలిగినట్టియు, ధన్య-అర్పిత-అంఘ్రితులసీనవదామధామ్నః = ధన్యాత్ములచే సమర్పించబడిన పాదములయందలి తులసియొక్క కొత్త మాలయే స్థానముగా గల, మధువ్రతపతేః = గండు తుమ్మెదయొక్క, లోకమ్ = స్థానమగు పాదమును, కామయానా ఇవ = కోరుచునే యున్న, విభూతిః = లక్ష్మీదేవి, అనువేలమ్ = సర్వకాలములయందు, యం వై = ఎవ్వానిని నిశ్చయముగా, ఉపయాతి = సేవించుచున్నదో.

భక్తులు నీ పాదములయందు నవనవలాడే తులసి దళముల మాలను సమర్పించగా, గండు తుమ్మెద దానిచుట్టూ తిరుగాడుచుండును. అట్టి నీ పాదముల స్థానమును మాత్రమే కోరే లక్ష్మీదేవి నిన్ను ఎల్లవేళలా సేవించుచుండును. ఐశ్వర్యమును కోరే ఇతరులగు ఇంద్రాది దేవతలు ఆ దేవియొక్క పాదధూళిని తమ శిరస్సుపై ధరించుచుందురు.

యస్తాం వివిక్తచరితైరనువర్తమానాం
నాత్యాద్రియత్పరమభాగవతప్రసంగః ।
స త్వం ద్విజానుపథపుణ్యరజః పునీతః
శ్రీవత్సలక్ష్మ కిమగా భగభాజనస్త్వమ్ ॥ 21

పరమభాగవతప్రసంగః = మహాభక్తులయందు గొప్ప ప్రేమ గల, యః = ఏ, త్వమ్ = నీవు, వివిక్తచరితైః = విశుద్ధమగు పరిచర్యలచే, అనువర్త మానామ్ = సేవించుచున్న, తామ్ = ఆ లక్ష్మీదేవిని, న అతి-ఆద్రియత్ = అధికముగా ఆదరించలేదో, సః = అట్టి, త్వమ్ = నీవు, కిం ద్విజ-అనుపథ పుణ్యరజఃపునీతః = బ్రహ్మవేత్తల మార్గమునందు గల పవిత్రమగు ధూళిచే పవిత్రుడవగుచున్నావా యేమి?, శ్రీవత్సలక్ష్మ = శ్రీవత్సమనే చిహ్నము ను, కిం అగాః = ఆ కారణముగా పొందినావా యేమి?, భగభాజనః = ఐశ్వ ర్యమునకు పాత్రుడవైనావా యేమి?

పరిశుద్ధమగు పరిచర్యలతో సేవించే ఆ లక్ష్మీదేవికంటె నీకు మహా భక్తులయందు మాత్రమే ఆదరము మెండు. కావుననే, నీకు లక్ష్మీదేవికంటె అట్టి భాగవతోత్తములయందే ప్రీతి ఎక్కువ. బ్రహ్మవేత్తలు నడిచే దారిలోని ధూళిని ధరించి నీవు పవిత్రుడవైనావా యేమి? (కాదు). అట్టి పవిత్రతను పొంది నీవు వక్షఃస్థలమునందు లక్ష్మీదేవిని ధరించుటకు, షడ్గుణసంపన్నుడ వగుటకు అర్హుడవైనావా యేమి? కానే కాదు. నీవు స్వయముగనే ఈ సర్వ మునకు అధీశ్వరుడవై యున్నావు.

ధర్మస్య తే భగవతస్త్రియుగ త్రిభిస్స్వైః
పద్భిశ్చరాచరమిదం ద్విజదేవతార్థమ్ ।
నూనం భృతం తదభిఘాతి రజస్తమశ్చ

సత్త్వేన నో వరదయా తనువా నిరస్య ।। 22

త్రియుగ = మూడు యుగములయందు మాత్రమే కానవచ్చు వాడా!, నః = మాకు, వరదయా = వరములనిచ్చే, సత్త్వేన = సత్త్వగుణప్రధానమగు, తనువా = శరీరముతో, తత్-అభిఘాతి = ధర్మముయొక్క పాదములకు విఘాతమును కలిగించే, రజః = రజోగుణమును, చ = మరియు, తమః = తమోగుణమును, నిరస్య = పోనాడి (పోనాడుము), ధర్మస్య = ధర్మస్వరూపుడవగు, భగవతః = భగవానుడవగు, తే = నీ, స్వైః = స్వీయములైన, త్రిభిః = మూడు, పద్భిః = పాదములచే, చర-అచరమ్ = స్థావర జంగమాత్మకమగు, ఇదమ్ = ఈ జగత్తు, ద్విజదేవతా-అర్థమ్ = బ్రహ్మవేత్తలు మరియు దేవతల కొరకు, నూనమ్ = నిశ్చయముగా, భృతమ్ = పాలించబడినది.

ఓ భగవానుడా! నీవు కృతత్రేతాద్వాపరములనే మూడు యుగములలో మాత్రమే ప్రత్యక్షముగా దర్శనమిచ్చెదవు. తపస్సు, దయ, దానము అనునవి ధర్మస్వరూపుడవగు నీ పాదములు. నీవు స్థావరజంగమాత్మకమగు ఈ జగత్తును బ్రహ్మవేత్తలు మరియు దేవతల కొరకు పాలించుచున్నావు. ధర్మముయొక్క ఆ మూడు పాదములకు విఘాతమును కలిగించే రజస్తమోగుణములను పోనాడి, నీవు సత్త్వమయమగు నీ మూర్తితో మాకు వరములనొసంగుము.

న త్వం ద్విజోత్తమకులం యదిహాత్మగోపం
గోప్తా వృషస్స్వర్హణేన ససూనృతేన ।
తర్హ్యేవ నంక్ష్యతి శివస్తవ దేవ పంథా
లోకోఽగ్రహీష్యదృషభస్య హి తత్ప్రమాణమ్ ।। 23

దేవ = ఓ దేవా!, ఇహ = ఈ లోకమునందు, ఆత్మగోపమ్ = నీచే రక్షించబడే, ద్విజ-ఉత్తమకులమ్ = శ్రేష్ఠులగు బ్రాహ్మణుల సముదాయమును, ససూనృతేన = ప్రియవాక్యముతో కూడిన, సు-అర్హణేన = చక్కని పూజచే, వృషః = శ్రేష్ఠుడవగు, త్వమ్ = నీవు, న గోప్తా = రక్షించనిచో, తర్హి ఏవ = అదే కాలమునందు, తవ = నీ, శివః = మంగళకరమగు, పంథాః =

మార్గము, నంక్ష్యతి = నశించగలదు, హి = ఏలయనగా, ఋషభస్య = శ్రేష్ఠుడవగు నీ, యత్ = ఏ ఆచరణము గలదో, తత్ = దానిని, లోకః = లోకము, ప్రమాణమ్ = ప్రమాణముగా, అగ్రహీష్యత్ = గ్రహించి యుండెడిది.

ఓ దేవా! ఈ లోకములో నీవు బ్రాహ్మణులతో ప్రియముగా మాటలాడి, వారికి చక్కని సమ్మానమును చేయుచున్నావు. ఆ విధముగా నీవు మాత్రమే రక్షకుడుగా గల ఆ బ్రహ్మవేత్తల సమూహమును నీవు రక్షించనిచో, నీచే ప్రవర్తిల్ల జేయబడిన మంగళకరమగు ధర్మమార్గము నశించును. ఏలయనగా, శ్రేష్ఠపురుషుడవగు నీవు దేనిని ఆచరిస్తే, లోకము దానిని ప్రమాణముగా స్వీకరించును.

తత్తేఽనభీష్టమివ సత్త్వనిధేర్విధిత్సోః
క్షేమం జనాయ నిజశక్తిభిరుద్ధృతారేః ।
నైతావతా త్ర్యధిపతేర్బత విశ్వభర్తుః
తేజః క్షతం త్వవనతస్య స తే వినోదః ॥ 24

సత్త్వనిధేః = సత్త్వగుణమునకు నిధియైనట్టియు, జనాయ = మానవుని కొరకు, క్షేమమ్ = మంగళమును, విధిత్సోః = కలిగించగోరునట్టియు, నిజశక్తిభిః = తన శక్తులచే, ఉద్ధృత-అరేః = నశింపజేయబడిన శత్రువులు గల, తే = నీకు, తత్ = ఆ ధర్మమార్గము నశించుట, అనభీష్టం ఇవ = నిశ్చితముగా సమ్మతము కాదు, ఏతావతా = ఇంత మాత్రముచే, త్రి-అధిపతేః = మూడు గుణములను తన వశములోనుంచుకొనునట్టియు, విశ్వభర్తుః = జగత్తును పాలించి పోషించునట్టియు, అవనతస్య = వినయమును కలిగియున్న, తే = నీయొక్క, తేజః = తేజస్సు, న క్షతమ్ = తగ్గిపోలేదు, సః = అది, వినోదః = వినోదము.

నీవు సత్త్వగుణనిధానమవు. నీవు మానవుల కల్యాణమును గోరి నీ శక్తిస్వరూపులగు రాజుల ద్వారా శత్రువులను నశింపజేసినావు. నీకు ఆ ధర్మమార్గము నశించుట సుతరాము సమ్మతము కాదు. మూడు గుణములను వశములో నుంచుకొనే నీవు జగత్తును పాలించి పోషించుచున్నావు.

నీవు వినయమును చూపినంత మాత్రాన, అది నీ తేజస్సునకు భంగకారి కాదు. ఆ విధముగా వినయమును ప్రదర్శించుట నీ లీల మాత్రమే.

యం వానయోర్దమమధీశ భవాన్ విధత్తే
వృత్తిం ను వా తదనుమన్మహి నిర్వ్యలీకమ్ ।
అస్మాసు వా య ఉచితో ధ్రియతాం స దండో
యేఽనాగసౌ వయమయుంక్ష్మహి కిల్బిషేణ ॥25

అధీశ = ఓ సర్వేశ్వరా!, అనయోః = వీరిద్దరికి, యమ్ = ఏ, దమమ్ = శిక్షను గాని, వృత్తిం ను వా = అధికమగు జీవికను గాని, భవాన్ = నీవు, విధత్తే = విధించుచున్నావో, తత్ = దానిని, నిర్-వ్యలీకమ్ = కపటము లేకుండగా, అనుమన్మహి = అనుమోదించుచున్నాము, అస్మాసు వా = మాయందు కూడా, సః = అట్టి, దండః = శిక్ష, ధ్రియతామ్ = విధింపబడు గాక!, యః = ఏది, ఉచితః = ఉచితమో, యే = ఏ, వయమ్ = మేము, అనాగసౌ = నిరపరాధులగు వీరిద్దరిని, కిల్బిషేణ = దుఃఖకారణమగు శాపముతో, అయుంక్ష్మహి = జతగూర్చితిమో.

ఓ సర్వేశ్వరా! వీరిద్దరికీ నీవు ఏ శిక్షను విధించినా, లేదా వారికి అధికమగు ఉపహారమునిచ్చినా, మేము దానిని కపటము లేకుండగా అనుమోదించుచున్నాము. అంతే గాక, మాకు కూడ ఉచితమగు దండమును విధించుము. అది కూడ మాకు స్వీకార్యమే. ఏలయనగా, మేము ఈ నిరపరాధుల జీవితములలోనికి శాపమును ప్రవేశపెట్టితిమి.

శ్రీభగవానువాచ ।
ఏతౌ సురేతరగతిం ప్రతిపద్య సద్యః
సంరంభసంభృతసమాధ్యనుబద్ధయోగౌ ।
భూయస్సకాశముపయాస్యత ఆశు యో వః
శాపో మయైవ నిమితస్తదవైత విప్రాః ॥ 26

విప్రాః = ఓ మహర్షులారా!, ఏతౌ = వీరిద్దరు, సద్యః = వెంటనే, సుర-ఇతరగతిమ్ = రాక్షసజన్మను, ప్రతిపద్య = పొంది, సంరంభసంభృతస

మాధి-అనుబద్ధయోగా = కోపావేశముచే వృద్ధి పొందే చిత్తైకాగ్రతచే దృఢము చేయబడిన యోగము (ఈశ్వరుని పొందే ఉపాయము) గలవారై, భూయః = మరల, ఆశు = తొందరలో, సకాశమ్ = నా సన్నిధిని, ఉపయాస్యతః = చేరుకొనగలరు, వః = మీ, యః = ఏ, శాపః = శాపము గలదో అది, మయా ఏవ = నా చేతనే, నిమితః = కల్పించబడినది, తత్ = ఆ విషయమును, అవైత = తెలియుడు.

శ్రీభగవానుడు ఇట్లు పలికెను --- ఓ మహర్షులారా! వీరిద్దరు వెంటనే రాక్షసజన్మను పొంది నాయందు కోపావేశమును కలిగియుందురు. అది వీరి మనస్సును నాయందు ఏకాగ్రము చేసి, యోగరూపముగా వర్ధిల్లును. వారు తొందరలోనే మరల నా సన్నిధికి చేరెదరు. మీరు నా ప్రేరణ చేతనే వీరికి శాపమును ఇచ్చితిరి. ఆ విషయమును గమనించుడు.

బ్రహ్మోవాచ ।
అథ తే మునయో దృష్ట్వా నయనానందభాజనమ్ ।
వైకుంఠం తదధిష్ఠానం వికుంఠం చ స్వయంప్రభమ్ ॥ 27

అథ = తరువాత, తే = ఆ, మునయః = మహర్షులు, నయన-ఆనందభాజనమ్ = కన్నులలోని ఆనందమునకు పాత్రమగు, స్వయంప్రభమ్ = స్వయంప్రకాశస్వరూపుడగు, వికుంఠమ్ = సర్వశక్తిమంతుడగు శ్రీహరిని, చ = మరియు, తత్-అధిష్ఠానమ్ = ఆయనయొక్క స్థానమగు, వైకుంఠమ్ = వైకుంఠమును, దృష్ట్వా = చూచి.

తరువాత ఆ మహర్షులు కన్నులకు పండువయగు శ్రీహరిని దర్శించిరి. స్వయంప్రకాశస్వరూపుడగు ఆ శ్రీహరి మొక్కవోని సామర్థ్యము గలవాడు. ఆయన నివాసమగు వైకుంఠమును కూడ కన్నుల పండువగా వారు చూచిరి. వైకుంఠము తనంత తానుగా ప్రకాశించే దివ్యస్థానము.

భగవంతం పరిక్రమ్య ప్రణిపత్యానుమాన్య చ ।
ప్రతిజగ్ముః ప్రముదితాశ్శంసంతో వైష్ణవీం శ్రియమ్ ॥ 28

భగవంతమ్ = శ్రీహరి భగవానుని, పరిక్రమ్య = ప్రదక్షిణము చేసి, ప్రణిపత్య = ప్రణమిల్లి, చ = మరియు, అనుమాన్య = అనుమతిని తీసుకొని, ప్రముదితాః = గొప్ప ఆనందమును పొందినవారై, వైష్ణవీమ్ = విష్ణువునకు సంబంధించిన, శ్రియమ్ = సంపద (శోభ) ను, శంసంతః = వర్ణించుచున్న వారై, ప్రతిజగ్మః = తిరిగి వెళ్లిరి.

వారు శ్రీహరి భగవానునకు ప్రదక్షిణము చేసి, ప్రణమిల్లి, ఆయన అనుమతిని పొంది, ఆయన సంపదను శోభను వర్ణించుకుంటూ, మహానందముతో తిరిగి వెళ్లిరి.

భగవాననుగావాహ యాతం మా భైష్టమస్తు శమ్ ।
బ్రహ్మతేజస్సమర్థోఽపి హంతుం నేచ్ఛే మతం తు మే ॥ 29

భగవాన్ = శ్రీహరి భగవానుడు, అనుగౌ = ఆ ఇద్దరు అనుచరులను ఉద్దేశించి, ఆహ = పలికెను, యాతమ్ = వెళ్లుడు, మా భైష్టమ్ = భయపడకుడు, శమ్ = మంగళము, అస్తు = కలుగుగాక!, సమర్థః అపి = సమర్థుడనే అయిననూ, బ్రహ్మతేజః = బ్రహ్మతేజస్సును, హంతుమ్ = త్రోసిపుచ్చుటకు, న ఇచ్ఛే = నేను ఇష్టపడను, మే = నాకు, మతం తు = సమ్మతమే కూడా.

శ్రీహరి భగవానుడు తన ఇద్దరు అనుచరులతో నిట్లు పలికెను: వెళ్లుడు. భయపడకుడు. మీకు మంగళము కలుగుగాక! బ్రాహ్మణశాపమును కాదని త్రోసిపుచ్చే సామర్థ్యము నాకున్ననూ, ఆ శాపము కూడ నా అభిమతమే యగుటచే, నేను అట్లు చేయనిచ్ఛగించుట లేదు.

ఏతత్పురైవ నిర్దిష్టం రమయా క్రుద్ధయా యదా ।
పురాపవారితా ద్వారి విశంతీ మయ్యుపారతే ॥ 30

యదా = ఏ సమయములోనైతే, పురా = పూర్వము, మయి = నేను, ఉపారతే = యోగనిద్రలోనికి జారుకోగా, విశంతీ = (లక్ష్మీదేవి) లోపల ప్రవేశించుచున్నదై, ద్వారి = ద్వారమునందు, అపవారితా = అడ్డు

కొనబడినదో అప్పుడు, క్రుద్ధయా = కోపమును పొందిన, రమయా = ఆ రమాదేవిచే, ఏతత్ = ఇది, నిర్దిష్టం ఏవ = నిర్దేశించబడియే యున్నది.

పూర్వము ఒకసారి నేను యోగనిద్రలోనుండగా, మీరు లోపలకు వచ్చుచున్న లక్ష్మీదేవిని ద్వారము వద్ద అడ్డుకొనిరి. అపుడామె కోపించి మీకీ శాపమును నిర్దేశించినది.

మయి సంరంభయోగేన నిస్తీర్య బ్రహ్మహేలనమ్ ।
ప్రత్యేష్యతం నికాశం మే కాలేనాల్పీయసా పునః ॥ 31

మయి = నాయందలి, సంరంభయోగేన = క్రోధముయొక్క నిరంతరసంయోగముచే, బ్రహ్మహేలనమ్ = బ్రహ్మవేత్తలను తిరస్కరించిన పాపమును, నిస్తీర్య = తొలగించుకొని, అల్పీయసా = అల్పమగు, కాలేన = కాలముచే, పునః = తిరిగి, మే = నా, నికాశమ్ = సమీపమును గురించి, ప్రతి-ఏష్యతమ్ = తిరిగి రాగలరు.

మీరు నిరంతరముగా నాయందు క్రోధమును చేసి, బ్రహ్మవేత్తలను నిరాకరించిన పాపమును పోగొట్టుకొని, కొద్ది కాలములో మరల నా సన్నిధికి చేరుకొనగలరు.

ద్వాఃస్థావాదిశ్య భగవాన్ విమానశ్రేణిభూషణమ్ ।
సర్వాతిశయయా లక్ష్మ్యా జుష్టం స్వం ధిష్ణ్యమావిశత్ ॥ 32

ద్వాఃస్థౌ = ద్వారపాలకులను, ఆదిశ్య = ఆదేశించి, భగవాన్ = శ్రీహరి భగవానుడు, విమానశ్రేణిభూషణమ్ = విమానముల వరుసలే అలంకారముగా గల, సర్వ-అతిశయయా = సర్వోత్కృష్టమగు (సర్వాధిక సౌందర్యవతియగు), లక్ష్మ్యా = సంపదతో (లక్ష్మీదేవిచే), జుష్టమ్ = కూడియున్న (సేవించబడే), స్వమ్ = తనదైన, ధిష్ణ్యమ్ = స్థానమును, ఆవిశత్ = ప్రవేశించెను.

శ్రీహరి భగవానుడు ద్వారపాలకులనీ విధముగా ఆదేశించి తన స్థానమును ప్రవేశించెను. విమానముల వరుసలతో శోభిల్లే ఆ స్థానము

సర్వాతిశాయియగు సంపదతో నిండి, సర్వాధికసౌందర్యనిధానమగు లక్ష్మీదేవిచే సేవింపబడుచున్నది.

తౌ తు గీర్వాణఋషభౌ దుస్తరాద్ధరిలోకతః ।
హతశ్రియౌ బ్రహ్మశాపాదభూతాం విగతస్మయౌ ॥ 33

తౌ = ఆ, గీర్వాణఋషభౌ తు = దేవతలలో శ్రేష్ఠులగు జయవిజయులైతే, దుస్తరాత్ = తప్పించుకొనుటకు శక్యము కాని, బ్రహ్మశాపాత్ = బ్రాహ్మణశాపము వలన, హరిలోకతః = వైకుంఠమునుండి (నందు), హతశ్రియౌ = నశింపజేయబడిన శోభ గలవారై, విగతస్మయౌ = తొలగిన గర్వము గలవారు, అభూతామ్ = అయిరి.

దేవతలలో శ్రేష్ఠులగు ఆ జయవిజయులైతే దాట శక్యము కాని బ్రాహ్మణశాపము వలన వైకుంఠములోనుండగానే తమ శోభను గోల్పోయిరి. వారు వైకుంఠమునుండి పతితులైరి. వారి గర్వము తొలగిపోయెను.

తదా వికుంఠధిషణాత్తయోర్నిపతమానయోః ।
హాహాకారో మహానాసీద్విమానాగ్ర్యేషు పుత్రకాః ॥ 34

పుత్రకాః = ఓ దేవతలారా!, తదా = అప్పుడు, వికుంఠధిషణాత్ = శ్రీహరి స్థానమగు వైకుంఠమునుండి, తయోః = వారిద్దరు, నిపతమానయోః = పతితులగుచుండగా, విమాన-అగ్ర్యేషు = శ్రేష్ఠమగు విమానములయందు, మహాన్ = పెద్ద, హాహాకారః = హాహాకారము, ఆసీత్ = ఆయెను.

ఓ దేవతలారా! అప్పుడు శ్రీహరియొక్క నివాసస్థానమునుండి వారిద్దరు పతితులగుచుండగా, శ్రేష్ఠమగు విమానములలో నివసించు జనులు పెద్దగా హాహాకారములను చేసిరి.

తావేవ హ్యధునా ప్రాప్తౌ పార్షదప్రవరౌ హరేః ।
దితేర్జఠరనిర్విష్టం కాశ్యపం తేజ ఉల్బణమ్ ॥ 35

తౌ = ఆ, హరేః = శ్రీహరియొక్క, పార్షదప్రవరౌ ఏవ = శ్రేష్ఠులగు అనుచరులే, అధునా = ఇప్పుడు, దితేః = దితియొక్క, జఠరనిర్విష్టమ్ =

ఉదరమునందు ప్రవేశించియున్న, కాశ్యపమ్ = కశ్యప ప్రజాపతికి సంబంధించిన, ఉల్బణమ్ = భయంకరమగు, తేజః = తేజస్సును, ప్రాప్తౌ హి = పొందినారు.

శ్రీహరియొక్క అనుయాయులలో శ్రేష్ఠులగు వారిద్దరు ఇప్పుడు దితియొక్క గర్భములోని భయంకరమగు కశ్యపుని తేజస్సును పొందిరి.

తయోరసురయోరద్య తేజసా యమయోర్హి వః ।
ఆక్షిప్తం తేజ ఏతర్హి భగవాంస్తద్విధిత్సతి ॥ 36

తయోః = ఆ, యమయోః = కవలలగు (యమునివంటి), అసురయోః = ఇద్దరు రాక్షసులయొక్క, తేజసా = తేజస్సుచే, అద్య = ఇప్పుడు, వః = మీ, తేజః = తేజస్సు, ఆక్షిప్తం హి = తిరస్కరించబడినది, ఏతర్హి = ఈ సమయములో, భగవాన్ = శ్రీహరి భగవానుడు, తత్ = ఆ పరిస్థితిని, విధిత్సతి = కలిగించ గోరుచున్నాడు.

మృత్యువువంటి వారిద్దరు రాక్షసులు కవలలు. వారి తేజస్సే ఇప్పుడు మీ తేజస్సును తిరస్కరించి యున్నది. ఈ సమయములో శ్రీహరి భగవానుడే ఈ పరిస్థితిని కలిగించ గోరుచున్నాడు.

విశ్వస్య యః స్థితిలయోద్భవహేతురాద్యో
యోగేశ్వరైరపి దురత్యయయోగమాయః ।
క్షేమం విధాస్యతి స నో భగవాంస్త్ర్యధీశః
తత్రాస్మదీయవిమృశేన కియానిహార్థః ॥ 37

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
షోడశోఽధ్యాయః ॥

యః = ఏ, ఆద్యః = ఆదికారణుడగు, త్రి-అధీశః = ముల్లోకములకు అధీశ్వరుడగు (త్రిగుణములను వశము చేసుకున్న) శ్రీహరి, విశ్వస్య = జగత్తుయొక్క, స్థితిలయ-ఉద్భవహేతుః = సృష్టిస్థితిలయములకు కారణమగుచున్నాడో, యోగీశ్వరైః అపి = యోగిశ్రేష్ఠులచే కూడ, దురత్యయయోగ

మాయః = దాట శక్యము కాని యోగమాయ గల, సః = ఆ, భగవాన్ = భగవానుడు, నః = మనకు, క్షేమమ్ = క్షేమమును, విధాస్యతి = కలిగించగలడు, తత్ర = ఆ విషయము అట్లుండగా, ఇహ = ఈ విషయములో, అస్మదీయవిమృశేన = మా విచారముచే, కియాన్ = ఎంతటి, అర్థః = ప్రయోజనము గలదు?

శ్రీహరి భగవానుడు ఈ జగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు కారణమైన ఆది పురుషుడు. ఆయన సత్త్వరజస్తమోగుణములను తన వశములో నుంచుకున్న త్రిలోకాధిపతి. శ్రేష్ఠులగు యోగులైననూ ఆయన యోగమాయను తరించలేరు. అట్టి ఆ భగవానుడే మనలకు క్షేమమును కలిగించగలడు. దీని గురించి మనము చర్చించి ప్రయోజనమేమున్నది?

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
పదునారవ అధ్యాయము ముగిసినది (16).

* * * * *

# అథ సప్తదశోఽధ్యాయః

## హిరణ్యాక్షుని దిగ్విజయము

మైత్రేయ ఉవాచ ।
నిశమ్యాత్మభువా గీతం కారణం శంకయోజ్ఝితాః ।
తతస్సర్వే న్యవర్తంత త్రిదివాయ దివౌకసః ॥ 1

మైత్రేయః = మైత్రేయ మహర్షి, ఉవాచ = పలికెను, ఆత్మభువా = స్వయంభువుడగు బ్రహ్మగారిచే, గీతమ్ = వర్ణించబడిన, కారణమ్ = కారణమును, నిశమ్య = విని, తతః = తరువాత, దివౌకసః = దేవతలు, సర్వే = అందరు, శంకయా = సందేహముచే, ఉజ్ఝితాః = విడువబడినవారై, త్రిదివాయ = స్వర్గము కొరకు, న్యవర్తంత = మరలి వెళ్లిరి.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- స్వయంభువుడగు బ్రహ్మగారు దేవతల తేజస్సు క్షీణించుటకు గల కారణమును ఈ విధముగా వర్ణించి చెప్పెను. దానిని విని దేవతలందరి సందేహములు తొలగిపోయెను. అపుడు వారు స్వర్గమునకు మరలి వెళ్లిరి.

దితిస్తు భర్తురాదేశాదపత్యపరిశంకినీ ।
పూర్ణే వర్షశతే సాధ్వీ పుత్రౌ ప్రసుషువే యమౌ ॥ 2

సాధ్వీ = పతివ్రతయగు, దితిః తు = దితియైతే, భర్తుః = భర్తయగు కశ్యపుని, ఆదేశాత్ = వచనమును బట్టి, అపత్యపరిశంకినీ = తన సంతానమునందు శంక గలదియై, వర్షశతే = వంద సంవత్సరములు, పూర్ణే = పూర్తి కాగా, యమౌ = కవలలగు, పుత్రౌ = పుత్రులను, ప్రసుషువే = కనెను.

సాధ్వియగు దితి భర్తయగు కశ్యపుడు చెప్పిన దానిని బట్టి తనకు కలుగబోయే సంతానము లోకమునకు ముప్పు తెచ్చునని శంకించుచునే యుండెను. ఆమె వంద సంవత్సరముల పిదప కవల మగపిల్లలను కనెను.

ఉత్పాతా బహవస్తత్ర నిపేతుర్జాయమానయోః ।
దివి భువ్యంతరిక్షే చ లోకస్యోరుభయావహాః ॥ 3

జాయమానయోః = వారు పుట్టుచుండగా, తత్ర = ఆ సమయములో, దివి = స్వర్గమునందు, అంతరిక్షే = అంతరిక్షమునందు, చ = మరియు, భువి = భూలోకమునందు, లోకస్య = లోకమునకు, ఉరుభయ-ఆవహాః = గొప్ప భయమును కలిగించే, బహవః = అనేకములైన, ఉత్పాతాః = చెడు శకునములు, తత్ర = అచట, నిపేతుః = ఉద్భవించినవి.

వారిద్దరు జన్మించుచుండగా ఆ సమయములో, స్వర్గమునందు అంతరిక్షములో మరియు భూమిపై జనులకు గొప్ప భయమును కలిగించే అనేకములగు ఉత్పాతములు ఆవిర్భవించినవి.

సహాచలా భువశ్చేలుర్దిశస్సర్వాః ప్రజజ్వలుః ।
సోల్కాశ్చాశనయః పేతుః కేతవశ్చార్తిహేతవః ॥ 4

సహ-అచలాః = పర్వతములతో కూడిన, భువః = భూఖండములు, చేలుః = కంపించినవి, సర్వాః = అన్ని, దిశః = దిక్కులు, ప్రజజ్వలుః = మండజొచ్చినవి, స-ఉల్కాః = నిప్పుతో గూడిన, అశనయః = పిడుగులు, పేతుః = పడినవి, చ = మరియు, ఆర్తిహేతవః = లోకపీడను కలిగించే, కేతవః = తోకచుక్కలు (కనబడినవి).

పర్వతములతో సహా భూఖండములు కంపించినవి. దిక్కులలో అగ్నిజ్వాలలు బయలు దేరినవి. ఉల్కలు, పిడుగులు పడినవి. లోకపీడను కలిగించే తోకచుక్కలు పొడిచినవి.

వవౌ వాయుస్సుదుస్స్పర్శః ఫూత్కారానీరయన్ముహుః ।
ఉన్మూలయన్నగపతీన్వాత్యానీకో రజోధ్వజః ॥ 5

సుదుస్స్పర్శః = మిక్కిలి నొప్పిని కలిగించే స్పర్శ గలది, వాత్యా-అనీకః = సుడిగాలులే సేనగా గలది, రజః-ధ్వజః = దుమ్ము ధ్వజముగా గలది అగు, వాయుః = వాయువు, ముహుః = మాటిమాటికీ, ఘూత్కారాన్ ఈరయన్ = ఊలలను పెట్టుచున్నదై, నగపతీన్ = పెద్ద వృక్షములను, ఉన్మూలయన్ = పెకిలించుచున్నదై, వవౌ = వీచెను.

మిక్కిలి కఠినమగు స్పర్శగల వాయువు నిరంతరముగా ఊలలను పెట్టుచూ వీచెను. ఆ వాయువునకు సుడులే సేన కాగా, ఎత్తుగా లేచిన దుమ్మే ధ్వజమాయెను. దాని ధాటికి పెద్ద పెద్ద వృక్షములు పెకిలించి వేయబడుచుండెను.

ఉద్ధసత్తడిదంభోదఘటయా నష్టభాగణే ।
వ్యోమ్ని ప్రవిష్టతమసా న స్మ వ్యాదృశ్యతే పదమ్ ॥ 6

ఉత్-హసత్-తడిత్-అంభోదఘటయా = పెద్దగా నవ్వుచున్న మెరుపులు గల మేఘముల గుంపుచే, నష్టభాగణే = కనబడని నక్షత్రగణములు గల, వ్యోమ్ని = ఆకాశమునందు, ప్రవిష్టతమసా = ప్రవేశించిన చీకటిచే, పదమ్ = స్థానము, న వ్యాదృశ్యతే స్మ = లేశమైననూ కానరాలేదు.

ఆకాశములో ఎత్తున మెరుపు తీగలు నవ్వుచున్నట్లు మెరియుచుండెను. మేఘముల గుంపు ఆకాశమును కప్పివేయగా చీకట్లు క్రమ్ముకొనెను. సూర్యుడు, చంద్రుడు మొదలగు జ్యోతిర్మండలములు గాని, నక్షత్రముల గుంపులు గాని కనబడలేదు. ఎక్కడైననూ ఏ వస్తువైననూ కానరాలేదు.

చుక్రోశ విమనా వార్ధిరుదూర్మిః క్షుభితోదరః ।
సోదపానాశ్చ సరితశ్చుక్షుభుశ్శుష్కపంకజాః ॥ 7

ఉత్-ఊర్మిః = ఎత్తైన తరంగములు గల, క్షుభిత-ఉదరః = కలిచివేయబడిన మధ్యభాగము గల, వార్ధిః = సముద్రము, విమనాః = వికలమైన మనస్సు గలది వలె, చుక్రోశ = ఆక్రోశించెను, చ = మరియు, ఉదపానాః = త్రాగునీటిని సమకూర్చే జలాశయములు, సరితః = నదులు, శుష్కపంకజాః = ఎండిన పద్మములు గలవై, చుక్షుభుః = కల్లోలమును పొందినవి.

సముద్రము లోపల కలిచివేయబడి తరంగములు ఉప్పొంగెను. సముద్రము వికలమైన మనస్సు గలవాని వలె ఆక్రోశించెను. మంచినీటి సరస్సులు, నదులు కల్లోలితములయ్యేను. వాటిలోని పద్మములు వాడిపో యెను.

ముహుః పరిధయోఽభూవన్ సరాహ్వోః శశిసూర్యయోః ।
నిర్ఘాతా రథనిర్హ్రాదా వివరేభ్యః ప్రజజ్ఞిరే ॥ 8

సరాహ్వోః = రాహువుతో గూడియున్న, శశిసూర్యయోః = చంద్రు నకు సూర్యునకు, ముహుః = అనేకపర్యాయములు, పరిధయః = పరివేష ములు, అభూవన్ = కలిగినవి, నిర్ఘాతాః = గర్జనలు, వివరేభ్యః = పర్వతగు హలనుండి, రథనిర్హ్రాదాః = రథము పరుగెత్తే ధ్వనివంటి ధ్వనులు, ప్రజ జ్ఞిరే = బయలు దేరినవి.

చంద్రగ్రహణములు, సూర్యగ్రహణములు కలిగినవి. సూర్యచం ద్రుల చుట్టూ నిరంతరముగా పరివేషములు (కాంతి గూడు కట్టుట) కలిగిన వి. మేఘములు లేకుండగనే గర్జనలు వినబడినవి. పర్వతగుహలనుండి రథము పరుగెత్తే ధ్వని వంటి ధ్వని బయలు దేరినది.

అంతర్గ్రామేషు ముఖతో వమంత్యో వహ్నిముల్బణమ్ ।
సృగాలోలూకటంకారైః ప్రణేదురశివం శివాః ॥ 9

అంతః-గ్రామేషు = గ్రామముల మధ్యలో, ముఖతః = నోళ్లనుండి, ఉల్బణమ్ = భయమును గొల్పే, వహ్నిమ్ = నిప్పును, వమంత్యః = గ్రక్కు చున్నవై, శివాః = ఆడు నక్కలు, సృగాల-ఉలూకటంకారైః = మగ నక్కల యొక్క మరియు గుడ్లగూబలయొక్క ధ్వనులతో గూడి, అశివమ్ = అమం గళకరముగా, ప్రణేదుః = బిగ్గరగా కూసినవి.

గ్రామముల మధ్యలో ఆడు నక్కలు నిప్పును గ్రక్కుచూ అమంగ ళకరముగా బిగ్గరగా కూసినవి. మగనక్కలు, గుడ్లగూబలు వాటికి తోడైనవి.

సంగీతవద్రోదనవదున్నమయ్య శిరోధరామ్ ।

వ్యముంచన్ వివిధా వాచో గ్రామసింహాస్తతస్తతః ॥ 10

తతః తతః = అక్కడక్కడ, గ్రామసింహాః = కుక్కలు, శిరోధరామ్ = మెడను, ఉన్నమయ్య = పైకెత్తి, సంగీతవత్ = సంగీతము వలె, రోదనవత్ = ఏడ్పు వలె, వివిధాః = అనేకములగు, వాచః = శబ్దములను, వ్యముంచన్ = విడిచిపెట్టినవి.

అక్కడక్కడ కుక్కలు మెడలను పైకెత్తి అనేకవిధముల శబ్దములను చేసినవి. వాటిలో కొన్ని ధ్వనులు సంగీతమును, మరికొన్ని ఏడ్పును పోలియుండెను.

ఖరాశ్చ కర్కశైః క్షత్తః ఖురైర్ఘ్నంతో ధరాతలమ్ ।
ఖార్కారరభసా మత్తాః పర్యధావన్ వరూథశః ॥ 11

క్షత్తః = ఓ విదురా!, ఖరాః చ = గాడిదలు కూడ, కర్కశైః = వాడియైన, ఖురైః = డెక్కలతో, ధరాతలమ్ = భూతలమును, ఘ్నంతః = కొట్టుచున్నవై, ఖార్కారరభసాః = ఖరఖరశబ్దముతో హడావుడి చేయుచున్నవై, మత్తాః = మదించినవై, వరూథశః = గుంపులుగా, పర్యధావన్ = ఇటునటు పరుగులెత్తినవి.

ఓ విదురా! మత్తెక్కిన గాడిదలు గుంపులుగా చేరి డెక్కలతో నేలను త్రవ్వుచూ ఖరఖర శబ్దమును చేయుచూ హడావుడిగా ఇటునటు పరుగులు తీసినవి.

రుదంతో రాసభత్రస్తా నీడాదుదపతన్ ఖగాః ।
ఘోషేఽరణ్యే చ పశవశ్శకృన్మూత్రమకుర్వత ॥ 12

రాసభత్రస్తాః = గాడిదలచే భయమును పొందిన, ఖగాః = పక్షులు, రుదంతః = ఏడ్చుచున్నవై, నీడాత్ = గూటినుండి, ఉదపతన్ = ఎగిరి పడినవి, ఘోషే = గొల్లపల్లెయందు, చ = మరియు, అరణ్యే = అరణ్యమునందు, పశవః = పశువులు, శకృత్ = పురీషమును, మూత్రమ్ = మూత్రమును, అకుర్వత = చేసినవి.

గాడిదల ఓండ్ర ధ్వనులకు భయపడి పక్షులు ఏడుస్తూ గూళ్ల నుండి ఎగిరి నేలగూలినవి. గొల్లపల్లెలయందు, అరణ్యములయందు పశువులు భయముచే మలమూత్రములను విడిచి పెట్టుచుండెను.

గావోఽత్రసన్నసృగ్దోహాస్తోయదాః పూయవర్షిణః ।
వ్యరుదన్ దేవలింగాని ద్రుమాః పేతుర్వినానిలమ్ ॥ 13

అసృక్-దోహాః = పొదుగులనుండి రక్తమును స్రవించే, గావః = ఆవులు, అత్రసన్ = భయపడినవి, తోయదాః = మేఘములు, పూయవర్షిణః = చీమును వర్షించినవి, దేవలింగాని = దేవతల ప్రతిమలు, వ్యరుదన్ = విశేషముగా కన్నీటిని కార్చినవి, ద్రుమాః = చెట్లు, అనిలం వినా = గాలి లేకుండగనే, పేతుః = నేల గూలినవి.

ఆవులు బెదిరిపోతూ పొదుగులనుండి రక్తమును స్రవించినవి. మేఘములు చీమును వర్షించినవి. దేవతల ప్రతిమలు విశేషముగా కన్నీటిని కార్చినవి. చెట్లు గాలి లేకుండగనే నేల గూలినవి.

గ్రహాన్ పుణ్యతమానన్యే భగణాంశ్చాపి దీపితాః ।
అతిచేరుర్వక్రగత్యా యుయుధుశ్చ పరస్పరమ్ ॥ 14

పుణ్యతమాన్ = శుభకరమగు, గ్రహాన్ = గ్రహములను, చ = మరియు, భగణాన్ అపి = నక్షత్రగణములను కూడ, దీపితాః = ప్రకాశించుచున్న, అన్యే = క్రూరగ్రహములు, వక్రగత్యా = వంకర మార్గముచే, అతిచేరుః = దాటి సంచరించినవి, చ = మరియు, పరస్పరమ్ = ఒకదానితో మరియొకటి, యుయుధుః = పోటీ పడినవి.

ప్రకాశించే క్రూరగ్రహములు శుభకరమగు గ్రహములను, మరియు నక్షత్రగణములను కూడ వక్రమార్గము గుండా దాటి సంచరించ జొచ్చినవి. అవి ఒకదానితో మరియొకటి పోటీ పడినవి.

దృష్ట్వాన్యాంశ్చ మహోత్పాతానతత్త్వవిదః ప్రజాః ।
బ్రహ్మపుత్రాన్నృతే భీతా మేనిరే విశ్వసంప్లవమ్ ॥ 15

అన్యాన్ = ఇతరములగు, మహా-ఉత్పాతాన్ చ = పెద్ద ఉత్పాతములను కూడ, దృష్ట్వా = చూచి, బ్రహ్మపుత్రాన్ ఋతే = బ్రహ్మగారి పుత్రులగు సనకాది మహర్షులను మినహాయించి, అతత్త్వవిదః = వాటి రహస్యమునెరుంగని, ప్రజాః = జనులు, భీతాః = భయపడినవారై, విశ్వసంప్లవమ్ = జగత్తునకు ప్రళయమును, మేనిరే = తలపోసిరి.

ఇంతే గాక, ఇతరములగు పెద్ద ఉత్పాతములు కూడ బయలు దేరినవి. వాటి రహస్యమునెరుంగని జనులు వాటిని చూచి భయపడి జగత్తునకు ప్రళయము దాపురించినదని తలపోసిరి. బ్రహ్మపుత్రులగు సనకాది మహర్షులు మాత్రము సర్వము తెలిసినవారగుటచే భయపడలేదు.

తావాదిదైత్యౌ సహసా వ్యజ్యమానాత్మపౌరుషౌ ।
వవృధాతేఽశ్మసారేణ కాయేనాద్రిపతీ ఇవ ॥ **16**

తౌ = ఆ, ఆదిదైత్యౌ = దితియొక్క ప్రథమసంతానమగు రాక్షసులిద్దరు, సహసా = వెంటనే, వ్యజ్యమాన-ఆత్మపౌరుషౌ = ప్రకటమగుచున్న స్వీయపరాక్రమము గలవారై, అశ్మసారేణ = ఇనుమువంటి దార్ఢ్యము గల, కాయేన = దేహముతో, అద్రిపతీ ఇవ = గొప్ప పర్వతముల వలె, వవృధాతే = పెరిగిరి.

దితియొక్క ప్రథమసంతానమగు ఆ రాక్షసులిద్దరు వెంటనే తమ పరాక్రమమును ప్రకటించువారై, ఇనుము వలె దృఢమైన దేహములు గలవారై, పెద్ద పర్వతముల వలె పెరిగి పెద్దవారైరి.

దివిస్పృశౌ హేమకిరీటకోటిభిః
నిరుద్ధకాష్ఠౌ స్ఫురదంగదాభుజౌ ।
గాం కంపయంతౌ చరణైః పదే పదే
కట్యా సుకాంచ్యార్కమతీత్య తస్థతుః ॥ **17**

హేమకిరీటకోటిభిః = బంగరు కిరీటముల కొనలతో, దివిస్పృశౌ = ద్యులోకమును స్పృశించుచున్నవారై, నిరుద్ధకాష్ఠౌ = వ్యాపించబడిన దిః ¯ స్ఫురత్-అంగదాభుజౌ = ప్రకాశించే బాహుపురులు

గల భుజములు గలవారై, పదే పదే = ప్రతి అడుగునందు, చరణైః = పాద ములచే, గామ్ = భూమిని, కంపయంతౌ = కంపింప జేయుచున్నవారై, సుకాంచ్యా = అందమైన మొలనూలు గల, కట్యా = నడుముతో, అర్కమ్ = సూర్యుని, అతీత్య = అతిక్రమించి, తస్థతుః = నిలిచిరి.

దిక్కులను వ్యాపించియున్న వారిద్దరి బంగరు కిరీటముల కొనలు ద్యులోకమును తాకుచుండెను. వారి భుజములయందు బాహుపురులు, నడుమునందు అందమైన మొలనూలు ప్రకాశించుచుండెను. వ రు వేసే ప్రతి అడుగునకు భూమి కంపించుచుండెను. వారు సూర్యుని క ంటె అధిక ముగా ప్రకాశించుచుండిరి.

ప్రజాపతిర్నామ తయోరకార్షీద్
యః ప్రాక్ స్వదేహాద్యమయోరజాయత ।
తం వై హిరణ్యకశిపుం విదుః ప్రజా
యం తం హిరణ్యాక్షమసూత సాగ్రతః ॥ **18**

తయోః = వారిద్దరికి, ప్రజాపతిః = కశ్యప ప్రజాపతి, నామ = పేరు ను, అకార్షీత్ = పెట్టెను, యమయోః = కవల పిల్లలిద్దరిలో, యః = ఎవడైతే, స్వదేహాత్ = తన దేహమునుండి, ప్రాక్ = ముందుగా, అజాయత = పుట్టెనో, తం వై = వానిని, హిరణ్యకశిపుమ్ = హిరణ్యకశిపునిగా, యమ్ = ఎవనిని, సా = ఆమె, అగ్రతః = ముందుగా, అసూత = కనెనో, తమ్ = వానిని, హిర ణ్యాక్షమ్ = హిరణ్యాక్షునిగా, ప్రజాః = జనులు, విదుః = తెలియుచున్నారు.

ఆ కవల పిల్లలిద్దరికీ కశ్యప ప్రజాపతి నామకరణము చేసెను. వారిలో ముందుగా ప్రజాపతిగారి దేహమునుండి పుట్టిన (జన్మక్రమములో రెండవ వాడు) వానిని హిరణ్యకశిపుడనియు, ఎవనిని దితి ముందుగా కనెనో వానిని హిరణ్యాక్షుడనియు జనులు వ్యవహరించుచున్నారు.

చక్రే హిరణ్యకశిపుర్దోర్భ్యాం బ్రహ్మవరేణ చ ।
వశే సపాలాన్ లోకాంస్త్రీనకుతోమృత్యురుద్ధతః ॥ **19**

దోర్భ్యామ్ = భుజములచే, ఉద్ధతః = గర్వించినవాడు, చ = మరి యు, బ్రహ్మవరేణ = బ్రహ్మగారి వరముచే, అకుతోమృత్యుః = దేనివలనైననూ మరణము లేనివాడు అగు, హిరణ్యకశిపుః = హిరణ్యకశిపుడు, సపాలాన్ = లోకపాలకులతో కూడిన, త్రీన్ = మూడు, లోకాన్ = లోకములను, వశే = తన వశమునందు, చక్రే = పెట్టుకొనెను.

హిరణ్యకశిపుడు తన భుజబలముచే చాల గర్వించి, బ్రహ్మగారినుండి దేనివలనైననూ మరణము లేని విధముగా వరమును పొంది, లోకపాలకులతో సహా ముల్లోకములను తన వశములో నుంచుకొనెను.

హిరణ్యాక్షోऽనుజస్తస్య ప్రియః ప్రీతికృదన్వహమ్ ।
గదాపాణిర్దివం యాతో యుయుత్సుర్మృగయన్ రణమ్ ॥20

తస్య = వానికి, ప్రియః = ప్రియమైన, అనుజః = తమ్ముడు, అన్వహమ్ = నిత్యము, ప్రీతికృత్ = ప్రీతిని కలిగించువాడు అగు, హిరణ్యాక్షః = హిరణ్యాక్షుడు, యుయుత్సుః = యుద్ధమును చేయవలెననే కోరిక గలవాడై, గదాపాణిః = గదను చేతబట్టినవాడై, రణమ్ = యుద్ధమును, మృగయన్ = వెదుకుచున్నవాడై, దివమ్ = స్వర్గమును గూర్చి, యయౌ = వెళ్లెను.

వాని అనుంగు తమ్ముడగు హిరణ్యాక్షుడు నిత్యము అన్నగారికి ప్రీతిని కలిగించెడివాడు. ఆతనికి యుద్ధమునందు ప్రీతి మెండు. ఆతడు గదను చేతబట్టి, యుద్ధమును చేసే అవకాశము కొరకు వెదుకుకుంటూ, స్వర్గమునకు వెళ్లెను.

తం వీక్ష్య దుస్సహజవం రణత్కాంచననూపురమ్ ।
వైజయంత్యా స్రజా జుష్టమంసన్యస్తమహాగదమ్ ॥ 21

మనోవీర్యవరోత్సిక్తమసృణ్యామకుతోభయమ్ ।
భీతా నిలిల్యిరే దేవాస్తార్క్ష్యత్రస్తా ఇవాహయః ॥ 22

దుస్సహజవమ్ = సహింప శక్యము కాని వేగము గలవాడు, రణత్-కాంచననూపురమ్ = ధ్వనించుచున్న బంగరు పెండెరము గలవాడు, వైజ

యంత్యా = విజయమును సూచించే, స్రజా = మాలతో, జుష్టమ్ = అలంక రించ బడినవాడు, అంసన్యస్తమహాగదమ్ = భుజమునందు ఉంచబడిన పెద్ద గద గలవాడు, మనోవీర్యవర-ఉత్సిక్తమ్ = మనోబలము శరీరబలము మరియు బ్రహ్మగారి వరము అనువాటిచే గర్వించి యున్నవాడు, అసృణ్యమ్ = నిరంకుశుడు, అకుతోభయమ్ = దేనివలనైననూ భయము లేని వాడు అగు హిరణ్యాక్షుని, వీక్ష్య = చూచి, దేవాః = దేవతలు, భీతాః = భయపడినవారై, తార్క్ష్యత్రస్తాః = గరుత్మంతుని వలన భయపడిన, అహయః ఇవ = సర్పములు వలె, నిలిల్యిరే = దాగియుండిరి.

హిరణ్యాక్షుని వేగమును సహించుట చాల కష్టము. ఆతడు భుజముపై పెద్ద గదను పెట్టుకొని నడుచుచుండగా కాలి బంగరు పెండెరములు గణగణలాడుచుండెను. ఆతడు మెడలో విజయసూచకముగా పుష్పమాలను ధరించి యుండెను. ఆతడు మనోబలముచే, శరీరబలముచే మరియు బ్రహ్మగారి వరముచే గర్వించియుండెను. నిరంకుశుడగు ఆ హిరణ్యాక్షునకు ఏదన్నా భయము లేదు. వానిని చూచి దేవతలు భయపడి, గరుత్మంతునకు భయపడిన పాముల వలె, దాగియుండిరి.

స వై తిరోహితాన్ దృష్ట్వా మహసా స్వేన దైత్యరాట్ ।
సేంద్రాన్ దేవగణాన్ క్షీబానపశ్యన్ వ్యనదద్ భృశమ్ ॥ 23

సః = ఆ, దైత్యరాట్ = రాక్షసరాజు, క్షీబాన్ = గర్వితులైన, స-ఇంద్రాన్ = ఇంద్రునితో గూడిన, దేవగణాన్ = దేవగణములను, అపశ్యన్ = కానరానివాడై, స్వేన = తన, మహసా = తేజస్సుచే, తిరోహితాన్ = దాగిన వారినిగా, దృష్ట్వా = గమనించి, భృశమ్ = అధికముగా, వ్యనదత్ = గర్జించెను.

ఆ రాక్షసరాజునకు గర్వితులై యుండే ఇంద్రాది దేవతలు కానరాలేదు. వారు తన తేజస్సునకు జడిసి దాగియున్నారని ఆతనికి తెలిసిపోయెను. అపుడాతడు బిగ్గరగా గర్జించెను.

తతో నివృత్తః క్రీడిష్యన్ గంభీరం భీమనిస్వనమ్ ।
విజగాహే మహాసత్త్వో వార్ధిం మత్త ఇవ ద్విపః ॥ 24

తతః = తరువాత, మహాసత్త్వః = మహాబలశాలియగు హిరణ్యాక్షుడు, నివృత్తః = వెనుదిరిగినవాడై, క్రీడిష్యన్ = క్రీడించబోవువాడై, మత్తః = మదించిన, ద్విపః ఇవ = ఏనుగు వలె, భీమనిస్వనమ్ = భయంకరమగు శబ్దమును చేయుచున్న, గంభీరమ్ = లోతైన, వార్ధిమ్ = సముద్రమును, విజగాహే = ప్రవేశించెను.

తరువాత మహాబలశాలియగు ఆ హిరణ్యాక్షుడు స్వర్గమునుండి వెనుదిరిగెను. వానికి క్రీడించవలెనని బుద్ధి పుట్టెను. అపుడాతడు భయంకరమగు ధ్వనిని చేయుచున్న అగాధమైన సముద్రము లోనికి మదించిన ఏనుగువలె ప్రవేశించెను.

తస్మిన్ ప్రవిష్టే వరుణస్య సైనికా
యాదోగణాస్సన్నధియస్ససాధ్వసాః ।
అహన్యమానా అపి తస్య వర్చసా
ప్రధర్షితా దూరతరం ప్రదుద్రువుః ॥ 25

తస్మిన్ = ఆ హిరణ్యాక్షుడు, ప్రవిష్టే = ప్రవేశించగా, వరుణస్య = వరుణుని, సైనికాః = సైనికులగు, యాదోగణాః = జలజంతువుల సమూహములు, సన్నధియః = ఏమి చేయాలో తోచని బుద్ధి గలవై, ససాధ్వసాః = భయముతో కూడినవై, అహన్యమానాః అపి = కొట్టబడక పోయిననూ, తస్య = వాని, వర్చసా = తేజస్సుచే, ప్రధర్షితాః = కంగారు పడిపోయినవై, దూరతరమ్ = చాల దూరము, ప్రదుద్రువుః = పారిపోయినవి.

ఆ హిరణ్యాక్షుడు సముద్రములో ప్రవేశించగానే, వరుణుని సైనికులగు జలజంతువులు ఏమి చేయాలో తోచక చాల భయమును పొందినవి. ఆతడు వాటి జోలికి పోకున్ననూ, అవి అతని తేజస్సును తాళలేక పోయినవి. అవి అపుడు గుంపులు గుంపులుగా చాల దూరము పారిపోయినవి.

స వర్షపూగానుదధౌ మహాబలః
చరన్మహోర్మీన్ శ్వసనేరితాన్ముహుః ।
మౌర్వ్యాభిజఘ్నే గదయా విభావరీ-

మాసేదివాంస్తాత పురీం ప్రచేతసః ॥ 26

తాత = ఓ వత్సా!, మహాబలః = మహాబలశాలియగు, సః = ఆ హిరణ్యాక్షుడు, వర్షపూగాన్ = అనేకసంవత్సరముల కాలము, ఉదధౌ = సముద్రమునందు, చరన్ = విహరించుచున్నవాడై, శ్వసన-ఈరితాన్ = ఊపిరిచే లేవగొట్టబడిన, మహా-ఊర్మీన్ = పెద్ద తరంగములను, ముహుః = పలుమార్లు, మౌర్వ్యా = లోహనిర్మితమైన, గదయా = గదతో, అభిజఘ్నే = కొట్టెను, ప్రచేతసః = వరుణుని, పురీమ్ = నగరమగు, విభావరీమ్ = విభావరిని, ఆసేదివాన్ = చేరుకొనెను.

ఓ వత్సా! మహాబలుడగు ఆ హిరణ్యాక్షుడు సముద్రమునందు తన ఊపిరిచే లేవగొట్టబడిన పెద్ద పెద్ద తరంగములను లోహమయమగు గదతో కొట్టుతూ అనేకసంవత్సరములు విహరించెను. తరువాత ఆతడు వరుణుని రాజధానియగు విభావరిని చేరుకొనెను.

తత్రోపలభ్యాసురలోకపాలకం
యాదోగణానామృషభం ప్రచేతసమ్ ।
స్మయన్ ప్రలబ్ధుం ప్రణిపత్య నీచవత్
జగాద మే దేహ్యధిరాజ సంయుగమ్ ॥ 27

తత్ర = అచట, అసురలోకపాలకమ్ = రాక్షసలోకములను పాలించునట్టియు, యాదోగణానామ్ = జలజంతువుల సమూహములకు, ఋషభమ్ = ప్రభువు అయిన, ప్రచేతసమ్ = వరుణుని, ఉపలభ్య = కనుగొని, స్మయన్ = చిరునవ్వు నవ్వుతూ, ప్రలబ్ధుమ్ = మోసగించుటకై, నీచవత్ = అల్పుని వలె, ప్రణిపత్య = నమస్కరించి, జగాద = పలికెను, అధిరాజ = ఓ మహారాజా!, మే = నా కొరకు, సంయుగమ్ = యుద్ధమును, దేహి = ఇమ్ము.

హిరణ్యాక్షుడు అచట రాక్షసలోకము (పాతాళము) నకు అధీశ్వరుడు, జలజంతుసముదాయములకు ప్రభువు అగు వరుణుని కనుగొనెను. అపుడాతడు ఆయనను మోసగించుట కొరకై, చిరునవ్వుతో అల్పుని వలె నటిస్తూ, ఆయనకు నమస్కరించి, ఇట్లు పలికెను: ఓ మహారాజా! నాకు యుద్ధమును చేసే అవకాశమును కల్పించుము.

త్వం లోకపాలోఽధిపతిర్బృహచ్ఛ్రవా
వీర్యాపహో దుర్మదవీరమానినామ్ ।
విజిత్య లోకేఽఖిలదైత్యదానవాన్
యద్రాజసూయేన పురాయజత్ప్రభో ॥ 28

ప్రభో= ఓ ప్రభూ!, త్వమ్ = నీవు, లోకపాలః = లోకపాలకుడవు, బృహత్-శ్రవాః = గొప్ప కీర్తి గల, అధిపతిః = ప్రభుడవు, దుర్మదవీరమానినామ్ = పొగరుమోతుతనముచే తనను తాను వీరుడనని తలబోసే వారి, వీర్య-అపహః = పరాక్రమమును అపహరించువాడవు, యత్ = ఏలయనగా, పురా = పూర్వము, లోకే = లోకమునందలి, అఖిలదైత్యదానవాన్ = దైత్యులను దానవులను అందరినీ, విజిత్య = జయించి, రాజసూయేన = రాజసూయ యాగముచే, అయజత్ = ఈశ్వరుని ఆరాధించితివో.

ఓ ప్రభూ! లోకపాలకుడవగు నీవు గొప్ప కీర్తి గల ప్రభుడవు. ఎవరైతే పొగరుతో తామే గొప్ప వీరులమని తలపోయుదురో, నీవు వారి పరాక్రమమును అపహరించెదవు. పూర్వము నీవు లోకములోని దైత్యులను దానవులను జయించి, రాజసూయయాగమును చేసియుంటివి.

స ఏవముత్సిక్తమదేన విద్విషా
దృఢం ప్రలబ్ధో భగవానపాం పతిః ।
రోషం సముత్థం శమయన్ స్వయా ధియా
వ్యవోచదంగోపశమం గతా వయమ్ ॥ 29

ఏవమ్ = ఈ విధముగా, ఉత్సిక్తమదేన = పెరిగిన పొగరు గల, విద్విషా = శత్రువగు ఆ హిరణ్యాక్షునిచే, దృఢమ్ = గట్టిగా, ప్రలబ్ధః = వేళాకోళము చేయబడిన, భగవాన్ = పూజ్యుడగు, అపాం పతిః = జలాధిపతియగు వరుణుడు, సముత్థమ్ = పైకి ఉబుకుచున్న, రోషమ్ = కోపమును, స్వయా = తన, ధియా = బుద్ధిచే, శమయన్ = చల్లార్చుకున్నవాడై, వ్యవోచత్ = పలికెను, అంగ = ఓ రాక్షసరాజా!, వయమ్ = మేము, ఉపశమమ్ = ఉపరతిని, గతాః = పొందియున్నాము.

ఈ విధముగా పొగరు పెరిగిన హిరణ్యాక్షుడు శత్రుబుద్ధితో జలాధిపతియగు వరుణ భగవానుని గట్టిగా వేళాకోళము చేసెను. కాని, ఆయన పైకి ఉబుకుచున్న కోపమును తన బుద్ధిచే చల్లార్చుకొని, ఇట్లు పలికెను: ఓ రాక్షసరాజా! మేము యుద్ధములనుండి విరమించుకున్నాము.

పశ్యామి నాన్యం పురుషాత్పురాతనాత్
యస్సంయుగే త్వాం రణమార్గకోవిదమ్ ।
ఆరాధయిష్యత్యసురర్షభేహి తం
మనస్వినో యం గృణతే భవాదృశాః ॥ **30**

అసుర-ఋషభ = ఓ రాక్షసశ్రేష్ఠా!, పురాతనాత్ = సనాతనుడగు, పురుషాత్ = పురుషుడగు శ్రీహరి కంటె, అన్యమ్ = మరియొకనిని, న పశ్యామి = కనజాలను, యః = ఎవడైతే, సంయుగే = యుద్ధమునందు, రణమార్గకోవిదమ్ = యుద్ధపద్ధతులలో దిట్టవగు, త్వామ్ = నిన్ను, ఆరాధయిష్యతి = సంతోషపెట్ట గలడో, తమ్ = వానిని గూర్చి, ఇహి = వెళ్లుము, యమ్ = ఎవ్వానిని, భవాదృశాః = నీవంటి, మనస్వినః = శూరులు, గృణతే = స్తుతించుచున్నారో.

ఓ రాక్షసశ్రేష్ఠా! యుద్ధవిధానములో నిపుణుడవగు నిన్ను సంతోషపెట్ట గలవాడు సనాతన పురుషుడగు శ్రీహరి కంటె మరియొకడు లేడని నేను భావిస్తున్నాను. కావున, నీవు ఆయన వద్దకు వెళ్లుము. నీవంటి శూరులు ఆయనను కొనియాడుచుందురు.

తం వీరమారాదభిపద్య విస్మయః
శయిష్యసే వీరశయే శ్వభిర్వృతః ।
యస్త్వద్విధానామసతాం ప్రశాంతయే
రూపాణి ధత్తే సదనుగ్రహేచ్ఛయా ॥ **31**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
సప్తదశోఽధ్యాయః ॥

తమ్ = ఆ, వీరమ్ = వీరుని, ఆరాత్ = తొందరలోనే, అభిపద్య = పొంది, విస్మయః = తొలగిన గర్వము గలవాడవై, వీరశయే = యుద్ధభూమి యందు, శ్వభిః = కుక్కలచే, వృతః = చుట్టువారబడినవాడవై, శయిష్యసి = నిద్రించగలవు, యః = ఎవడైతే, త్వత్-విధానామ్ = నీవంటి, అసతామ్ = దుష్టుల, ప్రశాంతయే = వినాశము కొరకు, సత్-అనుగ్రహ-ఇచ్ఛయా = సత్పురుషులను అనుగ్రహించవలెననే కోరికతో, రూపాణి = అవతారముల ను, ధత్తే = ధరించునో.

ఆ వీరుని నీవు తొందరలోనే చూడగలవు. అపుడు నీ గర్వము తొలగిపోవును. నీవు యుద్ధభూమియందు నిద్రించుచుండగా, నీ చుట్టూ కుక్కలు తిరుగుచుండును. నీవంటి దుష్టులను నశింపజేసి, సత్పురుషుల ననుగ్రహించుట కొరకై ఆయన అవతారములను ధరించుచుండును.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధమునందు
పదునేడవ అధ్యాయము ముగిసినది (17).



# అథ అష్టాదశోఽధ్యాయః

## హిరణ్యాక్షునితో వరాహ భగవానుని యుద్ధము

మైత్రేయ ఉవాచ ।
తదేవమాకర్ణ్య జలేశభాషితం
మహామనాస్తద్విగణయ్య దుర్మదః ।
హరేర్విదిత్వా గతిమంగ నారదాత్
రసాతలం నిర్వివిశే త్వరాన్వితః ॥ 1

మైత్రేయః = మైత్రేయ మహర్షి, ఉవాచ = పలికెను, అంగ = ఓ విదురా!, ఏవమ్ = ఈ విధముగా, తత్ = ఆ, జల-ఈశభాషితమ్ = జలములకు ప్రభువగు వరుణుని వచనమును, ఆకర్ణ్య = విని, మహామనాః = హర్షముతో నిండిన మనస్సు గల, దుర్మదః = గర్వించియున్న హిరణ్యాక్షుడు, విగణయ్య = (వరుణుని మాటను) త్రోసిపుచ్చి, నారదాత్ = నారదుని వలన, హరేః = శ్రీహరియొక్క, గతిమ్ = ఉన్న స్థలమును, విదిత్వా = తెలుసుకొని, త్వరా-అన్వితః = తొందరతో కూడినవాడై, రసాతలమ్ = రసాతలమును, నిర్వివిశే = ప్రవేశించెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఓ విదురా! జలాధిపతియగు వరుణుని ఈ వచనములను విని, గర్వించియున్న హిరణ్యాక్షునకు యుద్ధమును చేసే పురుషుడు లభించినందులకు హృదయము హర్షముతో నిండిపోయెను. నీవా పురుషుని చేతిలో మరణించెదవని వరుణుడు చెప్పిన మాటను ఆతడు త్రోసిపుచ్చి, నారదుని వలన శ్రీహరి ఉన్న స్థానమును తెలుసుకొని, తొందరగా రసాతలమును ప్రవేశించెను.

దదర్శ తత్రాభిజితం ధరాధరం

ప్రోన్నీయమానావనిమగ్రదంష్ట్రయా ।
ముష్ణంతమక్ష్ణా స్వరుచోఽరుణశ్రియా
జహాస చాహో వనగోచరో మృగః ॥ 2

తత్ర = అచట, అభిజితమ్ = సర్వమును జయించునట్టియు, అగ్ర దంష్ట్రయా = కోరల అగ్రభాగముచే, ప్రోన్నీయమాన-అవనిమ్ = పైకి ఎత్త బడి తీసుకురాబడుతున్న భూమి గలిగినట్టియు, అరుణశ్రియా = ఎర్రని శోభతో కూడిన, అక్ష్ణా = కన్నుతో, స్వరుచః = తన (హిరణ్యాక్షుని) కాంతు లను, ముష్ణంతమ్ = హరించుచున్న, ధరాధరమ్ = భూమిని మోయుచు న్న (పర్వతాకారుడైన) వరాహ భగవానుని, దదర్శ = చూచెను, చ = మరి యు, అహో = అరే!, వనగోచరః = అడవిలో కనబడే (నీటిలో సంచరించే), మృగః = పశువు, జహాస = నవ్వెను.

అచట హిరణ్యాక్షుడు పర్వతాకారములోనున్న విశ్వవిజేతయగు వరాహ భగవానుని చూచెను. ఆయన తన కోరల కొనపై భూమిని ఎత్తి తీసుకువచ్చు చుండెను. ఎర్రని కన్నుల శోభతో ప్రకాశించే ఆ భగవానుని ముందు హిరణ్యాక్షుని తేజస్సు వెలవెల పోయెను. ఆతడు ఆయనను చూచి, అరే! ఇది అడవిలో కనబడే (నీటిలో సంచరించే) పశువు!, అని పలికి నవ్వెను.

ఆహైనమేహ్యజ్ఞ మహీం విముంచ నో
రసౌకసాం విశ్వసృజేయమర్పితా ।
న స్వస్తి యాస్యస్యనయా మమేక్షతః
సురాధమాసాదితసూకరాకృతే ॥ 3

ఏనమ్ = ఈ భగవానుని గూర్చి, ఆహ = పలికెను, అజ్ఞ = ఓరీ మూర్ఖా!, ఏహి = రమ్ము, మహీమ్ = భూమిని, విముంచ = విడిచిపెట్టుము, రసా-ఓకసామ్ = రసాతలనివాసులమగు, నః = మాకు, విశ్వసృజా = జగ త్తును సృష్టించిన బ్రహ్మగారిచే, ఇయమ్ = ఈ భూమి, అర్పితా = ఈయబ డినది, సుర-అధమ = దేవతలలో అధముడా!, ఆసాదితసూకర-ఆకృతే = స్వీకరించబడిన వరాహరూపము గలవాడా!, మమ = నేను, ఈక్షతః =

చూచుచుండగా, అనయా = ఈ భూమితో, స్వస్తి = మంగళమును, న యాస్యసి = పొందలేవు.

ఆ హిరణ్యాక్షుడు వరాహ భగవానునితో నిట్లు పలికెను: ఓరీ మూర్ఖా! ఇటు రమ్ము. ఆ భూమిని విడిచిపెట్టుము. జగత్తును సృష్టించిన బ్రహ్మగారు రసాతలవాసులగు మాకు ఆ భూమిని ఇచ్చినాడు. నేను చూచుచుండగా నీవా భూమిని తీసుకొని సుఖమును పొందలేవు. వరాహ రూపమును దాల్చిన నీవు దేవతలలో అధముడవు.

త్వం నస్సపత్నైరభవాయ కిం భృతో
యో మాయయా హంత్యసురాన్ పరోక్షజిత్ ।
త్వాం యోగమాయాబలమల్పపౌరుషం
సంస్థాప్య మూఢ ప్రమృజే సుహృచ్ఛుచః ॥ 4

మూఢ = ఓరీ మూర్ఖా!, త్వమ్ = నీవు, సపత్నైః = శత్రువులచే, నః = మా, అభవాయ = వినాశము కొరకు, కిం భృతః = పోషించబడినావా యేమి?, పరోక్షజిత్ = ఎదురు పడకుండగా జయమును సంపాదించే, యః = ఏ నీవు, మాయయా = మాయచే, అసురాన్ = రాక్షసులను, హంతి = సంహరించెదవో, యోగమాయాబలమ్ = యోగమాయయే శక్తిగా గల, అల్పపౌరుషమ్ = అల్పమగు పౌరుషము గల, త్వామ్ = నిన్ను, సంస్థాప్య = సంహరించి, సుహృత్-శుచః = మిత్రుల (బంధువుల) కన్నీటిని, ప్రమృజే = తుడిచెదను.

ఓరీ మూర్ఖా! మా శత్రువులు మమ్ములను నశింప జేయుట కొరకై నిన్ను పెంచి పోషించినారా యేమి? నీవు ఎదురు పడకుండగా మాయతో రాక్షసులను సంహరించి విజయమును పొందుచున్నావు. యోగమాయయే నీ బలము. నీ పౌరుషము అల్పము. నిన్ను సంహరించి, నేను మిత్రుల (బంధువుల) కన్నీటిని తుడిచెదను.

త్వయి సంస్థితే గదయా శీర్ణశీర్ష-
ణ్యస్మద్భుజచ్యుతయా యే చ తుభ్యమ్ ।

బలిం హరంత్యృషయో యే చ దేవాః
స్వయం సర్వే న భవిష్యంత్యమూలాః ॥ 5

అస్మద్-భుజచ్యుతయా = మా భుజములచే విడిచిపెట్టబడిన, గదయా = గదచే, శీర్ణశీర్షణి = పగులగొట్టబడిన తల గల, త్వయి = నీవు, సంస్థితే = మరణించగా, యే = ఏ, ఋషయః = మహర్షులు, తుభ్యమ్ = నీ కొరకు, బలిమ్ = ఉపహారమును, హరంతి = సమర్పించుచున్నారో, చ = మరియు, యే = ఏ, దేవాః = దేవతలు గలరో, సర్వే = వారందరు, అమూలాః = మూలము లేనివారై, స్వయమ్ = తమంత తాముగా, న భవిష్యంతి = నశించెదరు.

నేను నా భుజములతో విడిచిపెట్టబోయే ఈ గదచే నీ తల పగిలి, నీవు మరణించెదవు. అప్పుడు నీకు పూజలను చేసే మహర్షులు మరియు దేవతలు, తల్లి వేరు నశించిన చెట్టు వలె, తమంత తామే నశించెదరు.

స తుద్యమానోఽరిదురుక్తతోమరైః
దంష్ట్రాగ్రగాం గాముపలక్ష్య భీతామ్ ।
తోదం మృషన్నిరగాదంబుమధ్యాత్
గ్రాహాహతస్సకరేణుర్యథేభః ॥ 6

అరిదురుక్తతోమరైః = శత్రువుయొక్క తప్పు మాటలు అనే చిల్లకోలలచే, తుద్యమానః = పొడువబడుచున్న, సః = ఆ వరాహ భగవానుడు, దంష్ట్ర-అగ్రగామ్ = కోరల కొనయందు ఉన్నట్టియు, భీతామ్ = భయపడిన, గామ్ = భూదేవిని, ఉపలక్ష్య = చూచి, గ్రాహ-ఆహతః = మొసలిచే గాయపరచబడిన, సకరేణుః = ఆడు ఏనుగుతో కూడియున్న, ఇభః యథా = మగ ఏనుగు వలె, తోదమ్ = ఆ నొప్పిని, మృషన్ = సహించుచున్నవాడై, అంబుమధ్యాత్ = నీటి మధ్యనుండి, నిరగాత్ = బయటకు వచ్చెను.

శత్రువు పలికిన పరుష వచనములు చిల్లకోల పోట్లవలె వరాహ భగవానునకు పీడను కలిగించినవి. ఆయన కోరల కొనలయందున్న భూదేవి భయపడుచుండెను. ఆమెను చూచి ఆయన ఆ నొప్పిని సహిస్తూ,

నీటిలో ఆడ ఏనుగుతో కలిసియుండి మొసలి కాటు తిన్న మగ ఏనుగు వలె, నీటి మధ్యనుండి బయటకు వచ్చెను.

తం నిస్సరంతం సలిలాదనుద్రుతో
హిరణ్యకేశో ద్విరదం యథా ఝషః ।
కరాలదంష్ట్రోఽశనినిస్స్వనోఽబ్రవీత్
గతహ్రియాం కిం త్వసతాం విగర్హితమ్ ॥ 7

సలిలాత్ = నీటినుండి, నిస్సరంతమ్ = బయటకు వచ్చుచున్న, తమ్ = ఆ వరాహ భగవానుని, ఝషః = మొసలి, ద్విరదం యథా = ఏనుగును వలె, అనుద్రుతః = వేగముగా అనుసరించువాడై, హిరణ్యకేశః = బంగరు రంగు జుట్టు గలిగినట్టియు, కరాలదంష్ట్రః = భయంకరమగు కోరలు గలిగినట్టియు, అశనినిస్స్వనః = పిడుగువంటి ధ్వనిని చేయు హిరణ్యాక్షుడు, అబ్రవీత్ = పలికెను, గతహ్రియామ్ = పోయిన లజ్జ గల, అసతామ్ = దుష్టులకు, విగర్హితమ్ = నిందించదగినది, కిమ్ = ఏది గలదు?

హిరణ్యాక్షుడు బంగరు రంగు జుట్టును, భయంకరమగు దంష్ట్రలను కలిగియుండెను. వరాహ భగవానుడు నీటినుండి బయటకు వచ్చుచుండగా, ఆతడు పిడుగు వలె ధ్వనిని చేయుచూ, మొసలి ఏనుగును వలె, ఆయన వైపు వేగముగా పరుగెత్తి ఇట్లనెను: పారిపోవుట అనే నిందించదగిన పనిని సిగ్గు లేని దుష్టులు చేయకుందురా?

స గాముదస్తాత్సలిలస్య గోచరే
విన్యస్య తస్యామదధాత్స్వసత్త్వమ్ ।
అభిష్టుతో విశ్వసృజా ప్రసూనైః
ఆపూర్యమాణో విబుధైః పశ్యతోఽరేః ॥ 8

విశ్వసృజా = జగత్కర్తయగు బ్రహ్మగారిచే, అభిష్టుతః = స్తుతించబడినవాడు, విబుధైః = దేవతలచే, ప్రసూనైః = పుష్పములచే, ఆపూర్యమాణః = ముంచెత్తబడుచున్నవాడు అగు, సః = ఆ వరాహ భగవానుడు, అరేః = శత్రువగు హిరణ్యాక్షుడు, పశ్యతః = చూచుచుండగా, సలిలస్య =

నీటికి, ఉదస్తాత్ = పైన, గోచరే = అనుకూలమగు స్థానమునందు, గామ్ = భూమిని, విన్యస్య = ఉంచి, తస్యామ్ = ఆ భూమియందు, స్వసత్త్వమ్ = తన శక్తిని, అదధాత్ = నిక్షేపించెను.

జగత్కర్తయగు బ్రహ్మగారు వరాహ భగవానుని స్తుతించుచుండెను. దేవతలాయనను పుష్పవృష్టితో ముంచెత్తుచుండిరి. తనకేసి చూచుచున్న శత్రువగు హిరణ్యాక్షుని ఆయన లెక్కచేయలేదు. అపుడాయన ఆ భూమిని నీటికి పైన అనుకూలమగు స్థానమునందుంచి, దానియందు తన ఆధారశక్తిని నిక్షేపించెను.

పరానుషక్తం తపనీయోపకల్పం
మహాగదం కాంచనచిత్రదంశమ్ ।
మర్మాణ్యభీక్ష్ణం ప్రతుదంతం దురుక్తైః
ప్రచండమన్యుః ప్రహసంస్తం బభాషే ॥ 9

పర-అనుషక్తమ్ = తనను వెంబడించుచున్నట్టియు, తపనీయ-ఉపకల్పమ్ = బంగరు ఆభరణములు కలిగినట్టియు, మహాగదమ్ = పెద్ద గద కలిగినట్టియు, కాంచనచిత్రదంశమ్ = బంగారముతో చేసిన రంగు రంగుల కవచము కలిగినట్టియు, దురుక్తైః = పరుష వచనములతో, మర్మాణి = మర్మస్థానములను, అభీక్ష్ణమ్ = పలుమార్లు, ప్రతుదంతమ్ = పీడను కలిగించుచున్న, తమ్ = ఆ హిరణ్యాక్షుని ఉద్దేశించి, ప్రచండమన్యుః = మహాకోపము గల వరాహ భగవానుడు, ప్రహసన్ = బిగ్గరగా నవ్వుచున్నవాడై, బభాషే = పలికెను.

హిరణ్యాక్షుడు బంగరు ఆభరణములను, రంగు రంగుల బంగరు కవచమును ధరించియుండెను. ఆతడు పెద్ద గదను చేతబట్టి, పలుమార్లు పరుష వచనములతో వరాహ భగవానుని హృదయమునకు పీడను కలిగించుచుండెను. ఆయన మహాకోపము గలవాడై, బిగ్గరగా నవ్వుతూ, వానిని ఉద్దేశించి ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ

సత్యం వయం భో వనగోచరా మృగా
యుష్మద్విధాన్మృగయే గ్రామసింహాన్ ।
న మృత్యుపాశైః ప్రతిముక్తస్య వీరా
వికత్థనం తవ గృహ్ణంత్యభద్ర ॥ 10

భోః = ఓయీ!, అభద్ర = దుష్టా!, సత్యమ్ = నిజమే, వయమ్ = మేము, వనగోచరాః = అడవిలో కానవచ్చే (నీటిలో నివసించే), మృగాః = పశువులమే, యుష్మద్-విధాన్ = నీవంటి, గ్రామసింహాన్ = కుక్కలను, మృగయే = వెదుకుచుందును, మృత్యుపాశైః = మృత్యువుయొక్క పాశము లచే, ప్రతిముక్తస్య = బంధించబడియున్న, తవ = నీ, వికత్థనమ్ = బడాయి కబుర్లను, వీరాః = వీరులు, న గృహ్ణంతి = సరుకు చేయరు.

శ్రీ వరాహ భగవానుడు ఇట్లు పలికెను --- ఓరీ దుష్టా! నిజమే. నేను అడవిలో తిరుగాడే (నీటిలో నివసించే) పశువునే. కాని, నీవంటి కుక్క లను వెదికి పట్టుకొనుటయే నా పని. మృత్యుపాశములచే కట్టివేయ బడియున్న నీ బడాయి కబుర్లను వీరులు సరుకు చేయరు.

ఏతే వయం న్యాసహరా రసౌకసాం
గతహ్రియో గదయా ద్రావితాస్తే ।
తిష్ఠామహేఽథాపి కథంచిదాజౌ
స్థేయం క్వ యామో బలినోత్పాద్య వైరమ్ ॥ 11

ఏతే = ఈ, వయమ్ = మేము, రసా-ఓకసామ్ = రసాతలమునందు నివసించు వారల, న్యాసహరాః = సొత్తును అపహరించువారము, గత హ్రియః = పోయిన సిగ్గు గలవారము, తే = నీ, గదయా = గదచే, ద్రావితాః = తరుమబడిన వారము, అథ అపి = అయినప్పటికీ, ఆజౌ = యుద్ధమునం దు, కథంచిత్ = ఏదో విధముగా, తిష్ఠామహే = నిలిచియున్నాము, స్థేయమ్ = నిలబడ వలసినదే, బలినా = బలవంతునితో, వైరమ్ = వైరము ను, ఉత్పాద్య = కలిగించుకొని, క్వ = ఎక్కడకు, యామః = వెళ్లెదము?

మేము రసాతల వాసులగు మీకు ప్రజాపతి ఇచ్చిన భూమి అనే సొత్తును అపహరించే చోరులము. నీవు గదతో తరుముకొచ్చినా, మాకు సిగ్గు లేదు. కాని, ఏలాగో యుద్ధరంగములో నిలిచియున్నాము. నిలబడక తప్పదు. బలశాలివగు నీతో వైరము పెట్టుకొని, ఎక్కడకు పోగలము?

త్వం పద్రథానాం కిల యూథపాధిపో
ఘటస్వ నోఽస్వస్తయ ఆశ్వనూహః ।
సంస్థాప్య చాస్మాన్ ప్రమృజాశ్రు స్వకానాం
యస్స్వాం ప్రతిజ్ఞాం నాతిపిపర్త్యసభ్యః ॥ 12

త్వమ్ = నీవు, పద్-రథానామ్ = పాదచారులగు యుద్ధవీరుల, యూథప-అధిపః కిల = సేనానాయకులకు అధిపతివి గదా!, అనూహః = శంక లేనివాడవై, ఆశు = వెంటనే, నః = మాయొక్క, అస్వస్తయే = అనిష్ట మును కలిగించుట కొరకై, ఘటస్వ = ప్రయత్నించుము, అస్మాన్ = మమ్ము లను, సంస్థాప్య = సంహరించి, స్వకానామ్ = నీ వారల, అశ్రు = కన్నీటిని, ప్రమృజ చ = తుడిచివేయుము, యః = ఎవడైతే, స్వామ్ = తన, ప్రతిజ్ఞామ్ = ప్రతిజ్ఞను, న అతిపిపర్తి = చక్కగా పూర్తి చేయడో వాడు, అసభ్యః = సభ్యుడు కాడు.

పాదచారులగు వీరుల నాయకులకు నీవు అధినాయకుడవు గదా! వెంటనే శంకను విడనాడి మాకు అనిష్టమును కలిగించే ప్రయత్నమును చేయుము. మమ్ములను సంహరించి, నీ వారల కన్నీటిని తుడువుము. ప్రతి జ్ఞను చేసి దానిని పూర్తి చేయని వానికి పెద్ద మనుష్యుల మధ్య కూర్చునే అధికారము ఉండదు.

మైత్రేయ ఉవాచ ।
సోఽధిక్షిప్తో భగవతా ప్రలబ్ధశ్చ రుషా భృశమ్ ।
ఆజహారోల్బణం క్రోధం క్రీడ్యమానోఽహిరాడివ ॥ 13

సః = ఆ హిరణ్యాక్షుడు, భగవతా = వరాహ భగవానునిచే, అధి క్షిప్తః = అధిక్షేపించ బడినవాడై, రుషా = కోపముచే, భృశమ్ = మిక్కిలి,

ప్రలబ్ధః చ = పరిహాసము చేయబడినవాడై, క్రీడ్యమానః = ఆటలాడించబడే, అహిరాట్ ఇవ = నాగరాజు వలె, ఉల్బణమ్ = భయంకరమగు, క్రోధమ్ = కోపమును, ఆజహార = తెచ్చుకొనెను.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- వరాహ భగవానుడు హిరణ్యాక్షుని ఉద్దేశించి మహాకోపముతో ఈ విధముగా ఎత్తి పొడుపు మాటలను పలికి, వేళాకోళము కూడా చేసెను. అపుడాతడు అల్లరి చేయబడిన నాగ రాజు వలె తనలో భయంకరమగు కోపమును నింపుకొనెను.

సృజన్నమర్షితశ్శ్వాసాన్మన్యుప్రచలితేంద్రియః ।
ఆసాద్య తరసా దైత్యో గదయాభ్యహనద్ధరిమ్ ॥ 14

దైత్యః = ఆ రాక్షసుడు, అమర్షితః = కోపించినవాడై, శ్వాసాన్ = నిట్టూర్పులను, సృజన్ = విడిచిపెట్టుచున్నవాడై, మన్యుప్రచలిత-ఇంద్రియః = కోపముచే క్షోభింపజేయబడిన ఇంద్రియములు గలవాడై, తరసా = వేగముతో, హరిమ్ = వరాహ భగవానుని, ఆసాద్య = సమీపించి, గదయా = గదతో, అభ్యహనత్ = గట్టిగా కొట్టెను.

ఆ రాక్షసుడు కోపముతో నిట్టూర్పులను విడుచుచుండెను. ఆతని ఇంద్రియములు కోపముచే క్షోభింప జేయబడెను. ఆతడు వేగముగా వరాహ భగవానుని సమీపించి, ఆయనను గదతో గట్టిగా కొట్టెను.

భగవాంస్తు గదావేగం విసృష్టం రిపుణోరసి ।
అవంచయత్తిరశ్చీనో యోగారూఢ ఇవాంతకమ్ ॥ 15

భగవాన్ తు = వరాహ భగవానుడైతే, రిపుణా = శత్రువగు హిరణ్యాక్షునిచే, ఉరసి = వక్షఃస్థలమునందు, విసృష్టమ్ = ప్రయోగించబడిన, గదావేగమ్ = గదయొక్క వేగమును, తిరశ్చీనః = ప్రక్కకు తిరిగినవాడై, యోగ-ఆరూఢః = యోగసిద్ధుడగు పురుషుడు, అంతకం ఇవ = మృత్యువును వలె, అవంచయత్ = తప్పించుకొనెను.

శత్రువగు హిరణ్యాక్షుడు వరాహ భగవానుని వక్షఃస్థలమునందు వేగముగా గదతో కొట్టబోయెను. కాని, ఆయన ప్రక్కకు తిరిగి, యోగసిద్ధు

డగు పురుషుడు మృత్యువును తప్పించుకునే విధముగా, ఆ దెబ్బను తప్పించుకొనెను.

పునర్గదాం స్వామాదాయ భ్రామయంతమభీక్ష్ణశః ।
అభ్యధావద్ధరిః క్రుద్ధస్సంరంభాద్దష్టదచ్ఛదమ్ ॥ 16

పునః = మరల, స్వామ్ = తన, గదామ్ = గదను, ఆదాయ = తీసుకొని, అభీక్ష్ణశః = పలుమార్లు, భ్రామయంతమ్ = త్రిప్పుచున్నట్టియు, సంరంభాత్ = కోపము వలన, దష్టదచ్ఛదమ్ = కొరకబడిన పెదవి గల హిరణ్యాక్షుని, హరిః = వరాహ భగవానుడు, క్రుద్ధః = కోపించినవాడై, అభ్యధావత్ = మీదకు ఉరికెను.

హిరణ్యాక్షుడు కోపముతో పెదవిని కొరుకుతూ, గదను మరల తీసుకొని గిర గిర త్రిప్పుచుండెను. అపుడు వరాహ భగవానుడు కోపించి వాని మీదకు ఉరికెను.

తతశ్చ గదయారాతిం దక్షిణస్యాం భ్రువి ప్రభుః ।
ఆజఘ్నే స తు తాం సౌమ్య గదయా కోవిదోఽహనత్ ॥ 17

సౌమ్య = సౌమ్యస్వభావము గల ఓ విదురా!, తతః = తరువాత, ప్రభుః = వరాహ భగవానుడు, గదయా = గదతో, అరాతిమ్ = శత్రువును, దక్షిణస్యామ్ = కుడి, భ్రువి = కనుబొమయందు, ఆజఘ్నే = సాగదీసి కొట్టెను, కోవిదః = నిపుణుడగు, సః తు = వాడైతే, తామ్ = ఆ గదను, అహనత్ = కొట్టెను.

వరాహ భగవానుడు శత్రువును కుడి కనుబొమపై గదతో సాగదీసి కొట్టబోగా, నేర్పరియగు ఆ హిరణ్యాక్షుడు తన గదతో దానిని అడ్డుకొనెను.

ఏవం గదాభ్యాం గుర్వీభ్యాం హర్యక్షో హరిరేవ చ ।
జిగీషయా సుసంరబ్ధావన్యోన్యమభిజఘ్నతుః ॥ 18

ఏవమ్ = ఈ విధముగా, హర్యక్షః = పచ్చని కన్నులు గల హిరణ్యాక్షుడు, హరిః ఏవ చ = వరాహ భగవానుడు కూడ, జిగీషయా = జయిం

చవలెననే కోరికచే, సుసంరబ్ధౌ = గొప్ప క్రోధము గలవారై, గుర్వీభ్యామ్ = బరువైన, గదాభ్యామ్ = గదలతో, అన్యోన్యమ్ = ఒకరినొకరు, అభిజఘ్నతుః = కొట్టుకొనిరి.

ఈ విధముగా హిరణ్యాక్షుడు, వరాహ భగవానుడు గొప్ప క్రోధము గలవారై ఒకరినొకరు జయించవలెననే కోరికతో బరువైన గదలతో ఒకరినొకరు కొట్టుకొనిరి.

తయోస్స్పృధోస్తిగ్మగదాహతాంగయోః
క్షతాస్రవఘ్రాణవివృద్ధమన్వోః ।
విచిత్రమార్గాంశ్చరతోర్జిగీషయా
వ్యభాదిలాయామివ శుష్మిణోర్మృధః ॥ 19

స్పృధోః = స్పర్ధ కలిగినట్టియు, తిగ్మగదా-ఆహత-అంగయోః = పదునైన ధారలు గల గదలచే కొట్టబడిన దేహములు గలిగినట్టియు, క్షత-ఆస్రవఘ్రాణవివృద్ధమన్వోః = గాయములనుండి కారే రక్తమును ఆఘ్రాణించుటచే విశేషముగా పెరిగిన కోపము గలిగినట్టియు, ఇలాయామ్ = భూమి విషయములో, జిగీషయా = జయించవలెననే కోరికతో, విచిత్రమార్గాన్ = రకరకముల గదాప్రయోగపద్ధతులను, చరతోః = చేయుచున్న, తయోః = వారిద్దరికి, ఇలాయామ్ = ఆవు విషయములో, శుష్మిణోః ఇవ = ఆబోతులకు వలె, మృధః = యుద్ధము, వ్యభాత్ = ప్రకాశించెను.

వారిద్దరు ఒకరినొకరు మించాలనే పట్టుదలతో యుద్ధమును చేయుచుండిరి. గదల పదునైన ధారలు తగిలి వారి శరీరములనుండి రక్తము ప్రసరించుచుండెను. ఆ రక్తగంధమునాఘ్రాణించగా, వారి కోపము ఇబ్బడి ముబ్బడిగా పెరిగెను. వారు భూమి కొరకై ఒకరినొకరు జయించవలెననే కోరికతో రకరకముల పద్ధతులలో గదలను ప్రయోగించుచుండిరి. ఆవు కొరకై పోట్లాడే రెండు ఆబోతుల వలె వారు ప్రకాశించిరి.

దైత్యస్య యజ్ఞావయవస్య మాయా-
గృహీతవారాహతనోర్మహాత్మనః ।

కౌరవ్య మహ్యాం ద్విషతోర్విమర్దనం
దిదృక్షురాగాదృషిభిర్వృతస్స్వరాట్ ॥ 20

కౌరవ్య = కురువంశీయుడవగు ఓ విదురా!, మహ్యామ్ = భూమి విషయములో, ద్విషతోః = వైరమును బూనియున్న, దైత్యస్య = రాక్షసుడగు హిరణ్యాక్షునియొక్క, యజ్ఞ-అవయవస్య = యజ్ఞములే అవయవములుగా గలిగినట్టియు, మాయాగృహీతవారాహతనోః = మాయాశక్తిచే స్వీకరించబడిన వరాహ రూపము గలిగినట్టియు, మహాత్మనః = పరబ్రహ్మస్వరూపుడగు శ్రీహరియొక్క, విమర్దనమ్ = యుద్ధమును, దిదృక్షుః = చూడగోరువాడై, స్వరాట్ = స్వయంప్రకాశ స్వరూపుడగు బ్రహ్మగారు, ఋషిభిః = మహర్షులతో, వృతః = చుట్టువారబడియున్నవాడై, ఆగాత్ = విచ్చేసెను.

ఓ విదురా! యజ్ఞములే అవయవములుగా గలవాడు, మాయాశక్తిచే వరాహ రూపమును దాల్చినవాడు, పరబ్రహ్మ స్వరూపుడు అగు శ్రీహరి భూమి నిమిత్తమై హిరణ్యాక్షునితో యుద్ధము చేయుచుండెను. దానిని చూచుటకై బ్రహ్మగారు మహర్షులతో కూడి విచ్చేసెను.

ఆసన్నశౌండీరమపేతసాధ్వసం
కృతప్రతీకారమహార్యవిక్రమమ్ ।
విలక్ష్య దైత్యం భగవాన్ సహస్రణీః
జగాద నారాయణమాదిసూకరమ్ ॥ 21

ఆసన్నశౌండీరమ్ = పొందబడిన ఉత్సాహము గలిగినట్టియు, అపేతసాధ్వసమ్ = తొలగిన భయము కలిగినట్టియు, కృతప్రతీకారమ్ = చేయబడిన ప్రతీకారము కలిగినట్టియు, అహార్యవిక్రమమ్ = తగ్గించ శక్యము కాని పరాక్రమము గల, దైత్యమ్ = ఆ రాక్షసుని, విలక్ష్య = చూచి, సహస్రణీః = వేలాది మహర్షులకు నాయకుడైన, భగవాన్ = పూజ్యుడగు బ్రహ్మగారు, ఆదిసూకరమ్ = ఆదివరాహమూర్తియగు, నారాయణమ్ = నారాయణుని గూర్చి, జగాద = పలికెను.

ఆ హిరణ్యాక్షుడు గొప్ప ఉత్సాహముతో నిర్భయముగా దెబ్బకు దెబ్బ తీయుచూ పోరుచుండెను. వాని పరాక్రమములో తగ్గుదల కానవచ్చుట లేదు. వేలాది మహర్షులను వెంట బెట్టుకొని వచ్చియున్న పూజ్యుడగు బ్రహ్మగారు ఆ విషయమును గమనించి, ఆదివరాహరూపములో నున్న నారాయణునితో నిట్లనెను.

బ్రహ్మోవాచ ।
ఏష తే దేవ దేవానామంఘ్రిమూలముపేయుషామ్ ।
విప్రాణాం సౌరభేయీణాం భూతానామప్యనాగసామ్ ॥ 22

అగస్కృద్భయకృద్దుష్కృదస్మద్రాద్ధవరోఽసురః ।
అన్వేషన్నప్రతిరథో లోకానటతి కంటకః ॥ 23

దేవ = ఓ దేవా!, తే = నీ, అంఘ్రిమూలమ్ = పాదమూలమును, ఉపేయుషామ్ = శరణు జొచ్చిన, దేవానామ్ = దేవతలకు, విప్రాణామ్ = బ్రాహ్మణులకు, సౌరభేయీణామ్ = గోవులకు, అనాగసామ్ = నిరపరాధులగు, భూతానాం అపి = ప్రాణులకు కూడ, అస్మద్-రాద్ధవరః = మాచే ఈయబడిన వరములు గల, ఏషః = ఈ, అసురః = రాక్షసుడు, అగస్కృత్ = అపరాధమును (హానిని) చేయువాడు, భయకృత్ = భయమును కలిగించువాడు, దుష్కృత్ = దుఃఖమును కలిగించువాడు, అప్రతిరథః = తనకు సాటి లేని వీడు, కంటకః = లోకకంటకుడై, అన్వేషన్ = వీరులను వెదుకుచున్నవాడై, లోకాన్ = లోకములను, అటతి = సంచరించుచున్నాడు.

ఓ దేవా! నేను ఈ రాక్షసునకు వరములనిచ్చి యుంటిని. వీడు నీ పాదమూలమును శరణు జొచ్చిన దేవతలకు, బ్రాహ్మణులకు, గోవులకు మరియు నిరపరాధులగు ప్రాణులకు హానిని, భయమును, దుఃఖమును కలిగించుచున్నాడు. లోకకంటకుడగు వీనికి సాటి లేరు. వీడు యుద్ధమును చేయుటకై వీరులను వెదుకుతూ లోకములను సంచరించుచున్నాడు.

మైనం మాయావినం దృప్తం నిరంకుశమసత్తమమ్
ఆక్రీడ బాలవద్దేవ యథాఽఽశీవిషముత్థితమ్ ॥ 24

దేవ = ఓ దేవా!, మాయావినమ్ = మాయావియైనట్టియు, దృప్తమ్ = గర్వించియున్నట్టియు, నిరంకుశమ్ = నియంత్రించువారు లేనట్టియు, అసత్తమమ్ = మిక్కిలి దుష్టుడైన, ఏనమ్ = వీనిని, బాలవత్ = బాలుని వలె, ఉత్థితమ్ = పడగ విప్పిన, ఆశీవిషం యథా = పామును వలె, మా ఆక్రీడ = ఆటలాడకుము.

ఓ దేవా! వీడు మాయావి, గర్విష్ఠి, పరమదుష్టుడు. వీనిని నియంత్రించువారు లేరు. చిన్న పిల్లవాడు పడగ విప్పిన పాముతో ఆడినట్లుగా, నీవు వీనితో ఆటలాడవద్దు.

న యావదేవ వర్ధేత స్వాం వేలాం ప్రాప్య దారుణః ।
స్వాం దేవ మాయామాస్థాయ తావజ్జహ్యఘమచ్యుత ।। 25

దేవ = ఓ దేవా!, అచ్యుత = వినాశము లేనివాడా!, దారుణః = భయంకరుడగు వీడు, యావత్ = ఎంతలో, స్వామ్ = తన, వేలామ్ = కాలమును, ప్రాప్య = పొంది, న వర్ధేత = వర్ధిల్లకుండునో, తావత్ ఏవ = అంతలోపులోనే, స్వామ్ = నీ, మాయామ్ = మాయను, ఆస్థాయ = ప్రకటించి, అఘమ్ = పాపిని, జహి = సంహరించుము.

ఓ అచ్యుత దేవా! భయంకరుడగు ఈ రాక్షసునకు బలమును వర్ధిల్లజేసే కాలము వచ్చే లోపులోనే, నీవు నీ మాయాశక్తిని ఆవిష్కరింపజేసి, ఈ పాపిని సంహరించుము.

ఏషా ఘోరతమా సంధ్యా లోకచ్ఛంబట్కరీ ప్రభో ।
ఉపసర్పతి సర్వాత్మన్ సురాణాం జయమావహ ।। 26

ప్రభో = ఓ ప్రభూ!, సర్వ-ఆత్మన్ = సర్వమునకు ఆత్మయైనవాడా!, లోక-ఛంబట్-కరీ = లోకములకు వినాశమును కలిగించే, ఘోరతమా = మిక్కిలి భయంకరమగు, ఏషా = ఈ, సంధ్యా = సంధ్యాకాలము, ఉపసర్పతి = సమీపించుచున్నది, సురాణామ్ = దేవతలకు, జయమ్ = విజయమును, ఆవహ = కలిగించుము.

# అథ ఏకోనవింశోऽధ్యాయః

## హిరణ్యాక్షుని వరాహ భగవానుడు సంహరించుట

మైత్రేయ ఉవాచ ।
అవధార్య విరించస్య నిర్వ్యలీకామృతం వచః ।
ప్రహస్య ప్రేమగర్భేణ తదపాంగేన సోऽగ్రహీత్ ॥ 1

మైత్రేయః = మైత్రేయ మహర్షి, ఉవాచ = పలికెను, విరించస్య = బ్రహ్మయొక్క, నిర్వ్యలీక-అమృతమ్ = కపటము లేని అమృతము వంటి, వచః = వచనమును, అవధార్య = విని, సః = ఆ వరాహ భగవానుడు, ప్రహస్య = నవ్వి, ప్రేమగర్భేణ = ప్రేమ నిండిన, అపాంగేన = కటాక్షముతో, తత్ = ఆ మాటను, అగ్రహీత్ = స్వీకరించెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- బ్రహ్మ నిష్కపటభావముతో పలికిన అమృతము వంటి ఆ వచనమును వరాహ భగవానుడు విని నవ్వెను. ఆయన బ్రహ్మకేసి ప్రేమ నిండిన కటాక్షముతో చూచి ఆ వచనమును స్వీకరించెను.

తతస్సపత్నం ముఖతశ్చరంతమకుతోభయమ్ ।
జఘానోత్పత్య గదయా హనావసురమక్షజః ॥ 2

తతః = తరువాత, అక్షజః = బ్రహ్మగారి ఘ్రాణేంద్రియమునుండి పుట్టిన వరాహ భగవానుడు, ఉత్పత్య = ఎగిరి, అకుతోభయమ్ = దేనివలనైననూ భయము లేనివాడు, ముఖతః = ఎదురుగా, చరంతమ్ = తిరుగుచున్నవాడు, సపత్నమ్ = శత్రువు అగు, అసురమ్ = హిరణ్యాక్షుని, గదయా = గదతో, హనౌ = దౌడయందు, జఘాన = కొట్టెను.

డు. నీవు యుద్ధములో పరాక్రమించి వీనిని సంహరించి, లోకములకు సుఖ
మును కలిగించుము.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధమునందు
పదునెనిమిదవ అధ్యాయము ముగిసినది (18).

* * * * *

సర్వమునకు ఆత్మయగు ఓ ప్రభూ! లోకములకు వినాశమును కలిగించే ఈ సంధ్యాకాలము సమీపించుచున్నది. ఆ లోపులోనే దేవతలకు విజయమును చేకూర్చుము.

అధునైషోఽభిజిన్నామ యోగో మౌహూర్తికో హ్యగాత్ ।
శివాయ నస్త్వం సుహృదామాశు నిస్తర దుస్తరమ్ ॥ 27

ఏషః = ఈ, అభిజిత్ నామ = అభిజిత్ అని ప్రసిద్ధిని గాంచిన, మౌహూర్తికః = రెండు ఘడియల, యోగః = యోగము, అధునా = ఇప్పుడు, అగాత్ హి = వెళ్లిపోయినది, సుహృదామ్ = మిత్రులమగు, నః = మా, శివాయ = మంగళము కొరకు, త్వమ్ = నీవు, ఆశు = వెంటనే, దుస్తరమ్ = జయింప శక్యము కాని వీనిని, నిస్తర = సంహరించుము.

రెండు ఘడియల ఈ అభిజిద్యోగము ఇంచుమించు పూర్తి కావచ్చినది. కావున, ఇప్పుడు నీవు నీ భక్తులమగు మాకు సుఖమును కలిగించుటకై, ఇతరులు జయించ లేని వీనిని వెంటనే సంహరించుము.

దిష్ట్యా త్వాం విహితం మృత్యుమయమాసాదితస్స్వయమ్ ।
విక్రమ్యైనం మృధే హత్వా లోకానాధేహి శర్మణి ॥ 28

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
అష్టాదశోఽధ్యాయః ॥

మృత్యుమ్ = మృత్యువుగా, విహితమ్ = విధించబడిన, త్వామ్ = నిన్ను, అయమ్ = వీడు, దిష్ట్యా = దైవయోగముచే, స్వయమ్ = తనంత తానుగా, ఆసాదితః = సమీపించినాడు, మృధే = యుద్ధమునందు, విక్రమ్య = పరాక్రమించి, ఏనమ్ = వీనిని, హత్వా = సంహరించి, లోకాన్ = లోకములను, శర్మణి = సుఖమునందు, ఆధేహి = స్థాపించుము.

వీడు నీ చేతిలో మరణించునని నీ చేతనే ఇదివరలో విధించబడినది. తనకు మృత్యువు అగు అట్టి నీ వద్దకు వీడు తనంత తానుగా వచ్చినా

దేనివలనైననూ భయపడని హిరణ్యాక్షుడు బ్రహ్మగారి ఘ్రాణేంద్రియమునుండి పుట్టిన వరాహ భగవానుని యెదుటనే తిరుగుతూ యుద్ధము చేయుచుండెను. అపుడాయన పైకి యెగిరి శత్రువగు ఆ రాక్షసుని గదతో దౌడపై కొట్టెను.

సా హతా తేన గదయా విహతా భగవత్కరాత్ ।
విఘూర్ణితాపతద్రేజే తదద్భుతమివాభవత్ ॥ 3

సా = ఆ గద, తేన = వానిచే, గదయా = గదతో, విహతా = కొట్టబడినదై, విఘూర్ణితా = అధికముగా తిరుగుచున్నదై, భగవత్-కరాత్ = వరాహ భగవానుని చేతినుండి, అపతత్ = క్రింద పడెను, రేజే = ప్రకాశించెను, తత్ = అది, అద్భుతం ఇవ = ఆశ్చర్యము వలె, అభవత్ = ఆయెను.

హిరణ్యాక్షుడు ఆ గదను తన గదతో కొట్టగా, అది గిరగిర తిరిగి వరాహ భగవానుని చేతినుండి క్రింద బడి ప్రకాశించెను. అట్లు క్రింద పడుట అక్కడనున్న వారందరికి ఆశ్చర్యమును కలిగించెను.

స తదా లబ్ధతీర్థోఽపి న బబాధే నిరాయుధమ్ ।
మానయన్ స మృధే ధర్మం విష్వక్సేనం ప్రకోపయన్ ॥ 4

సః = ఆ రాక్షసుడు, తదా = అప్పుడు, లబ్ధతీర్థః అపి = పొందబడిన అవకాశము గలవాడే అయిననూ, మృధే = యుద్ధమునందు, ధర్మమ్ = ధర్మమును, మానయన్ = పాలించువాడై, నిరాయుధమ్ = ఆయుధము లేని, విష్వక్సేనమ్ = వరాహ భగవానుని, ప్రకోపయన్ = అధికముగా కోపమును కలిగించువాడై, న బబాధే = కొట్టలేదు.

ఆ రాక్షసునకు అప్పుడు వరాహ భగవానుని దెబ్బ తీసే అవకాశము లభించినది. కాని, వాడు యుద్ధధర్మమును పాటిస్తూ, నిరాయుధుడగు ఆయనను కొట్టలేదు. ఆయనకు చాల కోపము కలిగెను.

గదాయామపవిద్ధాయాం హాహాకారే వినిర్గతే ।
మానయామాస తద్ధర్మం సునాభం చాస్మరద్విభుః ॥ 5

గదాయామ్ = గద, అపవిద్ధాయామ్ = జారిపోగా, హాహాకారే = హాహాకారము, వినిర్గతే = బయల్వెడలగా, విభుః = వరాహ భగవానుడు, తత్-ధర్మమ్ = వాని ధర్మమును, మానయామాస = ప్రశంసించెను, చ = మరియు, సునాభమ్ = సుదర్శన చక్రమును, అస్మరత్ = స్మరించెను.

వరాహ భగవానుని చేతినుండి గద జారిపోగానే, దేవతలు హాహా కారములను చేసిరి. ఆయన హిరణ్యాక్షుని ధర్మబుద్ధిని ప్రశంసించి, సుద ర్శన చక్రమును స్మరించెను.

తం వ్యగ్రచక్రం దితిపుత్రాధమేన
స్వపార్షదముఖ్యేన విషజ్జమానమ్ ।
చిత్రా వాచోऽతద్విదాం ఖేచరాణాం
తత్ర స్మాసన్ స్వస్తి తేऽముం జహీతి ॥ 6

వ్యగ్రచక్రమ్ = కంగారు పడుచున్న చక్రము గలిగినట్టియు, స్వపా ర్షదముఖ్యేన = తన అనుయాయులలో ప్రముఖుడగు, దితిపుత్ర-అధమేన = దితిపుత్రుడు అధముడు అయిన హిరణ్యాక్షునితో, విషజ్జమానమ్ = క్రీడిం చుచున్న, తమ్ = ఆ వరాహ భగవానుని ఉద్దేశించి, తత్ర = ఆ సమయము నందు, అతద్విదామ్ = ఆయన ప్రభావము తెలియని, ఖేచరాణామ్ = ఆకా శమునందున్న దేవతలయొక్క, తే = నీ కొరకు, స్వస్తి = మంగలమగు గాక!, అముమ్ = వీనిని, జహి = సంహరించుము, ఇతి = అనే, చిత్రాః = అనేకరకముల, వాచః = వాక్కులు, ఆసన్ స్మ = బయలు దేరినవి.

హిరణ్యాక్షుని వధించుటకు చక్రము కంగారు పడుచుండెను. కాని, వరాహ భగవానుడు తన అనుయాయులలో ప్రముఖుడు, అధముడు అగు ఆ రాక్షసునితో యుద్ధక్రీడను చేయుచుండెను. అపుడు ఆకాశములోనుండి యుద్ధమును చూచుచున్న దేవతలు ఆయన మహిమనెరుంగని వారై ఆయనతో, నీకు మంగళమగు గాక! వీనిని వెంటనే సంహరించుము, అని అనేకరకములుగా పలుకుచుండిరి.

స తం నిశామ్యాత్తరథాంగమగ్రతో

వ్యవస్థితం పద్మపలాశలోచనమ్ ।
విలోక్య చామర్షపరిప్లుతేంద్రియో
రుషా స్వదంతచ్ఛదమాదశచ్ఛ్వసన్ ॥ 7

సః = ఆ హిరణ్యాక్షుడు, ఆత్తరథాంగమ్ = స్వీకరించబడిన చక్రము గల, తమ్ = ఆ వరాహ భగవానుని, నిశామ్య = చూచి, చ = మరియు, అగ్రతః = ఎదుట, వ్యవస్థితమ్ = నిలిచియున్న ఆయనను, పద్మపలాశలోచనమ్ = పద్మపత్రములవంటి కన్నులు గలవానిగా, విలోక్య = గమనించి, అమర్షపరిప్లుత-ఇంద్రియః = కోపముచే వ్యాపించబడిన ఇంద్రియములు గలవాడై, రుషా = కోపముతో, శ్వసన్ = నిట్టూర్పులను విడుచుచున్నవాడై, స్వదంతచ్ఛదమ్ = తన పెదవిని, ఆదశత్ = అంతటా కొరుకు కొనెను.

పద్మపత్రములవలె ప్రసన్నమైన కన్నులు గల వరాహ భగవానుడు చక్రమును చేతబట్టి హిరణ్యాక్షుని యెదుట నిలబడెను. ఆయనను ఆ విధముగా చూడగానే, వాని మనస్సు ఇంద్రియములు కోపముతో నిండి పోయెను. ఆతడు కోపముతో నిట్టూర్పులను విడుస్తూ తన పెదవిని గట్టిగా కొరుకు కొనెను.

కరాలదంష్ట్రశ్చక్షుర్భ్యాం సంచక్షాణో దహన్నివ ।
అభిప్లుత్య స్వగదయా హతోऽసీత్యాహనద్ధరిమ్ ॥ 8

కరాలదంష్ట్రః = భయంకరమగు కోరలు గల హిరణ్యాక్షుడు, చక్షుర్భ్యామ్ = కన్నులతో, దహన్ ఇవ = దహించుచున్నాడా యన్నట్లు, సంచక్షాణః = చూచుచున్నవాడై, హతః అసి = సంహరించ బడితివి, ఇతి = అని, అభిప్లుత్య = ఎగిరి, స్వగదయా = తన గదతో, హరిమ్ = వరాహ భగవానుని, ఆహనత్ = కొట్టెను.

భయంకరమగు కోరలు గల హిరణ్యాక్షుడు కన్నులతో దహించుచున్నాడా యన్నట్లు చూస్తూ, ఇదిగో! ఈ దెబ్బతో నీ పని ఆఖరు, అని పలుకుతూ యెగిరి, తన గదతో వరాహ భగవానుని కొట్టెను.

పదా సవ్యేన తాం సాధో భగవాన్ యజ్ఞసూకరః ।

లీలయా మిషతశ్శత్రోః ప్రాహరద్వాతరంహసమ్ ॥ 9

సాధో = ఓ మహాత్మా విదురా!, యజ్ఞసూకరః = యజ్ఞవరాహరూపి యగు, భగవాన్ = శ్రీహరి భగవానుడు, సవ్యేన = ఎడమ, పదా = కాలితో, వాతరంహసమ్ = వాయువేగము గల, తామ్ = ఆ గదను, లీలయా = అవలీలగా, శత్రోః = శత్రువగు హిరణ్యాక్షుడు, మిషతః = చూచుచుండగా, ప్రాహరత్ = నేలగూల్చెను.

ఓ మహాత్మా! విదురా! యజ్ఞ వరాహ భగవానుడు వాయువేగము గల ఆ గదను శత్రువగు హిరణ్యాక్షుడు చూచుచుండగనే, తన యెడమ కాలితో అవలీలగా నేల గూల్చెను.

ఆహ చాయుధమాధత్స్వ ఘటస్వ త్వం జిగీషసి ।
ఇత్యుక్తస్స తదా భూయస్తాడయన్ వ్యనదద్భృశమ్ ॥ 10

చ = మరియు, ఆహ = పలికెను, ఆయుధమ్ = ఆయుధమును, ఆధత్స్వ = తీసుకొనుము, ఘటస్వ = ప్రయత్నించుము, త్వమ్ = నీవు, జిగీషసి = జయించ గోరుచున్నావు, ఇతి = ఈ విధముగా, ఉక్తః = పలుకబడిన, సః = ఆ హిరణ్యాక్షుడు, తదా = అప్పుడు, భూయః = మరల, తాడయన్ = కొట్టుచున్నవాడై, భృశమ్ = బిగ్గరగా, వ్యనదత్ = గర్జించెను.

నీవు జయించ గోరుచున్నావు గనుక ఆయుధమును తీసుకొని ప్రయత్నించుము, అని వరాహ భగవానుడు వానితో పలికెను. అపుడాతడు మరల ఆయనను కొడుతూ భీకరముగా గర్జించెను.

తాం స ఆపతతీం వీక్ష్య భగవాన్ సమవస్థితః ।
జగ్రాహ లీలయా ప్రాప్తాం గరుత్మానివ పన్నగీమ్ ॥ 11

సః = ఆ, భగవాన్ = వరాహ భగవానుడు, ఆపతతీమ్ = మీదకు వచ్చుచున్న, తామ్ = ఆ గదను, వీక్ష్య = చూచి, సమవస్థితః = చక్కగా నిలబడినవాడై, ప్రాప్తామ్ = దగ్గరకు వచ్చిన గదను, గరుత్మాన్ = గరుడుడు, పన్నగీం ఇవ = పామును వలె, లీలయా = లీలచే, జగ్రాహ = పట్టుకొనెను.

ఆ వరాహ భగవానుడు తన మీదకు వచ్చుచున్న గదను చూచి, అటులనే నిలబడెను. అది దగ్గరకు రాగానే, ఆయన దానిని అవలీలగా, గరుత్మంతుడు పామును వలె, పట్టుకొనెను.

స్వపౌరుషే ప్రతిహతే హతమానో మహాసురః ।
నైచ్ఛద్గదాం దీయమానాం హరిణా విగతప్రభః ॥ 12

విగతప్రభః = తొలగిన కాంతిగల, మహాసురః = ఆ మహారాక్షసుడు, స్వపౌరుషే = తన పౌరుషము, ప్రతిహతే = విఫలము కాగా, హతమానః = దెబ్బ తిన్న అభిమానము గలవాడై, హరిణా = వరాహ భగవానునిచే, దీయమానామ్ = ఈయబడుచున్న, గదామ్ = గదను, న ఐచ్ఛత్ = ఇష్టపడలేదు.

తన పరాక్రమము ఈ విధముగా విఫలము కాగా, ఆ మహారాక్షసుని అభిమానము దెబ్బ తిని, వాని ముఖములో కాంతి క్షీణించెను. వరాహ భగవానుడు ఇచ్చిన గదను తీసుకొనుటకు ఆతడు ఇష్టపడలేదు.

జగ్రాహ త్రిశిఖం శూలం జ్వలజ్జ్వలనలోలుపమ్ ।
యజ్ఞాయ ధృతరూపాయ విప్రాయాభిచరన్ యథా ॥ 13

ధృతరూపాయ = రూపు దాల్చిన, యజ్ఞాయ = యజ్ఞము కొరకు, జ్వలత్-జ్వలనలోలుపమ్ = మండే అగ్నివలె ముందుకు ఉరుకుచున్న, త్రిశిఖమ్ = మూడు కొనలు గల, శూలమ్ = శూలమును, విప్రాయ = బ్రాహ్మణుని కొరకు, అభిచరన్ యథా = అభిచారమును ప్రయోగించువాని వలె, జగ్రాహ = స్వీకరించెను.

బ్రాహ్మణుని సంహరించుటకై దుష్టుడు అభిచార కర్మకు పూనుకున్న విధముగా, ఆ హిరణ్యాక్షుడు యజ్ఞస్వరూపుడగు వరాహ భగవానుని సంహరించుటకై మూడు కొనల శూలమును పట్టుకొనెను. దాని కొనలు మండే అగ్ని వలె ముందుకు ఉరుకుచున్నవా యన్నట్లు ఉండెను.

తదోజసా దైత్యమహాభటార్పితం
చకాసదంతఃఖ ఉదీర్ణదీధితి ।

చక్రేణ చిచ్ఛేద నిశాతనేమినా
హరిర్యథా తార్క్ష్యపతత్త్రముజ్ఝితమ్ ॥ 14

ఓజసా = బలముచే, దైత్యమహాభట-అర్పితమ్ = రాక్షసులలో మహావీరుడగు హిరణ్యాక్షునిచే ప్రయోగించబడినట్టియు, అంతఃఖే = ఆకాశ మధ్యమునందు, చకాసత్ = ప్రకాశించుచున్నట్టియు, ఉదీర్ణదీధితి = బయ ల్వెడలుచున్న కాంతులు గల, తత్ = ఆ శూలమును, హరిః = వరాహ భగ వానుడు, నిశాతనేమినా = వాడి అంచు గల, చక్రేణ = చక్రముచే, ఉజ్ఝితమ్ = జారవిడువబడిన, తార్క్ష్యపతత్త్రమ్ = గరుత్మంతుని రెక్కను, హరిః యథా = ఇంద్రుడు వలె, చిచ్ఛేద = ముక్కలుగా చేసెను.

రాక్షసులలో మహావీరుడగు హిరణ్యాక్షుడు ఆకాశమధ్యములో కాంతులను గ్రక్కుతూ ప్రకాశించే శూలమును బలముగా ప్రయోగించెను. గరుత్మంతుడు విడిచిపెట్టిన రెక్కను ఇంద్రుడు కొట్టిన విధముగా, వరాహ భగవానుడు వాడి అంచు గల తన చక్రముతో దానిని ముక్కలుగా చేసెను.

వృక్ణే స్వశూలే బహుధారిణా
హరేః ప్రత్యేత్య విస్తీర్ణమురో విభూతిమ్ ।
ప్రవృద్ధరోషస్స కఠోరముష్టినా
నదన్ ప్రహృత్యాంతరధీయతాసురః ॥ 15

హరేః = వరాహ భగవానునియొక్క, అరిణా = చక్రముచే, స్వశూలే = తన శూలము, బహుధా = ముక్కలు ముక్కలుగా, వృక్ణే = ఛేదించబడగా, ప్రవృద్ధరోషః = పెరిగిన కోపము గల, సః = ఆ, అసురః = రాక్షసుడు, ప్రత్యేత్య = ఎదురుగా వచ్చి, నదన్ = గర్జిస్తున్నవాడై, విస్తీర్ణమ్ = విశాలమైన, విభూతిమ్ = లక్ష్మీదేవికి నివాసమగు, ఉరః = వక్షఃస్థలమును, కఠోరముష్టినా = కఠినమగు పిడికిలితో, ప్రహృత్య = కొట్టి, అంతరధీయత = అంతర్ధానమాయెను.

వరాహ భగవానుని చక్రము తన శూలమును ముక్కలు ముక్క లుగా ఛేదించగా, ఆ రాక్షసునకు కోపము పెరిగెను. అపుడాతడు ఆయనకు

ఎదురుగా వచ్చి, లక్ష్మీదేవికి ఆశ్రయమగు ఆయనయొక్క విశాల వక్షఃస్థల మును కఠినమగు తన పిడికిలితో కొట్టి గర్జించి మాయమయ్యెను.

తేనేత్థమాహతః క్షత్తర్భగవానాదిసూకరః ।
నాకంపత మనాక్ క్వాపి స్రజా హత ఇవ ద్విపః ।। **16**

క్షత్తః = ఓ విదురా!, ఆదిసూకరః భగవాన్ = ఆదివరాహ భగవాను డు, తేన = వానిచే, ఇత్థమ్ = ఈ విధముగా, ఆహతః = కొట్టబడినవాడై, స్రజా = పుష్పమాలచే, హతః = కొట్టబడిన, ద్విపః ఇవ = ఏనుగు వలె, క్వాపి = దేహములో ఏ భాగమునందైననూ, మనాక్ = కొంచెమైననూ, న అకంపత = చలించలేదు.

ఓ విదురా! ఆదివరాహ భగవానుని ఆతడీ విధముగా కొట్టగా ఆయన, పూలమాలచే కొట్టబడిన ఏనుగు వలె, దేహములో ఏభాగమునం దైననూ కొంచెమైననూ చలించలేదు.

అథోరుధాసృజన్మాయాం యోగమాయేశ్వరే హరౌ ।
యాం విలోక్య ప్రజాస్త్రస్తా మేనిరే ऽస్యోపసంయమమ్ ।। **17**

అథ = తరువాత, యోగమాయా-ఈశ్వరే = యోగమాయకు అధీ శ్వరుడగు, హరౌ = వరాహ భగవానునియందు, ఉరుధా = అనేక ప్రకార ములుగా, మాయామ్ = మాయను, అసృజత్ = ప్రయోగించెను, యామ్ = దేనిని, విలోక్య = చూచి, త్రస్తాః = భయపడిన, ప్రజాః = జనులు, అస్య = ఈ జగత్తునకు, ఉపసంయమమ్ = ప్రళయమును, మేనిరే = భావించిరో.

తరువాత ఆతడు యోగమాయకు అధీశ్వరుడగు వరాహ భగవా నునిపై అనేక రకముల మాయను ప్రయోగించెను. వాని మాయను చూచి భయపడిన జనులు జగత్తునకు ప్రళయము రాబోవుచున్నదని భావించిరి.

ప్రవవుర్వాయవశ్చండాస్తమః పాంసవమైరయన్ ।
దిగ్భ్యో నిపేతుర్గ్రావాణః క్షేపణైః ప్రహితా ఇవ ।। **18**

చండాః = ప్రచండమగు, వాయవః = గాలులు, ప్రవవుః = గట్టిగా వీచినవి, పాంసవమ్ = ధూళిచే చేయబడిన, తమః = చీకటిని, ఐరయన్ = కలిగించినవి, దిగ్భ్యః = దిక్కులనుండి, క్షేపణైః = క్షిపణులచే, ప్రహితాః ఇవ = ప్రయోగించబడినవా యన్నట్లు, గ్రావాణః = రాళ్లు, నిపేతుః = పడినవి.

ప్రచండమగు గాలులు వీచి దుమ్మును రేగగొట్టగా, చీకట్లు అలుముకొనెను. క్షిపణులు ప్రయోగించుచున్నవా యన్నట్లు దిక్కులనుండి రాళ్లు పడినవి.

ద్యౌర్నష్టభగణాభ్రౌఘైస్సవిద్యుత్స్తనయిత్నుభిః ।
వర్షద్భిః పూయకేశాసృగ్విణ్మూత్రాస్థీని చాసకృత్ ॥ 19

ద్యౌః = ఆకాశము, సవిద్యుత్-స్తనయిత్నుభిః = మెరుపులతో ఉరుములతో కూడినట్టియు, చ = మరియు, అసకృత్ = మాటిమాటికీ, పూయకేశ-అసృగ్-విట్-మూత్ర-అస్థీని = చీము జుట్టు రక్తము మలము మూత్రము మరియు ఎముకలను, వర్షద్భిః = వర్షించే, అభ్ర-ఓఘైః = మేఘముల గుంపులచే, నష్టభగణా = కనబడని నక్షత్రగణములు గలది.

ఆకాశము మెరుపులు ఉరుములతో గూడిన మేఘముల గుంపులతో నిండి నక్షత్రగణములు కానరాకుండా పోయెను. ఆ మేఘములు మాటిమాటికీ చీము, జుట్టు, రక్తము, మలము, మూత్రము, ఎముకలు అను వాటిని వర్షించెను.

గిరయః ప్రత్యదృశ్యంత నానాయుధముచోనఘ ।
దిగ్వాససో యాతుధాన్యశ్శూలిన్యో ముక్తమూర్ధజాః ॥ 20

అనఘ = ఓ మహాత్మా!, గిరయః = పర్వతములు, నానా-ఆయుధముచః = వివిధములగు ఆయుధములను విడిచిపెట్టుచున్నవిగా, ప్రత్యదృశ్యంత = కానబడెను, దిగ్-వాససః = దిగంబరులగు, యాతుధాన్యః = రాక్షసస్త్రీలు, శూలిన్యః = శూలము గలవారై, ముక్తమూర్ధజాః = జుట్టును విరబోసుకొనియున్నవారు (కనబడిరి).

ఓ మహాత్మా! పర్వతములు వివిధములగు ఆయుధములను ప్రయోగించుచుండెను. రాక్షసస్త్రీలు దిగంబరలై శూలములను పట్టుకొని జుట్టు విరబోసుకొని కనబడిరి.

బహుభిర్యక్షరక్షోభిః పత్త్యశ్వరథకుంజరైః ।
ఆతతాయిభిరుత్సృష్టా హింస్రా వాచోఽతివైశసాః ।। 21

పత్తి-అశ్వరథకుంజరైః = పదాతులు గుఱ్ఱములు రథములు ఏనుగులు వాటిని ఎక్కియున్న సైనికులతో కూడిన, ఆతతాయిభిః = హింసాస్వభావము గల, బహుభిః = అనేకులగు, యక్షరక్షోభిః = యక్షులచే మరియు రాక్షసులచే, ఉత్సృష్టాః = ప్రయోగించబడిన, అతివైశసాః = మిక్కిలి ఉగ్రమగు, హింస్రాః = క్రూరమగు, వాచః = పలుకులు (వినబడెను).

పదాతులు, గుఱ్ఱములు, రథములు, ఏనుగులు, వాటిమీద ఉన్న సైనికులు, హింసా స్వభావము గల అనేకులగు యక్షులు, రాక్షసులు మిక్కిలి ఉగ్రమైన క్రూరమగు పలుకులను పలుకుచున్నట్లు వినవచ్చెను.

ప్రాదుష్కృతానాం మాయానామాసురీణాం వినాశయత్ ।
సుదర్శనాస్త్రం భగవాన్ ప్రాయుంక్త దయితం త్రిపాత్ ।। 22

త్రిపాత్ = మూడు పాదములు గల యజ్ఞము (ధర్మము) స్వరూపముగా గల, భగవాన్ = వరాహ భగవానుడు, ప్రాదుష్కృతానామ్ = ఆవిర్భవింప జేయబడిన, ఆసురీణామ్ = రాక్షసులకు సంబంధించిన, మాయానామ్ = మాయలకు, వినాశయత్ = వినాశము చేయుట కొరకై, దయితమ్ = తనకు ప్రియమైన, సుదర్శన-అస్త్రమ్ = సుదర్శనచక్రమును, ప్రాయుంక్త = ప్రయోగించెను.

మూడు పాదములు గల ధర్మమే శ్రీహరియొక్క స్వరూపము. మూడు సవనములు గల యజ్ఞమే వరాహ భగవానుని స్వరూపము. ఆయన హిరణ్యాక్షునిచే ఆవిర్భవింప జేయబడిన రాక్షసమాయలను నశింప జేయుటకై తనకు ఇష్టమైన సుదర్శనచక్రమును ప్రయోగించెను.

తదా దితేస్సమభవత్సహసా హృది వేపథుః

స్మరంత్యా భర్తురాదేశం స్తనాచ్చాసృక్ ప్రసుస్రువే ॥ 23

తదా = అప్పుడు, భర్తుః = భర్తయగు కశ్యప ప్రజాపతియొక్క, ఆదేశమ్ = ఉపదేశమును, స్మరంత్యాః = స్మరించుచున్న, దితేః = దితికి, సహసా = వెంటనే, హృది = హృదయమునందు, వేపథుః = వణుకు, సమభవత్ = పుట్టెను, చ = మరియు, స్తనాత్ = స్తనమునుండి, అసృక్ = రక్తము, ప్రసుస్రువే = అధికముగా ప్రసరించెను.

అప్పుడు భర్త చెప్పిన విషయములు గుర్తుకు వచ్చిన దితికి హృదయములో వణుకు పుట్టి, స్తనములనుండి రక్తము స్రవించెను.

వినష్టాసు స్వమాయాసు భూయశ్చావ్రజ్య కేశవమ్ ।
రుషోపగూహమానోఽముం దదృశేఽవస్థితం బహిః ॥ 24

స్వమాయాసు = తన మాయలు, వినష్టాసు = పూర్తిగా నశించగా, భూయః = మరల, ఆవ్రజ్య = ఎదురుగా వచ్చి, రుషా = కోపముతో, కేశవమ్ = వరాహ భగవానుని, ఉపగూహమానః = కౌగిటిలో నలిపివేయుచున్నవాడై, బహిః = తన కౌగిటికి బయట, అవస్థితమ్ = నిలిచియున్న, అముమ్ = ఈయనను, దదృశే = చూచెను.

హిరణ్యాక్షుని మాయలు పూర్తిగా అంతర్ధానమయ్యేను. అపుడాతడు కోపముతో వరాహ భగవానునకు ఎదురుగా వచ్చి ఆయనను కౌగిటిలో బిగించి నొక్కివేయుటకు ప్రయత్నించెను. కాని, ఆయన వాని కౌగిటికి బయటనే నిలిచియుండుటను ఆతడు కనుగొనెను.

తం ముష్టిభిర్వినిఘ్నంతం వజ్రసారైరధోక్షజః ।
కరేణ కర్ణమూలేఽహన్ యథా త్వాష్ట్రం మరుత్పతిః ॥ 25

వజ్రసారైః = వజ్రమువలె కఠినమైన, ముష్టిభిః = పిడికిళ్లతో, వినిఘ్నంతమ్ = గట్టిగా కొట్టుచున్న, తమ్ = ఆ హిరణ్యాక్షుని, అధోక్షజః = వరాహ భగవానుడు, మరుత్పతిః = మరుద్గణములకు ప్రభువగు ఇంద్రుడు, త్వాష్ట్రం యథా = వృత్రుని వలె, కరేణ = చేతితో, కర్ణమూలే = చెంపకు పైన, అహన్ = కొట్టెను.

హిరణ్యాక్షుడు వజ్రమువలె కఠినమైన పిడికిలితో వరాహ భగవానుని గట్టిగా కొట్టుచుండగా, ఇంద్రుడు వృత్రుని వలె, ఆయన వానిని చెంపకు పైభాగమునందు చేతితో కొట్టెను.

స ఆహతో విశ్వజితా హ్యావజ్ఞయా
పరిభ్రమద్గాత్ర ఉదస్తలోచనః ।
విశీర్ణబాహ్వంఘ్రిశిరోరుహో ऽపతత్
యథా నగేంద్రో లులితో నభస్వతా ॥ 26

విశ్వజితా = విశ్వవిజేతయగు వరాహ భగవానునిచే, అవజ్ఞయా = ఉపేక్షాభావముతో, ఆహతః = కొట్టబడిన, సః = ఆ హిరణ్యాక్షుడు, పరిభ్రమత్-గాత్రః = గిరగిర తిరుగుచున్న శరీరము గలవాడై, ఉదస్తలోచనః = బయల్వెడలిన కన్నులు గలవాడై, విశీర్ణబాహు-అంఘ్రిశిరోరుహః = శిథిలమైన చేతులు కాళ్లు మరియు చెల్లాచెదరైన జుట్టు గలవాడై, నభస్వతా = వాయువుచే, లులితః = పెకిలించి వేయబడిన, నగ-ఇంద్రః యథా = గొప్ప చెట్టు వలె, అపతత్ = పడెను.

విశ్వవిజేతయగు వరాహ భగవానుడు హిరణ్యాక్షుని కేవలము ఉపేక్షాభావముతో మాత్రమే కొట్టెను; గట్టిగా కొట్టనే లేదు. వాని శరీరము గిరగిర తిరుగజొచ్చెను; కన్నులు బయల్వెడలెను. వాని చేతులు కాళ్లు శిథిలమయ్యెను; జుట్టు చెల్లాచెదరై, తుఫాను గాలిచే పెకిలించి వేయబడిన చెట్టువలె, వాడు క్రింద పడెను.

క్షితౌ శయానం తమకుంఠవర్చసం
కరాలదంష్ట్రం పరిదష్టదచ్ఛదమ్ ।
అజాదయో వీక్ష్య శశంసురాగతా
అహో ఇమాం కో ను లభేత సంస్థితిమ్ ॥ 27

క్షితౌ = భూమిపై, శయానమ్ = పరున్నట్టియు, అకుంఠవర్చసమ్ = ఎదురులేని తేజస్సు గలిగినట్టియు, కరాలదంష్ట్రమ్ = భయంకరమగు కోరలు గలిగినట్టియు, పరిదష్టదచ్ఛదమ్ = కొరికివేయబడిన పెదవి గల,

తమ్ = ఆ హిరణ్యాక్షుని; ఆగతాః = వచ్చియున్న, అజ-ఆదయః = బ్రహ్మ మొదలగువారు, వీక్ష్య = చూచి, అహో= ఆశ్చర్యము!, ఇమామ్ = ఇట్టి, సంస్థితిమ్ = మరణమును, కః ను = ఎవ్వాడు, లభేత = పొందును? అని, శశంసుః = కొనియాడిరి.

ఎదురు లేని తేజస్సు గల ఆ హిరణ్యాక్షుడు భూమిపై పడియుండెను. వాని కోరలు భీతిని గొల్పుచుండెను. వాని పెదవి కోపముచే కొరికి వేయబడి యుండెను. అచటకు విచ్చేసిన బ్రహ్మాదులు వానిని చూచి, ఇట్లు కొనియాడిరి: ఆశ్చర్యము! ఇట్టి మరణము ఎట్టి వానికి దొరుకును?

యం యోగినో యోగసమాధినా రహో
ధ్యాయంతి లింగాదసతో ముముక్షయా ।
తస్యైష దైత్యఋషభః పదా హతో
ముఖం ప్రపశ్యంస్తనుముత్ససర్జ హ ॥ 28

యమ్ = ఎవనిని, యోగినః = యోగులు, అసతః = మిథ్యాభూతమగు, లింగాత్ = లింగశరీరమునుండి, ముముక్షయా = విముక్తిని పొందవలెననే కోరికతో, రహః = ఏకాంతమునందు, యోగసమాధినా = మనోనిగ్రహముచే సంపన్నమైన సమాధిచే, ధ్యాయంతి = ధ్యానము చేయుదురో, తస్య = అట్టి భగవానుని, పదా = పాదముచే, హతః = కొట్టబడినవాడై, ఏషః = ఈ, దైత్య-ఋషభః = రాక్షసశ్రేష్ఠుడు, ముఖమ్ = ముఖమును, ప్రపశ్యన్ = చూచువాడై, తనుమ్ = దేహమును, ఉత్ససర్జ హ = విడిచిపెట్టెను గదా!

యోగులు లింగశరీరమునుండి విముక్తిని కోరువారై మనస్సును నిగ్రహించి, ఏకాగ్రమగు చిత్తముతో భగవానుని ధ్యానించెదరు. అట్టి భగవానుడు కాలితో తన్నగా, ఈ రాక్షసశ్రేష్ఠుడు ఆయన ముఖమును చూస్తూ ప్రాణములను విడిచిపెట్టెను.

ఏతౌ తౌ పార్షదావస్య శాపాద్యాతావసద్గతిమ్ ।
పునః కతిపయైః స్థానం ప్రపత్స్యేతే హ జన్మభిః ॥ 29

తౌ = ఆ, ఏతౌ = ఈ, అస్య = ఈ భగవానుని, పార్షదౌ = అనుయాయులు, శాపాత్ = శాపము వలన, అసద్-గతిమ్ = పాప (అసుర) జన్మను, యాతౌ = పొందినారు, కతిపయైః = కొన్ని, జన్మభిః = జన్మలచే, పునః = మరల, స్థానమ్ = వైకుంఠస్థానమును, ప్రపత్స్యేతే హ = పొందగలరు.

ఈ హిరణ్యాక్ష హిరణ్యకశిపులిద్దరు పూర్వములో విష్ణుపార్షదులుగా నుండిన జయవిజయులే. వారు సనకాది మహర్షుల శాపము వలన ఈ రాక్షసజన్మను పొందినారు. ఇట్టి కొన్ని జన్మల తరువాత, వారు మరల తమ స్థానమును పొందగలరు.

దేవా ఊచుః ।
నమో నమస్తేఽఖిలయజ్ఞతంతవే
స్థితౌ గృహీతామలసత్త్వమూర్తయే ।
దిష్ట్యా హతోఽయం జగతామరుంతుదః
త్వత్పాదభక్త్యా వయమీశ నిర్వృతాః ॥ 30

అఖిలయజ్ఞతంతవే = యజ్ఞములనన్నింటినీ ప్రవర్తిల్ల జేయునట్టియు, స్థితౌ = జగద్రక్షణ విషయములో, గృహీత-అమలసత్త్వమూర్తయే = స్వీకరించబడిన రజస్తమోగుణముల ప్రవేశము లేని సత్త్వమయమగు అవతారములు గల, తే = నీ కొరకు, నమః నమః = అనేక నమస్కారములు, జగతామ్ = లోకములకు, అరుంతుదః = మర్మములను భేదించే, అయమ్ = ఈతడు, దిష్ట్యా = దైవవశముచే, హతః = సంహరించ బడినాడు, ఈశ = ఓ ఈశ్వరా!, త్వత్-పాదభక్త్యా = నీ పాదములయందలి భక్తిచే, వయమ్ = మేము, నిర్వృతాః = సుఖమును పొందినవారము.

దేవతలు ఇట్లు పలికిరి --- ఓ ఈశ్వరా! యజ్ఞములనన్నింటినీ ప్రవర్తిల్ల జేయువాడవు నీవే. నీవు జగద్రక్షణ కొరకై రజస్తమోగుణముల దోషము లేని సత్త్వమయమగు అవతారములను దాల్చెదవు. నీకు అనేక నమస్కారములు. లోకములకు పీడను కలిగించే ఈతడు దైవవశముచే సంహరించ బడినాడు. మేము నీ పాదములయందు భక్తిని చేసి సుఖమును పొందినాము.

మైత్రేయ ఉవాచ ।
ఏవం హిరణ్యాక్షమసహ్యావిక్రమం
స సాదయిత్వా హరిరాదిసూకరః ।
జగామ లోకం స్వమఖండితోత్సవం
సమీడితః పుష్కరవిష్టరాదిభిః ॥ 31

ఏవమ్ = ఈ విధముగా, ఆదిసూకరః = ఆదివరాహరూపుడగు, సః = ఆ, హరిః = శ్రీహరి, అసహ్యావిక్రమమ్ = సహింప శక్యము కాని పరాక్రమము గల, హిరణ్యాక్షమ్ = హిరణ్యాక్షుని, సాదయిత్వా = సంహరించి, పుష్కరవిష్టర-ఆదిభిః = కమలాసనుడగు బ్రహ్మ మొదలగు వారిచే, సమీడితః = చక్కగా స్తుతించబడినవాడై, అఖండిత-ఉత్సవమ్ = నిరంతరమగు ఉత్సవము గల, స్వమ్ = తనదైన, లోకమ్ = వైకుంఠ లోకమును గురించి, జగామ = వెళ్లెను.

మైత్రేయుడిట్లు పలికెను --- ఈ విధముగా ఆదివరాహరూపియగు ఆ శ్రీహరి సహింప శక్యము కాని పరాక్రమము గల హిరణ్యాక్షుని సంహరించెను. కమలాసనుడగు బ్రహ్మ మొదలగు వారు ఆయనను చక్కగా స్తుతించిరి. అపుడాయన నిత్యకల్యాణముగానుండే తన వైకుంఠలోకమునకు వెళ్లెను.

మయా యథానూక్తమవాది తే హరేః
కృతావతారస్య సుమిత్ర చేష్టితమ్ ।
యథా హిరణ్యాక్ష ఉదారవిక్రమో
మహామృధే క్రీడనవన్నిరాకృతః ॥ 32

సుమిత్ర = ఓ మంచి మిత్రుడా!, ఉదారవిక్రమః = గొప్ప పరాక్రమము గల, హిరణ్యాక్షః = హిరణ్యాక్షుడు, మహామృధే = గొప్ప యుద్ధమునందు, క్రీడనవత్ = ఆటబొమ్మ వలె, యథా = ఏ విధముగా, నిరాకృతః = నశింప జేయబడినాడో, మయా = నాచే, తే = నీ కొరకు, కృత-అవతారస్య = స్వీకరించబడిన వరాహావతారము గల, హరేః = శ్రీహరియొక్క, చేష్టి

తమ్ = లీల, యథా-అను-ఉక్తమ్ = గురువుచే బోధించబడినదానిని అతిక్ర మించకుండగా, అవాది = చెప్పబడినది.

ఓ విదురా! నీవు మంచి మిత్రుడవు. గొప్ప పరాక్రమము గల హిర ణ్యాక్షుని వరాహ రూపమును దాల్చిన శ్రీహరి గొప్ప యుద్ధములో అటబొ మ్మను వలె ఆడించి సంహరించెను. భగవానుని ఆ లీలను నేను మా గురు వులు చెప్పిన దానిని అతిక్రమించకుండగా నీకు వర్ణించి చెప్పితిని.

సూత ఉవాచ ।
ఇతి కౌషారవాఖ్యాతామాశ్రుత్య భగవత్కథామ్ ।
క్షత్తాఽఽనందం పరం లేభే మహాభాగవతో ద్విజ॥ 33

ద్విజ = ఓ శౌనక మహర్షీ!, ఇతి = ఈ విధముగా, కౌషారవ-అఖ్యా తామ్ = మైత్రేయ మహర్షిచే చెప్పబడిన, భగవత్-కథామ్ = భగవానుని గాథను, ఆశ్రుత్య = విని, మహాభాగవతః = గొప్ప భగవద్భక్తుడగు, క్షత్తా = విదురుడు, పరమ్ = గొప్ప, ఆనందమ్ = ఆనందమును, లేభే = పొందెను.

సూతుడిట్లు పలికెను --- ఓ శౌనక మహర్షీ! ఈ విధముగా మైత్రేయ మహర్షి భగవానుని గాథను వర్ణించి చెప్పగా, గొప్ప భగవద్భక్తు డగు విదురుడు విని గొప్ప ఆనందమును పొందెను.

అన్యేషాం పుణ్యశ్లోకానాముద్దామయశసాం సతామ్ ।
ఉపశ్రుత్య భవేన్మోదః శ్రీవత్సాంకస్య కిం పునః ॥ 34

పుణ్యశ్లోకానామ్ = పవిత్రమగు కీర్తి గల, ఉద్దామయశసామ్ = అంతటా వ్యాపించిన కీర్తిగల, అన్యేషామ్ = ఇతరులగు, సతామ్ = మహా త్ముల (గాథను), ఉపశ్రుత్య = విని, మోదః = ఆనందము, భవేత్ = కలుగు ను, శ్రీవత్సాంకస్య = శ్రీవత్సము చిహ్నముగా గల శ్రీహరి గాథను గురిం చి, కిం పునః = చెప్పవలసినదేమున్నది?

అంతటా వ్యాపించిన పవిత్రమగు కీర్తి గల ఇతర మహాత్ముల గాథను విన్నప్పుడే ఆనందము కలుగుచున్నచో, శ్రీవత్సము చిహ్నముగా గల శ్రీహరి గాథ ఆనందమును కలిగించునని వేరుగా చెప్పవలెనా?

యో గజేంద్రం ఝషగ్రస్తం ధ్యాయంతం చరణాంబుజమ్ ।
క్రోశంతీనాం కరేణూనాం కృచ్ఛ్రతోఽమోచయద్ద్రుతమ్ ॥35

యః = ఏ శ్రీహరి, ఝషగ్రస్తమ్ = మొసలిచే పట్టుకొనబడినదై, కరేణూనామ్ = ఆడు ఏనుగులు, క్రోశంతీనామ్ = ఆక్రోశించుచుండగా, చరణ-అంబుజమ్ = పాదపద్మమును, ధ్యాయంతమ్ = ధ్యానించుచున్న, గజ-ఇంద్రమ్ = గొప్ప ఏనుగును, ద్రుతమ్ = వెంటనే, కృచ్ఛ్రతః = ఆపదనుండి, అమోచయత్ = విడిపించెనో.

గజేంద్రుని మొసలి పట్టుకున్నప్పుడు ఆడు ఏనుగులు ఆక్రోశించుచుండెను. అపుడా గజేంద్రుడు శ్రీహరి పాదపద్మములను ధ్యానించెను. వెంటనే శ్రీహరి ఆ ఏనుగును ఆపదనుండి విడిపించెను.

తం సుఖారాధ్యమృజుభిరనన్యశరణైర్నృభిః ।
కృతజ్ఞః కో న సేవేత దురారాధ్యమసాధుభిః ॥ 36

ఋజుభిః = ఋజుస్వభావము గల, అనన్యశరణైః = శ్రీహరి తక్క మరియొక రక్షకుని యెరుగని, నృభిః = మానవులచే, సుఖ-ఆరాధ్యమ్ = తేలికగా ఆరాధించబడునట్టియు, అసాధుభిః = దుష్టులచే, దురారాధ్యమ్ = ఆరాధింప శక్యము కాని, తమ్ = ఆ శ్రీహరిని, కృతజ్ఞః = కృతజ్ఞుడగు, కః = ఎవ్వాడు, న సేవేత = సేవించకుండును?

నిష్కపటులై ఏకాంతభక్తితో శరణు జొచ్చు మానవులకు శ్రీహరిని ఆరాధించుట చాల సరళమైన పని. కాని, దుష్టులకు ఆయనను ఆరాధించి ప్రసన్నుని చేసుకొనుట అసంభవము. మానవుని భాగ్యమంతయు ఆయన చలువయే అని గుర్తించిన వ్యక్తి ఎవడు ఆయనను సేవించకుండును?

యో వై హిరణ్యాక్షవధం మహాద్భుతం
విక్రీడితం కారణసూకరాత్మనః ।
శృణోతి గాయత్యనుమోదతేఽంజసా
విముచ్యతే బ్రహ్మవధాదపి ద్విజాః ॥ 37

ద్విజాః = ఓ మహర్షులారా!, యః వై = ఎవడైతే, కారణసూకర-ఆత్మనః = ఒక విశిష్టకారణముచే వరాహ రూపమును దాల్చిన శ్రీహరి యొక్క, హిరణ్యాక్షవధమ్ = హిరణ్యాక్షుని సంహారము అనే, మహా-అద్భుతమ్ = గొప్ప ఆశ్చర్యమును కలిగించే, విక్రీడితమ్ = లీలను, శృణోతి = వినునో, గాయతి = కీర్తించునో, అనుమోదతే = అనుమోదించునో వాడు, అంజసా = యథార్థముగా, బ్రహ్మవధాత్ అపి = బ్రహ్మహత్యా దోషము నుండి కూడ, విముచ్యతే = విముక్తిని పొందును.

ఓ మహర్షులారా! శ్రీహరి జగద్రక్షణము కొరకై వరాహ రూపమును దాల్చి హిరణ్యాక్షుని వధించుట అనే గొప్ప ఆశ్చర్యకరమగు లీలను ప్రకటించెను. దీనిని ఎవడైతే వినునో, కీర్తించునో, అనుమోదించి ప్రోత్సహించునో, వాడు యథార్థముగా బ్రహ్మహత్యాపాపమునుండి కూడ విముక్తుడగును.

ఏతన్మహాపుణ్యమలం పవిత్రం
ధన్యం యశస్యం పదమాయురాశిషామ్ ।
ప్రాణేంద్రియాణాం యుధి శౌర్యవర్ధనం
నారాయణోఽంతే గతిరంగ శృణ్వతామ్ ॥ 38

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
ఏకోనవింశోఽధ్యాయః ॥

అంగ = ఓ విదురా!, మహాపుణ్యమ్ = గొప్ప పుణ్యమునిచ్చునది, అలమ్ = అతిశయించిన, పవిత్రమ్ = పావనము, ధన్యమ్ = సంపదలనిచ్చునది, యశస్యమ్ = కీర్తిని కలిగించునది, ఆయురాశిషామ్ = ఆయుర్దాయమునకు మనోరథములకు, పదమ్ = స్థానము, యుధి = యుద్ధమునందు, ప్రాణ-ఇంద్రియాణామ్ = ప్రాణమునకు ఇంద్రియములకు, శౌర్యవర్ధనమ్ = పరాక్రమమును వర్ధిల్లజేయునది అగు, ఏతత్ = ఈ గాథను, శృణ్వతామ్ = వినువారలకు, అంతే = మరణించిన పిదప, నారాయణః = నారాయణుడు, గతిః = ఫలము.

గొప్ప పుణ్యమునిచ్చే ఈ గాథ వినువారిని అతిశయించి పవిత్రులను జేసి, ధనమును కీర్తిని ఆయుర్దాయమును మరియు మనోరథములను సంపాదించి పెట్టును. ఈ గాథను విన్నవారికి ఇది యుద్ధములో ప్రాణమునకు, ఇంద్రియములకు పరాక్రమమును వర్ధిల్ల జేయును. దీనిని విన్నవారు మరణించిన పిదప నారాయణుని పొందెదరు.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
పందొమ్మిదవ అధ్యాయము ముగిసినది (19).

* * * * *

# అథ వింశోఽధ్యాయః

## బ్రహ్మగారి సృష్టిని వర్ణించుట

శౌనక ఉవాచ ।
మహీం ప్రతిష్ఠామధ్యస్య సౌతే స్వాయంభువో మనుః ।
కాన్యన్వతిష్ఠద్ద్వారాణి మార్గాయావరజన్మనామ్ ॥ 1

శౌనకః = శౌనక మహర్షి, ఉవాచ = పలికెను, సౌతే = రోమహర్షణ పుత్రుడవగు ఓ సూతా!, స్వాయంభువః మనుః = స్వాయంభువ మనువు, ప్రతిష్ఠామ్ = ప్రాణులకు ఆధారమైన, మహీమ్ = భూమిని, అధ్యస్య = పొంది, అవరజన్మనామ్ = తరువాత జన్మగల జీవుల, మార్గాయ = ఉత్పత్తికై, కాని = ఏ, ద్వారాణి = ఉపాయములను, అన్వతిష్ఠత్ = చేసెను?

శౌనక మహర్షి ఇట్లు పలికెను -- ఓ సూత మహర్షీ! స్వాయంభువ మనువు సకలప్రాణులకు ఆధారమగు భూమిని పొంది, తరువాతి కాలములో పుట్టబోయే ప్రాణుల సృష్టి కొరకు ఏ ఉపాయముల ననుష్ఠించెను?

క్షత్తా మహాభాగవతః కృష్ణస్యైకాంతికస్సుహృత్ ।
యస్తత్యాజాగ్రజం కృష్ణే సాపత్యమఘవానితి ॥ 2

మహాభాగవతః = గొప్ప భగవద్భక్తుడగు, క్షత్తా = విదురుడు, కృష్ణస్య = శ్రీకృష్ణునకు, ఐకాంతికః = పరమప్రేమపాత్రుడగు, సుహృత్ = మిత్రుడు, యః = ఏ విదురుడు, కృష్ణే = శ్రీకృష్ణుని విషయములో, అఘవాన్ = తప్పును చేసినవాడు, ఇతి = అనే కారణముచే, స-అపత్యమ్ = పుత్రులతో కూడిన, అగ్రజమ్ = అన్నగారిని, తత్యాజ = విడిచిపెట్టెనో.

గొప్ప భగవద్భక్తుడగు విదురుడు శ్రీకృష్ణుని పరమప్రేమకు పాత్రుడగు మిత్రుడు. శ్రీకృష్ణుని విషయములో అపరాధమును చేసిన

దుర్యోధనాదులను, వారిని సమర్థించిన అన్నగారగు ధృతరాష్ట్రుని ఆయన విడిచిపెట్టి వెళ్లిపోయెను.

ద్వైపాయనాదనవరో మహిత్వే తస్య దేహజః ।
సర్వాత్మనా శ్రితః కృష్ణం తత్పరాంశ్చాప్యనువ్రతః ॥ 3

మహిత్వే = గొప్పదనమునందు, ద్వైపాయనాత్ = వ్యాసమహర్షి కంటె, అనవరః = తక్కువ కానివాడు, తస్య = ఆయనకు, దేహజః = పుత్రుడు, సర్వ-ఆత్మనా = అన్ని విధములుగా, కృష్ణమ్ = శ్రీకృష్ణుని, శ్రితః = ఆశ్రయించినవాడు, తత్-పరాన్ చ అపి = ఆ శ్రీకృష్ణుని భక్తులను కూడ, అనువ్రతః = సేవించువాడు.

ద్వైపాయన మహర్షి పుత్రుడగు విదురుడు గొప్పదనములో ఆయనకు తీసిపోవువాడు కాదు. ఆయన సర్వప్రకారములుగా శ్రీకృష్ణుని శరణుజొచ్చి, ఆయన భక్తులను సేవించెడివాడు.

కిమన్వపృచ్ఛన్మైత్రేయం విరజాస్తీర్థసేవయా ।
ఉపగమ్య కుశావర్త ఆసీనం తత్త్వవిత్తమమ్ ॥ 4

తీర్థసేవయా = పుణ్యతీర్థములను సేవించుటచే, విరజాః = తొలగిన దోషములు గల విదురుడు, కుశావర్తే = హరిద్వారమునందు, ఆసీనమ్ = కూర్చునియున్న, తత్త్వవిత్తమమ్ = తత్త్వవేత్తలలో శ్రేష్ఠుడగు, మైత్రేయమ్ = మైత్రేయ మహర్షిని, ఉపగమ్య = సమీపించి, కిమ్ = ఏమి; అన్వపృచ్ఛత్ = ప్రశ్నించెను?

పుణ్యతీర్థములను సేవించుట వలన నశించిన దోషములు గల విదురుడు హరిద్వారములోనున్న, తత్త్వవేత్తలలో శ్రేష్ఠుడగు మైత్రేయ మహర్షిని సమీపించి ఏమి ప్రశ్నించెను?

తయోస్సంవదతోస్సూత ప్రవృత్తా హ్యమలాః కథాః ।
ఆపో గాంగా ఇవాఘఘ్నీర్హరేః పాదాంబుజాశ్రయాః ॥ 5

సూత = ఓ సూత మహర్షీ!, తయోః = వారిద్దరు, సంవదతోః = సంభాషించుచుండగా, హరేః = శ్రీహరియొక్క, పాద-అంబుజ-ఆశ్రయాః = పాదపద్మములు ఆశ్రయముగా గల, అమలాః = పవిత్రమగు, గాంగాః = గంగానదికి సంబంధించిన, ఆపః ఇవ = జలములు వలె, అఘఘ్నాః = పాపములను నశింపజేసే, కథాః = గాథలు, ప్రవృత్తాః హి = నిశ్చయముగా ప్రసంగమునకు వచ్చియుండును.

ఓ సూతా! వారిద్దరు నిశ్చయముగా శ్రీహరి పాదపద్మములకు సంబంధించిన పవిత్రమగు గాథలను ప్రస్తావించియుందురు. ఆ గాథలు శ్రీహరి పాదపద్మములనుండి పుట్టిన గంగాజలముల వలె పాపములను కడిగివేయును.

తా నః కీర్తయ భద్రం తే కీర్తన్యోదారకర్మణః ।
రసజ్ఞః కో ను తృప్యేత హరిలీలామృతం పిబన్ ॥ 6

కీర్తన్య-ఉదారకర్మణః = కీర్తించదగిన గొప్ప లీలలు గల శ్రీహరి యొక్క, తాః = ఆ గాథలను, నః = మా కొరకు, కీర్తయ = కీర్తించుము, తే = నీ కొరకు, భద్రమ్ = మంగళమగు గాక!, రసజ్ఞః = రసము తెలిసినవాడు, కః = ఎవడు, హరిలీలా-అమృతమ్ = శ్రీహరియొక్క లీలలు అనే అమృతమును, పిబన్ = త్రాగుచున్నవాడై, తృప్యేత ను = తృప్తిని చెందును?

కీర్తించదగిన గొప్ప లీలలు గల శ్రీహరియొక్క ఆ గాథలను మాకు వినిపించుము. నీకు మంగళమగు గాక! రసజ్ఞుడెవడు శ్రీహరి యొక్క లీలలు అనే అమృతమును త్రావుతూ తృప్తిని చెందును?

ఏవముగ్రశ్రవాః పృష్ట ఋషిభిర్నైమిషాయనైః ।
భగవత్యర్పితాధ్యాత్మస్తానాహ శ్రూయతామితి ॥ 7

నైమిష-అయనైః = నైమిషారణ్యము నివాసముగా గల, ఋషిభిః = మహర్షులచే, ఏవమ్ = ఈ విధముగా, పృష్టః = ప్రశ్నించబడిన, ఉగ్రశ్రవాః = సూత మహర్షి, భగవతి = భగవానునియందు, అర్పిత-అధ్యాత్మః = సమ

ర్పించబడిన మనస్సు గలవాడై, తాన్ = వారిని ఉద్దేశించి, శ్రూయతామ్ = వినబడుగాక!, ఇతి = అని, ఆహ = పలికెను.

నైమిషారణ్యవాసులగు మహర్షులు ఈ విధముగా ప్రశ్నించగా, సూత మహర్షి తన మనస్సును భగవానునిపై నిలిపి, వినుడు అని వారితో ఇట్లు పలికెను.

సూత ఉవాచ ।
హరేర్ధృతక్రోడతనోస్స్వమాయయా
నిశమ్య గోరుద్ధరణం రసాతలాత్ ।
లీలాం హిరణ్యాక్షమవజ్ఞయా హతం
సంజాతహర్షో మునిమాహ భారతః ॥ 8

స్వమాయయా = తన మాయాశక్తిచే, ధృతక్రోడతనోః = ధరించబడిన వరాహరూపము గల, హరేః = శ్రీహరియొక్క, రసాతలాత్ = పాతాళమునుండి, గోః = భూమియొక్క, ఉద్ధరణమ్ = పైకి తీయుట, హిరణ్యాక్షమ్ = హిరణ్యాక్షుని, అవజ్ఞయా = తేలికగా, హతమ్ = చంపబడుట అనే, లీలామ్ = లీలను, నిశమ్య = విని, భారతః = భరతవంశీయుడగు విదురుడు, సంజాతహర్షః = కలిగిన హర్షము గలవాడై, మునిమ్ = మైత్రేయ మహర్షిని ఉద్దేశించి, ఆహ = పలికెను.

సూత మహర్షి ఇట్లు పలికెను --- శ్రీహరి తన మాయాశక్తిచే వరాహరూపమును దాల్చి, భూమిని పాతాళమునుండి పైకి తీసి, హిరణ్యాక్షుని అవలీలగా సంహరించెను. ఈ లీలను విని భరతవంశీయుడగు విదురుడు హర్షించి, మైత్రేయ మహర్షితో నిట్లనెను.

విదుర ఉవాచ ।
ప్రజాపతిపతిస్సృష్ట్వా ప్రజాసర్గే ప్రజాపతీన్ ।
కిమారభత మే బ్రహ్మన్ ప్రబ్రూహ్యవ్యక్తమార్గవిత్ ॥ 9

బ్రహ్మన్ = ఓ మహర్షీ!, ప్రజాపతిపతిః = ప్రజాపతులకు ప్రభువగు బ్రహ్మగారు, ప్రజాసర్గే = ప్రజల సృష్టియందు, ప్రజాపతీన్ = ప్రజాపతుల

ను, సృష్ట్వా = సృష్టించి, కిమ్ = దేనిని, ఆరభత = ఆరంభించెను?, అవ్యక్త మార్గవిత్ = పరోక్షవిషయములను (భగవద్విషయములను) కూడ యెరింగిన నీవు, మే = నా కొరకు, ప్రబ్రూహి = చెప్పుము.

విదురుడు ఇట్లు పలికెను --- ఓ మహర్షీ! ప్రజాపతులకు తండ్రియగు బ్రహ్మగారు ప్రజల సృష్టిలో భాగముగా ప్రజాపతులను సృష్టించి, తరువాత దేనిని ఆరంభించెను? నీవు భగవద్విషయములను, పరోక్ష విషయములను కూడ తెలిసినవాడవు. నాకీ విషయమును చెప్పుము.

యే మరీచ్యాదయో విప్రా యస్తు స్వాయంభువో మనుః ।
తే వై బ్రహ్మణ ఆదేశాత్కథమేతదభావయన్ ॥ 10

మరీచి-ఆదయః = మరీచి మొదలగు, విప్రాః = మహర్షులు, యే = ఎవరు గలరో, స్వాయంభువః మనుః తు = స్వాయంభువ మనువైతే, యః = ఎవడు గలడో, తే = వారు, బ్రహ్మణః = బ్రహ్మగారి, ఆదేశాత్ = ఆదేశము వలన, ఏతత్ = ఈ జగత్తును, కథమ్ = ఏ విధముగా, అభావయన్ = సృష్టించిరి?

మరీచి మొదలగు మహర్షులు, స్వాయంభువ మనువు బ్రహ్మగారి ఆదేశముచే ఈ జగత్తును ఏ విధముగా సృష్టించిరి?

సద్వితీయాః కిమసృజన్ స్వతంత్రా ఉత కర్మసు ।
ఆహోస్విత్సంహతాస్సర్వ ఇదం స్మ సమకల్పయన్ ॥ 11

సద్వితీయాః = భార్యలతో కూడినవారై, కిం అసృజన్ = సృష్టించిరా?, ఉత = లేక, కర్మసు = సృష్టికార్యములయందు, స్వతంత్రాః = భార్య యొక్క అపేక్ష లేనివారా?, ఆహోస్విత్ = లేక, సర్వే= అందరు, సంహతాః = కలిసినవారై, ఇదమ్ = ఈ జగత్తును, సమకల్పయన్ స్మ = సృష్టించిరా?

వారు భార్యలతో కూడి ఈ జగత్తును సృష్టించిరా? లేక, స్వతంత్రముగనే సృష్టించిరా? లేక, అందరు కలిసి సృష్టించిరా?

మైత్రేయ ఉవాచ ।

దైవేన దుర్వితర్క్యేణ పరేణానిమిషేణ చ ।
జాతక్షోభాద్భగవతో మహానాసీద్గుణత్రయాత్ ॥ 12

దుర్వితర్క్యేణ = ఊహింప శక్యము కాని, దైవేన = జీవుల అదృష్ట ముచే, పరేణ = ప్రకృతికి అధ్యక్షుడైన పురుషునిచే, చ = మరియు, అనిమిషేణ = కాలముచే, భగవతః = భగవానుని, జాతక్షోభాత్ = ఉత్పన్నమైన వైషమ్యము గల, గుణత్రయాత్ = త్రిగుణాత్మకమగు ప్రకృతినుండి, మహాన్ = మహత్తత్త్వము, ఆసీత్ = ప్రకటమయ్యెను.

జీవుల కర్మగతిని ఊహించుట శక్యము కాదు. ఆ కర్మగతి, ప్రకృతికి అధ్యక్షుడగు పురుషుడు, కాలము అనే మూడు హేతువులచే భగవానుని త్రిగుణాత్మికయగు మాయాశక్తియందు వైషమ్యము కలిగి మహత్తత్త్వము ప్రకటమయ్యెను.

రజఃప్రధానాన్మహతస్త్రిలింగో దైవచోదితాత్ ।
జాతస్ససర్జ భూతాదిర్వియదాదీని పంచశః ॥ 13

దైవచోదితాత్ = దైవముచే ప్రేరేపించబడిన, రజఃప్రధానాత్ = రజోగుణము ప్రధానముగా గల, మహతః = మహత్తునుండి, త్రిలింగః = మూడు గుణములు గల, భూతాదిః = అహంకారము, జాతః = ప్రకటమయ్యెను, వియత్-ఆదీని = ఆకాశము మొదలగు వాటిని, పంచశః = తన్మాత్రలు మహాభూతములు జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు మరియు అధిష్ఠాన దేవతలు అనువాటిని అయిదింటి చొప్పున, ససర్జ = సృష్టించెను.

భగవానుని ప్రేరణచే రజోగుణప్రధానమగు మహత్తునుండి సాత్త్విక రాజస తామస భేదముచే అహంకారము పుట్టెను. అదియే పంచ భూతములకు కారణము. దానినుండి అయిదు తన్మాత్రలు, అయిదు స్థూల భూతములు, అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు, అయిదైదు అధిష్ఠాన దేవతలు ప్రకటమయ్యెను.

తాని చైకైకశస్స్రష్టుమసమర్థాని భౌతికమ్ ।
సంహత్య దైవయోగేన హైమమండమవాసృజన్ ॥ 14

తాని చ = అవి, ఏక-ఏకశః = ఒక్కటొక్కటిగా, భౌతికమ్ = జగత్తును, స్రష్టుమ్ = సృష్టించుటకు, అసమర్థాని = సమర్థములు కానివై, దైవయోగేన = భగవంతుని శక్తిచే, సంహత్య = ఒకదానితో నొకటి కలిసి, హైమమ్ = తేజోమయమగు, అండమ్ = అండమును, అవాసృజన్ = సృష్టించినవి.

అవి విడివిడిగా బ్రహ్మాండమును సృష్టించలేక పోయినవి. అవి భగవంతుని శక్తిచే ఒకదానితో మరియొకటి కలిసి తేజోమయమగు అండమును సృష్టించినవి.

సోఽశయిష్టాబ్ధిసలిలే ఆండకోశో నిరాత్మకః ।
సాగ్రం వై వర్షసాహస్రమన్వవాత్సీత్తమీశ్వరః ॥ **15**

సః = ఆ, ఆండకోశః = బ్రహ్మాండము, నిరాత్మకః = అచేతనమై, అబ్ధిసలిలే = ప్రళయసముద్రజలమునందు, సాగ్రమ్ = కొద్ది ఆధిక్యము గల (నిండా), వర్షసాహస్రమ్ = వేయి సంవత్సరములు, అశయిష్ట = పడియుండెను, తమ్ = దానిని, ఈశ్వరః = ఈశ్వరుడు, అన్వవాత్సీత్ = ప్రవేశించెను.

ఆ బ్రహ్మాండము ప్రళయసముద్రజలములలో సుమారు (నిండా) వేయి సంవత్సరములు నిశ్చేతనముగా పడియుండెను. అపుడు దానియందు భగవానుడు ప్రవేశించెను.

తస్య నాభేరభూత్పద్మం సహస్రార్కోరుదీధితి ।
సర్వజీవనికాయౌకో యత్ర స్వయమభూత్స్వరాట్ ॥ **16**

తస్య = ఆ భగవానుని, నాభేః = నాభినుండి, సహస్ర-అర్క-ఉరుదీధితి = వేయి సూర్యుల అధికమగు కాంతి గల, సర్వజీవనికాయ-ఓకః = సకలప్రాణిసమూహములకు నివాసస్థానమగు, పద్మమ్ = పద్మము, అభూత్ = పుట్టెను, యత్ర = దేనియందైతే, స్వయమ్ = సాక్షాత్తుగా, స్వరాట్ = బ్రహ్మగారు, అభూత్ = పుట్టెనో.

ఆ భగవానుని నాభినుండి వేయి సూర్యులతో సమానమైన గొప్ప కాంతి గల పద్మము పుట్టెను. సకలప్రాణివర్గములకు నివాసస్థానమదియే. దానియందు సాక్షాత్తుగా బ్రహ్మగారు పుట్టిరి.

సోఽనువిష్టో భగవతా యశ్శేతే సలిలాశయే ।
లోకసంస్థాం యథాపూర్వం నిర్మమే సంస్థయా స్వయా ॥17

భగవతా = నారాయణునిచే, అనువిష్టః = అధిష్ఠించబడిన (ప్రవేశించబడిన), సః = ఆ బ్రహ్మ, స్వయా = తన, సంస్థయా = నామరూపాత్మకమగు వ్యవస్థచే, యథాపూర్వమ్ = పూర్వకల్పమునందు వలెనే, లోకసంస్థామ్ = లోకముల రచనను, నిర్మమే = నిర్మించెను, యః = ఏ నారాయణుడు, సలిల-ఆశయే = ప్రళయసముద్రమునందు, శేతే = నిద్రించునో.

ప్రళయజలములలో శయనించే నారాయణుడు ప్రవేశించి ప్రేరేపించగా, బ్రహ్మగారు పూర్వకల్పములో తనచేతనే నిర్ధారించబడిన నామరూపాత్మకమగు వ్యవస్థకు అనురూపముగా లోకములను నిర్మించెను.

ససర్జచ్ఛాయయావిద్యాం పంచపర్వాణమగ్రతః ।
తామిస్రమంధతామిస్రం తమో మోహో మహాతమః ॥ 18

అగ్రతః = ముందుగా, ఛాయయా = నీడ (అజ్ఞానము) చే, తామిస్రమ్ = తామిస్రము, అంధతామిస్రమ్ = అంధతామిస్రము, తమః = తమస్సు, మోహః = మోహము, మహాతమః = మహాతమస్సు అనే, పంచపర్వాణమ్ = అయిదు విభాగములు గల, అవిద్యామ్ = అవిద్యను, ససర్జ = సృష్టించెను.

ఆయన ముందుగా నీడ (అజ్ఞానము) నుండి తామిస్రము, అంధతామిస్రము, తమస్సు, మోహము, మహాతమస్సు అనే అయిదు విభాగములు గల అవిద్యను సృష్టించెను.

విససర్జాత్మనః కాయం నాభినందంస్తమోమయమ్ ।
జగృహుర్యక్షరక్షాంసి రాత్రిం క్షుత్తృట్సముద్భవామ్ ॥ 19

తమోమయమ్ = తమస్సు (అజ్ఞానము) ప్రధానముగా గల, ఆత్మనః = తన, కాయమ్ = దేహమును, న అభినందన్ = సంతోషము లేనివాడై, విససర్జ = విడిచిపెట్టెను, క్షుత్-తృట్-సముద్భవామ్ = ఆకలి దప్పికల

పుట్టుక గల, రాత్రిమ్ = రాత్రిరూపమగు ఆ దేహమును, యక్షరక్షాంసి = యక్షులు రాక్షసులు, జగృహుః = తీసుకున్నవి.

తమస్సు (అజ్ఞానము) ప్రధానముగా గల ఆ దేహము ఆయనకు నచ్చక, దానిని విడిచిపెట్టెను. అదియే రాత్రి ఆయెను. ఆకలి దప్పికలు దానినుండియే పుట్టెను. దానిని యక్షులు, రాక్షసులు స్వీకరించిరి.

క్షుత్తృడ్భ్యాముపసృష్టాస్తే తం జగ్ధుమభిదుద్రువుః ।
మా రక్షతైనం జక్షధ్వమిత్యూచుః క్షుత్తృడర్దితాః ॥ 20

క్షుత్-తృడ్భ్యామ్ = ఆకలి దప్పికలచే, ఉపసృష్టాః = కష్టమునకు గురి చేయబడిన, తే = ఆ యక్షరాక్షసులు, తమ్ = ఆ బ్రహ్మగారిని, జగ్ధుమ్ = తినుటకు, అభిదుద్రువుః = ఆయన వైపునకు పరుగెత్తిరి, క్షుత్-తృట్-అర్దితాః = ఆకలిదప్పికలచే పీడింపబడిన ఆ యక్షరాక్షసులు, ఏనమ్ = ఈయనను, మా రక్షత = రక్షించకుడు, జక్షధ్వమ్ = తినుడు, ఇతి = అని, ఊచుః = పలికిరి.

ఆ యక్షరాక్షసులు ఆకలి దప్పికల బాధకు తాళలేక, ఆ బ్రహ్మగారిని తినుటకై ఆయన వైపునకు పరుగు తీసిరి. ఈయనను రక్షించనక్కర లేదు; ఈయనను తినివేయుడు, అని వారు పలికిరి. కావుననే, వారు రాక్షసులు (రక్షించని వారు), యక్షులు (తినివేయువారు) అయిరి.

దేవస్తానాహ సంవిగ్నో మా మాం జక్షత రక్షత ।
అహో మే యక్షరక్షాంసి ప్రజా యూయం బభూవిథ ॥ 21

దేవః = బ్రహ్మ, సంవిగ్నః = భయపడినవాడై, తాన్ = వారిని ఉద్దేశించి, ఆహ = పలికెను, అహో యక్షరక్షాంసి = అరే యక్షరాక్షసులారా!, మామ్ = నన్ను, మా జక్షత = తినకుడు, రక్షత = రక్షించుడు, యూయమ్ = మీరు, మే = నా, ప్రజాః = సంతానము, బభూవిథ = అగుచున్నారు.

బ్రహ్మగారు భయపడి వారితో నిట్లనెను: అరే యక్షరాక్షసులారా! మీరు నా సంతానము. నన్ను తినివేయకుడు; నన్ను రక్షించుడు.

దేవతాః ప్రభయా యా యా దీవ్యన్ ప్రముఖతోఽసృజత్ ।

తే అహోర్షుర్దేవయంతో విసృష్టాం తాం ప్రభామహః ।। 22

ప్రభయా = తన సాత్త్వికప్రకాశముచే, దీవ్యన్ = విరాజిల్లుచున్న బ్రహ్మగారు, యాః యాః = ఏయే, దేవతాః = దేవతలను, ప్రముఖతః = ప్రధానముగా, అసృజత్ = సృష్టించెనో, తే = వారు, దేవయంతః = క్రీడించుచున్నవారై, తామ్ = ఆ, విసృష్టామ్ = బ్రహ్మచే విడిచిపెట్టబడిన, అహః = పగలు రూపముగల, ప్రభామ్ = ప్రకాశమును, అహోర్షుః = స్వీకరించిరి.

బ్రహ్మగారు తన సాత్త్వికప్రకాశముచే విరాజిల్లుతూ దేవతలను సృష్టించెను. బ్రహ్మగారిచే విడిచిపెట్టబడిన ఆ ప్రకాశము పగలు ఆయెను. ఆ దేవతలు క్రీడిస్తూ ఆ పగలు రూపములోని ప్రకాశమును స్వీకరించిరి.

దేవోఽదేవాన్ జఘనతస్సృజతి స్మాతిలోలుపాన్ ।
త ఏనం లోలుపతయా మైథునాయాభిపేదిరే ।। 23

దేవః = బ్రహ్మగారు, జఘనతః = నడుము భాగమునుండి, అతిలోలుపాన్ = మిక్కిలి భోగలాలసులగు, అదేవాన్ = అసురులను, సృజతి స్మ = సృష్టించెను, తే = వారు, లోలుపతయా = భోగలంపటత్వముచే, ఏనమ్ = ఈ బ్రహ్మను, మైథునాయ = భోగము కొరకు, అభిపేదిరే = సమీపించిరి.

బ్రహ్మగారు నడుము భాగమునుండి మిక్కిలి భోగలాలసులగు అసురులను సృష్టించెను. వారు భోగలంపటులగుటచే భోగము కొరకై బ్రహ్మగారి దగ్గరకు వెళ్లిరి.

తతో హసన్ స భగవానసురైర్నిరపత్రపైః ।
అన్వీయమానస్తరసా క్రుద్ధో భీతః పరాపతత్ ।। 24

తతః = తరువాత, సః = ఆ, భగవాన్ = బ్రహ్మ భగవానుడు, హసన్ = నవ్వుచున్నవాడై, నిరపత్రపైః = సిగ్గు లేని, అసురైః = అసురులచే, తరసా = వేగముగా, అన్వీయమానః = తరుమబడుచున్నవాడై, క్రుద్ధః = కోపించినవాడై, భీతః = భయపడినవాడై, పరాపతత్ = పారిపోయెను.

తరువాత ఆ బ్రహ్మ భగవానుడు ముందుగా వారిని చూచి నవ్వు కొనెను. కాని, వారు సిగ్గు లేకుండగా ఆయనను తరుముకొచ్చిరి. అపుడా యన కోపించి, భయపడి పారిపోయెను.

స ఉపవ్రజ్య వరదం ప్రపన్నార్తిహరం హరిమ్ ।
అనుగ్రహాయ భక్తానామనురూపాత్మదర్శనమ్ ॥ 25

సః = ఆ బ్రహ్మ, వరదమ్ = వరములనిచ్చునట్టియు, ప్రపన్న-ఆర్తి హరమ్ = శరణు జొచ్చినవారి ఇడుముల బాపే, భక్తానామ్ = భక్తుల, అను గ్రహాయ = అనుగ్రహము కొరకై, అనురూప-ఆత్మదర్శనమ్ = అనురూప ముగా తనను ప్రకటించే, హరిమ్ =హరిని, ఉపవ్రజ్య = సమీపించి.

శ్రీహరి శరణాగతులకు వరములనిచ్చి, ఇడుములను బాపే దైవ ము. ఆయన భక్తులననుగ్రహించుట కొరకై వారి భావనకు తగ్గ రూపములో ప్రకటమగును. ఆ బ్రహ్మగారు అట్టి శ్రీహరి వద్దకు వెళ్లి ప్రార్థించెను.

పాహి మాం పరమాత్మంస్తే ప్రేషణేనాసృజం ప్రజాః ।
తా ఇమా యభితుం పాపా ఉపాక్రామంతి మాం ప్రభో ॥ 26

పరమాత్మన్ = ఓ పరమాత్మా!, మామ్ = నన్ను, పాహి = రక్షించు ము, తే నీ, ప్రేషణేన = ప్రేరణచే, ప్రజాః = ప్రాణులను, అసృజమ్ = సృష్టిం చితిని, ప్రభో = ఓ ప్రభూ!, తాః = ఆ, పాపాః = పాపులగు, ఇమాః = వీరు, మామ్ = నన్ను, యభితుమ్ = భోగించుటకు, ఉపాక్రామంతి = తరుముకొ చ్చుచున్నారు.

ఓ పరమాత్మా! నీ ప్రేరణచే నేను ప్రాణులను సృష్టించితిని. ప్రభూ! కాని నాచేతనే సృష్టించబడిన పాపులగు వీరు నన్ను భోగించుటకు తరుముకొచ్చుచున్నారు. నన్ను కాపాడుము.

త్వమేకః కిల లోకానాం క్లిష్టానాం క్లేశనాశనః ।
త్వమేకః క్లేశదస్తేషామనాసన్నపదాం తవ ॥ 27

క్లిష్టానామ్ = కష్టములలోనున్న, లోకానామ్ = ప్రాణుల, క్లేశనాశనః = క్లేశములను పోగొట్టువాడవు, త్వమ్ = నీవు, ఏకః కిల = ఒక్కడివే గదా!, తవ = నీ, అనాసన్నపదామ్ = ఆశ్రయించబడని పాదములు గల, తేషామ్ = వారికి, క్లేశదః = కష్టములను ఇచ్చువాడవు, త్వమ్ = నీవు, ఏకః = ఒక్కడివే.

కష్టములలోనున్న వారి కష్టములను పోగొట్టువాడవు నీవు ఒక్కడి వే. నీ పాధములను ఆశ్రయించని ప్రాణులకు వారి కర్మలకనురూపముగా దుఃఖమును కలిగించువాడవు నీవు ఒక్కడివే.

సోఽవధార్యాస్య కార్పణ్యం వివిక్తాధ్యాత్మదర్శనః ।
విముంచాత్మతనుం ఘోరామిత్యుక్తో విముమోచ హ ॥ 28

వివిక్త-అధ్యాత్మదర్శనః = సుస్పష్టమైన ఇతరుల హృదయముల జ్ఞానము గల, సః = ఆ శ్రీహరి, అస్య = ఈ బ్రహ్మగారి, కార్పణ్యమ్ = దైన్యమును, అవధార్య = నిశ్చయముగా చూచి, ఘోరామ్ = మలినమైన, ఆత్మతనుమ్ = నీ దేహమును, విముంచ = విడిచిపెట్టుము, ఇతి = అని, ఉక్తః = చెప్పబడినవాడై, విముమోచ హ = విడిచిపెట్టెను.

శ్రీహరికి ఇతరుల మనస్సు కరతలామలకము. ఆయనకు బ్రహ్మ గారి దైన్యము స్పష్టముగా తెలిసెను. కామముచే కలుషితమైన ఈ దేహ మును విడువుము అని ఆయన చెప్పగా, బ్రహ్మ అటులనే చేసెను.

తాం క్వణచ్చరణాంభోజాం మదవిహ్వలలోచనామ్ ।
కాంచీకలాపవిలసద్దుకూలచ్ఛన్నరోధసమ్ ॥ 29
అన్యోన్యశ్లేషయోత్తుంగనిరంతరపయోధరామ్ ।
సునాసాం సుద్విజాం స్నిగ్ధహాసలీలావలోకనామ్ ॥ 30
గూహంతీం వ్రీడయాఽఽత్మానం నీలాలకవరూథినీమ్ ।
ఉపలభ్యాసురా ధర్మ సర్వే సమ్ముముహుః స్త్రియమ్ ॥ 31

ధర్మ విదురా!, క్వణత్-చరణ-అంభోజామ్ = కాలి అందెలతో ధ్వనించుచున్న పద్మములవంటి పాదములు గలది, మదవిహ్వలలోచ నామ్ = మత్తుతో చంచలముగానున్న కన్నులు గలది, కాంచీకలాపవిలసత్-

దుకూలచ్ఛన్నరోధసమ్ = మొలనూలు సరములతో ప్రకాశించే చీరచే కప్పబడియున్న నడుము గలది, అన్యోన్యశ్లేషయా = ఒకదానితో మరియొకటి ఒత్తుకొనుటచే, ఉత్తుంగనిరంతరపయోధరామ్ = ఎత్తైన అంతరము లేని స్తనములు గలది, సునాసామ్ = చక్కని ముక్కు గలది, సుద్విజామ్ = చక్కని పలు వరుసలు గలది, స్నిగ్ధహాసలీలా-అవలోకనామ్ = ప్రేమతో నిండిన చిరునవ్వుతో కూడిన విలాసయుక్తమగు చూపులు గలది, వ్రీడయా = సిగ్గుచే, ఆత్మానమ్ = తనను, గూహంతీమ్ = కప్పికొనుచున్నది, నీల-అలకవరూథినీమ్ = నల్లని దట్టమైన కురులు గలది అగు, తామ్ = ఆ, స్త్రియమ్ = స్త్రీని, ఉపలభ్య = చూచి, సర్వే = అందరు, అసురాః = అసురులు, సంముముహుః = పూర్తిగా మోహమును పొందిరి.

ఓ విదురా! బ్రహ్మగారు విడిచిన దేహము ఒక స్త్రీమూర్తి ఆయెను. మత్తుతో నిండిన చంచలమగు కన్నులు గల ఆమె పద్మములవంటి పాదములతో నడుచుచుండగా, కాలి అందెలు గణగణలాడుచుండెను. ఆమె నడుము చుట్టూ చీరను కట్టి దానిని ప్రకాశించే మొలనూలు సరములతో అలంకరించెను. ఒకదానితో మరియొకటి ఒత్తుకొని ఎత్తైన అంతరము లేని స్తనములు గల ఆమె ప్రేమతో నిండిన చిరునవ్వుతో విలాసగా చూచుచుండెను. చక్కని ముక్కు మంచి పలు వరుసలు గల ఆమె సిగ్గు వలన చీర చెరగుతో తనను తాను కప్పికొనుచుండెను. దట్టని నల్లని కురులు గల ఆమెను చూచి అసురులందరు పూర్తిగా మోహమును పొందిరి.

అహో రూపమహో ధైర్యమహో అస్యా నవం వయః ।
మధ్యే కామయమానానామకామేవ విసర్పతి ॥ 32

అహో రూపమ్ = ఆహా! ఏమి రూపము!, అహో ధైర్యమ్ = ఆశ్చర్యమును కలిగించే ధైర్యము!, అస్యాః = ఈమెయొక్క, నవమ్ = నూతనమైన, వయః = వయస్సు, అహో = ఆశ్చర్యమును కలిగించుచున్నది!, కామయమానానామ్ = కామించే వారి మధ్యలో, అకామా ఇవ = కామన లేనిదాని వలె, విసర్పతి = సంచరించుచున్నది.

ఏమి ఈమె రూపము! అహో! ఏమి ధైర్యము! అహో! ఈమెది అద్భుతమైన యౌవనము! కామించే మన మధ్యలో ఈమె కామన లేని దానివలె సంచరించుచున్నది.

వితర్కయంతో బహుధా తాం సంధ్యాం ప్రమదాకృతిమ్ ।
అభిసంభావ్య విశ్రంభాత్పర్యపృచ్ఛన్ కుమేధసః ॥ 33

ప్రమదా-ఆకృతిమ్ = స్త్రీరూపమును కలిగియున్న, తామ్ = ఆ, సంధ్యామ్ = సంధ్యాకాలమును గురించి, బహుధా = పలు విధములుగా, వితర్కయంతః = ఊహలను చేయుచున్నవారై, కుమేధసః = దుష్టబుద్ధి గల ఆ అసురులు, అభిసంభావ్య = మర్యాదను చేసి, విశ్రంభాత్ = చనువుతో, పర్యపృచ్ఛన్ = ప్రశ్నించిరి.

సంధ్యాకాలమే ఆ విధముగా స్త్రీరూపమును దాల్చియుండెను. దుష్టబుద్ధి గల ఆ అసురులు ఆమెను గురించి పలు రకముల ఊహలను చేసిరి. వారామెను చక్కగా మర్యాద చేసి, చనువుతో ఇట్లు ప్రశ్నించిరి.

కాసి కస్యాసి రంభోరు కో వార్థస్తేఽత్ర భామిని ।
రూపద్రవిణపణ్యేన దుర్భగాన్నో విబాధసే ॥ 34

రంభోరు = ఓ సుందరీ!, కా అసి = నీవు ఎవరివి?, కస్య అసి = ఎవరి దానవు?, అత్ర = ఇచట, తే = నీకు, అర్థః = ప్రయోజనము, కః వా = ఏమి గలదు? భామిని = ఓ భామామణీ!, రూపద్రవిణపణ్యేన = రూపము అనే అమూల్యమగు వస్తువుతో, దుర్భగాన్ = అభాగ్యులమగు, నః = మమ్ములను, విబాధసే = అధికముగా పీడించుచున్నావు.

ఓ సుందరీ! నీవు ఎవరివి? ఎవరి దానవు? ఇక్కడ నీకు పని యేమి? ఓ భామామణీ! నీవు నీ రూపము అనే అమూల్యమగు వస్తువుతో అభాగ్యులమగు మమ్ములను విశేషముగా బాధించుచున్నావు.

యా వా కాచిత్త్వమబలే దిష్ట్యా సందర్శనం తవ ।
ఉత్సునోషీక్షమాణానాం కందుకక్రీడయా మనః ॥ 35

అబలే = ఓ అబలా!, త్వమ్ = నీవు, యా వా కాచిత్ = ఎవరివి అయిననూ, దిష్ట్యా = భాగ్యముచే, తవ = నీ, సందర్శనమ్ = దర్శనము కలిగినది, ఈక్షమాణానామ్ = చూచువారల, మనః = మనస్సును, కందుక క్రీడయా = బంతి ఆటతో, ఉత్సునోషి = కలిచి వేయుచున్నావు.

ఓ అబలా! నీవు ఎవరివి అయిననూ అగుగాక! మాకు నీ దర్శనము భాగ్యముచే కలిగినది. నీవు బంతిని ఆడుతూ నిన్ను చూస్తూ ఉన్న మా మనస్సులను కలిచి వేయుచున్నావు.

నైకత్ర తే జయతి శాలిని పాదపద్మం
ఘ్నంత్యా ముహుః కరతలేన పతత్పతంగమ్ ।
మధ్యం విషీదతి బృహత్స్తనభారభీతం
శాంతేవ దృష్టిరమలా సుశిఖాసమూహః ॥ 36

శాలిని = ఓ సుందరీ!, పతత్-పతంగమ్ = పైకి ఎగురుచున్న బంతిని, ముహుః = మాటిమాటికీ, కరతలేన = అరచేతితో, ఘ్నంత్యా = కొట్టుచున్న, తే = నీ, పాదపద్మమ్ = పద్మమువంటి పాదము, ఏకత్ర = ఒక చోట, న జయతి = ఉండుట లేదు, బృహత్-స్తనభారభీతమ్ = పెద్ద స్తనముల బరువు వలన భయపడిన, మధ్యమ్ = నడుము, విషీదతి = కష్టపడుచున్నది, అమలా = స్వచ్ఛమగు, దృష్టిః = చూపు, శాంతా ఇవ = సొలసినట్లుగానున్నది, సుశిఖాసమూహః = అందమైన కేశపాశము.

ఓ సుందరీ! పైకి ఎగురుచున్న బంతిని నీవు అరచేతితో కొట్టుచుండగా, నీ పద్మములవంటి పాదములు ఒకచోట నిలబడుట లేదు. విశాలమగు స్తనముల భారము వలన నీ కృశించియున్న నడుము భయపడుచున్నదా యన్నట్లు ఉన్నది. స్వచ్ఛమగు నీ దృష్టి సొలసినట్లు కానవచ్చుచున్నది. నీ కేశపాశము అందముగా నున్నది.

ఇతి సాయంతనీం సంధ్యామసురాః ప్రమదాయతీమ్ ।
ప్రలోభయంతీం జగృహుర్మత్వా మూఢధియః స్త్రియమ్ ॥ 37

ఇతి = ఈ విధముగా, ప్రమదాయతీమ్ = యువతి వలె ఆచరించు చున్నట్టియు, ప్రలోభయంతీమ్ = ప్రలోభపెట్టుచున్న, సాయంతనీమ్ = సాయంకాలపు, సంధ్యామ్ = సంధ్యను, మూఢధియః = మోహమును పొందిన బుద్ధి గల, అసురాః = అసురులు, స్త్రియమ్ = స్త్రీగా, మత్వా = తలపోసి, జగృహుః = పట్టుకొనిరి.

సాయంకాల సంధ్య ఆ విధమగు రూపమును దాల్చి, వారిని ప్రలోభపెట్టెను. ఆమె వాస్తవముగా యువతియని భావించి మోహితులైన అసురులు ఆమెను పట్టుకొనిరి.

ప్రహస్య భావగంభీరం జిఘ్రంత్యాత్మానమాత్మనా ।
కాంత్యా ససర్జ భగవాన్ గంధర్వాప్సరసాం గణాన్ ।। 38

భగవాన్ = బ్రహ్మ భగవానుడు, భావగంభీరమ్ = గంభీరమగు భావము కలుగునట్లుగా, ప్రహస్య = నవ్వి, ఆత్మనా = తనచే, ఆత్మానమ్ = తనను, జిఘ్రంత్యా = ఆస్వాదించుచున్న, కాంత్యా = సౌందర్యముతో, గంధర్వ-అప్సరసామ్ = గంధర్వుల మరియు అప్సరసల, గణాన్ = గణములను, ససర్జ = సృష్టించెను.

బ్రహ్మ భగవానుడు గంభీరమగు భావము కలుగునట్లుగా నవ్వి, సౌందర్యముతో ప్రకాశించే తన మూర్తితో గంధర్వులు మరియు అప్సరసల గణములను సృష్టించెను. ఆయన మూర్తి తన సౌందర్యమును తానే ఆస్వాదించుచున్నదా యన్నట్లుండెను.

విససర్జ తనుం తాం వై జ్యోత్స్నాం కాంతిమతీం ప్రియామ్ ।
త ఏవ చాదదుః ప్రీత్యా విశ్వావసుపురోగమాః ।। 39

కాంతిమతీమ్ = సౌందర్యముతో కూడియున్న, తనుం వై = శరీరమును, విససర్జ = విడిచిపెట్టెను, జ్యోత్స్నామ్ = వెన్నెల రూపములోనున్న, తామ్ = ఆ శరీరమును; విశ్వావసుపురోగమాః = విశ్వావసువు మొదలగు, తే ఏవ = ఆ గంధర్వులే, ప్రీత్యా = ప్రీతితో, ఆదదుః చ = స్వీకరించిరి.

బ్రహ్మగారు సౌందర్యముతో కూడిన ఆ శరీరమును కూడ విడిచి పెట్టెను. అదియే వెన్నెల ఆయెను. దానిని విశ్వావసువు మొదలగు గంధర్వులు ప్రీతితో స్వీకరించిరి.

సృష్ట్వా భూతపిశాచాంశ్చ భగవానాత్మతంద్రిణా ।
దిగ్వాససో ముక్తకేశాన్ వీక్ష్య చామీలయద్దృశౌ ।। 40

భగవాన్ = బ్రహ్మ భగవానుడు, ఆత్మతంద్రిణా = తన సోమరితనముచే, భూతపిశాచాన్ = భూతములను పిశాచములను, సృష్ట్వా = సృష్టించి, దిగ్వాససః = దిగంబరులు, ముక్తకేశాన్ = విరబోసుకున్న జుట్టు గలవారు అగు వాటిని, వీక్ష్య = చూచి, దృశౌ = కన్నులను, అమీలయత్ = మూసుకొనెను.

బ్రహ్మ భగవానుడు తన మందత్వమునుండి భూతపిశాచములను సృష్టించెను. అవి దిగంబరముగా జుట్టు విరబోసుకొనియుండగా చూచి, ఆయన కళ్లను మూసుకొనెను.

జగృహుస్తద్విసృష్టాం తాం జృంభణాఖ్యాం తనుం ప్రభోః ।
నిద్రామింద్రియవిక్లేదో యథా భూతేషు దృశ్యతే ।
యేనోచ్ఛిష్టాన్ ధర్షయంతి తమున్మాదం ప్రచక్షతే ।। 41

ప్రభోః = జగత్ప్రభువగు బ్రహ్మగారి, తత్-విసృష్టామ్ = ఆయనచే విడిచిపెట్టబడిన, జృంభణ-అఖ్యామ్ = ఆవులింత అనే, తామ్ = ఆ, తనుమ్ = శరీరమును, జగృహుః = స్వీకరించిరి, యథా = ఏ విధముగానైతే, భూతేషు = ప్రాణులయందు, ఇంద్రియవిక్లేదః = ఇంద్రియములు వివశమగుట, దృశ్యతే = కానబడునో దానిని, నిద్రామ్ = నిద్రయని, యేన = దేనిచే, ఉచ్ఛిష్టాన్ = అపవిత్రులను, ధర్షయంతి = మోహపెట్టుచున్నవో, తమ్ = దానిని, ఉన్మాదమ్ = ఉన్మాదమనియు, ప్రచక్షతే = చెప్పుచున్నారు.

జగత్ప్రభువగు బ్రహ్మగారు ఆవులింతను విడిచిపెట్టెను. ఆ ఆవులింత అనే శరీరమును భూతములు పిశాచములు గ్రహించినవి. అదియే ప్రాణులలో ఇంద్రియములు వివశమయ్యే నిద్రారూపముగా ప్రకటమగుచు

న్నది. జనులు అపవిత్రులై యున్నప్పుడు భూతాదులు వారిని ఆవేశించి మోహితులను చేయును. దానికి ఉన్మాదమని పేరు. అది కూడ బ్రహ్మ గారు విడిచిపెట్టిన మందత్వరూపమగు శరీరముయొక్క ధర్మమే.

ఊర్జస్వంతం మన్యమాన ఆత్మానం భగవానజః ।
సాధ్యాన్ గణాన్ పితృగణాన్ పరోక్షేణాసృజత్ప్రభుః ॥ 42

భగవాన్ = పూజ్యుడగు, అజః = బ్రహ్మగారు, ఆత్మానమ్ = తనను, ఊర్జస్వంతమ్ = బలవంతునిగా, మన్యమానః = తలపోయువాడై, సాధ్యాన్ గణాన్ = సాధ్యగణములను, పితృగణాన్ = పితృదేవతల గణములను, పరోక్షేణ = కానరాని తన రూపముచే, అసృజత్ = సృష్టించెను.

పూజ్యుడగు బ్రహ్మ తాను బలవంతుడనని భావన చేసి తన అదృశ్యరూపము ద్వారా సాధ్యగణములను, పితృగణములను సృష్టించెను.

త ఆత్మసర్గం తం కాయం పితరః ప్రతిపేదిరే ।
సాధ్యేభ్యశ్చ పితృభ్యశ్చ కవయో యద్వితన్వతే ॥ 43

తే = ఆ, పితరః = పితృదేవతలు, ఆత్మసర్గమ్ = తమను సృష్టించిన, తమ్ = ఆ, కాయమ్ = శరీరమును, ప్రతిపేదిరే = పొందిరి, యత్ = దేనిని ఉద్దేశించి, కవయః = విద్వాంసులు, సాధ్యేభ్యః = సాధ్యుల కొరకు, చ = మరియు, పితృభ్యః చ = పితృదేవతల కొరకు కూడ, వితన్వతే = శ్రాద్ధాదికమును సమర్పించుచున్నారో.

ఆ పితృదేవతలు తమకు జన్మనిచ్చిన ఆ అదృశ్యరూపమును స్వీకరించిరి. విద్వాంసులు దానిని నిమిత్తముగా చేసుకొనియే, సాధ్యులకు పితృదేవతలకు శ్రాద్ధాదికర్మలలో హవ్యకవ్యములను సమర్పించెదరు.

సిద్ధాన్ విద్యాధరాంశ్చైవ తిరోధానేన సోఽసృజత్ ।
తేభ్యోఽదదాత్తమాత్మానమంతర్ధానాఖ్యమద్భుతమ్ ॥ 44

సః = ఆ బ్రహ్మగారు, తిరోధానేన = అంతర్ధానశక్తిచే, సిద్ధాన్ = సిద్ధులను, విద్యాధరాన్ చ ఏవ = విద్యాధరులను కూడ, అసృజత్ =

సృష్టించెను, అద్భుతమ్ = అద్భుతమగు, అంతర్ధాన-ఆఖ్యమ్ = అంతర్ధాన మనబడే, తమ్ = ఆ, ఆత్మానమ్ = శరీరమును, తేభ్యః = వారి కొరకు, అద దాత్ = ఇచ్చెను.

ఆ బ్రహ్మగారు తన అంతర్ధానశక్తిచే సిద్ధులను, విద్యాధరులను సృష్టించి, అద్భుతమగు ఆ అంతర్ధానశక్తిని వారికి ఇచ్చెను.

స కిన్నరాన్ కింపురుషాన్ ప్రత్యాత్మ్యేనాసృజత్ప్రభుః ।
మానయన్నాత్మనాఽఽత్మానమాత్మాభాసం విలోకయన్ ॥ 45

సః = ఆ, ప్రభుః = బ్రహ్మగారు, ఆత్మాభాసమ్ = తన ప్రతిబింబము ను, విలోకయన్ = చూచుచున్నవాడై, ఆత్మనా = తనచే, ఆత్మానమ్ = తన ను, మానయన్ = కొనియాడుకొనుచున్నవాడై, ప్రత్యాత్మ్యేన = ఆ ప్రతిబిం బముచే, కిన్నరాన్ = కిన్నరులను, కింపురుషాన్ = కింపురుషులను, అసృ జత్ = సృష్టించెను.

జగత్ప్రభువగు ఆ బ్రహ్మ తన ప్రతిబింబమును చూచి, దానిని తానే మెచ్చుకొని, దానిచే కిన్నరులను, కింపురుషులను సృష్టించెను.

తే తు తజ్జగృహూ రూపం త్యక్తం యత్పరమేష్ఠినా ।
మిథునీభూయ గాయంతస్తమేవోషసి కర్మభిః ॥ 46

పరమేష్ఠినా = బ్రహ్మగారిచే, త్యక్తమ్ = విడిచిపెట్టబడిన, యత్ = ఏ, రూపమ్ = రూపము గలదో, తత్ తు = దానినైతే, తే = వారు, జగృహుః = స్వీకరించిరి, ఉషసి = ప్రాతఃకాలమునందు, మిథునీభూయ = స్త్రీపురు షులు కలిసి, కర్మభిః = కర్మలచే, తం ఏవ = ఆయనను ఉద్దేశించియే, గాయంతః = గానము చేయుచున్నవారు.

బ్రహ్మగారు విడిచిపెట్టిన ఆ ప్రతిబింబరూపమును కిన్నర కింపురు షులు స్వీకరించిరి. కావుననే, వారు ప్రాతఃకాలమునందు స్త్రీపురుషుల జంటలుగా ఏర్పడి, బ్రహ్మగారి చేష్టలను గానము చేయుచుందురు.

దేహేన వై భోగవతా శయానో బహుచింతయా ।

సర్గేఽనుపచితే క్రోధాదుత్ససర్జ హ తద్వపుః ॥ 47

సర్గే = సృష్టి, అనుపచితే = వృద్ధిని పొందనిదై యుండగా, బహు చింతయా = పలువిధముల చింతచే, భోగవతా = కాళ్లను చాచిన, దేహేన = దేహముచే, శయానః = పరున్నవాడై, క్రోధాత్ = కోపము వలన, తత్ = ఆ, వపుః = దేహమును, ఉత్ససర్జ హ = విడిచిపెట్టెను.

సృష్టి విస్తారమును చెందని కారణముగా పలువిధములుగా చింతిస్తూ బ్రహ్మగారు కాళ్లను చాచుకొని పరుండెను. ఇంతలో, ఆయనకు కోపము వచ్చి ఆ దేహమును విడిచిపెట్టెనట.

యేఽహీయంతాముతః కేశా అహయస్తేఽంగ జజ్ఞిరే ।
సర్పాః ప్రసర్పతః క్రూరా నాగా భోగోరుకంధరా ॥ 48

అంగ = ఓ విదురా!, అముతః = ఈ దేహమునుండి, యే = ఏ, కేశాః = కేశములు, అహీయంత = జారినవో, తే = అవి, అహయః = పాములుగా, జజ్ఞిరే= పుట్టినవి, ప్రసర్పతః = కాళ్లను చేతులను చాపుతూ కదులుచున్న దేహమునుండి, క్రూరాః = క్రూరస్వభావముగల, సర్పాః = సర్పములు, భోగ-ఉరుకంధరాః = పడగచే విస్తరించిన మెడలు గల, నాగాః = నాగములు, జజ్ఞిరే = పుట్టినవి.

ఓ విదురా! ఆ దేహమునుండి కేశములు జారిపడి పాములు పుట్టెను. కాళ్లను చేతులను చాపుతూ కదులుచున్న దేహమునుండి క్రూరస్వభావము గల విషసర్పములు, పడగచే విస్తరించిన మెడలు గల త్రాచుపాములు పుట్టెను.

స ఆత్మానం మన్యమానః కృతకృత్యమివాత్మభూః
తదా మనూన్ ససర్జాంతే మనసా లోకభావనాన్ ॥ 49

ఆత్మభూః = స్వయంభువుడగు, సః = ఆ బ్రహ్మగారు, ఆత్మానమ్ = తనను, కృతకృత్యం ఇవ = కృతార్థుని వలె, మన్యమానః = తలపోయుచున్నవాడై, తదా = అప్పుడు, అంతే = అంతమునందు, మనసా = మనస్సు

చే, లోకభావనాన్ = ప్రాణులను వర్ధిల్లజేసే (లోకములను పాలించే), మనూన్ = మనువులను, ససర్జ = సృష్టించెను.

స్వయంభువుడగు బ్రహ్మగారు తాను కృతార్థుడనైనానని తలపోసి, అప్పుడు ఆఖరున మనస్సుతో ప్రాణులను వర్ధిల్లజేసి లోకములను పాలించే మనువులను సృష్టించెను.

తేభ్యస్సోఽత్యసృజత్స్వీయం పురం పురుషమాత్మవాన్ ।
తాన్ దృష్ట్వా యే పురా సృష్టాః ప్రశశంసుః ప్రజాపతిమ్ ॥50

ఆత్మవాన్ = బుద్ధిశక్తిప్రధానుడగు, సః = ఆ బ్రహ్మ, తేభ్యః = ఆ మనువుల కొరకు, స్వీయమ్ = తన, పురుషమ్ = పురుషాకారపు, పురమ్ = దేహమును, అత్యసృజత్ = విడిచిపెట్టెను, పురా = మనువులకు ముందు, సృష్టాః = సృష్టించబడినవారు, యే = ఎవరు గలరో వారు, తాన్ = ఆ మనువులను , దృష్ట్వా = చూచి, ప్రజాపతిమ్ = బ్రహ్మగారిని, ప్రశశంసుః = కొనియాడిరి.

బుద్ధిశక్తిప్రధానుడగు బ్రహ్మ పురుషాకారములోనున్న తన దేహమును మనువులకు విడిచిపెట్టెను. మనువులకంటె ముందే సృష్టించబడిన దేవతలు మొదలగు వారు మనువులను చూచి బ్రహ్మగారిని కొనియాడిరి.

అహో ఏతజ్జగత్స్రష్టస్సుకృతం బత తే కృతమ్ ।
ప్రతిష్ఠితాః క్రియా యస్మిన్ సాకమన్నమదామహే ॥ 51

జగత్-స్రష్టః = జగత్తును సృష్టించిన ఓ బ్రహ్మ!, తే = నీ, ఏతత్ = ఈ, కృతమ్ = చేయబడిన సృష్టి, సుకృతమ్ = బాగుగా చేయబడినది, అహో బత = చాల బాగున్నది!, యస్మిన్ = దేనియందు, క్రియాః = యజ్ఞాది కర్మలు, ప్రతిష్ఠితాః = ఆశ్రయించి ఉన్నవో, సాకమ్ = దీని సాహాయ్యముతో, అన్నమ్ = హవిర్భాగమును, అదామహే = భక్షించెదము.

జగత్తును సృష్టించిన ఓ బ్రహ్మ! నీవు చేసిన ఈ సృష్టి చాల బాగున్నది! దీనిని ఆశ్రయించి యజ్ఞాది కర్మలు ఉన్నవి. వాటి వలన మేము హవిర్భాగములను భోగించెదము.

తపసా విద్యయా యుక్తో యోగేన సుసమాధినా ।
ఋషీనృషిర్హృషీకేశస్ససర్జాభిమతాః ప్రజాః ॥ 52

హృషీకేశః = ఇంద్రియములను జయించిన, ఋషిః = మొట్టమొదటి ఋషియగు బ్రహ్మ, తపసా = తపస్సు (జ్ఞానము) చే, విద్యయా = ఉపాసనచే, సుసమాధినా = చక్కని చిత్తైకాగ్రత గల, యోగేన = యోగము చే, యుక్తః = కూడినవాడై, అభిమతాః = ప్రియమైన, ప్రజాః = సంతానము గు, ఋషీన్ = మహర్షులను, ససర్జ = సృష్టించెను.

ఇంద్రియ విజేత, మొదటి ఋషి అగు బ్రహ్మగారు తపస్సు, జ్ఞానము, ఉపాసన, చిత్తైకాగ్రతతో కూడిన యోగము అనువాటితో కూడినవాడై తనకు ప్రియమైన సంతానమగు మహర్షులను సృష్టించెను.

తేభ్యశ్చైకైకశస్స్వస్య దేహస్యాంశమదాదజః ।
యత్తత్సమాధియోగర్ధితపోవిద్యావిరక్తిమత్ ॥ 53

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
వింశోఽధ్యాయః ॥

అజః = బ్రహ్మగారు, తేభ్యః = వారి కొరకు, స్వస్య = తన, దేహస్య = శరీరముయొక్క, తత్ = ఆ, అంశమ్ = భాగమును, ఏక-ఏకశః = ఒక్కటొక్కటిగా, అదాత్ = ఇచ్చెను, యత్ = ఏదైతే, సమాధియోగ-ఋద్ధితపః-విద్యావిరక్తిమత్ = సమాధితో కూడిన యోగము అణిమాది సిద్ధులు తపస్సు (జ్ఞానము) ఉపాసన మరియు వైరాగ్యములను కలిగియున్నదో.

బ్రహ్మ సమాధియోగమును, అణిమాది సిద్ధులను, తపస్సును, ఉపాసనను, వైరాగ్యమును, జ్ఞానమును ఆ ఉపాధితో కలిగియుండెను. ఆయన ఆ ఉపాధియొక్క ఒక్కొక్క అంశమును ఆ మహర్షులకు ఇచ్చెను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
ఇరువదియవ అధ్యాయము ముగిసినది (**20**).



# అథ ఏకవింశోఽధ్యాయః

## కర్దమునకు భగవానుడు వరమునిచ్చుట

విదుర ఉవాచ ।
స్వాయంభువస్య చ మనోర్వంశః పరమసమ్మతః ।
కథ్యతాం భగవన్ యత్ర మైథునేనైధిరే ప్రజాః ॥ 1

విదురః = విదురుడు, ఉవాచ = పలికెను, భగవన్ = ఓ పూజ్యా!, స్వాయంభువస్య మనోః = స్వాయంభువ మనువుయొక్క, పరమసమ్మతః = మహాత్ములచే ఆదరించబడే, వంశః = వంశము, కథ్యతామ్ = చెప్పబడు గాక!, యత్ర = ఏ వంశమునందు, ప్రజాః = ప్రజలు, మైథునేన = స్త్రీపురుష సంయోగముచే, ఏధిరే = వర్ధిల్లిరో.

విదురుడిట్లు పలికెను --- ఓ పూజ్యా! స్వాయంభువ వంశమును మహాత్ములు కూడ ఆదరించెదరు. స్త్రీపురుష సంయోగరూపముగా ఆ వంశము పెరిగి పెద్దది ఆయెను. ఆ వంశమును గురించి చెప్పుము.

ప్రియవ్రతోత్తానపాదౌ సుతౌ స్వాయంభువస్య వై ।
యథాధర్మం జుగుపతుస్సప్తద్వీపవతీం మహీమ్ ॥ 2

స్వాయంభువస్య = స్వాయంభువ మనువుయొక్క, సుతౌ = కుమారులగు, ప్రియవ్రత-ఉత్తానపాదౌ వై = ప్రసిద్ధిని గాంచిన ప్రియవ్రతుడు ఉత్తానపాదుడు, సప్తద్వీపవతీమ్ = ఏడు ఖండములు గల, మహీమ్ = భూమిని, యథాధర్మమ్ = ధర్మమునతిక్రమించకుండగా, జుగుపతుః = పాలించిరి.

స్వాయంభువ మనువుయొక్క కుమారులగు ప్రియవ్రత-ఉత్తాన పాదులు ఏడు ఖండములతో కూడియున్న ఈ భూమండలమును ధర్మము నతిక్రమించకుండగా పాలించిరి గదా!

తస్య వై దుహితా బ్రహ్మన్ దేవహూతీతి విశ్రుతా ।
పత్నీ ప్రజాపతేరుక్తా కర్దమస్య త్వయానఘ ॥ 3

బ్రహ్మన్ = ఓ మహర్షీ!, అనఘ = ఓ పుణ్యాత్మా!, దేవహూతీ = దేవహూతి, ఇతి = అని, విశ్రుతా = ప్రసిద్ధిని గాంచిన, తస్య = ఆ స్వాయం భువ మనువుయొక్క, దుహితా = కుమార్తె, కర్దమస్య ప్రజాపతేః = కర్దమ ప్రజాపతియొక్క, పత్నీ = భార్యయని, త్వయా = నీచే, ఉక్తా వై = చెప్పబడి నది గదా!

ఓ మహర్షీ! నీవు గొప్ప పుణ్యాత్ముడవు. స్వాయంభువ మనువు యొక్క కుమార్తె దేవహూతియని ప్రసిద్ధిని గాంచినది. ఆమె కర్దమ ప్రజాప తియొక్క భార్యయని నీవు చెప్పితివి.

తస్యాం స వై మహాయోగీ యుక్తాయాం యోగలక్షణైః ।
ససర్జ కతిధా వీర్యం తన్మే శుశ్రూషవే వద ॥ 4

మహాయోగీ = గొప్ప యోగియగు, సః వై = ఆ కర్దముడు, యోగ లక్షణైః = యోగలక్షణములతో, యుక్తాయామ్ = కూడిన, తస్యామ్ = ఆమె యందు, కతిధా = ఎన్ని విధములుగా, వీర్యమ్ = వీర్యమును, ససర్జ = సృష్టించెను?, శుశ్రూషవే = వినగోరుచున్న, మే = నా కొరకు, తత్ = ఆ విషయమును, వద = చెప్పుము.

ఆ కర్దమ ప్రజాపతి గొప్ప యోగి. ఆయన భార్యయగు దేవహూతి యందు యమము మొదలగు యోగలక్షణములు గలవు. వారిద్దరకి సంతా నము ఎందరు? నేనీ విషయమును వినగోరుచున్నాను. చెప్పుడు.

రుచిర్యో భగవాన్ బ్రహ్మన్ దక్షో వా బ్రహ్మణస్సుతః ।
యథా ససర్జ భూతాని లబ్ధ్వా భార్యాం చ మానవీమ్ ॥ 5

బ్రహ్మన్ = ఓ మహర్షీ!, భగవాన్ = పూజ్యుడగు, యః = ఏ, రుచిః = రుచి గలడో, బ్రహ్మణః = బ్రహ్మగారి, సుతః = కుమారుడగు, దక్షః వా = దక్షుడు కూడ, మానవీమ్ = మనువుయొక్క కుమార్తెను, భార్యామ్ = భార్యనుగా, లబ్ధ్వా = పొంది, భూతాని = ప్రాణులను, యథా = ఏ విధముగా, ససర్జ = సృష్టించెనో.

ఓ మహర్షీ! పూజ్యుడగు రుచి ప్రజాపతి, బ్రహ్మపుత్రుడగు దక్షుడు కూడ మనువుయొక్క కుమార్తెలను భార్యలుగా పొంది, ప్రాణులను సృష్టించిన విధానమును గురించి చెప్పుము.

మైత్రేయ ఉవాచ ।
ప్రజాస్సృజేతి భగవాన్ కర్దమో బ్రహ్మణోదితః ।
సరస్వత్యాం తపస్తేపే సహస్రాణాం సమా దశ ॥ 6

ప్రజాః = ప్రజలను, సృజ = సృష్టించుము, ఇతి = అని, బ్రహ్మణా = బ్రహ్మగారిచే, ఉదితః = చెప్పబడిన, భగవాన్ = పూజ్యుడగు, కర్దమః = కర్దముడు, సహస్రాణాం దశ = పదివేలు, సమాః = సంవత్సరముల కాలము, సరస్వత్యామ్ = సరస్వతీ నదీతీరమునందు, తపః = తపస్సును, తేపే = చేసెను.

ప్రజలను సృష్టించుమని బ్రహ్మగారు పూజ్యుడగు కర్దమునకు చెప్పగా, ఆయన పదివేల సంవత్సరములు సరస్వతీ నదీతీరమునందు తపస్సును చేసెను.

తతస్సమాధియుక్తేన క్రియాయోగేన కర్దమః ।
సమాపేదే హరిం భక్త్యా ప్రపన్నవరదాశుషమ్ ॥ 7

తతః = ఆ తపస్సునందు, కర్దమః = కర్దముడు, సమాధియుక్తేన = చిత్తైకాగ్రతతో కూడిన, క్రియాయోగేన = పూజా విధానముచే, ప్రపన్నవరదాశుషమ్ = శరణాగతులకు వరములనొసగే, హరిమ్ = శ్రీహరిని, భక్త్యా = భక్తితో, సమాపేదే = ఆరాధించెను.

ఆ తపస్సులో కర్దముడు చిత్తైకాగ్రముతో గూడిన పూజావిధానము ద్వారా శరణాగతులకు వరములనొసగే శ్రీహరిని భక్తితో ఆరాధించెను.

తావత్ప్రసన్నో భగవాన్ పుష్కరాక్షః కృతే యుగే ।
దర్శయామాస తం క్షత్తశ్శాబ్దం బ్రహ్మ దధద్వపుః ।। 8

క్షత్తః = ఓ విదురా!, తావత్ = అంతవరకు, పుష్కర-అక్షః = పద్మములవంటి కన్నులు గల, భగవాన్ = శ్రీహరి భగవానుడు, ప్రసన్నః = ప్రసన్నుడై, కృతే యుగే = కృతయుగమునందు, శాబ్దమ్ = వేదప్రతిపాద్యమైన, బ్రహ్మ = పరబ్రహ్మ యేది గలదో తన్మయమైన, వపుః = శరీరమును, దధత్ = ధరించువాడై, తమ్ = ఆ కర్దముని గురించి, దర్శయామాస = తనను ప్రకటించెను.

ఓ విదురా! పుండరీకాక్షుడగు శ్రీహరి భగవానుడు అప్పటికి ప్రసన్నుడై కృతయుగారంభమునందు వేదప్రతిపాద్యమగు సచ్చిదానందరూపమును దాల్చి ఆ కర్దమునకు దర్శనమిచ్చెను.

స తం విరజమర్కాభం సితపద్మోత్పలస్రజమ్ ।
స్నిగ్ధనీలాలకవ్రాతవక్త్రాబ్జం విరజోఽంబరమ్ ।। 9

కిరీటినం కుండలినం శంఖచక్రగదాధరమ్ ।
శ్వేతోత్పలక్రీడనకం మనస్స్పర్శస్మితేక్షణమ్ ।। 10

విన్యస్తచరణాంభోజమంసదేశే గరుత్మతః ।
దృష్ట్వా ఖేఽవస్థితం వక్షఃశ్రియం కౌస్తుభకంధరమ్ ।। 11

సః = ఆ కర్దముడు, విరజమ్ = నిర్మలుడు, అర్క-ఆభమ్ = సూర్యుని బోలిన కాంతి గలవాడు, సితపద్మ-ఉత్పలస్రజమ్ = తెల్లని పద్మముల మరియు కలువల మాల గలవాడు, స్నిగ్ధనీల-అలకవ్రాతవక్త్రాబ్జమ్ = దట్టని నల్లని కేశముల సమూహము గల పద్మమువంటి ముఖము గలవాడు, విరజః-అంబరమ్ = స్వచ్ఛమగు వస్త్రము గలవాడు, కిరీటినమ్ = కిరీటము గలవాడు, కుండలినమ్ = కుండలములు గలవాడు, శంఖచక్రగదాధ

రమ్ = శంఖమును చక్రమును గదను ధరించినవాడు, శ్వేత-ఉత్పలక్రీడన కమ్ = తెల్ల కలువ ఆట వస్తువుగా గలవాడు, మనః-స్పర్శస్మిత-ఈక్షణమ్ = మనస్సునకు ఆనందమును కలిగించే చిరునవ్వు చూపులు గలవాడు, గరుత్మతః = గరుత్మంతుని, అంసదేశే = భుజస్థానమునందు, విన్యస్తచరణ-అంభోజమ్ = ఉంచబడిన పద్మమువంటి పాదములు గలవాడు, ఖే = ఆకాశమునందు ఉన్నవాడు, వక్షఃశ్రియమ్ = వక్షఃస్థలమునందు లక్ష్మీదేవి గలవాడు, కౌస్తుభకంధరమ్ = మెడలో కౌస్తుభ మాణిక్యము గలవాడు అగు, తమ్ = ఆ శ్రీహరిని, సః = ఆ కర్దముడు, దృష్ట్వా = చూచి.

సూర్యుని వలె నిర్మలముగా ప్రకాశించుచున్న శ్రీహరిని ఆ కర్దముడు చూచెను. ఆయన తెల్లని పద్మములు మరియు కలువల మాలను ధరించియుండెను. ఆయన ముఖపద్మము దట్టని నల్లని కేశసముదాయముతో, కిరీటముతో, కుండలములతో ప్రకాశించెను. స్వచ్ఛమగు వస్త్రము దాల్చిన శ్రీహరి శంఖమును, చక్రమును, గదను, విలాస కొరకై తెల్లని కలువను పట్టుకొనియుండెను. ఆయన చూపులు, చిరునవ్వు మనస్సునకు ఆనందమును కలిగించుచుండెను. ఆయన ఆకాశములో గరుత్మంతుని భుజములపై పద్మములవంటి పాదములను ఆన్చి యుండెను. ఆయన మెడలో కౌస్తుభమాణిక్యము, వక్షఃస్థలముపై లక్ష్మీదేవి ప్రకాశించిరి.

జాతహర్షోऽపతన్మూర్ధ్నా క్షితౌ లబ్ధమనోరథః ।
గీర్భిస్త్వభ్యగృణాత్ప్రీతిస్వభావాత్మా కృతాంజలిః ॥ 12

లబ్ధమనోరథః = పొందబడిన కోరిక గలవాడు, జాతహర్షః = కలిగిన ఆనందము గలవాడు, ప్రీతిస్వభావ-ఆత్మా = ప్రేమయే స్వభావముగా గల హృదయము గలవాడై, మూర్ధ్నా = శిరస్సుతో, క్షితౌ = నేలపై, అభ్యపతత్ = శ్రీహరికి ఎదురుగా పడెను, కృత-అంజలిః = చేతులను జోడించినవాడై, గీర్భిః తు = వచనములతోనైతే, అభ్యగృణాత్ = స్తుతించెను.

కర్దముని మనోరథము సఫలమగుటచే ఆతనికి హర్షము కలిగెను. ఆయనది ప్రేమయే స్వభావముగా గల హృదయము. ఆయన నేలపై శ్రీహరికి సాష్టాంగ నమస్కారమును చేసి, చేతులను జోడించి స్తుతించెను.

ఋషిరువాచ ।

జుష్టం బతాద్యాఖిలసత్త్వరాశేః
సాంసిధ్యమక్ష్ణోస్తవ దర్శనాన్నః ।
యద్దర్శనం జన్మభిరీడ్య సద్భిః
ఆశాసతే యోగినో రూఢయోగాః ॥ 13

ఈడ్య = కొనియాడ దగినవాడా!, బత = ఆహా!, అఖిలసత్త్వరాశేః = సంపూర్ణమగు సత్త్వగుణమునకు ఆశ్రయమగు, తవ = నీ, దర్శనాత్ = దర్శనము వలన, నః = మా, అక్ష్ణోః = కన్నులకు, సాంసిధ్యమ్ = సఫలత, జుష్టమ్ = పొందబడినది, యద్-దర్శనమ్ = ఏ నీ దర్శనమును, సద్భిః = పుణ్యము అధికముగా గల, జన్మభిః = జన్మలచే, రూఢయోగాః = దృఢమైన జ్ఞానము గల, యోగినః = భక్తులు, ఆశాసతే = ప్రార్థించుచున్నారో.

కొనియాడదగిన ఓ శ్రీహరీ! ఆహా! సంపూర్ణ సత్త్వగుణ నిధానమ వగు నీ దర్శనము వలన నా కన్నులు సఫలమైనవి. భక్తులు అనేకజన్మ లలో గొప్ప పుణ్యమును చేసుకొని, దాని ప్రభావముచే దృఢమగు జ్ఞాన మును పొంది నిన్ను దర్శించుటకు ప్రార్థనలను చేయుచున్నారు.

యే మాయయా తే హతమేధసస్త్వత్-
పాదారవిందం భవసింధుపోతమ్ ।
ఉపాసతే కామలవాయ తేషాం
రాసీశ కామాన్నిరయేఽపి యే స్యుః ॥ 14

ఈశ = ఓ ఈశ్వరా!, యే = ఎవరైతే, తే = నీ, మాయయా = మాయచే, హతమేధసః = నశింపజేయబడిన బుద్ధిగలవారై, భవసింధుపోతమ్ = సంసారసముద్రమునకు నావయగు, త్వత్-పాద-అరవిందమ్ = నీ పాదపద్మమును, కామలవాయ = కామనల లేశము కొరకు, ఉపాసతే = ఆరాధించుచున్నారో, తేషామ్ = వారికి, కామాన్ = కామనలను, రాసి = ఇచ్చుచున్నావు, యే = ఏ కామనలు, నిరయే అపి = నరకమునందు కూడ, స్యుః = ఉండునో.

ఓ ఈశ్వరా! నీ మాయచే నశింప జేయబడిన బుద్ధి గల జనులు సంసారసముద్రమును దాటించే నావవంటి నీ పాదపద్మములను అల్పము లగు కామనల కొరకై ఆరాధించెదరు. నీవు వారికి ఆ కామనలను నెరవేర్చె దవు. ఇంద్రియసుఖము నరకములో కూడ లభించును.

తథా స చాహం పరివోఢుకామః
సమానశీలాం గృహమేధధేనుమ్ ।
ఉపేయివాన్మూలమశేషమూలం
దురాశయః కామదుఘాంఘ్రిపస్య ॥ 15

సః = అట్టి, దురాశయః = కలుషితమగు చిత్తము గల, అహం చ = నేను కూడ, తథా = అట్టివాడనే, సమానశీలామ్ = సమానమగు స్వభావము గల, గృహమేధధేనుమ్ = గృహాశ్రమమునందు కామధేనువువంటి భార్య ను, పరివోఢుకామః = వివాహమాడాలనే కోరిక గలవాడనై, కామదుఘ-అం ఘ్రిపస్య = భక్తుల కోరికలను ఈడేర్చే కల్పవృక్షము అగు నీ, అశేషమూ లమ్ = పురుషార్థములన్నింటికీ మూలమగు, మూలమ్ = పాదమూలము ను, ఉపేయివాన్ = శరణు పొందినాను.

నేను కూడ అట్టి కలుషితమైన చిత్తము గలవాడనే. గృహాశ్రమము నకు గృహిణి కామధేనువు. నేను నా స్వభావమునకు అనురూపమగు యువతిని వివాహమాడ గోరుచున్నాను. నీవు భక్తుల కోరికలను తీర్చే కల్పవృక్షమవు. పురుషార్థములన్నింటికీ మూలమగు నీ పాదమూలమును నేను శరణు వేడుచున్నాను.

ప్రజాపతేస్తే వచసాధీశ తంత్యా
లోకః కిలాయం కామహతోऽనుబద్ధః ।
అహం చ లోకానుగతో వహామి
బలిం చ శుక్లానిమిషాయ తుభ్యమ్ ॥ 16

అధీశ = ఓ సర్వేశ్వరా!, శుక్ల = పరిశుద్ధుడా!, ప్రజాపతేః = ప్రజ లను పాలించే, తే = నీ, వచసా = ఉపదేశము అనే, తంత్యా = త్రాటిచే,

కామహతః = కోరికలచే హతుడైన, అయమ్ = ఈ, లోకః = మానవుడు, అనుబద్ధః కిల = కట్టివేయబడినాడు గదా!, లోక-అనుగతః = లోకముననుస రించే, అహం చ = నేను కూడా, అనిమిషాయ = కాలస్వరూపుడవగు, తుభ్యమ్ = నీ కొరకు, బలిమ్ = పూజను, వహామి = సమర్పించుచున్నాను.

ఓ సర్వేశ్వరా! నీవు పరిశుద్ధుడవు. ప్రజలను పాలించే నీవు వేదము అనే ఉపదేశమును మానవులకు అందించినావు. కామనలచే హతులైన మానవలోకము కర్మశాస్త్రము అనే త్రాటిచే కట్టివేయబడి యున్నది. నేను కూడ అదే లోకముననుసరిస్తూ, కాలస్వరూపుడవగు నిన్ను పూజాదికముతో ఆరాధించుచున్నాను.

లోకాంశ్చ లోకానుగతాన్ పశూంశ్చ
హిత్వా శ్రితాస్తే చరణాతపత్రమ్ ।
పరస్పరం త్వద్గుణవాదసీధు-
పీయూషనిర్యాపితదేహధర్మాః ॥ 17

లోకాన్ = జనులను, లోక-అనుగతాన్ = వారిని అనుసరించే, పశూన్ చ = అజ్ఞానులను కూడ, హిత్వా = విడిచిపెట్టి, పరస్పరమ్ = ఒకరితోనొకరు, త్వద్-గుణవాదసీధుపీయూషనిర్యాపితదేహధర్మాః = గుణముల కీర్తనము అనే మత్తైన అమృతముచే నిర్వహించబడిన దేహధర్మములు గల భక్తులు, తే = నీ, చరణ-ఆతపత్రమ్ = పాదములు అనే గొడుగును, శ్రితాః = ఆశ్రయించినారు.

నీ భక్తులు భోగపరాయణులగు జనులను, వారి అనుయాయులను దూరముగా పెట్టి, తమలో తాము నీ గుణములను గానము చేయుచుందురు. ఆ గానముయొక్క మత్తెక్కించే మధురిమలో వారు దేహధర్మములగు ఆకలిదప్పికలను విస్మరించెదరు. వారు నీ పాదములు అనే ఛత్రచ్ఛాయను ఆశ్రయించెదరు.

న తేఽజరాక్షభ్రమిరాయురేషాం
త్రయోదశారం త్రిశతం షష్టిపర్వ ।

షణ్నేమ్యనంతచ్ఛది యత్త్రిణాభి
కరాలస్రోతో జగదాచ్ఛిద్య ధావత్ ॥ 18

అజర-అక్షభ్రమిః = పరబ్రహ్మ అనే ఇరుసునందు తిరిగేది, త్రయో దశ-అరమ్ = పదమూడు ఆకులు గలది, త్రిశతం షష్టిపర్వ = మూడు వందల అరవై కణుపులు గలిది, షట్-నేమి = ఆరు కమ్మీలు కలది, అనంత చ్ఛది = లెక్క లేనన్ని పత్రములు గలది, త్రిణాభి = మూడు నడిమి తూములు గలది, కరాలస్రోతః = తీవ్రమగు వేగము గలది అగు, తే = నీ, యత్ = కాలచక్రము గలదో అది, జగత్ = జగత్తును, ఆచ్ఛిద్య = లాగుకొని, ధావత్ = పరుగెత్తుచున్నదై, ఏషామ్ = ఈ నీ భక్తుల, ఆయుః = ఆయుర్దా యమును, న = అట్లు చేయుట లేదు.

సంవత్సరము అనే నీ కాలచక్రము పరబ్రహ్మ అనే ఇరుసునందు తిరుగుచుండును. దానికి అధికమాసముతో కలుపుకొని పదమూడు ఆకులు గలవు. ఋతువులు అనే ఆరు కమ్మీలు గల ఆ చక్రముపై లెక్కలేనన్ని పత్రములు (సెకనులు, నిముషములు) చెక్కబడియున్నవి. నాలుగు మాస ముల కాలఖండములే మూడు నడిమి తూములుగా గల ఈ చక్రము తీవ్ర మగు వేగముతో పరుగెత్తుతూ జగత్తును తనతో వినాశము వైపునకు లాగు కొని పోవుచున్నది. కాని, అది నీ భక్తుల ఆయుర్దాయమును మాత్రము వ్యర్థము చేయలేకున్నది.

ఏకస్స్వయం సఞ్జగతస్సిసృక్షయాऽ
ద్వితీయయాऽऽత్మన్నధియోగమాయయా ।
సృజస్యదః పాసి పునర్గ్రసిష్యసే
యథోర్ణనాభిర్భగవన్ స్వశక్తిభిః ॥ 19

భగవన్ = ఓ భగవానుడా!, స్వయమ్ = స్వయముగా, ఏకః సన్ = ఒక్కడే ఉన్నవాడవై, జగతః = జగత్తుయొక్క, సిసృక్షయా = సృష్టిని చేయ వలెననే కోరికతో, అద్వితీయయా = నీకంటె వేరుగా లేని, ఆత్మన్ = నీయం దే, అధియోగమాయయా = అధిష్ఠానము గల యోగమాయచే, స్వశక్తిభిః = తన శక్తులచే, ఊర్ణనాభిః యథా = సాలె పురుగు వలె, అదః = ఈ జగత్తును,

సృజసి = సృష్టించుచున్నావు, పాసి = పాలించుచున్నావు, పునః = మరల, గ్రసిష్యసే = ఉపసంహరించ గలవు.

ఓ భగవానుడా! సృష్టికి పూర్వము నీవు ఒక్కడివే గలవు. నీకు సృష్టిని చేయవలెననే కోరిక కలిగెను. నీవే అధిష్ఠానముగా గల యోగ మాయ నీకంటె వేరుగా లేదు. సత్త్వరజస్తమోగుణములనే శక్తులను కలిగి యున్న ఆ యోగమాయ ద్వారా నీవు, సాలెపురుగు తననుండియే గూడును ప్రకటించే విధముగా, ఈ జగత్తును నీనుండియే సృష్టించి, పాలిం చుచున్నావు. మరల దానిని ప్రళయములో నీ లోనికే ఉపసంహరించెదవు.

నైతద్బతాధీశ పదం తవేప్సితం
యన్మాయయా నస్తనుషే భూతసూక్ష్మమ్ ।
అనుగ్రహాయాస్త్వపి యర్హి మాయయా
లసత్తులస్యా తనువా విలక్షితః ॥ 20

అధీశ = ఓ సర్వేశ్వరా!, ఏతత్ = ఈ, భూతసూక్ష్మమ్ = శబ్దరూపర సస్పర్శగంధాత్మకమగు, పదమ్ = భోగ్యము, తవ = నీకు, న ఈప్సితమ్ = సమ్మతమైనది కాదు, యత్ = దేనిని, మాయయా = మాయాశక్తిచే, నః = మా కొరకు, తనుషే = విస్తరింప జేయుచున్నావో, బత = ఆహా!, అపి = అయినప్పటికీ, అనుగ్రహాయ = మోక్షరూపమగు అనుగ్రహము కొరకు, అస్తు = అగుగాక!, యర్హి = ఏలయనగా, మాయయా = మాయచే, లసత్-తులస్యా = ప్రకాశించే తులసి మాల గల, తనువా = శరీరముతో, విలక్షితః = చూడబడినావో.

ఓ సర్వేశ్వరా! ఆహా! నీవు మాయచే శబ్దరూపరసస్పర్శగంధాత్మ కమగు భోగ్యజాతమును విస్తరింప జేసినావు. దానిని మాకు వరముగా నిచ్చుట నీకు సమ్మతము కాదు. అయినప్పటికీ, అది అంతతో గత్వా నాకు మోక్షరూపమగు నీ అనుగ్రహమునకే దారి తీయుగాక! ఏలయనగా, మాయచే పరిచ్ఛిన్నునిగా కన్పట్టే నీ తులసీమాలావిభూషితమైన రూప మును నేను కంటిని.

తం త్వానుభూత్యోపరతక్రియార్థం
స్వమాయయా వర్తితలోకతంత్రమ్ ।
నమామ్యభీక్ష్ణం నమనీయపాద-
సరోజమల్పీయసి కామవర్షమ్ ॥ 21

అనుభూత్యా = ఆత్మజ్ఞానముచే, ఉపరతక్రియా-అర్థమ్ = విరమించబడిన కర్మఫలము గలిగినట్టియు, స్వమాయయా = తన మాయాశక్తిచే, వర్తితలోకతంత్రమ్ = నడిపించబడే లోకవ్యవహారము గలిగినట్టియు, నమనీయపాదసరోజమ్ = నమస్కరించదగిన పాదపద్మములు కలిగినట్టియు, అల్పీయసి = అల్పమగు ఆరాధన (భక్తుని) యందు కూడ, కామవర్షమ్ = కోరికలను వర్షించే, తమ్ = అట్టి, త్వా = నిన్ను, అభీక్ష్ణమ్ = పలుమార్లు, నమామి = నమస్కరించుచున్నాను.

నీవు నిష్క్రియ పరబ్రహ్మస్వరూపుడవు. నీకు కర్మలయందు గాని, వాటి ఫలములయందు గాని అపేక్ష లేదు. అయిననూ, నీవు నీ మాయాశక్తిచే లోకవ్యవహారమును నడిపించుచున్నావు. నీ పాదపద్మములు నమస్కరించ దగినవి. నీవు అల్పుడగు నావంటి భక్తుడు చేసే చిన్న ఆరాధనకైననూ కోరికలను వర్షించెదవు. అట్టి నీకు పలుమార్లు నమస్కరించుచున్నాను.

ఋషిరువాచ ।
ఇత్యవ్యలీకం ప్రణుతోఽబ్జనాభస్తమాబభాషే వచసామృతేన ।
సుపర్ణపక్షోపరి రోచమానః ప్రేమస్మితోద్వీక్షణవిభ్రమద్భ్రూః ॥22

ఇతి = ఈ విధముగా, అవ్యలీకమ్ = నిష్కపటముగా, ప్రణుతః = స్తుతించబడినవాడై, సుపర్ణపక్ష-ఉపరి = గరుత్మంతుని రెక్కలపై, రోచమానః = ప్రకాశించుచున్నట్టియు, ప్రేమస్మిత-ఉద్వీక్షణవిభ్రమద్-భ్రూః = ప్రేమతో నిండిన చిరునవ్వుతో తలను పైకెత్తి చూచుటచే కదలాడుచున్న కనుబొమలు గల, అబ్జనాభః = పద్మనాభుడు, అమృతేన = అమృతరూపమగు, వచసా = వాక్కుతో, తమ్ = ఆయనను గురించి, ఆబభాషే = పలికెను.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- ఈ విధముగా కర్దముడు నిష్కపటముగా గరుత్మంతుని రెక్కలపై ప్రకాశించుచున్న పద్మనాభుని స్తుతించెను. ఆయన ప్రేమతో చిరునవ్వు నవ్వి తలను పైకెత్తి కనుబొమలను కదుపుతూ కర్దముని చూచి, అమృతమువంటి వాక్కుతో ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
విదిత్వా తవ చైత్యం మే పురైవ సమయోజి తత్ ।
యదర్థమాత్మనియమైస్త్వయైవాహం సమర్చితః ॥ 23

తవ = నీ, చైత్యమ్ = మనస్సులోని అభిప్రాయమును, విదిత్వా = తెలుసుకొని, పురా ఏవ = పూర్వమే, మే = నాచే, తత్ = అది, సమయోజి = చక్కగా ఏర్పాటు చేయబడినది, యత్-అర్థమ్ = దేని కొరకైతే, త్వయా = నీచే, ఆత్మనియమైః = మనోనియమములచే, అహమ్ = నేను, సమర్చితః ఏవ = నిశ్చయముగా ఆరాధించబడితినో.

శ్రీ భగవానుడు ఇట్లు పలికెను --- నీ మనస్సులోని అభిప్రాయము నాకు తెలియును. దేని కొరకైతే నీవు శమదమాది మనోనియమములతో నన్ను నిశ్చయముగా ఆరాధించితివో, దాని ఏర్పాటును నేను పూర్వమే చక్కగా చేసియున్నాను.

న వై జాతు మృషైవ స్యాత్ప్రజాధ్యక్ష మదర్హణమ్ ।
భవద్విధేష్వతితరాం మయి సంగృభితాత్మనామ్ ॥ 24

ప్రజా-అధ్యక్ష = ఓ ప్రజాపతీ!, మయి = నాయందు, సంగృభిత-ఆత్మనామ్ = ఏకాగ్రము చేయబడిన మనస్సులు గలవారి, మత్-అర్హణమ్ = నా పూజ, జాతు = ఏ కాలమునందైననూ, మృషా = వ్యర్థము, న వై స్యాత్ ఏవ = కానే కాదు, భవత్-విధేషు = నీ వంటివారి విషయములో, అతితరామ్ = అసలే కాదు.

ఓ ప్రజాపతీ! మనస్సును నాపై ఏకాగ్రము చేసి నన్ను పూజించే భక్తుల ఆ పూజ ఎన్నటికీ వ్యర్థము కానే కాదు. నీవంటి వారి విషయములో అసలే వ్యర్థము కాదు.

ప్రజాపతిసుతస్సమ్రాట్ మనుర్విఖ్యాతమంగలః ।
బ్రహ్మావర్తం యోఽధివసన్ శాస్తి సప్తార్ణవాం మహీమ్ ।। 25

యః = ఏ, ప్రజాపతిసుతః = బ్రహ్మగారి పుత్రుడు, సమ్రాట్ = చక్రవర్తి అగు, మనుః = మనువు, బ్రహ్మావర్తమ్ = బ్రహ్మావర్తమును, అధివసన్ = నివాసముగా చేసుకున్నవాడై, సప్తార్ణవామ్ = ఏడు సముద్రములు గల, మహీమ్ = భూమిని, శాస్తి = పాలించుచున్నాడో ఆయన, విఖ్యాతమంగలః = ప్రసిద్ధమైన మంగళాచరణము గలవాడు.

బ్రహ్మగారి పుత్రుడగు స్వాయంభువ మనువు చక్రవర్తియై బ్రహ్మావర్తమును రాజధానిగా చేసుకొని ఏడు సముద్రములతో గూడిన భూమిని శాసించుచున్నాడు. ఆయన సదాచారము లోకములో ప్రసిద్ధము.

స చేహ విప్ర రాజర్షిర్మహిష్యా శతరూపయా ।
ఆయాస్యతి దిదృక్షుస్త్వాం పరశ్వో ధర్మకోవిదః ।। 26

విప్ర = ఓ మహర్షీ!, రాజర్షిః = రాజర్షి, ధర్మకోవిదః = ధర్మములో నిష్ణాతుడు అగు, సః = ఆ మనువు, మహిష్యా = భార్యయగు, శతరూపయా = శతరూపతో గూడి, త్వామ్ = నిన్ను, దిదృక్షుః = చూడగోరువాడై, పరశ్వః = ఎల్లుండి, ఇహ = ఇచటకు, ఆయాస్యతి = రాగలడు.

ఓ మహర్షీ! ధర్మజ్ఞుడు, రాజర్షియగు ఆ మనువు భార్యయగు శతరూపతో గూడి నిన్ను చూడగోరి ఇచటకు ఎల్లుండి రాగలడు.

ఆత్మజామసితాపాంగీం వయశ్శీలగుణాన్వితామ్ ।
మృగయంతీం పతిం దాస్యత్యనురూపాయ తే ప్రభో ।। 27

ప్రభో = ఓ ప్రజాపతీ!, అసిత-అపాంగీమ్ = నల్లని కన్నులు గలది, వయః-శీలగుణ-అన్వితామ్ = వయస్సు శీలము గుణములతో కూడినది, పతిమ్ = భర్తను, మృగయంతీమ్ = కోరుచున్నది అగు, ఆత్మజామ్ = కుమార్తెను, అనురూపాయ = యోగ్యుడవగు, తే = నీ కొరకు, దాస్యతి = ఈయగలడు.

ఆయన కుమార్తె నల్లని కన్నులు గల చిన్నది. ఆమె శీలము, గుణములు గొప్పవి. ఆమె యుక్తవయస్కురాలు. మను చక్రవర్తి అట్టి తన కుమార్తెను నీకు ఇచ్చి వివాహము చేయగలడు.

సమాహితం తే హృదయం యత్రేమాన్ పరివత్సరాన్।
సా త్వాం బ్రహ్మన్నృపవధూః కామమాశు భజిష్యతి ॥ 28

బ్రహ్మన్ = ఓ మహర్షీ!, ఇమాన్ = ఈ, పరివత్సరాన్ = అనేకసంవత్సరముల కాలము, తే = నీ, హృదయమ్ = హృదయము, యత్ర = ఏ భార్యయందు, సమాహితమ్ = స్థిరముగా నిలిచియుండెనో, సా = అట్టి, నృపవధూః = రాజకన్య, త్వామ్ = నిన్ను, ఆశు = తొందరలో, కామమ్ = యథేచ్ఛగా, భజిష్యతి = సేవించగలదు.

ఓ మహర్షీ! గడచిన చాల సంవత్సరములనుండి భార్యను పొందవలెననే ఆకాంక్ష నీ హృదయములో స్థిరముగా నుండెను. అట్టి రాజకన్య తొందరలోనే నీకు భార్యయై నిన్ను యథేచ్ఛగా సేవించగలదు.

యా త ఆత్మభృతం వీర్యం నవధా ప్రసవిష్యతి ।
వీర్యే త్వదీయే ఋషయ ఆధాస్యంత్యంజసాఽఽత్మనః ॥ 29

యా = ఏ రాజకన్య, తే = నీ, ఆత్మభృతమ్ = తనయందు స్థాపించబడిన, వీర్యమ్ = వీర్యమును, నవధా = తొమ్మిది రూపములుగా, ప్రసవిష్యతి = జన్మనీయగలదో, త్వదీయే = నీకు సంబంధించిన, వీర్యే = సంతానమునందు, అంజసా = సాక్షాత్తుగా, ఋషయః = మహర్షులు, ఆత్మనః = తమను తాము, ఆధాస్యంతి = జన్మను ఈయగలరు.

ఆ రాజకన్యయందు నీవు తొమ్మిదిమంది కుమార్తెలను కనగలవు. వారు సాక్షాత్తుగా మహర్షులకు భార్యలై వారి వలన సంతానమును బడయగలరు.

త్వం చ సమ్యగనుష్ఠాయ నిదేశం మ ఉశత్తమః ।
మయి తీర్థకృతాశేషక్రియార్థో మాం ప్రపత్స్యసే ॥ 30

ఉశత్తమః = శుద్ధమగు అంతఃకరణము గల, త్వం చ = నీవు కూడా, మే = నా, నిదేశమ్ = ఆదేశమును, సమ్యక్ = చక్కగా, అనుష్ఠాయ = అనుష్ఠించి, మయి = నాయందు, తీర్థీకృత-అశేషక్రియా-అర్థః = సమర్పించబడిన సకలములగు కర్మలు మరియు వాటి ఫలములు గలవాడవై, మామ్ = నన్ను, ప్రపత్స్యసే = పొందగలవు.

శుద్ధమగు అంతఃకరణము గల నీవు కూడా నా ఆదేశమును చక్కగా అనుష్ఠించి, సకలకర్మలను వాటి ఫలములతో సహా నాకు సమర్పించి, నన్ను పొందగలవు.

కృత్వా దయాం చ జీవేషు దత్త్వా చాభయమాత్మవాన్ ।
మయ్యాత్మానం సహ జగద్ద్రక్ష్యస్యాత్మని చాపి మామ్ ॥31

ఆత్మవాన్ = జితేంద్రియుడవగు నీవు, జీవేషు = ప్రాణులయందు, దయామ్ = దయను, కృత్వా = చేసి, అభయమ్ = అభయమును, దత్త్వా = ఇచ్చి, మయి = నాయందు, ఆత్మానమ్ = తనను, జగత్ = జగత్తును, సహ = కలిపి, ద్రక్ష్యసి = చూడగలవు, చ = మరియు, మాం అపి = నన్ను కూడ, ఆత్మని = నీయందు (చూడగలవు).

నీవు ఇంద్రియములను జయించి, ప్రాణులయందు దయను చూపుతూ, సకలప్రాణులకు అభయమునిచ్చే సన్న్యాసాశ్రమమును స్వీకరించెదవు. తనతో సహా ఈ జగత్తు అంతా పరమేశ్వరునియందే నిలిచియున్నదనే జ్ఞానము నీకు కలుగగలదు. ఇంతేగాక, నన్ను సర్వమును ఆత్మయందు, అనగా ఆత్మరూపముగా దర్శించగలవు.

సహాహం స్వాంశకలయా త్వద్వీర్యేణ మహామునే ।
తవ క్షేత్రే దేవహూత్యాం ప్రణేష్యే తత్త్వసంహితామ్ ॥ 32

మహామునే = ఓ మహర్షీ!, అహమ్ = నేను, స్వ-అంశకలయా సహ = నా అంశకళతో, త్వద్-వీర్యేణ = నీ సంతానముతో బాటు, తవ = నీ, క్షేత్రే = భార్యయగు, దేవహూత్యామ్ = దేవహూతియందు (అవతరించి),

తత్త్వసంహితామ్ = తత్త్వముల స్వరూపమును వివరించే సాంఖ్యశాస్త్రము ను, ప్రణేష్యే = బోధించగలను.

ఓ మహర్షీ! నేను నీ భార్యయగు దేవహూతియందు ఇతరసంతాన ముతో బాటు నా అంశకళతో అవతరించి, తత్త్వముల స్వరూపమును వివరించే సాంఖ్యశాస్త్రమును బోధించగలను.

మైత్రేయ ఉవాచ ।
ఏవం తమనుభాష్యాథ భగవాన్ ప్రత్యగక్షజః ।
జగామ బిందుసరసస్సరస్వత్యా పరిశ్రితాత్ ॥ 33

ప్రత్యక్-అక్షజః = ఇంద్రియములు అంతర్ముఖములైనప్పుడు తెలి యబడే, భగవాన్ = శ్రీహరి భగవానుడు, ఏవమ్ = ఈ విధముగా, తమ్ = ఆ కర్దముని గురించి, అనుభాష్య = సంభాషించి, అథ = తరువాత, సర స్వత్యా = సరస్వతీనదిచే, పరిశ్రితాత్ = చుట్టువారబడియున్న, బిందుసరసః = బిందుసరస్సునుండి, జగామ = వెళ్లెను.

ఇంద్రియములు అంతర్ముఖములైనప్పుడు మాత్రమే శ్రీహరి దర్శనమిచ్చును. ఆ భగవానుడీ విధముగా కర్దమునితో సంభాషించి, తరు వాత సరస్వతీ నదిచే చుట్టువారబడియున్న ఆ బిందుసరస్సు వద్దనుండి తన లోకమునకు వెళ్లెను.

నిరీక్షతస్తస్య యయావశేషసిద్ధేశ్వరాభిష్టుతసిద్ధమార్గః ।
ఆకర్ణయన్ పత్రరథేంద్రపక్షైరుచ్చారితం స్తోమముదీర్ణసామ ॥ 34

తస్య = ఆ కర్దముడు, నిరీక్షతః = చూచుచుండగా, అశేషసిద్ధ-ఈ శ్వర-అభిష్టుతసిద్ధమార్గః = సిద్ధపురుషులలో శ్రేష్ఠులగు వారందరిచే కొని యాడబడే సిద్ధమార్గము గల శ్రీహరి, పత్రరథ-ఇంద్రపక్షైః = పక్షిరాజగు గరుత్మంతుని రెక్కలచే, ఉదీర్ణసామ = ప్రకటము చేయబడిన సామవేద మంత్రమును, ఉచ్చారితమ్ = ఉచ్చరించబడిన, స్తోమమ్ = ఋగ్వేద మంత్రసముదాయమును, ఆకర్ణయన్ = వింటున్నవాడై, యయౌ = వెళ్లెను.

శ్రీహరిని పొందే మార్గము (వైకుంఠ మార్గము, జ్ఞానమార్గము) ను సిద్ధపురుషులు అన్వేషించుచుందురు. గొప్ప సిద్ధులందరు ఆ మార్గమును కొనియాడుచుందురు. అట్టి శ్రీహరి, కర్దముడు చూచుచుండగనే, గరుత్మంతుని రెక్కలనుండి వెలువడే సామగానమును, ఆయనచే ఉచ్చరించబడిన ఋగ్వేదమంత్రములను వింటూ, తన లోకమునకు వెళ్లెను.

అథ సంప్రస్థితే శుక్లే కర్దమో భగవానృషిః ।
ఆస్తే స్మ బిందుసరసి తం కాలం ప్రతిపాలయన్ ॥ 35

అథ = తరువాత, శుక్లే = శ్రీహరి, సంప్రస్థితే = తన లోకమునకు వెళ్లగా, భగవాన్ = పూజ్యుడగు, ఋషిః = కర్దమ మహర్షి, తమ్ = ఆ, కాలమ్ = కాలమును, ప్రతిపాలయన్ = వేచి చూచుచున్నవాడై, బిందుసరసి = బిందుసరస్సునందు, ఆస్తే స్మ = ఉండెను.

శ్రీహరి తన లోకమునకు వెళ్లిన తరువాత పూజ్యుడగు కర్దమ మహర్షి మనుచక్రవర్తి రాకను ప్రతీక్షిస్తూ బిందుసరస్సుయొక్క తీరమునందలి తన ఆశ్రమమునందు ఉండెను.

మనుస్స్యందనమాస్థాయ శాతకౌంభపరిచ్ఛదమ్ ।
ఆరోప్య స్వాం దుహితరం సభార్యః పర్యటన్మహీమ్ ॥ 36

మనుః = మను చక్రవర్తి, శాతకౌంభపరిచ్ఛదమ్ = బంగరు అలంకారములు గల, స్యందనమ్ = రథమును, ఆస్థాయ = అధిష్ఠించి, స్వామ్ = తన, దుహితరమ్ = కుమార్తెను, ఆరోప్య = ఎక్కించి, సభార్యః = భార్యతో కూడినవాడై, మహీమ్ = భూమిని, పర్యటన్ = పర్యటించుచున్నవాడై.

మను చక్రవర్తి తన భార్య, కుమార్తె వెంట రాగా, బంగరు అలంకారములతో కూడియున్న రథమునెక్కి భూమిని పర్యటించుచుండెను.

తస్మిన్ సుధన్వన్నహని భగవాన్ యత్సమాదిశత్ ।
ఉపాయాదాశ్రమపదం మునేశ్శాంతవ్రతస్య తత్ ॥ 37

సుధన్వన్ = ఓ విదురా!, శాంతవ్రతస్య = పరిసమాప్తి చెందిన వ్రత నిష్ఠ గల, మునేః = కర్దమ మహర్షియొక్క, తత్ = ఆ, ఆశ్రమపదమ్ = ఆశ్రమస్థానమును, తస్మిన్ = ఆ, అహని = దినమునందు, ఉపాయాత్ = చేరుకొనెను, యత్ = ఏ దినమును, భగవాన్ = శ్రీహరి భగవానుడు, సమాదిశత్ = నిర్దేశించెనో.

ఓ విదురా! కర్దమ మహర్షి తపోవ్రతమును పూర్తి చేసుకొని విశ్రాంతిగా నుండెను. శ్రీహరి భగవానుడు నిర్దేశించిన నాటికే మను చక్రవర్తి ఆ ఆశ్రమస్థానమునకు చేరుకొనెను.

యస్మిన్ భగవతో నేత్రాన్న్యపతన్నశ్రుబిందవః ।
కృపయా సంపరీతస్య ప్రపన్నేఽర్పితయా భృశమ్ ॥ 38

ప్రపన్నే = శరణు పొందిన భక్తునియందు, భృశమ్ = అధికముగా, అర్పితయా = చేయబడిన, కృపయా = దయచే, సంపరీతస్య = పూర్తిగా వ్యాపించబడియున్న, భగవతః = శ్రీహరి భగవానుని, నేత్రాత్ = కంటినుండి, యస్మిన్ = ఏ ఆశ్రమస్థానమునందు, అశ్రుబిందవః = కన్నీటి బిందువులు, న్యపతన్ = జారి పడినవో.

తనను శరణు పొందిన కర్దముని చూడగానే శ్రీహరి భగవానుని హృదయము అతిశయించిన దయతో నిండిపోయెను. ఆయన కన్నుల నుండి నీటి బిందువులు జారి ఆ ఆశ్రమస్థానమునందు పడినవి.

తద్వై బిందుసరో నామ సరస్వత్యా పరిప్లుతమ్ ।
పుణ్యం శివామృతజలం మహర్షిగణసేవితమ్ ॥ 39

సరస్వత్యా = సరస్వతీ నదిచే, పరిప్లుతమ్ = చుట్టువారబడియున్నది, పుణ్యమ్ = పవిత్రమైనది, శివ-అమృతజలమ్ = మంగళకరమగు అమృతమువంటి నీరు గలది, మహర్షిగణసేవితమ్ = మహర్షుల గణములచే సేవించబడునది అగు, తత్ = ఆ ఆశ్రమము, బిందుసరః నామ వై = బిందుసరస్సు అను పేరుతో ప్రసిద్ధిని గాంచినది.

కావుననే, ఆ స్థానమునకు బిందుసరస్సు అనే పేరు ప్రసిద్ధిని గాంచినది. పవిత్రమగు ఆ సరస్సు సరస్వతీనదిచే చుట్టువారబడి యున్న ది. దానిలోని శుభకరమగు జలము అమృతము వలె నుండును. మహర్షుల గణములు ఆ సరస్సును సేవించుచుండును.

పుణ్యద్రుమలతాజాలైః కూజత్పుణ్యమృగద్విజైః ।
సర్వర్తుఫలపుష్పాఢ్యం వనరాజిశ్రియాన్వితమ్ ॥ 40

పుణ్యద్రుమలతాజాలైః = పవిత్రములగు చెట్లతో లతల గుంపుల తో, కూజత్-పుణ్యమృగద్విజైః = కూయుచున్న పవిత్రమగు మృగములతో పక్షులతో, వనరాజిశ్రియా = అడవి చెట్ల పంక్తుల శోభతో, అన్వితమ్ = కూడి యున్నది, సర్వ-ఋతుఫలపుష్ప-ఆఢ్యమ్ = అన్ని ఋతువుల పండ్లతో పుష్పములతో సమృద్ధముగా నున్నది.

పవిత్రములగు చెట్లు, తీగల గుంపులతో నిండియున్న ఆ ఆశ్రమ ములో పవిత్రములగు మృగములు, పక్షులు ధ్వనులను చేయుచున్నవి. అది తమంత తాముగా పుట్టి పెరిగిన చెట్ల వరుసలతో శోభిల్లుచుండెను. అన్ని ఋతువులకు చెందిన పువ్వులు, పండ్లు అచట సమృద్ధిగా నుండెను.

మత్తద్విజగణైర్ఘుష్టం మత్తభ్రమరవిభ్రమమ్ ।
మత్తబర్హినటాటోపమాహ్వయన్మత్తకోకిలమ్ ॥ 41

మత్తద్విజగణైః = మత్తెక్కిన పక్షుల గుంపులతో, ఘుష్టమ్ = కిలకిల లాడుచున్నది, మత్తభ్రమరవిభ్రమమ్ = మదించిన తుమ్మెదల విలాసలు గలది, మత్తబర్హినట-ఆటోపమ్ = మదించిన నెమళ్ల నాట్యపు హడావుడి గల ది, ఆహ్వయత్-మత్తకోకిలమ్ = ఆహ్వానించుచున్న కోకిలలు గలది.

మదించిన తుమ్మెదల విలాసలు గల ఆ ఆశ్రమము మత్తెక్కిన పక్షుల గుంపులతో కిలకిలలాడుచుండెను. అచట నెమళ్లు హడావుడిగా నాట్యములను చేయుచుండగా, కోకిలలు తమ కూతలతో జనులను ఆహ్వా నించుచుండెను.

కదంబచంపకాశోకకరంజబకులాసనైః ।

కుందమందారకుటజైశ్చూతపోతైరలంకృతమ్ ॥ 42

కదంబచంపక-అశోకకరంజబకుల-అసనైః = కడిమి సంపెగ అశోకము పులిగోరు పొగడ వేగి చెట్లతో, కుందమందారకుటజైః = మల్లె మందారము కొడిసె అనువాటితో, చూతపోతైః = పిల్ల మామిడిచెట్లతో, అలంకృతమ్ = అలంకరించి బడినది.

కడిమి, సంపెగ, అశోకము, పొగడ, వేగి, కొడిసె, లేత మామిడి అనే చెట్లతో, మల్లె మందారము అనే మొక్కలతో ఆ ఆశ్రమము శోభిల్లెను.

కారండవైః ప్లవైర్హంసైః కురరైర్జలకుక్కుటైః ।
సారసైశ్చక్రవాకైశ్చ చకోరైర్వల్గు కూజితమ్ ॥ 43

కారండవైః = కన్నెలేళ్లచే, ప్లవైః = బాతులచే, హంసైః = హంసలచే, కురరైః = పెన్నడ పులుగులచే, జలకుక్కుటైః = నీటి కోళ్లచే, సారసైః = బెగ్గురు పక్షులచే, చక్రవాకైః = జక్కవ పిట్టలచే, చ = మరియు, చకోరైః = వెన్నెల పులుగులచే, వల్గు = మనోహరముగా, కూజితమ్ = కూయబడినది.

కన్నెలేళ్లు, బాతులు, హంసలు, పెన్నడ పులుగులు, నీటి కోళ్లు, బెగ్గురు పక్షులు, జక్కవ పిట్టలు, వెన్నెల పులుగులు అచట మనోహరముగా కూయుచుండెను.

తథైవ హరిణైః క్రోడైశ్శ్వావిద్గవయకుంజరైః ।
గోపుచ్ఛైర్హరిభిర్మర్కైర్నకులైర్నాభిభిర్వృతమ్ ॥ 44

తథా ఏవ = అదే విధముగా, హరిణైః = ఇర్రిలతో, క్రోడైః = అడవి పందులతో, శ్వావిద్-గవయకుంజరైః = ఏదుపందులతో గురుపోతులతో ఏనుగులతో, గోపుచ్ఛైః = కొండముచ్చులతో, హరిభిః = సింహములతో, మర్కైః = కోతులతో, నకులైః = ముంగిసలతో, నాభిభిః = కస్తూరీ మృగములతో, వృతమ్ = కూడినది.

అదే విధముగా అచట ఇర్రిలు, అడవి పందులు, ఏదు పందులు, గురుపోతులు, ఏనుగులు, కొండముచ్చులు, సింహములు, కోతులు, ముంగిసలు, కస్తూరి మృగములు గలవు.

ప్రవిశ్య తత్తీర్థవరమాదిరాజస్సహాత్మజః ।
దదర్శ మునిమాసీనం తస్మిన్ హుతహుతాశనమ్ ॥ 45

ఆదిరాజః = ఆదిరాజగు మనువు, సహ-ఆత్మజః = కుమార్తెతో గూడినవాడై, తత్ = ఆ, తీర్థవరమ్ = గొప్ప పుణ్యక్షేత్రమును, ప్రవిశ్య = ప్రవేశించి, తస్మిన్ = ఆ ఆశ్రమమునందు, హుతహుతాశనమ్ = వ్రేల్చబడిన అగ్నులు గల, ఆసీనమ్ = కూర్చునియున్న, మునిమ్ = మహర్షిని, దదర్శ = చూచెను.

ఆదిరాజగు మనువు కుమార్తెతో కలిసి ఆ గొప్ప పుణ్యక్షేత్రమును చేరి ఆశ్రమమునకు వెళ్లెను. అచట అగ్నులను వ్రేల్చి విశ్రాంతిగా కూర్చుని యున్న కర్దమ మహర్షిని ఆయన చూచెను.

విద్యోతమానం వపుషా తపస్యుగ్రయుజా చిరమ్ ।
నాతిక్షామం భగవతస్స్నిగ్ధాపాంగావలోకనాత్ ।
తద్వ్యాహృతామృతకలాపీయూషశ్రవణేన చ ॥ 46

చిరమ్ = చిరకాలము, తపసి = తపస్సునందు, ఉగ్రయుజా = తీవ్రమగు సంబంధము గల, వపుషా = శరీరముతో, విద్యోతమానమ్ = ప్రకాశించుచున్నట్టియు, భగవతః = శ్రీహరి భగవానుని, స్నిగ్ధ-అపాంగ-అవలోకనాత్ = ప్రేమతో నిండిన కడకంటి చూపు వలన, చ = మరియు, తద్-వ్యాహృత-అమృతకలాపీయూషశ్రవణేన = ఆ శ్రీహరియొక్క పలుకులనే అమృతమయుడగు చంద్రుని కళామయమగు అమృతముయొక్క వినుటచే, న-అతిక్షామమ్ = మిక్కిలి కృశించి లేని (కర్దముని చూచెను).

చిరకాలము తపస్సును చేయుటచే కర్దముని శరీరము ప్రకాశించుచుండెను. శ్రీహరి భగవానుడు ఆయనను ప్రేమతో నిండిన కటాక్షముతో

చూచెను. పైగా, ఆయన శ్రీహరియొక్క అమృతమువలె మధురమైన పలుకులను వినియుండెను. కావుననే, ఆయన మరీ చిక్కినట్లుగా లేడు.

ప్రాంశుం పద్మపలాశాక్షం జటిలం చీరవాససమ్ ।
ఉపసంసృత్య మలినం యథార్హణమసంస్కృతమ్ ।। 47

ప్రాంశుమ్ = పొడవైనవాడు, పద్మపలాశ-అక్షమ్ = పద్మపత్రముల వంటి కన్నులు గలవాడు, జటిలమ్ = జటాధారి, చీరవాససమ్ = నారబట్టలను ధరించినవాడు, అసంస్కృతమ్ = సానపెట్టబడని, మలినమ్ = మలినముగా నున్న, అర్హణం యథా = గొప్ప రత్నమువలె నున్న మహర్షిని, ఉపసంసృత్య = దగ్గరకు వెళ్లి (చూచెను).

కర్దముడు పొడవైనవాడు. ఆయన కన్నులు పద్మపత్రములను బోలియుండెను. జటాధారియగు ఆయన నారబట్టలను ధరించెను. ఆయన సానపెట్టబడని కారణముగా ప్రకాశించని గొప్ప రత్నము వలె నుండెను. మనువు దగ్గరకు వెళ్లి ఆయనను దర్శించెను.

అథోటజముపాయాతం నృదేవం ప్రణతం పురః ।
సపర్యయా పర్యగృహ్ణాత్ప్రతినంద్యానురూపయా ।। 48

అథ = తరువాత, ఉటజమ్ = పర్ణశాలను గురించి, ఉపాయాతమ్ = వచ్చినట్టియు, పురః = ఎదుట, ప్రణతమ్ = నమస్కరించిన, నృదేవమ్ = మహారాజును, ప్రతినంద్య = అభినందించి, అనురూపయా = తగిన, సపర్యయా = సపర్యచే, పర్యగృహ్ణాత్ = సత్కరించెను.

అపుడు కర్దముడు తన పర్ణశాలకు వచ్చి నమస్కరించి ఎదుట నిలబడిన మహారాజును అభినందించి తగిన విధముగా సపర్యను అందించి సత్కరించెను.

గృహీతార్హణమాసీనం సంయతం ప్రీణయన్మునిః ।
స్మరన్ భగవదాదేశమిత్యాహ శ్లక్ష్ణయా గిరా ।। 49

గృహీత-అర్హణమ్ = స్వీకరించబడిన పూజ గలిగినట్టియు, ఆసీనమ్ = కూర్చున్నట్టియు, సంయతమ్ = శ్రద్ధగా వినుచున్న మహారాజును, ప్రీణయన్ = సంతోషపెట్టుచున్నవాడై, మునిః = కర్దమ మహర్షి, భగవత్-ఆదేశమ్ = భగవానుని ఆదేశమును, స్మరన్ = స్మరించుచున్నవాడై, శ్లక్ష్ణయా = మధురమగు, గిరా = వాక్కుతో, ఇతి = ఈ విధముగా, ఆహ = పలికెను.

మను చక్రవర్తి సత్కారమును స్వీకరించి కూర్చుండి శ్రద్ధగా ఆలకించుచుండెను. కర్దమ మహర్షి భగవానుని ఆదేశమును గుర్తు చేసుకొని మధురమగు వచనములతో నిట్లు పలికెను. ఆయన మాటలను విని మను మహారాజు సంతోషించెను.

నూనం చంక్రమణం దేవ సతాం సంరక్షణాయ తే ।
వధాయ చాసతాం యస్త్వం హరేశ్శక్తిర్హి పాలినీ ॥ 50

దేవ = ప్రభూ!, తే = నీ, సంక్రమణమ్ = సంచారము, నూనమ్ = నిశ్చయముగా, సతామ్ = సత్పురుషుల, సంరక్షణాయ = సంరక్షణము కొరకు, చ = మరియు, అసతామ్ = దుష్టుల, వధాయ = వధ కొరకు, యః = ఏ, త్వమ్ = నీవు, హరేః = శ్రీహరియొక్క, పాలినీ = పాలించే, శక్తిః హి = శక్తివి అయి ఉన్నావో.

ఓ ప్రభూ! శ్రీహరియొక్క పాలనశక్తి నీ రూపములో నున్నది. నీ ఈ సంచారము వలన దుష్టులు శిక్షింపబడి, సత్పురుషులకు రక్షణ లభించును. ఇది నిశ్చయము.

యోఽర్కేంద్వగ్నీంద్రవాయూనాం యమధర్మప్రచేతసామ్ ।
రూపాణి స్థాన ఆధత్సే తస్మై శుక్లాయ తే నమః ॥ 51

యః = ఏ నీవు, అర్క-ఇందు-అగ్ని-ఇంద్రవాయూనామ్ = సూర్యుడు చంద్రుడు అగ్ని ఇంద్రుడు వాయువుల, యమధర్మప్రచేతసామ్ = యముడు ధర్ముడు వరుణుల, రూపాణి = రూపములను, ఆధత్సే =

ధరించుచున్నావో, స్థానే = ఇది యుక్తమే గదా!, తస్మై = అట్టి, శుక్లాయ = విష్ణుస్వరూపుడవగు, తే = నీ కొరకు, నమః = నమస్కారము.

సూర్యుడు, చంద్రుడు, అగ్ని, ఇంద్రుడు, వాయువు, యముడు, ధర్ముడు మరియు వరుణుడు అనే దేవతల రూపములను నీవు ధరించుచున్నావు. నీవు విశుద్ధ విష్ణు స్వరూపుడవు. నీకు నమస్కారము.

న యదా రథమాస్థాయ జైత్రం మణిగణార్పితమ్ ।
విస్ఫూర్జచ్చండకోదండో రథేన త్రాసయన్నఘాన్ ॥ 52

స్వసైన్యచరణక్షుణ్ణం వేపయన్మండలం భువః ।
వికర్షన్ బృహతీం సేనాం పర్యటస్యంశుమానివ ॥ 53

తదైవ సేతవస్సర్వే వర్ణాశ్రమనిబంధనాః ।
భగవద్రచితా రాజన్ భిద్యేరన్ బత దస్యుభిః ॥ 54

రాజన్ = ఓ మహారాజా!, యదా = ఏనాడైతే, జైత్రమ్ = జయమునిచ్చే, మణిగణ-అర్పితమ్ = మణుల సమూహములు పొదిగిన, రథమ్ = రథమును, ఆస్థాయ = అధిష్ఠించి, విస్ఫూర్జత్-చండకోదండః = ధ్వనించుచున్న భయంకరమగు ధనస్సు గలవాడవై, రథేన = రథముచే, అఘాన్ = దుష్టులను, త్రాసయన్ = భయపెట్టుచున్నవాడవై, స్వసైన్యచరణక్షుణ్ణమ్ = నీ సైనికుల పాదములచే నలుగకొట్టబడిన, భువః మండలమ్ = భూమండలమును, వేపయన్ = కంపింపజేయుచున్నవాడవై, బృహతీమ్ = పెద్ద, సేనామ్ = సేనను, వికర్షన్ = నడిపించువాడవై, అంశుమాన్ ఇవ = సూర్యుని వలె, న పర్యటసి = పర్యటించవో, తదా ఏవ = అప్పుడే, వర్ణ-ఆశ్రమనిబంధనాః = వర్ణాశ్రమముల నిర్వహణ గల, భగవత్-రచితాః = భగవానునిచే ఏర్పాటు చేయబడిన, సర్వే = అన్ని, సేతవః = ధర్మమర్యాదలు, దస్యుభిః = దుష్టులచే, భిద్యేరన్ బత = భేదించబడును సుమా!

ఓ రాజా! నీవు మణుల గణములు పొదిగిన జయప్రదమగు రథమునెక్కి, ధ్వనించే భయంకరమగు ధనస్సును ధరించి కదిలినప్పుడు, నీ రథమును చూచినంత మాత్రాన పాపులు భయపడెదరు. నీవు సూర్యుని

వలె పెద్ద సేనను నడిపిస్తూ సాగినప్పుడు, నీ సైనికుల పాదముల తొక్కిడికి భూమండలము కంపించును. నీవీ విధముగా పర్యటించనినాడు, వెంటనే వర్ణాశ్రమనిర్వహణకు ఆలంబనమైన భగవన్నిర్మితములగు ధర్మ మర్యాదలు అన్నియు దుష్టులచే చెల్లాచెదరు చేయబడును సుమా!

అధర్మశ్చ సమేధేత లోలుపైర్వ్యంకుశైర్నృభిః ।
శయానే త్వయి లోకోఽయం దస్యుగ్రస్తో వినంక్ష్యతి ।। 55

త్వయి = నీవు, శయానే = ప్రమత్తుడవై యున్నచో, లోలుపైః = భోగలాలసులగు, వ్యంకుశైః = అడ్డు ఆపు లేని, నృభిః = మానవులచే, అధర్మః = అధర్మము, సమేధేత = వర్ధిల్లును, అయమ్ = ఈ, లోకః = లోకము, దస్యుగ్రస్తః = దుష్టులచే ఆక్రమించబడినదై, వినంక్ష్యతి = వినాశమును పొందగలదు.

నీవు ప్రమత్తుడవైనచో, భోగలాలసులగు జనులకు అడ్డు ఆపు ఉండదు. వారి కారణముగా అధర్మము వర్ధిల్లును. దుష్టులగు జనులచే కబళించి వేయబడి ఈ లోకము నశించును.

అథాపి పృచ్ఛే త్వాం వీర యదర్థం త్వమిహాగతః ।
తద్వయం నిర్వ్యలీకేన ప్రతిపద్యామహే హృదా ।। 56

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
ఏకవింశోఽధ్యాయః ।।

వీర = ఓ వీరుడా!, అథ అపి = అయినప్పటికీ, త్వామ్ = నిన్ను, పృచ్ఛే = అడుగుచున్నాను, త్వమ్ = నీవు, ఇహ = ఇచటకు, యదర్థమ్ = దేని కొరకు, ఆగతః = వచ్చినావో, తత్ = దానిని, వయమ్ = మేము, నిర్వ్యలీకేన = కపటము లేని, హృదా = హృదయముతో, ప్రతిపద్యామహే = అంగీకరించెదము.

ఓ వీరా! అయినప్పటికీ, నేను నిన్ను అడుగుచున్నాను. నీవు ఇచటకు వచ్చిన ప్రయోజనమును నేను నిష్కపటమగు హృదయముతో స్వీకరించెదను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
ఇరువది ఒకటవ అధ్యాయము ముగిసినది (**21**).

* * * * *

# అథ ద్వావింశోऽధ్యాయః

## దేవహూతి కర్దముల వివాహము

మైత్రేయ ఉవాచ ।
ఏవమావిష్కృతాశేషగుణకర్మోదయో మునిమ్ ।
సవ్రీడ ఇవ తం సమ్రాడుపారతమువాచ హ ॥ 1

మైత్రేయః = మైత్రేయుడు, ఉవాచ = పలికెను, ఏవమ్ = ఈ విధముగా, ఆవిష్కృత-అశేషగుణకర్మ-ఉదయః = వర్ణించబడిన సకల గుణముల మరియు కర్మల గొప్పదనము గల, సమ్రాట్ = మను చక్రవర్తి, ఉపారతమ్ = విరమించిన, తమ్ = ఆ, మునిమ్ = మహర్షిని గురించి, సవ్రీడః ఇవ = సిగ్గుతో కూడినవాడు వలె, ఉవాచ హ = పలికెనట.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- కర్దమ మహర్షి ఈ విధముగా మను చక్రవర్తియొక్క సకల గుణముల మరియు కర్మల ఉత్కర్షను వర్ణించి విరమించెను. అపుడా మనువు సిగ్గు పడుతున్నట్లుగా ఆయనతో నిట్లనెను.

మనురువాచ ।
బ్రహ్మాసృజత్స్వముఖతో యుష్మానాత్మపరీప్సయా ।
ఛందోమయస్తపోవిద్యాయోగయుక్తానలంపటాన్ ॥ 2

ఛందోమయః = వేదస్వరూపుడగు, బ్రహ్మా = బ్రహ్మగారు, ఆత్మపరీప్సయా = తన వేదవిగ్రహమును పరిరక్షించాలనే కోరికతో, స్వముఖతః = తన ముఖమునుండి, తపోవిద్యాయోగయుక్తాన్ = తపస్సు విద్య మరియు యోగములతో కూడిన, అలంపటాన్ = భోగాసక్తి లేని, యుష్మాన్ = మిమ్ములను, అసృజత్ = సృష్టించెను.

వేదమూర్తియగు బ్రహ్మగారు తన వేదవిగ్రహమును లోకములో ప్రవర్తిల్లజేయాలనే కోరికతో, తపస్సు విద్య మరియు యోగములతో కూడిన మిమ్ములను తన ముఖమునుండి సృష్టించెను. మీకు భోగముల యందు ఆసక్తి లేదు.

తత్త్రాణాయాసృజచ్చాస్మాన్దోస్సహస్రాత్సహస్రపాత్ ।
హృదయం తస్య హి బ్రహ్మ క్షత్రమంగం ప్రచక్షతే ॥ 3

తత్-త్రాణాయ = ఆ బ్రాహ్మణులను రక్షించుట కొరకై, సహస్ర పాత్ = అనంతమగు పాదములు గల ఆ విరాట్ పురుషుడు, దోః-సహస్రాత్ = అనంతములగు భుజములనుండి, అస్మాన్ = మమ్ములను, అసృజత్ = సృష్టించెను, బ్రహ్మ = బ్రాహ్మణుడు, తస్య = ఆ విరాట్ పురుషుని, హృదయమ్ = హృదయమనియు, క్షత్రమ్ = క్షత్రియుడు, అంగమ్ = భుజమని యు, ప్రచక్షతే హి = చెప్పుచున్నారు గదా!

అనంతములగు పాదములు గల విరాట్ పురుషుడు బ్రాహ్మణు లను రక్షించుట కొరకై తన అనంతములగు భుజములనుండి క్షత్రియులను సృష్టించెను. ఆ విరాట్ పురుషునకు బ్రాహ్మణుడు హృదయమనియు, క్షత్రియుడు భుజమనియు మహర్షులు చెప్పుచున్నారు గదా!

అతో హ్యన్యోన్యమాత్మానం బ్రహ్మ క్షత్రం చ రక్షతః ।
రక్షతి స్మావ్యయో దేవస్స యస్సదసదాత్మకః ॥ 4

అతః హి = ఇందువలననే, బ్రహ్మ = బ్రాహ్మణుడు, చ = మరియు, క్షత్రమ్ = క్షత్రియుడు, ఆత్మానమ్ = తనను, అన్యోన్యం చ = ఒకరిని మరియొకరు కూడ, రక్షతః = రక్షించెదరు, సః = ఆ, అవ్యయః = వినాశము లేని, దేవః = పరమేశ్వరుడు, రక్షతి స్మ = రక్షించుచున్నాడు, యః = ఎవడై తే, సత్-అసత్-ఆత్మకః = కార్యకారణరూపుడో.

కావుననే, బ్రాహ్మణుడు క్షత్రియుడు తనను తాను రక్షించుకొను టయే గాక, ఒకరిని మరియొకరు కూడ రక్షించెదరు. వాస్తవములో అవినా శి, కార్యకారణరూపుడు అగు ఆ శ్రీహరియే అందరినీ రక్షించుచున్నాడు.

తవ సందర్శనాదేవ ఛిన్నా మే సర్వసంశయాః ।
యత్స్వయం భగవాన్ ప్రీత్యా ధర్మమాహ రిరక్షిషోః ॥ 5

తవ = నీ, సందర్శనాత్ ఏవ = దర్శనమాత్రము వలన, మే = నా, సర్వసంశయాః = అన్ని సందేహములు, ఛిన్నాః = తొలగిపోయినవి, యత్ = ఏలయనగా, భగవాన్ = పూజ్యుడవగు నీవు, స్వయమ్ = స్వయముగా, రిరక్షిషోః = ప్రజలను రక్షించగోరే నాకు, ధర్మమ్ = ధర్మమును, ఆహ = చెప్పితివో.

నిన్ను చూచినంతనే నా సందేహములన్నియు తొలగిపోయినవి. ఏలయనగా, ప్రజలను రక్షించగోరే నాకు పూజ్యుడవగు నీవు స్వయముగా రాజధర్మములను వర్ణించి చెప్పితివి.

దిష్ట్యా మే భగవాన్ దృష్టో దుర్దర్శో యోఽకృతాత్మనామ్ ।
దిష్ట్యా పాదరజస్స్పృష్టం శీర్ష్ణా మే భవతశ్శివమ్ ॥ 6

యః = ఏ నీవు, అకృత-ఆత్మనామ్ = వశము చేసుకొనబడని మనస్సు గలవారికి, దుర్దర్శః = చూడ శక్యము కానివాడవో, భగవాన్ = పూజ్యుడవగు అట్టి నీవు, దిష్ట్యా = దైవవశముచే, మే = నాకు, దృష్టః = కనబడితివి, దిష్ట్యా = దైవవశముచే, మే = నా, శీర్ష్ణా = శిరస్సుచే, భవతః = నీ, శివమ్ = మంగళకరమగు, పాదరజః = పాదముల ధూళి, స్పృష్టమ్ = స్పృశించబడినది.

మనోజయము లేనివారికి నీవు కానరావు. దైవవశముచే నీవు నాకు కనబడితివి. నేను దైవవశముచే పూజ్యుడవగు నీ మంగళకరమగు పాదధూళిని తలపై దాల్చితిని.

దిష్ట్యా త్వయానుశిష్టోఽహం కృతశ్చానుగ్రహో మహాన్ ।
అపావృతైః కర్ణరంధ్రైర్జుష్టా దిష్ట్యోశతీర్గిరః ॥ 7

దిష్ట్యా = దైవవశముచే, అహమ్ = నేను, త్వయా = నీచే, అనుశిష్టః = బోధించబడితిని, చ = మరియు, మహాన్ = గొప్ప, అనుగ్రహః = అనుగ్రహము, కృతః = చేయబడినది, దిష్ట్యా = దైవవశముచే, అపావృతైః = తెరువ

బడిన, కర్ణరంధ్రైః = చెవి రంధ్రములచే, ఉశతీః = మనోహరములగు, గిరః = వచనములు, జుష్టాః = సేవించబడినవి.

దైవవశముచే నీవు గొప్ప అనుగ్రహమును చూపి నాకు ధర్మమును ఉపదేశించితివి. నేను దైవవశముచే చెవులను అప్పజెప్పి నీ మనోహరములగు మాటలను వింటిని.

స భవాన్ దుహితృస్నేహపరిక్లిష్టాత్మనో మమ ।
శ్రోతుమర్హసి దీనస్య శ్రావితం కృపయా మునే ॥ 8

మునే = ఓ మహర్షీ!, సః = అట్టి, భవాన్ = నీవు, దుహితృస్నేహపరిక్లిష్ట-ఆత్మనః = కుమార్తెయందలి ప్రేమచే వ్యాకులమైన మనస్సు గల, దీనస్య = దీనుడనగు, మమ = నా, శ్రావితమ్ = విన్నపమును, కృపయా = దయతో, శ్రోతుమ్ = వినుటకు, అర్హసి = తగుదువు.

ఓ మహర్షీ! అట్టి నీవు దీనుడనగు నా విన్నపమును దయతో వినదగుదువు. కుమార్తెయందలి ప్రేమచే నా మనస్సు వ్యాకులమై యున్నది.

ప్రియవ్రతోత్తానపదోస్స్వసేయం దుహితా మమ ।
అన్విచ్ఛతి పతిం యుక్తం వయశ్శీలగుణాదిభిః ॥ 9

ప్రియవ్రత-ఉత్తానపదోః = ప్రియవ్రత ఉత్తానపాదుల, స్వసా = చెల్లెలు, మమ = నా; దుహితా = కుమార్తె అగు, ఇయమ్ = ఈమె, వయః-శీల గుణ-ఆదిభిః = వయస్సు శీలము గుణములు మొదలగు వాటిచే, యుక్తమ్ = యోగ్యుడగు, పతిమ్ = భర్తను, అన్విచ్ఛతి = పొంద గోరుచున్నది.

ఈమె నా కుమార్తె; ప్రియవ్రత ఉత్తానపాదులకు సోదరి. ఈమె వయస్సు శీలము గుణములు మొదలగు వాటిలో తనకు తగిన భర్తను పొందగోరుచున్నది.

యదా తు భవతశ్శీలశ్రుతరూపవయోగుణాన్ ।
అశృణోన్నారదాదేషా త్వయ్యాసీత్కృతనిశ్చయా ॥ 10

ఏషా = ఈమె, యదా = ఏ కాలములోనైతే, భవతః = నీ, శీలశ్రుత రూపవయోగుణాన్ = శీలము విద్య రూపము వయస్సు గుణము అనువాటిని గురించి, నారదాత్ = నారదుని వలన, అశృణోత్ = విన్నదో అప్పటి నుండియు, త్వయి తు = నీయందైతే, కృతనిశ్చయా = చేయబడిన నిశ్చయము గలది.

నీ శీలము విద్య రూపము వయస్సు గుణములను గురించి ఈమె నారదుని వద్ద విన్నప్పటినుండియు, నిన్నే భర్తగా పొందాలనే నిశ్చయమును చేసుకున్నది.

తత్ప్రతీచ్ఛ ద్విజాగ్ర్యేమాం శ్రద్ధయోపహృతాం మయా ।
సర్వాత్మనానురూపాం తే గృహమేధిషు కర్మసు ॥ 11

ద్విజ-అగ్ర్య = ఓ బ్రాహ్మణ శ్రేష్ఠా!, తత్ = అందువలన, మయా = నాచే, శ్రద్ధయా = శ్రద్ధతో, ఉపహృతామ్ = నీవద్దకు తీసుకురాబడినట్టియు, తే = నీకు, గృహమేధిషు = గృహాశ్రమమునకు చెందిన, కర్మసు = కర్మలయందు, సర్వాత్మనా = అన్ని విధములుగా, అనురూపామ్ = యోగ్యురాలైన, ఇమామ్ = ఈమెను, ప్రతీచ్ఛ = స్వీకరించుము.

ఓ బ్రాహ్మణ శ్రేష్ఠా! నీకు గృహస్థాశ్రమ కర్మలయందు ఈమె అన్ని విధములుగా యోగ్యురాలు. నేనీమెను నీకు శ్రద్ధతో సమర్పించుచున్నాను.
న, ఈమెను నీవు స్వీకరించుము.

ఉద్యతస్య హి కామస్య ప్రతివాదో న శస్యతే ।
అపి నిర్ముక్తసంగస్య కామరక్తస్య కిం పునః ॥ 12

ఉద్యతస్య = తనంత తానుగా లభించిన, కామస్య = భోగమునకు, ప్రతివాదః = నిరాకరించుట, నిర్ముక్తసంగస్య అపి = విరక్తునకైననూ, న శస్యతే = మంచిది కాదు, కామరక్తస్య = భోగములయందు ప్రీతి గలవానికి, కిం పునః = మంచిది కాదని వేరుగా చెప్పవలయునా?

తనంత తానుగా సంప్రాప్తమైన భోగమును నిరాకరించుట విరక్తున కైననూ శోభనీయదు. భోగములయందు ప్రీతి గలవానికి అట్లు చేయుట మంచిది కాదని వేరుగా చెప్పవలయునా?

యు ఉద్యతమనాదృత్య కీనాశమభియాచతే ।
క్షీయతే తద్యశః స్ఫీతం మానశ్చావజ్ఞయా హతః ॥ 13

యః = ఎవడైతే, ఉద్యతమ్ = తనంత తానుగా లభించిన భోగమును, అనాదృత్య = తిరస్కరించి, కీనాశమ్ = లుబ్ధుని, అభియాచతే = యాచించునో, స్ఫీతమ్ = ఉజ్జ్వలమైన, తత్-యశః = వాని కీర్తి క్షీయతే = క్షీణించును, చ = మరియు, మానః = అభిమానము, అవజ్ఞయా = అవమానముచే, హతః = నష్టమగును.

ఎవడైతే తనంత తానుగా సంప్రాప్తమైన భోగమును కాదని తరువాత లుబ్ధుని యాచించునో, వాని ఉజ్జ్వలమగు కీర్తి నశించును; అవమానముచే వాని అభిమానము వినష్టమగును.

అహం త్వాశృణవం విద్వన్ వివాహార్థం సముద్యతమ్
అతస్త్వముపకుర్వాణః ప్రత్తాం ప్రతిగృహాణ మే ॥ 14

విద్వన్ = ఓ విద్వాంసుడా!, త్వా = నిన్ను, వివాహార్థమ్ = వివాహము కొరకు, సముద్యతమ్ = ప్రయత్నము చేయుచున్నవానినిగా, అహమ్ = నేను, అశృణవమ్ = వినియుంటిని, అతః = ఇందువలన, ఉపకుర్వాణః = వివాహము వరకు మాత్రమే బ్రహ్మచర్యమును కలిగియున్న, త్వమ్ = నీవు, మే = నా, ప్రత్తామ్ = ఈయబడిన కన్యను, ప్రతిగృహాణ = స్వీకరించుము.

ఓ విద్వాంసుడా! నీవు వివాహమునకు ప్రయత్నము చేయుచున్నావని నేను వినియుంటిని. అనగా, నీవు బ్రహ్మచర్యమును విడిచిపెట్టి గృహాశ్రమములోనికి అడుగు పెట్టబోవుచున్నావు. కావుననే, నా కుమార్తెను నీకిచ్చి వివాహమును చేసెదను; స్వీకరించుము.

ఋషిరువాచ ।

బాఢముద్వోఢుకామోఽహమప్రత్తా చ తవాత్మజా ।
ఆవయోరనురూపోఽసావాద్యో వైవాహికో విధిః ॥ 15

బాఢమ్ = నిజమే, అహమ్ = నేను, ఉద్వోఢుకామః = వివాహమాడాలనే కోరిక గలవాడనే, చ = మరియు, తవ = నీ, ఆత్మజా = కుమార్తె, అప్రత్తా = మరియొకనితో వివాహము నిశ్చయమైన యువతి కాదు, అసౌ = ఈ, ఆవయోః = మా యిద్దరి, వైవాహికః = వివాహమునకు సంబంధించిన, ఆద్యః = మొదటి, విధిః = విధానము, అనురూపః = యోగ్యమైనది.

కర్దమ మహర్షి ఇట్లు పలికెను --- నిజమే; నేను వివాహమును చేసుకోవాలనే అనుకుంటున్నాను. మీ అమ్మాయికి మరియొకనితో వివాహము నిశ్చయము కాలేదు గనుక, మా యిద్దరి ఈ వివాహము యోగ్యముగా నుండును. వివాహములలో బ్రాహ్మ వివాహము (పెద్దలు నిశ్చయించిన పెళ్లి) మొదటిది, శ్రేష్ఠమైనది.

కామస్స భూయాన్నరదేవ తేఽస్యాః
పుత్ర్యాస్సమామ్నాయవిధౌ ప్రతీతః ।
క ఏవ తే తనయాం నాద్రియేత
స్వయైవ కాంత్యా క్షిపతీమివ శ్రియమ్ ॥ 16

నరదేవ = ఓ మహారాజా!, అస్యాః = ఈ, తే = నీ, పుత్ర్యాః = కుమార్తెయొక్క, కామః = ఇచ్ఛగించబడిన, సః = ఆ వివాహము, సమామ్నాయవిధౌ = వేదోక్తమగు వివాహవిధియందు, ప్రతీతః = ప్రసిద్ధమైనది, భూయాత్ = అగుగాక!, స్వయా ఏవ = తనదైన, కాంత్యా = కాంతిచే, శ్రియమ్ = లక్ష్మీదేవిని, క్షిపతీం ఇవ = తిరస్కరించుచున్నదివలె నున్న, తే = నీ, తనయామ్ = కుమార్తెను, కః ఏవ = ఎవ్వాడు, న ఆద్రియేత = స్వీకరించకుండును?

ఓ మహారాజా! ఈ నీ కుమార్తె వేదములో ప్రసిద్ధమైన విధానములో వివాహమాడవలెనని కోరుచున్నది. నీవు కూడ అటులనే కోరుచు

న్నావు. ఆ కోరిక తీరుగాక! నీ కుమార్తె తన శోభతో లక్ష్మీదేవిని మించి యున్నది. ఆమెను వివాహమాడుటకు ఎవడు కాదనును?

యాం హర్మ్యపృష్ఠే క్వణదంఘ్రిశోభాం
విక్రీడతీం కందుకవిహ్వలాక్షీమ్ ।
విశ్వావసుర్న్యపతత్స్వాద్విమానాత్
విలోక్య సమ్మోహవిమూఢచేతాః ॥ 17

హర్మ్యపృష్ఠే = ప్రాసాదముయొక్క పై భాగమునందు, విక్రీడతీమ్ = ఆడుచున్నట్టియు, క్వణత్-అంఘ్రిశోభామ్ = ధ్వనిని చేయుచున్న పాదముల శోభను కలిగినట్టియు, కందుకవిహ్వల-అక్షీమ్ = బంతియందు వ్యాకులముగానున్న చూపు గల, యామ్ = ఏ దేవహూతిని, విలోక్య = చూచి, సమ్మోహవిమూఢచేతాః = సమ్మోహముచే వ్యాకులమైన మనస్సు గల, విశ్వావసుః = గంధర్వుడు, స్వాత్ = తన, విమానాత్ = విమానము నుండి, న్యపతత్ = క్రింద పడెనో.

ఈమె ప్రాసాదమునకు పైభాగమునందు బంతిని ఆడుచుండెను. ఆమె పాదములు నూపురముల ధ్వనితో గూడి శోభిల్లెను. ఆమె చూపులు బంతి వెనుక పరుగెడుతూ చాల వ్యాకులముగా నుండెను. ఆకాశములో విమానమునుండి గంధర్వుడు అట్టి ఈమె సౌందర్యమును చూచి సమ్మోహితుడై, స్పృహ తప్పి క్రింద బడెను.

తాం ప్రార్థయంతీం లలనాలలామ-
మసేవితశ్రీచరణైరదృష్టామ్ ।
వత్సాం మనోరుచ్చపదస్స్వసారం
కో నానుమన్యేత బుధోఽభియాతామ్ ॥ 18

ప్రార్థయంతీమ్ = భర్తగా కోరుచున్నట్టియు, లలనాలలామమ్ = స్త్రీలకు అలంకారమైనట్టియు, అసేవితశ్రీచరణైః = సేవించబడని లక్ష్మీదేవి యొక్క పాదములు గలవారిచే, అదృష్టామ్ = కనబడనట్టియు, మనోః = మనుచక్రవర్తియొక్క, వత్సామ్ = ముద్దుల పట్టి అయినట్టియు, ఉచ్చపదః

= ఉత్తానపాదుని, స్వసారమ్ = సోదరి యైనట్టియు, అభియాతామ్ = స్వయముగా వచ్చియున్న, తామ్ = ఆమెను, బుధః = తెలివైనవాడు, కః = ఎవడు, న అనుమన్యేత = అంగీకరించకుండును?

స్త్రీలకే అలంకారమనదగిన ఈమెను లక్ష్మీదేవి పాదములనారాధించనివారు కనలేరు. మనువుయొక్క ముద్దుల పట్టి, ఉత్తానపాదుని సోదరియగు ఈమె ఏరి కోరి స్వయముగా వచ్చినది. అట్టి ఈమెను తెలివైన వాడు ఎవడు అంగీకరించకుండును?

అతో భజిష్యే సమయేన సాధ్వీం
యావత్తేజో బిభృయాదాత్మనో మే ।
అతో ధర్మాన్ పారమహంస్యముఖ్యాన్
శుక్లప్రోక్తాన్ బహు మన్యేఽవిహింస్రాన్ ॥ 19

అతః = కావున, సాధ్వీమ్ = సాధ్వియగు ఈమెను, సమయేన = నియమముతో, భజిష్యే = స్వీకరించగలను, యావత్ = ఎంతవరకైతే, మే = నా, ఆత్మనః = దేహమునుండి, తేజః = తేజస్సును, బిభృయాత్ = ధరించునో, అతః = ఆపైన, శుక్లప్రోక్తాన్ = భగవంతునిచే ఉపదేశింపబడినట్టియు, అవిహింస్రాన్ = హింసాసంబంధము లేనట్టియు, పారమహంస్యముఖ్యాన్ = సన్న్యాసాశ్రమమునందు ప్రధానముగా పాటించబడే, ధర్మాన్ = ధర్మములను, బహుమన్యే = అధికమహత్త్వమునిచ్చెదను.

కావున, ఈ సాధ్విని నేను స్వీకరించెదను. కాని, ఒక నియమము గలదు. నేను ఈమెతో సంతానము కలుగువరకు గృహాశ్రమమును నెరపెదను. తరువాత, సన్న్యాసమును స్వీకరించి ఆ ఆశ్రమధర్మములను పాటించెదను. హింసతో సంబంధము లేని ఆ శమదమాది ధర్మములను భగవానుడే స్వయముగా ఉపదేశించెను.

యతోఽభవద్విశ్వమిదం విచిత్రం
సంస్థాస్యతే యత్ర చ వావతిష్ఠతే ।
ప్రజాపతీనాం పతిరేష మహ్యం

పరం ప్రమాణం భగవాననంతః ।। 20

ఇదమ్ = ఈ, విచిత్రమ్ = అనేకభేదములతో గూడిన, విశ్వమ్ = జగత్తు, యతః = ఏ పరమేశ్వరునినుండి, అభవత్ = ప్రకటమైనదో, యత్ర చ = ఏ పరమేశ్వరునియందే, సంస్థాస్యతే = విలీనము కాగలదో, అవతిష్ఠతే వా = ఇప్పుడు నిలిచియున్నదో, ప్రజాపతీనామ్ = ప్రజాపతులకు, పతిః = ప్రభువగు, ఏషః = ఈ, అనంతః భగవాన్ పరమ్ = అనంత భగవానుడు మాత్రమే, మహ్యమ్ = నా కొరకు, ప్రమాణమ్ = ప్రమాణము.

అనేకభేదములతో కూడిన ఈ జగత్తు ఆ అనంత భగవానునినుండి ప్రకటమై, ఆయనయందే స్థితిని కలిగి, ఆయనయందే విలీనము కాగలదు. ప్రజాపతులకు కూడ ప్రభువగు ఈ భగవానుడే నాకీ విషయములో ప్రమాణము. నేను ఆయన ఆదేశమును మాత్రమే పాటించుచున్నాను.

మైత్రేయ ఉవాచ ।
స ఉగ్రధన్వన్నియదేవాబభాషే
ఆసీచ్చ తూష్ణీమరవిందనాభమ్ ।
ధియోపగృహ్ణన్ స్మితశోభితేన
ముఖేన చేతో లులుభే దేవహూత్యాః ।। 21

ఉగ్రధన్వన్ = ఓ విదురా!, సః = ఆ కర్దముడు, ఇయత్ ఏవ = ఇంత మాత్రమే, ఆబభాషే = పలికెను, చ = మరియు, అరవిందనాభమ్ = పద్మ నాభుని, ధియా = బుద్ధిచే, ఉపగృహ్ణన్ = స్మరించుచున్నవాడై, తూష్ణీం ఆసీత్ = మిన్నకుండెను, స్మితశోభితేన = చిరునవ్వుతో శోభిల్లే, ముఖేన = ముఖముతో, దేవహూత్యాః = దేవహూతియొక్క, చేతః = మనస్సును, లులుభే = దోచివేసెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఓ విదురా! ఆ కర్దముడు ఇంతమాత్రమే పలికి మిన్నకుండి, పద్మనాభుని మనస్సులో ధ్యానించు చుండెను. చిరునవ్వుతో శోభిల్లే ఆయన ముఖము దేవహూతి హృదయ మును దోచివేసెను.

సోఽనుజ్ఞాత్వా వ్యవసితం మహిష్యా దుహితుః స్ఫుటమ్ ।
తస్మై గుణగణాఢ్యాయ దదౌ తుల్యాం ప్రహర్షితః ॥ 22

సః = ఆ మనువు, మహిష్యాః = భార్యయొక్క, దుహితుః = కుమార్తెయొక్క, వ్యవసితమ్ = నిశ్చయమును, స్ఫుటమ్ = స్పష్టముగా, అనుజ్ఞాత్వా = తెలుసుకున్నవాడై, ప్రహర్షితః = గొప్ప హర్షమును పొందినవాడై, గుణగణ-ఆఢ్యాయ = సద్గుణ సముదాయములచే సంపన్నుడైన, తస్మై = ఆ కర్దముని కొరకు, తుల్యామ్ = సమానమగు గుణములు గల కుమార్తెను, దదౌ = ఇచ్చెను.

ఆ మనువు తన భార్యను, కుమార్తెను సంప్రదించి వారి స్పష్టమగు అంగీకారమును పొంది గొప్పగా ఆనందించెను. కర్దముడు సకలసద్గుణములకు నిలయము. దేవహూతి కూడ అంతే. మనువు ఆమెను ఆయనకిచ్చి వివాహమును జరిపించెను.

శతరూపా మహారాజ్ఞీ పారిబర్హాన్మహాధనాన్ ।
దంపత్యోః పర్యదాత్ప్రీత్యా భూషావాసఃపరిచ్ఛదాన్ ॥ 23

మహారాజ్ఞీ = మహారాణియగు, శతరూపా = శతరూప, దంపత్యోః = దంపతులకు ఇద్దరికి, ప్రీత్యా = ప్రేమతో, మహాధనాన్ = మిక్కిలి విలువైన, భూషావాసఃపరిచ్ఛదాన్ = భూషణములను వస్త్రములను ఇంటి సామగ్రిని, పారిబర్హాన్ = పెళ్లి కానుకలుగా, పర్యదాత్ = ఇచ్చెను.

మహారాణియగు శతరూప ఆ కొత్త దంపతులకు మిక్కిలి విలువైన భూషణములను, వస్త్రములను, ఇంటి సామగ్రిని పెళ్లికానుకలుగా ప్రేమతో ఇచ్చెను.

ప్రత్తాం దుహితరం సమ్రాట్ సదృక్షాయ గతవ్యథః ।
ఉపగుహ్య చ బాహుభ్యామౌత్కంఠ్యోన్మథితాశయః ॥ 24

గతవ్యథః = తొలగిపోయిన చింతగల, సమ్రాట్ = మను చక్రవర్తి, సదృక్షాయ = యోగ్యుడగు వరుని కొరకు, ప్రత్తామ్ = ఇచ్చి వివాహము చేయబడిన, దుహితరమ్ = కుమార్తెను, బాహుభ్యామ్ = రెండు చేతులతో,

ఉపగుహ్య = కౌగిలించుకొని, ఔత్కంఠ్య-ఉన్మథిత-ఆశయః = ఉత్కంఠచే విహ్వాలమైన మనస్సు గలవాడాయెను.

మను చక్రవర్తి కుమార్తెను యోగ్యుడగు వరునకిచ్చి వివాహమును చేసి నిశ్చింతగా నుండెను. కాని, విరహోత్కంఠచే వ్యాకులమైన మనస్సుతో ఆయన కుమార్తెను రెండు చేతులతో కౌగిలించుకొనెను.

అశక్నువంస్తద్విరహం ముంచన్ బాష్పకలాం ముహుః ।
ఆసించదంబ వత్సేతి నేత్రోదైర్దుహితుశ్శిఖాః ॥ 25

తత్-విరహమ్ = ఆమెయొక్క విరహమును, అశక్నువన్ = సహించలేనివాడై, ముహుః = మాటిమాటికీ, బాష్పకలామ్ = కన్నీటి బిందువును, ముంచన్ = విడిచిపెట్టుచున్నవాడై, అంబ = అమ్మా!, వత్సే = అమ్మాయీ!, ఇతి = అని, నేత్ర-ఉదైః = కన్నీళ్లతో, దుహితుః = కుమార్తెయొక్క, శిఖాః = కేశములను, ఆసించత్ = తడిపివేసెను.

మను చక్రవర్తి కుమార్తెయొక్క విరహమును సహించలేకపోయెను. ఆయన అదే పనిగా కన్నీటిని విడుచుచుండెను. తల్లీ! అమ్మాయీ! అంటూ ఆయన ఆమె కేశములను తన కన్నీళ్లతో తడిపి వేసెను.

ఆమంత్ర్య తం మునివరమనుజ్ఞాతస్సహానుగః ।
ప్రతస్థే రథమారుహ్య సభార్యస్స్వపురం నృపః ॥ 26

నృపః = మను చక్రవర్తి, తమ్ = ఆ, మునివరమ్ = మహర్షిని, ఆమంత్ర్య = అడిగి, అనుజ్ఞాతః = అనుమతి ఈయబడినవాడై, సహ-అనుగః = అనుచరులతో కూడినవాడై, సభార్యః = భార్యతో కూడినవాడై, రథమ్ = రథమును, ఆరుహ్య = ఎక్కి, స్వపురమ్ = తన నగరమును గురించి, ప్రతస్థే = బయలు దేరెను.

మను చక్రవర్తి ఆ మహర్షిని అడిగి సెలవు తీసుకొని తన భార్య, అనుచరులు వెంటరాగా రథముపై తన నగరమునకు బయలు దేరెను.

ఉభయోరృషికుల్యాయాస్సరస్వత్యాస్సురోధసోః ।

ఋషీణాముపశాంతానాం పశ్యన్నాశ్రమసంపదః ॥ 27

ఋషికుల్యాయాః = ఋషిగణములచే సేవించబడే, సరస్వత్యాః = సరస్వతీ నదియొక్క, ఉభయోః = రెండు, సురోధసోః = అందమైన తీరములయందు, ఉపశాంతానామ్ = నివృత్తిపరాయణులగు, ఋషీణామ్ = మహర్షుల, ఆశ్రమసంపదః = ఆశ్రమముల ప్రకృతిసంపదను, పశ్యన్ = చూచుచున్నవాడై (వెళ్లెను).

సరస్వతీనదిని మహర్షులు సేవించుచుందురు. దాని సుందరమగు రెండు తీరముల వెంబడి ప్రకృతిసంపదతో శోభిల్లే నివృత్తిపరాయణులగు మహర్షుల ఆశ్రమములు గలవు. మను చక్రవర్తి వాటి శోభను తిలకిస్తూ పయనించెను.

తమాయాంతమభిప్రేత్య బ్రహ్మావర్తాత్ప్రజాః పతిమ్ ।
గీతసంస్తుతివాదిత్రైః ప్రత్యుదీయుః ప్రహర్షితాః ॥ 28

తమ్ = ఆ, పతిమ్ = మహారాజును, ఆయాంతమ్ = వచ్చుచున్నవానినిగా, అభిప్రేత్య = తెలుసుకొని, ప్రజాః = జనులు, ప్రహర్షితాః = గొప్ప హర్షమును పొందినవారై, బ్రహ్మావర్తాత్ = బ్రహ్మావర్తమునుండి, గీతసంస్తుతివాదిత్రైః = గీతములు స్తోత్రములు వాద్యములతో, ప్రత్యుదీయుః = ఎదురేగిరి.

ఆ మహారాజు వచ్చుచున్నాడనే విషయము తెలిసి జనులు గొప్ప హర్షమును పొందినవారై, బ్రహ్మావర్తమునుండి గీతములు స్తోత్రములు వాద్యములతో ఆయనకు ఎదురేగిరి.

బర్హిష్మతీ నామ పురీ సర్వసంపత్సమన్వితా ।
న్యపతన్ యత్ర రోమాణి యజ్ఞస్యాంగం విధున్వతః ॥ 29

సర్వసంపత్-సమన్వితా = అన్ని సంపదలతో కూడియున్న, బర్హిష్మతీ నామ = బర్హిష్మతి అని ప్రసిద్ధిని గాంచిన, పురీ = నగరము గలదు, యత్ర = ఎక్కడనైతే, అంగమ్ = శరీరమును, విధున్వతః = విదల్చుచున్న,

యజ్ఞస్య = యజ్ఞ వరాహమూర్తియొక్క, రోమాణి = రోమములు, న్యపతన్ = పడినవో.

అన్ని సంపదలతో నిండిన బర్హిష్మతీ నగరము మనువుయొక్క ప్రసిద్ధమైన రాజధాని. యజ్ఞ వరాహమూర్తి తన శరీరమును విదల్చినప్పుడు ఆయన రోమములు అక్కడ పడినవి.

కుశాః కాశాస్త ఏవాసన్ శశ్వద్ధరితవర్చసః ।
ఋషయో యైః పరాభావ్య యజ్ఞఘ్నాన్ యజ్ఞమీజిరే ॥ 30

తే ఏవ = ఆ రోమములే, శశ్వత్-హరితవర్చసః = అన్ని కాలములలో పచ్చని ప్రకాశము గల, కుశాః = దర్భలు, కాశాః = రెల్లు, ఆసన్ = అయినవి, ఋషయః = మహర్షులు, యైః = వేటిచే, యజ్ఞఘ్నాన్ = యజ్ఞములను పాడుచేసే రాక్షసులను, పరాభావ్య = పరాభవించి, యజ్ఞమ్ = యజ్ఞమును (పరమేశ్వరుని), ఈజిరే = చేసిరో (ఆరాధించిరో).

ఆ రోమములే అన్ని కాలములలో పచ్చగా ఉండే దర్భలు, రెల్లు ఆయెను. మహర్షులు వాటితో యజ్ఞమునకు విఘ్నమును కలిగించే రాక్షసులను తరిమికొట్టి యజ్ఞమును చేసి, శ్రీహరిని ఆరాధించిరి.

కుశకాశమయం బర్హిరాస్తీర్య భగవాన్మనుః ।
అయజద్యజ్ఞపురుషం లబ్ధ్వా స్థానం యతో భువమ్ ॥ 31

భగవాన్ = పూజ్యుడగు, మనుః = మను చక్రవర్తి, కుశకాశమయమ్ = దర్భలు రెల్లుతో కూడిన, బర్హిః = ఆసనమును, ఆస్తీర్య = పరిచి, యతః = ఏ వరాహ భగవానునినుండి, భువమ్ = భూమిని, స్థానమ్ = స్థానముగా, లబ్ధ్వా = పొంది, యజ్ఞపురుషమ్ = యజ్ఞపురుషుడగు శ్రీహరిని, అయజత్ = ఆరాధించెనో.

పూజ్యుడగు మనుచక్రవర్తి వరాహ భగవానునినుండి భూమి అనే నివాసస్థానమును పొంది, ఈ స్థానములో దర్భలు రెల్లుతో కూడిన ఆసనమును పరిచి, యజ్ఞపురుషుడగు శ్రీహరిని ఆరాధించెను.

బర్హిష్మతీం నామ విభుర్యాం నివిశ్య సమావసత్ ।
తస్యాం ప్రవిష్టో భవనం తాపత్రయవినాశనమ్ ॥ 32

బర్హిష్మతీం నామ = బర్హిష్మతి అని ప్రసిద్ధికెక్కిన, యామ్ = ఏ పురమును, సమావిశత్ = నివసించెనో, విభుః = మను చక్రవర్తి, నివిశ్య = ప్రవేశించి, తస్యామ్ = ఆ పురమునందు, తాపత్రయవినాశనమ్ = మూడు విధముల తాపములను పోగొట్టే, భవనమ్ = భవనమును, ప్రవిష్టః = ప్రవేశించెను.

ఆ స్థానమే బర్హిష్మతీ నగరము. దానియందే మనుప్రభువు అప్పటి నుండియు నివసించుచుండెను. ఇప్పుడు ఆయన ఆ నగరమును చేరుకొని, మూడు విధముల తాపమును పోగొట్టే తన భవనమును ప్రవేశించెను.

సభార్యస్సప్రజః కామాన్ బుభుజేఽన్యావిరోధతః ।
సంగీయమానసత్కీర్తిస్సస్త్రీభిస్సురగాయకైః ।
ప్రత్యూషేష్వనుబద్ధేన హృదా శృణ్వన్ హరేః కథాః ॥ 33

సస్త్రీభిః = అప్సరసలతో కూడియున్న, సురగాయకైః = గంధర్వులచే, సంగీయమానసత్కీర్తిః = బాగా గానము చేయబడుచున్న మంచి కీర్తిగల మనువు, ప్రత్యూషేషు = ప్రాతఃకాలములయందు, అనుబద్ధేన = భక్తితో నిండిన, హృదా = హృదయముతో, హరేః = శ్రీహరియొక్క, కథాః = కథలను, శృణ్వన్ = వినుచున్నవాడై, సభార్యః = భార్యతో గూడినవాడై, సప్రజః = సంతానముతో కూడినవాడై, అన్య-అవిరోధతః = ధర్మార్థమోక్షములకు విరోధము లేకుండా, కామాన్ = కామములను, బుభుజే = భోగించెను.

ఆ మనుచక్రవర్తి అచట తన భార్యతో పిల్లలతో గూడి/ధర్మార్థమోక్షములకు విరోధము లేని విధముగా భోగములననుభవించెను. ఆయన సత్కీర్తిని అప్సరసలు, గంధర్వులు చక్కగా గానము చేసెడివారు. కాని, ఆయన ప్రాతఃకాలములయందు భక్తితో నిండిన హృదయముతో శ్రీహరి యొక్క గాథలను వినెడివాడు.

నిష్ణాతం యోగమాయాసు మునిం స్వాయంభువం మనుమ్।

యదా భ్రంశయితుం భోగా న శేకుర్భగవత్పరమ్ ॥ 34

యత్ = ఏ కారణముచే, యోగమాయాసు = స్వేచ్ఛచే భోగములను సృష్టించుటయందు, నిష్ణాతమ్ = నిపుణుడైనట్టియు, మునిమ్ = మననశీలుడైనట్టియు, స్వాయంభువమ్ = స్వయంభువుని పుత్రుడైనట్టియు, భగవత్-పరమ్ = భగవత్పరాయణుడైన, మనుమ్ = మను చక్రవర్తిని, భోగాః = భోగములు, అ = కొంచెమైననూ, భ్రంశయితుమ్ = చలింపజేయుటకు, న శేకుః = సమర్థములు కాలేదో.

కావుననే, తన ఇచ్ఛచే భోగములను సృష్టించుటయందు నిపుణుడైననూ మననశీలుడగు స్వాయంభువ మనువు భగవత్పరాయణుడుగనే యుండెను. ఆయనను భోగములు కొంచెమైననూ చలింప జేయుటకు సమర్థములు కాలేదు.

అయాతయామాస్తస్యాసన్ యామాస్స్వాంతరయాపనాః ।
శృణ్వతో ధ్యాయతో విష్ణోః కుర్వతో బ్రువతః కథాః ॥ 35

విష్ణోః = శ్రీహరియొక్క, కథాః = గాథలను, శృణ్వతః = వినుచున్నట్టియు, ధ్యాయతః = ధ్యానించుచున్నట్టియు, కుర్వతః = సేవను చేయుచున్నట్టియు, బ్రువతః = చెప్పుచున్న, తస్య = ఆయనకు, స్వ-అంతర యాపనాః = తన పాలనాకాలమును చెల్లింపజేసే, యామాః = జాములు, అయాతయామాః = సఫలములు, ఆసన్ = అయినవి.

ఆయన శ్రీహరియొక్క గాథలను వింటూ, చెప్తూ, శ్రీహరినే ధ్యానిస్తూ, శ్రీహరిని సేవిస్తూ ఉండెడివాడు. ఈ విధముగా ఆయన మన్వంతరములోని జాములు అన్నీ ఆయనకు సఫలములే అయినవి.

స ఏవం స్వాంతరం నిన్యే యుగానామేకసప్తతిమ్ ।
వాసుదేవప్రసంగేన పరిభూతగతిత్రయః ॥ 36

వాసుదేవప్రసంగేన = శ్రీహరియొక్క ప్రసంగముచే, పరిభూతగతిత్రయః = తిరస్కరించబడిన మూడు అవస్థలు మూడు గుణములు మరియు మూడు తాపములు గల, సః = ఆ మనువు, ఏవమ్ = ఈ విధము

గా, స్వ-అంతరమ్ = తన మన్వంతరమగు, యుగానాం ఏకసప్తతిమ్ = డెబ్బది ఒక్క మహాయుగములను, నిన్యే = గడిపెను.

ఆ మనువు ఈ విధముగా వాసుదేవుని ప్రసంగముచే జాగ్రత్తు స్వప్నము సుషుప్తి అనే మూడు అవస్థలను, ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదై వికములనే మూడు తాపములను జయించి, సత్త్వరజస్తమోగుణములకు అతీతమైన స్థితిని పొందెను. ఆయన ఈ విధముగా తన మన్వంతర కాల మగు డెబ్బది ఒక్క మహాయుగములను గడిపివేసెను.

శారీరా మానసా దివ్యా వైయాసే యే చ మానుషాః ।
భౌతికాశ్చ కథం క్లేశా బాధంతే హరిసంశ్రయమ్ ॥ 37

వైయాసే = ఓ వ్యాసపుత్రా!, శారీరాః = శరీరమునకు సంబంధించి నవి, మానసాః = మనస్సునకు చెందినవి, దివ్యాః = దైవమునకు సంబంధిం చినవి, చ = మరియు, యే = ఏ, మానుషాః = మానవకృతములైనవి, భౌతికాః చ = ఆధిభౌతికములగు, క్లేశాః = క్లేశములు, హరిసంశ్రయమ్ = శ్రీహరిని ఆశ్రయించిన వానిని, కథమ్ = ఎట్లు, బాధంతే = బాధించును?

వ్యాసపుత్రుడవగు ఓ విదురా! జ్వరము మొదలగునవి శరీరము నకు చెందిన క్లేశములు. శోకము మొదలగు క్లేశములు మానసికములు. అనావృష్టి మొదలగునవి ఆధిదైవిక క్లేశములు. ఒకప్పుడు శత్రువులు క్లేశ ములను కలిగించెదరు. పాము కాటు మొదలగునవి ఆధిభౌతిక క్లేశములు. ఇవి అన్నీ శ్రీహరిని శరణు జొచ్చినవానిని ఎట్లు బాధించును?

యః పృష్టో మునిభిః ప్రాహ ధర్మాన్నానావిధాన్ శుభాన్ ।
నృణాం వర్ణాశ్రమాణాం చ సర్వభూతహితస్సదా ॥ 38

సదా = అన్ని వేళలా, సర్వభూతహితః = సకలప్రాణుల హిత మును కోరే, యః = ఏ మనువు, మునిభిః = మహర్షులచే, పృష్టః = ప్రశ్నిం చబడినవాడై, నృణామ్ = మానవులకు, చ = మరియు, వర్ణ-ఆశ్రమాణామ్ = వర్ణములకు ఆశ్రమములకు, నానావిధాన్ = అనేకవిధములైన, శుభాన్ = మంగళకరములగు, ధర్మాన్ = ధర్మములను, ప్రాహ = చెప్పెనో.

మనువు అన్ని వేళలా సకలప్రాణుల హితమును కోరెడివాడు. మునులు ప్రశ్నించగా, ఆయన సకలమానవులకు మరియు వర్ణములకు ఆశ్రమములకు సంబంధించిన అనేకవిధములైన ధర్మములను బోధించెను. ఈ ధర్మములు మానవులకు శుభమును కలిగించును.

ఏతత్త ఆదిరాజస్య మనోశ్చరితమద్భుతమ్ ।
వర్ణితం వర్ణనీయస్య తదపత్యోదయం శృణు ॥ **39**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
ద్వావింశో ऽధ్యాయః ॥

వర్ణనీయస్య = వర్ణించదగిన, ఆదిరాజస్య = మొట్టమొదటి చక్రవర్తి యగు, మనోః = మనువుయొక్క, ఏతత్ = ఈ, అద్భుతమ్ = అద్భుతమగు, చరితమ్ = వృత్తాంతము, తే = నీ కొరకు, వర్ణితమ్ = వర్ణించబడినది, తత్-అపత్య-ఉదయమ్ = ఆయన కుమార్తెయగు దేవహూతియొక్క గొప్పదనమును గురించి, శృణు = వినుము.

మనువు మొట్టమొదటి చక్రవర్తి. అద్భుతమగు ఆయన చరిత్ర వర్ణించదగినది. దానిని నేను వర్ణించి చెప్పితిని. ఇప్పుడు ఆయన కుమార్తె యగు దేవహూతియొక్క మహత్త్వమును గురించి వినుము.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
ఇరువది రెండవ అధ్యాయము ముగిసినది (22).

* * * * *

# అథ త్రయోవింశోऽధ్యాయః

## దేవహూతి కర్దముల విహారము

మైత్రేయ ఉవాచ ।
పితృభ్యాం ప్రస్థితే సాధ్వీ పతిమింగితకోవిదా ।
నిత్యం పర్యచరత్ప్రీత్యా భవానీవ భవం ప్రభుమ్ ॥ 1

మైత్రేయః = మైత్రేయుడు, ఉవాచ = పలికెను, పితృభ్యామ్ = తల్లిదండ్రులచే, ప్రస్థితే = వెళ్లబడగా, ఇంగితకోవిదా = అభిప్రాయమును తెలుసుకొనుటలో నిపుణురాలగు, సాధ్వీ = పతివ్రతయగు దేవహూతి, నిత్యమ్ = నిత్యము, భవానీ = పార్వతి, ప్రభుమ్ = ప్రభువగు, భవం ఇవ = శివుని వలె, ప్రీత్యా = ప్రేమతో, పర్యచరత్ = పరిచర్యను చేసెను.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- తల్లిదండ్రులు వెళ్లిన తరువాత పతివ్రతయగు దేవహూతి భర్తయొక్క ఇంగితమును నేర్పుగా తెలుసుకుంటూ, పార్వతి శివప్రభుని వలె, ఆయనకు ప్రేమతో నిత్యము పరిచర్యను చేసెను.

విశ్రంభేణాత్మశౌచేన గౌరవేణ దమేన చ ।
శుశ్రూషయా సౌహృదేన వాచా మధురయా చ భోః ॥ 2

విసృజ్య కామం దంభం చ ద్వేషం లోభమఘం మదమ్ ।
అప్రమత్తోద్యతా నిత్యం తేజీయాంసమతోషయత్ ॥ 3

భోః = ఓ విదురా!, విశ్రంభేణ = చనువుతో, ఆత్మశౌచేన = అంతఃకరణశుద్ధితో, గౌరవేణ = ఆదరముతో, దమేన = ఇంద్రియజయముతో, శుశ్రూషయా = సేవతో, సౌహృదేన = ప్రేమతో, చ = మరియు, మధురయా

= మధురమగు, వాచా = వాక్కుతో, కామమ్ = కామమును, దంభమ్ = బడాయిని, ద్వేషమ్ = ద్వేషమును, లోభమ్ = లోభమును, అఘమ్ = పాపమును, చ = మరియు, మదమ్ = గర్వమును, విసృజ్య = విడిచిపెట్టి, నిత్యమ్ = నిత్యము, అప్రమత్తా = సావధానురాలై, ఉద్యతా = ప్రయత్నము గలదై, తేజీయాంసమ్ = తేజశ్శాలియగు కర్దముని, అతోషయత్ = సంతోషపెట్టెను.

ఆమె చనువు అంతఃకరణశుద్ధి ఆదరము ఇంద్రియజయము సేవాభావము ప్రేమ మధురమగు వాక్కు అనే గుణములను కలిగియుండెను. ఆమె కామము, దంభము, ద్వేషము, లోభము, పాపము, గర్వము అనువాటిని పరిత్యజించెను. ఆమె తేజశ్శాలియగు కర్దముని సావధాను రాలై ప్రయత్నపూర్వకముగా నిత్యము సేవించి సంతోషపెట్టెను.

స వై దేవర్షివర్యస్తాం మానవీం సమనువ్రతామ్ ।
దైవాద్గరీయసః పత్యురాశాసానాం మహాశిషః ॥ 4

కాలేన భూయసా క్షామాం కర్శితాం వ్రతచర్యయా ।
ప్రేమగద్గదయా వాచా పీడితః కృపయాబ్రవీత్ ॥ 5

దేవర్షివర్యః = దేవర్షులలో శ్రేష్ఠుడగు, సః = ఆ కర్దముడు, మానవీమ్ = మనువు కుమార్తె అయినట్టియు, సమనువ్రతామ్ = తనను అనుసరించుచున్నట్టియు, దైవాత్ = దైవముకంటె, గరీయసః = గొప్పవాడగు, పత్యుః = భర్తనుండి, మహాశిషః = గొప్ప మనోరథములను, ఆశాసానామ్ = ఆకాంక్షించుచున్నట్టియు, భూయసా కాలేన = చిరకాలము, వ్రతచర్యయా = వ్రతానుష్ఠానముచే, క్షామామ్ = కృశించినట్టియు, కర్శితామ్ = క్లేశమును పొందుచున్న, తామ్ = ఆ దేవహూతిని (చూచి), పీడితః = దుఃఖమును పొందినవాడై, ప్రేమగద్గదయా = ప్రేమతో బొంగురువోయిన, వాచా = వాక్కుతో, కృపయా = దయతో, అబ్రవీత్ = పలికెను.

మనుపుత్రియగు ఆ దేవహూతి దైవముకంటె గొప్పవాడగు భర్తను అనుసరించుచుండెను. ఆమె ఆ భర్తనుండి గొప్ప మనోరథములనాకాంక్షించెను. ఆమె చిరకాలము వ్రతానుష్ఠానముచే క్లేశమును పొంది చిక్కియుండె

ను. దేవర్షులలో శ్రేష్ఠుడగు ఆ కర్దముడు ఆమెను చూచి దుఃఖితుడై, దయ కలిగి బొంగురు వోయిన కంఠముతో ప్రేమపూర్వకముగా ఆమెతో నిట్లనెను.

కర్దమ ఉవాచ ।
తుష్టోఽహమద్య తవ మానవి మానదాయాః
శుశ్రూషయా పరమయా పరయా చ భక్త్యా ।
యో దేహినామయమతీవ సుహృత్స్వదేహో
నావేక్షితస్సముచితః క్షపితుం మదర్థే ॥ 6

మానవి = ఓ మనుపుత్రీ!, మానదాయాః = మర్యాదను ఇచ్చే, తవ = నీ, పరమయా = గొప్ప, శుశ్రూషయా = సేవచే, చ = మరియు, పరయా = అన్నిటినీ మించిన, భక్త్యా = భక్తిచే, అద్య = ఈనాడు, అహమ్ = నేను, తుష్టః = సంతోషించితిని, సముచితః = కొనియాడదగిన, అయమ్ = ఈ, స్వదేహః = నీ దేహము, మదర్థే = నా సేవ కొరకై, క్షపితుమ్ = క్షీణింపజే యుటకు, నావేక్షితః = ఉపేక్షించ బడినది, యః = ఏ దేహము, దేహినామ్ = ప్రాణులకు, అతీవ = మిక్కిలి, సుహృత్ = ప్రియమైనదో.

కర్దముడిట్లు పలికెను --- ఓ మనుపుత్రీ! నీవు ఇతరులకు ఇచ్చే మర్యాద గొప్పది. నీ ఉత్తమమగు సేవ, అన్నిటినీ మించిన భక్తి నాకు ఈనాడు సంతోషమును కలిగించినది. నీ ఈ కొనియాడదగిన దేహమును నీవు నా సేవ కొరకై ఉపేక్ష జేసి క్షీణింప జేసినావు. సకలప్రాణులకు దేహము చాల ప్రియమైనది గదా!

యే మే స్వధర్మనిరతస్య తపస్సమాధి-
విద్యాత్మయోగవిజితా భగవత్ప్రసాదాః ।
తానేవ తే మదనుసేవనయావరుద్ధాన్ దృష్టిం
ప్రపశ్య వితరామ్యభయానశోకాన్ ॥ 7

యే = ఏ, స్వధర్మనిరతస్య = తన ధర్మమునందు నిష్ఠను కలిగి యున్న, మే = నా, తపః-సమాధివిద్యా-ఆత్మయోగవిజితాః = తపస్సు ధ్యానము ఉపాసనలయందలి చిత్తైకాగ్రతలచే పొందబడిన, భగవత్-ప్ర

పాదాః = భగవంతుని అనుగ్రహములైన విభూతులు గలవో, అభయాన్ = భయము లేనివి, అశోకాన్ = శోకము లేనివి, తే = నీచే, మత్-అనుసేవనయా = నన్ను సేవించుటచే, అవరుద్ధాన్ = వశము చేసుకొనబడినవి అగు, తాన్ ఏవ = ఆ విభూతులనే, ప్రపశ్య = చక్కగా చూడుము, దృష్టిమ్ = దివ్యదృష్టిని, వితరామి = ఇచ్చుచున్నాను.

నేను స్వధర్మమునందు నిష్ఠ గలవాడనై చిత్తమును ఏకాగ్రము చేసి తపస్సును, ధ్యానమును, ఉపాసనను చేసి, భగవంతుని అనుగ్రహ రూపములగు విభూతులను (మహిమలను) సంపాదించితిని. వాటి వలన లభించే దివ్యభోగములయందు భయము గాని, శోకము గాని లేదు. నన్ను నిరంతరముగా సేవించిన నీకు కూడ అవి వశమైనవి. నేను నీకు దివ్యదృష్టిని ఇచ్చెదను. నీవు వాటిని చూడుము.

> అన్యే పునర్భగవతో భ్రువ ఉద్విజృంభ-
> విభ్రంశితార్థరచనాః కిమురుక్రమస్య ।
> సిద్ధాసి భుంక్ష్వ విభవాన్నిజధర్మదోహాన్
> దివ్యాన్నరైర్దురధిగాన్నృపవిక్రియాభిః ॥ 8

ఉరుక్రమస్య = వామనావతారములో పెద్ద అడుగులుగల, భగవతః = శ్రీహరి భగవానుని, భ్రువః = కనుబొమ (కాలము) యొక్క, ఉద్విజృంభ విభ్రంశిత-అర్థరచనాః = ముడివడుటచే నశింపజేయబడిన మనోరథముల యోజనలు గల, అన్యే పునః = ఇతరములగు భోగములైతే, కిమ్ = ఎంత?, సిద్ధా = సిద్ధురాలవు, అసి = అగుచున్నావు, నిజధర్మదోహాన్ = నీ పాతివ్రత్యధర్మముచే సంపాదించబడినట్టియు, నరైః = మానవులచే, నృపవిక్రియాభిః = మేము రాజులము అనే అభిమానములచే, దురధిగాన్ = పొంద శక్యము కాని, దివ్యాన్ = దివ్యములగు, విభవాన్ = భోగములను, భుంక్ష్వ = అనుభవించుము.

స్వర్గము మొదలగు ఇతరభోగములెన్ని ఉన్నా, అవి సర్వశక్తిమంతుడగు శ్రీహరియొక్క కనుబొమల ముడివడుటచే వాటి యోజనలు అన్నియు వినష్టమగును. కాలముయొక్క ప్రభావము ముందు అవి యెంత

టివి? నీవు నీ పాతివ్రత్యధర్మమునందు సిద్ధురాలవైనావు. ఆ ధర్మము నీకు దివ్యములగు భోగములను సంపాదించి పెట్టును. మేము ధనము అధికారము గలవారము అని విర్రవీగే మానవులు ఈ భోగములను పొందలేరు. అట్టి భోగములను నీవు అనుభవించుము.

ఏవం బ్రువాణమబలాఖిలయోగమాయా-
విద్యావిచక్షణమవేక్ష్య గతాధిరాసీత్ ।
సంప్రశ్రయప్రణయవిహ్వలయా గిరేషద్-
వ్రీడావలోకవిలసద్ధసితాననాఽఽహ ॥ 9

అఖిలయోగమాయావిద్యావిచక్షణమ్ = అన్ని యోగశక్తులయందు విద్యలయందు సమర్థుడైనట్టియు, ఏవమ్ = ఈ విధముగా, బ్రువాణమ్ = పలుకుచున్న కర్దముని, అవేక్ష్య = చూచి, అబలా = దేవహూతి, గత-ఆధిః = తొలగిన మనోవ్యథ గలది, ఆసీత్ = ఆయెను, సంప్రశ్రయప్రణయవిహ్వలయా = వినయము ప్రేమలతో బొంగురువోయిన, గిరా = వాక్కుతో, ఈషద్-వ్రీడా-అవలోకవిలసత్-హసిత-ఆననా = కొంచెము సిగ్గుగల చూపుతో ప్రకాశించే చిరునవ్వు గల ముఖము గలదియై, ఆహ = పలికెను.

కర్దముడు అన్ని యోగశక్తులయందు విద్యలయందు నిపుణుడు. ఆయన ఈ విధముగా మాటలాడుటను గని అమాయకురాలగు ఆ దేవహూతికి మనస్సులోని వ్యథ తొలగిపోయెను.ఆమె ముఖము కొంచెము సిగ్గుతో కూడిన చూపులతో మరియు చిరునవ్వుతో ప్రకాశించుచుండెను. వినయముతో, ప్రేమతో బొంగురు వోయిన కంఠముతో ఆమె ఇట్లనెను.

దేవహూతిరువాచ ।
రాద్ధం బత ద్విజవృషైతదమోఘయోగ-
మాయాధిపే త్వయి విభో తదవైమి భర్తః ।
యస్తేఽభ్యధాయి సమయస్సకృదంగసంగో
భూయాద్గరీయసి గుణః ప్రసవస్సతీనామ్ ॥ 10

ద్విజవృష = ఓ బ్రాహ్మణశ్రేష్ఠా!, విభో= ఓ ప్రభూ!, భర్తః = ఓ భర్తా!, అమోఘయోగమాయా-అధిపే = అమోఘములగు యోగశక్తులకు అధీశ్వరుడవగు, త్వయి = నీయందు, ఏతత్ = ఇది, రాద్ధం బత = సిద్ధించి యున్నది సుమా!, తత్ = దానిని, అవైమి = తెలియుచున్నాను, తే = నీచే, యః = ఏ, సమయః = నియమము, అభ్యధాయి = చెప్పబడినదో, సకృత్ = ఒక్కసారి, అంగసంగః = అంగముల కలయిక, భూయాత్ = కలుగుగాక!, సతీనామ్ = పతివ్రతలకు, గరీయసి = శ్రేష్ఠుడగు భర్తయందు, ప్రసవః = సంతానము, గుణః = గొప్ప లాభము.

దేవహూతి ఇట్లు పలికెను --- ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! నీకు అమోఘములగు యోగశక్తులపై ఆధిపత్యము గలదు. నీవు సిద్ధపురుషుడవని నేను ఎరుగుదును. ఓ ప్రభూ! నీవు నా భర్తవు. వివాహసమయములో సంతానమును గురించి నీవు మాటను ఇచ్చియుంటివి. కావున, మనమిద్దరము కలిసి సుఖించాలని నా కోరిక. పతివ్రతలకు శ్రేష్ఠుడగు భర్తతో సంతానమును పొందుటయే గొప్ప లాభము.

తత్రేతికృత్యముపశిక్ష యథోపదేశం
యేనైష మే కర్శితోऽతిరిరంసయాऽऽత్మా ।
సిద్ధ్యేత తే కృతమనోభవధర్షితాయా
దీనస్తదీశ భవనం సదృశం విచక్ష్వ ॥ 11

ఈశ = ఓ ప్రభూ!, తత్ర = ఆ విషయములో, యథా-ఉపదేశమ్ = శాస్త్రోపదేశమునతిక్రమించకుండగా, ఇతికృత్యమ్ = సాధనసామగ్రిని, ఉపశిక్ష = సంపాదించుము, యేన = దేనిచే, తే = నీచే, కృతమనోభవధర్షితాయాః = కలిగించబడిన మన్మథునిచే పీడను పొందిన, మే = నాయొక్క, అతిరిరంసయా = అధికమగు రమించవలెననే కోరికచే, కర్శితః = కృశింపజేయబడిన, ఏషః = ఈ, దీనః = దీనమగు, ఆత్మా = దేహము, సిద్ధ్యేత = సమర్థమగునో, తత్ = అందువలన, సదృశమ్ = యోగ్యమగు, భవనమ్ = భవనమును గురించి, విచక్ష్వ = ఆలోచించుము.

ఓ ప్రభూ! నీవు శాస్త్రోపదేశమునతిక్రమించకుండగా మన విహార మునకు కావలసిన సాధనసామగ్రిని సంపాదించుము. నిన్ను చూచుచున్న నా హృదయమును మన్మథుడు పీడించుచున్నాడు. నీతో రమించవలెననే కోరిక అధికముగా నున్ననూ, నా ఈ దేహము కృశించి దీనముగా నున్నది. ఈ దేహము విహారయోగ్యమగునట్లు అనుగ్రహించుము. మన విహారము నకు యోగ్యమైన భవనమును గురించి కూడ విచారించుము.

మైత్రేయ ఉవాచ ।
ప్రియాయాః ప్రియమన్విచ్ఛన్ కర్దమో యోగమాస్థితః ।
విమానం కామగం క్షత్తస్తర్హ్యేవావిరచీకరత్ ॥ 12

క్షత్తః = ఓ విదురా!, కర్దమః = కర్దముడు, ప్రియాయాః = ప్రియురా లగు దేవహూతికి, ప్రియమ్ = ప్రియమును, ఇచ్ఛన్ = గోరువాడై, అను = వెంటనే, యోగమ్ = యోగమును, ఆస్థితః = చేపట్టినవాడై, కామగమ్ = యథేచ్ఛగా సంచరించే, విమానమ్ = విమానమును, తర్హి ఏవ = అదే సమ యములో, ఆవిరచీకరత్ = ఆవిర్భవింప జేసెను.

ఓ విదురా! కర్దముడు ప్రియురాలికి ప్రియమును చేయగోరి, వెంటనే అదే సమయములో యోగశక్తిని చేపట్టి, యథేచ్ఛగా సంచరించే విమానమును ఆవిర్భవింప జేసెను.

సర్వకామదుఘం దివ్యం సర్వరత్నసమన్వితమ్ ।
సర్వర్ధ్యుపచయోదర్కం మణిస్తంభైరుపస్కృతమ్ ॥ 13

సర్వకామదుఘమ్ = కోరికలనన్నిటినీ తీర్చునది, దివ్యమ్ = ప్రకా శించునది, సర్వరత్నసమన్వితమ్ = శ్రేష్ఠవస్తువులన్నింటితో కూడియున్నది, సర్వ-ఋద్ధి-ఉపచయ-ఉదర్కమ్ = అన్ని సంపదల ఉత్తరోత్తరాభివృద్ధి గల ది, మణిస్తంభైః = మణిస్తంభములచే, ఉపస్కృతమ్ = అలంకరించబడినది (అగు విమానమును ఆవిర్భవింప జేసెను).

ఆ దివ్యమగు విమానము కోరికలనన్నింటినీ తీర్చును. అన్ని శ్రేష్ఠ వస్తువులతో కూడియున్న ఆ విమానమునందు అన్ని సంపదలు ఒకదానిని

మించి మరియొకటి ఉన్నవి. అది మణిమయమగు స్తంభములచే అలంక రింపబడి యున్నది.

దివ్యోపకరణోపేతం సర్వకాలసుఖావహమ్ ।
పట్టికాభిః పతాకాభిర్విచిత్రాభిరలంకృతమ్ ॥ 14

దివ్య-ఉపకరణ-ఉపేతమ్ = దివ్యమగు సాధనములతో కూడియు న్నది, సర్వకాలసుఖ-ఆవహమ్ = అన్ని కాలములయందు సుఖమును కలి గించునది, విచిత్రాభిః = రంగు రంగుల, పట్టికాభిః = పట్టువస్త్రముల జెండా లతో, పతాకాభిః = పతాకలతో, అలంకృతమ్ = అలంకరించబడినది.

దివ్యమగు సాధనములతో కూడియున్న ఆ విమానము అన్ని కాల ములలో సుఖమును కలిగించును. దానికి రంగు రంగుల జెండాలు, పతా కలు అలంకరించబడినవి.

స్రగ్భిర్విచిత్రమాల్యాభిర్మంజుశింజత్ షడంఘ్రిభిః ।
దుకూలక్షౌమకౌశేయైర్నానావస్త్రైర్విరాజితమ్ ॥ 15

విచిత్రమాల్యాభిః = రంగు రంగుల మాలలకు తగిన పుష్పములు గలిగినట్టియు, మంజుశింజత్-షడంఘ్రిభిః = మధురముగా ధ్వని చేయు చున్న తుమ్మెదలు గల, స్రగ్భిః = మాలలచే, దుకూలక్షౌమకౌశేయైః = నాజూకైన నూలు నార మరియు పట్టులతో చేసిన, నానావస్త్రైః = అనేక వస్త్రములచే, విరాజితమ్ = ప్రకాశించుచున్నది.

మాలలు కట్టదగిన రంగు రంగుల పుష్పముల మాలలతో ఆ విమానము అలంకరించబడెను. ఆ మాలల చుట్టూ తుమ్మెదలు ఎగు రుతూ మధురముగా ధ్వని చేయుచుండెను. ఆ విమానములో రకరకముల నూలు నార మరియు పట్టు వస్త్రములు సమృద్ధిగా నుండెను.

ఉపర్యుపరి విన్యస్తనిలయేషు పృథక్ పృథక్ ।
క్షిప్తైః కశిపుభిః కాంతం పర్యంకవ్యజనాసనైః ॥ 16

ఉపరి ఉపరి = ఒకదానిపై నొకటి, విన్యస్తనిలయేషు = నిర్మించబడిన గృహములయందు, పృథక్ పృథక్ = వేర్వేరుగా, క్షిప్తైః = ఉంచబడిన, కశిపుభిః = మెత్తలచే, పర్యంకవ్యజన-ఆసనైః = శయ్యలు గాలిని విసిరే సాధనములు మరియు ఆసనములతో, కాంతమ్ = సుందరముగానున్నది.

ఆ విమానములో అంతస్తులు ఒకదానిపై నొకటి నిర్మించబడి యున్నవి. వాటిలో మెత్తలు, శయ్యలు, గాలిని వీచే సాధనములు, ఆసనములు వేర్వేరుగా అమర్చబడి చాల సుందరముగా నుండెను.

తత్ర తత్ర వినిక్షిప్తనానాశిల్పోపశోభితమ్ ।
మహామరకతస్థల్యా జుష్టం విద్రుమవేదిభిః ॥ **17**

తత్ర తత్ర = అక్కడక్కడ, వినిక్షిప్తనానాశిల్ప-ఉపశోభితమ్ = చెక్కబడిన అనేకవిధముల శిల్పములచే శోభిల్లునది, మహామరకతస్థల్యా = గొప్ప పచ్చలు పొదిగిన చదరపు నేలతో, విద్రుమవేదిభిః = పగడముల అరుగులతో, జుష్టమ్ = కూడియున్నది.

దానిలో అక్కడక్కడ అనేకవిధముల అందమైన శిల్పములు చెక్కబడియున్నవి. అది ఇంద్రనీలమాణిక్యములు పొదిగిన చదరపు నేలతో మరియు పగడములు పొదిగిన అరుగులతో శోభిల్లుచుండెను.

ద్వాఃసు విద్రుమదేహల్యా భాతం వజ్రకపాటవత్ ।
శిఖరేష్వింద్రనీలేషు హేమకుంభైరధిశ్రితమ్ ॥ **18**

ద్వాఃసు = ద్వారములయందు, విద్రుమదేహల్యా = పగడముల కడపతో, భాతమ్ = ప్రకాశించునది, వజ్రకపాటవత్ = వజ్రములు పొదిగిన తలుపులు గలది, ఇంద్రనీలేషు = ఇంద్రనీలమాణిక్యములు పొదిగిన, శిఖరేషు = భవనముల అగ్రములయందు, హేమకుంభైః = బంగరు కలశములచే, అధిశ్రితమ్ = అధిష్ఠించబడినది.

ద్వారముల కడపలకు పగడములు, తలుపులకు వజ్రములు పొదుగబడినవి. భవనముల అగ్రములయందు ఇంద్రనీలమణులు పొదగబడి, బంగరు కలశములు స్థాపించబడినవి.

చక్షుష్మత్పద్మరాగాగ్ర్యైర్వజ్రభిత్తిషు నిర్మితైః ।
జుష్టం విచిత్రవైతానైర్మహార్హై ర్హేమతోరణైః ॥ 19

వజ్రభిత్తిషు = వజ్రముల గోడలయందు, నిర్మితైః = నిర్మించబడిన, చక్షుష్మత్-పద్మరాగ-అగ్ర్యైః = కన్నులను బోలిన శ్రేష్ఠమగు కెంపులతో, విచిత్రవైతానైః = రంగు రంగుల మేలుకట్టుల సమూహములతో, మహార్హైః = మిక్కిలి విలువైన, హేమతోరణైః = బంగరు తోరణము (బహిర్ద్వారము) లతో, జుష్టమ్ = కూడియున్నది.

ఆ భవనములలో వజ్రముల గోడలయందు పొదిగిన కెంపులు కన్నులవలె భాసించుచున్నవి. ఆ విమానము మేలుకట్టుల సమూహము లతో మరియు బంగరు తోరణములతో కూడియున్నది.

హంసపారావతవ్రాతైస్తత్ర తత్ర నికూజితమ్ ।
కృత్రిమాన్ మన్యమానైస్స్వానధిరుహ్యాధిరుహ్య చ ॥ 20

కృత్రిమాన్ = కృత్రిమములగు బొమ్మలను, స్వాన్ = తమ జాతి పక్షులనుగా, మన్యమానైః = తలపోయుచున్న, హంసపారావతవ్రాతైః = హంసలు పావురముల సమూహములచే, అధిరుహ్య అధిరుహ్య చ = వాటి మీదకు పాకి పాకి, నికూజితమ్ = అధికముగా కూయబడుచున్నది.

ఆ భవనములలో వివిధపక్షుల శిల్పములు గలవు. హంసలు పావు రములు వాటిని చూచి తమ జాతి పక్షులేనని భావించి వాటితో ఆటలాడు టకు నిరంతరముగా ప్రయత్నిస్తూ గట్టిగా కూయుచున్నవి.

విహారస్థానవిశ్రామసంవేశప్రాంగణాజిరైః ।
యథోపజోషం రచితైర్విస్మాపనమివాత్మనః ॥ 21

యథా-ఉపజోషమ్ = అవసరమునకు తగ్గట్లుగా, రచితైః = నిర్మిం చబడిన, విహారస్థానవిశ్రామసంవేశప్రాంగణ-అజిరైః = విహరించే స్థల ములు విశ్రాంతిగా కూర్చుండే స్థలములు పరుండే గదులు వాకిళ్లు ముంగి

ళ్లతో, ఆత్మనః = తనకు, విస్మాపనం ఇవ = విస్మయమును కలిగించుచు న్నదా యన్నట్లు ఉన్నది.

దానిలో అవసరమునకు సరిపోవునట్లుగా విహరించే స్థలములు, విశ్రాంతిగా కూర్చుండే స్థలములు, పరుండే గదులు, వాకిళ్లు, ముంగిళ్లు ఏర్పాటు చేయబడినవి. ఆ విమానమును చూచి, కర్దముడు కూడ ఆశ్చర్య పడునా యన్నట్లు ఉన్నది.

ఈదృగ్గృహం తత్పశ్యంతీం నాతిప్రీతేన చేతసా ।
సర్వభూతాశయాభిజ్ఞః ప్రావోచత్కర్దమస్స్వయమ్ ॥ 22

ఈదృక్ = ఇట్టి, తత్ = ఆ, గృహమ్ = విమానగృహమును, న-అతి ప్రీతేన = మిక్కిలి ప్రీతిని పొందని, చేతసా = మనస్సుతో, పశ్యంతీమ్ = చూచుచున్న దేవహూతిని గురించి, సర్వభూత-ఆశయ-అభిజ్ఞః = సకలప్రా ణుల మనస్సులోని సంగతులను తెలుసుకొనగలిగే, కర్దమః = కర్దముడు, స్వయమ్ = స్వయముగా, ప్రావోచత్ = పలికెను.

ఇట్టి ఈ గృహమును చూచి దేవహూతి పెద్ద ప్రీతిని పొందలేదు. కర్దముడు సకలప్రాణుల మనస్సులలోని విషయములను గ్రహించగల యోగి. ఆయన తానే ఆమెను మాటలలోనికి దింపి ఇట్లనెను.

నిమజ్జ్యాస్మిన్ హ్రదే భీరు విమానమిదమారుహ ।
ఇదం శుక్లకృతం తీర్థమాశిషాం యాపకం నృణామ్ ॥ 23

భీరు = ఓ భయస్వభావము గలదానా!, అస్మిన్ = ఈ, హ్రదే = చెరువునందు, నిమజ్జ్య = మునిగి, ఇదమ్ = ఈ, విమానమ్ = విమానము ను, ఆరుహ = ఎక్కుము, ఇదమ్ = ఈ, శుక్లకృతమ్ = శ్రీహరిచే చేయబడి న, తీర్థమ్ = తీర్థము, నృణామ్ = మానవులకు, ఆశిషామ్ = మనోరథముల కు, యాపకమ్ = పొందించునది.

ఓ భయస్వభావము గల దేవహూతీ! ఈ సరస్సులో మునిగి ఈ విమానమునెక్కుము. ఈ సరస్సును స్వయముగా శ్రీహరియే తన ఆనంద

బాష్పములతో నిర్మించెను. దీనియందు స్నానమును చేసిన మానవులకు మనోరథములీడేరును.

సా తద్భర్తుస్సమాదాయ వచః కువలయేక్షణా ।
సరజం బిభ్రతీ వాసో వేణీభూతాంశ్చ మూర్ధజాన్ ॥ 24

అంగం చ మలపంకేన సంఛన్నం శబలస్తనమ్ ।
ఆవివేశ సరస్వత్యాస్సరశ్శివజలాశయమ్ ॥ 25

సరజమ్ = పాతబడిన, వాసః = వస్త్రమును, వేణీభూతాన్ = జడలు కట్టిన, మూర్ధజాన్ = కేశములను, చ = మరియు, మలపంకేన = తడిసిన దుమ్ముతో, సంఛన్నమ్ = కప్పబడిన, శబలస్తనమ్ = పాలిపోయిన స్తనములు గల, అంగం చ = శరీరమును, బిభ్రతీ = దాల్చియున్న, కువలయ-ఈక్షణా = కలువ కన్నుల, సా = ఆ దేవహూతి, భర్తుః = భర్తయొక్క, తత్ = ఆ, వచః = మాటను, సమాదాయ = స్వీకరించి, సరస్వత్యాః = సరస్వతీ నదియొక్క, శివజల-ఆశయమ్ = మంగళకరమగు నీటికి నిలయమగు, సరః = సరస్సును, ఆవివేశ = ప్రవేశించెను.

కలువ కన్నుల దేవహూతి పాతబడిన చీరను దాల్చియుండెను. ఆమె జుట్టు జడలు కట్టెను. పాలిపోయిన ఆమె శరీరము మట్టి కొట్టుకొని యుండెను. ఆమె భర్త మాటను అంగీకరించి, పవిత్రమగు జలములతో నిండియున్న ఆ సరస్వతీనదికి చెందిన బిందుసరస్సును ప్రవేశించెను.

సాంతస్సరసి వేశ్మస్థాశ్శతాని దశ కన్యకాః ।
సర్వాః కిశోరవయసో దదర్శోత్పలగంధయః ॥ 26

సా = ఆమె, అంతః-సరసి = సరస్సు లోపల, వేశ్మస్థాః = ప్రాసాదమునందున్న, దశ శతాని = వేయి, కన్యకాః = కన్యలను, దదర్శ = చూచెను, సర్వాః = వారందరు, కిశోరవయసః = యౌవనములోనుండిరి, ఉత్పలగంధయః = కలువల సువాసన గలవారు.

ఆమె సరస్సు లోపల ఒక ప్రాసాదములో కలువల సువాసనను కలిగియున్న వేయి యువతులను చూచెను.

తాం దృష్ట్వా సహసోత్థాయ ప్రోచుః ప్రాంజలయః స్త్రియః ।
వయం కర్మకరీస్తుభ్యం శాధి నః కరవామ కిమ్ ॥ 27

స్త్రియః = ఆ యువతులు, తామ్ = ఆమెను, దృష్ట్వా = చూచి, సహసా = వెంటనే, ఉత్థాయ = లేచి, ప్రాంజలయః = చేతులను జోడించిన వారై, ప్రోచుః = పలికిరి, వయమ్ = మేము, తుభ్యమ్ = నీ కొరకు, కర్మకరీః = పనులను చేయువారము, నః = మమ్ములను, శాధి = ఆదేశించుము, కిమ్ = దేనిని, కరవామ = చేయుదము?

ఆ యువతులు ఆమెను చూచి వెంటనే లేచి చేతులను జోడించి నమస్కరించి ఇట్లు పలికిరి --- మేము నీ సేవకురాండ్రము. మమ్ములనాదేశించుము. ఇప్పుడు మేము నీకు ఏమి చేయవలెను?

స్నానేన తాం మహార్హేణ స్నాపయిత్వా మనస్వినీమ్ ।
దుకూలే నిర్మలే నూత్నే దదురస్యై చ మానదాః ॥ 28

మానదాః = మర్యాదనిచ్చే ఆ యువతులు, మనస్వినీమ్ = అభిమానవతియగు, తామ్ = ఆ దేవహూతిని, మహా-అర్హేణ = మిక్కిలి శ్రేష్ఠమగు, స్నానేన = స్నానసాధనముచే, స్నాపయిత్వా = స్నానము చేయించి, అస్యై = ఈమె కొరకు, నిర్మలే = స్వచ్ఛమైన, నూత్నే = కొత్త, దుకూలే చ = జంట నూలు వస్త్రములను కూడ, దదుః = ఇచ్చిరి.

మర్యాదనెరిగిన ఆ యువతులు అభిమానవతియగు ఆ దేవహూతిని శ్రేష్ఠమగు సుగంధద్రవ్యములతో కూడిన స్నానమును చేయించి, ఆమెకు నాజూకైన కొత్త నూలు వస్త్రములను ఇచ్చిరి.

భూషణాని పరార్ధ్యాని వరీయాంసి ద్యుమంతి చ ।
అన్నం సర్వగుణోపేతం పానం చైవామృతాసవమ్ ॥ 29

పరార్ధ్యాని = అమూల్యములైనట్టియు, వరీయాంసి = శ్రేష్ఠములైన ట్టియు, చ = మరియు, ద్యుమంతి = కాంతిమంతములైన, భూషణాని = భూషణములను, సర్వగుణ-ఉపేతమ్ = అన్ని రుచులతో కూడిన, అన్నమ్ = ఆహారమును, చ = మరియు, అమృత-ఆసవమ్ = అమృతమువంటి మత్తెక్కించే, పానం ఏవ = పానీయమును కూడ (ఇచ్చిరి).

వారామెకు అమూల్యములైన కాంతిమంతములగు శ్రేష్ఠమగు ఆభ రణములను, అన్ని రసములతో కూడియున్న ఆహారమును, అమృతము వంటి మత్తెక్కించే పానీయమును కూడ ఇచ్చిరి.

అథాదర్శే స్వమాత్మానం స్రగ్విణం విరజాంబరమ్ ।
విరజం కృతస్వస్త్యయనం కన్యాభిర్బహుమానితమ్ ॥ 30

అథ = అప్పుడు, ఆదర్శే = అద్దమునందు, స్రగ్విణమ్ = మాలను ధరించినట్టియు, విరజ-అంబరమ్ = స్వచ్ఛమగు వస్త్రములను కలిగినట్టి యు, విరజమ్ = నిర్మలమైనట్టియు, కృతస్వస్త్యయనమ్ = చేయబడిన మంగళాలంకారములు కలిగినట్టియు, కన్యాభిః = ఆ దేవకన్యలచే, బహు మానితమ్ = అధికముగా సేవించబడిన, స్వమ్ = తన, ఆత్మానమ్ = దేహ మును (చూచెను).

అప్పుడు ఆ దేవహూతి తనను తాను అద్దములో చూచుకొనెను. ఆమెకు మాలను స్వచ్ఛమగు వస్త్రములను ధరించిన స్వచ్ఛమగు దేహ ము దర్శనమిచ్చెను. ఆ కన్యలు ఆమెకు మంగళాలంకారములను ధరింప జేసి గొప్ప సేవలను చేసిరి.

స్నాతం కృతశిరస్స్నానం సర్వాభరణభూషితమ్ ।
నిష్కగ్రీవం వలయినం కూజత్కాంచననూపురమ్ ॥ 31

స్నాతమ్ = స్నానము చేయబడినట్టియు, కృతశిరః-స్నానమ్ = చేయబడిన తల స్నానము కలిగినట్టియు, సర్వ-ఆభరణభూషితమ్ = అన్ని ఆభరణములచే అలంకరించబడినట్టియు, నిష్కగ్రీవమ్ = మెడలో పదకము గలిగినట్టియు, వలయినమ్ = కంకణములు కలిగినట్టియు, కూజత్-కాంచ

ననూపురమ్ = ధ్వనిని చేయుచున్న బంగరు కాలి అందెలు కలిగిన (దేహ మును చూచెను).

ఆమె మామూలు స్నానము మాత్రమే గాక, తల స్నానమును చేసెను. తరువాత ఆమె ఆభరణములనన్నింటినీ అలంకరించుకొనెను. ఆమె మెడలో పదకము, చేతులకు గాజులు శోభను చేకూర్చెను. ఆమె పాదములయందలి బంగరు అందెలు గణగణలాడుచుండెను.

శ్రోణ్యోరధ్యస్తయా కాంచ్యా కాంచన్యా బహురత్నయా ।
హారేణ చ మహార్హేణ రుచకేన చ భూషితమ్ ॥ 32

శ్రోణ్యోః = నితంబములయందు, అధ్యస్తయా = ధరించబడిన, కాంచన్యా = బంగరు, బహురత్నయా = అనేకరత్నములు గల, కాంచ్యా = మొలనూలుతో, మహార్హేణ = గొప్ప విలువైన, హారేణ = హారముతో, చ = మరియు, రుచకేన = కుంకుమ మొదలగు మంగళద్రవ్యముతో, భూషితమ్ = అలంకరించబడిన (దేహమును చూచెను).

ఆమె నడుమునందు అనేకరత్నములు పొదిగిన బంగరు మొల నూలును దాల్చెను. ఆమె గొప్ప విలువైన హారముతో మరియు కుంకుమ మొదలగు మంగళద్రవ్యములతో అలంకరించుకొనెను.

సుదతా సుభ్రువా శ్లక్ష్ణస్నిగ్ధాపాంగేన చక్షుషా ।
పద్మకోశస్పృధా నీలైరలకైశ్చ లసన్ముఖమ్ ॥ 33

సుదతా = అందమగు దంతపంక్తితో, సుభ్రువా = అందమగు కను బొమతో, శ్లక్ష్ణస్నిగ్ధ-అపాంగేన = మధురమైన ప్రేమతో కూడిన కడగంటి చూపుతో, పద్మకోశస్పృధా = పద్మపు మొగ్గతో పోటీపడే, చక్షుషా = కంటి తో, చ = మరియు, నీలైః = నల్లని, అలకైః = కురులతో, లసత్ = ప్రకాశించే, ముఖమ్ = ముఖమును (చూచెను).

ఆమె ముఖము అందమగు పలు వరుసలతో, అందమగు కనుబొ మలతో, మధురమైన ప్రేమతో నిండిన కడగంటి చూపుతో, పద్మపు మొగ్గ లతో పోటీపడే కన్నులతో మరియు నల్లని కురులతో ప్రకాశించెను.

యదా సస్మార ఋషభమృషీణాం దయితం పతిమ్ ।
తత్ర చాస్తే సహ స్త్రీభిర్యత్రాస్తే స ప్రజాపతిః ॥ 34

యదా = ఎప్పుడైతే, ఋషీణామ్ = మహర్షులలో, ఋషభమ్ = శ్రేష్ఠుడైనట్టియు, దయితమ్ = ప్రియుడైన, పతిమ్ = భర్తను, సస్మార = స్మరించెనో (అప్పుడు), స్త్రీభిః సహ = ఆ కన్యకలతో బాటు, తత్ర = అక్కడ, ఆస్తే = ఉండెను, యత్ర = ఎక్కడనైతే, సః = ఆ, ప్రజాపతిః = కర్దమ ప్రజాపతి, ఆస్తే = ఉన్నాడో.

ఆమెకు అప్పుడు మహర్షివర్యుడు, తనకు ప్రియుడు అగు భర్త గుర్తుకు వచ్చెను. ఆమె ఆ కన్యలతోబాటు ఆ కర్దమ ప్రజాపతి ఉన్నచోటనే నిలిచియుండెను.

భర్తుః పురస్తాదాత్మానం స్త్రీసహస్రవృతం తదా ।
నిశామ్య తద్యోగగతిం సంశయం ప్రత్యపద్యత ॥ 35

తదా = అప్పుడు, భర్తుః = భర్తకు, పురస్తాత్ = ఎదుట, స్త్రీసహస్ర వృతమ్ = వేయిమంది స్త్రీలతో కూడియున్న, ఆత్మానమ్ = తనను, తత్-యోగగతిమ్ = ఆయన యోగశక్తిని, నిశామ్య = చూచి, సంశయమ్ = విస్మయమును, ప్రత్యపద్యత = పొందెను.

అప్పుడామె వేయిమంది స్త్రీలతో సేవింపబడే తనను చూచుకొని, భర్తయొక్క యోగశక్తికి విస్మయమును పొందెను.

స తాం కృతమలస్నానాం విభ్రాజంతీమపూర్వవత్ ।
ఆత్మనో బిభ్రతీం రూపం సంవీతరుచిరస్తనీమ్ ॥ 36

విద్యాధరీసహస్రేణ సేవ్యమానాం సువాససమ్ ।
జాతభావో విమానం తదారోహయదమిత్రహన్ ॥ 37

అమిత్రహన్ = కామక్రోధాది శత్రువులను జయించిన ఓ విదురా!, కృతమలస్నానామ్ = చేయబడిన మురికిని పోగొట్టే స్నానము కలిగినట్టి

యు, అపూర్వవత్ = పూర్వముందు ఇట్టి శోభ లేదాయన్నట్లుగా, విభ్రాజం తీమ్ = ప్రకాశించుచున్నట్టియు, ఆత్మనః = తన, రూపమ్ = రూపమును, బిభ్రతీమ్ = కలిగియున్నట్టియు, సంవీతరుచిరస్తనీమ్ = కప్పబడిన సుందర మగు స్తనములు గలిగినట్టియు, విద్యాధరీసహస్రేణ = వేయిమంది విద్యాధ రకన్యలచే, సేవ్యమానామ్ = సేవించబడుచున్నట్టియు, సువాసనమ్ = గొప్ప చీరను దాల్చియున్న, తామ్ = ఆ దేవహూతిని, జాతభావః = ఉద యించిన ప్రేమగల, సః = ఆ కర్దముడు, తత్ = ఆ, విమానమ్ = విమానము ను, ఆరోహయత్ = ఎక్కించెను.

కామక్రోధాది శత్రువులను జయించిన ఓ విదురా! దేవహూతి స్నానమును చేసి, తన సహజరూపములోనున్నదే అయిననూ, ఇదివరకె న్నడూ లేదాయన్నట్లు స్వచ్ఛముగా ప్రకాశించుచుండెను. ఆమె చక్కని చీరను దాల్చి భుజములచుట్టూ చక్కగా కప్పుకొనెను. ఆమెను వేయి మంది విద్యాధరకన్యలు చుట్టువారి సేవించుచుండిరి. ఆమెను చూడగానే కర్దముని హృదయములో ప్రేమ ఉదయించెను. ఆయన ఆమెను ఆ విమా నమునెక్కించెను.

తస్మిన్నలుప్తమహిమా ప్రియయానురక్తో
విద్యాధరీభిరుపచీర్ణవపుర్విమానే ।
బభ్రాజ ఉత్కచకుముద్గణవానపీచ్యః
తారాభిరావృత ఇవోడుపతిర్నభఃస్థః ॥ 38

అలుప్తమహిమా = లోపము లేని ప్రభావము గలవాడు, ప్రియయా = భార్యతో, అనురక్తః = అనురాగము గలవాడు, విద్యాధరీభిః = విద్యాధర స్త్రీలచే, ఉపచీర్ణవపుః = సేవించబడిన దేహము గల కర్దముడు, తస్మిన్ = ఆ, విమానే = విమానమునందు, ఉత్కటకుముద్గణవాన్ = వికసిం చిన కలువల సమూహములు గల, అపీచ్యః = అతిసుందరుడగు, తారాభిః = నక్షత్రములతో, ఆవృతః = చుట్టువారబడియున్న, నభఃస్థః = ఆకాశమునం దున్న, ఉడుపతిః ఇవ = చంద్రుని వలె, బభ్రాజే = ప్రకాశించెను.

కర్దముడు ప్రియురాలియందు అనురాగము గలవాడే అయిననూ, ఆయన యోగమహిమకు లోటు లేదు. ఆ విమానములో ఆయనను విద్యాధరస్త్రీలు సేవించుచుండిరి. కలువల సమూహములను వికసింపజేసి ఆకాశములో తారలచే చుట్టువారబడియున్న అతిసుందరుడగు చంద్రుని వలె ఆయన ప్రకాశించెను.

తేనాష్టలోకపవిహారకులాచలేంద్ర-
ద్రోణీష్వనంగసఖమారుతసౌభగాసు ।
సిద్ధైర్నుతో ద్యుధునిపాతశివస్వనాసు
రేమే చిరం ధనదవల్లలనావరూథీ ॥ 39

సిద్ధైః = సిద్ధులచే, నుతః = స్తుతించబడిన కర్దముడు, లలనావరూథీ = విద్యాధరస్త్రీల సమూహము గలవాడై, తేన = ఆ విమానముచే, అనంగసఖమారుతసౌభగాసు = మన్మథుని మిత్రుడగు వాయువుచే సుందరమైనట్టియు, ద్యుధునిపాతశివస్వనాసు = గంగానది పైనుండి పడుచుండుటచే మంగళకరమగు ధ్వనిగల, అష్టలోకపవిహారకుల-అచల-ఇంద్రద్రోణీషు = ఎనమండుగురు లోకపాలకులు విహరించే గొప్ప మేరుపర్వతము యొక్క బిలములయందు, చిరమ్ = చిరకాలము, ధనదవత్ = కుబేరుని వలె, రేమే = రమించెను.

సిద్ధులచే స్తుతించబడే కర్దముడు ఆ విమానముపై నెక్కి, విద్యాధరస్త్రీలు సేవించుచుండగా, మేరుపర్వతబిలములయందు చిరకాలము కుబేరుని వలె రమించెను. పైనుండి పడే గంగానదియొక్క మంగళకరమగు ధ్వనిగల ఆ స్థానములో మన్మథమిత్రుడగు వాయువు మెల్లగా సుఖకరముగా వీచుచుండును. కావుననే, అచట ఎనమండుగురు లోకపాలకులు విహరించుచుందురు.

వైశ్రంభకే సురసనే నందనే పుష్పభద్రకే ।
మానసే చైత్రరథ్యే చ స రేమే రామయా రతః ॥ 40

రతః = ఉల్లాసముగానున్న, సః = ఆ కర్దముడు, రామయా = ప్రియురాలగు దేవహూతితో గూడి, వైశ్రంభకే = వైశ్రంభకమునందు, సుర సనే = సురసనమునందు, నందనే = నందనమునందు, పుష్పభద్రకే = పుష్పభద్రకమునందు, మానసే = మానససరోవరమునందు, చ = మరి యు, చైత్రరథ్యే = చైత్రరథమునందు, రేమే = రమించెను.

ప్రీతుడైయున్న ఆ కర్దముడు ప్రియురాలితో గూడి, వైశ్రంభకము సురసనము నందనము పుష్పభద్రకము చైత్రరథము అనే దేవోద్యానముల యందు, మరియు మానససరోవరమునందు రమించెను.

> భ్రాజిష్ణునా విమానేన కామగేన మహీయసా ।
> వైమానికానత్యశేత చరన్ లోకాన్ యథానిలః ॥ **41**

భ్రాజిష్ణునా = ధగధగలాడే, కామగేన = యథేచ్ఛగా సంచరించే, మహీయసా = గొప్ప, విమానేన = విమానముచే, లోకాన్ = లోకములను, అనిలః యథా = వాయువువలె, చరన్ = సంచరించుచున్నవాడై, వైమాని కాన్ = విమానములలో తిరిగే దేవతలను, అత్యశేత = అతిక్రమించెను.

ధగధగలాడుతూ యథేచ్ఛగా సంచరించే ఆ గొప్ప విమానములో కర్దముడు లోకములను వాయువువలె సంచరిస్తూ, విమానములలో సంచ రించే దేవతలను దాటిపోయెను.

> కిం దురాపాదనం తేషాం పుంసాముద్దామచేతసామ్ ।
> యైరాశ్రితస్తీర్థపదశ్చరణో వ్యసనాత్యయః ॥ **42**

ఉద్దామచేతసామ్ = ధైర్యముతో నిండిన మనస్సులు గల, తేషామ్ = ఆ, పుంసామ్ = పురుషులకు, కిమ్ = ఏమి, దురాపాదనమ్ = సంపాదించ శక్యము కానిది?, యైః = ఎవరిచే, వ్యసన-అత్యయః = కష్టములనుండి గట్టె క్కించే, తీర్థపదః = పవిత్రమగు పాదములు గల భగవానుని, చరణః = పాద ము, ఆశ్రితః = ఆశ్రయించబడినదో.

కష్టములను గట్టెక్కించే పవిత్రములగు భగవానుని పాదములను శరణు పొంది ధైర్యముతో జీవించు వారలకు సంపాదించ శక్యము కానిది ఏముండును?

ప్రేక్షయిత్వా భువో గోలం పత్న్యై యావాన్ స్వసంస్థయా ।
బహ్వాశ్చర్యం మహాయోగీ స్వాశ్రమాయ న్యవర్తత ॥ 43

స్వసంస్థయా = తన రచనచే, యావాన్ = ఎంత గలదో, బహు-ఆశ్చర్యమ్ = అనేకములగు అద్భుతములు గల, భువః = భూమి యొక్క, గోలమ్ = గోళమును, పత్న్యై = భార్య కొరకు, ప్రేక్షయిత్వా = చూపించి, మహాయోగీ = గొప్ప యోగియగు కర్దముడు, స్వ-ఆశ్రమాయ = తన ఆశ్రమము కొరకు, న్యవర్తత = మరలి వచ్చెను.

అనేకద్వీపములు మొదలగు రచనతో అనేకములగు అద్భుతములు గల భూగోళమునంతనూ మహాయోగియగు కర్దముడు తన భార్యకు చూపించి, తన ఆశ్రమమునకు మరలి వచ్చెను.

విభజ్య నవధాఽఽత్మానం మానవీం సురతోత్సుకామ్ ।
రామాం నిరమయన్ రేమే వర్షపూగాన్ముహూర్తవత్ ॥ 44

ఆత్మానమ్ = తనను, నవధా = తొమ్మిది విధములుగా, విభజ్య = విభజించుకొని, సురత-ఉత్సుకామ్ = విహారమునందు ఉత్సాహముగల, మానవీమ్ = మనుపుత్రియగు, రామామ్ = ప్రియురాలిని, నిరమయన్ = అధికముగా రమింప జేయుచున్నవాడై, వర్షపూగాన్ = అనేకసంవత్సరములను, ముహూర్తవత్ = గంటవలె, రేమే = రమించెను.

కర్దముడు తొమ్మిది రూపములను దాల్చినవాడై, విహారమునందు ఉత్సాహము గల మనుపుత్రియగు ప్రియురాలిని అధికముగా రమింపజేసెను. ఈ విధముగా వారు రమించుచుండగా అనేకసంవత్సరముల కాలము ముహూర్తము వలె గడిచిపోయెను.

తస్మిన్ విమాన ఉత్కృష్టాం శయ్యాం రతికరీం శ్రితా ।

న చాబుధ్యత తం కాలం పత్యాపీచ్యేన సంగతా ॥ 45

తస్మిన్ = ఆ, విమానే = విమానమునందు, రతికరీమ్ = ప్రీతిని కలిగించే, ఉత్కృష్టామ్ = గొప్ప, శయ్యామ్ = శయ్యను, శ్రితా = అధిష్ఠించినదై, అపీచ్యేన = అతిసుందరుడగు, పత్యా = భర్తతో, సంగతా చ = కలిసియున్న దేవహూతి కూడ, తమ్ = ఆ, కాలమ్ = కాలమును, న అబుధ్యత = గమనించలేదు.

దేవహూతి కూడ ఆ విమానములో ప్రీతికరమగు గొప్ప శయ్యను అధిష్ఠించి అతిసుందరుడగు తన భర్తతో కూడియున్నదై గడచి పోయిన కాలమును గుర్తించనే లేదు.

ఏవం యోగానుభావేన దంపత్యో రమమాణయోః ।
శతం వ్యతీయుశ్శరదః కామలాలసయోర్మనాక్ ॥ 46

ఏవమ్ = ఈ విధముగా, కామలాలసయోః = కామాసక్తిగల, దంపత్యోః = ఆ దంపతులు, యోగ-అనుభావేన = యోగశక్తిచే, రమమాణయోః = రమించుచుండగా, శతమ్ = వంద, శరదః = శరత్కాలములు, మనాక్ = కొద్ది కాలమువలె, వ్యతీయుః = గడచిపోయినవి.

ఈ విధముగా కామలాలసులగు ఆ దంపతులు యోగశక్తిచే రమించుచుండగా, వంద శరత్కాలములు (సంవత్సరములు) కొద్ది కాలమువలె గడిచిపోయినవి.

తస్యామాధత్త రేతస్తాం భావయన్నాత్మనాఽఽత్మవిత్ ।
నోధా విధాయ రూపం స్వం సర్వసంకల్పవిద్విభుః ॥ 47

ఆత్మవిత్ = ఆత్మజ్ఞాని, సర్వసంకల్పవిత్ = అన్ని సంకల్పములు తెలిసినవాడు, విభుః = సమర్థుడు అగు కర్దముడు, తామ్ = ఆ దేవహూతిని, ఆత్మనా = తన స్వరూపముగా, భావయన్ = భావించువాడై, స్వమ్ = తన, రూపమ్ = రూపమును, నోధా = తొమ్మిది విధములుగా, విధాయ = చేసుకొని, తస్యామ్ = ఆమెయందు, రేతః = రేతస్సును, ఆధత్త = ఆధానము చేసెను.

సర్వసమర్థుడగు కర్దముడు ఆత్మజ్ఞాని, దేవహూతి సంకల్పము లన్నీ తెలిసినవాడు. ఆయన ఆమెను తన అర్ధాంగిగా భావన చేసి, తన రూపమును తొమ్మిది రూపములుగా విభాగము చేసి, ఆమెయందు సంతానమును పొందెను.

అతస్సా సుషువే సద్యో దేవహూతిః స్త్రియః ప్రజాః ।
సర్వాస్తాశ్చారుసర్వాంగ్యో లోహితోత్పలగంధయః ।। 48

అతః = ఇందువలన, సా = ఆ, దేవహూతిః = దేవహూతి, సద్యః = వెనువెంటనే, స్త్రియః ప్రజాః = స్త్రీసంతానమును, సుషువే = కనెను, తాః = ఆ అమ్మాయిలు, సర్వాః = అందరు, చారుసర్వ-అంగ్యః = సుందరమైన అన్ని అవయవములు గలవారు, లోహిత-ఉత్పలగంధయః = ఎర్రకలువల సుగంధము గలవారు.

కావుననే, ఆ దేవహూతి వెనువెంటనే తొమ్మండుగురు అమ్మాయిలను కనెను. అన్ని అవయవములలో సుందరముగానున్న వారందరు ఎర్ర కలువల సుగంధమును కలిగియుండిరి.

పతిం సా ప్రవ్రజిష్యంతం తదాఽఽలక్ష్యోశతీ సతీ ।
స్మయమానా విక్లబేన హృదయేన విదూయతా ।। 49

లిఖంత్యధోముఖీ భూమిం పదా నఖమణిశ్రియా ।
ఉవాచ లలితాం వాచం నిరుధ్యాశ్రుకలాం శనైః ।। 50

తదా = అప్పుడు, ప్రవ్రజిష్యంతమ్ = సన్న్యసించబోయే, పతిమ్ = భర్తను, ఆలక్ష్య = చూచి, ఉశతీ = సుందరి, సతీ = పతివ్రతయగు, సా = ఆ దేవహూతి, స్మయమానా = చిరునవ్వు గలదై, విక్లబేన = వ్యాకులమైన, విదూయతా = దుఃఖితమైన, హృదయేన = హృదయముతో, అధోముఖీ = క్రిందకు చూచుచున్నదై, భూమిమ్ = భూమిని, నఖమణిశ్రియా = మణుల వంటి గోళ్ల కాంతిగల, పదా = పాదముతో, లిఖంతీ = వ్రాయుచున్నదై, అశ్రుకలామ్ = కన్నీటి బిందువులను, నిరుధ్య = ఆపుకొని, శనైః = మెల్లగా, లలితామ్ = మృదువైన, వాచమ్ = వాక్కును, ఉవాచ = పలికెను.

అప్పుడు సన్న్యసించుటకు సంసిద్ధుడైన భర్తయగు కర్దముని చూచి, సుందరి పతివ్రతయగు ఆ దేవయాని హృదయము కల్లోలితమై దుఃఖముతో నిండిపోయెను. కాని, ఆమె ముఖముపై చిరునవ్వును చెరుగనీయలేదు. ఆమె క్రిందకు చూస్తూ మణులవలె ప్రకాశించే గోళ్లు గల పాదముతో భూమిపై వ్రాస్తూ, కన్నీటి బిందువులను అపుకొని, మెల్లగా మృదువుగా ఇట్లు పలికెను.

దేవహూతిరువాచ ।
సర్వం తద్భగవాన్మహ్యముపోవాహ ప్రతిశ్రుతమ్ ।
అథాపి మే ప్రపన్నాయా అభయం దాతుమర్హసి ॥ 51

భగవాన్ = పూజ్యుడవగు నీవు, ప్రతిశ్రుతమ్ = ప్రతిజ్ఞ చేయబడిన, తత్ = ఆ, సర్వమ్ = సర్వమును, మహ్యమ్ = నాకొరకు, ఉపోవాహ = సంపాదించినావు, అథ అపి = అయినప్పటికీ, ప్రపన్నాయాః = శరణు వేడే, మే = నా కొరకు, అభయమ్ = అభయమును, దాతుమ్ = ఇచ్చుటకు, అర్హసి = తగుచున్నావు.

దేవహూతి ఇట్లు పలికెను - పూజ్యుడవగు నీవు నాకు వివాహకాలములో ఇచ్చిన మాట ప్రకారముగా సర్వమును సమకూర్చినావు. కాని, నేను నిన్ను శరణు వేడుచున్నాను. నాకు నీవు అభయమునీయ దగుదువు.

బ్రహ్మన్ దుహితృభిస్తుభ్యం విమృగ్యాః పతయస్సమాః ।
కశ్చిత్ స్యాన్మే విశోకాయ త్వయి ప్రవ్రజితే వనమ్ ॥ 52

బ్రహ్మన్ = ఓయీ మహర్షీ!, తుభ్యమ్ = నీచే, దుహితృభిః = కుమార్తెలతో, సమాః = సమానమైన, పతయః = భర్తలు, విమృగ్యాః = వెదుకబడవలెను, త్వయి = నీవు, వనమ్ = వనమును గురించి, ప్రవ్రజితే = సన్న్యసించి వెళ్లిపోగా, మే = నా, విశోకాయ = శోకనివృత్తి కొరకు, కశ్చిత్ = ఒక పిల్లవాడు, స్యాత్ = ఉండును.

ఓ మహర్షీ! నీవు నీ కుమార్తెలకు తగిన భర్తలను వెదుకవలెను. పైగా, నీవు సన్న్యసించి వనమునకు వెళ్లగా నన్ను ఓదార్చే ఒక పిల్లవాడు మనకు కలుగవలెను.

ఏతావతాఽలం కాలేన వ్యతిక్రాంతేన మే ప్రభో ।
ఇంద్రియార్థప్రసంగేన పరిత్యక్తపరాత్మనః ॥ 53

ప్రభో= ఓ ప్రభూ!, ఇంద్రియ-అర్థప్రసంగేన = ఇంద్రియములకు విషయములగు శబ్దాదులతో దృఢమగు ఆసక్తిని కలిగియుండుటచే, పరిత్యక్తపర-ఆత్మనః = విడిచిపెట్టబడిన పరమాత్మ గల, మే = నాకు, వ్యతిక్రాంతేన = గడచిపోయిన, ఏతావతా = ఇంతటి, కాలేన = కాలముచే, అలమ్ = వ్యర్థము.

ఓ ప్రభూ! ఇంద్రియములకు శబ్దాదివిషయములయందు దృఢమగు ఆసక్తి ఉండుటచే, నేను పరమాత్మను ఉపాసించలేదు. ఆ విధముగా ఇంతకాలము నాకు వ్యర్థమైనది.

ఇంద్రియార్థేషు సజ్జంత్యా ప్రసంగస్త్వయి మే కృతః ।
అజానంత్యా పరం భావం తథాప్యస్త్వభయాయ మే ॥ 54

ఇంద్రియ-అర్థేషు = ఇంద్రియభోగములయందు, సజ్జంత్యా = ఆసక్తిని కలిగియున్న, పరం భావమ్ = పరమతత్త్వమును, అజానంత్యా = తెలియని, మే = నాచే, త్వయి = నీయందు, ప్రసంగః = దృఢమగు సంగము, కృతః = చేయబడినది, తథా అపి = అయినప్పటికీ, మే = నాకు, అభయాయ = అభయము కొరకు, అస్తు = అగుగాక!

నేను ఇంద్రియభోగములయందాసక్తి గలదాననై పరమార్థమును తెలియలేకపోతిని. ఆ విధముగా నాకు నీయందు దృఢమగు సంగము ఏర్పడినది. అయిననూ, నాకు సంసారభయమునుండి విముక్తి కలుగుగాక!

సంగో యస్సంసృతేర్హేతురసత్సు విహితోఽధియా ।
స ఏవ సాధుషు కృతో నిస్సంగత్వాయ కల్పతే ॥ 55

అధియా = అజ్ఞానముచే, అసత్సు = దుష్టులయందు, విహితః = చేయబడిన, యః = ఏ, సంగః = ఆసక్తి, సంసృతేః = సంసారమునకు, హేతుః = కారణమో, సః = ఆ, సంగః ఏవ = సంగమే, సాధుషు = సత్పురుషులయందు, కృతః = చేయబడినదై, నిస్సంగత్వాయ = సంగవిముక్తి కొరకు, కల్పతే = సమర్థమగును.

అవివేకి దుష్టులతో సంగము చేసి సంసారములో పడును. అదే సంగమును సత్పురుషులతో చేసినచో, సంగ (సంసార) విముక్తి కలుగును.

నేహ యత్కర్మ ధర్మాయ న విరాగాయ కల్పతే ।
న తీర్థపదసేవాయై జీవన్నపి మృతో హి సః ।। 56

ఇహ = ఈ సంసారములో, యత్-కర్మ = ఎవని కర్మ, ధర్మాయ = ధర్మము కొరకు, న కల్పతే = సమర్థము కాదో, విరాగాయ = వైరాగ్యము కొరకు, న = కాదో, తీర్థపదసేవాయై = భగవానుని సేవకొరకు, న = కాదో, సః = అట్టివాడు, జీవన్ అపి = జీవించుచున్ననూ, మృతః హి = మరణించినవాడే గదా!

ఈ సంసారములో ఎవని కర్మ ధర్మము కొరకు గాని, వైరాగ్యము కొరకు గాని, భగవానుని సేవ కొరకు గాని సమర్థము కాదో, వాడు జీవించి యున్ననూ మరణించినవానితో సమానమే.

సాహం భగవతో నూనం వంచితా మాయయా దృఢమ్ ।
యత్త్వాం విముక్తిదం ప్రాప్య న ముముక్షేయ బంధనాత్।।57

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
త్రయోవింశోఽధ్యాయః ।।

సా = అట్టి, అహమ్ = నేను, భగవతః = భగవానుని, మాయయా = మాయచే, దృఢమ్ = గట్టిగా, వంచితా = వంచింపబడితిని, నూనమ్ = నిశ్చయము, యత్ = ఏలయనగా, విముక్తిదమ్ = మోక్షమునిచ్చే, త్వామ్ =

నిన్ను, ప్రాప్య = పొంది, బంధనాత్ = బంధమునుండి, న ముముక్షేయ = మోక్షమును పొందుటలేదు.

భగవానుని మాయ నన్ను నిశ్చయముగా వంచించినది. ఏలయనగా, నీ అనుగ్రహముచే నేను జ్ఞానమును తద్ద్వారా మోక్షమును పొందే అవకాశము ఉన్ననూ, ఈ సంసారబంధమునుండి విముక్తిని పొందలేకపోతిని.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
ఇరువది మూడవ అధ్యాయము ముగిసినది (23).

* * * * *

# అథ చతుర్వింశోऽధ్యాయః

## శ్రీ కపిల భగవానుడు జన్మించుట

మైత్రేయ ఉవాచ ।
నిర్వేదవాదినీమేవం మనోర్దుహితరం మునిః ।
దయాలుశ్శాలినీమాహ శుక్లాభివ్యాహృతం స్మరన్ ॥ 1

మైత్రేయః = మైత్రేయుడు, ఉవాచ = పలికెను, ఏవమ్ = ఈ విధముగా, నిర్వేదవాదినీమ్ = వైరాగ్యముతో కూడిన పలుకులను పలుకుచున్న, శాలినీమ్ = ఉత్తమగుణములతో ప్రకాశించే, మనోః = మను చక్రవర్తి యొక్క, దుహితరమ్ = కుమార్తెయగు దేవహూతిని గురించి, దయాలుః = దయాశీలుడగు, మునిః = కర్దమ మహర్షి, శుక్ల-అభివ్యాహృతమ్ = శ్రీహరిచే చెప్పబడిన విషయమును, స్మరన్ = స్మరించువాడై, ఆహ = పలికెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా ఉత్తమగుణములతో ప్రకాశించే మనుపుత్రియగు దేవహూతి వైరాగ్యము నిండిన పలుకులను పలికెను. అప్పుడు దయాస్వభావము గల కర్దముడు శ్రీహరి చెప్పిన విషయములను స్మరించి ఆమెతో నిట్లనెను.

ఋషిరువాచ ।
మా ఖిదో రాజపుత్రీత్థమాత్మానం ప్రత్యనిందితే ।
భగవాంస్తేఽక్షరో గర్భమదూరాత్సంప్రపత్స్యతే ॥ 2

రాజపుత్రి = ఓ రాజపుత్రీ!, ఇత్థమ్ = ఈ విధముగా, ఆత్మానం ప్రతి = నీ గురించి నీవు, మా ఖిదః = దుఃఖించకుము, అనిందితే = దోషము లేనిదానా!, అక్షరః = అవినాశియగు, భగవాన్ = శ్రీహరి భగవానుడు, అదూ

రాత్ = తొందరలోనే, తే = నీ, గర్భమ్ = గర్భమును, సంప్రపత్స్యతే = పొందగలడు.

కర్దమ మహర్షి ఇట్లు పలికెను --- దోషమునెరుంగని ఓ రాజకుమారీ! ఈ విధముగా నీ గురించి నీవు ఖేదపడకుము. అక్షర పరబ్రహ్మస్వరూపుడగు శ్రీహరి తొందరలోనే నీ గర్భమునందు ప్రవేశించగలడు.

ధృతవ్రతాసి భద్రం తే దమేన నియమేన చ ।
తపోద్రవిణదానైశ్చ శ్రద్ధయా చేశ్వరం భజ ॥ 3

ధృతవ్రతా = అనుష్ఠించబడిన వ్రతములు గలదానవు, అసి = అగుచున్నావు, తే = నీ కొరకు, భద్రమ్ = మంగళమగుగాక!, దమేన = ఇంద్రియ నిగ్రహముతో, నియమేన = నియమముతో, తపోద్రవిణదానైః చ = తపస్సుతో మరియు ధనదానములతో, శ్రద్ధయా = శ్రద్ధతో, ఈశ్వరమ్ = ఈశ్వరుని, భజ = సేవించుము.

నీవు వ్రతములననుష్ఠించిన దానవు. నీకు మంగళమగు గాక! నీవు ఇంద్రియములను నిగ్రహించి నియమమును పాటిస్తూ ధనాదికమును దానము చేసి శ్రద్ధతో ఈశ్వరుని గురించి తపస్సును చేయుము.

స త్వయాఽఽరాధితశ్శుక్లో వితన్వన్మామకం యశః ।
ఛేత్తా తే హృదయగ్రంథిమౌదర్యో బ్రహ్మభావనః ॥ 4

త్వయా = నీచే, ఆరాధితః = ఆరాధించబడిన, సః = ఆ, శుక్లః = శ్రీహరి, మామకమ్ = నా, యశః = కీర్తిని, వితన్వన్ = విస్తరింపజేయువాడై, ఔదర్యః = పుత్రుడై, బ్రహ్మభావనః = బ్రహ్మజ్ఞానమునుపదేశించువాడై, తే = నీ, హృదయగ్రంథిమ్ = అజ్ఞానమనే హృదయగ్రంథిని, ఛేత్తా = నశింపజేయగలడు.

నీచే ఆరాధించబడిన ఆ శ్రీహరి నీకు పుత్రుడై పుట్టి, నా కీర్తిని విస్తరింపజేసి, నీకు బ్రహ్మజ్ఞానమునుపదేశించి, నీ అజ్ఞానమనే హృదయగ్రంథిని నిర్మూలించగలడు.

మైత్రేయ ఉవాచ ।
దేవహూత్యపి సందేశం గౌరవేణ ప్రజాపతేః ।
సమ్యక్ శ్రద్ధాయ పురుషం కూటస్థమభజద్గురుమ్ ॥ 5

దేవహూతిః అపి = దేవహూతి కూడ, ప్రజాపతేః = కర్దమ ప్రజాపతి యొక్క, సందేశమ్ = సందేశమును, గౌరవేణ = గౌరవముతో, సమ్యక్ = చక్కగా, శ్రద్ధాయ = శ్రద్ధతో స్వీకరించి, కూటస్థమ్ = నిర్వికారుడు, గురుమ్ = జగత్తునకు తండ్రి (గురువు, గురువు కాబోవువాడు) అగు, పురుషమ్ = పురుషోత్తముని, అభజత్ = సేవించెను.

దేవహూతి కూడ కర్దమ ప్రజాపతియొక్క సందేశమును చక్కగా మర్యాదగా శ్రద్ధతో స్వీకరించెను. నిర్వికారుడు, జగత్తునకు తండ్రి, గురువు, తనకు గురువు కాబోవువాడు అగు పురుషోత్తముని ఆమె సేవించెను.

తస్యాం బహుతిథే కాలే భగవాన్ మధుసూదనః ।
కార్దమం వీర్యమాపన్నో జజ్ఞేఽగ్నిరివ దారుణి ॥ 6

బహుతిథే = అధికమగు, కాలే= కాలము (గడువగా), మధుసూదనః = మధువు అనే రాక్షసుని సంహరించిన, భగవాన్ = శ్రీహరి భగవానుడు, కార్దమమ్ = కర్దమునకు చెందిన, వీర్యమ్ = వీర్యమును, ఆపన్నః = పొందినవాడై, తస్యామ్ = ఆమెయందు, దారుణి = కట్టెయందు, అగ్నిః ఇవ = అగ్ని వలె, జజ్ఞే = జన్మించెను.

చాల రోజులు గడిచిన తరువాత మధువు అనే రాక్షసుని సంహరించిన శ్రీహరి భగవానుడు కర్దముని వీర్యము ద్వారా ఆమెయందు, కట్టెయందు అగ్నివలె, జన్మించెను.

అవాదయంస్తదా వ్యోమ్ని వాదిత్రాణి ఘనాఘనాః ।
గాయంతి తం స్మ గంధర్వా నృత్యంత్యప్సరసో ముదా ॥ 7

తదా = అప్పుడు, వ్యోమ్ని = ఆకాశమునందు, ఘనాఘనాః = వర్షించే మేఘములు, వాదిత్రాణి = వాద్యములను, అవాదయన్ = మ్రోగిం

చినవి, తమ్ = ఆ శ్రీహరిని గురించి, గంధర్వాః = గంధర్వులు, గాయంతి స్మ = గానమును చేసిరి, అప్సరసః = అప్సరసలు, ముదా = ఆనందముతో, నృత్యంతి స్మ = నాట్యమును చేసిరి.

అప్పుడు ఆకాశములో మేఘములు వాద్యఘోషలవంటి గర్జనలను చేయుచూ వర్షించినవి. గంధర్వులు శ్రీహరి గాథలను గానము చేయగా, అప్సరసలు నాట్యమును చేసిరి.

పేతుస్సుమనసో దివ్యాః ఖేచరైరపవర్జితాః ।
ప్రసేదుశ్చ దిశస్సర్వా అంభాంసి చ మనాంసి చ ॥ 8

ఖేచరైః = దేవతలచే, అపవర్జితాః = విడిచిపెట్టబడిన, దివ్యాః = దేవలోకమునకు సంబంధించిన, సుమనసః = పుష్పములు, పేతుః = పడినవి, సర్వాః = అన్ని, దిశః = దిక్కులు, అంభాంసి = జలములు, చ = మరియు, మనాంసి చ = మనస్సులు కూడ, ప్రసేదుః = ప్రసన్నములైనవి.

దేవతలు దేవలోకమునందలి పుష్పములను వర్షించిరి. దిక్కులన్నియు నిర్మలములైనవి. జలాశయములు, సకలప్రాణుల మనస్సులు కూడ నిర్మలములైనవి.

తత్కర్దమాశ్రమపదం సరస్వత్యా పరిశ్రితమ్ ।
స్వయంభూస్సాకమృషిభిర్మరీచ్యాదిభిరభ్యయాత్ ॥ 9

సరస్వత్యా = సరస్వతీనదిచే, పరిశ్రితమ్ = చుట్టువారబడియున్న, తత్ = ఆ, కర్దమ-ఆశ్రమపదమ్ = కర్దముని ఆశ్రమస్థానమును గురించి, స్వయంభూః = బ్రహ్మగారు, మరీచి-ఆదిభిః = మరీచి మొదలగు, ఋషిభిః సాకమ్ = మహర్షులతో గూడి, అభ్యయాత్ = విచ్చేసెను.

సరస్వతీనదిచే చుట్టువారబడియున్న కర్దముని ఆశ్రమమునకు బ్రహ్మగారు మరీచి మొదలగు మహర్షులతో గూడి విచ్చేసెను.

భగవంతం పరం బ్రహ్మ సత్త్వేనాంశేన శత్రుహన్ ।
తత్త్వసంఖ్యానవిజ్ఞప్త్యై జాతం విద్వానజస్స్వరాట్ ॥ 10

సభాజయన్ విశుద్ధేన చేతసా తచ్చికీర్షితమ్ ।
ప్రహృష్యమాణైరసుభిః కర్దమం చేదమభ్యధాత్ ।। 11

శత్రుహన్ = అంతశ్శత్రువులను జయించిన ఓ విదురా!, సత్త్వేన = సత్త్వగుణమయమగు, అంశేన = అంశచే, తత్త్వసంఖ్యానవిజ్ఞప్త్యై = ప్రకృతి మొదలగు తత్త్వముల నిరూపణము గల శాస్త్రముయొక్క బోధ కొరకై, జాతమ్ = జన్మించిన, పరం బ్రహ్మ = పరబ్రహ్మస్వరూపుడగు, భగవంతమ్ = శ్రీహరి భగవానుని, విద్వాన్ = తెలుసుకున్న, అజః = పుట్టుక లేని, స్వరాట్ = స్వయంసిద్ధమగు జ్ఞానముతో సంపన్నుడైన బ్రహ్మగారు, ప్రహృష్యమాణైః = మహానందముతో నిండిన, అసుభిః = ఇంద్రియములతో, విశుద్ధేన = పరిశుద్ధమగు, చేతసా = మనస్సుతో, తత్-చికీర్షితమ్ = ఆ భగవానుడు చేయగోరిని పనిని, సభాజయన్ = అభినందించువాడై, కర్దమం చ = కర్దముని గురించి, ఇదమ్ = ఈ మాటను, అభ్యధాత్ = చెప్పెను.

అంతశ్శత్రువులను జయించిన ఓ విదురా! పరబ్రహ్మ స్వరూపుడగు శ్రీహరి భగవానుడు సత్త్వగుణప్రధానమగు అంశతో జన్మించినాడని పుట్టుక లేని బ్రహ్మగారికి తెలియును. ఆయన ప్రకృతి మొదలగు తత్త్వములను నిరూపించే శాస్త్రమును లోకములో బోధించ గోరుచున్నాడని కూడ స్వయంసిద్ధజ్ఞానసంపన్నుడగు బ్రహ్మగారికి తెలియును. ఆయన ఇంద్రియములన్నియు అతిశయించిన ఆనందమును ప్రకటించుచుండెను. ఆయన పరిశుద్ధమగు మనస్సుతో భగవానుని సంకల్పమునభినందించి, కర్దమునితో నిట్లనెను.

బ్రహ్మోవాచ ।
త్వయా మేఽపచితిస్తాత కల్పితా నిర్వ్యలీకతః ।
యన్మే సంజగృహే వాక్యం భవాన్మానద మానయన్ ।। 12

తాత = ఓ వత్సా!, త్వయా = నీచే, నిర్వ్యలీకతః = నిష్కపటముగా, మే = నాకు, అపచితిః = పూజ, కల్పితా = చేయబడినది, మానద = మర్యాదనిచ్చువాడా!, యత్ = ఏలయనగా, భవాన్ = నీవు, మే = నా,

వాక్యమ్ = వాక్యమును, మానయన్ = మర్యాదనిచ్చువాడవై, సంజగృహే = స్వీకరించితివో.

బ్రహ్మగారు ఇట్లు పలికెను --- ఓ వత్సా! పెద్దలకు మర్యాదనిచ్చే స్వభావము నీది. నీవు నాకు నిష్కపటముగా పూజను చేసితివి. ఏలయన గా, నీవు నా ఆజ్ఞను మర్యాదతో పాలించితివి.

ఏతావత్యేవ శుశ్రూషా కార్యా పితరి పుత్రకైః ।
బాఢమిత్యనుమన్యేత గౌరవేణ గురోర్వచః ॥ 13

పుత్రకైః = పుత్రులచే, పితరి = తండ్రి విషయములో, ఏతావతీ ఏవ = ఇంతమాత్రమే, శుశ్రూషా = సేవ, కార్యా = చేయదగినది, గురోః = తండ్రి యొక్క, వచః = మాటను, బాఢమ్ = సరే, ఇతి = అని, గౌరవేణ = మర్యాద తో, అనుమన్యేత = అంగీకరించవలెను.

పుత్రులు తండ్రికి ఇంతమాత్రము సేవను చేయవలెను. అది యేద న, వారు తండ్రి మాటను గౌరవముతో సరే అని అంగీకరించవలెను.

ఇమా దుహితరస్సభ్య తవ వత్స సుమధ్యమాః ।
సర్గమేతం ప్రభావైస్స్వైర్బృహయిష్యంత్యనేకధా ॥ 14

వత్స = కుమారా!, సభ్య = యోగ్యుడా!, సుమధ్యమాః = సుందరు లగు, ఇమాః = ఈ, తవ = నీ, దుహితరః = కుమార్తెలు, స్వైః = తమ, ప్రభావైః = వంశములచే, ఏతమ్ = ఈ, సర్గమ్ = సృష్టిని, అనేకధా = అనేకవి ధములుగా, బృహయిష్యంతి = వర్ధిల్లజేయగలరు.

ఓ కుమారా! నీవు యోగ్యుడవు. నీ ఈ కుమార్తెలు సుందరులు. వీరు తమ వంశముల ద్వారా ఈ సృష్టిని పలువిధముల వర్ధిల్లజేయగలరు.

అతస్త్వమృషిముఖ్యేభ్యో యథాశీలం యథారుచి ।
ఆత్మజాః పరిదేహ్యద్య విస్తృణీహి యశో భువి ॥ 15

అతః = కావున, త్వమ్ = నీవు, ఋషిముఖ్యేభ్యః = మహర్షుల కొర కు, యథాశీలమ్ = స్వభావమునతిక్రమించకుండగా, యథారుచి = అభిరు

చికి తగ్గట్లుగా, అద్య = ఈ కాలములో, ఆత్మజాః = కుమార్తెలను, పరిదేహి = ఇచ్చి వివాహమును చేయుము, భువి = భూలోకమునందు, యశః = కీర్తిని, విస్తృణీహి = విస్తరింపజేయుము.

కావున నీవీ కాలములో మహర్షులకు వారి వారి స్వభావమునకు రుచులకు తగ్గట్లుగా నీ కుమార్తెలనిచ్చి వివాహము చేసి, భూలోకములో నీ కీర్తిని విస్తరింపజేయుము.

వేదాహమాద్యం పురుషమవతీర్ణం స్వమాయయా ।
భూతానాం శేవధిం దేహం బిభ్రాణం కపిలం మునే ।। **16**

మునే = ఓ మహర్షీ!, భూతానామ్ = ప్రాణులకు, శేవధిమ్ = నిధియగు, ఆద్యం పురుషమ్ = ఆదిపురుషుడైన శ్రీహరిని, స్వమాయయా = తన మాయచే, దేహమ్ = దేహమును, బిభ్రాణమ్ = ధరించియున్నవానినిగా, కపిలమ్ = కపిలునిగా, అవతీర్ణమ్ = అవతరించినవానినిగా, అహమ్ = నేను, వేద = తెలియుచున్నాను.

ఓ మహర్షీ! నాకు తెలుసు. సకలప్రాణులకు నిధి (మనోరథములనీడేర్చువాడు), ఆదిపురుషుడు అగు శ్రీహరి తన మాయచే దేహమును దాల్చి కపిలునిగా అవతరించినాడు.

జ్ఞానవిజ్ఞానయోగేన కర్మణాముద్ధరన్ జటాః ।
హిరణ్యకేశః పద్మాక్షః పద్మముద్రాపదాంబుజః ।। **17**

ఏష మానవి తే గర్భం ప్రవిష్టః కైటభార్దనః ।
అవిద్యాసంశయగ్రంథిం ఛిత్త్వా గాం విచరిష్యతి ।। **18**

మానవి = ఓ మనుపుత్రీ!, హిరణ్యకేశః = తేజోమయమైన కేశములు గలవాడు, పద్మ-అక్షః = పద్మములవంటి కన్నులు గలవాడు, పద్మముద్రాపద-అంబుజః = పద్మాకారపు రేఖలు గల పాదపద్మములు గలవాడు, కైటభ-అర్దనః = కైటభాసురుని సంహరించినవాడు అగు, ఏషః = ఈ శ్రీహరి, తే = నీ, గర్భమ్ = గర్భమును, ప్రవిష్టః = ప్రవేశించినాడు, జ్ఞానవి

జ్ఞానయోగేన = జ్ఞాన (పరోక్షమగు ఆత్మజ్ఞానము) విజ్ఞానము (ప్రత్యక్షమైన అదే జ్ఞానము) లు అనే ఉపాయముచే, కర్మణామ్ = కర్మల, జటాః = వాసనామూలములను, ఉద్ధరన్ = పెకలించువాడై, అవిద్యాసంశయగ్రంథిమ్ = స్వరూపముయొక్క అజ్ఞానము మరియు సంశయములు అనే ముడిని, ఛిత్త్వా = కోసివేసి, గామ్ = భూమిని, విచరిష్యతి = సంచరించగలడు.

ఓ మనుపుత్రీ! తేజోమయమగు కేశములు గలవాడు, పద్మముల వంటి కన్నులు పాదములు గలవాడు, పాదములయందు పద్మాకారపు రేఖలు గలవాడు, కైటభాసురుని సంహరించినవాడు అగు శ్రీహరి నీ గర్భమును ప్రవేశించి ఈ కపిలుడై జన్మించినాడు. ఆత్మస్వరూపమును తెలియుట, దానియందు నిష్ఠను కలిగియుండుట అనే యోగవ ు ద్వారా ఈయన జిజ్ఞాసువుల వాసనలను నశింపజేయగలడు. ఈ వాసనలే కర్మలకు మూలములోనుండి బంధించుచున్నవి. ఈయన స్వరూపముయొక్క అజ్ఞానము, ఇతరసంశయములు అనే జనుల హృదయగ్రంథిని ఛేదిస్తూ, భూలోకములో పర్యటించగలడు.

అయం సిద్ధగణాధీశస్సాంఖ్యాచార్యైస్సుసమ్మతః ।
లోకే కపిల ఇత్యాఖ్యాం గంతా తే కీర్తివర్ధనః ॥ 19

సిద్ధగణ-అధీశః = సిద్ధుల గణములకు అధీశ్వరుడు, సాంఖ్య-ఆచార్యైః = సాంఖ్యశాస్త్రవిద్వాంసులచే, సుసమ్మతః = చాల ఆదరణీయుడు అగు, అయమ్ = ఈ బాలుడు, లోకే = లోకమునందు, కపిలః = కపిలుడు, ఇతి = అనే, ఆఖ్యామ్ = ప్రసిద్ధిని, గంతా = పొందగలడు, తే = నీ, కీర్తివర్ధనః = కీర్తిని వర్ధిల్లజేయగలడు.

ఈ బాలకుడు సిద్ధుల గణములకు అధీశ్వరుడై, తత్త్వనిరూపణమును చేసే సాంఖ్యశాస్త్రములో విద్వాంసులగు మహాత్ములచే ఆదరించబడగలడు. ఈయన లోకములో కపిలుడను పేరిట ప్రసిద్ధిని గాంచి, నీ కీర్తిని ఇనుమడింప జేయగలడు.

మైత్రేయ ఉవాచ ।
తావాశ్వాస్య జగత్స్రష్టా కుమారైస్సహనారదః ।

హంసో హంసేన యానేన త్రిధామ పరమం యయౌ ।। 20

జగత్-స్రష్టా = జగత్తును సృష్టించిన, హంసః = బ్రహ్మగారు, తౌ = వారిద్దరిని, ఆశ్వాస్య = నచ్చజెప్పి, కుమారైః = సనకాదులతో, సహనారదః = నారదునితో గూడినవాడై, యానేన = వాహనమైన, హంసేన = హంసచే, పరమమ్ = అన్ని లోకములను అతిశయించి ఉండే, త్రిధామ = మూడవ లోకమగు స్వర్గమును గురించి, యయౌ = వెళ్లెను.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- సృష్టికర్తయగు బ్రహ్మగారు ఈ విధముగా దేవహూతికి కర్దమునకు నచ్చజెప్పి, సనకాదులు నారదుడు వెంట రాగా, తన హంసవాహనముపై బ్రహ్మాండములో సర్వోత్కృష్టమగు బ్రహ్మలోకమునకు వెళ్లెను.

గతే శతధృతౌ క్షత్తః కర్దమస్తేన చోదితః ।
యథోదితం స్వదుహితౄః ప్రాదాద్విశ్వసృజాం తతః ।। 21

క్షత్తః = ఓ విదురా!, తతః = తరువాత, శతధృతౌ = బ్రహ్మగారు, గతే = వెళ్లగా, తేన = ఆయనచే, చోదితః = ఆజ్ఞాపించబడిన, కర్దమః = కర్దముడు, యథా-ఉదితమ్ = యథావిధిగా, స్వదుహితౄః = తన కుమార్తెలను, విశ్వసృజామ్ = ప్రజాపతులకు, ప్రాదాత్ = ఇచ్చెను.

ఓ విదురా! బ్రహ్మగారు వెళ్లిన తరువాత ఆయన ఆజ్ఞ ప్రకారముగా కర్దముడు తన కుమార్తెలను ప్రజాపతులకు ఇచ్చి యథావిధిగా వివాహములను చేసెను.

మరీచయే కలాం ప్రాదాదనసూయామథాత్రయే ।
శ్రద్ధామంగిరసేऽయచ్ఛత్పులస్త్యాయ హవిర్భువమ్ ।। 22

మరీచయే = మరీచి కొరకు, కలామ్ = కళను, అథ = తరువాత, అత్రయే = అత్రి కొరకు, అనసూయామ్ = అనసూయను, ప్రాదాత్ = ఇచ్చెను, అంగిరసే = అంగిరసుని కొరకు, శ్రద్ధామ్ = శ్రద్ధను, పులస్త్యాయ = పులస్త్యుని కొరకు, హవిర్భువమ్ = హవిర్భువను, అయచ్ఛత్ = ఇచ్చెను.

తరువాత ఆయన కళను మరీచికి, అనసూయను అత్రికి, శ్రద్ధను అంగిరసునకు, హవిర్భువను పులస్త్యునకు ఇచ్చి పెళ్లి చేసెను.

పులహాయ గతిం యుక్తాం క్రతవే చ క్రియాం సతీమ్ ।
ఖ్యాతిం చ భృగవేఽయచ్ఛద్వసిష్ఠాయాప్యరుంధతీమ్ ॥ 23

పులహాయ = పులహుని కొరకు, యుక్తామ్ = యోగ్యురాలగు, గతిమ్ = గతిని, చ = మరియు, క్రతవే = క్రతువు కొరకు, సతీమ్ = సాధ్వియగు, క్రియామ్ = క్రియను, భృగవే చ = భృగువు కొరకు, ఖ్యాతిమ్ = ఖ్యాతిని, వసిష్ఠాయ అపి = వసిష్ఠుని కొరకు కూడ, అరుంధతీమ్ = అరుంధతిని, అయచ్ఛత్ = ఇచ్చెను.

కర్దముడు పులహునకు యోగ్యురాలగు గతిని, క్రతువునకు సాధ్వియగు క్రియను, భృగువునకు ఖ్యాతిని, వసిష్ఠునకు అరుంధతిని ఇచ్చి వివాహము చేసెను.

అథర్వణేఽదదాచ్ఛాంతిం యయా యజ్ఞో వితన్యతే ।
విప్రర్షభాన్ కృతోద్వాహాన్ సదారాన్ సమలాలయత్ ॥ 24

అథర్వణే = అథర్వుని కొరకు, శాంతిమ్ = శాంతిని, అదదాత్ = ఇచ్చెను, యయా = ఏ శాంతిచే, యజ్ఞః = యజ్ఞము, వితన్యతే = సమృద్ధము చేయబడుచున్నదో, కృత-ఉద్వాహాన్ = చేయబడిన వివాహములు గల, సదారాన్ = భార్యలతో కూడియున్న, విప్ర-ఋషభాన్ = మహర్షులను, సమలాలయత్ = సంతోషపరచెను.

ఆయన శాంతిని అథర్వణునకు ఇచ్చి వివాహము చేసెను. శాంతి వలననే యజ్ఞములు సమృద్ధములగును. వివాహమాడి భార్యలతో గూడియున్న ఆ మహర్షులను కర్దముడు బహుమానములతో సంతోషపెట్టెను.

తతస్త ఋషయః క్షత్తః కృతదారా నిమంత్ర్య తమ్ ।
ప్రాతిష్ఠన్ నందిమాపన్నాస్స్వం స్వమాశ్రమమండలమ్ ॥25

క్షత్తః = ఓ విదురా!, తతః = తరువాత, కృతదారాః = వివాహమైన, తే = ఆ, ఋషయః = మహర్షులు, నందిమ్ = ఆనందమును, ఆపన్నాః = పొందినవారై, తమ్ = ఆ కర్దముని, నిమంత్ర్య = సెలవు తీసుకొని, స్వం స్వమ్ = తమ తమ, ఆశ్రమమండలమ్ = ఆశ్రమస్థానమును గురించి, ప్రాతిష్ఠన్ = బయలుదేరిరి.

ఓ విదురా! తరువాత భార్యలతో గూడియున్న ఆ మహర్షులు ఆనందించి కర్దముని సెలవు తీసుకొని, తమ తమ ఆశ్రమములకు వెళ్లిరి.

స చావతీర్ణం త్రియుగమాజ్ఞాయ విబుధర్షభమ్ ।
వివిక్త ఉపసంగమ్య ప్రణమ్య సమభాషత ॥ **26**

సః చ = ఆ కర్దముడు కూడ, విబుధ-ఋషభమ్ = దేవశ్రేష్ఠుడగు, త్రియుగమ్ = శ్రీహరిని, అవతీర్ణమ్ = అవతరించినవానిగా, ఆజ్ఞాయ = తెలుసుకొని, వివిక్తే = ఏకాంతమునందు, ఉపసంగమ్య = దగ్గరకు వెళ్లి, ప్రణమ్య = నమస్కరించి, సమభాషత = సంభాషించెను.

కర్దముడు కూడ దేవశ్రేష్ఠుడు, కృతత్రేతాద్వాపరములు అనే మూడు యుగములలో మాత్రమే దర్శనమిచ్చువాడు (ఈశ్వరభావము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము అనే మూడు రెళ్లు ఆరు గుణములతో సంపన్నుడు) అగు శ్రీహరి అవతరించినాడని తెలుసుకొని, ఏకాంతములో ఆయన వద్దకు వెళ్లి నమస్కరించి సంభాషించెను.

అహో పాపచ్యమానానాం నిరయే స్వైరమంగలైః ।
కాలేన భూయసా నూనం ప్రసీదంతీహ దేవతాః ॥ **27**

అహో = ఆహా!, స్వైః = తమ, అమంగలైః = పాపములచే, ఇహ = ఈ, నిరయే = నరకము (సంసారము) నందు, పాపచ్యమానానామ్ = పీడింపబడుచున్నవారికి, భూయసా = చాల, కాలేన = కాలముచే, దేవతాః = దేవతలు, ప్రసీదంతి = ప్రసన్నులగుచున్నారు, నూనమ్ = నిశ్చయము.

ఆశ్చర్యము! తమ పాపములచే నరకమువంటి ఈ సంసారము నందు పీడలను పొందుచున్న జనులపై చాల కాలము తరువాత దేవత లకు అనుగ్రహము కలిగినది. ఇది నిశ్చయము.

బహుజన్మవిపక్వేన సమ్యగ్యోగసమాధినా ।
ద్రష్టుం యతంతే యతయశ్శూన్యాగారేషు యత్పదమ్॥28

శూన్య-అగారేషు = నిర్జనస్థానములయందు, యతయః = సాధకు లు, బహుజన్మవిపక్వేన = అనేకజన్మలయందు పక్వమైన, సమ్యక్-యోగ సమాధినా = సుదృఢమగు యోగాభ్యాసముచే లభించిన చిత్తైకాగ్రతతో, యత్-పదమ్ = ఏ భగవానుని స్వరూపమును, ద్రష్టుమ్ = చూచుటకు, యతంతే = ప్రయత్నించెదరో.

సాధకులు అనేకజన్మలలో యోగమును అభ్యసించుట వలన అది సుదృఢమై చిత్తమునకు ఏకాగ్రత లభించును. వారు నిర్జనప్రదేశమునందు అట్టి చిత్తములో ఆ శ్రీహరియొక్క స్వరూపమును దర్శించుటకు ప్రయత్నించుచుందురు.

స ఏవ భగవానద్య హేలనం నగణయ్య నః ।
గృహేషు జాతో గ్రామ్యాణాం యస్స్వానాం పక్షపోషణః॥29

సః = అట్టి, భగవాన్ ఏవ = భగవానుడే, అద్య = ఈనాడు, హేల నమ్ = చులకన అగుటను, నగణయ్య = లెక్కచేయక, గ్రామ్యాణామ్ = వివే కము లేని, నః = మా, గృహేషు = ఇంటియందు, జాతః = పుట్టినాడు, యః = ఏ హరి, స్వానామ్ = భక్తుల, పక్షపోషణః = పక్షమును సమర్థించునో.

శ్రీహరి భగవానుడు తన భక్తుల పక్షమును సమర్థించును. కావున నే, అట్టి ఆ భగవానుడు తాను చులకన అగుదునేమో యని సరకు చేయ కుండా, ఈనాడు అవివేకులమగు మా ఇంటిలో జన్మించినాడు.

స్వీయం వాక్యమృతం కర్తుమవతీర్ణోఽసి మే గృహే ।
చికీర్షుర్భగవాన్ జ్ఞానం భక్తానాం మానవర్ధనః ॥ 30

భక్తానామ్ = భక్తుల, మానవర్ధనః = హోదాను వర్ధిల్లజేసే, భగవాన్ = భగవానుడవగు నీవు, జ్ఞానమ్ = సాంఖ్యశాస్త్రమును, చికీర్షుః = చేయగోరువాడవై, స్వీయమ్ = నీ, వాక్యమ్ = మాటను, ఋతమ్ = సత్యము, కర్తుమ్ = చేయుటకు, మే = నా, గృహే = ఇంటిలో, అవతీర్ణః అసి = అవతరించితివి.

భగవానుడవగు నీవు భక్తుల హోదాను వర్ధిల్లజేసెదవు. నీవు సాంఖ్యశాస్త్రమును లోకములో ప్రవర్తిల్ల జేయగోరి, నాకిచ్చిన మాటను యథార్థము చేయుటకై నా గృహములో అవతరించితివి.

తాన్యేవ తేఽభిరూపాణి రూపాణి భగవంస్తవ ।
యాని యాని చ రోచంతే స్వజనానామరూపిణః ॥ 31

భగవన్ = ఓ భగవానుడా!, యాని యాని = ఏయే, తవ = నీ, రూపాణి = రూపములు, స్వజనానామ్ = నీ భక్తులకు, రోచంతే = ఇష్టమగునో, తాని ఏవ = అవియే, అరూపిణః = రూపము లేని, తే = నీ కొరకు, అభిరూపాణి = అభీష్టములు.

ఓ భగవానుడా! నీవు రూపము లేనివాడవు. నీ భక్తులకు నీ ఏయే రూపములు ఇష్టమగునో, అవియే నీకు కూడ అభీష్టములగుచున్నవి.

త్వాం సూరిభిస్తత్త్వబుభుత్సయాద్ధా
సదాభివాదార్హణపాదపీఠమ్ ।
ఐశ్వర్యవైరాగ్యయశోఽవబోధ-
వీర్యశ్రియా పూర్తమహం ప్రపద్యే ॥ 32

సూరిభిః = విద్వాంసులచే, తత్త్వబుభుత్సయా = తత్త్వముల స్వరూపమును తెలియాలనే కోరికతో, అద్ధా = సాక్షాత్తుగా, సదా = ఎల్లవేళలా, అభివాద-అర్హణపాదపీఠమ్ = నమస్కరించదగిన పాదపీఠము గలిగినట్టియు, ఐశ్వర్యవైరాగ్యయశః-అవబోధవీర్యశ్రియా = ఈశ్వరభావము వైరాగ్యము యశస్సు జ్ఞానము వీర్యము మరియు శ్రీ అను ఆరు గుణములతో,

పూర్ణమ్ = పూర్ణుడవైన, త్వామ్ = నిన్ను, అహమ్ = నేను, ప్రపద్యే = శరణు వేడుచున్నాను.

విద్వాంసులు తత్త్వముల స్వరూపమును తెలియగోరి సర్వదా సాక్షాత్తుగా నీ పాదపీఠమునకు నమస్కరించెదరు. ఈశ్వరభావము, వైరాగ్యము, యశస్సు, జ్ఞానము, వీర్యము (శక్తి), శ్రీ (సంపద, శోభ) అనే ఆరు గుణములు నీలో పూర్ణముగా నున్నవి. నిన్ను నేను శరణు వేడుచున్నాను.

పరం ప్రధానం పురుషం మహాంతం
కాలం కవిం త్రివృతం లోకపాలమ్ ।
ఆత్మానుభూత్యానుగతప్రపంచం
స్వచ్ఛందశక్తిం కపిలం ప్రపద్యే ॥ 33

పరమ్ = ప్రకృతికి అతీతుడైనట్టియు, ప్రధానమ్ = ప్రకృతిస్వరూపుడైనట్టియు, పురుషమ్ = పురుషస్వరూపుడైనట్టియు, మహాంతమ్ = మహత్తత్త్వరూపుడైనట్టియు, కాలమ్ = కాలస్వరూపుడైనట్టియు, కవిమ్ = సర్వజ్ఞుడైనట్టియు, త్రివృతమ్ = మూడు విధముల అహంకారము స్వరూపముగా గలిగినట్టియు, లోకపాలమ్ = లోకపాలకుల రూపములోనున్నట్టియు, ఆత్మానుభూత్యా = తన చిచ్ఛక్తిచే, అనుగతప్రపంచమ్ = తనలో లీనము చేయబడిన బ్రహ్మాండము కలిగినట్టియు, స్వచ్ఛందశక్తిమ్ = తన అధీనము లోనున్న శక్తులు గల, కపిలమ్ = కపిల భగవానుని, ప్రపద్యే = శరణు వేడుచున్నాను.

నీవు ప్రకృతికి అతీతుడవు. జగత్తునకు ఉపాదానమగు ప్రధానము, దానికి అధ్యక్షుడగు పురుషుడు, దాని ప్రథమకార్యమగు మహత్తత్త్వము (సమష్టి బుద్ధిశక్తి), ప్రధానములో సంక్షోభమును కలిగించే కాలము, సాత్త్విక రాజస తామసములనే అహంకారములు, ఇంద్రాది లోకపాలకులు నీ రూపములే. సర్వజ్ఞుడవగు నీవు ప్రకృతిలోని పరిణామమును దర్శించే సాక్షివి. నీవు నీ చిచ్ఛక్తిచే బ్రహ్మాండమును వ్యాపించి నీలో విలీనము చేసెదవు. శక్తులన్నియు నీ వశములోనుండును. కపిలభగవానుడవగు నిన్ను నేను శరణు వేడుచున్నాను.

ఆ స్మాభిపృచ్ఛేఽద్య పతిం ప్రజానాం
త్వయావతీర్ణార్ణ ఉతాప్తకామః ।
పరివ్రజత్పదవీమాస్థితోఽహం
చరిష్యే త్వాం హృది యుంజన్ విశోకః ॥ 34

ప్రజానామ్ = ప్రాణులకు, పతిమ్ = ప్రభుడవగు నిన్ను, అద్య = ఈనాడు, ఆ స్మ అభి పృచ్ఛే = అనుజ్ఞను కోరుచున్నాను, త్వయా = నీచే, అవతీర్ణ-ఋణః = తీర్చివేయబడిన ఋణములు గలిగినట్టియు, ఉత = మరియు, ఆప్తకామః = పొందబడిన మనోరథములు గల, అహమ్ = నేను, పరివ్రజత్-పదవీమ్ = సన్న్యాసుల మార్గమును, ఆస్థితః = స్వీకరించినవాడనై, త్వామ్ = నిన్ను, హృది = హృదయమునందు, యుంజన్ = ధ్యానించువాడనై, విశోకః = శోకము లేనివాడనై, చరిష్యే = సంచరించెదను.

నీవు ప్రాణులకు ప్రభుడవు. నేనీనాడు నీ అనుమతిని కోరుచున్నాను. నీవు నాకు పుత్రుడవై జన్మించుటచే నా ఋణములన్నియు తీరిపోయినవి. నీ అనుగ్రహముచే నా కోరికలు సిద్ధించినవి. నేను సన్న్యాసాశ్రమమును స్వీకరించి నిన్ను మనస్సులో ధ్యానిస్తూ నిశ్చింతగా చరించెదను.

శ్రీభగవానువాచ ।
మయా ప్రోక్తం హి లోకస్య ప్రమాణం సత్యలౌకికే ।
అథాజని మయా తుభ్యం యదవోచమృతం మునే ॥ 35

మునే = ఓ మహర్షీ!, సత్యలౌకికే = వైదిక లౌకిక కర్మలయందు, మయా = నాచే, ప్రోక్తమ్ = చెప్పబడినది, లోకస్య = మానవునకు, ప్రమాణం హి = ప్రమాణము గదా!, అథ = కావున, తుభ్యమ్ = నీ కొరకు, యత్ = దేనిని, అవోచమ్ = చెప్పితినో అది, ఋతమ్ = సత్యము అగునట్లుగా, మయా = నాచే, అజని = జన్మించబడినది.

శ్రీభగవానుడు ఇట్లు పలికెను --- వైదిక లౌకిక కర్మలలో మానవునకు నేను చెప్పినదే ప్రమాణము. నీ పుత్రుడనై జన్మించెదనని నేను నీతో చెప్పియుంటిని. ఆ మాటను సత్యము చేయుటకై జన్మించితిని.

ఏతన్మే జన్మ లోకేఽస్మిన్ ముముక్షూణాం దురాశయాత్ ।
ప్రసంఖ్యానాయ తత్త్వానాం సమ్మతాయాత్మదర్శనే ।। 36

దురాశయాత్ = కలుషితమగు అంతఃకరణము అనే లింగశరీరము నుండి, ముముక్షూణామ్ = విముక్తిని కోరువారలకు, ఆత్మదర్శనే = ఆత్మ సాక్షాత్కారమునందు, సమ్మతాయ = ఉపయుక్తమైన, తత్త్వానామ్ = తత్త్వముల, ప్రసంఖ్యానాయ = వివేకపూర్వకముగా చెప్పుట కొరకు, అస్మిన్ = ఈ, లోకే = లోకమునందు, మే = నా, ఏతత్ = ఈ, జన్మ = జన్మ.

కలుషితమగు అంతఃకరణము జీవుని లింగశరీరరూపములో బంధించును. దానినుండి విముక్తిని పొంది ఆత్మసాక్షాత్కారమును కోరువారలకు తత్త్వముల వివేకపూర్వకమగు అవగాహన ఆవశ్యకము. దానిని బోధించుటకు నేనీ లోకములో ఈ విధముగా అవతరించితిని.

ఏష ఆత్మపథోఽవ్యక్తో నష్టః కాలేన భూయసా ।
తం ప్రవర్తయితుం దేహమిమం విద్ధి మయా భృతమ్ ।। 37

అవ్యక్తః = అతిసూక్ష్మమగు, ఏషః = ఈ, ఆత్మపథః = ఆత్మజ్ఞాన మార్గము, భూయసా = చాల, కాలేన = కాలముచే, నష్టః = కనుమరుగైనది, తమ్ = దానిని, ప్రవర్తయితుమ్ = ప్రవర్తిల్ల జేయుటకు, ఇమమ్ = ఈ, దేహమ్ = దేహమును, మయా = నాచే, భృతమ్ = స్వీకరింపబడిన దానినిగా, విద్ధి = తెలియుము.

ఈ ఆత్మజ్ఞానము అనే మోక్షమార్గము చాల సూక్ష్మమైనది. కాలముయొక్క దీర్ఘమగు ప్రవాహములో ఇది కనుమరుగైనది. దీనిని మరల లోకములో ప్రవర్తిల్ల జేయుటకై నేనీ దేహమును దాల్చినానని తెలియుము.

గచ్ఛ కామం మయాఽఽపృష్టో మయి సన్న్యస్తకర్మణా ।
జిత్వా సుదుర్జయం మృత్యుమమృతత్వాయ మాం భజ।।38

కామమ్ = యథేచ్ఛగా, గచ్ఛ = వెళ్లుము, మయా = నాచే, ఆపృష్టః = అనుజ్ఞనీయబడితివి, మయి = నాయందు, సన్న్యస్తకర్మణా = సమర్పించబడిన కర్మచే, సుదుర్జయమ్ = మిక్కిలి జయించ శక్యము కాని,

మృత్యుమ్ = మృత్యువును, జిత్వా = జయించి, అమృతత్వాయ = మోక్షము కొరకై, మామ్ = నన్ను, భజ = సేవించుము.

నేను నీకు అనుజ్ఞనిచ్చుచున్నాను. యథేచ్ఛగా వెళ్లుము. మృత్యువును జయించి మోక్షమును పొందుట చాల కష్టము. కాని, కర్మలను నాకు సమర్పించుట ద్వారా మృత్యువును జయించవచ్చును. అట్లు చేసి నన్ను భజించుము.

మామాత్మానం స్వయంజ్యోతిస్సర్వభూతగుహాశయమ్ ।
ఆత్మన్యేవాత్మనా వీక్ష్య విశోకోఽభయమృచ్ఛసి ॥ 39

స్వయంజ్యోతిః = స్వయంప్రకాశస్వరూపుడను, సర్వభూతగుహా-ఆశయమ్ = సకలప్రాణుల బుద్ధిగుహయందు నివసించువాడను అగు, మామ్ = నన్ను, ఆత్మని = తనయందు, ఆత్మనా = బుద్ధిచే, ఆత్మానమ్ = ఆత్మరూపునిగా, వీక్ష్య = దర్శించి, విశోకః = తొలగిన శోకము గలవాడవై, అభయమ్ = అభయమును, ఋచ్ఛసి = పొందుచున్నావు.

నేను స్వయంప్రకాశస్వరూపుడను; సకలప్రాణుల బుద్ధిగుహలో నివసించెదను. నన్ను నీవు నీయందే బుద్ధిచే ఆత్మరూపునిగా దర్శించుము. నీ శోకము పోయి, అభయస్థానమగు మోక్షము లభించును.

మాత్ర ఆధ్యాత్మికీం విద్యాం శమనీం సర్వకర్మణామ్ ।
వితరిష్యే యయా చాసౌ భయం చాతితరిష్యతి ॥ 40

సర్వకర్మణామ్ = కర్మలన్నింటికీ, శమనీమ్ = తొలగించే, ఆధ్యాత్మికీమ్ = ఆత్మతత్త్వమును ప్రకాశింపజేసే, విద్యామ్ = జ్ఞానమును, మాత్రే = తల్లికి, వితరిష్యే = చెప్పగలను, యయా = దేనిచే, అసౌ చ = ఈమె కూడా, భయమ్ = సంసారభయమును, అతితరిష్యతి = దాటివేయగలదో.

ఆత్మతత్త్వమును ప్రకాశింపజేసే విద్యను నేను అమ్మకు కూడ బోధించెదను. దానిచే ఆమె సర్వకర్మల బంధమునతిక్రమించి సంసారభయమునుండి బయట పడగలదు.

మైత్రేయ ఉవాచ ।
ఏవం సముదితస్తేన కపిలేన ప్రజాపతిః ।
దక్షిణీకృత్య తం ప్రీతో వనమేవ జగామ హ ॥ 41

తేన = ఆ, కపిలేన = కపిల భగవానునిచే, ఏవమ్ = ఈ విధముగా, సముదితః = చక్కగా అనుమతి ఈయబడినవాడై, ప్రజాపతిః = కర్దమ ప్రజా పతి, తమ్ = ఆయనను, దక్షిణీకృత్య = ప్రదక్షిణము చేసి, ప్రీతః = ఆనందించినవాడై, వనం ఏవ = వనమును గురించియే, జగామ హ = వెళ్లెనట.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- కపిల భగవానుడు ఈ విధముగా చక్కగా అనుమతినీయగా, కర్దమ ప్రజాపతి సంతోషించి, ఆయనకు ప్రదక్షిణము చేసి అడవికి వెళ్లెను.

వ్రతం స ఆస్థితో మౌనమాత్మైకశరణో మునిః ।
నిస్సంగో వ్యచరత్ క్షోణీమనగ్నిరనికేతనః ॥ 42

ఆత్మా-ఏకశరణః = ఆత్మ ఒక్కటే ఆశ్రయముగా గలవాడు, మునిః = మననశీలుడు, నిస్సంగః = సంసారమునందు ఆసక్తి లేనివాడు, అనగ్నిః = అగ్నిహోత్రాది కర్మలు లేనివాడు, అనికేతనః = స్థిరమగు నివాసస్థానము లేనివాడు అగు, సః = ఆ కర్దముడు, మౌనం వ్రతమ్ = మౌనవ్రతమును, ఆస్థితః = స్వీకరించినవాడై, క్షోణీమ్ = భూమిని, వ్యచరత్ = సంచరించెను.

మననశీలుడగు కర్దముడు ఆత్మను మాత్రమే ఆశ్రయించి సంసారమునందలి ఆసక్తిని పరిత్యజించెను. సన్న్యసించుటచే ఆయనకు అగ్నిహోత్రాది కర్మలతో సంబంధము తప్పినది. పరివ్రాజకుడగుటచే ఆయనకు స్థిర నివాసము లేదు. ఆయన మౌనవ్రతమును స్వీకరించి భూలోకములో సంచరించెను.

మనో బ్రహ్మణి యుంజానో యత్తత్సదసతః పరమ్ ।
గుణావభాసో విగుణ ఏకభక్త్యానుభావితే ॥ 43

గుణ-అవభాసే = సత్త్వరజస్తమోగుణములను ప్రకాశింప జేయున ట్టియు, విగుణే = నిర్గుణమైన, ఏకభక్త్యా = ఏకాంతభక్తిచే, అనుభావితే = సాక్షాత్కరించే, తత్ = ఆ, బ్రహ్మణి = పరబ్రహ్మయందు, మనః = మనస్సు ను, యుంజానః = నిలుపువాడై (సంచరించెను), యత్ = ఏది, సత్-అసతః = కార్య కారణములకు, పరమ్ = అతీతమైనదో.

కార్యకారణములకు అతీతమైన పరబ్రహ్మ స్వయముగా నిర్గుణ మై, సత్త్వరజస్తమోగుణములను తన చైతన్యప్రకాశములో ప్రకాశింప జేయును. ఏకాంతమగు భక్తిచే దానిని ఆత్మరూపముగా దర్శించదగును. ఆయన అట్టి పరబ్రహ్మయందు మనస్సును ఏకాగ్రము చేసి సంచరించెను.

నిరహంకృతిర్నిర్మమశ్చ నిర్ద్వంద్వస్సమదృక్ స్వదృక్ ।
ప్రత్యక్-ప్రశాంతధీర్ధీరః ప్రశాంతోర్మిరివోదధిః ॥ 44

నిరహంకృతిః = అహంకారము లేనివాడు, చ = మరియు, నిర్మమః = మమకారము లేనివాడు, నిర్ద్వంద్వః = సుఖదుఃఖాది ద్వంద్వములు లేని వాడు, సమదృక్ = భేదదృష్టి లేనివాడు, స్వదృక్ = ఆత్మనిష్ఠ గలవాడు, ప్రత్యక్-ప్రశాంతధీః = స్వరూపమువైపు లగ్నమైన ప్రసన్నమగు బుద్ధి గల వాడు, ధీరః = వివేకి అగు కర్దముడు, ప్రశాంత-ఊర్మిః = సద్దుమణిగిన తరం గములు గల, ఉదధిః ఇవ = సముద్రమువలె నుండెను.

ఆయనయందు అహంకార మమకారములు లేకుండెను. ఆయన సుఖదుఃఖాది ద్వంద్వములకు అతీతుడై సంచరించెను. ఆయన సర్వత్రా పరమాత్మను మాత్రమే దర్శించెడివాడు. ఆత్మనిష్ఠ గల ఆయన బుద్ధి స్వరూపనిష్ఠమై ప్రసన్నముగా నుండెడిది. ఆత్మానాత్మవివేకము గల కర్ద ముడు తరంగములు సద్దు మణిగిన సముద్రమువలె ప్రశాంతగంభీరుడై యుండెను.

వాసుదేవే భగవతి సర్వజ్ఞే ప్రత్యగాత్మని ।
పరేణ భక్తిభావేన లబ్ధాత్మా ముక్తబంధనః ॥ 45

సర్వజ్ఞే = సర్వజ్ఞుడైనట్టియు, ప్రత్యక్-ఆత్మని = అంతరతమమగు ఆత్మరూపములోనున్న, వాసుదేవే భగవతి = వాసుదేవ భగవానునియందు, పరేణ = సర్వాతిశాయియగు, భక్తిభావేన = భక్తిభావముచే, లబ్ధ-ఆత్మా = స్థిరముగా చేయబడిన అంతఃకరణము గలవాడై, ముక్తబంధనః = విముక్తమైన బంధము గలవాడాయెను.

సర్వజ్ఞుడు, ప్రత్యగాత్మ స్వరూపుడు అగు వాసుదేవ భగవానుని యందు సర్వాతిశాయియగు భక్తిభావముతో స్థిరముగా నిలిచిన బుద్ధిగల కర్దముడు సంసారబంధము తొలగి జీవన్ముక్తుడయ్యెను.

ఆత్మానం సర్వభూతేషు భగవంతమవస్థితమ్ ।
అపశ్యత్సర్వభూతాని భగవత్యపి చాత్మని ॥ 46

సర్వభూతేషు = సకలప్రాణులయందు, ఆత్మానమ్ = ఆత్మరూపుడై, అవస్థితమ్ = నిలిచియున్న, భగవంతమ్ = భగవానుని, అపి చ = మరియు, సర్వభూతాని = సకలప్రాణులను, ఆత్మని = ఆత్మరూపుడగు, భగవతి = భగవానునియందు, అపశ్యత్ = చూచెను.

సకలప్రాణులలో భగవానుడే ఆత్మరూపముగా నిలిచియున్నాడని ఆయన దర్శించగల్గెను. ఇంతేగాక, సకలప్రాణులు ఆత్మరూపుడగు భగవానునియందే ఉనికిని కలిగియున్నవని ఆయన దర్శించగల్గినాడు.

ఇచ్ఛాద్వేషవిహీనేన సర్వత్ర సమచేతసా ।
భగవద్భక్తియుక్తేన ప్రాప్తా భాగవతీ గతిః ॥ 47

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
చతుర్వింశోఽధ్యాయః ॥

ఇచ్ఛాద్వేషవిహీనేన = రాగద్వేషములు లేనట్టియు, సర్వత్ర = అంతటా, సమచేతసా = భేదదృష్టి లేనట్టియు, భగవత్-భక్తియుక్తేన = భగవానునియందు భక్తితో కూడియున్న కర్దమునిచే, భాగవతీ = భగవానుని పరమపదము అనే, గతిః = లక్ష్యము, ప్రాప్తా = పొందబడెను.

కర్దమునియందు రాగద్వేషములు లేవు. ఆయన అంతటా వ్యాపించియున్న భగవానుని మాత్రమే చూచుటచే, ఆయనయందు భేదదృష్టి లేదు. ఆయన మనస్సు భగవానునియందు భక్తితో నిండియుండెను. ఆయన భగవానుని పరమపదము (మోక్షము) ను పొందెను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
ఇరువది నాల్గవ అధ్యాయము ముగిసినది (24).

* * * * *

# అథ పంచవింశోఽధ్యాయః

## శ్రీ కపిల భగవానుని ఉపదేశము - భక్తియోగ మహిమ

శౌనక ఉవాచ ।
కపిలస్తత్త్వసంఖ్యాతా భగవానాత్మమాయయా ।
జాతస్స్వయమజస్సాక్షాదాత్మప్రజ్ఞప్తయే నృణామ్ ॥ 1

శౌనకః = శౌనక మహర్షి, ఉవాచ = పలికెను, అజః = పుట్టుక లేని, భగవాన్ = భగవానుడు, నృణామ్ = మానవులకు, ఆత్మప్రజ్ఞప్తయే = ఆత్మతత్త్వమును బోధించుట కొరకై, ఆత్మమాయయా = తన మాయాశక్తిచే, స్వయమ్ = స్వయముగా, సాక్షాత్ = సాక్షాత్తుగా, తత్త్వసంఖ్యాతా = తత్త్వములను లెక్కపెట్టే (సాంఖ్యశాస్త్రమును ప్రవర్తిల్లజేసే), కపిలః = కపిలుడై, జాతః = జన్మించినాడు.

శౌనక మహర్షి ఇట్లు పలికెను --- పుట్టుక లేని శ్రీహరి భగవానుడు మానవులకు ఆత్మతత్త్వమును బోధించుటకై తన మాయాశక్తిచే స్వయముగా సాక్షాత్తుగా సాంఖ్యశాస్త్రమును ప్రవర్తిల్ల జేసిన కపిలుడై జన్మించెను.

న హ్యస్య వర్ష్మణః పుంసాం వరిమ్ణస్సర్వయోగినామ్ ।
విశ్రుతౌ శ్రుతదేవస్య భూరి తృప్యంతి మేఽసవః ॥ 2

పుంసామ్ = మానవులలో, వర్ష్మణః = శ్రేష్ఠుడైనట్టియు, సర్వయోగినామ్ = యోగులందరిలో, వరిమ్ణః = శ్రేష్ఠుడైన, అస్య = ఈ కపిలునియొక్క, విశ్రుతౌ = విఖ్యాతియందు, భూరి = అధికముగా, శ్రుతదేవస్య = శ్రవణము చేయబడిన భగవానుడు గల, మే = నా, అసవః = ఇంద్రియములు, న తృప్యంతి హి = తృప్తిని పొందుట లేదు గదా!

నేను భగవానుని గాథలను అధికముగా శ్రవణము చేసినవాడనే. కాని, మానవశ్రేష్ఠుడు, యోగిపుంగవుడు అగు ఈ కపిల భగవానుని కీర్తిని ఎంత విన్నా నా ఇంద్రియములకు, ఇక చాలును అనిపించుట లేదు.

యద్యద్విధత్తే భగవాన్ స్వచ్ఛందాత్మాఽఽత్మమాయయా ।
తాని మే శ్రద్దధానస్య కీర్తన్యాన్యనుకీర్తయ ।। 3

స్వ-ఛంద-ఆత్మా = తనవారి ఇచ్ఛచే దేహావిర్భావము గల, భగవాన్ = కపిల భగవానుడు, ఆత్మమాయయా = తన మాయాశక్తిచే, యత్ యత్ = దేనిని దేనిని, విధత్తే = చేసెనో, కీర్తన్యాని = కీర్తించదగిన, తాని = వాటిని, శ్రద్దధానస్య = శ్రద్ధావంతుడనగు, మే = నాకు, అనుకీర్తయ = వర్ణించి చెప్పుము.

భగవానుడు తన భక్తుల కోరికకు తగ్గట్లుగా దేహమును స్వీకరించి అవతరించును. కపిల భగవానుడు చేసిన కార్యములన్నియు కీర్తించదగిన వే. శ్రద్ధాళువునగు నాకు వాటిని వర్ణించి చెప్పుము.

సూత ఉవాచ ।
ద్వైపాయనసఖస్త్వేవం మైత్రేయో భగవాంస్తథా ।
ప్రాహేదం విదురం ప్రీత ఆన్వీక్షిక్యాం ప్రచోదితః ।। 4

ద్వైపాయనసఖః = వ్యాసమహర్షియొక్క మిత్రుడైన, భగవాన్ = పూజ్యుడగు, మైత్రేయః తు = మైత్రేయ మహర్షి అయితే, ఏవమ్ = ఈ విధముగా, ఆన్వీక్షిక్యామ్ = బ్రహ్మవిద్యయందు, ప్రచోదితః = ప్రేరేపించబడినవాడై, ప్రీతః = ఆనందించినవాడై, విదురమ్ = విదురుని ఉద్దేశించి, ఇదమ్ = ఈ విషయమును, తథా = ఆ ప్రశ్నకు తగ్గట్లుగా, ప్రాహ = చెప్పెను.

సూతుడు ఇట్లు పలికెను -- పూజ్యుడగు మైత్రేయ మహర్షి వ్యాసుని మిత్రుడు. ఆయనను ఇదే విధముగా విదురుడు బ్రహ్మవిద్యను బోధించుటకు ప్రేరేపించెను. అపుడాయన కూడ విదురుని శ్రద్ధకు ఆనందించి ఆ ప్రశ్నకు తగ్గట్లుగా విదురునితో నిట్లనెను.

మైత్రేయ ఉవాచ ।

పితరి ప్రస్థితేऽరణ్యం మాతుః ప్రియచికీర్షయా ।
తస్మిన్ బిందుసరేऽవాత్సీద్భగవాన్ కపిలః కిల ।। 5

పితరి = తండ్రి, అరణ్యమ్ = వనమును గురించి, ప్రస్థితే = వెళ్లిపోగా, మాతుః = తల్లికి, ప్రియచికీర్షయా = ప్రియమును చేయు గోరికతో, కపిలః భగవాన్ = కపిల భగవానుడు, తస్మిన్ = ఆ, బిందుసరే = బిందుసరమునందు, అవాత్సీత్ కిల = నివసించెను.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- తండ్రియగు కర్దముడు వనమునకు వెళ్లిన తరువాత, కపిల భగవానుడు తల్లియగు దేవహూతికి ప్రియమును చేయు కోరికతో ఆ బిందుసరమునందే నివసించెను.

తమాసీనమకర్మాణం తత్త్వమార్గాగ్రదర్శనమ్ ।
స్వసుతం దేవహూత్యాహ ధాతుస్సంస్మరతీ వచః ।। 6

దేవహూతిః = దేవహూతి, ధాతుః = బ్రహ్మగారి, వచః = మాటను, సంస్మరతీ = స్మరించుచున్నదై, ఆసీనమ్ = కూర్చుని యున్నట్టియు, అకర్మాణమ్ = కర్మలనుండి నివృత్తుడైనట్టియు, తత్త్వమార్గ-అగ్రదర్శనమ్ = జ్ఞానమార్గముయొక్క పారమును దర్శించినట్టియు, స్వసుతమ్ = తన కుమారుడైన, తమ్ = ఆ కపిల భగవానుని గురించి, ఆహ = పలికెను.

ఒకనాడు జ్ఞానమార్గములో పారదృశ్వయగు కపిల భగవానుడు కర్మలనుండి విరతుడై కూర్చుని యుండెను. దేవహూతి బ్రహ్మగారి వచనములను గుర్తు చేసుకొని, తన కుమారుడగు కపిలునితో నిట్లనెను.

దేవహూతిరువాచ ।
నిర్విణ్ణా నితరాం భూమన్నసదింద్రియతర్షణాత్ ।
యేన సంభావ్యమానేన ప్రపన్నాంధం తమః ప్రభో ।। 7

భూమన్ = ఓ పరబ్రహ్మరూపా!, అసత్-ఇంద్రియతర్షణాత్ = దుష్టములగు ఇంద్రియములను తృప్తి పరచుట వలన, నితరామ్ = మిక్కిలి, నిర్విణ్ణా = ఖేదమును పొందియున్నాను, ప్రభో = ఓ ప్రభూ!, సంభావ్యమా

నేన = నిరంతరముగా చేయబడిన, యేన = దేనిచే, అంధం తమః = మహా మోహమును, ప్రపన్నా = పొందితినో.

ఓ పరబ్రహ్మాస్వరూపా! ప్రభూ! నేను నిరంతరముగా ఈ దుష్టము లగు ఇంద్రియములను సంతోషపెట్టి చాల ఖేదమును పొందియున్నాను. దాని వలన నేను అజ్ఞానాంధకారములో పడిపోయినాను.

తస్య త్వం తమసోఽంధస్య దుష్పారస్యాద్య పారగమ్ ।
సచ్చక్షుర్జన్మనామంతే లబ్ధం మే త్వదనుగ్రహాత్ ॥ 8

తస్య = ఆ, దుష్పారస్య = దాట శక్యము కాని, అంధస్య = గాఢమైన, తమసః = అజ్ఞానమునకు, పారగమ్ = దాటించు, త్వమ్ = నీవు అనే, సత్-చక్షుః = శ్రేష్ఠమగు కన్ను, మే = నాకు, జన్మనామ్ = జన్మల, అంతే = అంతమునందు, త్వత్-అనుగ్రహాత్ = నీ అనుగ్రహము వలన, అద్య = ఈనాడు, లబ్ధమ్ = పొందబడినది.

నీవు దాట శక్యము కాని ఆ గాఢమగు అజ్ఞానాంధకారమును దాటించే గొప్ప కన్నువంటివాడవు. నీ అనుగ్రహము చేతనే నాకు నేడు నీవు లభించినావు. అనేకజన్మల తరువాత నాకు జ్ఞానము కలిగే అవకాశము వచ్చినది. ఇది నాకు ఆఖరు జన్మ.

య ఆద్యో భగవాన్ పుంసామీశ్వరో వై భవాన్ కిల ।
లోకస్య తమసాంధస్య చక్షుస్సూర్య ఇవోదితః ॥ 9

యః = ఎవడైతే, ఆద్యః = సర్వకారణుడో, పుంసామ్ = జీవులకు, ఈశ్వరః = ప్రభుడో అట్టి, భగవాన్ = భగవానుడు, భవాన్ కిల = నీవే కదా!, తమసా = అజ్ఞానముచే, అంధస్య = గ్రుడ్డిదై యున్న, లోకస్య = లోకమునకు, చక్షుః = ప్రకాశమునిచ్చే, సూర్యః ఇవ = సూర్యుడు వలె, ఉదితః = ఉదయించినావు.

సర్వకారణుడు, సకలప్రాణులకు అధీశ్వరుడు అగు భగవానుడు నీవే. అజ్ఞానముచే గ్రుడ్డిదైయున్న లోకమునకు వెలుగునిచ్చే సూర్యుని వంటి నీవు ఉదయించినావు.

అథ మే దేవ సమ్మోహమపాక్రష్టుం త్వమర్హసి ।
యోఽవగ్రహోఽహం మమేతీత్యేతస్మిన్యోజితస్త్వయా ।। 10

దేవ = ఓ దేవా!, అథ = కావున, త్వమ్ = నీవు, మే = నా, సమ్మోహమ్ = మోహమును, అపాక్రష్టుమ్ = దూరము చేయుటకు, అర్హసి = తగుదువు, యః = ఏ మోహము, ఏతస్మిన్ = ఈ దేహమునందు, అహమ్ = నేను, మమ = నాది, ఇతి = అనే, అవగ్రహః = అభిమానము గల ో అది, త్వయా = నీచే, యోజితః = కూర్చబడినది.

ఓ దేవా! ఈ దేహమునందు నేను, నాది అనే అభిమానమును నీవే కలిగించినావు. కావున, నాకు అట్టి వ్యామోహమును నీవే దూరము చేయ దగుదువు.

తం త్వా గతాహం శరణం శరణ్యం
స్వభృత్యసంసారతరోః కుఠారమ్ ।
జిజ్ఞాసయాహం ప్రకృతేః పూరుషస్య
నమామి సద్ధర్మవిదాం వరిష్ఠమ్ ।। 11

శరణ్యమ్ = శరణు పొందదగినట్టియు, స్వభృత్యసంసారతరోః = తన భక్తుల సంసారము అనే వృక్షమునకు, కుఠారమ్ = గొడ్డలి అయిన, తమ్ = అట్టి, త్వామ్ = నిన్ను, అహమ్ = నేను, శరణం గతా = శరణు పొందుచున్నాను, ప్రకృతేః = ప్రకృతియొక్క, పూరుషస్య = పురుషునియొక్క, జిజ్ఞాసయా = తెలియవలెననే కోరికతో, సద్-ధర్మవిదామ్ = సర్వోత్తమ ధర్మమగు మోక్షముయొక్క ఉపాయములను తెలిసినవారిలో, వరిష్ఠమ్ = శ్రేష్ఠుడవైన నిన్ను, అహమ్ = నేను, నమామి = నమస్కరించుచున్నాను.

నిన్ను శరణు పొందిన భక్తుల సంసారవృక్షమును నీవు గొడ్డలి వలె నశింపజేసెదవు. నేను నిన్ను శరణు వేడుచున్నాను. నేను ప్రకృతి పురుషుల స్వరూపమును తెలియగోరుచున్నాను. మోక్షధర్మములు తెలిసినవారిలో నీవు శ్రేష్ఠుడవు. నేను నీకు నమస్కరించుచున్నాను.

మైత్రేయ ఉవాచ ।
ఇతి స్వమాతుర్నిరవద్యమీప్సితం
నిశమ్య పుంసామపవర్గవర్ధనమ్ ।
ధియాభినంద్యాత్మవతాం సతాం గతిః
బభాష ఈషత్ స్మితశోభితాననః ॥ 12

ఆత్మవతామ్ = జితేంద్రియులగు, సతామ్ = సత్పురుషులకు, గతిః = ఫలమైన కపిల భగవానుడు, ఇతి = ఈ విధమైన, స్వమాతుః = తన తల్లియొక్క, నిరవద్యమ్ = పవిత్రమైనట్టియు, పుంసామ్ = మానవులకు, అపవర్గవర్ధనమ్ = మోక్షమునందు ప్రీతిని వర్ధిల్లజేసే, ఈప్సితమ్ = కోరికను, నిశమ్య = విని, ధియా = బుద్ధితో, అభినంద్య = ప్రశంసించి, ఈషత్-స్మితశోభిత-ఆననః = చిరునవ్వుతో ప్రకాశించే ముఖము గలవాడై, బభాషే = పలికెను.

మైత్రేయుడు ఇట్లు పలికెను -- జితేంద్రియులగు సత్పురుషులచే ఫలముగా పొందబడే (ఆత్మరూపముగా తెలియబడే) కపిల భగవానుడు తల్లియొక్క ఈ పవిత్రమైన కోరికను విని ఆమెను తన మనస్సు లోపలనే ప్రశంసించెను. ఆ కోరిక మానవులకు మోక్షమునందు ప్రీతిని వర్ధిల్లజేయును. ఆయన చిరునవ్వుతో ప్రకాశించే ముఖము గలవాడై, ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
యోగ ఆధ్యాత్మికః పుంసాం మతో నిఃశ్రేయసాయ మే ।
అత్యంతోపరతిర్యత్ర దుఃఖస్య చ సుఖస్య చ ॥ 13

పుంసామ్ = మానవులకు, నిఃశ్రేయసాయ = మోక్షము కొరకు, ఆధ్యాత్మికః = ఆత్మనిష్ఠ అనే, యోగః = యోగము (ఉపాయము), మే = నా కొరకు, మతః = సమ్మతము, యత్ర = దేనియందైతే, సుఖస్య = సుఖముయొక్క, దుఃఖస్య చ = దుఃఖముయొక్క కూడా, అత్యంత-ఉపరతిః = పూర్తి నివృత్తి కలుగునో.

శ్రీ కపిల భగవానుడిట్లు చెప్పెను -- మానవులు మోక్షమును పొందాలంటే ఆత్మనిష్ఠయే సాధనమని నా సిద్ధాంతము. దానిలో మానవునకు సుఖదుఃఖముల ద్వంద్వమునుండి శాశ్వతనివృత్తి లభించును.

తమిమం తే ప్రవక్ష్యామి యమవోచం పురానఘే ।
ఋషీణాం శ్రోతుకామానాం యోగం సర్వాంగనైపుణమ్ ।।14

అనఘే = ఓ పుణ్యాత్మురాలా!, తమ్ = అట్టి, ఇమమ్ = ఈ, సర్వ-అంగనైపుణమ్ = అన్ని అంగములతో సంపన్నమైన, యోగమ్ = యోగమును, తే = నీ కొరకు, ప్రవక్ష్యామి = బోధించగలను, యమ్ = దేనిని, పురా = పూర్వము, శ్రోతుకామానామ్ = వినగోరే, ఋషీణామ్ = మహర్షులకు, అవోచమ్ = చెప్పితినో.

ఓ పుణ్యాత్మురాలా! అట్టి ఈ అన్ని అంగములతో సంపన్నమైన యోగమును నేను నీకు బోధించెదను. నేను దీనిని పూర్వము వినగోరుచున్న మహర్షులకు బోధించియుంటిని.

చేతః ఖల్వస్య బంధాయ ముక్తయే చాత్మనో మతమ్ ।
గుణేషు సక్తం బంధాయ రతం వా పుంసి ముక్తయే ।। 15

అస్య = ఈ, ఆత్మనః = జీవుని, చేతః = మనస్సు, బంధాయ = బంధము కొరకు, చ = మరియు, ముక్తయే = ముక్తి కొరకు, మతమ్ = కారణమని అంగీకరించబడినది, గుణేషు = విషయములయందు, సక్తమ్ = ఆసక్తి గలది, బంధాయ = బంధము కొరకు, వా = అట్లు గాక, పుంసి = పరమేశ్వరునియందు, రతమ్ = ప్రీతిగలది, ముక్తయే = ముక్తి కొరకు.

ఈ మానవుని మనస్సే బంధమోక్షములు రెండింటికీ కారణమగునని మహర్షులు చెప్పుచున్నారు. భోగములయందు ఆసక్తి ఉన్న మనస్సు బంధమును, పరమేశ్వరుని భక్తి గల మనస్సు మోక్షమును కలిగించును.

అహంమమాభిమానోత్థైః కామలోభాదిభిర్మలైః ।
వీతం యదా మనశ్శుద్ధమదుఃఖమసుఖం సమమ్ ।। 16

యదా = ఏ కాలమునందైతే, మనః = మనస్సు, అహంమమ-అభిమాన-ఉత్థైః = నేను నాది అనే అభిమానమునుండి పుట్టే, కామలోభ-ఆదిభిః = కామము లోభము మొదలగు, మలైః = మాలిన్యములచే, వీతమ్ = రహితమగునో అప్పుడు, అదుఃఖమ్ = దుఃఖము లేని, అసుఖమ్ = సుఖము లేని, శుద్ధమ్ = పరిశుద్ధమైన ఆ మనస్సు, సమమ్ = ప్రసన్నముగా నుండును.

ఇది నేను, ఇది నాది అనే అభిమానములనుండి మనస్సులో కామము లోభము మొదలగు దోషములు పుట్టును. మనస్సునుండి ఇవి తొలగిన నాడు ఆ మనస్సునందు సుఖమునకు విర్రవీగుట గాని, దుఃఖమునకు క్రుంగిపోవుట గాని ఉండదు. అప్పుడు మనస్సు ప్రసన్నమగును.

తదా పురుష ఆత్మానం కేవలం ప్రకృతేః పరమ్ ।
నిరంతరం స్వయంజ్యోతిరణిమానమఖండితమ్ ॥ 17

జ్ఞానవైరాగ్యయుక్తేన భక్తియుక్తేన చాత్మనా ।
పరిపశ్యత్యుదాసీనం ప్రకృతిం చ హతౌజసమ్ ॥ 18

తదా = అప్పుడు, పురుషః = మానవుడు, జ్ఞానవైరాగ్యయుక్తేన = జ్ఞానవైరాగ్యములతో కూడిన, చ = మరియు, భక్తియుక్తేన = భక్తితో నిండిన, ఆత్మనా = మనస్సుతో, ఆత్మానమ్ = ఆత్మను (తనను), కేవలమ్ = అద్వయము, ప్రకృతేః = ప్రకృతికి, పరమ్ = అతీతము, నిరంతరమ్ = లోపల బయట అనే భేదము లేనిది, స్వయంజ్యోతిః = స్వయముగా ప్రకాశించునది, అణిమానమ్ = సూక్ష్మమైనది, అఖండితమ్ = నీవు నేను అనే భేదము లేనిది, ఉదాసీనమ్ = ద్వంద్వములకు సాక్షిగా నిలుచునదిగాను, చ = మరియు, ప్రకృతిమ్ = ప్రకృతిని, హత-ఓజసమ్ = క్షీణించిన బలము గలదిగను, పరిపశ్యతి = దర్శించును.

అప్పుడు మానవుని మనస్సులో భక్తి వైరాగ్యము కలిగి, జ్ఞానము ఉదయించును. అపుడాతడు ఆత్మ (తన స్వరూపము) అద్వయము, ప్రకృతికి అతీతము, లోపల బయట అనే భేదము లేనిది, స్వయంప్రకాశము, ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరము కానిది, నీవు నేను అనే భేదము లేని

ది, సుఖదుఃఖాది ద్వంద్వములకు సాక్షి అని గ్రహించును. మరియు, ఆతడు ప్రకృతికి తనను బంధించే శక్తి క్షీణించిపోయినదని గుర్తించును.

న యుజ్యమానయా భక్త్యా భగవత్యఖిలాత్మని ।
సదృశోఽస్తి శివః పంథా యోగినాం బ్రహ్మసిద్ధయే ।। 19

యోగినామ్ = యోగులకు, బ్రహ్మసిద్ధయే = బ్రహ్మత్వము సిద్ధించుట కొరకై, అఖిల-అత్మని = సకలమునందు ఆత్మరూపముగానుండే, భగవతి = భగవానునియందు, యుజ్యమానయా = చేయబడే, భక్త్యా = భక్తితో, సదృశః = సమానమైన, శివః = మంగళకరమగు, పంథాః = మార్గము, న అస్తి = లేదు.

సాధకులు బ్రహ్మత్వమును పొందుటకు, సకలమునకు ఆత్మరూపుడైయుండే భగవానునియందు భక్తిని చేయుటతో సమానమైన మరియొక మంగళకరమగు ఉపాయము లేదు.

ప్రసంగమజరం పాశమాత్మనః కవయో విదుః ।
స ఏవ సాధుషు కృతో మోక్షద్వారమపావృతమ్ ।। 20

ప్రసంగమ్ = సంసారాసక్తిని, ఆత్మనః = జీవునకు, అజరమ్ = దృఢమైన, పాశమ్ = బంధముగా, కవయః = మహర్షులు, విదుః = తెలియుచున్నారు, సః ఏవ = అదే ఆసక్తి, సాధుషు = సాధుపురుషులయందు, కృతః = చేయబడినదై, అపావృతమ్ = తెరువబడిన, మోక్షద్వారమ్ = మోక్షమునకు ద్వారము అగును.

మానవుడు సంసారమునందు ఆసక్తిని కలిగియున్నచో, అది వానికి దృఢమగు పాశము అగునని మహర్షులు చెప్పుచున్నారు. కాని, మానవుడు అదే ఆసక్తిని సాధుసంగతియందు చూపినచో, అది వానికి తెరుచుకున్న మోక్షద్వారమే అగును.

తితిక్షవః కారుణికాస్సుహృదస్సర్వదేహినామ్ ।
అజాతశత్రవశ్శాంతాస్సాధవస్సాధుభూషణాః ।। 21

సాధవః = సాధుపురుషులు, తితిక్షవః = సహనగుణము గలవారు, కారుణికాః = కరుణ గలవారు, సర్వదేహినామ్ = సకలప్రాణులకు, సుహృదః = ఉపకారమును చేసే మిత్రులు, అజాతశత్రవః = పుట్టని శత్రువులు గలవారు, శాంతాః = శాంతస్వభావము గలవారు, సాధుభూషణాః = చక్కని శీలమే అలంకారముగా గలవారు.

సాధుపురుషులయందు సహనగుణము ఉండును. వారు సకలప్రాణులయందు దయ గలిగి సహజముగనే ఉపకారమును చేయుచుందురు. ఈ లోకములో వారికి శత్రువు అన్నవాడు పుట్టలేదు, పుట్టబోడు. శాంతమే స్వభావముగా గల సాధువులకు సచ్ఛీలమే అలంకారము.

మయ్యనన్యేన భావేన భక్తిం కుర్వంతి యే దృఢామ్ ।
మత్కృతే త్యక్తకర్మాణస్త్యక్తస్వజనబాంధవాః ॥ 22

యే = ఎవరైతే, మయి = నాయందు, అనన్యేన = ఇతరము లేని, భావేన = మనస్సుతో, దృఢామ్ = దృఢమగు, భక్తిమ్ = భక్తిని, కుర్వంతి = చేయుదురో, మత్-కృతే = నా కొరకై, త్యక్తకర్మాణః = విడువబడిన కర్మలు గలవారో, త్యక్తస్వజనబాంధవాః = విడువబడిన స్వజనులు బంధువులు గలవారో (వారు సాధువులు).

సాధువులు ఇతరమును సర్వమును (భేదభావమును) ప్రక్కన బెట్టి ఏకాంతమగు మనస్సుతో నాయందు దృఢమగు భక్తిని చేయుదురు. వారు నన్ను పొందుట కొరకై తమవారిని బంధుజనమును విడిచిపెట్టి, సర్వకర్మసన్న్యాసులై యుందురు.

మదాశ్రయాః కథా మృష్టాః శృణ్వంతి కథయంతి చ ।
తపంతి వివిధాస్తాపా నైతాన్మద్గతచేతసః ॥ 23

మత్-ఆశ్రయాః = నేను విషయముగా గల (నేనే ఆశ్రయముగా గలవారై), మృష్టాః = పవిత్రములగు, కథాః = గాథలను, శృణ్వంతి = వినెదరు, చ = మరియు, కథయంతి = చెప్పెదరు, మత్-గతచేతసః = నాయందు

లగ్నమైన మనస్సు గల, ఏతాన్ = వీరిని, వివిధాః = పలువిధములగు, తాపాః = దుఃఖములు, న తపంతి = పీడించవు.

సాధువులు నన్నే శరణు వేడి నన్ను వర్ణించే పవిత్రములగు గాథలను వినెదరు; లేదా, చెప్పెదరు. వారు నాయందే మనస్సును లగ్నము చేసియుందురు. వారిని వివిధములగు దుఃఖములు పీడించలేవు.

త ఏతే సాధవస్సాధ్వి సర్వసంగవివర్జితాః ।
సంగస్తేష్వథ తే ప్రార్థ్యస్సంగదోషహరా హి తే ॥ 24

సాధ్వి = ఓ పతివ్రతా!, సర్వసంగవివర్జితాః = సమస్తములగు ఆసక్తులచే విడువబడిన, తే = అట్టి, ఏతే = వీరు మాత్రమే, సాధవః = సాధువులు, అథ = కావున, తే = నీకు, తేషు = వారియందు, సంగః = సంగము, ప్రార్థ్యః = కోరదగినది, హి = ఏలయనగా, తే = వారు, సంగదోషహరాః = సంసారాసక్తి అనే దోషమును పోగొట్టెదరు.

ఓ పతివ్రతా! అన్ని విధముల సంసారాసక్తిని విడిచిపెట్టిన ఇట్టి వారు మాత్రమే సాధువులు అనబడుదురు. వీరు సంసార-ఆసక్తి అనే దోషమును పోనాడెదరు. కావున, నీవు వారితోడి సంగమును కోరుకొనుము.

సతాం ప్రసంగాన్మమ వీర్యసంవిదో
భవంతి హృత్కర్ణరసాయనాః కథాః ।
తజ్జోషణాదాశ్వపవర్గవర్త్మని
శ్రద్ధా రతిర్భక్తిరనుక్రమిష్యతి ॥ 25

సతామ్ = సత్పురుషుల, ప్రసంగాత్ = సంగము వలన, మమ = నాయొక్క, వీర్యసంవిదః = మహిమయొక్క చక్కని అవగాహన గల, హృత్-కర్ణరసాయనాః = హృదయమునకు చెవులకు సుఖమును కలిగించే, కథాః = గాథలు, భవంతి = ప్రవర్తిల్లును, తత్-జోషణాత్ = వాటిని సేవించుట వలన, ఆశు = శీఘ్రముగా, అపవర్గవర్త్మని = మోక్షమార్గమునందు, శ్రద్ధా = శ్రద్ధ, రతిః = ప్రీతి, భక్తిః = భక్తి, అనుక్రమిష్యతి = వరుసగా కలుగగలదు.

సత్పురుషుల సంగమును చేసినచో నా గాథలను వినుట సంభవమగును. హృదయమునకు చెవులకు సుఖమును ఇచ్చే ఆ గాథలు నా మహిమను గురించి చక్కని అవగాహనను కలిగించును. వాటిని సేవించుట వలన శీఘ్రమే మోక్షమార్గమునందు శ్రద్ధ, ప్రేమ మరియు భక్తి క్రమముగా వికసించును.

భక్త్యా పుమాన్ జాతవిరాగ ఐంద్రియాత్
దృష్టశ్రుతాన్మద్రచనానుచింతయా ।
చిత్తస్య యత్తో గ్రహణే యోగయుక్తో
యతిష్యతే ఋజుభిర్యోగమార్గైః ॥ 26

పుమాన్ = మానవుడు, మత్-రచనా-అనుచింతయా = నా సృష్టిరచనయొక్క స్మరణముచే, భక్త్యా = భక్తిచే, దృష్టశ్రుతాత్ = కనబడిన వినబడిన, ఐంద్రియాత్ = ఇంద్రియసుఖమునుండి, జాతవిరాగః = పుట్టిన వైరాగ్యము గలవాడై, యత్తః = సావధానుడై, యోగయుక్తః = యోగముతో కూడినవాడై, ఋజుభిః = తిన్ననైన, యోగమార్గైః = యోగమార్గములచే, చిత్తస్య = చిత్తముయొక్క, గ్రహణే = నిగ్రహమునందు, యతిష్యతే = ప్రయత్నించగలడు.

మానవుడు నా సృష్టిరచనను స్మరించుటచే నాయందు భక్తి కలుగును. దాని వలన వానికి ఐహిక-ఆముష్మికములగు ఇంద్రియసుఖములయందు విరక్తి కలుగును. అపుడాతడు సావధానమనస్కుడై యోగమును చేపట్టి భక్తిప్రధానమైన (ఆయాసము లేని) యోగమార్గముల ద్వారా మనోనిగ్రహమును పొందుటకు ప్రయత్నమును చేయగలడు.

అసేవయాయం ప్రకృతేర్గుణానాం
జ్ఞానేన వైరాగ్యవిజృంభితేన ।
యోగేన మయ్యర్పితయా చ భక్త్యా
మాం ప్రత్యగాత్మానమిహావరుంధే ॥ 27

ప్రకృతేః = ప్రకృతియొక్క, గుణానామ్ = సత్త్వరజస్తమోగుణముల, అసేవయా = సేవించకపోవుటచే, వైరాగ్యవిజృంభితేన = వైరాగ్యముచే పుష్టి చేయబడిన, జ్ఞానేన = జ్ఞానముచే, యోగేన = యోగముచే, చ = మరియు, మయి = నాయందు, అర్పితయా = చేయబడిన, భక్త్యా = భక్తిచే, అయమ్ = ఈ మానవుడు, ప్రత్యక్-ఆత్మానమ్ = అంతరతమమగు ఆత్మయే స్వరూపముగా గల, మామ్ = నన్ను, ఇహ = ఈ జన్మయందే, అవరుంధే = పొందును.

మానవుడు సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతియొక్క కార్యములైన విషయభోగములను సేవించుట మానివేయవలెను. ఆతని జ్ఞానమునకు వైరాగ్యము గట్టి తోడు కావలెను. అట్టి మానవుడు యోగసాధనను చేయుచూ నాయందు భక్తిని చేసినచో, ఆతడు ఈ జన్మలోనే అంతరాత్మ రూపుడనగు నన్ను పొందును.

దేవహూతిరువాచ ।
కాచిత్త్వయ్యుచితా భక్తిః కీదృశీ మమ గోచరా ।
యయా పదం తే నిర్వాణమంజసాన్వాశ్నవా అహమ్ ।। 28

ఉచితా = ముక్తిని సాధించుటకు యోగ్యమైన, త్వయి = నీయందలి, భక్తిః = భక్తి, కాచిత్ = ఎట్టిది?, మమ = నాకు, గోచరా = తగినది, కీదృశీ = ఎట్టిది?, యయా = ఏ భక్తిచే, అహమ్ = నేను, తే = నీ, నిర్వాణమ్ = శోకరహితమైన మోక్షము అనే, పదమ్ = స్వరూపమును, అంజసా = తేలికగా, అన్వాశ్నవై = పొందెదనో.

దేవహూతి ఇట్లు పలికెను --- మోక్షమును పొందుటకు యోగ్యమగు భక్తి యెట్టిది? నావంటి అబలలకు తగిన భక్తియొక్క స్వరూపమేమి? ఏ భక్తిచే నేను శోకరహితమైన నీ పరమపదమును తేలికగా పొందెదను?

యో యోగో భగవద్బాణో నిర్వాణాత్మంస్త్వయోదితః
కీదృశః కతి వాంగాని యతస్తత్త్వావబోధనమ్ ।। 29

నిర్వాణ-ఆత్మన్ = నిరతిశయమగు ఆనందమే స్వరూపముగా గల వాడా!, భగవద్-బాణః = భగవంతునియందు ప్రయోగించబడిన బాణ మువంటి, త్వయా = నీచే, ఉదితః = బోధించబడిన, యః = ఏ, యోగః = యోగము గలదో అది, కీదృశః = ఎట్టిది?, అంగాని = అంగములు, కతి వా = ఎన్ని?, యతః = దేనివలన, తత్త్వ-అవబోధనమ్ = తత్త్వ (యథార్థ) జ్ఞానము కలుగునో.

ఓ భగవాన్! నిరతిశయమగు ఆనందమే నీ స్వరూపము. నీవు బోధించిన యోగము లక్ష్యమునందు ప్రయోగించబడిన బాణము వలె తత్త్వజ్ఞానమును కలిగించి భగవానుని పొందించును. దాని స్వరూపమె ట్టిది? దాని అంగములు ఎన్ని?

తదేతన్మే విజానీహి యథాహం మందధీర్హరే ।
సుఖం బుద్ధ్యేయ దుర్బోధం యోషా భవదనుగ్రహాత్ ॥ 30

హరే = ఓ శ్రీహరీ!, దుర్బోధమ్ = కష్టముచే తెలియదగిన, తత్ = అట్టి, ఏతత్ = ఈ యోగమును, మే = నాకు, విజానీహి = వివరముగా బోధించుము, యథా = ఏ విధముగానైతే, మందధీః = మందబుద్ధిగల, యోషా = అబలనగు, అహమ్ = నేను, భవత్-అనుగ్రహాత్ = నీ అనుగ్ర హము వలన, సుఖమ్ = తేలికగా, బుద్ధ్యేయ = తెలుసుకొనెదనో.

ఓ శ్రీహరీ! నేను అబలను, మందబుద్ధిని. ఈ యోగమును తెలి యుట చాల కష్టము. కాని నీ అనుగ్రహము వలన నేను దానిని తేలికగా తెలియగలిగే విధముగా నాకు వివరముగా బోధించుము.

మైత్రేయ ఉవాచ ।
విదిత్వార్థం కపిలో మాతురిత్థం
జాతస్నేహో యత్ర తన్వాభిజాతః ।
తత్త్వామ్నాయం యత్ప్రవదంతి సాంఖ్యం
ప్రోవాచ వై భక్తివితానయోగమ్ ॥ 31

కపిలః = కపిలుడు, ఇత్థమ్ = ఈ విధముగా, మాతుః = తల్లియొక్క, అర్థమ్ = ప్రయోజనము (అభిప్రాయము) ను, విదిత్వా = తెలుసుకొని, యత్ర = ఏ తల్లియందు, తన్వా = శరీరముచే, అభిజాతః = జన్మించినాడో ఆమెయందు, జాతస్నేహః = పుట్టిన ప్రేమ గలవాడై, తత్త్వ-ఆమ్నాయమ్ = తత్త్వములను నిరూపించే శాస్త్రమును, యత్ = దేనిని, సాంఖ్యమ్ = సాంఖ్యమని, ప్రవదంతి = చెప్పెదరో, భక్తివితానయోగమ్ = భక్తియొక్క విస్తారమును యోగమును, ప్రోవాచ వై = నిశ్చయముగా చెప్పెను.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- తల్లియొక్క ఈ విధమగు అభిప్రాయమునెరింగిన కపిలునకు ఆమెయందు ప్రేమ కలిగెను. తాను ఆమె నుండియే జన్మించినాడు గదా! అపుడాయన ఆమెకు పెద్దలచే సాంఖ్యము అని పిలువబడే తత్త్వములను నిరూపించే శాస్త్రమును, భక్తియొక్క విస్తారమును మరియు యోగమును బోధించెను.

శ్రీభగవానువాచ ।
దేవానాం గుణలింగానామానుశ్రవికకర్మణామ్ ।
సత్త్వ ఏవైకమనసో వృత్తిస్స్వాభావికీ తు యా ॥ 32

అనిమిత్తా భాగవతీ భక్తిస్సిద్ధేర్గరీయసీ ।
జరయత్యాశు యా కోశం నిగీర్ణమనలో యథా ॥ 33

ఏకమనసః = ఏకరూపమైన మనస్సు గలవాని, గుణలింగానామ్ = శబ్దాది విషయములను తెలుసుకొనే, అనుశ్రవికకర్మణామ్ = వేదవిహితములైన కర్మలను మాత్రమే చేసే, దేవానామ్ = ఇంద్రియములయొక్క, యా = ఏ, సత్త్వే ఏవ = సత్త్వమూర్తియగు శ్రీహరియందు మాత్రమే, స్వాభావికీ = సహజసిద్ధమైన, అనిమిత్తా = కామన లేని, వృత్తిః = ప్రవృత్తి గలదో అది, భాగవతీ = భగవానునకు సంబంధించిన, భక్తిః = భక్తి, సిద్ధేః = మోక్షము కంటె, గరీయసీ = గొప్పది, యా = ఏదైతే, ఆశు = శీఘ్రముగా, నిగీర్ణమ్ = భుజించబడిన అన్నమును, అనలః యథా = జఠరాగ్ని వలె, కోశమ్ = లింగశరీరమును, జరయతి = నశింపజేయునో.

భగవానునియందు మాత్రమే లగ్నమైన మనస్సు గల సాధకుని శబ్దాది విషయములను గ్రహించే జ్ఞానేంద్రియములు మరియు కర్మేంద్రియములు వేదవిహితమైన కర్మలయందు మాత్రమే లగ్నమై యుండును. అవి స్వతస్సిద్ధముగా సత్త్వమూర్తియగు శ్రీహరియందు నిష్కామముగా ప్రవర్తిల్లుటయే భగవద్భక్తి యనబడును. ఈ భక్తి యోగసిద్ధి (మోక్షము) కంటె గొప్పది. భుజించిన అన్నమును జఠరాగ్ని వలె భక్తి జీవుని కర్మసంస్కారముల రాశియగు లింగశరీరమును శీఘ్రముగా భస్మము చేయును.

నైకాత్మతాం మే స్పృహయంతి కేచిత్
మత్పాదసేవాభిరతా మదీహాః ।
యేఽన్యోన్యతో భాగవతాః ప్రసజ్య
సభాజయంతే మమ పౌరుషాణి ॥ **34**

మత్-పాదసేవా-అభిరతాః = నా పాదములను సేవించుటయందు ప్రీతిగల, మత్-ఈహాః = నా కొరకు మాత్రమే అన్ని ఇంద్రియచేష్టలు గల, కేచిత్ = కొందరు, భాగవతాః = భగవద్భక్తులు, మే = నా, ఏక-ఆత్మతామ్ = అభేదరూపమగు సాయుజ్యమును, న స్పృహయంతి = కోరరు, యే = ఎవరైతే, అన్యోన్యతః = ఒకరితోనొకరు, ప్రసజ్య = కలిసి, మమ = నా, పౌరుషాణి = పరాక్రమకార్యములను, సభాజయంతే = కొనియాడెదరో.

నా పాదములను సేవించుటయందు ప్రీతిగల కొందరు భగవద్భక్తులు తమ ఇంద్రియముల చేష్టలనన్నింటినీ నా కొరకు మాత్రమే చేయుదురు. వారు బ్రహ్మాత్మైకత్వము అనే సాయుజ్యమోక్షమును కోరరు. వారు పరస్పరము కలుసుకొని నా పరాక్రమకార్యములను శ్లాఘించెదరు.

పశ్యంతి తే మే రుచిరాణ్యంబ సంతః
ప్రసన్నవక్త్రారుణలోచనాని ।
రూపాణి దివ్యాని వరప్రదాని
సాకం వాచం స్పృహణీయాం వదంతి ॥ **35**

అంబ = ఓ అమ్మా!, తే = ఆ, సంతః = సత్పురుషులు, రుచిరాణి = అందమైనట్టియు, ప్రసన్నవక్త్ర-అరుణలోచనాని = ప్రసన్నములైన ముఖములు ఎర్రని కన్నులు గలిగినట్టియు, దివ్యాని = దివ్యములైనట్టియు, వరప్రదాని = వరములనిచ్చే, రూపాణి = రూపములను, పశ్యంతి = చూచెదరు, సాకమ్ = నాతో, స్పృహణీయామ్ = ప్రేమతో కూడిన, వాచమ్ = మాటను, వదంతి = పలికెదరు.

అమ్మా! ప్రసన్నమగు ముఖము ఎర్రని కన్నులు గల నా అందమైన వరములనిచ్చే దివ్యరూపములను ఆ సత్పురుషులు దర్శించి, నాతో బాటు ప్రేమపూర్వకముగా సంభాషించెదరు. నాతోడి అట్టి సంభాషణమును మహాత్ములు అందరు కోరెదరు.

> తైర్దర్శనీయావయవైరుదార-
> విలాసహాసేక్షితవామసూక్తైః ।
> హృతాత్మనో హృతప్రాణాంశ్చ భక్తి-
> రనిచ్ఛతో మే గతిమణ్వీం ప్రయుంక్తే ॥ 36

దర్శనీయ-అవయవైః = చూడదగిన అవయవములు గలిగినట్టియు, ఉదారవిలాసహాస-ఈక్షితవామసూక్తైః = గంభీరములైన లీలలు చిరునవ్వు చూపు మరియు మధురభాషణము గల, తైః = ఆ రూపములచే, హృత-ఆత్మనః = అపహరించబడిన మనస్సు గల వారిని, చ = మరియు, హృతప్రాణాన్ = అపహరించబడిన ప్రాణములు గల వారిని, అనిచ్ఛతః = ఇచ్ఛగించకున్ననూ, భక్తిః = భక్తి, అణ్వీమ్ = సూక్ష్మమగు, గతిమ్ = గతిని, ప్రయుంక్తే = పొందించుచున్నది.

దర్శనీయములగు అవయవములు గల నా రూపములు ఆ సాధు పురుషుల మనస్సులను దోచివేయును. నా గంభీరమగు లీలలు, నా చిరునవ్వుతో కూడిన చూపులు, నా మధురభాషణములను చూచి వారి ప్రాణములు ఎగిరిపోవును. అట్టి వారలను ఆ భక్తియే బ్రహ్మాత్మైక్యరూపమగు మోక్షమును పొందించును.

అథో విభూతిం మమ మాయావినస్తా-
మైశ్వర్యమష్టాంగమనుప్రవృత్తమ్ ।
శ్రియం భాగవతీం వాఽస్పృహయంతి భద్రాం
పరస్య మే తేఽశ్నువతే తు లోకే ॥ 37

అథో = తరువాత, మాయావినః = మాయకు అధీశుడనగు, మమ = నాయొక్క, తామ్ = ఆ, విభూతిమ్ = సత్యాదిలోకముల భోగసంపత్తినిగాని, అను = భక్తిని అనుసరించి, ప్రవృత్తమ్ = తనంత తానుగా సిద్ధించిన, అష్ట-అంగమ్ = ఎనిమిది అంగములు గల, ఐశ్వర్యమ్ = ఐశ్వర్యమును గాని, భాగవతీమ్ = భగవంతునకు సంబంధించిన, శ్రియం వా = సంపదను గాని, అ స్పృహయంతి = కోరరు, తు = కాని, పరస్య = పరమేశ్వరుడనగు, మే = నా, లోకే = వైకుంఠలోకమునందు, తే = వారు, భద్రామ్ = దుఃఖసంపర్కము లేని సంపదను, అశ్నువతే = పొందెదరు.

తరువాత వారు మాయాధీశుడనగు నా సత్యాదిలోకముల భోగసంపత్తిని గాని, తనంత తానుగా సిద్ధించే అణిమ మొదలగు ఎనిమిది ఐశ్వర్యములను గాని, వైకుంఠలోకమునందలి భగవానుని సంపదను గాని కోరరు. కాని, పరమేశ్వరుడనగు నా వైకుంఠలోకమునందు వారు దుఃఖసంపర్కము లేశమైననూ లేని విభూతిని పొందెదరు.

న కర్హిచిన్మత్పరాః శాంతరూపే
నంక్ష్యంతి నో మేఽనిమిషో లేఢి హేతిః ।
యేషామహం ప్రియ ఆత్మా సుతశ్చ
సఖా గురుస్సుహృదో దైవమిష్టమ్ ॥ 38

శాంతరూపే = శాంతిమయమగు వైకుంఠమునందు, మత్-పరాః = నేనే ఆశ్రయముగా గలవారై, కర్హిచిత్ = ఏ కాలమునందైననూ, న నంక్ష్యంతి = నశించరు, మే = నా, హేతిః = ఆయుధమగు, అనిమిషః = కాలము, నో లేఢి = వారిని మ్రింగివేయదు, యేషామ్ = ఎవరికైతే, అహమ్ = నేను, ప్రియః = ప్రియమగు, ఆత్మా = ఆత్మనో, సుతః చ = పుత్రుడను,

సఖా = మిత్రుడను, గురుః = గురువును, సుహృదః = స్నేహితులను, ఇష్టం దైవమ్ = ఇష్టదైవమునో.

ఎవరైతే ఆత్మరూపుడనగు నన్ను అధికముగా ప్రేమించెదరో, పుత్రునివలె నన్ను హృదయములో దాచుకొందురో, మిత్రునివలె నమ్మె దరో, గురువును వలె ఆదరించెదరో, మిత్రునివలె హితకారియని స్వీకరిం చెదరో, ఇష్టదైవమును వలె ఆరాధించెదరో, అట్టి నన్ను శరణు పొందిన భక్తులు ఏకాలమునందైననూ వినాశమును పొందరు. వారు శాంతిమయ మగు నా వైకుంఠధామములో నివసించెదరు. నా శస్త్రమగు కాలము వారి జోలికి పోదు.

ఇమం లోకం తథైవామముమాత్మానముభయాయినమ్ ।
ఆత్మానమను యే చేహ యే రాయః పశవో గృహాః ॥ 39

విసృజ్య సర్వానన్యాంశ్చ మామేవం విశ్వతోముఖమ్ ।
భజంత్యనన్యయా భక్త్యా తాన్ మృత్యోరతిపారయే ॥ 40

ఇమమ్ = ఈ, లోకమ్ = లోకమును, తథా ఏవ = అదే విధముగా, అముమ్ = పరలోకమును, ఉభయాయినమ్ = రెండు లోకములను పొందే లింగదేహమును, ఆత్మానమ్ = దేహమును, ఇహ = ఈ జన్మలో, యే చ = ఎవరైతే, అను = దేహమును అనుసరించి యున్నారో వారిని, యే = ఏ, రాయః = ధనములు, పశవః = పశువులు, గృహాః = ఇల్లు గలవో వాటిని, చ = మరియు, అన్యాన్ = ఇతరములగు, సర్వాన్ = అన్నింటినీ, విసృజ్య = విడిచిపెట్టి, విశ్వతోముఖమ్ = సర్వవ్యాపకుడనగు, మామ్ = నన్ను, ఏవమ్ = ఈ విధముగా, అనన్యయా = ఏకాంతమగు (భేదభావము లేని), భక్త్యా = భక్తితో, భజంతి = సేవించెదరో, తాన్ = వారిని, మృత్యోః = సంసారమునుం డి, అతిపారయే = దాటించెదను.

ఎవరైతే ఇహలోక పరలోకములయందలి ఆసక్తిని, ఈ రెండు లోక ములకు పయనించే లింగదేహమును, ఈ జన్మలో ఈ దేహముపై గల అహంకారమును, దేహసంబంధి జనులను, ధనము పశుసంపద ఇల్లు మొదలగువాటిని, ఇతరము సర్వమును విడిచిపెట్టి, సర్వవ్యాపకుడగు

నన్ను అభేదభావముతో కూడిన ఏకాంతభక్తితో సేవించెదరో, వారిని నేను జననమరణప్రవాహరూపమగు సంసారమునుండి తరింప జేసెదను.

నాన్యత్ర మద్భగవతః ప్రధానపురుషేశ్వరాత్ ।
ఆత్మనస్సర్వభూతానాం భయం తీవ్రం నివర్తతే ॥ 41

ప్రధానపురుష-ఈశ్వరాత్ = ప్రకృతికి జీవులకు ప్రభుడను, సర్వభూతానామ్ = సకలప్రాణులకు, ఆత్మనః = ఆత్మరూపుడను, భగవతః = భగవానుడను అగు, మత్ = నాకంటె, అన్యత్ర = ఇతరమునందు, తీవ్రమ్ = తీవ్రమగు, భయమ్ = భయము, న నివర్తతే = తొలగిపోదు.

ప్రకృతికి, జీవులకు అధీశ్వరుడను నేనే. భగవానుడనగు నేను సకలప్రాణులలో ఆత్మరూపముగా నున్నాను. నన్ను విడిచి ఇతరమునాశ్రయించుటచే తీవ్రమగు ఈ సంసారభయము తొలగదు.

మద్భయాద్వాతి వాతోఽయం సూర్యస్తపతి మద్భయాత్ ।
వర్షతీంద్రో దహత్యగ్నిర్మృత్యుశ్చరతి మద్భయాత్ ॥ 42

అయమ్ = ఈ, వాతః = గాలి, మత్-భయాత్ = నా వలని భయము వలన, వాతి = వీచుచున్నది, సూర్యః = సూర్యుడు, మద్భయాత్ = నా వలని భయము వలన, తపతి = తపించుచున్నాడు, ఇంద్రః = ఇంద్రుడు, వర్షతి = వర్షించుచున్నాడు, అగ్నిః = అగ్ని, దహతి = దహించుచున్నది, మృత్యుః = మృత్యువు, మద్భయాత్ = నా వలని భయము వలన, చరతి = ప్రవర్తిల్లుచున్నది.

ఈ గాలి నా భయము వలన వీచుచున్నది. ఈ సూర్యుడు నా భయము వలననే తపించుచున్నాడు. ఇంద్రుడు వర్షించుట, అగ్ని దహించుట నా భయము వలననే. మృత్యుదేవత నా భయము వలననే తన పనిని చేయుచున్నది.

జ్ఞానవైరాగ్యయుక్తేన భక్తియోగేన యోగినః ।
క్షేమాయ పాదమూలం మే ప్రవిశంత్యకుతోభయమ్ ॥ 43

యోగినః = యోగులు, క్షేమాయ = క్షేమము కొరకు, జ్ఞానవైరాగ్య యుక్తేన = జ్ఞానవైరాగ్యములతో కూడిన, భక్తియోగేన = భక్తియోగముచే, అకుతోభయమ్ = దేనివలనైననూ భయము లేని, మే = నా, పాదమూలమ్ = పాదముల మూలమును, ప్రవిశంతి = ప్రవేశించెదరు.

యోగులు క్షేమరూపమగు మోక్షమును పొందుట కొరకై జ్ఞానవైరాగ్యములతో కూడిన భక్తియోగముతో నా పాదమూలమునాశ్రయించి సర్వభయములనుండి విముక్తిని పొందెదరు.

ఏతావానేవ లోకేఽస్మిన్ పుంసాం నిఃశ్రేయసోదయః ।
తీవ్రేణ భక్తియోగేన మనో మయ్యర్పితం స్థిరమ్ ।। 44

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
పంచవింశోఽధ్యాయః ।।

తీవ్రేణ = తీవ్రమగు, భక్తియోగేన = భక్తియోగముచే, మయి = నాయందు, అర్పితమ్ = అర్పించబడిన, మనః = మనస్సు, స్థిరమ్ = నాయందే స్థిరముగా నుండుట, అస్మిన్ = ఈ, లోకే = లోకమునందు, ఏతావాన్ ఏవ = ఇంత మాత్రమే, పుంసామ్ = మానవులకు, నిఃశ్రేయస-ఉదయః = సర్వోత్కృష్టమగు కల్యాణము లభించుట.

ఈ లోకములో మానవులకు సర్వోత్కృష్టమగు కల్యాణము లభించుట యనగా, వారి మనస్సు తీవ్రమగు భక్తియోగముచే నాయందు అర్పితమై, నాయందే స్థిరముగా నిలిచియుండుటయే.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
ఇరువది అయిదవ అధ్యాయము ముగిసినది (25).

* * * * *

# అథ షడ్వింశోऽధ్యాయః

## మహత్తు మొదలగు తత్త్వముల ఉత్పత్తి

శ్రీభగవానువాచ ।
అథ తే సంప్రవక్ష్యామి తత్త్వానాం లక్షణం పృథక్ ।
యద్విదిత్వా విముచ్యేత పురుషః ప్రాకృతైర్గుణైః ॥ 1

శ్రీభగవాన్ = శ్రీభగవానుడు, ఉవాచ = పలికెను, అథ = తరువాత, తే = నీ కొరకు, తత్త్వానామ్ = ప్రకృతి మొదలగు తత్త్వముల, లక్షణమ్ = లక్షణమును, పృథక్ = వేర్వేరుగా, సంప్రవక్ష్యామి = చక్కగా బోధించగలను, యత్ = దేనిని, విదిత్వా = తెలుసుకొని, పురుషః = మానవుడు, ప్రాకృతైః = ప్రకృతికి చెందిన, గుణైః = గుణములనుండి, విముచ్యేత = విముక్తిని పొందునో.

కపిల భగవానుడిట్లు పలికెను --- నేనిప్పుడు నీకు ప్రకృతి మొదలగు తత్త్వముల లక్షణమును వేర్వేరుగా వివరించి చెప్పెదను. ఈ జ్ఞానము వలన మానవుడు సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతియొక్క బంధమునుండి విముక్తుడగును.

జ్ఞానం నిఃశ్రేయసార్థాయ పురుషస్యాత్మదర్శనమ్ ।
యదాహుర్వర్ణయే తత్తే హృదయగ్రంథిభేదనమ్ ॥ 2

ఆత్మదర్శనమ్ = ఆత్మసాక్షాత్కారరూపమగు, యత్ = ఏ, జ్ఞానమ్ = జ్ఞానము, పురుషస్య = మానవునకు, నిఃశ్రేయస-అర్థాయ = మోక్షము కొరకు అని, ఆహుః = చెప్పెదరో, హృదయగ్రంథిభేదనమ్ = హృదయము లోని అజ్ఞానము అనే ముడిని తీసివేసే, తత్ = అట్టి జ్ఞానమును, తే = నీ కొరకు, వర్ణయే = వర్ణించెదను.

ఈ జ్ఞానము వలన మానవుని హృదయములోని అజ్ఞానమనే ముడి విడిపోవును. దాని వలన ఆత్మసాక్షాత్కారము కలిగి మానవుడు మోక్షమును పొందునని మహర్షులు చెప్పుచున్నారు. అట్టి జ్ఞానమును నేను నీకు వివరించి చెప్పెదను.

అనాదిరాత్మా పురుషో నిర్గుణః ప్రకృతేః పరః ।
ప్రత్యగ్ధామా స్వయంజ్యోతిర్విశ్వం యేన సమన్వితమ్ ॥ 3

ఆత్మా = ఆత్మయే, పురుషః = పురుషుడు, అనాదిః = ఆది లేనివాడు, నిర్గుణః = గుణములు లేనివాడు, ప్రకృతేః = ప్రకృతికి, పరః = అతీతుడు, ప్రత్యక్-ధామా = దేహేంద్రియమనస్సంఘాతములో అంతరతమమగు చైతన్యస్వరూపుడు, స్వయంజ్యోతిః = స్వయంప్రకాశ స్వరూపుడు, యేన = ఎవనిచే, విశ్వమ్ = జగత్తు, సమన్వితమ్ = వ్యాప్తమైనదో.

అనాది, నిర్గుణుడు, ప్రకృతికి అతీతుడు అగు పురుషుడు ఆత్మయే. ఈ దేహేంద్రియసంఘాతములో అతిసూక్ష్మమగు స్వయంప్రకాశ తత్త్వము ఆత్మయే. ఈ జగత్తు ఆత్మచైతన్యముచే వ్యాప్తమై ప్రకాశించుచున్నది.

స ఏవ ప్రకృతిం సూక్ష్మాం దైవీం గుణమయీం విభుః ।
యదృచ్ఛయైవోపగతామభ్యపద్యత లీలయా ॥ 4

విభుః = సర్వవ్యాపకుడగు, సః ఏవ = ఆ పురుషుడే, సూక్ష్మామ్ = సూక్ష్మమైనట్టియు, దైవీమ్ = ప్రకాశస్వరూపుడగు పురుషుని శక్తి అయినట్టియు, గుణమయీమ్ = సత్త్వరజస్తమోగుణాత్మకమైనట్టియు, యదృచ్ఛయా ఏవ = తన ఇచ్ఛచే మాత్రమే, ఉపగతామ్ = ప్రాప్తమైన, ప్రకృతిమ్ = మాయను, లీలయా = లీలచే, అభ్యపద్యత = స్వీకరించెను.

సర్వవ్యాపకుడగు ఆ పురుషుడే తన ఇచ్ఛచే మాత్రమే తనకు సంప్రాప్తమైన తన మాయాశక్తిని లీలచే స్వీకరించెను. సత్త్వరజస్తమోగుణాత్మకమగు ఆ మాయ జగత్కారణమగుటచే సూక్ష్మము.

గుణైర్విచిత్రాస్సృజతీం స్వరూపాః ప్రకృతిం ప్రజాః ।

విలోక్య ముముహే సద్యస్స ఇహ జ్ఞానగూహయా ।। 5

గుణైః = సత్త్వరజస్తమోగుణములచే, విచిత్రాః = వివిధములైన, స్వరూపాః = తనతో సమానమగు రూపము గల, ప్రజాః = ప్రాణులను, సృజతీమ్ = సృష్టించుచున్న, ప్రకృతిమ్ = మాయాశక్తిని, విలోక్య = చూచి, సః = ఆ పురుషుడు, ఇహ = ఈ సంసారమునందు, జ్ఞానగూహయా = జ్ఞానమును కప్పివేసే ఆవరణశక్తిచే, సద్యః = వెంటనే, ముముహే = మోహ మును పొందెను.

ప్రకృతి తన సత్త్వరజస్తమోగుణములచే తనతో సమానమైన స్వరూపము గల వివిధప్రాణులను సృష్టించెను. ఈ సంసారములో ఆ ప్రకృ తిని చూచి పురుషుడు ఆ మాయాశక్తియొక్క ఆవరణశక్తిచే తన స్వరూప మును విస్మరించెను.

ఏవం పరాభిధ్యానేన కర్తృత్వం ప్రకృతేః పుమాన్ ।
కర్మసు క్రియమాణేషు గుణైరాత్మని మన్యతే ।। 6

ఏవమ్ = ఈ విధముగా, పుమాన్ = పురుషుడు, పర-అభిధ్యానేన = తనకంటె విలక్షణమగు ప్రకృతిని తన స్వరూపముగా భావించుటచే, ప్రకృతేః = ప్రకృతియొక్క, గుణైః = సత్త్వరజస్తమోగుణములచే, కర్మసు = కర్మలు, క్రియమాణేషు = చేయబడుచుండగా, కర్తృత్వమ్ = కర్తృత్వ మును, ఆత్మని = తనయందు, మన్యతే = భావించుచున్నాడు.

ఈ విధముగా పురుషుడు తనకంటె విలక్షణమైన ప్రకృతిని తన స్వరూపముగా పొరబడినాడు. కావుననే, ప్రకృతియొక్క గుణములు కర్మ లను చేయుచుండగా, వాటి కర్తృత్వమును తనపై ఆపాదించుకొనినాడు.

తదస్య సంసృతిర్బంధః పారతంత్ర్యం చ తత్కృతమ్ ।
భవత్యకర్తురీశస్య సాక్షిణో నిర్వృతాత్మనః ।। 7

తత్ = అందువలన, అకర్తుః = కర్త కానట్టియు, ఈశస్య = స్వతం త్రుడైనట్టియు, సాక్షిణః = సాక్షియైనట్టియు, నిర్వృత-ఆత్మనః = ఆనందస్వ రూపుడగు, అస్య = ఈ పురుషునకు, సంసృతిః = సంసారము, బంధః =

బంధము, చ = మరియు, తత్-కృతమ్ = కర్మబంధముచే చేయబడిన, పారతంత్ర్యమ్ = అస్వతంత్రత, భవతి = కలుగుచున్నది.

పురుషుడు అకర్త, స్వతంత్రుడు, సాక్షి, ఆనందస్వరూపుడు. కాని, ఆ అధ్యాసచే పురుషునకు జననమరణప్రవాహరూప సంసారము, కర్తృత్వముచే కర్మబంధము, దానిచే అస్వతంత్రత సంప్రాప్తమైనవి.

కార్యకారణకర్తృత్వే కారణం ప్రకృతిం విదుః ।
భోక్తృత్వే సుఖదుఃఖానాం పురుషం ప్రకృతేః పరమ్ ॥ 8

కార్యకారణకర్తృత్వే = దేహమును ఇంద్రియములను ఉత్పన్నము చేయుటయందు, ప్రకృతిమ్ = ప్రకృతిని, కారణమ్ = హేతువుగా, విదుః = తెలియుచున్నారు, సుఖదుఃఖానామ్ = సుఖదుఃఖముల, భోక్తృత్వే = భోక్తృత్వము (ఉపలబ్ధి) నందు, ప్రకృతేః = ప్రకృతికి, పరమ్ = అతీతమైన, పురుషమ్ = పురుషుని (హేతువుగా తెలియుచున్నారు).

దేహము, ఇంద్రియములు ప్రకృతినుండి ఉత్పన్నముగుచున్నవి. ప్రకృతికి అతీతుడైన పురుషుడు వాటితో తాదాత్మ్యమును చెంది సుఖదుఃఖములకు భోక్త యగుచున్నాడని మహర్షులు చెప్పుచున్నారు.

దేవహూతిరువాచ ।
ప్రకృతేః పురుషస్యాపి లక్షణం పురుషోత్తమ ।
బ్రూహి కారణయోరస్య సదసచ్చ యదాత్మకమ్ ॥ 9

పురుషోత్తమ = ఓ పురుషోత్తమా!, అస్య = ఈ జగత్తునకు, కారణయోః = హేతువులగు, ప్రకృతేః = ప్రకృతియొక్క, అపి = మరియు, పురుషస్య = పురుషునియొక్క, లక్షణమ్ = లక్షణమును, బ్రూహి = చెప్పుము, సత్-అసత్ = కార్య కారణ (స్థూల సూక్ష్మ) రూపమగు జగత్తు, యత్-ఆత్మకమ్ = ఏ ప్రకృతిపురుషులే స్వరూపముగా గలదియో.

దేవహూతి ఇట్లు పలికెను --- ఓ పురుషోత్తమా! ఈ జగత్తునకు ప్రకృతిపురుషులు హేతువు. స్థూలసూక్ష్మరూపమగు ఈ జగత్తుయొక్క స్వరూపము ప్రకృతిపురుషులే. వాటి లక్షణములను చెప్పుము.

శ్రీభగవానువాచ ।
యత్తత్త్రిగుణమవ్యక్తం నిత్యం సదసదాత్మకమ్ ।
ప్రధానం ప్రకృతిం ప్రాహురవిశేషం విశేషవత్ ॥ **10**

యత్ = ఏదైతే, త్రిగుణమ్ = సత్త్వరజస్తమోగుణాత్మకమో, అవ్యక్తమ్ = సూక్ష్మమో, నిత్యమ్ = నిత్యమో, సత్-అసత్-ఆత్మకమ్ = కార్యకారణరూపమో, అవిశేషమ్ = పృథివి మొదలగు విశేషములు లేనిదే అయిననూ, విశేషవత్ = విశేషములకు ఆశ్రయమో, తత్ = అట్టి, ప్రధానమ్ = ముఖ్యకారణమును, ప్రకృతిమ్ = ప్రకృతినిగా, ప్రాహుః = చెప్పుచున్నారు.

కపిల భగవానుడిట్లు పలికెను --- సత్త్వరజస్తమోగుణాత్మకము, సూక్ష్మమైనది, ఉత్పత్తివినాశములు లేనిది, కార్యకారణరూపములోనున్నది, పృథివి మొదలగు విశేషములు స్వయముగా తనయందు లేకున్ననూ వాటికి ఆశ్రయమగునది, జగత్తునకు ముఖ్యకారణము అగు తత్త్వమును ప్రకృతి అని అందురు.

పంచభిః పంచభిర్బ్రహ్మ చతుర్భిర్దశభిస్తథా ।
ఏతచ్చతుర్వింశతికం గణం ప్రాధానికం విదుః ॥ **11**

పంచభిః = అయిదింటితో, పంచభిః = అయిదింటితో, చతుర్భిః = నాలుగింటితో, తథా = అదే విధముగా, దశభిః = పదింటితో, ఏతత్-చతుర్వింశతికమ్ = ఈ ఇరవై నాలుగు తత్త్వములు గల, గణమ్ = సముదాయమును, ప్రాధానికమ్ = ప్రకృతికార్యము రూపములోనున్న, బ్రహ్మ = బ్రహ్మయని, విదుః = తెలియుచున్నారు.

అయిదు, అయిదు, నాలుగు, పది వెరసి ఇరవై నాలుగు తత్త్వములు ప్రకృతియొక్క కార్యములు. పరబ్రహ్మ వీటిని అధిష్ఠించి బ్రహ్మాండరూపముగా నున్నాడని మహర్షులు చెప్పుచున్నారు.

మహాభూతాని పంచైవ భూరాపోఽగ్నిర్మరున్నభః ।
తన్మాత్రాణి చ తావంతి గంధాదీని మతాని మే ॥ **12**

భూః = భూమి, ఆపః = నీరు, అగ్నిః = అగ్ని, మరుత్ = వాయువు, నభః = ఆకాశము అనే, మహాభూతాని = మహాభూతములు, పంచ ఏవ = అయిదు మాత్రమే, గంధ-ఆదీని = గంధము మొదలగు, తన్మాత్రాణి చ = తన్మాత్రలు కూడ, తావంతి = అన్నే అని, మే = నాకు, మతాని = తెలియబడునవి.

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అనునవి అయిదు స్థూల మహాభూతములు. వీటికి కారణమగు సూక్ష్మతన్మాత్రలు కూడ అయిదే. అవియే గంధము, రసము, రూపము, స్పర్శ మరియు శబ్దము అనునవి అని నేను చెప్పుచున్నాను.

ఇంద్రియాణి దశ శ్రోత్రం త్వగ్దృగ్రసననాసికాః ।
వాక్కరౌ చరణౌ మేఢ్రం పాయుర్దశమ ఉచ్యతే ॥ 13

శ్రోత్రమ్ = చెవి, త్వక్-దృక్-రసననాసికాః = చర్మము కన్ను నాలుక ముక్కులు, వాక్-కరౌ = వాక్కు చేతులు, చరణౌ = పాదములు, మేఢ్రమ్ = జననేంద్రియము, దశమః = పదవదియగు, పాయుః = విసర్జనేంద్రియము అను, దశ = పది, ఇంద్రియాణి = ఇంద్రియములని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు, వాక్కు, చేతులు, కాళ్లు, జనన-విసర్జనేంద్రియములు అనునవి పది ఇంద్రియములని చెప్పబడినది.

మనో బుద్ధిరహంకారశ్చిత్తమిత్యంతరాత్మకమ్ ।
చతుర్ధా లక్ష్యతే భేదో వృత్త్యా లక్షణరూపయా ॥ 14

అంతరాత్మకమ్ = అంతఃకరణము, లక్షణరూపయా = చిహ్నరూపమగు, వృత్త్యా = వికారముచే, మనః = మనస్సు, బుద్ధిః = బుద్ధి, అహంకారః = అహంకారము, చిత్తమ్ = చిత్తము, ఇతి = అనే, భేదః = విభాగము, చతుర్ధా = నాలుగు విధములుగా, లక్ష్యతే = కానవచ్చుచున్నది.

అంతఃకరణము దానిలో వచ్చే వికారముల చిహ్నమును బట్టి నాలుగు రకములుగా కానవచ్చుచున్నది. సంకల్పవికల్పముల రూప

ములో నుండేది మనస్సు. నిశ్చయరూపములో నుండేది బుద్ధి. నేను అనే వృత్తి అహంకారము. స్మృతిరూపములో నుండేది చిత్తము.

ఏతావానేవ సంఖ్యాతో బ్రహ్మణస్సగుణస్య హ
సన్నివేశో మయా ప్రోక్తో యః కాలః పంచవింశకః ॥ 15

మయా = నాచే, ప్రోక్తః = చెప్పబడిన, సగుణస్య బ్రహ్మణః = సగుణబ్రహ్మయొక్క, సన్నివేశః = విశిష్టమగు అవస్థ, ఏతావాన్ ఏవ = ఇంతమాత్రము అనియే, సంఖ్యాతః = పరిగణించబడినది, యః = ఏ, కాలః = కాలము గలదో అది, పంచవింశకః = ఇరువది అయిదవది.

నేనీ విధముగా సగుణబ్రహ్మయొక్క జగద్రూపమగు అవస్థలోని విశేషములను పరిగణించితిని. దీనినే ఇతరులగు ఆచార్యులు కూడ చెప్పుచున్నారు. కాలము ఇరువది అయిదవ తత్త్వము.

ప్రభావం పౌరుషం ప్రాహుః కాలమేకే యతో భయమ్ ।
అహంకారవిమూఢస్య కర్తుః ప్రకృతిమీయుషః ॥ 16

ఏకే = కొందరు, కాలమ్ = కాలమును, పౌరుషమ్ = పురుషునకు సంబంధించిన, ప్రభావమ్ = మహిమనుగా, ప్రాహుః = చెప్పుచున్నారు, అహంకారవిమూఢస్య = నేను చేయుచున్నాననే భావనచే విమోహితుడై, ప్రకృతిమ్ = అవిద్యను, ఈయుషః = పొందియున్న, కర్తుః = కర్తయగు జీవునకు, యతః = దేనివలన, భయమ్ = భయము గలదో.

కొందరు కాలము పురుషుని మహిమయని చెప్పెదరు. జీవుడు అవిద్యచే ప్రకృతితో తాదాత్మ్యమును చెంది గుణములచే చేయబడే కర్మలకు తానే కర్తనని భ్రమపడి, కాలమునకు భయపడుచున్నాడు.

ప్రకృతేర్గుణసామ్యస్య నిర్విశేషస్య మానవి ।
చేష్టా యతస్స భగవాన్ కాల ఇత్యుపలక్షితః ॥ 17

మానవి = ఓ మనుపుత్రీ!, గుణసామ్యస్య = సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థలోనున్న, నిర్విశేషస్య = పృథివ్యాది వికారములు లేని,

ప్రకృతేః = ప్రకృతికి, యతః = ఎవనివలన, చేష్టా = కదలిక కలుగునో, సః = అట్టి, భగవాన్ = భగవానుడే, కాలః = కాలము, ఇతి = అని, ఉపలక్షితః = వ్యవహరించబడుచున్నాడు.

సృష్టికి పూర్వము ప్రకృతియందలి సత్త్వరజస్తమోగుణములు సామ్యావస్థలోనుండుటచే ప్రకృతియందింకనూ పృథివ్యాది వికారములేమియు ప్రకటము కావు. ఆ స్థితిలో ఆ సామ్యావస్థలో కదలికను భగవానుడే కలిగించును. ఆ చేష్టకు కారణమగు భగవానునకే కాలమని వ్యవహారము.

అంతః పురుషరూపేణ కాలరూపేణ యో బహిః ।
సమన్వేత్యేష సత్త్వానాం భగవానాత్మమాయయా ॥ 18

యః = ఏ, ఏషః = ఈ, భగవాన్ = భగవానుడు, ఆత్మమాయయా = తన మాయాశక్తిచే, సత్త్వానామ్ = ప్రాణులకు, అంతః = లోపల, పురుష రూపేణ = పురుషుని రూపముచే, బహిః = బయట, కాలరూపేణ = కాలము అనే రూపముచే, సమన్వేతి = వ్యాపించియున్నాడో.

ఈ భగవానుడే తన మాయాశక్తిచే ప్రాణులకు లోపల పురుషరూపములో, బయట కాలరూపములో వ్యాపించియున్నాడు.

దైవాత్ క్షుభితధర్మిణ్యాం స్వస్యాం యోనౌ పరః పుమాన్ ।
ఆధత్త వీర్యం సాసూత మహత్తత్త్వం హిరణ్మయమ్ ॥ 19

పరః = ప్రకృతికి అతీతుడగు, పుమాన్ = పురుషుడు, దైవాత్ = కాలముచే, క్షుభితధర్మిణ్యామ్ = వైషమ్యమును పొందించబడిన గుణములు గల, స్వస్యామ్ = తనదైన, యోనౌ = ఉపాధియగు మాయాశక్తియందు, వీర్యమ్ = చైతన్యశక్తిని, ఆధత్త = ఉంచెను, సా = ఆ ప్రకృతి, హిరణ్మయమ్ = తేజోమయమగు, మహత్తత్త్వమ్ = మహత్తు అనే తత్త్వమును, అసూత = కనెను.

కాలము ప్రకృతియొక్క గుణములలోని సామ్యావస్థను కదల్చి వైషమ్యమును కలిగించును. ప్రకృతికి అతీతుడగు పురుషుడు అట్టి తన

ప్రకృతియందు చైతన్యశక్తిని ఆధానము చేయును. అపుడా ప్రకృతి తేజోమ యమగు మహత్తత్త్వరూపముగా ప్రకటమగును.

విశ్వమాత్మగతం వ్యంజన్ కూటస్థో జగదంకురః ।
స్వతేజసాపిబత్తీవ్రమాత్మప్రస్వాపనం తమః ॥ 20

కూటస్థః = నిర్వికారము, జగత్-అంకురః = జగత్తునకు అంకురము వంటిది అగు మహత్తత్త్వము, ఆత్మగతమ్ = తనయందు అవ్యక్తముగానున్న, విశ్వమ్ = జగత్తును, వ్యంజన్ = ప్రకటించుచున్నదై, ఆత్మప్రస్వాపనమ్ = తనను నిద్రబుచ్చే (స్వరూపమును కప్పివేసే), తీవ్రమ్ = తీవ్రమగు, తమః = అంధకారమును, స్వతేజసా = తన తేజస్సుచే, అపిబత్ = త్రాగివేసెను.

నిర్వికారము, జగత్తునకు అంకురము వంటిది అగు మహత్తత్త్వము తనయందు అవ్యక్తముగానున్న జగత్తును ప్రకటింప జేయుచున్నదై, తన స్వరూపమును కప్పివేసే తీవ్రమగు ప్రళయకాలీనమైన అంధకారమును తన తేజస్సుచే త్రాగివేసెను (నశింపజేసెను).

యత్తత్సత్త్వగుణం స్వచ్ఛం శాంతం భగవతః పదమ్ ।
యదాహుర్వాసుదేవాఖ్యం చిత్తం తన్మహదాత్మకమ్ ॥ 21

తత్ = ప్రసిద్ధి గాంచినది, స్వచ్ఛమ్ = స్వచ్ఛము, శాంతమ్ = శాంతము, సత్త్వగుణమ్ = సత్త్వగుణమయము, భగవతః = భగవానుని, పదమ్ = ఉపలబ్ధి స్థానము అగు, యత్ = ఏ, చిత్తమ్ = చిత్తము గలదో, తత్ = అదియే, మహత్-ఆత్మకమ్ = మహత్తత్త్వము, వాసుదేవ-ఆఖ్యమ్ = వాసుదేవుడను పేరు గలది.

శాస్త్రములో ప్రసిద్ధిని గాంచినది, స్వచ్ఛము, శాంతము, సత్త్వగుణమయము, భగవానుని కనుగొనే స్థానము అగు చిత్తమే మహత్తత్త్వము. అదియే వాసుదేవుడనే ఉపాస్యదైవము అని మహర్షులు చెప్పుచున్నారు.

స్వచ్ఛత్వమవికారిత్వం శాంతత్వమితి చేతసః ।

వృత్తిభిర్లక్షణం ప్రోక్తం యథాపాం ప్రకృతిః పరా ॥ 22

స్వచ్ఛత్వమ్ = స్వచ్ఛముగానుండుట, అవికారిత్వమ్ = వికారములు లేకుండుట, శాంతత్వమ్ = శాంతముగా నుండుట, ఇతి = అనే, వృత్తిభిః = గుణములచే, చేతసః = చిత్తముయొక్క, లక్షణమ్ = లక్షణము, అపామ్ = జలములయొక్క, పరా = ఇతరసంసర్గము లేని, ప్రకృతిః యథా = స్వభావము వంటిది.

చిత్తము స్వభావముచే స్వచ్ఛముగా, వికారములు (విక్షేపలయములనే రజస్తమోగుణముల ధర్మములు) లేనిదిగా, శాంతముగా నుండును. ఇది చిత్తముయొక్క లక్షణము. చిత్తమును భూమితో సంపర్కము కలుగక ముందు స్వచ్ఛముగా నుండే నీటితో పోల్చవచ్చును.

మహత్తత్త్వాద్వికుర్వాణాద్భగవద్వీర్యసంభవాత్ ।
క్రియాశక్తిరహంకారస్త్రివిధస్సమపద్యత ॥ 23

వైకారికస్తైజసశ్చ తామసశ్చ యతో భవః ।
మనసశ్చేంద్రియాణాం చ భూతానాం మహతామపి ॥ 24

వికుర్వాణాత్ = వికారమును చెందుచున్న, భగవత్-వీర్యసంభవాత్ = భగవంతుని చిచ్ఛక్తిచే ఉత్పన్నమైన, మహత్తత్త్వాత్ = మహత్తత్త్వమునుండి, క్రియాశక్తిః = క్రియలయందు శక్తిగల, వైకారికః = సాత్త్వికము, తైజసః = తైజసము, తామసః చ = తామసము అనే, త్రివిధః = మూడు విధముల, అహంకారః = అహంకారము, సమపద్యత = ప్రకటమయ్యెను, యతః = దేనినుండి, మనసః = మనస్సుయొక్క, ఇంద్రియాణాం చ = ఇంద్రియములయొక్క, మహతాం భూతానాం అపి = మహాభూతములయొక్క, భవః = ఉత్పత్తి కలిగినదో.

భగవానుని చిచ్ఛక్తిచే ఉదయించిన మహత్తత్త్వము వికారమును చెంది, సాత్త్విక రాజస తామస అనే మూడు విధముల క్రియాశక్తియుక్తమగు అహంకారము ప్రకటమయ్యెను. దానినుండియే మనస్సు, ఇంద్రియములు, పంచ మహాభూతములు పుట్టినవి.

సహస్రశిరసం సాక్షాద్యమనంతం ప్రచక్షతే ।
సంకర్షణాఖ్యం పురుషం భూతేంద్రియమనోమయమ్ ॥ 25

భూత-ఇంద్రియమనోమయమ్ = పంచభూతములు ఇంద్రియములు మనస్సు అనే రూపములోనుండే, యమ్ = ఏ అహంకారమును, సాక్షాత్ = సాక్షాత్తుగా, సహస్రశిరసమ్ = అనంతమగు శిరస్సులు గలిగినట్టియు, సంకర్షణ-ఆఖ్యమ్ = సంకర్షణుడు అను పేరుగల, అనంతం పురుషమ్ = అనంతదేవుడని, ప్రచక్షతే = చెప్పుచున్నారో.

పంచభూతములు, ఇంద్రియములు, మనస్సు అనే రూపములో నుండే అహంకారము సాక్షాత్తుగా అనంతదేవుడని మహర్షులు చెప్పుచున్నారు. అనంతమగు శిరస్సులు గల ఆ అనంతునకు సంకర్షణుడని పేరు.

కర్తృత్వం కరణత్వం చ కార్యత్వం చేతి లక్షణమ్ ।
శాంతఘోరవిమూఢత్వమితి వా స్యాదహంకృతేః ॥ 26

కర్తృత్వమ్ = కర్తయగుట, కరణత్వమ్ = సాధనమై యుండుట, కార్యత్వం చ = కార్యము (పుట్టేది) అయి ఉండుట, ఇతి = అని గాని, శాంత ఘోరవిమూఢత్వం వా = శాంతము ఘోరము విమూఢము అయి ఉండుట గాని, అహంకృతేః = అహంకారముయొక్క, లక్షణమ్ = లక్షణము.

దేవత రూపములో కర్తృత్వము, ఇంద్రియముల రూపములో కరణత్వము, పంచభూతముల రూపములో కార్యత్వము అహంకారము యొక్క లక్షణము. సత్త్వరజస్తమోగుణముల సంబంధముచే క్రమముగా శాంతత్వము (ప్రసన్నత), ఘోరత్వము (విక్షేపము లేక చాంచల్యము), విమూఢత్వము (మోహము) అనునవి కూడ అహంకార లక్షణములే.

వైకారికాద్వికుర్వాణాన్మనస్తత్త్వమజాయత ।
యత్సంకల్పవికల్పాభ్యాం వర్తతే కామసంభవః ॥ 27

వికుర్వాణాత్ = వికారమును చెందుచున్న, వైకారికాత్ = సాత్త్వికాహంకారమునుండి, మనస్తత్త్వమ్ = మనస్సు అనే తత్త్వము, అజాయత = పుట్టెను, యత్-సంకల్పవికల్పాభ్యామ్ = దేని సంకల్ప (విషయచింతన

ము) వికల్పము (విశేషచింతనము) లనుండి, కామసంభవః = కామన యొక్క పుట్టుక, వర్తతే = కలుగుచున్నదో.

సాత్త్వికాహంకారము వికారమును చెంది మనస్సు పుట్టును. దాని సంకల్పవికల్పములనుండి కామనలు పుట్టును.

యద్విదుర్హ్యనిరుద్ధాఖ్యం హృషీకాణామధీశ్వరమ్ ।
శారదేందీవరశ్యామం సంరాధ్యం యోగిభిశ్శనైః ॥ 28

యత్ = ఏ మనస్తత్త్వమును, హృషీకాణామ్ = ఇంద్రియములకు, అధీశ్వరమ్ = అధీశ్వరుడైనట్టియు, శారద-ఇందీవరశ్యామమ్ = శరత్కాల మునందలి కలువవలె నల్లనైనట్టియు, యోగిభిః = సాధకులచే, శనైః = మెల్లమెల్లగా, సంరాధ్యమ్ = ఆరాధించదగిన, అనిరుద్ధ-ఆఖ్యమ్ = అనిరు ద్ధుడు అనే పేరు గలదానినిగా, విదుః హి = తెలియుచున్నారో.

ఆ మనస్తత్త్వమే ఇంద్రియాధిపతియగు అనిరుద్ధుడని ప్రసిద్ధిని గాంచినది. శరత్కాలమునందలి కలువవలె నల్లనైన అనిరుద్ధుని యోగులు మనస్సును మెల్లమెల్లగా వశము చేసుకొని ఆరాధించెదరు.

తైజసాత్తు వికుర్వాణాద్బుద్ధితత్త్వమభూత్సతి ।
ద్రవ్యస్ఫురణవిజ్ఞానమింద్రియాణామనుగ్రహః । 29

సతి = ఓ పతివ్రతా!, వికుర్వాణాత్ = వికారమును చెందుచున్న, తైజసాత్ తు = తైజసాహంకారమునుండైతే, బుద్ధితత్త్వమ్ = బుద్ధి అనే తత్త్వము, అభూత్ = పుట్టెను, ద్రవ్యస్ఫురణవిజ్ఞానమ్ = ద్రవ్యములు స్ఫురించుట అనే విజ్ఞానము, ఇంద్రియాణామ్ = ఇంద్రియములకు, అను గ్రహః = అనుగ్రహము.

ఓ సాధ్వీ! తైజసాహంకారము వికారమును చెంది బుద్ధితత్త్వము పుట్టెను. ద్రవ్యములు స్ఫురించి వాటి విజ్ఞానము కలుగుట, ఇంద్రియము లకు ఆయా విషయముల జ్ఞానము కలుగుట అనునవి దాని కార్యములు.

సంశయోఽథ విపర్యాసో నిశ్చయస్స్మృతిరేవ చ ।

స్వాప ఇత్యుచ్యతే బుద్ధేర్లక్షణం వృత్తితః పృథక్ ॥ 30

సంశయః = సంశయము, అథ = మరియు, విపర్యాసః = విపరీత జ్ఞానము, నిశ్చయః = నిశ్చయజ్ఞానము, స్మృతిః ఏవ చ = స్మరణము, స్వాపః = నిద్ర, ఇతి = అని, పృథక్ = వేర్వేరుగా, వృత్తితః = వృత్తులను బట్టి, బుద్ధేః = బుద్ధియొక్క, లక్షణమ్ = లక్షణము.

సంశయము (ఒకే వస్తువునందు పలు రకముల జ్ఞానము కలుగుట), విపర్యాసము (ఒకదానిని మరియొకటిగా భావించుట), నిశ్చయము (ఖచ్చితమైన జ్ఞానము), స్మరణము, నిద్ర అను వేర్వేరు రూపములు బుద్ధియొక్క లక్షణము.

తైజసానీంద్రియాణ్యేవ క్రియాజ్ఞానవిభాగశః ।
ప్రాణస్య హి క్రియా శక్తిర్బుద్ధేర్విజ్ఞానశక్తితా ॥ 31

క్రియాజ్ఞానవిభాగశః = కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములు అనే విభాగమును బట్టి, ఇంద్రియాణి = ఇంద్రియములు, తైజసాని ఏవ = తైజసాహంకారమునుండి పుట్టినవియే, హి = ఏలయనగా, క్రియా = కర్మ, ప్రాణస్య = ప్రాణముయొక్క, శక్తిః = శక్తి, బుద్ధేః = బుద్ధికి, విజ్ఞానశక్తితా = విజ్ఞానము అనే శక్తిని కలిగియుండుట.

కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు అనే రెండు రకముల ఇంద్రియములు తైజసాహంకారమునుండియే పుట్టినవి. వీటిలో కర్మ ప్రాణముయొక్క శక్తి కాగా, విజ్ఞానము బుద్ధియొక్క శక్తి అగుచున్నది.

తామసాచ్చ వికుర్వాణాద్భగవద్వీర్యచోదితాత్ ।
శబ్దమాత్రమభూత్తస్మాన్నభః శ్రోత్రం తు శబ్దగమ్ ॥ 32

చ = మరియు, భగవత్-వీర్యచోదితాత్ = భగవానుని చిచ్ఛక్తిచే ప్రేరితమై, వికుర్వాణాత్ = వికారమును చెందుచున్న, తామసాత్ = తామసాహంకారమునుండి, శబ్దమాత్రమ్ = శబ్దతన్మాత్ర, అభూత్ = పుట్టెను, తస్మాత్ = దానినుండి, నభః = ఆకాశము, శ్రోత్రం తు = శ్రోత్రేంద్రియమైతే, శబ్దగమ్ = శబ్దమును గ్రహించునది.

భగవానుని చిచ్ఛక్తిచే ప్రేరితమై వికారమును చెందిన తామసాహంకారమునుండి శబ్దతన్మాత్ర (రూపరసాదులతో కలయిక లేని కేవలశబ్దము) యు, దానినుండి ఆకాశము పుట్టినవి. శ్రోత్రేంద్రియము శబ్దమును గ్రహించును.

అర్థాశ్రయత్వం శబ్దస్య ద్రష్టుర్లింగత్వమేవ చ ।
తన్మాత్రత్వం చ నభసో లక్షణం కవయో విదుః । 33

శబ్దస్య = శబ్దమునకు, అర్థ-ఆశ్రయత్వమ్ = అర్థమును ప్రకాశింపజేయుట, ద్రష్టుః = చూచువానికి, లింగత్వం ఏవ చ = జ్ఞాపనము చేయుట, నభసః = ఆకాశమునకు, తన్మాత్రత్వం చ = తన్మాత్ర యగుట, లక్షణమ్ = లక్షణమని, కవయః = పండితులు, విదుః = తెలియుచున్నారు.

శబ్దము అర్థమును ప్రకాశింపజేయును శబ్దమును ఉచ్చరించు వ్యక్తిని జ్ఞాపనము చేయును. శబ్దము ఆకాశమునకు తన్మాత్ర (సూక్ష్మభూతము). ఇవి శబ్దలక్షణములని పండితులు చెప్పుచున్నారు.

భూతానాం ఛిద్రదాతృత్వం బహిరంతరమేవ చ ।
ప్రాణేంద్రియాత్మధిష్ణ్యత్వం నభసో వృత్తిలక్షణమ్ ॥ 34

భూతానామ్ = ప్రాణులకు పదార్థములకు, ఛిద్రదాతృత్వమ్ = అవకాశమునిచ్చుట, బహిః = బయట, అంతరం ఏవ చ = లోపల కూడ ఉండుట, ప్రాణ-ఇంద్రియ-ఆత్మధిష్ణ్యత్వమ్ = ప్రాణమునకు ఇంద్రియములకు మనస్సునకు ఆశ్రయమగుట, నభసః = ఆకాశముయొక్క, వృత్తిలక్షణమ్ = కార్యరూపమైన లక్షణము.

ఆకాశము సకలపదార్థములకు తనయందు ఉండే అవకాశమునిచ్చుటయే గాక, వాటికి లోపల బయట కూడ వ్యాపించియుండును. నాడులయందలి ఛిద్రము రూపములోనున్న ఆకాశము ప్రాణమునకు, ఇంద్రియములకు, మనస్సునకు ఆశ్రయమగుచున్నది. ఈ కార్యములే ఆకాశముయొక్క లక్షణము అగుచున్నవి.

నభసశ్శబ్దతన్మాత్రాత్కాలగత్యా వికుర్వతః ।

స్పర్శోఽభవత్తతో వాయుస్త్వక్ స్పర్శస్య చ సంగ్రహః ॥ 35

శబ్దతన్మాత్రాత్ = శబ్దము తన్మాత్రగా గలిగినట్టియు, కాలగత్యా = కాలముయొక్క గమనముచే, వికుర్వతః = వికారమును చెందుచున్న, నభసః = ఆకాశమునుండి, స్పర్శః = స్పర్శ తన్మాత్ర, అభవత్ = పుట్టెను, తతః = దానినుండి, వాయుః = వాయువు పుట్టెను, త్వక్ = త్వగింద్రియము, స్పర్శస్య = స్పర్శకు, సంగ్రహః = గ్రహించునది.

శబ్దతన్మాత్రనుండి ఆకాశము పుట్టగా, కాలగమనముచే వికారమును చెందిన ఆకాశమునుండి స్పర్శతన్మాత్ర పుట్టినది. దానినుండి వాయువు పుట్టినది. స్పర్శను గ్రహించే ఇంద్రియము చర్మము.

మృదుత్వం కఠినత్వం చ శైత్యముష్ణత్వమేవ చ ।
ఏతత్ స్పర్శస్య స్పర్శత్వం తన్మాత్రత్వం నభస్వతః ॥ 36

మృదుత్వమ్ = మెత్తగా నుండుట, కఠినత్వమ్ = గట్టిగానుండుట, శైత్యమ్ = చల్లగానుండుట, ఉష్ణత్వం ఏవ చ = వేడిగానుండుట, నభస్వతః = వాయువునకు, తన్మాత్రత్వమ్ = సూక్ష్మరూపమగుట, ఏతత్ = ఇది, స్పర్శస్య = స్పర్శయొక్క, స్పర్శత్వమ్ = లక్షణము.

మెత్తదనము, గట్టిదనము, చల్లదనము, వేడి, వాయువునకు తన్మాత్ర అగుట అనునవి స్పర్శయొక్క లక్షణములు.

చాలనం వ్యూహనం ప్రాప్తిర్నేతృత్వం ద్రవ్యశబ్దయోః ।
సర్వేంద్రియాణామాత్మత్వం వాయోః కర్మాభిలక్షణమ్ ॥ 37

చాలనమ్ = కదల్చుట, వ్యూహనమ్ = దగ్గరకు చేర్చుట, ప్రాప్తిః = వెళ్లుట, ద్రవ్యశబ్దయోః = ద్రవ్యశబ్దముల, నేతృత్వమ్ = తీసుకుపోవుట, సర్వ-ఇంద్రియాణామ్ = ఇంద్రియములన్నింటికీ, ఆత్మత్వమ్ = ఆత్మయగుట, వాయోః = వాయువుయొక్క, కర్మ-అభిలక్షణమ్ = పనుల లక్షణము.

వాయువు చెట్టు కొమ్మలు మొదలగు వాటిని కుదుపును; గడ్డి మొ[illegible]ని ఒకచోటికి చేర్చును; అన్ని చోట్లకు వెళ్లును; గంధాది

ద్రవ్యములను ఘ్రాణము మొదలగు ఇంద్రియములకు చేర్చును; శబ్దమును చెవి వరకు చేర్చును. ఇంద్రియములన్నింటికీ శక్తిని సమకూర్చునది వాయువే. వాయువుయొక్క ఈ కార్యములే దాని లక్షణములు.

వాయోశ్చ స్పర్శతన్మాత్రాద్రూపం దైవేరితాదభూత్ ।
సముత్థితం తతస్తేజశ్చక్షూ రూపోపలంభనమ్ ॥ 38

దైవ-ఈరితాత్ = కాలముచే ప్రేరితమైన, స్పర్శతన్మా[త్రా]త్ = స్పర్శ తన్మాత్రగా గల, వాయోః చ = వాయువునుండి కూడ, రూపమ్ = రూపము, అభూత్ = పుట్టెను, తతః = దానినుండి, తేజః = అగ్ని సముత్థితమ్ = పుట్టినది, చక్షుః = కన్ను, రూప-ఉపలంభనమ్ = రూపమును గ్రహించే ఇంద్రియము.

స్పర్శ తన్మాత్రగా గల వాయువునుండి కాలప్రేరణచే రూపము, దానినుండి అగ్ని పుట్టినవి. కన్ను రూపమును గ్రహించే ఇంద్రియము.

ద్రవ్యాకృతిత్వం గుణతా వ్యక్తిసంస్థాత్వమేవ చ ।
తేజస్త్వం తేజసస్సాధ్వి రూపమాత్రస్య వృత్తయః ॥ 39

సాధ్వి = ఓ పతివ్రతా!, ద్రవ్య-అకృతిత్వమ్ = పదార్థములకు ఆకారమును కలిగించుట, గుణతా = పదార్థములకు గుణమై భాసించుట, వ్యక్తిసంస్థాత్వం ఏవ చ = ద్రవ్యముయొక్క సన్నివేశ విశేషముగనే భాసించుట కూడా, తేజసః = అగ్నియొక్క, తేజస్త్వమ్ = స్వరూపమై యుండుట, రూపమాత్రస్య = రూపతన్మాత్రయొక్క, వృత్తయః = లక్షణములు.

ఓ సాధ్వీ! పదార్థములకు ఆకారమును కలిగించుట, పదార్థములకు గుణమై భాసిల్లుట, పదార్థముల విశిష్టమగు సన్నివేశము (ఆకారము, పరిమాణము) రూపములోనే తెలియబడుట, అగ్నికి స్వరూపమై యుండుట అనునవి రూపతన్మాత్రయొక్క లక్షణములు.

ద్యోతనం పచనం పానమదనం హిమమర్దనమ్ ।
తేజసో వృత్తయస్త్వేతాశ్శోషణం క్షుత్తృడేవ చ ॥ 40

ద్యోతనమ్ = ప్రకాశించుట, పచనమ్ = వండుట, పానమ్ = నీటిని త్రాగుట, అదనమ్ = భక్షించుట, హిమమర్దనమ్ = చలిని పోగొట్టుట, శోష ణమ్ = ఎండింపజేయుట, క్షుత్ = ఆకలి, తృట్ ఏవ చ = దాహము కూడ, ఏతే = ఇవి, తేజసః = అగ్నియొక్క, వృత్తయః = వ్యాపారములు.

ప్రకాశించుట, ఆహారపదార్థములను వండుట, దాహమును కలిగించి నీటిని త్రాగుట, ఆకలిని కలిగించి ఆహారమును భక్షించుట, చలిని పోగొట్టుట, ఎండింప జేయుట అనునవి అగ్నియొక్క వ్యాపారములు.

రూపమాత్రాద్వికుర్వాణాత్తేజసో దైవచోదితాత్ ।
రసమాత్రమభూత్తస్మాదంభో జిహ్వా రసగ్రహః ॥ **41**

రూపమాత్రాత్ = రూపము తన్మాత్రగా గలిగినట్టియు, దైవచోదితాత్ = దైవముచే ప్రేరితమై, వికుర్వాణాత్ = వికారమును చెందుచున్న, తేజసః = అగ్నినుండి, రసమాత్రమ్ = రసతన్మాత్ర, అభూత్ = ఉదయించెను, తస్మాత్ = దానినుండి, అంభః = జలము, జిహ్వా = నాలుక, రసగ్రహః = రసమును గ్రహించును.

రూపము తన్మాత్రగా గల అగ్ని దైవప్రేరణచే వికారమును చెంది రసతన్మాత్రకు జన్మనిచ్చెను. దానినుండి జలము పుట్టెను. నాలుక రసమును గ్రహించును.

కషాయో మధురస్తిక్తః కట్వమ్ల ఇతి నైకధా ।
భౌతికానాం వికారేణ రస ఏకో విభిద్యతే ॥ **42**

భౌతికానామ్ = భౌతికపదార్థములయొక్క, వికారేణ = కలయికచే, ఏకః = ఒకే, రసః = రసము, కషాయః = వగరు, మధురః = తీపి, తిక్తః = చేదు, కటు = కారము, అమ్లః = పులుపు, ఇతి = అని, నైకధా = అనేకవిధములుగా, విభిద్యతే = విభాగమును పొందుచున్నది.

రసము ఒక్కటియే. కాని, భౌతికపదార్థముల కలయికచే అది వగరు, తీపి, చేదు, కారము, పులుపు, ఉప్పు అని ఆరు విధములుగా విభాగమును పొందుచున్నది.

క్లేదనం పిండనం తృప్తిః ప్రాణనాప్యాయనోందనమ్ ।
తాపాపనోదో భూయస్త్వమంభసో వృత్తయస్త్విమాః ॥ 43

క్లేదనమ్ = తడిగా చేయుట, పిండనమ్ = ముద్దగా చేయుట, తృప్తిః = తృప్తి, ప్రాణన-ఆప్యాయన-ఉందనమ్ = జీవింపజేయుట దాహమును తీర్చుట మెత్తగా చేయుట, తాప-అపనోదః = తాపము తొలగుట, భూయస్త్వమ్ = అధికముగా లభ్యమగుట, ఇమాః = ఇవి, అంభసః = నీటియొక్క, వృత్తయః = లక్షణములు.

తడిగా చేయుట, ముద్దగా చేయుట, తృప్తిని కలిగించుట, ప్రాణములను నిలబెట్టుట, దాహమును తీర్చుట, పదార్థములను మెత్తగా చేయుట, వేడిని తొలగించుట, అధికముగా లభించుట (భూమినుండి ఊరుట) అనునవి నీటి లక్షణములు.

రసమాత్రాద్వికుర్వాణాదంభసో దైవచోదితాత్ ।
గంధమాత్రమభూత్తస్మాత్పృథ్వీ ఘ్రాణస్తు గంధగః ॥ 44

రసమాత్రాత్ = రసము తన్మాత్రగా గలిగినట్టియు, దైవచోదితాత్ = దైవముచే ప్రేరేపించబడి, వికుర్వాణాత్ = వికారమును పొందుచున్న, అంభసః = నీటినుండి, గంధమాత్రమ్ = గంధతన్మాత్ర, అభూత్ = పుట్టెను, తస్మాత్ = దానినుండి, పృథ్వీ = పృథివి, ఘ్రాణః తు = ఘ్రాణేంద్రియమైతే, గంధగః = గంధమును గ్రహించును.

రసము తన్మాత్రగా గల నీరు దైవప్రేరణచే వికారమును చెంది గంధతన్మాత్ర పుట్టినది. దానినుండి పృథివి పుట్టినది. గంధమును గ్రహించే ఇంద్రియము ముక్కు.

కరంభపూతిసౌరభ్యశాంతోగ్రామ్లాదిభిః పృథక్ ।
ద్రవ్యావయవవైషమ్యాద్గంధ ఏకో విభిద్యతే ॥ 45

ఏకః = ఒకే, గంధః = గంధము, ద్రవ్య-అవయవవైషమ్యాత్ = ద్రవ్యముల అవయవముల హెచ్చుతగ్గులచే, కరంభపూతిసౌరభ్యశాంత-ఉ

గ్ర-అమ్ల-ఆదిభిః = మిశ్రమగంధము దుర్గంధము సుగంధము మృదుగంధము తీవ్రగంధము పులుపు వాసన మొదలగువాటిచే, పృథక్ విభిద్యతే = వేర్వేరు తేడాలను కలిగియున్నది.

గంధము ఒక్కటే. కాని ద్రవ్యావయవముల సమ్మేళనములోని హెచ్చుతగ్గుల వలన మిశ్రమగంధము దుర్గంధము సుగంధము మృదుగంధము తీవ్రగంధము పులుపు వాసన మొదలగు భేదములు ఏర్పడును.

భావనం బ్రహ్మణః స్థానం ధారణం సద్విశేషణమ్ ।
సర్వసత్త్వగుణోద్భేదః పృథివీవృత్తిలక్షణమ్ ॥ 46

బ్రహ్మణః = పరమేశ్వరుని, భావనమ్ = ప్రతిమ మొదలగు రూపములలో భావనకు ఆధారమగుట, స్థానమ్ = నిలిచియుండుట, ధారణమ్ = ఇతరమునకు స్థితిని కలిగించుట, సత్-విశేషణమ్ = ఆకాశము మొదలగు వాటిని అవచ్ఛిన్నము (పరిమితము) చేయుట, సర్వసత్త్వగుణ-ఉద్భేదః = సకలప్రాణుల ఆయా గుణములను ప్రకటింపజేయుట, పృథివీవృత్తిలక్షణమ్ = పృథివియొక్క కార్యరూపమగు లక్షణము.

పృథివి ప్రతిమ మొదలగు రూపములలో పరమేశ్వరుని భావనకు ఆలంబనమగును. పృథివి తాను స్థిరముగా నిలిచియుండి నీరు మొదలగు వాటికి ఆధారమగుచుండును. ఆకాశమును పృథివి ఘటాకాశము, మఠాకాశము మొదలగు తీరులలో పరిచ్ఛిన్నము చేసినట్లు కానవచ్చును. సకలప్రాణులలో వ్యక్తమయ్యే స్త్రీత్వపుంస్త్వాది గుణములను పృథివియే ప్రకటింపజేయుచున్నది. ఈ కార్యముల ద్వారా పృథివి తెలియబడును.

నభోగుణవిశేషోఽర్థో యస్య తచ్ఛ్రోత్రముచ్యతే ।
వాయోర్గుణవిశేషోఽర్థో యస్య తత్స్పర్శనం విదుః ॥ 47

నభోగుణవిశేషః = ఆకాశముయొక్క విశిష్టగుణమగు శబ్దము, యస్య = దేనికి, అర్థః = విషయమో, తత్ = ఆ ఇంద్రియము, శ్రోత్రమ్ = శ్రోత్రమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, వాయోః = వాయువుయొక్క, గుణవిశేషః = అసాధారణగుణమగు స్పర్శ, యస్య = ఏ ఇంద్రియమునకు,

అర్థః = గ్రహింపబడే విషయమో, తత్ = అది, స్పర్శనమ్ = స్పర్శేంద్రియ మని, విదుః = తెలియుచున్నారు.

ఆకాశముయొక్క విశేషగుణము శబ్దము. దానిని గ్రహించే ఇంద్రియము శ్రోత్రము. వాయువుయొక్క అసాధారణ గుణము స్పర్శ. దానిని గ్రహించే ఇంద్రియము స్పర్శేంద్రియము.

తేజోగుణవిశేషోఽర్థో యస్య తచ్చక్షురుచ్యతే ।
అంభోగుణవిశేషోఽర్థో యస్య తద్రసనం విదుః ।
భూమేర్గుణవిశేషోఽర్థో యస్య స ఘ్రాణ ఉచ్యతే ॥ **48**

తేజః-గుణవిశేషః = అగ్నికి విశేషగుణమగు రూపము, యస్య = దేనికి, అర్థః = విషయమో, తత్ = అది, చక్షుః = చక్షురింద్రియమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, అంభః-గుణవిశేషః = నీటియొక్క విశేషగుణమగు రసము, యస్య = దేనికి, అర్థః = విషయమో, తత్ = అది, రసనమ్ = రసనేంద్రియమని, విదుః = తెలియుచున్నారు, భూమేః = భూమియొక్క, గుణవిశేషః = విశిష్టగుణమగు గంధము, యస్య = దేనికి, అర్థః = విషయమో, సః = అది, ఘ్రాణః = ఘ్రాణేంద్రియమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

అగ్నికి విశేషగుణము రూపము. దానిని గ్రహించేది చక్షురింద్రియము. నీటి విశేషగుణము రసము. దానిని గ్రహించేది రసనేంద్రియము. భూమికి విశేషగుణము గంధము. దానిని గ్రహించేది ఘ్రాణేంద్రియము.

పరస్య దృశ్యతే ధర్మో హ్యపరస్మిన్ సమన్వయాత్ ।
అతో విశేషో భావానాం భూమావేవోపలక్ష్యతే ॥ **49**

పరస్య = కారణముయొక్క, ధర్మః = ధర్మము, అపరస్మిన్ = కార్యమునందు, సమన్వయాత్ = అనువృత్తమగుట వలన, దృశ్యతే = కానవచ్చును, అతః = కావున, భావానామ్ = పంచభూతముల, విశేషః = విశిష్టగుణము, భూమౌ ఏవ = భూమియందు మాత్రమే, ఉపలక్ష్యతే = కానబడును.

ఉపాదానకారణము కార్యములోనికి అనువృత్తమగును. కావున, కార్యములో కారణధర్మము కూడ కనబడును. కావుననే, భూమియందు

మాత్రమే తన విశేషధర్మమగు గంధముతో బాటు మిగిలిన నాలుగు భూత ముల గుణములు, అనగా శబ్దస్పర్శరూపరసములు కూడ గలవు.

ఏతాన్యసంహత్య యదా మహదాదీని సప్త వై ।
కాలకర్మగుణోపేతో జగదాదిరుపావిశత్ ॥ 50

యదా = ఏ కాలమునందైతే, ఏతాని = ఈ, మహత్-ఆదీని = మహత్తు మొదలగు, అసంహత్య = కలువకుండగానున్న, సప్త = ఏడింటిని, జగత్-ఆదిః = జగత్కారణమగు భగవానుడు, కాలకర్మగుణ-ఉపేతః = కాలము కర్మ గుణములతో కూడినవాడై, ఉపావిశత్ = ప్రవేశించెనో.

మహత్తు, అహంకారము, పంచభూతములు అనే ఈ ఏడు తత్త్వములు ఒకదానితో మరియొకటి కలియకుండగా నుండెను. అపుడు జగత్కారణమగు భగవానుడు, వాటిలో కలయికను తెచ్చే కాలము జీవుల కర్మాదృష్టము మరియు సత్త్వరజస్తమోగుణములు అనువాటితో గూడి వాటిని ప్రవేశించెను.

తతస్తేనానువిద్ధేభ్యో యుక్తేభ్యోఽండమచేతనమ్
ఉత్థితం పురుషో యస్మాదుదతిష్ఠదసౌ విరాట్ ॥ 51

తతః = తరువాత, తేన = ఆ భగవానుని ప్రవేశముచే, అనువిద్ధేభ్యః = క్షోభిల్లజేయబడిన, యుక్తేభ్యః = ఒకదానితో మరియొకటి కలిసిన ఆ తత్త్వములనుండి, అచేతనమ్ = ప్రాణము లేని, అండమ్ = బ్రహ్మాండము, ఉత్థితమ్ = ఉదయించినది, యస్మాత్ = దేనినుండి, అసౌ = ఈ, విరాట్ పురుషః = విరాట్ పురుషుడు, ఉదతిష్ఠత్ = ఉదయించినాడో.

తరువాత భగవానుడు ప్రవేశించుటచే ఆ తత్త్వములలో సంక్షోభము కలిగి అవి ఒకదానితో మరియొకటి కలిసినవి. అప్పుడు ప్రాణరహిత మైన అండము పుట్టెను. దానినుండి విరాట్ పురుషుడు (సమష్టి బ్రహ్మాండ శరీరాభిమాని) ప్రకటమయ్యెను.

ఏతదండం విశేషాఖ్యం క్రమవృద్ధైర్దశోత్తరైః

తోయాదిభిః పరివృతం ప్రధానేనావృతైర్బహిః
యత్ర లోకవితానోఽయం రూపం భగవతో హరేః 52

విశేష-ఆఖ్యమ్ = విశేషమనబడే, ఏతత్ = ఈ, అండమ్ = బ్రహ్మాండము, బహిః = బయట, ప్రధానేన = ప్రకృతిచే, ఆవృతైః = చుట్టువారబడియున్నట్టియు, క్రమవృద్ధైః = వరుసగా పెరిగినట్టియు, దశ-ఉత్తరైః = ఒకదానిని మించి మరియొకటి పది రెట్లు ఉన్న, తోయ-ఆదిభిః = జలము మొదలగు వాటిచే, పరివృతమ్ = చుట్టువారబడియున్నది, యత్ర = దేనియందైతే, భగవతః హరేః = శ్రీహరి భగవానుని, రూపమ్ = రూపము అయిన, అయమ్ = ఈ, లోకవితానః = లోకముల విస్తారము గలదో.

ఈ అండమునకు విశేషము అని పేరు. దీని చుట్టూ పది రెట్లు నీరు, దాని చుట్టూ పది రెట్లు తేజస్సు, దాని చుట్టూ పది రెట్లు వాయువు, దాని చుట్టూ పది రెట్లు ఆకాశము, దాని చుట్టూ ప్రకృతియొక్క ఆవరణము గలవు. దీనియందు ఈ లోకముల విస్తారము గలదు. ఈ విస్తారము శ్రీహరి భగవానుని రూపమే.

హిరణ్మయాదండకోశాదుత్థాయ సలిలేశయాత్ ।
తమావిశ్య మహాదేవో బహుధా నిర్బిభేద ఖమ్ ।। 53

సలిలేశయాత్ = నీటియందున్న, హిరణ్మయాత్ = తేజోమయమైన, అండకోశాత్ = బ్రహ్మాండకోశమునుండి, ఉత్థాయ = పైకి లేచి, మహాదేవః = విరాట్ పురుషుడు, తమ్ = దానిని, ఆవిశ్య = ఆవేశించి, బహుధా = అనేకప్రకారములుగా, ఖమ్ = ఛిద్రమును, నిర్బిభేద = పగుల గొట్టెను.

నీటియందున్న తేజోమయమైన ఆ బ్రహ్మాండకోశమునుండి విరాట్ పురుషుడు పైకి లేచి దానిని మరల ఆవేశించి, దానియందు అనేకఛిద్రములను పగుల గొట్టెను.

నిరభిద్యతాస్య ప్రథమం ముఖం వాణీ తతోఽభవత్ ।
వాణ్యా వహ్నిరథో నాసే ప్రాణోతో ఘ్రాణ ఏతయోః 54

అస్య = ఈ విరాట్ పురుషునకు, ప్రథమమ్ = ముందుగా, ముఖమ్ = నోరు, నిరభిద్యత = విడివడెను, తతః = దానినుండి, వాణీ = వాగింద్రియము, అభవత్ = పుట్టెను, వాణ్యాః = వాగింద్రియమునకు అధిష్ఠాతయగు, వహ్నిః = అగ్ని, అథో = తరువాత, నాసే = ముక్కు పుటములు, ఏతయోః = వీటియందు, ప్రాణ-ఉతః = ప్రాణముతో గూడియున్న, ఘ్రాణః = ఘ్రాణేంద్రియము.

విరాట్ పురుషునకు ముందుగా నోరు విడివడెను. దానినుండి వాగింద్రియము, దానికి అధిష్ఠాతయగు అగ్ని ప్రకటమైనవి. తరువాత ముక్కు పుటములు విడివడెను. వాటినుండి ప్రాణముతో గూడిన ఘ్రాణేంద్రియము పుట్టెను.

ఘ్రాణాద్వాయురభిద్యేతామక్షిణీ చక్షురేతయోః ।
తస్మాత్సూర్యో వ్యభిద్యేతాం కర్ణౌ శ్రోత్రం తతో దిశః ।। 55

ఘ్రాణాత్ = ఘ్రాణేంద్రియముకంటె పిదప, వాయుః = వాయువు, అక్షిణీ = కన్నులు, అభిద్యేతామ్ = విడివడెను, ఏతయోః = వీటియందు, చక్షుః = చక్షురింద్రియము, తస్మాత్ = దాని తరువాత, సూర్యః = సూర్యుడు, కర్ణౌ = చెవులు, వ్యభిద్యేతామ్ = విడివడెను, శ్రోత్రమ్ = శ్రోత్రేంద్రియము, తతః = దాని తరువాత, దిశః = దిగ్దేవత.

ఘ్రాణేంద్రియము తరువాత దాని అధిష్ఠాన దేవతయగు వాయువు ప్రకటమయ్యెను. తరువాత కన్నులు విడివడెను. వాటియందు చక్షురింద్రియము, దాని అధిష్ఠానమగు సూర్యుడు ప్రకటమయ్యెను. తరువాత చెవులు విడివడి శ్రోత్రేంద్రియము, దానికి అధిష్ఠానమగు దిగ్దేవత పుట్టెను.

నిర్బిభేద విరాజస్త్వగ్రోమశ్మశ్ర్వాదయస్తతః ।
తత ఓషధయశ్చాసన్ శిశ్నం నిర్బిభిదే తతః ।। 56

విరాజః = విరాట్ పురుషునకు, త్వక్ = చర్మము, నిర్బిభేద = ప్రకటమయ్యెను, తతః = దానినుండి, రోమశ్మశ్రు-ఆదయః = రోమములు మీసములు గెడ్డము మొదలగునవి, తతః = తరువాత, ఓషధయః చ = ఓషధు

లు కూడ, ఆసన్ = ప్రకటమయ్యెను, తతః = తరువాత, శిశ్నమ్ = జననేంద్రియము, నిర్బిభిదే = ప్రకటమయ్యెను.

విరాట్ పురుషునకు తరువాత చర్మము, దానినుండి రోమములు మీసము గెడ్డము మొదలగునవి, చర్మమునకు అధిష్ఠానదేవతయగు ఓషధులు, తరువాత జననేంద్రియము ప్రకటమయ్యెను.

రేతస్తస్మాదాప ఆసన్నిరభిద్యత వై గుదమ్ ।
గుదాదపానోఽపానాచ్చ మృత్యుర్లోకభయంకరః ॥ 57

తస్మాత్ = దానినుండి, రేతః = రేతస్సు, ఆపః = జలములు, ఆసన్ = పుట్టినవి, గుదం వై = విసర్జనేంద్రియము, నిరభిద్యత = ప్రకటమయ్యెను, గుదాత్ = దానినుండి, అపానః = అపానము, చ = మరియు, అపానాత్ = అపానము కంటె పిదప, లోకభయంకరః = జనులకు భయమును గొల్పే, మృత్యుః = మృత్యువు.

దానినుండి రేతస్సు, అభిమానిదేవతయగు ఆపోదేవుడు (జలము) పుట్టెను. తరువాత విసర్జనేంద్రియము ప్రకటమై, దానినుండి అపానము, తరువాత లోకములకు భయమును కలిగించే మృత్యువు పుట్టెను.

హస్తౌ చ నిరభిద్యేతాం బలం తాభ్యాం తతస్స్వరాట్ ।
పాదౌ చ నిరభిద్యేతాం గతిస్తాభ్యాం తతో హరిః ॥ 58

హస్తౌ చ = చేతులు కూడ, నిరభిద్యేతామ్ = ప్రకటమయ్యెను, తాభ్యామ్ = వాటినుండి, బలమ్ = బలము, తతః = తరువాత, స్వరాట్ = ఇంద్రుడు, పాదౌ చ = పాదములు కూడ, నిరభిద్యేతామ్ = ప్రకటమయ్యెను, తాభ్యామ్ = వాటినుండి, గతిః = గమనము, తతః = తరువాత, హరిః = విష్ణువు.

విరాట్ పురుషునకు చేతులు ప్రకటమై, వాటియందు బలము అనే కర్మేంద్రియము, తరువాత దానికి అధిష్ఠానమగు ఇంద్రుడు ప్రకటమైెరి. తరువాత పాదములు ప్రకటమై, వాటినుండి గమనము అనే ఇంద్రియము, తరువాత దానికి అధిష్ఠానమగు విష్ణువు ప్రకటమైెరి.

నాడ్యోఽస్య నిరభిద్యంత తాభ్యో లోహితమాభృతమ్ ।
నద్యస్తతస్సమభవన్నుదరం నిరభిద్యత ॥ 59

అస్య = ఈ విరాట్ పురుషునకు, నాడ్యః = నాడులు, నిరభిద్యంత = ప్రకటమయ్యెను, తాభ్యః = వాటినుండి, లోహితమ్ = రక్తము, ఆభృతమ్ = ఉత్పన్నమై వాటియందు నిండెను, తతః = తరువాత, నద్యః = నదులు (దేవతలు), సమభవన్ = ప్రకటమయ్యెను, ఉదరమ్ = ఉదరము, నిరభిద్యత = ప్రకటమయ్యెను.

ఈ విరాట్ పురుషునకు నాడులు ప్రకటమై వాటియందు రక్తము పుట్టి వాటిని నింపెను. తరువాత నదీదేవతలు ప్రకటమైరి. తరువాత ఆయనకు ఉదరము ప్రకటమయ్యెను.

క్షుత్పిపాసే తతస్స్యాతాం సముద్రస్త్వేతయోరభూత్ ।
అథాస్య హృదయం భిన్నం హృదయాన్మన ఉత్థితమ్ ॥ 60

తతః = ఆ విరాట్ పురుషునినుండి, క్షుత్-పిపాసే = ఆకలి దప్పికలు, స్యాతామ్ = ఉత్పన్నమయ్యెను, ఏతయోః = వీటికి, సముద్రః = సముద్రము, అభూత్ = పుట్టెను, అథ = తరువాత, అస్య = ఈయనకు, హృదయమ్ = హృదయము, భిన్నమ్ = ప్రకటమయ్యెను, హృదయాత్ = హృదయమునుండి, మనః = మనస్సు, ఉత్థితమ్ = పుట్టినది.

తరువాత ఆ విరాట్ పురుషునకు ఆకలి దప్పికలు పుట్టి, వాటికి దేవతయగు సముద్రము ప్రకటమయ్యెను. తరువాత ఆయనకు హృదయము ప్రకటమై, దానినుండి మనస్సు పుట్టెను.

మనసశ్చంద్రమా జాతో బుద్ధిర్బుద్ధేర్గిరాం పతిః ।
అహంకారస్తతో రుద్రశ్చిత్తం చైత్యస్తతోఽభవత్ ॥ 61

మనసః = మనస్సునకు, చంద్రమాః = దేవతయగు చంద్రుడు, జాతః = పుట్టెను, బుద్ధిః = బుద్ధి, బుద్ధేః = బుద్ధికి, గిరాం పతిః = బ్రహ్మ,

తతః = పిదప, అహంకారః = అహంకారము, రుద్రః = రుద్రుడు, తతః = పిదప, చిత్తమ్ = చిత్తము, చైత్యః = క్షేత్రజ్ఞుడు, అభవత్ = ప్రకటమయ్యెను.

మనస్సునకు దేవతయగు చంద్రుడు, బుద్ధి, దానికి దేవతయగు బ్రహ్మ ప్రకటమైరి. తరువాత అహంకారము, దానికి దేవతయగు రుద్రుడు, చిత్తము, దానికి దేవతయగు క్షేత్రజ్ఞుడు ప్రకటమైరి.

ఏతే హ్యాభ్యుత్థితా దేవా నైవాస్యోత్థాపనేఽశకన్ ।
పునరావివిశుః ఖాని తముత్థాపయితుం క్రమాత్ ॥ 62

ఏతే = ఈ, అభ్యుత్థితాః = ప్రకటమైన, దేవాః = దేవతలు, అస్య = ఈ విరాట్ పురుషునియొక్క, ఉత్థాపనే = పైకి లేపుటయందు, న ఏవ అశకన్ = సమర్థులు కాలేకపోయిరి, పునః = మరల, తమ్ = ఆయనను, ఉత్థాపయితుమ్ = పైకి లేపుటకు, క్రమాత్ = వరుసగా, ఖాని = తమ తమ స్థానములను, ఆవివిశుః = ప్రవేశించిరి.

ఈ విధముగా ప్రకటమైన దేవతలు ఆ విరాట్ పురుషుని పైకి లేపుటకు సమర్థులు కాలేకపోయిరి. అపుడు వారు మరల ఆయనను లేపుటకు తమ తమ స్థానములలో ప్రవేశించిరి.

వహ్నిర్వాచా ముఖం భేజే నోదతిష్ఠత్తదా విరాట్ ।
ఘ్రాణేన నాసికే వాయుర్నోదతిష్ఠత్తదా విరాట్ ॥ 63

వహ్నిః = అగ్ని, వాచా = వాక్కుతో, ముఖమ్ = ముఖమును, భేజే = ప్రవేశించెను, తదా = అప్పుడు, విరాట్ = విరాట్ పురుషుడు, న ఉదతిష్ఠత్ = పైకి లేవలేదు, వాయుః = వాయువు, ఘ్రాణేన = ఘ్రాణేంద్రియముతో, నాసికే = ముక్కు పుటములను, తదా = అప్పుడు, విరాట్ = విరాట్ పురుషుడు, న ఉదతిష్ఠత్ = పైకి లేవలేదు.

అప్పుడు అగ్ని వాక్కుతో ముఖమును ప్రవేశించెను. కాని, విరాట్ పురుషుడు పైకి లేవలేదు. వాయువు ఘ్రాణేంద్రియముతో సహా ముక్కు పుటములను ప్రవేశించిననూ, ఆయన పైకి లేవలేదు.

అక్షిణీ చక్షుషాऽऽదిత్యో నోదతిష్ఠత్తదా విరాట్ ।
శ్రోత్రేణ కర్ణౌ చ దిశో నోదతిష్ఠత్తదా విరాట్ ॥ 64

త్వచం రోమభిరోషధ్యో నోదతిష్ఠత్తదా విరాట్ ।
రేతసా శిశ్నమాపస్తు నోదతిష్ఠత్తదా విరాట్ ॥ 65

గుదం మృత్యురపానేన నోదతిష్ఠత్తదా విరాట్ ।
హస్తావింద్రో బలేనైవ నోదతిష్ఠత్తదా విరాట్ ॥ 66

విష్ణుర్గత్యైవ చరణౌ నోదతిష్ఠత్తదా విరాట్ ।
నాడీర్నద్యో లోహితేన నోదతిష్ఠత్తదా విరాట్ ॥ 67

క్షుత్తృడ్భ్యాముదరం సింధుర్నోదతిష్ఠత్తదా విరాట్ ।
హృదయం మనసా చంద్రో నోదతిష్ఠత్తదా విరాట్ ॥ 68

బుద్ధ్యా బ్రహ్మాపి హృదయం నోదతిష్ఠత్తదా విరాట్ ।
రుద్రోऽభిమత్యా హృదయం నోదతిష్ఠత్తదా విరాట్ ॥ 69

ఆదిత్యః = ఆదిత్యుడు, చక్షుషా = చక్షురింద్రియముతో, అక్షిణీ = కన్నులను, దిశః = దిగ్దేవత, శ్రోత్రేణ = శ్రోత్రేంద్రియముతో, కర్ణౌ = చెవులను, ఓషధ్యః = ఓషధి దేవతలు, రోమభిః = రోమములతో సహా, త్వచమ్ = త్వగింద్రియమును, ఆపః తు = ఆపోదేవతయైతే, రేతసా = రేతస్సుతో, శిశ్నమ్ = జననేంద్రియమును, మృత్యుః = మృత్యుదేవత, అపానేన = అపానముతో, గుదమ్ = విసర్జనేంద్రియమును, ఇంద్రః = ఇంద్రుడు, బలేన ఏవ = బలము అనే కర్మేంద్రియముతోనే, హస్తౌ = చేతులను, విష్ణుః = విష్ణువు, గత్యా ఏవ = గమనము అనే ఇంద్రియముతోనే, చరణౌ = పాదములను, నద్యః = నదీ దేవతలు, లోహితేన = రక్తముతో, నాడీః = నాడులను, సింధుః = సముద్రదేవత, క్షుత్-తృడ్భ్యామ్ = ఆకలి దప్పికలతో, ఉదరమ్ = ఉదరమును, చంద్రః = చంద్రుడు, మనసా = మనస్సు అనే ఇంద్రియముతో, హృదయమ్ = హృదయమును, బ్రహ్మా అపి = బ్రహ్మ కూడా, బుద్ధ్యా = బుద్ధి అనే అంతరింద్రియముతో, హృదయమ్ = హృదయమును, రుద్రః =

రుద్రుడు, అభిమత్యా = అహంకారముతో, హృదయమ్ = హృదయమును, భేజే= ప్రవేశించెను, తదా = అప్పుడు, విరాట్ = విరాట్ పురుషుడు, న ఉద తిష్ఠత్ = పైకి లేవలేదు.

ఆదిత్యుడు చక్షురింద్రియముతో కన్నులను, దిగ్దేవత శ్రోత్రేంద్రియ ముతో చెవులను, ఓషధి దేవతలు రోమములతో చర్మమును, ఆపోదేవత రేతస్సుతో జననేంద్రియమును, మృత్యుదేవత అపానముతో విసర్జనేంద్రి యమును, ఇంద్రుడు బలముతో సహా చేతులను, విష్ణువు గమనముతో సహా కాళ్లను, నదీ దేవతలు రక్తముతో నాడులను, సముద్రదేవత ఆకలి దప్పికలతో ఉదరమును, చంద్రుడు మనస్సుతో. బ్రహ్మగారు బుద్ధితో రుద్రుడు అహంకారముతో హృదయమును ప్రవేశించిననూ, ఆ విరాట్ పురుషుడు పైకి లేవలేదు.

చిత్తేన హృదయం చైత్యః క్షేత్రజ్ఞః ప్రావిశద్యదా ।
విరాట్ తదైవ పురుషస్సలిలాదుదతిష్ఠత ।। 70

చైత్యః = చిత్తమునకు అధిష్ఠాతయగు, క్షేత్రజ్ఞః = క్షేత్రజ్ఞుడు, యదా = ఏ సమయములో, చిత్తేన = చిత్తముతో, ప్రావిశత్ = ప్రవేశించెనో, తదా ఏవ = అప్పుడు మాత్రమే, విరాట్ పురుషః = విరాట్ పురుషుడు, సలి లాత్ = నీటినుండి, ఉదతిష్ఠత = పైకి లేచెను.

చిత్తమునకు అధిష్ఠాత, క్షేత్రము (దేహము) ను ద్రష్టయై దర్శించే క్షేత్రజ్ఞుడు చిత్తముతో సహా ప్రవేశించగానే, ఆ విరాట్ పురుషుడు నీటి నుండి పైకి లేచెను.

యథా ప్రసుప్తం పురుషం ప్రాణేంద్రియమనోధియః
ప్రభవంతి వినా యేన నోత్థాపయితుమోజసా ।। 71

యథా = ఏ విధముగానైతే, ప్రసుప్తమ్ = గాఢముగా నిద్రించుచు న్న, పురుషమ్ = వ్యక్తిని, ప్రాణ-ఇంద్రియమనః-ధియః = ప్రాణము ఇంద్రి యములు మనస్సు మరియు బుద్ధి, యేన వినా = ఏ క్షేత్రజ్ఞుడు లేకుండ

గా, ఓజసా = తమ బలముచే, ఉత్థాపయితుమ్ = లేపుటకు, న ప్రభవంతి = సమర్థములు కావో.

నిద్ర పోవుచున్న వ్యక్తిని క్షేత్రజ్ఞుడు లేకుండగా ప్రాణము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి తమ బలముచే లేపజాలవు. అదే విధముగా, ఆయా దేవతలు విరాట్ పురుషుని లేపలేక పోయిరి.

తమస్మిన్ ప్రత్యగాత్మానం ధియా యోగప్రవృత్తయా ।
భక్త్యా విరక్త్యా జ్ఞానేన వివిచ్యాత్మని చింతయేత్ ॥ 72

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
షడ్వింశో ఽధ్యాయః ॥

భక్త్యా = భక్తిచే, విరక్త్యా = వైరాగ్యముచే, జ్ఞానేన = ప్రకృతిపురుష వివేకముచే, యోగప్రవృత్తయా = యోగముచే ఏకాగ్రమైన, ధియా = బుద్ధితో, అస్మిన్ = ఈ, ఆత్మని = దేహమునందు, తమ్ = ఆ, ప్రత్యక్-ఆత్మానమ్ = అంతరతమమగు ఆత్మను, వివిచ్య = వివేచన చేసి, చింతయేత్ = దర్శించవలెను.

మానవుడు పరమేశ్వరునియందు భక్తిని చేసి, ప్రకృతి పురుషవివేకము గలవాడై, దానిచే సంసారమునందు వైరాగ్యమును పొంది, యోగముచే ఏకాగ్రము చేయబడిన బుద్ధితో, ఈ దేహమునందే ప్రత్యగాత్మరూపములో ఉపలభ్యముగానున్న పరమేశ్వరుని దర్శించవలెను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
ఇరువది ఆరవ అధ్యాయము ముగిసినది (**26**).

* * * * *

# అథ సప్తవింశోऽధ్యాయః

## ప్రకృతి పురుష వివేకముచే మోక్షప్రాప్తి

శ్రీభగవానువాచ ।
ప్రకృతిస్థోऽపి పురుషో నాజ్యతే ప్రాకృతైర్గుణైః ।
అవికారాదకర్తృత్వాన్నిర్గుణత్వాజ్జలార్కవత్ ॥ 1

శ్రీభగవాన్ = శ్రీభగవానుడు, ఉవాచ = పలికెను, పురుషః = పురుషుడు, ప్రకృతిస్థః అపి = ప్రకృతికార్యమగు దేహమునందు ఉన్నవ డైననూ, అవికారాత్ = వికారములు లేకుండుట వలన, అకర్తృత్వాత్ = కర్త కాకుండుట వలన, నిర్గుణత్వాత్ = నిర్గుణుడు అగుట వలన, జల-అర్కవత్ = నీటి యందలి సూర్యుని వలె, ప్రాకృతైః = ప్రకృతికి చెందిన, గుణైః = గుణముల చే, న ఆజ్యతే = లేపమును పొందుట లేదు.

శ్రీ కపిల భగవానుడు ఇట్లు పలికెను --- అకర్తయగు పురుషుని (ఆత్మ) యందు వికారములు లేవు. పురుషుడు నిర్గుణుడు. కావున, పురుషుడు ప్రకృతి కార్యమగు దేహమునందు ఉన్నవాడైననూ, నీటియందు ప్రతిఫలించిన సూర్యుని వలె, ప్రకృతి గుణములగు సత్త్వరజస్తమస్సులచే సంప్రాప్తమయ్యే పుణ్యపాపములచే గాని, సుఖదుఃఖములచే గాని లేపమును పొందడు.

స ఏష యర్హి ప్రకృతేర్గుణేష్వభివిషజ్జతే ।
అహంక్రియావిమూఢాత్మా కర్తాస్మీత్యభిమన్యతే ॥ 2

సః = అట్టి, ఏషః = ఈ పురుషుడు, యర్హి = ఏ కాలమునందైతే, అహంక్రియావిమూఢ-ఆత్మా = అహంకారముచే మోహింపజేయబడిన బుద్ధి గలవాడై, ప్రకృతేః = ప్రకృతియొక్క, గుణేషు = గుణములయందు,

అభివిషజ్జతే = ఆసక్తి గలవాడగునో అప్పుడు, కర్తా = కర్తను, అస్మి = అగుచున్నాను, ఇతి = అని, అభిమన్యతే = అభిమానమును కలిగియుండును.

అట్టి ఈ పురుషుడు ఏ కాలమునందు అహంకారముచే మోహింపజేయబడిన బుద్ధి గలవాడై ప్రకృతియొక్క గుణములయందు ఆసక్తి గలవాడగునో, అప్పుడు నేను కర్తను అనే అభిమానమును కలిగియుండును.

తేన సంసారపదవీమవశోఽభ్యేత్యనిర్వృతః ।
ప్రాసంగికైః కర్మదోషైస్సదసన్మిశ్రయోనిషు ॥ 3

తేన = ఆ అభిమానముచే, అవశః = అస్వతంత్రుడై, అనిర్వృతః = సుఖము లేనివాడై, ప్రాసంగికైః = దేహము మొదలగు వాటిచే చేయబడిన, కర్మదోషైః = కర్మల దోషములచే, సత్-అసత్-మిశ్రయోనిషు = మంచి చెడు మిశ్రమజన్మలయందు, సంసారపదవీమ్ = సంసారచక్రమును, = పొందును.

నేను కర్తను అనే అభిమానముగల జీవుడు దేహాదులచే చేయబడే కర్మలయొక్క పుణ్యాపాపరూపమగు ఫలముకు భోక్తయగును. అట్టి జీవుడు అస్వతంత్రుడై మంచి (దేవ), చెడు (పశు), మిశ్రమ (మనుష్య) జన్మలను పొంది సంసారచక్రములో పడి తిరుగుతూ సుఖమునకు దూరమగును.

అర్థే హ్యవిద్యమానేఽపి సంసృతిర్న నివర్తతే ।
ధ్యాయతో విషయానస్య స్వప్నేఽనర్థాగమో యథా ॥ 4

విషయాన్ = భోగములను గురించి, ధ్యాయతః = చింతిల్లుచున్న, అస్య = ఈ జీవునకు, అర్థే = సారము, అవిద్యమానే అపి = లేకున్ననూ, స్వప్నే = స్వప్నమునందు, అనర్థ-ఆగమః యథా = ఆపద ప్రాప్తమైనట్లుగా, సంసృతిః = సంసారము, న నివర్తతే = తొలగుట లేదు.

జన్మమరణాది రూపసంసారము మిథ్య. అయిననూ, భోగములను గురించి చింతిల్లే జీవునకు, స్వప్నమునందలి ఆపద దాని దుఃఖము వలె, సంసారమునందు తిరుగాడుట తప్పుట లేదు.

అత ఏవ శనైశ్చిత్తం ప్రసక్తమసతాం పథి ।
భక్తియోగేన తీవ్రేణ విరక్త్యా చ నయేద్వశమ్ ॥ 5

అతః ఏవ = కావుననే, అసతామ్ = దుష్టములగు ఇంద్రియముల, పథి = మార్గమునందు, ప్రసక్తమ్ = గట్టిగా తగుల్కొనియున్న, చిత్తమ్ = చిత్తమును, తీవ్రేణ = తీవ్రమగు, భక్తియోగేన = భక్తియోగముచే, చ = మరియు, విరక్త్యా = వైరాగ్యముచే, శనైః = మెల్లగా, వశమ్ = వశమును, నయేత్ = పొందించవలెను.

కావుననే, దుష్టములగు ఇంద్రియముల మార్గములో, అనగా వాటి విషయములలో గట్టిగా తగుల్కొనియున్న మనస్సును భక్తియోగముచే మరియు తీవ్రమగు వైరాగ్యముచే మెల్లగా వశములోనికి తెచ్చుకొనవలెను.

యమాదిభిర్యోగపథైరభ్యసన్ శ్రద్ధయాన్వితః ।
మయి భావేన సత్యేన మత్కథాశ్రవణేన చ ॥ 6

శ్రద్ధయా = శ్రద్ధతో, అన్వితః = కూడినవాడై, మయి = నాయందు, సత్యేన = ఫలకామన లేని, భావేన = ప్రేమతో, మత్-కథాశ్రవణేన చ = నా గాథలను వినుట ద్వారా, యమ-ఆదిభిః = యమనియమములు మొదలగు, యోగపథైః = యోగమార్గములచే, అభ్యసన్ = అభ్యాసము చేయుచున్నవాడై.

సాధకుడు నాయందు ఫలాసక్తి లేని ప్రేమ గలిగి నా గాథలను వింటూ, యమనియమాది యోగాంగములను శ్రద్ధతో అభ్యసించవలెను.

సర్వభూతసమత్వేన నిర్వైరేణాప్రసంగతః ।
బ్రహ్మచర్యేణ మౌనేన స్వధర్మేణ బలీయసా ॥ 7

సర్వభూతసమత్వేన = సకలప్రాణులయందు సమదృష్టిని కలిగియుండుటచే, నిర్వైరేణ = వైరభావము లేకుండుటచే, అప్రసంగతః = ఆసక్తి లేకుండుట వలన, బ్రహ్మచర్యేణ = బ్రహ్మచర్యముచే, మౌనేన = మౌనముచే, బలీయసా = బలిష్ఠమగు, స్వధర్మేణ = స్వధర్మముచే (మనస్సు వశమగును).

సాధకుడు సకలప్రాణులయందు ప్రకాశించే చైతన్యరూపమగు బ్రహ్మను దర్శించవలెను. అట్టి దర్శనముచే వైరభావమును తొలగించుకొని, సంసారవిషయములయందు ఆసక్తికి దూరముగా నుండవలెను. సాధకుడు బ్రహ్మచర్యము (గృహస్థుని విషయములో ఏకపత్నీ వ్రతము) ను పాటిస్తూ మౌనియై (అధికప్రసంగమును చేయనివాడై, ప్రసన్నమగు మనస్సు గలవాడై) స్వధర్మము (కర్తవ్యము) ను గట్టిగా అనుష్ఠించవలెను.

యదృచ్ఛయోపలబ్ధేన సంతుష్టో మితభుజ్ మునిః ।
వివిక్తశరణశ్శాంతో మైత్రః కరుణ ఆత్మవాన్ ॥ 8

యదృచ్ఛయా = ప్రారబ్ధముచే, ఉపలబ్ధేన = లభించిన దానితో, సంతుష్టః = సంతోషము గలవాడై, మితభుక్ = మితముగా భుజించువాడై, మునిః = మననశీలుడై, వివిక్తశరణః = ఏకాంతమునందు నివసించువాడై, శాంతః = రాగద్వేషములు లేనివాడై, మైత్రః = అందరిని ప్రేమించువాడై, కరుణః = అందరియందు దయ గలవాడై, ఆత్మవాన్ = ధైర్యము గలవాడు.

సాధకుడు ప్రారబ్ధవశముచే తనంత తానుగా లభించిన దానితో సంతుష్టుడు కావలెను. మితముగా భుజిస్తూ మననశీలుడై ఏకాంతములో నివసించవలెను. రాగద్వేషములను విడనాడి అందరినీ ప్రేమిస్తూ అందరియందు దయ గలిగి తాను కృతార్థుడననే ధైర్యముతో నుండవలెను.

సానుబంధే చ దేహేఽస్మిన్నకుర్వన్నసదాగ్రహమ్ ।
జ్ఞానేన దృష్టతత్త్వేన ప్రకృతేః పురుషస్య చ ॥ 9

ప్రకృతేః = ప్రకృతియొక్క, పురుషస్య చ = పురుషునియొక్క కూడ, దృష్టతత్త్వేన = చూడబడిన యాథార్థ్యము గల, జ్ఞానేన = జ్ఞానముచే, స-అనుబంధే = తన వారితో గూడిన, అస్మిన్ = ఈ, దేహే = దేహమునందు, అసత్-ఆగ్రహమ్ = మిథ్యారూపమగు పట్టుదలను, అకుర్వన్ = చేయనివాడు.

ప్రకృతిపురుషుల స్వరూపమునెరింగిన జ్ఞాని ఈ దేహమునందు గాని, దాని సంబంధీకులయందు గాని, నేను నాది అనే మిథ్యారూపమగు అభిమానము లేనివాడై యుండును.

నివృత్తబుద్ధ్యవస్థానో దూరీభూతాన్యదర్శనః ।
ఉపలభ్యాత్మనాఽఽత్మానం చక్షుషేవార్కమాత్మదృక్ ।। 10

నివృత్తబుద్ధి-అవస్థానః = తొలగిన బుద్ధియొక్క జాగ్రత్తు మొదలగు అవస్థలు గలిగి, దూరీభూత-అన్యదర్శనః = దూరమైన భేదదృష్టి గలవాడై, చక్షుషా = కంటితో, అర్కమ్ = సూర్యునివలె, ఆత్మనా = బుద్ధిచే, ఆత్మానమ్ = ఆత్మను, ఉపలభ్య = పొంది, ఆత్మదృక్ = ఆత్మనిష్ఠ గలవాడు.

ప్రకృతిపురుష వివేకము గల జ్ఞాని, జాగ్రత్తు మొదలగు అవస్థలు బుద్ధికి సంబంధించినవే గాని, ఆత్మకు వాటితో లేపము లేదని తెలుసుకొనును. ఈశ్వరుని కంటె భిన్నముగా ఏదీ లేదనే దర్శనమును ఆతడు కలిగి యుండును. సూర్యుడు అధిష్ఠానదేవతగా గల కంటితో సూర్యుని చూచే విధముగా, ఆతడు తన శుద్ధమగు అంతఃకరణము ద్వారా ఆత్మరూపముగా నుండే పరమేశ్వరుని దర్శించి ఆయనయందు విలీనుడై జీవన్ముక్తుడగును.

ముక్తలింగం సదాభాసమసతి ప్రతిపద్యతే ।
సతో బంధుమసచ్చక్షుస్సర్వానుస్యూతమద్వయమ్ ।। 11

సత్-ఆభాసమ్ = (మిథ్యాభూతమగు అహంకారమునందు) అఖండసత్ యొక్క ప్రతిఫలనమును, ముక్తలింగమ్ = విడిచిపెట్టబడిన ఉపాధులు గలదానినిగా, సతః = ఆ సత్ నకు, బంధుమ్ = అభిన్నమైనదిగా, అసత్-చక్షుః = మిథ్యాభూతమగు జగత్తునకు ప్రకాశింపజేయునదిగా, సర్వ-అనుస్యూతమ్ = సర్వమునందు వ్యాపించియున్నదానినిగా, అద్వయమ్ = రెండవది లేనిదానినిగా, ప్రతిపద్యతే = దర్శించును.

అంతఃకరణములో ఆ అఖండసత్ యొక్క ప్రతిఫలనమే జీవుడనియు, ఉపాధిని పరిత్యజించిన జీవుడు ఆ సత్ కంటె భిన్నుడు కాద

నియు, ఈ మిథ్యాభూతమగు జగత్తును అంతనూ వ్యాపించి దానిని ప్రకా శింపజేసే అద్వయబ్రహ్మ అదియేననియు ఆ ముని దర్శించును.

యథా జలస్థ ఆభాసః స్థలస్థేనావదృశ్యతే ।
స్వాభాసేన తథా సూర్యో జలస్థేన దివి స్థితః ॥ 12

ఏవం త్రివృదహంకారో భూతేంద్రియమనోమయైః ।
స్వాభాసైర్లక్షితోఽనేన సదాభాసేన సత్యదృక్ ॥ 13

యథా = ఏ విధముగానైతే, స్థలస్థేన = స్థలమునందలి ప్రతిబిం బముచే, జలస్థః = జలమునందున్న, ఆభాసః = సూర్యప్రతిబింబము, జల స్థేన = నీటియందున్న, స్వ-ఆభాసేన = తన ప్రతిబింబముచే, దివి = ఆకాశ మునందు, స్థితః = ఉన్న, సూర్యః = సూర్యుడు, అవదృశ్యతే = చూడబడు చున్నాడో, తథా = అదే విధముగా, ఏవమ్ = ఈ విధముగా, భూత-ఇంద్రి యమనోమయైః = పంచభూతములు ఇంద్రియములు మనస్సులచే అవ చ్ఛిన్నము చేయబడిన, స్వ-ఆభాసైః = తన ప్రతిబింబములచే, త్రివృత్ = త్రిగుణాత్మకమైన, అహంకారః = అహంకారము, సత్-ఆభాసేన = బ్రహ్మ యొక్క ప్రతిబింబము రూపముగా, లక్షితః = దర్శించబడినది, అనేన = దీనిచే, సత్యదృక్ = సచ్చిదాత్మ (దర్శించబడును).

నీటి పడియలో పడిన సూర్యకాంతి ప్రతిఫలించి ఇంటిలోని గోడపై పడినప్పుడు ఆ గోడమీది సూర్యుడు నీటిలోని సూర్యుని ప్రతిబింబమని తెలియును. నీటిలోని సూర్యుడు కూడ ఆకాశమునందలి సూర్యుని ప్రతి బింబమే. అదే విధముగా, పంచభూతకార్యమగు ఈ దేహమునందు, ఇంద్రియములయందు, అంతఃకరణమునందు చైతన్యప్రకాశము అనుభవ మునకు వచ్చుచున్నది. కాని, వాటి ఈ ప్రకాశము అహంకార ప్రకాశము యొక్క ప్రతిఫలము మాత్రమేనని గ్రహించదగును. అహంకారమునందలి చైతన్యప్రకాశము కూడ ఆ అఖండసత్ యొక్క ప్రకాశమేనని దర్శించు జీవన్ముక్తుడు ఆ బ్రహ్మ-అభిన్నమగు సచ్చిదాత్మను దర్శించును.

భూతసూక్ష్మేంద్రియమనోబుద్ధ్యాదిష్విహ నిద్రయా ।

లీనేష్వసతి యస్తత్ర వినిద్రో నిరహంక్రియః 14

ఇహ = ఈ నిద్రావస్థయందు, భూతసూక్ష్మ-ఇంద్రియమనః-బుద్ధి-ఆదిషు = తన్మాత్రలు ఇంద్రియములు మనస్సు బుద్ధి మొదలగునవి, నిద్రయా = నిద్రచే, అసతి = అవ్యాకృతమునందు, లీనేషు = లీనములు కాగా, యః = ఏ ఆత్మ, తత్ర = ఆ కాలములో, వినిద్రః = నిద్ర లేనిదై, నిర హంక్రియః = అహంకారము లేనిదై ఉండునో.

నిద్రావస్థలో సూక్ష్మభూతములు, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మొదలగునవి అవ్యాకృతము (నామరూప పరిణామము లేని ప్రకృతి యొక్క సూక్ష్మావస్థ) లో విలీనమగును. కాని, ఆత్మచైతన్యము నిద్రించ దు. అది నిత్యదృక్స్వరూపమై అహంకారము లేని ఆ అవస్థను ప్రకాశింప జేయును.

మన్యమానస్తదాఽఽత్మానమనష్టో నష్టవన్మృషా ।
నష్టేఽహంకరణే ద్రష్టా నష్టవిత్త ఇవాతురః ।। 15

అహంకరణే = అహంకారము, నష్టే = నశించగా, అనష్టః = నశించ ని, ద్రష్టా = ద్రష్టయగు జీవుడు, తదా = ఆ నిద్రాసమయములో, ఆత్మానమ్ = తనను, నష్టం ఇవ = నశించినవానిని వలె, మృషా = అయథార్థముగా, మన్యమానః = తలపోయువాడై, ఆతురః = దుఃఖితుడైయున్న, నష్టవిత్తః ఇవ = నశించిన ధనము గలవాడు వలె అగును.

ఆత్మ జాగ్రదవస్థయందు సర్వమునకు ద్రష్టవలె భాసించును. కాని, నిద్రలో అహంకారముతో సహా ఆ సర్వము అంతర్ధానమగును. అప్పుడు ధనమును కోల్పోయి తనను తానే కోల్పోయినట్లుగా కంగారు పడే వ్యక్తి వలె, అజ్ఞాని తాను నిద్రలో లేకుండా పోయినానని భావించును.

ఏవం ప్రత్యవమృశ్యాసావాత్మానం ప్రతిపద్యతే ।
సాహంకారస్య ద్రవ్యస్య యోఽవస్థానమనుగ్రహః ।। 16

ఏవమ్ = ఈ విధముగా, అసౌ = ఈ వివేకి, ప్రత్యవమృశ్య = విమర్శ చేసి, ఆత్మానమ్ = ఆత్మను, ప్రతిపద్యతే = తెలియుచున్నాడు,

యః = ఏ ఆత్మ, స-అహంకారస్య = అహంకారముతో గూడిన, ద్రవ్యస్య = దేహేంద్రియమనస్సంఘాతమునకు, అవస్థానమ్ = అధిష్ఠానము, అనుగ్రహః = ప్రకాశకమో.

దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారము అనునవి కేవలము ఆత్మచైతన్యము మాత్రమే అధిష్ఠానముగా కలిగి దానియందు మాత్రమే భాసించుచున్నవి. వివేకి ఈ విధముగా విమర్శ చేసి ఆత్మతత్త్వమును తెలుసుకొనును.

దేవహూతిరువాచ ।
పురుషం ప్రకృతిర్బ్రహ్మన్న విముంచతి కర్హిచిత్ ।
అన్యోన్యాపాశ్రయత్వాచ్చ నిత్యత్వాదనయోః ప్రభో ॥ 17

బ్రహ్మన్ = ఓ పరమేశ్వరా!, ప్రభో = ఓ ప్రభూ!, అనయోః = ఈ ప్రకృతిపురుషులు, అన్యోన్య-అపాశ్రయత్వాత్ = ఒకదానిని మరియొకటి ఆశ్రయించి ఉండుట వలన, నిత్యత్వాత్ చ = నిత్యములగుట వలన, ప్రకృతిః = ప్రకృతి, కర్హిచిత్ = ఏ కాలమునందైననూ, పురుషమ్ = పురుషుని, న విముంచతి = విడిచిపెట్టదు.

దేవహూతి ఇట్లు పలికెను --- ఓ పరమేశ్వరా! ప్రభూ! ఒకదానిని మరియొకటి ఆశ్రయించి ఉండే ఈ ప్రకృతి పురుషులు నిత్యములు. కావున, ప్రకృతి ఏ కాలమునందైననూ పురుషుని విడిచి యుండదు.

యథా గంధస్య భూమేశ్చ న భావో వ్యతిరేకతః ।
అపాం రసస్య చ యథా తథా బుద్ధేః పరస్య చ ॥ 18

యథా = ఏ విధముగానైతే, గంధస్య = గంధమునకు, భూమేః చ = భూమికి, యథా = ఏ విధముగా, అపామ్ = నీళ్లకు, రసస్య చ = రసమునకు, వ్యతిరేకతః = వేర్వేరుగా, భావః = ఉనికి, న = లేదో, తథా = అదే విధముగా, బుద్ధేః = బుద్ధికి, పరస్య చ = పురుషునకు.

భూమి, గంధము వేర్వేరుగా మనజాలవు. నీరు, రసము అనువాటికి వేర్వేరు ఉనికి లేదు. అదే విధముగా బుద్ధి (ప్రకృతి), పురుషుడు ఒకదానిని విడిచి మరియొకటి ఉండలేదు.

అకర్తుః కర్మబంధోఽయం పురుషస్య యదాశ్రయః ।
గుణేషు సత్సు ప్రకృతేః కైవల్యం తేష్వతః కథమ్ ॥ 19

అకర్తుః = కర్త కాని, పురుషస్య = పురుషునకు, అయమ్ = ఈ, కర్మబంధః = కర్మల బంధము, యత్-ఆశ్రయః = ఏ గుణములనాశ్రయించి కలుగుచున్నదో, తేషు = అట్టి, ప్రకృతేః = ప్రకృతియొక్క, గుణేషు సత్సు = సత్త్వరజస్తమోగుణములు నిత్యములై యుండగా, అతః = ఈ కర్మబంధమునుండి, కైవల్యమ్ = విముక్తిచే కలిగే కేవలభావము, కథమ్ = ఎట్లు?

పురుషుడు స్వయముగా కర్త కాడు. కాని, ప్రకృతి గుణములతో తాదాత్మ్యముచే పురుషునకు కర్మబంధము కలుగుచున్నది. కాని, ఈ సత్త్వరజస్తమోగుణములు నిత్యములై యుండగా, ఆ పురుషునకు కర్మబంధమునుండి విముక్తి, కేవలభావము ఎట్లు కలుగును?

క్వచిత్తత్త్వావమర్శేన నివృత్తం భయముల్బణమ్ ।
అనివృత్తనిమిత్తత్వాత్పునః ప్రత్యవతిష్ఠతే ॥ 20

తత్త్వ-అవమర్శేన = యథార్థస్వరూపమును తెలియుటచే, క్వచిత్ = ఒకానొక పురుషునియందు, ఉల్బణమ్ = తీవ్రమగు, భయమ్ = సంసారభయము, నివృత్తమ్ = తొలగిననూ, అనివృత్తనిమిత్తత్వాత్ = హేతువు తొలగక పోవుటచే, పునః = మరల, ప్రత్యవతిష్ఠతే = సంప్రాప్తమగును.

ఒకానొక పురుషునియందు ఒకవేళ ఆత్మజ్ఞానముచే తీవ్రమగు సంసారభయము తొలగిననూ, దానికి కారణమగు గుణములు నిత్యములగుటచే, ఆ సంసారము మరల సంప్రాప్తమగును.

శ్రీభగవానువాచ ।
అనిమిత్తనిమిత్తేన స్వధర్మేణామలాత్మనా ।

తీవ్రయా మయి భక్త్యా చ శ్రుతసంభృతయా చిరమ్ ॥ 21

జ్ఞానేన దృష్టతత్త్వేన వైరాగ్యేణ బలీయసా ।
తపోయుక్తేన యోగేన తీవ్రేణాత్మసమాధినా ॥ 22

ప్రకృతిః పురుషస్యేహ దహ్యమానా త్వహర్నిశమ్ ।
తిరోభవిత్రీ శనకైరగ్నేర్యోనిరివారణిః ॥ 23

అనిమిత్తనిమిత్తేన = ఫలమునందలి తృష్ణ ప్రేరకము కాని, స్వధర్మేణ = స్వధర్మముచే, అమల-ఆత్మనా = స్వచ్ఛమగు అంతఃకరణముచే, చిరమ్ = చిరకాలము, శ్రుతసంభృతయా = శ్రవణముచే పరిపుష్టము చేయబడిన, తీవ్రయా = తీవ్రమగు, మయి = నాయందలి, భక్త్యా చ = భక్తిచే, దృష్టతత్త్వేన = దర్శించబడిన ప్రకృతిపురుషుల తత్త్వము గల, జ్ఞానేన = జ్ఞానముచే, బలీయసా = బలిష్ఠమైన, వైరాగ్యేణ = వైరాగ్యముచే, తపః-యుక్తేన = తపస్సుతో కూడిన, యోగేన = యోగముచే, తీవ్రేణ = తీవ్రమగు, ఆత్మసమాధినా = చిత్తైకాగ్రతచే, ఇహ = ఈ జన్మయందే, పురుషస్య = పురుషునకు, ప్రకృతిః = ప్రకృతి, అగ్నేః = నిప్పునకు, యోనిః = జన్మస్థానమగు, అరణిః ఇవ = కట్టెవలె, అహర్నిశమ్ = రాత్రింబగళ్లు, శనకైః = మెల్లగా, దహ్యమానా = దహించబడుచున్నదై, తిరోభవిత్రీ = అంతర్ధానమగును.

సాధకుడు ఫలమునందు తృష్ణ లేకుండగా స్వచ్ఛమగు అంతఃకరణముతో స్వధర్మముననుష్ఠించవలెను. చిరకాలము నా గాథలను విని నాయందలి భక్తిని తీవ్రముగా పరిపుష్టము చేసుకొనవలెను. ప్రకృతిపురుషుల యథార్థస్వరూపమును తెలుసుకొనవలెను. బలిష్ఠమగు వైరాగ్యము గలవాడై, వ్రతనియమములను పాటిస్తూ ధ్యానమును అభ్యాసము చేయవలెను. దృఢమగు చిత్తైకాగ్రతను కలిగియుండవలెను. ఇట్లు చేయు సాధకునకు ఈ జన్మలోనే, కట్టెయందలి నిప్పుచే కట్టె కాల్చివేయబడినట్లుగా, అవిద్య మెల్లమెల్లగా దహించివేయబడి అంతర్ధానమగును.

భుక్తభోగా పరిత్యక్తా దృష్టదోషా చ నిత్యశః ।
నేశ్వరస్యాశుభం ధత్తే స్వే మహిమ్ని స్థితస్య చ ॥ 24

భుక్తభోగా = భుజించబడిన భోగములు గలది, పరిత్యక్తా = విడిచి పెట్టబడినది, నిత్యశః = ఎల్లవేళలా, దృష్టదోషా = దర్శించబడిన దోష ములు గలది అగు ప్రకృతి, స్వే = తన, మహిమ్ని = పరమానందస్వరూప మునందు, స్థితస్య = నిలిచియున్న, ఈశ్వరస్య = స్వతంత్రుడగు పురుషున కు, అశుభమ్ = సంసారమనే అమంగళమును, న ధత్తే = కలిగించుట లేదు.

ప్రకృతి నిత్యము దుఃఖహేతువు అని వివేకియగు పురుషుడు దర్శించి దానియందు తాదాత్మ్యమును చెందకుండగా విడిచిపెట్టును. అట్టి ప్రకృతి తన పరమానంద స్వరూపమునందు నిలిచియుండే స్వతంత్రుడగు పురుషునకు సంసారమనే అమంగళమును కలిగించలేదు.

యథా హ్యప్రతిబుద్ధస్య ప్రస్వాపో బహ్వనర్థభృత్ ।
స ఏవ ప్రతిబుద్ధస్య న వై మోహాయ కల్పతే ॥ 25

అప్రతిబుద్ధస్య = తెలివి రాని వానికి, ప్రస్వాపః = కల, బహు-అనర్థ భృత్ = అనేకములగు కష్టములను తెచ్చిపెట్టును, ప్రతిబుద్ధస్య = తెలివి వచ్చిన ఆ వ్యక్తికి, సః ఏవ = అదే కల, మోహాయ = మోహము కొరకు, న వై కల్పతే = సమర్థము కానే కాదు.

కలను కనుచున్నవానికి ఆ కలలోని దృశ్యములు అనేకములగు ఆపదలను కలిగించి దుఃఖితుని జేయును. కాని, ఆ వ్యక్తి నిద్ర లేచిన తరు వాత, ఆ కల వానికి మోహమును కలుగజేయలేదు గదా!

ఏవం విదితతత్త్వస్య ప్రకృతిర్మయి మానసమ్ ।
యుంజతో నాపకురుత ఆత్మారామస్య కర్హిచిత్ ॥ 26

ఏవమ్ = ఈ విధముగా, విదితతత్త్వస్య = తెలియబడిన ప్రకృతిపు రుషుల యథార్థస్వరూపము గలిగినట్టియు, మయి = నాయందు, మాన సమ్ = మనస్సును, యుంజతః = లగ్నము చేయునట్టియు, ఆత్మ-ఆరా మస్య = తనయందు తాను రమించు వ్యక్తికి, కర్హిచిత్ = ఏ కాలమునందైన నూ, ప్రకృతిః = ప్రకృతి, న అపకురుతే = అపకారమును చేయదు.

ఈ విధముగా ప్రకృతిపురుషుల స్వరూపమునెరింగి తనయందు తాను రమించువాడై నాయందు మనస్సును లగ్నము చేయు సాధకునకు ప్రకృతి ఏ కాలమునందైననూ మోహము కలిగించదు.

యదైవమధ్యాత్మరతః కాలేన బహుజన్మనా ।
సర్వత్ర జాతవైరాగ్య ఆబ్రహ్మభువనాన్మునిః ॥ 27

బహుజన్మనా = అనేకజన్మలు గల, కాలేన = కాలముచే, యదా = ఎప్పుడైతే, ఏవమ్ = ఈ విధముగా, మునిః = మననశీలుడగు వ్యక్తి, అధ్యాత్మరతః = తన స్వరూపమునందు నిష్ఠ గలవాడగునో అప్పుడు, ఆబ్రహ్మ భువనాత్ = బ్రహ్మలోకము వరకు, సర్వత్ర = అంతటా, జాతవైరాగ్యః = పుట్టిన వైరాగ్యము గలవాడగును.

ఈ విధముగా మననశీలుడగు వ్యక్తి అనేకజన్మల కాలము ఆత్మనిష్ఠను కలిగియున్నప్పుడు, వానికి బ్రహ్మలోకము వరకు గల భోగములన్నింటియందు వైరాగ్యము కలుగును.

మద్భక్తః ప్రతిబుద్ధార్థో మత్ప్రసాదేన భూయసా ।
నిఃశ్రేయసం స్వసంస్థానం కైవల్యాఖ్యం మదాశ్రయమ్ ॥ 28

ప్రాప్నోతీహాంజసా ధీరస్స్వదృశా చ్ఛిన్నసంశయః ।
యద్గత్వా న నివర్తేత యోగీ లింగాద్వినిర్గమే ॥ 29

మత్-భక్తః = నా భక్తుడగు, ధీరః = వివేకి, భూయసా = అధికమగు, మత్-ప్రసాదేన = నా అనుగ్రహముచే, ప్రతిబుద్ధ-అర్థః = తెలియబడిన తత్త్వజ్ఞానము గలవాడై, స్వదృశా = స్వరూపజ్ఞానముచే, ఛిన్నసంశయః = తొలగించబడిన సందేహములు గలవాడై, స్వసంస్థానమ్ = తన స్వరూపమైనట్టియు, మత్-ఆశ్రయమ్ = నేను ఆశ్రయముగా గలిగినట్టియు, కైవల్య-ఆఖ్యమ్ = కైవల్యము అను పేర ప్రసిద్ధిని గాంచిన, నిఃశ్రేయసమ్ = నిరతిశయానందరూపమగు మోక్షమును, ఇహ = ఈ జన్మలోనే, అంజసా = సాక్షాత్తుగా, ప్రాప్నోతి = పొందును, యోగీ = జ్ఞాని, యత్ = దేనిని, గత్వా =

పొంది, లింగాత్ = లింగశరీరమునుండి, వినిర్గమే = నిష్క్రమించగా, న నివర్తేత = మరలి రాడో.

నా భక్తుడగు వివేకికి స్వరూపజ్ఞానము కలిగి సంశయములు తొలగిపోవును. వానికి నా గొప్ప అనుగ్రహముచే తత్త్వజ్ఞానము లభించును. ఆతనికి ఈ జన్మలోనే సాక్షాత్తుగా ప్రత్యగభిన్నమగు బ్రహ్మయే (నేనే) స్వరూపముగా గల కేవల (అద్వయ) భావమని ప్రసిద్ధిని గాంచిన నిరతిశయానందరూపమగు జీవన్ముక్తి లభించును. ఆ జ్ఞాని లింగదేహము నశించిన తరువాత మరల తిరిగి జన్మించడు.

యదా న యోగోపచితాసు చేతో
మాయాసు సిద్ధస్య విషజ్జతేఽంగ ।
అనన్యహేతుష్వథ మే గతిస్స్యా-
దాత్యంతికీ యత్ర న మృత్యుహాసః ॥ 30

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
సప్తవింశోఽధ్యాయః ॥

అంగ = అమ్మా!, యదా = ఏ కాలమునందైతే, సిద్ధస్య = సిద్ధపురుషునియొక్క, చేతః = మనస్సు, యోగ-ఉపచితాసు = యోగముచే పరిపుష్టము చేయబడినట్టియు, అనన్యహేతుషు = మరియొక సాధనము లేని, మాయాసు = మాయామయములగు సిద్ధులయందు, న విషజ్జతే = ఆసక్తిని పొందదో, అథ = అప్పుడు, మే = నాయొక్క, ఆత్యంతికీ = పరమపురుషార్థరూపమగు, గతిః = మోక్షము, స్యాత్ = కలుగును, యత్ర = దేనియందైతే, మృత్యుహాసః = మృత్యువుయొక్క గర్వము, న = ఉండదో.

అమ్మా! సిద్ధపురుషుని యెదుట యోగశక్తిచే పరిపుష్టము చేయబడిన మాయామయములగు సిద్ధులు ప్రకటమగును. వాటిని సాధించుటకు యోగము తప్ప మరియొక ఉపాయము లేదు. కాని, ఎప్పుడైతే ఆతడు వాటియందు ఆసక్తిని పొందడో, అప్పుడు ఆతడు పరమపురుషార్థమగు

మోక్షమును పొంది నాలో విలీనమగును. అపుడాతనికి మృత్యుభయము శాశ్వతముగా నివారణ యగును.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధమునందు
ఇరువది ఏడవ అధ్యాయము ముగిసినది (**27**).

* * * * *

# అథ అష్టావింశోఽధ్యాయః

## అష్టాంగ యోగ విధానము

శ్రీభగవానువాచ ।
యోగస్య లక్షణం వక్ష్యే సబీజస్య నృపాత్మజే ।
మనో యేనైవ విధినా ప్రసన్నం యాతి సత్పథమ్ ॥ 1

శ్రీభగవాన్ = శ్రీభగవానుడు, ఉవాచ = పలికెను, నృప-ఆత్మజే = ఓ మనుపుత్రీ!, సబీజస్య = ఆలంబనముతో కూడిన, యోగస్య = యోగము యొక్క, లక్షణమ్ = లక్షణమును, వక్ష్యే = చెప్పెదను, యేన విధినా ఏవ = ఏ యోగమునునుష్ఠించుటచే, మనః = మనస్సు, ప్రసన్నమ్ = ప్రసన్నమై, సత్-పథమ్ = భగవానుని మార్గమును, యాతి = పొందునో.

శ్రీ కపిల భగవానుడిట్లు పలికెను --- అమ్మా! నేనిప్పుడు నీకు సబీజ (ఆలంబముతో కూడిన) యోగమును చెప్పెదను. దీనిని అనుష్ఠించినచో మనస్సు ప్రసన్నమై భగవానునిపై లగ్నమగును.

స్వధర్మాచరణం శక్త్యా విధర్మాచ్చ నివర్తనమ్ ।
దైవాల్లబ్ధేన సంతోష ఆత్మవిచ్చరణార్చనమ్ ॥ 2

శక్త్యా = శక్తితో, స్వధర్మ-ఆచరణమ్ = తన ధర్మమునాచరించుట, విధర్మాత్ = అధర్మమునుండి, నివర్తనమ్ = దూరముగా నుండుట, దైవాత్ = ప్రారబ్ధము వలన, లబ్ధేన = లభించినదానితో, సంతోషః = సంతోషము, ఆత్మవిత్-చరణ-అర్చనమ్ = ఆత్మజ్ఞానుల పాదములను పూజించుట.

యథాశక్తి తన ధర్మమునాచరించుట, అధర్మమునకు దూరముగా నుండుట, ప్రారబ్ధానుసారముగా లభించిన దానితో సంతృప్తిని జెందుట, ఆత్మజ్ఞానుల పాదములను పూజించుట.

గ్రామ్యధర్మనివృత్తిశ్చ మోక్షధర్మరతిస్తథా ।
మితమేధ్యాదనం శశ్వద్వివిక్తక్షేమసేవనమ్ ॥ 3

గ్రామ్యధర్మనివృత్తిః = భోగాసక్తిని పెంచే కర్మలకు దూరముగా నుండుట, తథా = మరియు, మోక్షధర్మరతిః = మోక్షధర్మములయందు ప్రీతిని కలిగియుండుట, మితమేధ్య-అదనమ్ = పవిత్రమగు ఆహారమును మితముగా భుజించుట, శశ్వత్ = నిత్యము, వివిక్తక్షేమసేవనమ్ = పీడలేని ఏకాంతస్థానమును సేవించుట.

భోగాసక్తిని పెంచే కర్మలకు దూరముగా నుండుట, మోక్షధర్మములగు శ్రవణాదులయందు ప్రీతిని కలిగియుండుట, పవిత్రమగు ఆహారమును మితముగా భుజించుట, నిత్యము నిర్భయమగు స్థానములో ఏకాంతముగా నుండుట.

అహింసా సత్యమస్తేయం యావదర్థపరిగ్రహః ।
బ్రహ్మచర్యం తపశ్శౌచం స్వాధ్యాయః పురుషార్చనమ్ ॥ 4

అహింసా = అహింస, సత్యమ్ = సత్యము, అస్తేయమ్ = పరధనమునపహరించకుండుట, యావత్ = ఎంతతో దేహనిర్వహణ జరుగునో అంత, అర్థపరిగ్రహః = వస్తువులను స్వీకరించుట, బ్రహ్మచర్యమ్ = బ్రహ్మచర్యము, తపః = తపస్సు, శౌచమ్ = శౌచము, స్వాధ్యాయః = మోక్షశాస్త్రమునధ్యయనము చేయుట, పురుష-అర్చనమ్ = శ్రీహరిని పూజించుట.

ప్రాణులకు హింసను కలిగించకుండుట, అసత్యమును మాటలాడకుండుట, పరధనమునపహరించకుండుట, దేహనిర్వహణకు కావలసినంత మాత్రమే వస్తువులను ప్రోగుచేయుట, బ్రహ్మచర్యము, తపస్సు, దేహమును మనస్సును శుద్ధముగా నుంచుకొనుట, మోక్షశాస్త్రమునధ్యయనము చేయుట, పరమేశ్వరుని పూజించుట.

మౌనం సదాఽఽసనజయస్స్థైర్యం ప్రాణజయశ్శనైః ।
ప్రత్యాహారశ్చేంద్రియాణాం విషయాన్మనసా హృది ॥ 5

మౌనమ్ = మౌనము, సదా = ఎల్లవేళలా, ఆసనజయస్థైర్యమ్ = ఆసనములను అభ్యసించి స్థిరముగా కూర్చుండుట, శనైః = మెల్లగా, ప్రాణ జయః = శ్వాసను జయించుట, ఇంద్రియాణామ్ = ఇంద్రియములకు, మనసా = మనస్సుతో, విషయాత్ = విషయభోగమునుండి, హృది = హృదయమునందు, ప్రత్యాహారః = ప్రత్యాహారము.

మౌనముగా నుండుట, నిత్యము ఆసనములనభ్యసించి స్థిరముగా కూర్చుండుట, మెల్లమెల్లగా ప్రాణాయామము ద్వారా శ్వాసను జయించుట, మనస్సుతో ఇంద్రియములను విషయభోగములనుండి వెనకకు లాగి హృదయమునందు నిలుపుట అనే ప్రత్యాహారము.

స్వధిష్ణ్యానామేకదేశే మనసా ప్రాణధారణమ్ ।
వైకుంఠలీలాభిధ్యానం సమాధానం తథాఽఽత్మనః ।। 6

స్వధిష్ణ్యానామ్ = తమ స్థానములలో, ఏకదేశే = ఒక స్థానమునందు, మనసా = మనస్సుతో సహా, ప్రాణధారణమ్ = ప్రాణములను నిలిపి యుంచుట, వైకుంఠలీలా-అభిధ్యానమ్ = శ్రీహరియొక్క లీలలను స్మరించుట, తథా = మరియు, ఆత్మనః = బుద్ధియొక్క, సమాధానమ్ = ఏకాగ్రత.

ప్రాణములను మనస్సుతో సహా మూలాధారము మొదలగు స్థానములలో ఒకదానియందు నిలిపియుంచుట, శ్రీహరి లీలలను స్మరించుట, బుద్ధియొక్క ఏకాగ్రత అనువాటిని సాధకుడు అభ్యసించవలెను.

ఏతైరన్యైశ్చ పథిభిర్మనో దుష్టమసత్పథమ్ ।
బుద్ధ్యా యుంజీత శనకైర్జితప్రాణో హ్యతంద్రితః ।। 7

జితప్రాణః = జయించబడిన ప్రాణము గల సాధకుడు, అతంద్రితః = సోమరితనము లేనివాడై, ఏతైః = ఈ, అన్యైః చ = ఇతరములైన, పథిభిః = మార్గములచే, దుష్టమ్ = దుష్టమైనట్టియు, అసత్-పథమ్ = మిథ్యాభూతములగు భోగముల మార్గములో నడిచే, మనః = మనస్సును, శనకైః = మెల్లగా, బుద్ధ్యా = బుద్ధి ద్వారా, యుంజీత = ఏకాగ్రము చేయవలెను.

మనస్సు దుష్టమైనది. అది మిథ్యాభూతములగు భోగముల వెనుక పరుగులెత్తుచుండును. సాధకుడు ప్రాణాయామమును చేసి, సోమరి తనము లేనివాడై, దానిని బుద్ధితో మెల్లగా ఏకాగ్రము చేసి ఈశ్వరునిపై నిలుపవలెను.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య విజితాసన ఆసనమ్ ।
తస్మిన్ స్వస్తి సమాసీన ఋజుకాయస్సమభ్యసేత్ ॥ 8

శుచౌ = పరిశుద్ధమగు, దేశే = స్థానమునందు, ఆసనమ్ = ఆసనమును, ప్రతిష్ఠాప్య = వేసుకొని, విజిత-ఆసనః = జయించబడిన యోగాసనము గలవాడై, తస్మిన్ = ఆ ఆసనమునందు, స్వస్తి = సుఖముగా, ఋజుకాయః = తిన్ననైన శరీరము గలవాడై, సమాసీనః = చక్కగా కూర్చున్నవాడై, సమభ్యసేత్ = ధ్యానమును అభ్యాసము చేయవలెను.

సాధకుడు ఒక యోగాసనమునందు కొంతసేపు స్థిరముగా కూర్చుండుటను అభ్యాసము చేయవలెను. అదియే ఆసనజయము. సాధకుడు పరిశుద్ధమగు స్థానమునందు ఆసనమును వేసుకొని దానిపై సుఖముగా యోగాసనములో చక్కగా నిటారుగా కూర్చుండి అభ్యసించవలెను.

ప్రాణస్య శోధయేన్మార్గం పూరకుంభకరేచకైః ।
ప్రతికూలేన వా చిత్తం యథా స్థిరమచంచలమ్ ॥ 9

పూరకుంభకరేచకైః = పూరకము (గాలిని నిండా పీల్చుట), కుంభకము (గాలిని లోపల గాని బయట గాని నిలిపి యుంచుట), రేచకము (గాలిని పూర్తిగా విడిచిపెట్టుట) లచే, ప్రాణస్య = ప్రాణముయొక్క, మార్గమ్ = నాడీమార్గమును, శోధయేత్ = శుద్ధి చేయవలెను, ప్రతికూలేన వా = రేచక కుంభకపూరకముల వరుసలో గాని చేయవలెను, యథా = ఏ విధముగానైతే, చిత్తమ్ = మనస్సు, స్థిరమ్ = స్థిరముగను, అచంచలమ్ = చాంచల్యము లేనిదిగను ఉండునో.

గాలిని లోపలకు పీల్చి కొద్దిసేపు నిలిపి యుంచవలెను. తరువాత దానిని బయటకు విడిచిపెట్టి బయటనే కొద్దిసేపు నిలిపియుంచవలెను.

దీనికి విరుద్ధక్రమములో కూడ ప్రాణాయామమును చేయవచ్చును. ఇట్లు చేయుట వలన ప్రాణమార్గము (నాడులు) శుద్ధియై, మనస్సు అచంచల ముగా స్థిరముగా నుండును.

మనోఽచిరాత్స్యాద్విరజం జితశ్వాసస్య యోగినః ।
వాయ్వగ్నిభ్యాం యథా లోహం ధ్మాతం త్యజతి వై మలమ్ ॥10

జితశ్వాసస్య = జయించబడిన శ్వాసగల, యోగినః = యోగికి, అచిరాత్ = తొందరలోనే, మనః = మనస్సు, వాయు-అగ్నిభ్యామ్ = వాయువు అగ్నులచే, ధ్మాతమ్ = కాల్చబడిన, లోహమ్ = లోహము, యథా = ఏవిధముగానైతే, మలమ్ = మాలిన్యమును, త్యజతి వై = విడిచిపెట్టునో అదే విధముగా, విరజమ్ = నిర్మలము, స్యాత్ = అగును.

లోహమును నిప్పులలో కాల్చి దానిపైకి గాలిని ప్రసరింపజేసినచో దాని మాలిన్యములు తొలగిపోవును. అదే విధముగా, యోగి ప్రాణాయామ ముచే వాయువును జయించినచో, మనస్సు శీఘ్రముగా నిర్మలమగును.

ప్రాణాయామైర్దహేద్దోషాన్ ధారణాభిశ్చ కిల్బిషాన్ ।
ప్రత్యాహారేణ సంసర్గాన్ ధ్యానేనానీశ్వరాన్ గుణాన్ ॥ 11

ప్రాణాయామైః = ప్రాణాయామములచే, దోషాన్ = దేహదోషముల ను, ధారణాభిః = ధారణలచే, కిల్బిషాన్ = పాపములను, ప్రత్యాహారేణ = ప్రత్యాహారముచే, సంసర్గాన్ = భోగములతోడి సంబంధములను, ధ్యానేన = ధ్యానముచే, అనీశ్వరాన్ = భగవంతునినుండి విముఖము చేసే, గుణాన్ = గుణములను, దహేత్ = పోగొట్టుకొనవలెను.

సాధకులు ప్రాణాయామమును చేసి దేహములోని వాతపిత్తాదుల దోషములను తొలగించుకొనవచ్చును. మనస్సును ఈశ్వరుని రూపము వంటి ఒక స్థానముపై నిలుపుట (ధారణ) ను అభ్యసించుటచే పాపసంస్కా రములు దూరమగును. ఇంద్రియములను బాహ్యపదార్థములనుండి ఉప సంహరించుటచే భోగములయందలి ఆసక్తి తొలగును. పరమేశ్వరుని

ధ్యానించుటచే ఈశ్వరునినుండి విముఖము చేసే రాగద్వేషాది గుణములు తొలగిపోవును.

యదా మనస్స్వం విరజం యోగేన సుసమాహితమ్ ।
కాష్ఠాం భగవతో ధ్యాయేత్స్వనాసాగ్రావలోకనః ॥ 12

యదా = ఏ కాలమునందైతే, స్వమ్ = తన, మనః = మనస్సు, యోగేన = యోగాభ్యాసముచే, సుసమాహితమ్ = చక్కని ఏకాగ్రతను కలిగియున్నదో అప్పుడు, స్వనాసా-అగ్ర-అవలోకనః = తన ముక్కుకొనను చూచువాడై, భగవతః = భగవానుని, కాష్ఠామ్ = మూర్తిని, ధ్యాయేత్ = ధ్యానించవలెను.

యోగాభ్యాసముచే మనస్సు శుద్ధమై చక్కని ఏకాగ్రతను పొందును. అప్పుడు సాధకుడు తన ముక్కుకొనను చూచుచున్నాడా యన్నట్లు మనస్సును ఏకాగ్రము చేసి భగవానుని మూర్తిని ధ్యానించవలెను.

ప్రసన్నవదనాంభోజం పద్మగర్భారుణేక్షణమ్ ।
నీలోత్పలదలశ్యామం శంఖచక్రగదాధరమ్ ॥ 13

ప్రసన్నవదన-అంభోజమ్ = ప్రసన్నమగు ముఖపద్మము గలవాడు, పద్మగర్భ-అరుణ-ఈక్షణమ్ = పద్మకోశము వలె ఎర్రనైన కన్నులు గలవాడు, నీల-ఉత్పలదలశ్యామమ్ = నల్లని కలువరేకుల వలె శ్యామల వర్ణము గలవాడు, శంఖచక్రగదాధరమ్ = శంఖమును చక్రమును గదను ధరించువాడు అగు శ్రీహరిని ధ్యానించవలెను.

శ్రీహరియొక్క పద్మమువంటి ముఖము ప్రసన్నముగా నుండును. ఆయన కన్నులు పద్మకోశము వలె అరుణవర్ణమును కలిగియుండును. నల్లని కలువరేకులవలె శ్యామలవర్ణమును కలిగియున్న శ్రీహరి శంఖమును చక్రమును గదను ధరించియుండును.

లసత్పంకజకింజల్కపీతకౌశేయవాససమ్ ।
శ్రీవత్సవక్షసం భ్రాజత్కౌస్తుభాముక్తకంధరమ్ ॥ 14

లసత్-పంకజకింజల్కపీతకౌశేయవాససమ్ = ప్రకాశించే పద్మపు పుప్పొడివలె పచ్చనైన పట్టువస్త్రమును దాల్చినట్టియు, శ్రీవత్సవక్షసమ్= శ్రీవత్సమనే చిహ్నము వక్షఃస్థలమునందు కలిగినట్టియు, భ్రాజత్-కౌస్తుభ-ఆముక్తకంధరమ్ = ప్రకాశించే కౌస్తుభముతో కలిసియున్న మెడ గల శ్రీహరిని ధ్యానించవలెను.

పద్మపు పుప్పొడివలె పచ్చగా ప్రకాశించే పట్టువస్త్రమును దాల్చిన శ్రీహరియొక్క వక్షఃస్థలముపై శ్రీవత్సము, మెడలో కౌస్తుభమాణిక్యము విరాజిల్లును.

మత్తద్విరేఫకలయా పరీతం వనమాలయా ।
పరార్థ్యహారవలయకిరీటాంగదనూపురమ్ ॥ 15

మత్తద్విరేఫకలయా = మదించిన తుమ్మెదల మధురధ్వని గల, వనమాలయా = వనమాలచే, పరీతమ్ = వ్యాపించబడియున్నట్టియు, పరార్థ్యహారవలయకిరీట-అంగదనూపురమ్ = అమూల్యమైన హారములు కంకణములు కిరీటము బాహుపురులు నూపురములు కలిగిన శ్రీహరిని ధ్యానించవలెను.

శ్రీహరి మదించిన తుమ్మెదల మధురధ్వని గల వనమాలను మెడనుండి పాదముల వరకు ధరించును. ఆయన హారములు కంకణములు బాహుపురులు నూపురములు మొదలగు అమూల్యములైన ఆభరణములను ధరించియుండును.

కాంచీగుణోల్లసచ్ఛ్రోణిం హృదయాంభోజవిష్టరమ్ ।
దర్శనీయతమం శాంతం మనోనయనవర్ధనమ్ ॥ 16

కాంచీగుణ-ఉల్లసత్-శ్రోణిమ్ = మొలనూలు సరములతో ప్రకాశించుచున్న నడుము గలిగినట్టియు, హృదయ-అంభోజవిష్టరమ్ = భక్తుల హృదయపద్మమే నివాసముగా గలిగినట్టియు, దర్శనీయతమమ్= మిక్కిలి సుందరుడైనట్టియు, శాంతమ్ = శాంతుడైనట్టియు, మనోనయనవర్ధనమ్ = మనస్సునకు కళ్లకు హర్షమును కలిగించే శ్రీహరిని ధ్యానించవలెను.

శ్రీహరి నడుము మొలనూలు సరములతో ప్రకాశించుచుండును. భక్తుల హృదయపద్మములే నివాసముగా గల ఆయన శాంతరూపుడై అతిశయించిన తన సౌందర్యముతో భక్తుల మనస్సునకు కళ్లకు ఆహ్లాదమును కలిగించుచుండును.

అపీచ్యదర్శనం శశ్వత్సర్వలోకనమస్కృతమ్ ।
సంతం వయసి కైశోరే భృత్యానుగ్రహకాతరమ్ ॥ 17

అపీచ్యదర్శనమ్ = అతిసుందరమగు దర్శనము గలిగినట్టియు, శశ్వత్ = నిత్యము, సర్వలోకనమస్కృతమ్ = సకలలోకములచే నమస్కరించబడునట్టియు, కైశోరే వయసి = యౌవనమునందు, సంతమ్ = ఉన్నట్టియు, భృత్య-అనుగ్రహకాతరమ్ = భక్తులను అనుగ్రహించుటకై కంగారు పడే శ్రీహరిని ధ్యానించవలెను.

యౌవనమునందుండే శ్రీహరి దర్శనము అతి సుందరమైనది. సర్వలోకములచే నమస్కరించబడే శ్రీహరి భక్తులను అనుగ్రహించుటకు తొందర పడుచుండును.

కీర్తన్యతీర్థయశసం పుణ్యశ్లోకయశస్కరమ్ ।
ధ్యాయేద్దేవం సమగ్రాంగం యావన్న చ్యవతే మనః ॥ 18

కీర్తన్యతీర్థయశసమ్ = కీర్తించదగిన పవిత్రమగు కీర్తి గలిగినట్టియు, పుణ్యశ్లోకయశస్కరమ్ = పవిత్రమగు కీర్తిగల భీష్మాదులకు కీర్తిని కలిగించు, దేవమ్ = శ్రీహరిని, మనః = మనస్సు, యావత్ న చ్యవతే = ఎంతవరకు చలించదో అంతవరకు, సమగ్ర-అంగమ్ = పూర్ణమగు అంగములు కలవానిగా, ధ్యాయేత్ = ధ్యానించవలెను.

కీర్తించదగిన పవిత్రమగు కీర్తిగల శ్రీహరి పవిత్రమగు కీర్తిగల భీష్మాదుల కీర్తిని కూడ వర్ధిల్లజేయును. సాధకుడు మనస్సు స్థిరముగా నిలబడినంత వరకు ఆ శ్రీహరియొక్క పూర్ణమగు మూర్తిని ధ్యానించవలెను.

స్థితం వ్రజంతమాసీనం శయానం వా గుహాశయమ్ ।

ప్రేక్షణీయేహితం ధ్యాయేచ్ఛుద్ధభావేన చేతసా ॥ 19

స్థితమ్ = నిలిచియున్న, వ్రజంతమ్ = వెళ్లుచున్న, ఆసీనమ్ = కూర్చునియున్న, శయానం వా = లేదా పరుండియున్న, గుహాశయమ్ = బుద్ధిగుహయందు నివసించే, ప్రేక్షణీయ-ఈహితమ్ = చూడదగిన లీలలు గల శ్రీహరిని, శుద్ధభావేన = శుద్ధమగు భావముతో కూడిన, చేతసా = మనస్సుతో, ధ్యాయేత్ = ధ్యానించవలెను.

సాధకుడు తన అభిరుచికి తగ్గట్లుగా శ్రీహరి నిలిచియున్నట్లు గాని, నడచుచున్నట్లు గాని, కూర్చునియున్నట్లు గాని, లేదా పరుండియున్నట్లు గాని ధ్యానించవచ్చును. దర్శించదగిన లీలలు గల శ్రీహరి సాధకుని బుద్ధి గుహయందు చైతన్యరూపముగా నిలిచియుండును. సాధకుడు అట్టి శ్రీహరిని పరిశుద్ధమగు భావనతో కూడిన మనస్సుతో ధ్యానించవలెను.

తస్మింల్లబ్ధపదం చిత్తం సర్వావయవసంస్థితమ్ ।
విలక్ష్యైకత్ర సంయుజ్యాదంగే భగవతో మునిః ॥ 20

చిత్తమ్ = చిత్తమును, తస్మిన్ = ఆ శ్రీహరి మూర్తియందు, లబ్ధపదమ్ = పొందబడిన స్థిరత్వము గలదానినిగా, సర్వ-అవయవసంస్థితమ్ = అన్ని అవయవములయందు నిలకడను పొందినదానినిగా, విలక్ష్య = గమనించి, మునిః = మననశీలుడగు సాధకుడు, భగవతః = భగవానుని, ఏకత్ర = ఒక, అంగే= అవయవమునందు, సంయుజ్యాత్ = లగ్నము చేయవలెను.

తన చిత్తము భగవానుని మూర్తియందలి అవయవములన్నింటియందు నిలకడను పొందినదని గమనించిన తరువాత, మననశీలుడగు సాధకుడు మనస్సును భగవానుని ఒక్కొక్క అంగముపై విశేషముగా ఏకాగ్రము చేయవలెను.

సంచింతయేద్భగవతశ్చరణారవిందం
వజ్రాంకుశధ్వజసరోరుహలాంఛనాఢ్యమ్ ।
ఉత్తుంగరక్తవిలసన్నఖచక్రవాల-
జ్యోత్స్నాభిరాహతమహద్ధృదయాంధకారమ్ ॥ 21

వజ్ర-అంకుశధ్వజసరోరుహలాంఛన-ఆఢ్యమ్ = వజ్రము అంకుశము ధ్వజము పద్మముల రేఖలతో సంపన్నమైనట్టియు, ఉత్తుంగరక్తవిలసత్-నఖచక్రవాలజ్యోత్స్నాభిః = ఎత్తైన ఎర్రగా ప్రకాశించే గోళ్ల మండలముల కాంతులచే, ఆహతమహత్-హృదయ-అంధకారమ్ = పోగొట్టబడిన మహాత్ముల హృదయమునందలి చీకటి గల, భగవతః = శ్రీహరియొక్క, చరణ-అరవిందమ్ = పాదపద్మమును, సంచింతయేత్ = ధ్యానించవలెను.

భగవానుని అరికాళ్లు వజ్రము అంకుశము ధ్వజము పద్మముల రేఖలతో నొప్పారును. శ్రీహరియొక్క ఎత్తైన ఎర్రని గుండ్రని ప్రకాశించే గోళ్ల కాంతులు ధ్యానము చేసే మహాత్ముల హృదయములలోని చీకట్లను తరిమివేయును.

యచ్ఛౌచనిస్సృతసరిత్ప్రవరోదకేన
తీర్థేన మూర్ధ్న్యధికృతేన శివశ్శివో ఽభూత్ ।
ధ్యాతుర్మనశ్శమలశైలనిసృష్టవజ్రం
ధ్యాయేచ్చిరం భగవతశ్చరణారవిందమ్ ॥ 22

మూర్ధ్ని = శిరస్సునందు, అధికృతేన = ధరించబడిన, యత్-శౌచనిస్సృతసరిత్-ప్రవర-ఉదకేన = ఏ పాదములను కడిగిన నీటినుండి బయల్వెడలిన నదియొక్క గొప్ప జలముచే, శివః = శివుడు, శివః = మంగళస్వరూపుడు, అభూత్ = ఆయెనో, ధ్యాతుః = ధ్యానము చేయువానియొక్క, మనః-శమలశైలనిసృష్టవజ్రమ్ = మనస్సునందలి మాలిన్యము అనే పర్వతమునందు ప్రయోగించబడిన వజ్రము అగు, భగవతః = శ్రీహరి భగవానుని, చరణ-అరవిందమ్ = పాదపద్మమును, చిరమ్ = చిరకాలము, ధ్యాయేత్ = ధ్యానించవలెను.

శ్రీహరియొక్క పాదములను కడిగిన నీరే గంగానదియై ప్రవహించగా ఆ పవిత్రజలములను శిరస్సుపై దాల్చి శివుడు మంగళస్వరూపుడాయెను. శ్రీహరియొక్క పాదము ధ్యానించువారి మనస్సులోని మాలిన్యపర్వతములను బ్రద్దలుకొట్టే వజ్రము. అట్టి శ్రీహరి భగవానుని పాదపద్మమును సాధకుడు చిరకాలము ధ్యానించవలెను.

జానుద్వయం జలజలోచనయా జనన్యా
లక్ష్మ్యాఖిలస్య సురవందితయా విధాతుః ।
ఊర్వోర్నిధాయ కరపల్లవరోచిషా యత్
సంలాలితం హృది విభోరభవస్య కుర్యాత్ ।। 23

అభవస్య = జన్మలేని (సంసారభయమును పోగొట్టే), విభోః = శ్రీహరియొక్క, యత్ = ఏది, జలజలోచనయా = పద్మమువంటి కన్నులు గలిగినట్టియు, అఖిలస్య = సకలజగత్తునకు, విధాతుః = సృష్టికర్తయగు బ్రహ్మకు, జనన్యా = తల్లియైనట్టియు, సురవందితయా = దేవతలచే నమస్కరించబడే, లక్ష్మ్యా = లక్ష్మీదేవిచే, ఊర్వోః = తొడలపై, నిధాయ = ఉంచుకొని, కరపల్లవరోచిషా = చిగురుటాకువలె ప్రకాశించే చేతితో, సంలాలితమ్ = చక్కగా సేవించబడినదో అట్టి, జానుద్వయమ్ = మోకాళ్ల జంటను, హృది = హృదయమునందు, కుర్యాత్ = ధ్యానించవలెను.

పద్మములవంటి కన్నులు గలది, సకలజగత్తును సృష్టించిన బ్రహ్మకు తల్లి, దేవతలచే నమస్కరించబడునది అగు లక్ష్మీదేవి శ్రీహరియొక్క మోకాళ్లను తన తొడలపై నుంచుకొని చిగురుటాకులవలె ప్రకాశించే చేతులతో చక్కగా సేవ చేయును. జన్మలేనివాడు, సంసారభయమును పోగొట్టువాడు అగు శ్రీహరిప్రభుని అట్టి మోకాళ్ల జంటను సాధకుడు హృదయములో ధ్యానించవలెను.

ఊరూ సుపర్ణభుజయోరధిశోభమానా-
వోజోనిధీ అతసికాకుసుమావభాసౌ ।
వ్యాలంబిపీతవరవాససి వర్తమాన-
కాంచీకలాపపరిరంభి నితంబబింబమ్ ।   24

సుపర్ణభుజయోః = గరుత్మంతుని భుజములపై, అధిశోభమానౌ = అధిష్ఠించి ప్రకాశించునట్టియు, ఓజోనిధీ = బలమునకు ఆశ్రయములైనట్టియు, అతసికాకుసుమ-అవభాసౌ = నల్లయగిసె పుష్పముల కాంతి గల, ఊరూ = తొడలను, వ్యాలంబిపీతవరవాససి = మణికట్లవరకు వ్రేలాడే గొప్ప పచ్చని ధోవతియందు, వర్తమానకాంచీకలాపపరిరంభి = ఉండే మొల

నూలు సరములను అంటిపెట్టుకొనియుండు, నితంబబింబమ్ = నితంబ మండలమును (ధ్యానించవలెను).

బలమునకు ఆశ్రయములై నల్లయగిసె పుష్పముల కాంతితో శోభిల్లే శ్రీహరి తొడలు గరుత్మంతుని భుజములపై అధిష్ఠించి ప్రకాశించును. ఆయన కట్టే గొప్ప పీతాంబరము మణికట్లవరకు వ్యాపించియుండును. దానిపై నుండే మొలనూలు సరములు నితంబబింబమును అంటిపెట్టుకొని యుండును. శ్రీహరి రూపమును ఈ విధముగా ధ్యానించవలెను.

నాభిహ్రదం భువనకోశగుహోదరస్థం
యత్రాత్మయోనిధిషణాఖిలలోకపద్మమ్ ।
వ్యూఢం హరిన్మణివృషస్తనయోరముష్య
ధ్యాయేద్ద్వయం విశదహారమయూఖగౌరమ్ ॥25

అముష్య = ఈ శ్రీహరియొక్క, భువనకోశగుహా-ఉదరస్థమ్ = భువనముల సమూహమునకు అధిష్ఠానమగు ఉదరమునందున్న, నాభిహ్రదమ్ = లోతైన బొడ్డును, యత్ర = దేనియందు, ఆత్మయోనిధిషణ-అఖిల లోకపద్మమ్ = బ్రహ్మకు నివాసమగు సకలలోకములే స్వరూపముగా గల పద్మము, వ్యూఢమ్ = మొలిచినదో, హరిన్మణివృషస్తనయోః = గొప్ప పచ్చలవంటి స్తనముల, విశదహారమయూఖగౌరమ్ = స్వచ్ఛమైన హార ముల కాంతులచే తెల్లనైన, ద్వయమ్ = జంటను, ధ్యాయేత్ = ధ్యానించవ లెను.

సకలభువనములకు ఆశ్రయమైన శ్రీహరియొక్క ఉదరమునం దుండే లోతైన బొడ్డునుండి సకలలోకముల రూపములోనున్న పద్మము ఆవిర్భవించగా దానియందు బ్రహ్మ ఉదయించెను. అట్టి నాభిని ధ్యానించ వలెను. ఆయన స్తనముల జంట పచ్చలను పోలియుండును. స్వచ్ఛమగు హారముల కాంతులచే అవి తెల్లగా ప్రకాశించును. వాటిని ధ్యానించవలెను.

వక్షోఽధివాసమృషభస్య మహావిభూతేః
పుంసాం మనోనయననిర్వృతిమాదధానమ్ ।

కంఠం చ కౌస్తుభమణేరధిభూషణార్థం
కుర్యాన్మనస్యఖిలలోకనమస్కృతస్య ॥ 26

అఖిలలోకనమస్కృతస్య = సకలలోకములచే నమస్కరించబడే, ఋషభస్య = శ్రేష్ఠుడగు శ్రీహరియొక్క, మహావిభూతేః = మహాలక్ష్మికి, అధివాసమ్ = నివాసస్థానమైనట్టియు, పుంసామ్ = ధ్యానము చేయువారల కు, మనోనయననిర్వృతిమ్ = మనస్సునకు కళ్లకు ఆనందమును, ఆదధా నమ్ = కలిగించే, వక్షః = వక్షఃస్థలమును, చ = మరియు, కౌస్తుభమణేః = కౌస్తుభమాణిక్యమునకు, అధిభూషణ-అర్థమ్ = అధికమగు శోభకొరకు (ధ రించబడిన), కంఠమ్ = కంఠమును, మనసి = మనస్సునందు, కుర్యాత్ = ధ్యానించవలెను.

దేవశ్రేష్ఠుడగు శ్రీహరి సకలలోకములకు నమస్కరించ దగినవా డు. మహాలక్ష్మికి నివాసమగు ఆయన వక్షఃస్థలము ధ్యాతల మనస్సునకు కళ్లకు ఆనందమును కలిగించును. ఆయన కంఠము తనయందు ధరించబ డిన కౌస్తుభమాణిక్యమునకు కూడ శోభను తెచ్చిపెట్టును. సాధకుడు అట్టి కంఠమును మనస్సులో ధ్యానించవలెను.

బాహూంశ్చ మందరగిరేః పరివర్తనేన
నిర్ణిక్తబాహువలయానధిలోకపాలాన్ ।
సంచింతయేద్దశశతారమసహ్యతేజః
శంఖం చ తత్కరసరోరుహరాజహంసమ్ ॥ 27

మందరగిరేః = మందరపర్వతముయొక్క, పరివర్తనేన = గిరగిర త్రిప్పుటచే, నిర్ణిక్తబాహువలయాన్ = మెరుగు పెట్టబడిన బాహుపురులు గలిగినట్టియు, అధిలోకపాలాన్ = ఆశ్రయించబడిన లోకపాలకులు గల, బాహూన్ చ = బాహువులను, అసహ్యతేజః = సహింప శక్యము కాని తేజస్సు గల, దశశత-అరమ్ = అనంతములగు ధారలు గల సుదర్శనచక్ర మును, తత్-కరసరోరుహరాజహంసమ్ = ఆయన చేతులు అనే పద్మము లకు రాజహంస అయిన, శంఖం చ = శంఖమును కూడ, సంచింతయేత్ = ధ్యానించవలెను.

మందరపర్వతమును గిరగిర త్రిప్పినప్పుడు ఆయన బాహుపురులకు మెరుగు పెట్టబడెను. ఆయన బాహువులను లోకపాలకులు ఆశ్రయించి తమ కార్యములను చేయుదురు. అనంతములగు ధారలు గల సుదర్శనచక్రముయొక్క తేజస్సును సహించుట సంభవము కాదు. శంఖము పద్మములవంటి ఆయన చేతులలో రాజహంసవలె ప్రకాశించును. వీటిని అన్నింటినీ ధ్యానించవలెను.

కౌమోదకీం భగవతో దయితాం స్మరేత
దిగ్ధామరాతిభటశోణితకర్దమేన ।
మాలాం మధువ్రతవరూథగిరోపఘుష్టాం
చైత్యస్య తత్త్వమమలం మణిమస్య కంఠే ॥ **28**

అస్య = ఈ, భగవతః = శ్రీహరికి, దయితామ్ = ప్రియమైనట్టియు, అరాతిభటశోణితకర్దమేన = శత్రుభటుల రక్తపు అడుసుచే, దిగ్ధామ్ = పూయబడిన, కౌమోదకీమ్ = కౌమోదకీ గదను, కంఠే = కంఠమునందలి, మధువ్రతవరూథగిరా = తుమ్మెదల గుంపుల ధ్వనిచే, ఉపఘుష్టామ్ = ధ్వనించుచున్న, మాలామ్ = వనమాలను, చైత్యస్య = జీవుని, అమలమ్ = స్వచ్ఛమైన, తత్త్వమ్ = తత్త్వమగు, మణిమ్ = కౌస్తుభమణిని, స్మరేత = స్మరించవలెను.

శత్రువీరుల రక్తపు అడుసుచే పూయబడిన కౌమోదకీగద ఈ శ్రీహరి భగవానునకు ప్రియమైనది. ఆయన కంఠమునందలి వనమాల చుట్టూ తుమ్మెదల గుంపులు ఝుంకారమును చేయుచున్నవి. ఆయన మెడలోని కౌస్తుభమాణిక్యము స్వచ్ఛమగు జీవతత్త్వమే. వీటిని సాధకుడు ధ్యానించవలెను.

భృత్యానుకంపితధియేహ గృహీతమూర్తేః
సంచింతయేద్భగవతో వదనారవిందమ్ ।
యద్విస్ఫురన్మకరకుండలవల్గితేన
విద్యోతితామలకపోలముదారనాసమ్ ॥ **29**

భృత్య-అనుకంపితధియా = భక్తులయందు పుట్టిన జాలి గల బుద్ధిచే, గృహీతమూర్తేః = స్వీకరించబడిన సాకారరూపము గల, భగవతః = శ్రీహరిభగవానుని, ఉదారనాసమ్ = ఎత్తైన పొడవాటి ముక్కుగల, వదన-అరవిందమ్ = ముఖపద్మమును, సంచింతయేత్ = ధ్యానించవలెను, యత్ = ఏ ముఖము, విస్ఫురత్-మకరకుండలవల్గితేన = అధికముగా ప్రకాశించే మకరకుండలముల కదలికచే, విద్యోతిత-అమలకపోలమ్ = ప్రకాశింపచేయబడే స్వచ్ఛమగు చెక్కిళ్లు గలదో.

శ్రీహరి తన భక్తులను అనుగ్రహించవలెననే అభిప్రాయముతో సాకారరూపమును ధరించినాడు. ఆయన ముఖపద్మము పొడవాటి ఎత్తైన ముక్కుతో ప్రకాశించును. ఊగిసలాడే మకరకుండలముల కాంతులచే ఆయన స్వచ్ఛమగు చెక్కిళ్లు అధికముగా ప్రకాశించును. ఆ ముఖమును ధ్యానించవలెను.

యచ్ఛ్రీనికేతమలిభిః పరిసేవ్యమానం
భూత్యా స్వయా కుటిలకుంతలవృందజుష్టమ్ ।
మీనద్వయాశ్రయమధిక్షిపదబ్జనేత్రం
ధ్యాయేన్మనోమయమతంద్రిత ఉల్లసద్భ్రు ॥ 30

శ్రీనికేతమ్ = సౌందర్యనిధానమైన, అలిభిః = తుమ్మెదలచే, పరిసేవ్యమానమ్ = చుట్టు సేవించబడే, మీనద్వయ-ఆశ్రయమ్ = రెండు చేపలకు ఆశ్రయమైన పద్మమును, స్వయా = తన, భూత్యా = శోభచే, అధిక్షిపత్ = తిరస్కరించునట్టియు, కుటిలకుంతలవృందజుష్టమ్ = దట్టని గిరజాల జుట్టుచే కూడియున్నట్టియు, అబ్జనేత్రమ్ = పద్మములవంటి కన్నులు గలిగినట్టియు, ఉల్లసత్-భ్రు = ప్రకాశించే కనుబొమలు గల, యత్ = ఏ ముఖము గలదో దానిని, అతంద్రితః = సావధానుడై, మనోమయమ్ = మనస్సునందు నిండియున్నదానినిగా, ధ్యాయేత్ = ధ్యానించవలెను.

సౌందర్యనిధానమగు శ్రీహరియొక్క ముఖపద్మము దట్టని గిరజాల జుట్టుతో కూడి పద్మములవంటి నేత్రములతో మరియు అందమగు కనుబొమలతో ప్రకాశించును. తుమ్మెదలచే చుట్టువారబడి రెండు చేపలకు

ఆశ్రయమైన పద్మమును ఆ ముఖము తన శోభచే తిరస్కరించును. సాధకుడు సావధానుడై ఆ ముఖపద్మమును తన మనస్సులో నింపుకొని ధ్యానించవలెను.

తస్యావలోకమధికం కృపయాతిఘోర-
తాపత్రయోపశమనాయ నిసృష్టమక్ష్ణోః ।
స్నిగ్ధస్మితానుగుణితం విపులప్రసాదం
ధ్యాయేచ్చిరం వితతభావనయా గుహాయామ్ ॥ 31

కృపయా = దయతో, అధికమ్ = అధికమగు (ఆధ్యాత్మిక-ఆధిభౌతిక-ఆధిదైవికమగు), అతిఘోరతాపత్రయ-ఉపశమనాయ = మిక్కిలి భయంకరమగు మూడు తాపములను చల్లార్చుటకై, నిసృష్టమ్ = ప్రసరించునట్టియు, స్నిగ్ధస్మిత-అనుగుణితమ్ = ప్రేమతో కూడిన చిరునవ్వుచే వర్ధిల్లజేయబడినట్టియు, విపులప్రసాదమ్ = విస్తారమగు అనుగ్రహము గల, తస్య = ఆ శ్రీహరియొక్క, అక్ష్ణోః = కన్నుల, అవలోకమ్ = చూపును, గుహాయామ్ = బుద్ధియందు, చిరమ్ = చాలసేపు, వితతభావనయా = అతిశయించిన ప్రేమతో, ధ్యాయేత్ = ధ్యానించవలెను.

భగవానుని కన్నులనుండి అధికమగు దయతో నిండిన చూపు ప్రసరించుచుండును. అది భక్తులకు భయంకరమగు ఆధ్యాత్మిక-ఆధిభౌతిక-ఆధిదైవికములనే మూడు విధముల తాపములనుండి శాంతిని చేకూర్చును. ఆ చూపులోని దయ ప్రేమతో నిండిన చిరునవ్వుచే ఎన్నోరెట్లు వర్ధిల్లుచుండును. ఆ చూపు భక్తులకు అతిశయించిన అనుగ్రహమును కలిగించును. సాధకుడు తన బుద్ధిగుహయందు అతిశయించిన ప్రేమతో ఆ చూపును ధ్యానించవలెను.

హాసం హరేరవనతాఖిలలోకతీవ్ర-
శోకాశ్రుసాగరవిశోషణమత్యుదారమ్ ।
సమ్మోహనాయ రచితం నిజమాయయాస్య
భ్రూమండలం మునికృతే మకరధ్వజస్య ॥ 32

అవనత-అఖిలలోకతీవ్రశోక-అశ్రుసాగరవిశోషణమ్ = శరణు జొచ్చిన సకలప్రాణుల ఉత్కటమగు దుఃఖముచే కలిగిన కన్నీటి సముద్రమును ఎండింపజేయునట్టియు, అతి-ఉదారమ్ = ఆనందమును కలిగించే, హరేః = శ్రీహరియొక్క, హాసమ్ = నవ్వును, మునికృతే = మహర్షుల కొరకై, మకరధ్వజస్య = మన్మథుని, సమ్మోహనాయ = మోహింపజేయుట కొరకు, నిజమాయయా = తన మాయచే, రచితమ్ = రచించబడిన, అస్య = ఈ శ్రీహరియొక్క, భ్రూమండలమ్ = కనుబొమల వలయమును (ధ్యానించవలెను).

శ్రీహరియొక్క చిరునవ్వు భక్తులందరికి ఉత్కటమగు దుఃఖమువలన కలిగే కన్నీటి సముద్రములను ఎండింపజేసి ఆనందమును కలిగించును. ఆ నవ్వును ధ్యానించవలెను. మన్మథుని మోహింపజేసి మహర్షులకు క్షేమమును కలిగించుట కొరకు మాత్రమే ఆయన తన మాయచే కనుబొమల వలయమును నిర్మించినాడని ధ్యానము చేయవలెను.

ధ్యానాయనం ప్రహసితం బహులాధరోష్ఠ-
భాసారుణాయితతనుద్విజకుందపంక్తి ।
ధ్యాయేత్స్వదేహకుహరేఽవసితస్య విష్ణోః
భక్త్యాఽఽర్ద్రయార్పితమనా న పృథగ్దిదృక్షేత్ ॥33

స్వదేహకుహరే = తన దేహమునందలి హృదయాకాశమునందు, అవసితస్య = ప్రత్యక్షమైన, విష్ణోః = శ్రీహరియొక్క, బహుల-అధర-ఓష్ఠ భాసా = అధికమగు క్రిందిపెదవియొక్క కాంతిచే, అరుణాయితతనుద్విజ కుందపంక్తి = ఎర్రగా చేయబడిన సూక్ష్మమగు మల్లెమొగ్గలవంటి పలు వరుసలు గల, ప్రహసితమ్ = పెద్ద నవ్వును, ధ్యాయేత్ = ధ్యానించవలెను, ఆర్ద్రయా = ప్రేమరసముతో నిండిన, భక్త్యా = భక్తితో, అర్పితమనాః = అర్పించబడిన మనస్సు గలవాడై, పృథక్ = శ్రీహరికంటె భిన్నమైనదానిని, న దిదృక్షేత్ = చూడగోరరాదు.

శ్రీహరి బిగ్గరగా నవ్వినప్పుడు క్రిందిపెదవియొక్క అతిశయించిన కాంతిచే మల్లెమొగ్గలవంటి సూక్ష్మమగు పలువరుసలు ఎర్రగా కానవచ్చు

ను. సాధకుడు ధ్యానమునకు విషయమగు శ్రీహరిని తన దేహములోని హృదయాకాశములో ప్రత్యక్షము చేసుకొని ఆ నవ్వును ధ్యానించవలెను. సాధకుడు ప్రేమరసముతో నిండిన మనస్సును శ్రీహరికి సమర్పించవలెను. శ్రీహరికంటె భిన్నమైనదానిని దేనినైననూ చూడగోరరాదు.

ఏవం హరౌ భగవతి ప్రతిలబ్ధభావో
భక్త్యా ద్రవద్ధృదయ ఉత్పులకః ప్రమోదాత్ ।
ఔత్కంఠ్యబాష్పకలయా ముహురర్ద్యమానః
తచ్చాపి చిత్తబడిశం శనకైర్వియుంక్తే ॥ 34

ఏవమ్ = ఇట్లు, భగవతి హరౌ = శ్రీహరి భగవానునియందు, ప్రతిలబ్ధభావః = పొందబడిన ప్రేమాతిశయము గలవాడై, భక్త్యా = భక్తితో, ద్రవత్-హృదయః = ద్రవించే హృదయము గలవాడై, ప్రమోదాత్ = మహానందముతో, ఉత్పులకః = రోమాంచము గలవాడై, ఔత్కంఠ్యబాష్పకలయా = అతిశయించిన హర్షముచే స్రవించే కన్నీటితో, ముహుః = పదే పదే, అర్ద్యమానః = తడుపబడినవాడై, తత్ = ఆ, చిత్తబడిశం అపి = మనస్సు అనే గాలమును కూడ, శనకైః = మెల్లగా, వియుంక్తే = ఉపసంహరించును.

ఈ విధముగా శ్రీహరి భగవానునియందు ప్రేమాతిశయము గల సాధకుని హృదయము భక్తిచే ద్రవించి ఆనందముతో శరీరమంతటా రోమాంచము కలుగును. అతిశయించిన హర్షముచే కన్నీరు స్రవించి అతని దేహమును పలుమార్లు తడుపును. అంతవరకు ఆతని మనస్సు చేపను పట్టే గాలము వలె శ్రీహరిని దగ్గరకు తెచ్చినది. అపుడాతడు మెల్లగా ఆ మనస్సును కూడ ధ్యేయవస్తువునుండి ఉపసంహరించును.

ముక్తాశ్రయం యర్హి నిర్విషయం విరక్తం
నిర్వాణమృచ్ఛతి మనస్సహసా యథార్చిః ।
ఆత్మానమత్ర పురుషోఽవ్యవధానమేక-
మన్వీక్షతే ప్రతినివృత్తగుణప్రవాహః ॥ 35

యర్హి = ఏ కాలమునందైతే, ముక్త-ఆశ్రయమ్ = విడువబడిన ఆశ్రయము గలది, నిర్విషయమ్ = విషయము లేనిది, విరక్తమ్ = భోగములయందు వైరాగ్యము గలది అగు, మనః = మనస్సు, అర్చిః యథా = దీపజ్వాల వలె, నిర్వాణమ్ = విలయమును, ఋచ్ఛతి = పొందునో, అత్ర = ఈ స్థితిలో, పురుషః = సాధకుడు, ప్రతినివృత్తగుణప్రవాహః = తొలగిపోయిన గుణముల ప్రవాహరూపమగు ఉపాధి సంబంధము గలవాడై, అవ్యవధానమ్ = విభాగము లేని, ఏకమ్ = అఖండమగు, ఆత్మానమ్ = ఆత్మను, అను = సర్వమునందు అనుగతమైనదిగా, ఈక్షతే = దర్శించును.

సాధకుడు ధ్యానమును చేయుచుండగా ఒకానొక కాలములో మనస్సునకు అహంకారరూపమగు ఆశ్రయము, విశిష్టమగు ధ్యేయవిషయము లేకుండా పోవును. వైరాగ్యపూర్ణమగు అట్టి సాధకుని మనస్సు నూనె లయిపోయిన దీపజ్వాలవలె తన మూలమగు ఆత్మయందు విలీనమగును. ఆ స్థితిలో సాధకుడు సత్త్వరజస్తమోగుణముల ప్రవాహరూపమగు దేహాది ఉపాధియొక్క తాదాత్మ్యరూపమైన బంధమునుండి విముక్తుడగును. అపుడాతడు ధ్యాత, ధ్యేయము అనే విభాగము లేని అఖండమగు ఆత్మతత్త్వమే సర్వమునకు అధిష్ఠానముగా నున్నదని దర్శించును.

సోఽప్యేతయా చరమయా మనసో నివృత్త్యా
తస్మిన్మహిమ్న్యవసితస్సుఖదుఃఖబాహ్యే ।
హేతుత్వమప్యసతి కర్తరి దుఃఖయోర్యత్
స్వాత్మన్ విధత్త ఉపలబ్ధపరాత్మకాష్ఠః ॥ 36

ఉపలబ్ధపర-ఆత్మకాష్ఠః = ప్రత్యక్షము చేసుకొనబడిన సర్వాతిశాయియగు ఆత్మస్వరూపము గల, సః అపి = ఆ సాధకుడు మాత్రమే, ఏతయా = ఈ, చరమయా = అవిద్యారహితమగు, మనసః = మనస్సుయొక్క, నివృత్త్యా = విలయముచే, సుఖదుఃఖబాహ్యే = సుఖదుఃఖముల సంబంధము లేని, తస్మిన్ = ఆ, మహిమ్ని = బ్రహ్మస్వరూపమునందు, అవసితః = నిష్ఠను పొందినవాడై, దుఃఖయోః = సుఖదుఃఖములకు, యత్ హేతుత్వమ్ = ఏ భోక్తృత్వమును, స్వాత్మన్ = తన స్వరూపమునందు

భావించినాడో, అపి = దానిని కూడ, అసతి = మిథ్యాభూతమగు, కర్తరి = అహంకారమునందు, విధత్తే = ఉంచును.

ఆత్మతత్త్వమును ప్రత్యక్షము చేసుకున్న జ్ఞానికి మనస్సునందలి అవిద్య తొలగిపోవుటచే, ఆతడు సుఖదుఃఖములకు అతీతమైన తన బ్రహ్మ స్వరూపమునందు నిష్ఠను కలిగియుండును. ఆతని మనస్సు తన మూల మగు ఆత్మయందు విలీనమగును. ఒకప్పుడు ఆతడు అవిద్యచే తాను సుఖదుఃఖముల భోక్తనని భావించెడి వాడు. కాని, భోక్త అహంకారము మాత్రమేననియు, ఆ అహంకారము కూడ మిథ్యయేననియు ఆతడు ఇప్పుడు యెరుంగును.

దేహం చ తం న చరమః స్థితముత్థితం వా
సిద్ధో విపశ్యతి యతో ఽధ్యగమత్స్వరూపమ్ ।
దైవాదుపేతమథ దైవవశాదపేతం
వాసో యథా పరికృతం మదిరామదాంధః ॥ 37

చరమః = చరమజన్మయందున్న, సిద్ధః = కృతార్థుడైన జ్ఞాని, మది రామద-అంధః = మద్యముయొక్క నిషాచే కన్నుమిన్ను గాననివాడు, పరి కృతమ్ = నడుమునకు చుట్టబడిన, వాసః యథా = వస్త్రమును వలె, స్థితమ్ = కూర్చున్నది గాని, ఉత్థితం వా = లేచి నిలబడినది గాని, దైవాత్ = ప్రారబ్ధము వలన, ఉపేతమ్ = వెళ్లినది గాని, దైవవశాత్ = ప్రారబ్ధవశముచే, అపేతమ్ = తిరిగి వచ్చినది గాని అగు, తమ్ = ఆ, దేహం చ = దేహమును కూడ, న విపశ్యతి = విశేషముగా చూడడు, యతః = ఏలయనగా, స్వరూ పమ్ = తన స్వరూపమును, అధ్యగమత్ = పొందినాడో.

ఆత్మజ్ఞానమును పొంది కృతార్థుడైన జ్ఞానికి ఇది ఆఖరు జన్మ. మద్యముయొక్క నిషాలో కన్ను గానని వానికి తన నడుము చుట్టూ వస్త్రము ఉన్నదా, ఊడినదా అను దృష్టి ఉండదు. అదే విధముగా, ఆ జ్ఞానికి తన ఈ దేహము కూర్చున్నా, నిలబడినా, ప్రారబ్ధవశముచే ఎక్కడి కైనా వెళ్లినా, తిరిగి వచ్చినా, ఆత్మజ్ఞాననిష్ఠయందున్నవాడగుటచే ఆయన పెద్దగా పట్టించుకోడు.

దేహోఽపి దైవవశగః ఖలు కర్మ యావత్
స్వారంభకం ప్రతిసమీక్షత ఏవ సాసుః ।
తం సప్రపంచమధిరూఢసమాధియోగః
స్వాప్నం పునర్న భజతే ప్రతిబుద్ధవస్తుః ॥ 38

దైవవశగః = ప్రారబ్ధమునకు అధీనమై నడిచే, స-అసుః = ఇంద్రియములతో ప్రాణముతో కూడియున్న, దేహః అపి = దేహము కూడ, యావత్ = ఎంతవరకైతే, స్వ-ఆరంభకమ్ = తనకు జన్మనిచ్చిన, కర్మ = కర్మ ఉన్నదో అంతవరకు, ప్రతి = ఆ కర్మను బట్టి, సమీక్షతే ఏవ = జీవించియే యుండును, ప్రతిబుద్ధవస్తుః = తెలియబడిన ఆత్మవస్తువుగల, అధిరూఢసమాధియోగః = పొందబడిన ఆత్మజ్ఞాననిష్ఠారూపమగు యోగము గల పురుషుడు, సప్రపంచమ్ = ధనము బంధువులతో కూడియున్న, స్వాప్నమ్ = స్వప్నపదార్థమైన, తమ్ = ఆ దేహమును, పునః = మరల, న భజతే = పొందడు.

ఇంద్రియములతో, ప్రాణాపానాది ప్రాణవృత్తులతో కూడియున్న ఈ దేహము తనకు జన్మనిచ్చిన ప్రారబ్ధకర్మయొక్క శేషము ఉన్నంత వరకు, ఆ కర్మయొక్క ప్రభావముచే జీవించియే యుండును. కాని, ఆత్మస్వరూపమును తెలిసి ఆ ఆత్మజ్ఞానమునందు పరినిష్ఠితుడై యున్న యోగి ధనము బంధువర్గము మొదలగు వాటితో సంబంధమును కలిగియున్న ఇట్టి దేహమును మరల పొందడు. వాస్తవముగా ఈ దేహమైననూ స్వప్నపదార్థము వలె మిథ్య మాత్రమే.

యథా పుత్రాచ్చ విత్తాచ్చ పృథఙ్ మర్త్యః ప్రతీయతే ।
అప్యాత్మత్వేనాభిమతాద్దేహాదేః పురుషస్తథా ॥ 39

మర్త్యః = మానవుడు, యథా = ఏ విధముగానైతే, ఆత్మత్వేన = తానే అన్నట్లుగా, అభిమతాత్ అపి = స్వీకరించబడినప్పటికీ, పుత్రాత్ = పుత్రునికంటె, విత్తాత్ చ = ధనము కంటె కూడా, పృథక్ = వేరుగా, ప్రతీయతే = కానవచ్చుచున్నాడో, తథా = అదే విధముగా, పురుషః = పురుషుడు, దేహాదేః = దేహము మొదలగువాటికంటె (విలక్షణుడే).

మానవుడు తన పుత్రునియందు, ధనమునందు తానే అన్న భావమును కలిగియుండును. కాని, వాస్తవములో వాటికంటె భిన్నముగా కానవచ్చుచునే యున్నాడు. అదే విధముగా క్షేత్రజ్ఞుడగు పురుషుడు (పూర్ణమగు ఆత్మ) దేహాదులే యన్నట్లు భ్రమ ఉన్ననూ, వాస్తవములో ఆత్మ దేహాదుల కంటె విలక్షణమైనది.

యథోల్ముకాద్విస్ఫులింగాద్ధూమాదపి స్వసంభవాత్ ।
అప్యాత్మత్వేనాభిమతాద్యథాగ్నిః పృథగుల్ముకాత్ ॥ 40

యథా = ఏ విధముగానైతే, అగ్నిః = అగ్ని, ఆత్మత్వేన = తానే యన్నట్లు, అభిమతాత్ అపి = స్వీకరించబడినప్పటికీ, స్వసంభవాత్ = తన నుండి పుట్టిన, ఉల్ముకాత్ = మండే కట్టెకంటె, విస్ఫులింగాత్ = మిణుగురు కంటె, ధూమాత్ = పొగకంటె, యథా = ఏ విధముగానైతే, ఉల్ముకాత్ అపి = నిప్పు ఉన్న కట్టె కంటె, పృథక్ = వేరుగానున్నదో.

మండే కట్టెయొక్క మంట, మంట ఆరినా ఉండే నిప్పు, మిణుగురులు, పొగ అనునవి అగ్నినుండి పుట్టినవే. అవి అన్నీ అగ్నిగనే పరిగణించబడుచున్నవి. కాని, వాస్తవములో అగ్ని వీటికంటె విలక్షణముగా నున్నది.

భూతేంద్రియాంతఃకరణాత్ప్రధానాజ్జీవసంజ్ఞితాత్ ।
ఆత్మా తథా పృథగ్ద్రష్టా భగవాన్ బ్రహ్మసంజ్ఞితః ॥ 41

తథా = అదే విధముగా, భూత-ఇంద్రియ-అంతఃకరణాత్ = పాంచభౌతిక దేహము ఇంద్రియములు అంతఃకరణములకంటె, జీవసంజ్ఞితాత్ = జీవుడనబడే పరిచ్ఛిన్నవ్యక్తి కంటె, ద్రష్టా = సాక్షియగు, ఆత్మా = ఆత్మ, పృథక్ = విలక్షణము, ప్రధానాత్ = ప్రకృతికంటె, బ్రహ్మసంజ్ఞితః = బ్రహ్మ యని వ్యవహరించబడే, భగవాన్ = భగవానుడు, పృథక్ = విలక్షణుడు.

అదే విధముగా పాంచభౌతిక దేహము ఇంద్రియములు అంతఃకరణము అనువాటిని దర్శించే ఆత్మచైతన్యము వాటికంటె విలక్షణము. బ్రహ్మయని పిలువబడే భగవానుడు ప్రకృతికంటె విలక్షణుడు.

సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।

ఈక్షేతానన్యభావేన భూతేష్వివ తదాత్మతామ్ ।। 42

భూతేషు = పంచభూతముల కార్యములయందు, తత్-ఆత్మతాం ఇవ = పాంచభౌతిక స్వరూపమును వలె, సర్వభూతేషు = సకలపదార్థముల యందు, ఆత్మానమ్ = తనను, సర్వభూతాని = సకలపదార్థములను, ఆత్మని చ = ఆత్మయందు కూడ, ఈక్షేత = దర్శించవలెను.

పంచభూతముల కార్యములగు ఘటాదులను పరిశీలించినచో, అవి వాస్తవములో పంచభూతములేనని స్పష్టమగును. అదే విధముగా, జ్ఞాని సకలపదార్థములు ఆత్మస్వరూపుడగు తనయందే గలవనియు, ఆత్మ రూపుడగు తాను సకలపదార్థములయందు వ్యాపించియున్నాననియు తెలుసుకొనును.

స్వయోనిషు తథా జ్యోతిరేకం నానా ప్రతీయతే ।
యోనీనాం గుణవైషమ్యాత్తథాఽఽత్మా ప్రకృతౌ స్థితః ।। 43

ఏకమ్ = ఒకే ఒక, జ్యోతిః = తేజస్సు, స్వయోనిషు = తాను ప్రకటమయ్యే కట్టె మొదలగు స్థానములయందు, యోనీనామ్ = అభివ్యక్తిస్థానములయొక్క, గుణవైషమ్యాత్ = గుణములలోని హెచ్చుతగ్గుల వలన, తథా నానా = అనేకమా యన్నట్లు, ప్రతీయతే = కానవచ్చుచున్నదో, తథా = అదే విధముగా, ప్రకృతౌ = ప్రకృతికార్యమగు దేహాదియందు, స్థితః = ఉన్న, ఆత్మా = ఆత్మ, యోనీనామ్ = ఉపాధులయొక్క, గుణవైషమ్యాత్ = సత్త్వరజస్తమోగుణములయందలి హెచ్చుతగ్గులచే, నానా = అనేకముగా, ప్రతీయతే = భాసించుచున్నది.

తేజస్సు ఒక్కటియే. కాని, అది ప్రకటమయ్యే కట్టె మొదలగు వాటి యందు పొట్టి పొడవు మొదలగు హెచ్చుతగ్గులుండుటచే, తేజస్సు (అగ్ని) అనేకరకములుగా నున్నట్లు భాసించును. అదే విధముగా, బ్రహ్మ-ఆత్మ ఒక్కటియే. కాని, అది అభివ్యక్తమయ్యే ప్రకృతికార్యములగు దేహాదుల యందు సత్త్వరజస్తమోగుణముల పాళ్లలో హెచ్చుతగ్గులు ఉన్నవి. కావున నే, వివిధములగు ఉపాధులలో ఆత్మ భిన్నమా యన్నట్లు కానవచ్చును.

తస్మాదిమాం స్వాం ప్రకృతిం దైవీం సదసదాత్మికామ్ ।

దుర్విభావ్యాం పరాభావ్య స్వరూపేణావతిష్ఠతే ॥ 44

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
అష్టావింశోఽధ్యాయః ॥

తస్మాత్ = కావున, దైవీమ్ = శ్రీహరియొక్క మాయాశక్తి రూపమైనది, సత్-అసత్-ఆత్మికామ్ = కార్య కారణముల రూపములో పరిణమించినది, దుర్విభావ్యామ్ = నిరూపించ శక్యము కానిది, స్వామ్ = తనను పట్టుకొనియున్నది అగు, ప్రకృతిమ్ = ప్రకృతిని, పరాభావ్య = తిరస్కరించి, స్వరూపేణ = తన యథార్థరూపముచే, అవతిష్ఠతే = నిలిచియుండును.

ఈ ప్రకృతి భగవానుని మాయాశక్తియే. ఇదియే కార్యకారణముల రూపముగా పరిణమించి జీవుని మోహింపజేయుచున్నది. కావున, భక్తుడు దీనిని త్రోసిపుచ్చి తన బ్రహ్మ-ఆత్మస్వరూపమునందు ప్రతిష్ఠితుడై యుండవలెను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
ఇరువది ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (28).

* * * * *

# అథ ఏకోనత్రింశోऽధ్యాయః

## భక్తిలోని మర్మములు - కాల మహిమ

దేవహూతిరువాచ ।

లక్షణం మహదాదీనాం ప్రకృతేః పురుషస్య చ ।
స్వరూపం లక్ష్యతేऽమీషాం యేన తత్పారమార్థికమ్ ॥ 1

యథా సాంఖ్యేషు కథితం యన్మూలం తత్ప్రచక్షతే ।
భక్తియోగస్య మే మార్గం బ్రూహి విస్తరశః ప్రభో ॥ 2

దేవహూతిః = దేవహూతి, ఉవాచ = పలికెను, ప్రభో = ఓ ప్రభూ!, మహత్-ఆదీనామ్ = మహత్తు మొదలగువాటికి, ప్రకృతేః = ప్రకృతికి, పురుషస్య చ = పురుషునకు, లక్షణమ్ = లక్షణము, సాంఖ్యేషు = సాంఖ్యశాస్త్రమునందు ఏది గలదో, యేన = దేనిచే, అమీషామ్ = వీటియొక్క, పారమార్థికమ్ = వాస్తవికమగు, స్వరూపమ్ = స్వరూపము, లక్ష్యతే = తెలియబడుచున్నదో, తత్ = అది, కథితమ్ = చెప్పబడినది, యత్-మూలమ్ = దేనికి సాధనమని, ప్రచక్షతే = చెప్పుచున్నారో అట్టి, భక్తియోగస్య = భక్తియోగము యొక్క, మార్గమ్ = మార్గమును, మే = నా కొరకు, విస్తరశః = విస్తారముగా, బ్రూహి = చెప్పుము.

దేవహూతి ఇట్లు పలికెను --- ఓ ప్రభూ! మహత్తు మొదలగు తత్త్వములు, ప్రకృతి, పురుషుడు అనువాటి లక్షణమును సాంఖ్యశాస్త్రపద్ధతిలో నీవు నాకు చెప్పితివి. ఈ లక్షణములను బట్టి వారి పరమార్థ స్వరూపమును తెలియవచ్చును. ఈ జ్ఞానము భక్తియోగమునకు సాధనమని పెద్దలు చెప్పుచున్నారు గదా! నాకు నీవు ఆ భక్తియోగముయొక్క మార్గమును విస్తారముగా చెప్పుము.

విరాగో యేన పురుషో భగవన్ సర్వతో భవేత్ ।
ఆచక్ష్వ జీవలోకస్య వివిధా మమ సంసృతీః ॥ 3

భగవన్ = ఓ భగవానుడా!, యేన = దేనిచే, పురుషః = సాధకుడు, సర్వతః = అంతటా, విరాగః = తొలగిన ఆసక్తి గలవాడు, భవేత్ = అగునో, జీవలోకస్య = జీవసమూహముయొక్క, వివిధాః = అనేకరకముల, సంసృతీః = సంసారగతులను, మమ = నాకు, ఆచక్ష్వ = చెప్పుము.

ఓ భగవన్! అట్టి వర్ణనము వలన సాధకుడు సర్వమునందు తొలగిన ఆసక్తి గలవాడగును. జననమరణప్రవాహరూపమగు ఈ సంసారములో జీవులు పొందే వివిధగతులను కూడ నాకు చెప్పుము.

కాలస్యేశ్వరరూపస్య పరేషాం చ పరస్య తే ।
స్వరూపం బత కుర్వంతి యద్ధేతోః కుశలం జనాః ॥ 4

పరేషాం చ = లోకేశ్వరులగు బ్రహ్మాదులకు కూడ, పరస్య = నియామకమగు, తే = నీ స్వరూపమైన, ఈశ్వరరూపస్య = ఈశ్వరుడే స్వరూపముగా గల, కాలస్య = కాలముయొక్క, స్వరూపమ్ = స్వరూపమును గురించి (చెప్పుము), యత్-హేతోః = దేని కారణముగా, జనాః = జనులు, కుశలమ్ = పుణ్యకార్యమును, కుర్వంతి బత = చేయుచున్నారో.

లోకేశ్వరులగు బ్రహ్మాదులను కూడ నియమించే కాలము సర్వేశ్వరుడవగు నీకంటె భిన్నముగా లేదు. దాని ప్రభావము చేతనే, జనులు పుణ్యములను చేయుచున్నారు. దాని స్వరూపమును నాకు చెప్పుము.

లోకస్య మిథ్యాభిమతేరచక్షుషః
చిరం ప్రసుప్తస్య తమస్యనాశ్రయే ।
శ్రాంతస్య కర్మస్వనువిద్ధయా ధియా
త్వమావిరాసీః కిల యోగభాస్కరః ॥ 5

మిథ్యా-అభిమతేః = మిథ్యారూపములగు దేహాదులయందు ఆత్మాభిమానము కలిగినట్టియు, అచక్షుషః = జ్ఞానము లేనట్టియు, చిరమ్

= చిరకాలము, అనాశ్రయే = అపారమగు, తమసి = అజ్ఞానకార్యమగు సంసారమునందు, ప్రసుప్తస్య = నిద్రించుచున్నట్టియు, కర్మసు = కర్మల యందు, అనువిద్ధయా = తగుల్కొన్న, ధియా = బుద్ధితో, శ్రాంతస్య = అల సిపోయిన, లోకస్య = మానవునకు, యోగభాస్కరః = జ్ఞానసూర్యుడవగు, త్వమ్ = నీవు, ఆవిరాసీః కిల = ఆవిర్భవించితివి గదా!

మానవుడు మిథ్యారూపములగు దేహాదులయందు ఆత్మబుద్ధి గలవాడై జ్ఞానవిహీనుడై అజ్ఞానకార్యమగు సంసారమనే చీకటిలో చిరకాల మునుండి నిద్రించుచున్నాడు. ఆతడు కర్మలయందు ఆసక్తమైన బుద్ధిచే అలసి సొలసి యుండగా, జ్ఞానసూర్యుడవగు నీవు ఆవిర్భవించితివి.

మైత్రేయ ఉవాచ ।
ఇతి మాతుర్వచః శ్లక్ష్ణం ప్రతినంద్య మహామునిః ।
ఆబభాషే కురుశ్రేష్ఠ ప్రీతస్తాం కరుణార్దితః ।। 6

కురుశ్రేష్ఠ = కురువంశశ్రేష్ఠుడవగు ఓ విదురా!, ఇతి = ఈ విధమైన, మాతుః = తల్లియొక్క, శ్లక్ష్ణమ్ = మధురమగు, వచః = వచనమును, ప్రతినంద్య = అభినందించి, మహామునిః = కపిల మహాముని, ప్రీతః = సంతసించినవాడై, కరుణా-అర్దితః = కరుణచే ద్రవించినవాడై, తామ్ = ఆమెను గురించి, ఆబభాషే = పలికెను.

మైత్రేయుడు ఇట్లు పలికెను --- కురువంశ శ్రేష్ఠుడవగు ఓ విదురా! తల్లి పలికిన ఈ మధుగమగు వచనములను విని కపిల మహాముని సంతోషించెను. ఆయన హృదయము కరుణతో ద్రవించెను. ఆయన ఆమెను అభినందించి ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
భక్తియోగో బహువిధో మార్గైర్భామిని భావ్యతే ।
స్వభావగుణమార్గేణ పుంసాం భావో విభిద్యతే ।। 7

భామిని = అమ్మా!, భక్తియోగః = భక్తియోగము, మార్గైః = విశిష్టప్ర కారములచే, బహువిధః = అనేకభేదములు గలదిగా, భావ్యతే = తెలియబ

డుచున్నది, పుంసామ్ = మానవుల, భావః = అభిప్రాయము, స్వభావగుణ మార్గేణ = స్వభావము మరియు గుణములు అనువాటి భేదముచే, భిద్యతే = వేర్వేరుగా నున్నది.

అమ్మా! భక్తియోగములో మహాత్ములు అనేకభేదములను అంగీకరించుచున్నారు. స్వభావము, గుణములు అను అంశములను బట్టి మానవుల అభిప్రాయములు వేర్వేరుగా నున్నవి.

అభిసంధాయ యో హింసాం దంభం మాత్సర్యమేవ వా ।
సంరంభీ భిన్నదృగ్భావం మయి కుర్యాత్స తామసః ॥ 8

భిన్నదృక్ = భేదదర్శనము గల, యః = ఎవడైతే, హింసామ్ = హింసను గాని, దంభమ్ = దంభమును గాని, మాత్సర్యం ఏవ వా = మాత్సర్యమునే గాని, అభిసంధాయ = సంకల్పించి, సంరంభీ = కోపము గలవాడై, మయి = నాయందు, భావమ్ = భక్తిని, కుర్యాత్ చేయునో, సః = వాడు, తామసః = తమోగుణప్రధానుడు.

తాను, పరాయి అనే భేదమే సత్యమని భావించే ఏ మానవుడు ఇతరులకు హింసను గాని, లేక తాను గొప్ప ధర్మాత్ముడననే బడాయిని గాని, ఇతరుల మేలును చూడలేని తనమును గాని సంకల్పించి నాయందు భక్తిని చేసినచో, అట్టి కోపిష్ఠి తామసభక్తుడనబడును.

విషయానభిసంధాయ యశ ఐశ్వర్యమేవ వా ।
అర్చాదావర్చయేద్యో మాం పృథగ్భావస్స రాజసః ॥ 9

విషయాన్ = ఇంద్రియభోగములను గాని, యశః = కీర్తిని గాని, ఐశ్వర్యం ఏవ వా = సంపదనే గాని, అభిసంధాయ = సంకల్పించి, పృథక్-భావః = భేదమును దర్శించే, యః = ఎవడైతే, అర్చా-ఆదౌ = ప్రతిమ మొదలగు వాటియందు, మామ్ = నన్ను, అర్చయేత్ = పూజించునో, సః = ఆతడు, రాజసః = రజోగుణప్రధానుడు.

ఎవడైతే తనకు నాకు భేదమును స్వీకరించి, ఇంద్రియభోగములు కీర్తి సంపద మొదలగు వాటిని పొందాలనే ఆకాంక్షతో ప్రతిమ మొదలగువాటియందు నన్ను ఆరాధించునో, అట్టివాడు రాజసభక్తుడనబడును.

కర్మనిర్హారముద్దిశ్య పరస్మిన్ వా తదర్పణమ్ ।
యజేద్యష్టవ్యమితి వా పృథగ్భావస్స సాత్త్వికః ॥ 10

కర్మనిర్హారమ్ = పాపక్షయమును గాని, వా = లేదా, పరస్మిన్ = పరమేశ్వరునియందు, తత్-అర్పణమ్ = ఆ కర్మను అర్పించుటను గాని, ఉద్దిశ్య = ఉద్దేశించి, యష్టవ్యం ఇతి వా = చేయవలసిన విధి యున్నదని గాని, పృథక్-భావః = భేదభావము గలవాడు, యజేత్ = వేదోక్తకర్మను చేయునో, సః = అట్టివాడు, సాత్త్వికః = సత్త్వగుణప్రధానుడు.

పాపక్షయము కొరకు గాని, లేదా కర్మను పరమేశ్వరునకు అర్పించుట కొరకు గాని, లేదా కర్మ విధించబడినది గనుక చేయవలసినదే అని గాని ఎవడైతే పూజాదికమును భేదభావనతో చేయునో, అట్టి భక్తుడు సాత్త్వికభక్తుడనబడును.

మద్గుణశ్రుతిమాత్రేణ మయి సర్వగుహాశయే ।
మనోగతిరవిచ్ఛిన్నా యథా గంగాంభసోఽంబుధౌ । 11

లక్షణం భక్తియోగస్య నిర్గుణస్య హ్యుదాహృతమ్ ।
అహైతుక్యవ్యవహితా యా భక్తిః పురుషోత్తమే ॥ 12

మత్-గుణశ్రుతిమాత్రేణ = నా గుణములను విన్నంత మాత్రాన, సర్వగుహా-ఆశయే = సకలప్రాణుల బుద్ధిగుహలో సాక్షిరూపముగానుండే, మయి = నాయందు, గంగా-అంభసః = గంగాజలమునకు, అంబుధౌ యథా = సముద్రమునందు వలె, అవిచ్ఛిన్నా = వ్యవధానము లేని, మనోగతిః = మనస్సుయొక్క సంచారము, నిర్గుణస్య = నిర్గుణమగు, భక్తియోగస్య = భక్తియోగముయొక్క, లక్షణమ్ = లక్షణమని, ఉదాహృతమ్ = చెప్పబడినది, యా = ఏ, పురుషోత్తమే = పురుషోత్తముడగు శ్రీహరియంద

లి, భక్తిః = భక్తి, అహైతుకీ = ఫలాభిలాష లేనిదో, అవ్యవహితా = భేదదృష్టి లేనిదో.

నా గుణములను విన్నంత మాత్రాన భక్తుని మనస్సు, గంగాప్రవాహము సముద్రములో కలిసే తీరున, సకలప్రాణుల బుద్ధిగుహయందు సాక్షిరూపముగానుండే నాయందు నిరంతరముగా సంచరించును. భక్తునకు నాయందు గల ఆ ప్రేమకు ఫలాభిలాష కారణము కాదు. భక్తుడు నన్ను తన ఆత్మకంటె అభిన్నముగా దర్శించును. అట్టి భక్తి నిర్గుణభక్తియోగముయొక్క లక్షణము.

సాలోక్యసార్ష్టిసామీప్యసారూప్యైకత్వమప్యుత ।
దీయమానం న గృహ్ణంతి వినా మత్సేవనం జనాః ॥ 13

జనాః = అట్టి నిర్గుణభక్తులు, మత్-సేవనం వినా నా సేవను మినహాయించి, దీయమానమ్ = ఈయబడుచున్న, సాలోక్యసార్ష్టిసామీప్యసారూప్య-ఏకత్వం అపి ఉత = సాలోక్యము సార్ష్టి సామీప్యము సారూప్యము సాయుజ్యము అనువాటిని కూడ, న గృహ్ణంతి = స్వీకరించరు.

నిర్గుణభక్తులు కేవలము నా సేవయందు మాత్రమే ప్రీతిని కలిగియుందురు. సాలోక్యము (శ్రీహరితో ఒకే లోకమునందు ఉండుట), సార్ష్టి (శ్రీహరితో సమానమగు ఐశ్వర్యమును కలిగియుండుట), సామీప్యము (శ్రీహరికి సమీపములోనుండుట), సారూప్యము (శ్రీహరితో సమానమగు రూపమును కలిగియుండుట), సాయుజ్యము (శ్రీహరిలో ఐక్యమగుట) అనే ఫలములను ఇచ్చిననూ వారు తీసుకోరు.

స ఏవ భక్తియోగాఖ్య ఆత్యంతిక ఉదాహృతః ।
యేనాతివ్రజ్య త్రిగుణం మద్భావాయోపపద్యతే ॥ 14

సః = అట్టి, భక్తియోగ-ఆఖ్యః = భక్తియోగమని ప్రసిద్ధి చెందినది యే, ఆత్యంతికః = సర్వోత్కృష్టమగు స్థాయిని చేరినదియని, ఉదాహృతః = చెప్పబడినది, యేన = దేనిచే, త్రిగుణమ్ = త్రిగుణాత్మకమగు సంసార

మును, అతిక్రమ్య = అతిక్రమించి, మత్-భావాయ = నాలో ఐక్యమగుటకు, ఉపపద్యతే = అర్హుడగునో.

అట్టి భక్తియోగమే పరమపురుషార్థమని చెప్పబడినది. దాని వలన సాధకుడు సత్త్వరజస్తమోగుణాత్మకమగు సంసారమునుండి విముక్తుడై నాలో ఐక్యమగును.

నిషేవితేనానిమిత్తేన స్వధర్మేణ మహీయసా ।
క్రియాయోగేన శస్తేన నాతిహింస్రేణ నిత్యశః ॥ 15

మద్ధిష్ణ్యదర్శనస్పర్శపూజాస్తుత్యభివందనైః ।
భూతేషు మద్భావనయా సత్త్వేనాసంగమేన చ ॥ 16

మహతాం బహుమానేన దీనానామనుకంపయా ।
మైత్ర్యా చైవాత్మతుల్యేషు యమేన నియమేన చ ॥ 17

ఆధ్యాత్మికానుశ్రవణాన్నామసంకీర్తనాచ్చ మే ।
ఆర్జవేనార్యసంగేన నిరహంక్రియయా తథా ॥ 18

మద్ధర్మణో గుణైరేతైః పరిసంశుద్ధ ఆశయః ।
పురుషస్యాంజసాభ్యేతి శ్రుతమాత్రగుణం హి మామ్ ॥ 19

నిషేవితేన = సేవించబడిన, అనిమిత్తేన = ఫలతృష్ణ లేని, మహీయసా = గొప్పదియగు, స్వధర్మేణ = నిత్యనైమిత్తిక కర్మల అనుష్ఠానముచే, నిత్యశః = ప్రతినిత్యము, శస్తేన = ప్రశంసించదగిన, నాతిహింస్రేణ = అధికమగు హింస లేని, క్రియాయోగేన = కర్మయోగముచే, మత్-ధిష్ణ్యదర్శనస్పర్శపూజాస్తుతి-అభివందనైః = నా మూర్తిని చూచుట స్పృశించుట పూజించుట స్తుతించుట మరియు నమస్కరించుటచే, భూతేషు = ప్రాణుల యందు, మద్భావనయా = నన్ను భావించుటచే, సత్త్వేన = ధైర్యముచే, అసంగమేన చ = వైరాగ్యముచే, మహతామ్ = మహాత్ములకు, బహుమానేన = ఆదరించుటచే, దీనానామ్ = దీనులకు, అనుకంపయా = దయను చూపుటచే, ఆత్మతుల్యేషు = తనతో సమానమైనవారియందు, మైత్ర్యా చ

ఏవ = మైత్రిచే, యమేన = యమముచే, నియమేన = నియమముచే, ఆధ్యాత్మిక-అనుశ్రవణాత్ = అధ్యాత్మశాస్త్రమును నిత్యము వినుటవలన, మే = నా, నామసంకీర్తనాత్ చ = నామములను కీర్తించుట వలన, ఆర్జవేన = ఋజుస్వభావముచే, ఆర్యసంగేన = సత్పురుషులతోడి సంగముచే, తథా = అదే విధముగా, నిరహంక్రియయా = అహంకారము లేకుండుటచే, మత్-ధర్మణః = నా ధర్మములను అనుష్ఠించే, పురుషస్య = పురుషునకు, ఏతైః = ఈ, గుణైః = గుణములచే, పరిసంశుద్ధః = మిక్కిలి శుద్ధమైన, ఆశయః = మనస్సు, అంజసా = తేలికగా, శ్రుతమాత్రగుణమ్ = కేవలము వినబడిన గుణములు గల, మామ్ = నన్ను, అభ్యేతి హి = పొందును గదా!

సాధకుడు శ్రేష్ఠమగు స్వధర్మమును ఫలతృష్ణ లేకుండగా అనుష్ఠించవలెను. నిత్యము పువ్వులను కోయుట మొదలగువాటికంటె అధికమగు హింసకు తావులేని ప్రశస్తమైన కర్మయోగమునను‌ష్ఠించవలెను. నా మూర్తిని దర్శించి స్పృశించి పూజించి స్తుతించి నమస్కరించవలెను. సకల ప్రాణులయందు ఆత్మరూపముగానున్న నన్ను దర్శించవలెను. ధైర్యముతో వైరాగ్యమును కలిగియుండవలెను. పెద్దలను ఆదరించవలెను. దీనులపై దయను చూపవలెను. తన సాటివారితో మైత్రిని నెరపవలెను. అహింస, సత్యము, అస్తేయము (పరధనమును కోరకుండుట), బ్రహ్మచర్యము, అపరిగ్రహము (భోగముల వెనుక పడకుండుట) అను యమములను, శౌచము (ఆంతర బాహ్యములయందు శుద్ధి), సంతుష్టి, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరశరణాగతి అనే నియమములను పాటించవలెను. అధ్యాత్మశాస్త్రమును శ్రవణము చేయవలెను. నా నామములను కీర్తించవలెను. ఋజుస్వభావము కలిగి సత్పురుషులతో సంగమును చేయవలెను. అహంకారమును విడనాడవలెను. నా ధర్మములను (భాగవతధర్మములను) అనుష్ఠించే సాధకునకు ఈ గుణములచే మనస్సు చాల పరిశుద్ధమై, నా గుణములను వింటూనే తేలికగా నాయందు లగ్నమగును.

యథా వాతరథో ఘ్రాణమావృంక్తే గంధ ఆశయాత్ ।
ఏవం యోగరతం చేత ఆత్మానమవికారి యత్ ॥ 20

యథా ఏ విధముగానైతే, వాతరథః = గాలిచే కొనిపోబడే, గంధః = గంధము, ఆశయాత్ = తన స్థానమునుండి, ఘ్రాణమ్ = ముక్కును, ఆవృంక్తే = పొందునో, ఏవమ్ = ఇదే విధముగా, యోగరతమ్ = భక్తియోగ మునందు ప్రీతిగల, అవికారి = విశుద్ధమైన, యత్ = ఏ, చేతః = మనస్సు గలదో అది, ఆత్మానమ్ = ఆత్మను పొందును.

పరిమళము తన స్థానమునుండి గాలి ద్వారా ముక్కునకు తాకును. అదే విధముగా భక్తియోగముచే విశుద్ధమైన మనస్సు తన మూలమగు ఆత్మను చేరును (ఆత్మయందు విలీనమగును).

అహం సర్వేషు భూతేషు భూతాత్మావస్థితస్సదా ।
తమవజ్ఞాయ మాం మర్త్యః కురుతేఽర్చావిడంబనమ్ ।। 21

అహమ్ = నేను, సర్వేషు = సకలములైన, భూతేషు = ప్రాణుల యందు, సదా = నిత్యము, భూత-ఆత్మా = ప్రాణులకు ఆత్మనై, అవస్థితః = నిలిచియున్నాను, తమ్ = అట్టి, మామ్ = నన్ను, అవజ్ఞాయ = తిరస్కరించి, మర్త్యః = మానవుడు, అర్చావిడంబనమ్ = పూజ అనే అపహాస్యమును, కురుతే = చేయుచున్నాడు.

నేను సకలప్రాణులలో నిత్యము ఆత్మరూపుడనై నిలిచియున్నాను. అట్టి నన్ను కాదని త్రోసిపుచ్చి ఎవడైతే ప్రతిమయందు నన్ను పూజించునో, ఆ పూజ అపహాస్యము, మోసము తక్క మరియొకటి కాదు.

యో మాం సర్వేషు భూతేషు సంతమాత్మానమీశ్వరమ్ ।
హిత్వార్చాం భజతే మౌఢ్యాద్భస్మన్యేవ జుహోతి సః ।। 22

యః = ఎవడైతే, సర్వేషు = సకలములైన, భూతేషు = ప్రాణుల యందు, ఆత్మానమ్ = ఆత్మరూపునిగా, ఈశ్వరమ్ = అంతర్యామిగా, సంతమ్ = ఉన్న, మామ్ = నన్ను, హిత్వా = ఉపేక్షించి, అర్చామ్ = ప్రతిమను, భజతే = సేవించుచున్నాడో, సః = అట్టివాడు, మౌఢ్యాత్ = మూర్ఖత్వము వలన, భస్మని ఏవ = బూడిదయందు మాత్రమే, జుహోతి = హోమమును చేయుచున్నాడు.

నేను సకలప్రాణులలో ఆత్మరూపునిగానుండి దేహేంద్రియాదు లను నియమించుచున్నాను. అట్టి నన్ను ఉపేక్ష చేసి ప్రతిమను మాత్రమే సేవించువాడు చేసే పూజ బూడిదలో చేసిన హోమము వంటిది మాత్రమే.

ద్విషతః పరకాయే మాం మానినో భిన్నదర్శినః ।
భూతేషు బద్ధవైరస్య న మనశ్శాంతిమృచ్ఛతి ॥ 23

పరకాయే = ఇతరప్రాణుల దేహమునందున్న, మామ్ = నన్ను, ద్విషతః = ద్వేషించునట్టియు, మానినః = గర్వము కలిగినట్టియు, భిన్నద ర్శినః = భేదమును దర్శించునట్టియు, భూతేషు = ప్రాణులయందు, బద్ధవై రస్య = దృఢమగు వైరము గలవానికి, మనః = మనస్సు, శాంతిమ్ = శాంతి ని, న ఋచ్ఛతి = పొందదు.

భేదమే యథార్థమని భావించి గర్వియై ఇతరప్రాణులయందు వైర మును బూని ద్వేషించు వ్యక్తి ఆ ప్రాణుల దేహములయందు ఆత్మరూపు డనై యున్న నన్నే ద్వేషించుచున్నాడు. వానికి మనశ్శాంతి లభించదు.

అహముచ్చావచైర్ద్రవ్యైః క్రియయోత్పన్నయానఘే ।
నైవ తుష్యేఽర్చితోఽర్చాయాం భూతగ్రామావమానినః ॥ 24

అనఘే = ఓ పుణ్యాత్మురాలా!, ఉచ్చావచైః = అనేకప్రకారములైన, ద్రవ్యైః = పదార్థములచే, ఉత్పన్నయా = సంపాదించబడిన, క్రియయా = విధివిధానముచే, అర్చాయామ్ = మూర్తియందు, అర్చితః = పూజించబడి న నేను, భూతగ్రామ-అవమానినః = ప్రాణిసమూహములను అవమానించు వానికి, న ఏవ తుష్యే = సంతోషించను.

ఒకడు అనేకవిధముల సామగ్రితో విధివిధానముగా నన్ను మూర్తి యందు ఆరాధించవచ్చును. కాని ఆతడు ప్రాణిసమూహమును అవమా నించువాడైనచో, ఆ పూజ ఎంత గొప్పదైనా, నన్ను సంతోషపెట్టదు.

అర్చాదావర్చయేత్తావదీశ్వరం మాం స్వకర్మకృత్ ।
యావన్న వేద స్వహృది సర్వభూతేష్వవస్థితమ్ ॥ 25

స్వకర్మకృత్ = స్వధర్మమునసుష్ఠించు మానవుడు, యావత్ = ఎంతవరకైతే, స్వహృది = తన హృదయమునందు, సర్వభూతేషు = సకల ప్రాణులయందు, అవస్థితమ్ = నిలిచియున్న, ఈశ్వరమ్ = ఈశ్వరుడనగు, మామ్ = నన్ను, న వేద = తెలియడో, తావత్ = అంతవరకు, అర్చా-ఆదౌ = మూర్తి మొదలగువాటియందు, అర్చయేత్ = పూజించవలెను.

మానవుడు తన కర్తవ్యమును చేస్తూ, తన హృదయములో సకల ప్రాణులలో ఈశ్వరుడనగు నేనే నిలిచియున్నాననే సత్యమును గుర్తించనంతవరకు మూర్తి మొదలగు వాటియందు నన్ను పూజించవలెను.

ఆత్మనశ్చ పరస్యాపి యః కరోత్యంతరోదరమ్ ।
తస్య భిన్నదృశో మృత్యుర్విదధే భయముల్బణమ్ ॥ 26

యః = ఎవడైతే, ఆత్మనః = తనకు, పరస్య అపి = ఇతరునకు (పరమాత్మకు) కూడ, అంతరా = భేదమును, అరం ఉత్ = అల్పమైననూ, కరోతి = చేయునో, భిన్నదృశః = భేదమును దర్శించే, తస్య = వానికి, మృత్యుః = మృత్యురూపుడనగు నేను, ఉల్బణమ్ = తీవ్రమగు, భయమ్ = భయమును, విదధే = కలిగించెదను.

భేదమును దర్శించే స్వభావము గల వ్యక్తి తనకు ఇతరులకు మధ్యలో, తనకు పరమాత్మకు మధ్యలో భేదమును చూచును. ఆ విధముగా అల్పమైననూ భేదమును భావన చేయువానికి మృత్యురూపుడనగు నేను తీవ్రమగు భయమును కలిగించెదను.

అథ మాం సర్వభూతేషు భూతాత్మానం కృతాలయమ్ ।
అర్హయేద్దానమానాభ్యాం మైత్ర్యాభిన్నేన చక్షుషా ॥ 27

అథ = కావున, సర్వభూతేషు = సకలప్రాణులయందు, కృత-ఆలయమ్ = చేయబడిన నివాసము కలిగినట్టియు, భూత-ఆత్మానమ్ = ప్రాణుల ఆత్మనైన, మామ్ = నన్ను, దానమానాభ్యామ్ = దానముచే మరియు సత్కారముచే, మైత్ర్యా = స్నేహభావముతో, అభిన్నేన = భేదము లేని, చక్షుషా = దర్శనముతో, అర్హయేత్ = పూజించవలెను.

నేను సకలప్రాణులలో ఆత్మరూపముగా నివసించియున్నాను. కావున భక్తుడు సకలప్రాణులయందు సమదృష్టిని కలిగియుండవలెను. తన కంటె గొప్పవారిని సత్కరించవలెను. తనకంటె తక్కువ వారికి దానమును చేయవలెను. తనతో సమానమైన వారితో మైత్రిని నెరపవలెను. ఇట్లు చేసిన చో, అది నన్ను పూజించినట్లే యగును.

జీవాః శ్రేష్ఠా హ్యజీవానాం తతః ప్రాణభృతశ్శుభే ।
తతస్సచిత్తాః ప్రవరాస్తతశ్చేంద్రియవృత్తయః ॥ 28

శుభే = ఓ శుభస్వరూపురాలా!, అజీవానామ్ = ప్రాణము లేనివాటి కంటె, జీవాః = ప్రాణముగలవి, శ్రేష్ఠాః = శ్రేష్ఠమైనవి, తతః = వాటికంటె, ప్రాణభృతః = శ్వాస గలవి, తతః = వాటికంటె, సచిత్తాః = జ్ఞానము గలవి, ప్రవరాః = గొప్పవి, తతః చ = వాటికంటె కూడ, ఇంద్రియవృత్తయః = ఇంద్రియముల వ్యాపారము గలవి.

ఓ శుభస్వరూపురాలా! ప్రాణము లేనివాటికంటె ప్రాణము గల చెట్లు మొదలగునవి గొప్పవి. వాటికంటె ఉచ్ఛ్వాసనిశ్వాస గల జంతువులు గొప్పవి. వాటికంటె మనస్సు గలవి గొప్పవి. వాటికంటె ఇంద్రియవ్యాపారములు గలవి గొప్పవి.

తత్రాపి స్పర్శవేదిభ్యః ప్రవరా రసవేదినః ।
తేభ్యో గంధవిదః శ్రేష్ఠాస్తతశ్శబ్దవిదో వరాః ॥ 29

తత్ర అపి = వాటియందు కూడ, స్పర్శవేదిభ్యః = స్పర్శజ్ఞానము గలవాటికంటె, రసవేదినః = రుచిని తెలుసుకునే ప్రాణులు, ప్రవరాః = గొప్పవి, తేభ్యః = వాటికంటె, గంధవిదః = గంధమును తెలుసుకునే ప్రాణులు, శ్రేష్ఠాః = గొప్పవి, తతః = వాటికంటె, శబ్దవిదః = శబ్దమును తెలుసుకునేవి, వరాః = గొప్పవి.

ఇంద్రియవ్యాపారములు గల ప్రాణులలో కేవలము స్పర్శజ్ఞానము మాత్రమే గల చెట్ల కంటె రసమును కూడ గ్రహించే చేపలు మొదలగునవి గొప్పవి. వాటికంటె గంధమును కూడ గ్రహించే తుమ్మెద మొదల

గునవి గొప్పవి. వాటికంటె శబ్దమును కూడ గ్రహించే పాములు మొదలగు నవి గొప్పవి.

రూపభేదవిదస్తత్ర తతశ్చోభయతోదతః ।
తేషాం బహుపదాః శ్రేష్ఠాశ్చతుష్పాదస్తతో ద్విపాత్ ॥ 30

తత్ర = వాటికంటె, రూపభేదవిదః = రూపములోని తేడాలను తెలుసుకునేవి, తతః = వాటికంటె, ఉభయతః-దతః = క్రింద పైన కూడ దంతములు గలవి, తేషామ్ = పాదములు లేనివాటికంటె, బహుపదాః అనేకపాదములు గలవి, శ్రేష్ఠాః = గొప్పవి, తతః = వాటికంటె, చతుష్పాదః = నాలుగు పాదములు గలది, తతః = దానికంటె, ద్విపాత్ = రెండు పాదములు గల మానవుడు.

వాటికంటె రూపభేదమును కూడ గుర్తించే కాకులు మొదలగునవి గొప్పవి. వాటికంటె క్రింద పైన కూడ దంతములు గల కోతులు మొదలగునవి గొప్పవి. పాదములు లేని సర్పము మొదలగు ప్రాణులకంటె అనేకపాదములు గల తుమ్మెద మొదలగునవి గొప్పవి. వాటికంటె నాలుగు పాదములు గల పశువులు, వాటికంటె రెండు పాదములు గల మానవుడు గొప్పవారు.

తతో వర్ణాశ్చ చత్వారస్తేషాం బ్రాహ్మణ ఉత్తమః ।
బ్రాహ్మణేష్వపి వేదజ్ఞో హ్యర్థజ్ఞోఽభ్యధికస్తతః ॥ 31

తతః = ఆ మానవులలో, చత్వారః = నాలుగు, వర్ణాః = వర్ణములు, తేషామ్ = వారిలో, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, ఉత్తమః = గొప్పవాడు, బ్రాహ్మణేషు అపి = బ్రాహ్మణులయందు కూడ, వేదజ్ఞః = వేదమునెరింగిన వాడు, తతః = వానికంటె, అర్థజ్ఞః = అర్థము తెలిసినవాడు, అభ్యధికః = చాల గొప్ప.

మానవులలో నాలుగు వర్ణములు గొప్పవి. వారిలో బ్రాహ్మణుడు శ్రేష్ఠుడు. బ్రాహ్మణులలో కూడ వేదమునెరింగినవాడు గొప్ప. వేదార్థము తెలిసినవాడు వానికంటె గొప్ప.

అర్థజ్ఞాత్సంశయచ్ఛేత్తా తతః శ్రేయాన్ స్వకర్మకృత్ ।
ముక్తసంగస్తతో భూయానదోగ్ధా ధర్మమాత్మనః ॥ 32

అర్థజ్ఞాత్ = అర్థము తెలిసినవానికంటె, సంశయచ్ఛేత్తా = సంశయమును తీర్చువాడు, తతః = వానికంటె, స్వకర్మకృత్ = తన ధర్మమునను ష్ఠించువాడు, శ్రేయాన్ = గొప్పవాడు, తతః = వానికంటె, ఆత్మనః = తన, ధర్మమ్ = ధర్మమును, అదోగ్ధా = పితుకని, ముక్తసంగః = విడువబడిన సంసారాసక్తి గలవాడు, భూయాన్ = గొప్పవాడు.

కేవలము వేదార్థము తెలిసినవానికంటె దానిలోని సంశయములను తీర్చువాడు గొప్ప. వానికంటె వేదము చెప్పిన విధముగా స్వధర్మమునాచరించువాడు గొప్ప. వానికంటె తన ధర్మమును నిష్కామముగా ఆచరిస్తూ సంసారమునందు ఆసక్తిని విడిచినవాడు గొప్పవాడు.

తస్మాన్మయ్యర్పితాశేషక్రియార్థాత్మా నిరంతరః ।
మయ్యర్పితాత్మనః పుంసో మయి సన్న్యస్తకర్మణః ।
న పశ్యామి పరం భూతమకర్తుస్సమదర్శనాత్ ॥ 33

తస్మాత్ = వానికంటె, మయి = నాయందు, అర్పిత-అశేషక్రియా-అర్థ-ఆత్మా = సమర్పించబడిన సకలకర్మలు కర్మఫలములు దేహాదిసంఘాతము గల, నిరంతరః = భేదభావము లేనివాడు, మయి = నాయందు, అర్పిత-ఆత్మనః = సమర్పించబడిన బుద్ధి గలిగినట్టియు, మయి = నాయందు, సన్న్యస్తకర్మణః = సమర్పించబడిన కర్మలు గలిగినట్టియు, అకర్తుః = కర్త కానట్టియు, సమదర్శనాత్ = సమదృష్టి గల, పుంసః = మానవునికంటె, పరమ్ = గొప్ప, భూతమ్ = ప్రాణిని, న పశ్యామి = నేను కనుటలేదు.

అట్టి ముక్తసంగునికంటె నాయందే అన్ని కర్మలను వాటి ఫలములను మాత్రమే గాక దేహాది సంఘాతమును కూడ సమర్పించి నాతో అభేదమును దర్శించే జ్ఞాని గొప్పవాడు. జ్ఞాని నాయందు తన బుద్ధిని, కర్మలను సమర్పించి, తాను అకర్తృ-ఆత్మస్వరూపుడై సర్వత్ర ఈశ్వరుని దర్శిస్తూ ఉండును. ఈ సృష్టిలో జ్ఞానికంటె గొప్ప ప్రాణి నాకు కానరాదు.

మనసైతాని భూతాని ప్రణమేద్బహు మానయన్ ।
ఈశ్వరో జీవకలయా ప్రవిష్టో భగవానితి ॥ 34

ఈశ్వరః = సర్వశాసకుడగు, భగవాన్ = శ్రీహరి భగవానుడు, జీవకలయా = జీవరూపముగా, ప్రవిష్టః = ప్రవేశించినాడు, ఇతి = ఈ హేతువుచే, ఏతాని = ఈ, భూతాని = ప్రాణులను, బహు = అధికముగా, మానయన్ = ఆదరించువాడై, మనసా = మనస్సుతో, ప్రణమేత్ = ప్రణమిల్లవలెను.

సర్వేశ్వరుడగు శ్రీహరి భగవానుడే ఈ ప్రాణులలో జీవరూపముగా ప్రవేశించి యున్నాడు. కావున, భక్తుడు సకలప్రాణులను అధికముగా ఆదరిస్తూ మనస్సులో వాటికి నమస్కరించవలెను.

భక్తియోగశ్చ యోగశ్చ మయా మానవ్యుదీరితః ।
యయోరేకతరేణైవ పురుషః పురుషం వ్రజేత్ ॥ 35

మానవి = ఓ మనుపుత్రీ!, మయా = నాచే, భక్తియోగః = భక్తియోగము, యోగః చ = అష్టాంగయోగము కూడ, ఉదీరితః = చెప్పబడినది, యయోః = ఏ రెండింటిలో, ఏకతరేణ ఏవ = ఏదో ఒకదానిచే మాత్రమే, పురుషః = మానవుడు, పురుషమ్ = పరమేశ్వరుని, వ్రజేత్ = పొందును.

ఓ మనుపుత్రీ! నేను నీకు భక్తియోగమును, అష్టాంగయోగమును కూడ చెప్పితిని. సాధకుడు ఈ రెండింటిలో ఏ ఒక్కదానిని సాధన చేసినా, ఆ పరమపురుషుని పొందును.

ఏతద్భగవతో రూపం బ్రహ్మణః పరమాత్మనః ।
పరం ప్రధానం పురుషం దైవం కర్మవిచేష్టితమ్ ॥ 36

ఏతత్ = ఇది, భగవతః = భగవంతుడైనట్టియు, బ్రహ్మణః = పరబ్రహ్మ అయినట్టియు, పరమాత్మనః = పరమాత్మయొక్క, రూపమ్ = రూపము, ప్రధానమ్ = ప్రకృతి, పరమ్ = దానికి అతీతమగు, పురుషమ్ = పురుషుడు, కర్మవిచేష్టితమ్ = కర్మల వివిధరూపములకు ఆశ్రయమగు, దైవమ్ = అదృష్టము.

ప్రకృతి, దానికి అతీతుడగు పురుషుడు, జీవుని కర్మల ఫలమునకు ఆశ్రయమగు అదృష్టరూపమగు దైవము అనునవి పరబ్రహ్మ పరమాత్మ భగవానుని రూపములే.

రూపభేదాస్పదం దివ్యం కాల ఇత్యభిధీయతే ।
భూతానాం మహదాదీనాం యతో భిన్నదృశాం భయమ్॥37

రూపభేద-ఆస్పదమ్ = విభిన్నరూపములకు కారణమగు, దివ్యమ్ = భగవానుని అద్భుతప్రభావము, కాలః = కాలము, ఇతి = అని, అభిధీయతే = చెప్పబడుచున్నది, యతః = దేనివలన, మహత్-ఆదీనామ్ = మహత్తు మొదలగు తత్త్వముల అభిమాని దేవతలకు, భిన్నదృశామ్ = భేద దృష్టిగల, భూతానామ్ = ప్రాణులకు, భయమ్ = భయము గలదో.

భగవానుని మాయాశక్తి విభిన్నరూపములు గల ఈ విశ్వముగా ఉదయించుటకు కారణమైన భగవానుని అద్భుతప్రభావమునకే కాలమని పేరు. మహత్తు మొదలగు తత్త్వముల అభిమాని దేవతలతో సహా భేదదృష్టిగల ప్రాణులు ఈ కాలమునకు భయపడుచుందురు.

యోఽన్తః ప్రవిశ్య భూతాని భూతైరత్త్యఖిలాశ్రయః ।
స విష్ణ్వాఖ్యోఽధియజ్ఞోఽసౌ కాలః కలయతాం ప్రభుః ॥ 38

అఖిల-ఆశ్రయః = సర్వమునకు ఆశ్రయమగు, యః = ఏ కాలము, భూతాని = ప్రాణులను, అంతః = లోపల, ప్రవిశ్య = ప్రవేశించి, భూతైః = భూతములచే, అత్తి = భక్షించునో, సః = అట్టి, అసౌ = ఈ, కలయతామ్ = జగత్తును శాసించే బ్రహ్మాదులకు కూడ, ప్రభుః = శాసకమగు, కాలః = కాలమే, అధియజ్ఞః = యజ్ఞముల ఫలమును ఇచ్చే, విష్ణు-ఆఖ్యః = విష్ణువు అనబడువాడు.

సర్వమునకు ఆశ్రయమగు కాలమే ప్రాణుల లోపల ప్రవేశించి పంచభూతముల ద్వారానే వాటిని నశింపజేయును. జగత్తును శాసించే బ్రహ్మాదులను కూడ కాలము శాసించును. ఆ కాలము యజ్ఞఫలదాత అగు విష్ణువే అని చెప్పబడినది.

న చాస్య కశ్చిద్దయితో న ద్వేష్యో న చ బాంధవః ।
ఆవిశత్యప్రమత్తోఽసౌ ప్రమత్తం జనమంతకృత్ ॥ 39

అస్య = ఈ కాలమునకు, కశ్చిత్ = ఒకడు, దయితః = ప్రియమైన వాడు, న = కాదు, ద్వేష్యః = ద్వేషించబడేవాడు, న = లేడు, బాంధవః చ = బంధువు కూడ, న = లేడు, అంతకృత్ = నశింపజేసే, అప్రమత్తః = నిత్యము జాగరూకముగానుండే, అసౌ = ఈ కాలము, ప్రమత్తమ్ = భోగ ములలో మునిగి ఒళ్లు మరిచియున్న, జనమ్ = జనుని, ఆవిశతి = ప్రవేశిం చుచున్నది.

ఈ కాలమునకు ఒకడు ప్రియుడని గాని, మరియొకడు శత్రువని గాని లేరు. దానికి బంధువులు కూడ లేరు. అది అందరినీ సంహరించును. సర్వమును నశింపజేసే ఈ కాలము నిత్యము జాగరూకమై యుండును. ఈ కాలము భోగములలో మునిగి ఒళ్లు మరిచియున్న జనుని ప్రవేశించి నశింపజేయును.

యద్భయాద్వాతి వాతోఽయం సూర్యస్తపతి యద్భయాత్ ।
యద్భయాద్వర్షతే దేవో భగణో భాతి యద్భయాత్ ॥ 40

అయమ్ = ఈ, వాతః = గాలి, యత్-భయాత్ = ఏ కాలము యొక్క భయము వలన, వాతి = వీచుచున్నదో, సూర్యః = సూర్యుడు, యత్-భయాత్ = దేని భయము వలన, తపతి = తపించుచున్నాడో, యత్-భయాత్ = దేని భయము వలన, దేవః = ఇంద్రుడు, వర్షతే = వర్షించుచు న్నాడో, యత్-భయాత్ = దేని భయము వలన, భగణః = నక్షత్రసమూహ ము, భాతి = ప్రకాశించుచున్నదో.

కాలరూపుడగు భగవానుని భయము వలననే గాలి వీచుచున్నది; సూర్యుడు ఎండలు కాయుచున్నాడు; ఇంద్రుడు వర్షించుచున్నాడు; నక్షత్ర ములు ప్రకాశించుచున్నవి.

యద్వనస్పతయో భీతా లతాశ్చౌషధిభిస్సహ ।
స్వే స్వే కాలేఽభిగృహ్ణంతి పుష్పాణి చ ఫలాని చ ॥ 41

వనస్పతయః = చెట్లు, లతాః = తీగలు, ఓషధిభిః సహ = మొక్కలతో సహా, యత్ = దేనివలన, భీతాః = భయపడినవై, స్వే స్వే = తమ తమ, కాలే = కాలమునందు, పుష్పాణి = పుష్పములను, ఫలాని చ = పండ్లను కూడ, అభిగృహ్ణంతి = ప్రకటించుచున్నవో.

చెట్లు, మొక్కలు, తీగలు కాలమునకు భయపడి తమ తమ సమయము వచ్చినప్పుడు పువ్వులను, పండ్లను ఆవిర్భవింప జేయుచున్నవి.

స్రవంతి సరితో భీతా నోత్సర్పత్యుదధిర్యతః ।
అగ్నిరింధే సగిరిభిర్భూర్న మజ్జతి యద్భయాత్ ॥ 42

యతః = దేనివలన, భీతాః = భయపడిన, సరితః = నదులు, స్రవంతి = ప్రవహించుచున్నవో, ఉదధిః = సముద్రము, న ఉత్సర్పతి = చెలియలికట్టను దాటుట లేదో, అగ్నిః = అగ్ని, ఇంధే = మండుచున్నదో, యత్-భయాత్ = దేని భయము వలన, సగిరిభిః = పర్వతములతో కూడిన, భూః = భూమి, న మజ్జతి = మునిగిపోవుట లేదో.

కాలమునకు భయపడి నదులు ప్రవహించుచున్నవి; సముద్రము చెలియలికట్టను దాటకున్నది; అగ్ని మండుచున్నది; పర్వతములతో కూడిన భూమి నీటిలో మునిగిపోకుండ నున్నది.

నభో దదాతి శ్వసతాం పదం యన్నియమాదదః ।
లోకం స్వదేహం తనుతే మహాన్ సప్తభిరావృతమ్ ॥ 43

యత్-నియమాత్ = ఏ కాలముయొక్క నియమము వలన, అదః = ఈ, నభః = ఆకాశము, శ్వసతామ్ = ప్రాణులకు, పదమ్ = స్థానమును, దదాతి = ఇచ్చుచున్నదో, మహాన్ = మహత్తత్త్వము, స్వదేహమ్ = తన దేహమును, సప్తభిః = ఏడు తత్త్వములచే చుట్టువారబడియున్న, లోకమ్ = బ్రహ్మాండముగా, తనుతే = విస్తరించుచున్నదో.

కాలముయొక్క ఆజ్ఞకు లోబడి ఈ ఆకాశము ప్రాణులకు స్థానము నొసగుచున్నది. అటులనే, మహత్తత్త్వము కాలమునకు వశవర్తియై అహం

కారరూపమైన తన శరీరమును ఏడు ఆవరణలతో కూడిన బ్రహ్మాండము రూపములో విస్తరించుచున్నది.

గుణాభిమానినో దేవాస్సర్గాదిష్వస్య యద్భయాత్ ।
వర్తంతేఽనుయుగం యేషాం వశ ఏతచ్చరాచరమ్ ॥ 44

యత్-భయాత్ = ఏ కాలము వలని భయము వలన, గుణ-అభిమానినః = రజస్సత్త్వతమోగుణముల అభిమానులగు, దేవాః = బ్రహ్మవిష్ణురుద్రులు, అనుయుగమ్ = ప్రతికల్పమునందు, అస్య = ఈ జగత్తుయొక్క, సర్గ-ఆదిషు = సృష్టిస్థితిలయములయందు, వర్తంతే = ప్రవర్తిల్లుచున్నారో, ఏతత్ = ఈ, చర-అచరమ్ = స్థావరజంగమాత్మకమగు జగత్తు, యేషామ్ = ఎవరి, వశే = వశములోనున్నదో.

కాలమునకు భయపడియే రజస్సత్త్వతమోగుణముల అభిమానులగు బ్రహ్మవిష్ణురుద్రులు ప్రతి కల్పమునందు క్రమముగా ఈ జగత్తుయొక్క సృష్టిస్థితిలయములనే కార్యములయందు ప్రవర్తిల్లుచున్నారు. స్థావరజంగమాత్మకమగు ఈ జగత్తు ఆ దేవతల వశములోనున్నది.

సోఽనంతోఽంతకరః కాలోఽనాదిరాదికృదవ్యయః ।
జనం జనేన జనయన్మారయన్మృత్యునాంతకమ్ ॥ 45

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
ఏకోనత్రింశోఽధ్యాయః ॥

అనంతః = అంతము లేనిది, అంతకరః = సర్వమును అంతము చేయునది, అనాదిః = ఆది లేనిది, ఆదికృత్ = సర్వమునకు ఆరంభమును కలిగించునది, అవ్యయః = వికారములు లేనిది అగు, సః = అట్టి, కాలః = కాలము, జనమ్ = జనుని, జనేన = జనుని ద్వారా, జనయన్ = పుట్టించునదై, మృత్యునా = మృత్యువుచే, అంతకమ్ = చంపుదానిని కూడ, మారయన్ = చంపించునది.

సర్వమునకు అంతమును కలిగించు ఈ కాలము స్వయముగా అంతము లేనిది. సర్వమునకు జన్మనిచ్చే ఈ కాలము స్వయముగా ఆది లేనిది. కాలమునకు వృద్ధి, హ్రాసము మొదలగు వికారములు లేవు. అది తండ్రి మొదలగు జనునిచే పుత్రుడు మొదలగు జనునకు జన్మనిప్పించును. మృత్యువు ద్వారా అది ఇతరులను చంపే పెద్దపులి మొదలగు వాటికి, యమధర్మరాజునకు కూడ మరణమునిప్పించును.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడప స్కంధములో
ఇరువది తొమ్మిదవ అధ్యాయము ముగిసినది (**29**).

* * * * *

# అథ త్రింశోऽధ్యాయః

## దేహాభిమానులగు జీవుల అధోగతిని వర్ణించుట

కపిల ఉవాచ ।
తస్యైతస్య జనో నూనం నాయం వేదోరువిక్రమమ్ ।
కాల్యమానోऽపి బలినో వాయోరివ ఘనావలిః ॥

కపిలః = కపిల భగవానుడు, ఉవాచ = పలికెను, అయమ్ = ఈ, జనః = మానవుడు, కాల్యమానః అపి = గిరగిర త్రిప్పి పీడించబడుచున్ననూ, తస్య = అట్టి, ఏతస్య = ఈ కాలముయొక్క, ఉరువిక్రమమ్ = గొప్ప ప్రభావమును, ఘన-ఆవలిః = మేఘపంక్తి, బలినః = బలవంతమగు, వాయోః ఇవ = వాయువుయొక్క వలె, న వేద = తెలియకున్నాడు, నూనమ్ = నిశ్చయము.

బలమగు వాయువు మేఘపంక్తిని ఎగరగొట్టును. ఆ మేఘపంక్తికి వాయువుయొక్క ప్రభావము తెలియదు. అదే విధముగా ఈ కాలము జీవుని సంసారములో గిరగిర త్రిప్పి పీడించును. కాని, జీవుడు దాని గొప్ప ప్రభావమును తెలియజాలడు. ఇది నిశ్చయము.

యం యమర్థముపాదత్తే దుఃఖేన సుఖహేతవే ।
తం తం ధునోతి భగవాన్ పుమాన్ శోచతి యత్కృతే ॥ 2

పుమాన్ = మానవుడు, సుఖహేతవే = సుఖము కొరకై, దుఃఖేన = కష్టముచే, యం యమ్ = ఏయే, అర్థమ్ = వస్తువును, ఉపాదత్తే = సంపాదించునో, భగవాన్ = కాలరూపములోనున్న దైవము, తం తమ్ = ఆయా వస్తువును, ధునోతి = వినాశము చేయును యత్-కృతే = దేని కొరకై, శోచతి = శోకించునో.

మానవుడు సుఖమును పొందాలనే ఆశతో కష్టపడి ఏయే వస్తువులను సంపాదించునో, వాటినన్నింటినీ కాలరూపములోని దైవము తుడిచిపెట్టును. దాని వలన, ఆ మానవునకు దుఃఖమే మిగులును.

యదధ్రువస్య దేహస్య సానుబంధస్య దుర్మతిః ।
ధ్రువాణి మన్యతే మోహాద్గృహక్షేత్రవసూని చ ॥ 3

యత్ = ఏలయనగా, దుర్మతిః = మందమతియగు జీవుడు, స-అనుబంధస్య = సంబంధులతో గూడిన, అధ్రువస్య = అశాశ్వతమైన, దేహస్య = దేహమునకు సంబంధించిన, గృహక్షేత్రవసూని చ = ఇల్లు పొలము ధనము మొదలగువాటిని, మోహాత్ = అజ్ఞానము వలన, ధ్రువాణి = శాశ్వతములుగా, మన్యతే = భావించుచున్నాడో.

మందమతియగు జీవుడు ఇట్లు దుఃఖించుటకు కారణమేమనగా, అనిత్యమగు దేహమును, దానికి సంబంధించిన ఇల్లు పొలము ధనము మొదలగు వాటిని అజ్ఞానముచే నిత్యములని భావించుచున్నాడు.

జంతుర్వై భవ ఏతస్మిన్ యాం యాం యోనిమనువ్రజేత్ ।
తస్యాం తస్యాం స లభతే నిర్వృతిం న విరజ్యతే ॥ 4

ఏతస్మిన్ = ఈ, భవే= సంసారమునందు, సః = అట్టి, జంతుః వై = జీవుడు, యాం యామ్ = ఏయే, యోనిమ్ = జన్మను, అనువ్రజేత్ = పొందునో, తస్యాం తస్యామ్ = ఆయా యోనియందు, నిర్వృతిమ్ = సుఖమును, లభతే = పొందుచున్నాడు, న విరజ్యతే = విరక్తిని పొందుట లేదు.

ఈ సంసారములో జీవుడు మనుష్యపశుదేవాది యోనులలో దేనియందు జన్మించిననూ, దానిని సుఖప్రాయముగా భావించి విరక్తిని పొందుట లేదు.

నరకస్థోఽపి దేహం వై న పుమాంస్త్యక్తుమిచ్ఛతి ।
నారక్యాం నిర్వృతౌ సత్యాం దేవమాయావిమోహితః ॥ 5

దేవమాయావిమోహితః = శ్రీహరియొక్క మాయచే అధికముగా మోహింపజేయబడిన, పుమాన్ = జీవుడు, నరకస్థః అపి = నరకమునందున్న వాడే అయిననూ, నారక్యామ్ = నరకమునందు కలిగే, నిర్వృతౌ = సుఖము, సత్యామ్ = ఉంటూ ఉండగా, దేహమ్ = దేహమును, త్యక్తుమ్ = విడుచుటకు, న వై ఇచ్ఛతి = సుతరాము ఇష్టపడడు.

జీవుడు శ్రీహరియొక్క మాయచే విశేషముగా మోహమును పొందియున్నాడు. అట్టి జీవుడు నరకమునందున్ననూ, అక్కడ లభించే అల్పసుఖమును మరిగి, ఆ దేహమును కూడ విడుచుటకు ఇష్టపడడు.

ఆత్మజాయాసుతాగారపశుద్రవిణబంధుషు ।
నిరూఢమూలహృదయ ఆత్మానం బహు మన్యతే ॥ 6

ఆత్మజాయాసుత-అగారపశుద్రవిణబంధుషు = దేహము భార్య సంతానము ఇల్లు పశువులు ధనము బంధువులు అనువాటియందు, నిరూఢమూలహృదయః = పుట్టే కోరికలు గల (గట్టిగా లగ్నమైన) హృదయము గలవాడై, ఆత్మానమ్ = తనను, బహు = గొప్పగా, మన్యతే = తలంచును.

మానవుడు దేహము, భార్య, సంతానము, ఇల్లు, డబ్బు, బంధువులు మొదలగువాటిపై గట్టిగా లగ్నమైన హృదయమునందు అనేకములగు మనోరథములను కలిగి, తాను గొప్పవాడినని తలపోయుచుండును.

సందహ్యమానసర్వాంగ ఏషాముద్వహనాధినా ।
కరోత్యవిరతం మూఢో దురితాని దురాశయః ॥ 7

ఏషామ్ = వీటియొక్క, ఉద్వహన-ఆధినా = పోషణకు సంబంధించిన మనోవ్యథచే, సందహ్యమానసర్వ-అంగః = మిక్కిలి తాపమునకు గురిచేయబడిన అన్ని అవయవములు గలవాడై, మూఢః = మోహితుడగు మానవుడు, దురాశయః = దుష్టమగు హృదయము కలవాడై, అవిరతమ్ = నిరంతరముగా, దురితాని = పాపములను, కరోతి = చేయును.

మోహితుడగు మానవుడు దుష్టమైన హృదయము గలవాడై, వీటిని పోషించాలనే మనోవ్యథలో పడును. వాని అవయవములన్నియు ఆ

వ్యథచే అధికమగు తాపమునకు గురిచేయబడును. అట్టివాడు నిరంతర ముగా పాపములను చేయును.

ఆక్షిప్తాత్మేంద్రియః స్త్రీణామసతీనాం చ మాయయా ।
రహోరచితయాఽఽలాపైశ్శిశూనాం కలభాషిణామ్ ॥ 8

గృహేషు కూటధర్మేషు దుఃఖతంత్రేష్వతంద్రితః ।
కుర్వన్ దుఃఖప్రతీకారం సుఖవన్మన్యతే గృహీ ॥ 9

అసతీనామ్ = దుష్టలగు, స్త్రీణామ్ = స్త్రీలయొక్క, రహః-రచితయా = రహస్యముగా చేయబడిన, మాయయా = మాయచే, కలభాషిణామ్ = మధురముగా పలికే, శిశూనామ్ = పిల్లల, ఆలాపైః = కబుర్లచే, ఆక్షిప్త-ఆత్మేంద్రియః = ఆకర్షించబడిన అంతఃకరణము ఇంద్రియములు గలవాడు, కూటధర్మేషు = కపటమే స్వభావముగాగల, దుఃఖతంత్రేషు = దుఃఖమే ప్రధానముగాగల, గృహేషు = గృహకార్యములయందు, అతంద్రితః = ఏమరుపాటు లేని, గృహీ = గృహస్థుడు, దుఃఖప్రతీకారమ్ = దుఃఖమును పోగొట్టే ఉపాయమును, కుర్వన్ = చేయుచున్నవాడై, సుఖవత్ = సుఖము వలె, మన్యతే = తలపోయును.

గృహస్థుని దుష్టలగు స్త్రీలు ఏకాంతమునందు మాయచేసి ఆకర్షించెదరు. పైగా చిన్న పిల్లల ముద్దు ముద్దు కబుర్లచే గృహస్థుని ఇంద్రియములు, అంతఃకరణము ఆకర్షితమగును. దుఃఖప్రధానమగు గృహకార్యములయందు కపటమునకు ప్రముఖస్థానము ఉండును. వాటిని ఏమరుపాటు లేకుండగా నిర్వహించే గృహస్థుడు దుఃఖమును పోగొట్టే ఉపాయమును చేసుకొని, ఆ దుఃఖనివృత్తినే సుఖమని తలపోయును.

అర్థైరాపాదితైర్గుర్వ్యా హింసయేతస్తతశ్చ తాన్ ।
పుష్ణాతి యేషాం పోషేణ శేషభుగ్యాత్యధస్స్వయమ్ ॥ 10

ఇతస్తతః = అంతటా, గుర్వ్యా = అధికమగు, హింసయా = హింసతో, ఆపాదితైః = సంపాదించబడిన, అర్థైః = ధనము మొదలగువాటితో, తాన్ = వారిని, పుష్ణాతి = పోషించును, యేషామ్ = ఎవరి, పోషేణ = పోష

ణముచే, శేషభుక్ = మిగిలినదానిని భుజించే ఆతడు, స్వయమ్ = తాను, అధః = నరకమును, యాతి = పొందును.

అన్ని సందర్భములలో హింసను చేసి సంపాదించిన ధనము మొదలగువాటితో తన వారిని పోషించు మానవుడు, వారు తినగా మిగిలిన దానిని తిని, ఆ విధముగా హింసతో వారిని పోషించుటచే, తాను నరకమునకు వెళ్లును.

వార్తాయాం లుప్యమానాయామారబ్ధాయాం పునః పునః ।
లోభాభిభూతో నిస్సత్త్వః పరార్థే కురుతే స్పృహామ్ ॥ 11

పునః పునః = మరల మరల, ఆరబ్ధాయామ్ = ఆరంభించబడిన, వార్తాయామ్ = జీవిక, లుప్యమానాయామ్ = లోపించుచుండగా, లోభ-అభిభూతః = లోభముచే పరాభూతుడై, నిస్సత్త్వః = శక్తి లేనివాడై, పర-అర్థే = ఇతరుల ధనమునందు, స్పృహామ్ = ఆశను, కురుతే = చేయును.

మానవుడు జీవిక కొరకు ఎంత ప్రయత్నించిననూ ఒకప్పుడు అది లుప్తమగుచునే యుండును. కాని, లోభముచే పరాభూతమైన మనస్సు గలవానికి ఆ లోభమునకు తగ్గ ధనమును సంపాదించే శక్తి ఉండదు. అప్పుడాతడు ఇతరుల ధనముపై కన్ను వేయును.

కుటుంబభరణాకల్పో మందభాగ్యో వృథోద్యమః ।
శ్రియా విహీనః కృపణో ధ్యాయన్ శ్వసితి మూఢధీః ॥ 12

కుటుంబభరణ-అకల్పః = కుటుంబమును పోషించుటయందు అసమర్థుడైనట్టియు, మందభాగ్యః = దురదృష్టవంతుడైనట్టియు, వృథా-ఉద్యమః = వ్యర్థమగు ఉద్యమము కలిగినట్టియు, శ్రియా = సంపదచే, విహీనః = రహితుడైనట్టియు, కృపణః = దీనుడైనట్టియు, మూఢధీః = మోహమును పొందిన బుద్ధి గల వ్యక్తి, ధ్యాయన్ = చింతిల్లువాడై, శ్వసితి = నిట్టూర్పును విడుచును.

వ్యామోహమును పొందియున్న వ్యక్తి దురదృష్టవంతుడగుటచే సంపద లేక, చేసిన ప్రయత్నములు వ్యర్థము కాగా, కుటుంబమును పోషించలేక దీనుడై చింతిస్తూ నిట్టూర్పులను విడుచుచుండును.

ఏవం స్వభరణాకల్పం తత్కలత్రాదయస్తథా ।
నాద్రియంతే యథా పూర్వం కీనాశా ఇవ గోజరమ్ ॥ **13**

ఏవమ్ = ఈ విధముగా, స్వభరణ-అకల్పమ్ = తనను పోషించుకొనుటయందు అసమర్థుడైన ఆ వ్యక్తిని, తత్-కలత్ర-ఆదయః = వాని భార్య మొదలగువారు, గోజరమ్ = ముసలి ఎద్దును, కీనాశాః ఇవ = దుష్టులగు పశుపోషకులు వలె, యథా పూర్వమ్ = పూర్వమునందు ఎట్లో, తథా = ఆ విధముగా, న ఆద్రియంతే = ఆదరించరు.

ఈ విధముగా వ్యక్తి తనను తాను పోషించుకోలేని స్థితిలోనున్నప్పుడు వాని భార్య మొదలగువారు పూర్వము ఆదరించిన విధముగా ఆదరించరు. ముసలి ఎద్దును దుష్టులగు వ్యవసాయదారులు నిరాదరించిన తీరున, వారాతనిని అనాదరము చేయుదురు.

తత్రాప్యజాతనిర్వేదో భ్రియమాణస్స్వయంభృతైః ।
జరయోపాత్తవైరూప్యో మరణాభిముఖో గృహే ॥ **14**

తత్ర అపి = ఆ స్థితిలో కూడ, అజాతనిర్వేదః = పుట్టని వైరాగ్యము గలవాడు, స్వయంభృతైః = తనచే పోషించబడినవారిచే, భ్రియమాణః = పోషించబడుచున్నవాడై, జరయా = ముసలితనముచే, ఉపాత్తవైరూప్యః = పొందబడిన వికృతరూపము గలవాడై, గృహే = ఇంటియందు, మరణ-అభిముఖః = మరణమునకు సంసిద్ధుడుగా నుండును.

ఆ స్థితిలో కూడ వైరాగ్యమును పొందని వ్యక్తి పూర్వము తాను పోషించినవారిచే ఇప్పుడు పోషించబడుచుండును. ముసలితనము వానికి వికృతాకారమును తెచ్చిపెట్టును. ఆ విధముగా అతడు మరణమునకు ఎదురు చూస్తూ ఇంటిలో పడియుండును.

ఆస్తేఽవమత్యోపన్యస్తం గృహపాల ఇవాహరన్ ।

ఆమయావ్యప్రదీప్తాగ్నిరల్పాహారోఽల్పచేష్టితః ॥ 15

అవమత్యా = అవమానముతో, ఉపన్యస్తమ్ = ముందు ఉంచబడిన ఆహారమును, గృహపాలః ఇవ = ఇంటి కుక్కవలె, ఆహరన్ = భుజించువాడై, ఆమయావీ = అజీర్ణరోగము గలవాడై, అప్రదీప్త-అగ్నిః = పని చేయని జఠరాగ్ని గలవాడై, అల్ప-ఆహారః = అల్పమగు ఆహారము గలవాడై, అల్పచేష్టితః = అల్పమగు చేష్టలు గలవాడై, ఆస్తే = ఉండును.

తన ఇంటిలోని వారు కుక్కకు వలె తనముందు విసిరిన అన్నమును ఆతడు భుజించును. ఆతనికి అజీర్ణముచే జఠరాగ్ని మందగించి తక్కువ ఆహారమును మాత్రమే తినును. కావుననే, ఆతడు పని చేసే శక్తి కూడ తగ్గి, ఒకచోట పడియుండును.

వాయునోత్క్రమతోత్తారః కఫసంరుద్ధనాడికః ।
కాసశ్వాసకృతాయాసః కంఠే ఘురఘురాయతే ॥ 16

ఉత్క్రమతా = పైకి తన్నుచున్న, వాయునా = ఊపిరిచే, ఉత్తారః = పైకి ఎక్కిన కనుగ్రుడ్లు గలవాడై, కఫసంరుద్ధనాడికః = శ్లేష్మముచే మూసి వేయబడిన నాడులు గలవాడై, కాసశ్వాసకృత-ఆయాసః = దగ్గు ఆయాసముచే కలిగించబడిన శ్రమ గలవాడై, కంఠే = కంఠమునందు, ఘురఘురాయతే = ఘురఘుర శబ్దమును చేయుచుండును.

ఆతనికి ఊపిరి పైకి దన్ని కనుగ్రుడ్లు పైకి ఎక్కును. శ్లేష్మము నాడులను మూసివేయును. దగ్గు ఆయాసము ఆతనికి శ్రమను కలిగించుచుండును. ఆతడు కంఠములో ఘురఘుర శబ్దమును చేయుచుండును.

శయానః పరిశోచద్భిః పరివీతస్స్వబంధుభిః ।
వాచ్యమానోఽపి న బ్రూతే కాలపాశవశం గతః ॥ 17

పరిశోచద్భిః = అధికముగా దుఃఖించుచున్న, స్వబంధుభిః = తన బంధువులచే, పరివీతః = చుట్టువారబడినవాడై, శయానః = పరున్నవాడై, కాలపాశవశం గతః = మృత్యుపాశమునకు చిక్కినవాడై, వాచ్యమానః అపి = పలుకరించబడుచున్నవాడైననూ, న బ్రూతే = మాటలాడడు.

ఆతడు పరుండియుండగా బంధువులు చుట్టూ చేరి అధికముగా దుఃఖించుచుందురు. ఈతడు మృత్యువుయొక్క పాశమునకు చిక్కి యుండుటచే, వారు పలుకరించిననూ బదులు చెప్పలేడు.

ఏవం కుటుంబభరణే వ్యాపృతాత్మాఽజితేంద్రియః ।
మ్రియతే రుదతాం స్వానామురువేదనయాస్తధీః ॥ 18

ఏవమ్ = ఈ విధముగా, కుటుంబభరణే = కుటుంబమును పోషించుటయందు, వ్యాపృత-ఆత్మా = పూర్తిగా లగ్నమైన మనస్సు గలవాడై, అజిత-ఇంద్రియః = జయించబడని ఇంద్రియములు గలవాడై, స్వానామ్ = తనవారలు, రుదతామ్ = ఏడ్చుచుండగా, ఉరువేదనయా = అధికమగు నొప్పిచే, అస్తధీః = నశించిన బుద్ధిశక్తి గలవాడై, మ్రియతే = మరణించును.

ఈ విధముగా ఆతడు బలముగానున్నప్పుడు కుటుంబపోషణవ్యాపారములో తలమున్కలవుతూ ఇంద్రియములపై విజయమును సాధించలేదు. ఇప్పుడు తన బంధువులు ఏడ్చుచుండగా అధికమగు నొప్పిచే నశించిన బుద్ధిశక్తి గలవాడై మరణించును.

యమదూతౌ తదా ప్రాప్తౌ భీమౌ సరభసేక్షణౌ ।
స దృష్ట్వా త్రస్తహృదయశ్శకృన్మూత్రం విముంచతి ॥ 19

తదా = అప్పుడు, భీమౌ = భయమును గొల్పునట్టియు, సరభస-ఈక్షణౌ = కోపముతో నిండిన కన్నులు గలిగినట్టియు, ప్రాప్తౌ = వచ్చియున్న, యమదూతౌ = ఇద్దరు యమదూతలను, దృష్ట్వా = చూచి, సః = ఆతడు, త్రస్తహృదయః = భయపడిన హృదయము గలవాడై, శకృత్ = మలమును, మూత్రమ్ = మూత్రమును, విముంచతి = విడిచిపెట్టును.

అపుడు యమదూతలు ఆతనికి కనబడెదరు. వారు కోపముతో నిండిన కన్నులతో భీతిని గొల్పుదురు. వారిని చూచి ఆతడు తన హృదయములో చాల భయపడి మలమూత్రములను విడిచిపెట్టును.

యాతనాదేహ ఆవృత్య పాశైర్బద్ధ్వా గలే బలాత్ ।

నయతో దీర్ఘమధ్వానం దండ్యం రాజభటా యథా ॥ 20

యాతనాదేహే = యాతనలకు తగిన దేహమునందు, ఆవృత్య = చుట్టబెట్టి, గలే = మెడయందు, బలాత్ = గట్టిగా, పాశైః = త్రాళ్లతో, బద్ధ్వా = కట్టి, రాజభటాః = రాజభటులు, దండ్యం యథా = శిక్షింపదగిన అపరాధిని వలె, దీర్ఘమ్ = పొడవైన, అధ్వానమ్ = దారిని, నయతః = నడిపించెదరు.

వారాతనిని యాతనలకు తగిన దేహమునందు పారవేసి, మెడకు గట్టిగా త్రాళ్లను కట్టి, రాజభటులు శిక్షార్హుడగు అపరాధిని వలె, చాల పొడవైన యమలోకమార్గమునందు నడిపించెదరు.

తయోర్నిర్భిన్నహృదయస్తర్జనైర్జాతవేపథుః ।
పథి శ్వభిర్భక్ష్యమాణ ఆర్తోఽఘం స్వమనుస్మరన్ ॥ 21

తయోః = వారిద్దరి, తర్జనైః = బెదిరింపులచే, నిర్భిన్నహృదయః = పగిలిన హృదయము గలవాడై, జాతవేపథుః = పుట్టిన వణుకు గలవాడై, పథి = మార్గమునందు, శ్వభిః = కుక్కలచే, భక్ష్యమాణః = కరువబడుచున్న వాడై, ఆర్తః = పీడితుడై, స్వమ్ = తన, అఘమ్ = పాపమును, అనుస్మరన్ = గుర్తునకు తెచ్చుకొనుచున్నవాడు.

వారిద్దరు ఈతనిని బెదిరిస్తూ ఉంటే ఈతని గుండె పగిలి వణుకు పుట్టును. దారిలో ఈతనిని కుక్కలు కరచును. అతడు తాను చేసిన పాపమును గుర్తుకు తెచ్చుకుంటూ దుఃఖిస్తూ వెళ్లును.

క్షుత్తృట్పరీతోఽర్కదవానలానిలైః
సంతప్యమానః పథి తప్తవాలుకే ।
కృచ్ఛ్రేణ పృష్ఠే కశయా చ తాడితః
చలత్యశక్తోఽపి నిరాశ్రమోదకే ॥ 22

క్షుత్-తృట్-పరీతః = ఆకలి దప్పికలచే వ్యాపించబడినవాడై, అర్క దవానల-అనిలైః = సూర్యునిచే దావాగ్నిచే మరియు వాయువుచే, సంతప్యమానః = పీడించబడుచున్నవాడై, తప్తవాలుకే = కాలే ఇసుక గల, నిరాశ్రమ

-ఉదకే = విశ్రాంతిస్థానము గాని త్రాగునీరు గాని లేని, పథి = మార్గమునందు, పృష్ఠే = వీపుపై, కశయా = కొరడాచే, తాడితః చ = కొట్టబడినవాడై, కృచ్ఛ్రేణ = అతికష్టము మీద, అశక్తః అపి = శక్తి లేనివాడైననూ, చలతి = నడుచును.

ఆ జీవుని తీవ్రమగు ఆకలి దప్పికలు బాధించుచుండును; సూర్యుడు, దావాగ్ని, సుడిగాలులు ఆతనిని పీడించుచుండును. నడిచే దారిలో కాలే ఇసుక ఉండును. దారిలో విశ్రామస్థానము గాని, త్రాగే నీరు గాని ఉండదు. యమదూతలు కొరడాతో వీపుపై కొట్టుచుందురు. ఆ జీవుడు శక్తి లేకున్ననూ అతికష్టము మీద ఆ దారిలో ముందుకు సాగును.

తత్ర తత్ర పతన్ శ్రాంతో మూర్ఛితః పునరుత్థితః ।
పథా పాపీయసా నీతస్తమసా యమసాదనమ్ ॥ 23

శ్రాంతః = అలసిన ఆ జీవుడు, తత్ర తత్ర = అక్కడక్కడ, మూర్ఛితః = మూర్ఛిల్లినవాడై, పతన్ = పడుచున్నవాడై, పునః = మరల, ఉత్థితః = లేచినవాడై, పాపీయసా = పాపులకు తగిన, తమసా = చీకటితో నిండిన, పథా = మార్గముచే, యమసాదనమ్ = యముని నగరమును గురించి, నీతః = తీసుకొని వెళ్లబడును.

ఆ జీవుడు అలసి అక్కడక్కడ దారిలో మూర్ఛిల్లి మరల లేచి పాపులకు తగిన చీకటితో నిండిన ఆ దారిలో యమదూతలచే యమపురికి తీసుకు వెళ్లబడును.

యోజనానాం సహస్రాణి నవతిం నవ చాధ్వనః ।
త్రిభిర్ముహూర్తైర్ద్వాభ్యాం వా నీతః ప్రాప్నోతి యాతనాః ॥ 24

అధ్వనః = మార్గముయొక్క, యోజనానాం సహస్రాణి నవతిం నవ చ = తొంభై తొమ్మిది వేల యోజనముల దూరమును, త్రిభిః = మూడు, వా = లేదా, ద్వాభ్యామ్ = రెండు, ముహూర్తైః = ముహూర్తములచే, నీతః = తీసుకువెళ్లబడినవాడై, యాతనాః = యాతనలను, ప్రాప్నోతి = పొందును.

యమలోకమార్గము నిడివి తొంభై తొమ్మిది వేల యోజనములు. ఈ దూరమును వారాతనిని రెండు లేక మూడు ముహూర్తముల కాలములో తీసుకువెళ్ళెదరు. అచట ఆతడు యాతనలను పొందును.

ఆదీపనం స్వగాత్రాణాం వేష్టయిత్వోల్ముకాదిభిః ।
ఆత్మమాంసాదనం క్వాపి స్వకృత్తం పరతోఽపి వా ॥ 25

స్వగాత్రాణామ్ = తన అవయవములకు, ఉల్ముక-ఆదిభిః = కాలే కట్టెలు మొదలగు వాటితో, వేష్టయిత్వా = చుట్టూ వేసి, ఆదీపనమ్ = మండించుట, క్వ అపి = ఒకప్పుడు, స్వకృత్తమ్ = తనచేతనే కోయబడిన, వా = లేదా, పరతః అపి = మరియొకనిచే (కోయబడిన), ఆత్మమాంస-అదనమ్ = తన మాంసమును తానే తినుట.

జీవుని అవయవముల చుట్టూ కాలే కట్టెలను వేసి మండించెదరు. ఒకప్పుడు ఈతడు తన శరీరమునుండి మాంసమును కోసి భక్షించునట్లు చేసెదరు; లేదా, ఇతరులు వీని మాంసమును కోసి వీనిచే తినిపించెదరు.

జీవతశ్చాంత్రాభ్యుద్ధారః శ్వగృధ్రైర్యమసాదనే ।
సర్పవృశ్చికదంశాద్యైర్దశద్భిశ్చాత్మవైశసమ్ ॥ 26

యమసాదనే = యమపురియందు, జీవతః = జీవించియున్నవానికి, శ్వగృధ్రైః = కుక్కలచే గ్రద్దలచే, అంత్ర-అభ్యుద్ధారః = ప్రేవులను పీకివేయుట, దశద్భిః = కరచుచున్న, సర్పవృశ్చికదంశ-ఆద్యైః = సర్పములు తేళ్లు అడవి ఈగలు మొదలగువాటిచే, ఆత్మవైశసమ్ = దేహమునకు పీడ.

ఆ యమపురియందు జీవుల ప్రేవులను వారు బ్రతికియుండగనే కుక్కలు గ్రద్దలు పీకివేయును. సర్పములు తేళ్లు అడవి ఈగలు కరచుచుండగా వారి దేహములకు చాల పీడ కలుగును.

కృంతనం చావయవశో గజాదిభ్యో భిదాపనమ్ ।
పాతనం గిరిశృంగేభ్యో రోధనం చాంబుగర్తయోః ॥ 27

అవయవశః = ప్రతి అవయవమును, కృంతనమ్ = కోయుట, గజ-ఆదిభ్యః = ఏనుగులు మొదలగువాటి వలన, భిదా-ఆపనమ్ = అవయవములను విరుగకొట్టించుట, గిరిశృంగేభ్యః = కొండకొమ్ములనుండి, పాతనమ్ = పారద్రోయుట, చ = మరియు, అంబుగర్తయోః = నీటియందు గోతియందు, రోధనమ్ = నొక్కి యుంచబడుట.

అచట జీవులను ప్రతి అవయవమును ముక్కలు ముక్కలుగా కోసెదరు. ఏనుగులు మొదలగు వాటిచే తొక్కించెదరు. కొండకొమ్ములనుండి పారద్రోసెదరు. నీటిలో, గోతిలో ముంచి నొక్కి యుంచెదరు.

యాస్తామిస్రాంధతామిస్రా రౌరవాద్యాశ్చ యాతనాః ।
భుంక్తే నరో వా నారీ వా మిథస్సంగేన నిర్మితాః ॥ 28

నరః వా = నరుడు గాని, నారీ వా = స్త్రీ గాని, మిథః = పరస్పరము, సంగేన = ఆసక్తిచే, నిర్మితాః = నిర్మించబడిన, యాతనాః = యాతనలను, భుంక్తే = అనుభవించును, యాః = ఏ, తామిస్ర-అంధతామిస్రాః = తామిస్రము అంధతామిస్రములు గలవో, రౌరవ-ఆద్యాః చ = రౌరవము మొదలగునవి గలవో.

స్త్రీపురుషులు పరస్పరము ఆసక్తిచే అధర్మమును చేసినచో, దాని వలన కలిగించబడే యాతనలను వారు అనుభవించెదరు. తామిస్రము, అంధతామిస్రము, రౌరవము మొదలగు యాతనలు గలవు.

అత్రైవ నరకస్స్వర్గ ఇతి మాతః ప్రచక్షతే ।
యా యాతనా వై నారక్యస్తా ఇహాప్యుపలక్షితాః ॥ 29

మాతః = అమ్మా!, అత్ర ఏవ = ఇచటనే, నరకః = నరకము, స్వర్గః = స్వర్గము, ఇతి = అని, ప్రచక్షతే = చెప్పుచున్నారు, యాః = ఏ, నారక్యః = నరకమునకు చెందిన, యాతనాః వై = యాతనలు గలవో, తాః = అవి, ఇహ అపి = ఈ లోకములో కూడ, ఉపలక్షితాః = ప్రత్యక్షమగుచున్నవి.

అమ్మా! స్వర్గము, నరకము ఇక్కడనే గలవని కొందరు చెప్పుచున్నారు. నరకమునకు సంబంధించిన యాతనలు మనకు ఇక్కడనే ప్రత్యక్షమగుచున్నవి.

ఏవం కుటుంబం బిభ్రాణ ఉదరంభర ఏవ వా ।
విసృజ్యేహోభయం ప్రేత్య భుంక్తే తత్ఫలమీదృశమ్ ॥ 30

కుటుంబమ్ = కుటుంబమును, బిభ్రాణః = పోషించువాడు గాని, ఉదరంభరః ఏవ వా = తన పొట్టను పోసుకొనువాడు గాని, ఏవమ్ = ఈ విధముగా, ఉభయమ్ = రెండింటినీ, విసృజ్య = విడిచిపెట్టి, ప్రేత్య = మరణించి, ఈదృశమ్ = ఇటువంటి, తత్-ఫలమ్ = దాని ఫలమును, భుంక్తే = అనుభవించుచున్నాడు.

మానవుడు కుటుంబమును పోషించుటకు గాని, లేక తన పొట్ట పోసుకొనుటకు గాని పాపములను చేసినచో, మరణించునప్పుడు ఈ దేహము కుటుంబము అనే రెండింటినీ విడిచిపెట్టి ఆ పాపముల ఫలమును ఈ విధముగా అనుభవించును.

ఏకః ప్రపద్యతే ధ్వాంతం హిత్వేదం స్వకలేవరమ్ ।
కుశలేతరపాథేయో భూతద్రోహేణ యద్భృతమ్ ॥ 31

భూతద్రోహేణ = ప్రాణులకు పీడను కలిగించుటచే, యత్ = ఏది, భృతమ్ = పోషించబడినదో, ఇదమ్ = ఆ ఈ, స్వకలేవరమ్ = తన దేహమును, హిత్వా = విడిచిపెట్టి, కుశల-ఇతరపాథేయః = అపుణ్యమే యమలోకమార్గములో భోగ్యముగా గలవాడై, ఏకః = ఒక్కడే, ధ్వాంతమ్ = నరకమును, ప్రపద్యతే = పొందును.

మానవుడు ఇతరప్రాణులకు ద్రోహమునాచరించి ఈ దేహమును పోషించినచో, ఆ విధముగా పోషించబడిన ఈ తన దేహమును ఇక్కడనే విడిచిపెట్టి ఒంటరిగా నరకమునకు వెళ్లును. ఆతడు చేసిన పాపమునే ఆతడు ఆ యమలోకమార్గములో భోగించును.

దైవేనాసాదితం తస్య శమలం నిరయే పుమాన్ ।

భుంక్తే కుటుంబపోషస్య హృతవిత్త ఇవాతురః ॥ 32

హృతవిత్తః = అపహరించబడిన ధనము గలవాడై, ఆతురః ఇవ = పీడింపబడినవాడు వలె, పుమాన్ = మానవుడు, దైవేన = దైవముచే, ఆసాదితమ్ = పొందించబడిన, తస్య = ఆ, కుటుంబపోషస్య = కుటుంబపోషణముయొక్క, శమలమ్ = పాపమును, నిరయే = నరకమునందు, భుంక్తే = అనుభవించును.

సర్వస్వమును కోల్పోయినవాడు చాల పీడను పొందును. అదే విధమగు దుఃఖమును అధర్మముగా జీవించువాడు అనుభవించును. అన్యాయముగా కుటుంబమును పోషించు మానవునిచే దైవము ఆ పాపముయొక్క ఫలమును నరకములో అనుభవింప జేయును.

కేవలేన హ్యధర్మేణ కుటుంబభరణోత్సుకః ।
యాతి జీవోఽంధతామిస్రం చరమం తమసః పదమ్ ॥ 33

కేవలేన = కేవలమైన, అధర్మేణ = అధర్మముచే, కుటుంబభరణ-ఉత్సుకః = కుటుంబమును పోషించాలనే ఉత్సాహము గల, జీవః = జీవుడు, తమసః = నరకముయొక్క, చరమమ్ = అంతిమమగు, పదమ్ = స్థానమైన, అంధతామిస్రమ్ = అంధతామిస్రమును, యాతి = పొందును.

కేవలము అధర్మమార్గములో కుటుంబమును పోషించే ఉత్సాహము గల జీవుడు నరకముయొక్క అంతిమస్థానమగు అంధతామిస్రమును పొంధును.

అధస్తాన్నరలోకస్య యావతీర్యాతనాదయః ।
క్రమశస్సమనుక్రమ్య పునరత్రావ్రజేచ్ఛుచిః ॥ 34

ఇతి శ్రీమద్భాగవత మహాపురాణే తృతీయస్కంధే
త్రింశోఽధ్యాయః ॥

నరలోకస్య = మనుష్యజన్మకు, అధస్తాత్ = క్రింద, యావతీః = ఎన్ని, యాతనా-ఆదయః = యాతనలు మొదలగునవి గలవో వాటిని,

క్రమశః = వరుసగా, సమనుక్రమ్య = పొంది, పునః = మరల, శుచిః = పవిత్రు డై, అత్ర = ఈ మనుష్యజన్మలో, ఆవ్రజేత్ = తిరిగి వచ్చును.

పాపములను చేయు వ్యక్తి మనుష్యలోకమునకు నికృష్టస్థానమ లోనుండే నరకములోని యాతనలను, మనుష్యజన్మకంటె నికృష్టమగు పశువు మొదలగు జన్మలను క్రమముగా అనుభవించి, ఆ విధముగా పవి త్రుడై మరల తిరిగి మనుష్యజన్మను పొందును.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
ముప్పదియవ అధ్యాయము ముగిసినది (30).

* * * * *

# అథ ఏకత్రింశోఽధ్యాయః

## మనుష్యజన్మను పొందే జీవుని గతిని వర్ణించుట

శ్రీభగవానువాచ ।
కర్మణా దైవనేత్రేణ జంతుర్దేహోపపత్తయే ।
స్త్రియాః ప్రవిష్ట ఉదరం పుంసో రేతఃకణాశ్రయః ॥ 1

శ్రీభగవాన్ = కపిల భగవానుడు, ఉవాచ = పలికెను, జంతుః = జీవుడు, దేహ-ఉపపత్తయే = దేహమును పొందుట కొరకు, దైవనేత్రేణ = భగవానుడే ప్రేరకుడుగా గల, కర్మణా = పూర్వకర్మచే, పుంసః = పురుషుని, రేతఃకణాశ్రయః = వీర్యకణములు ఆశ్రయముగా గలవాడై, స్త్రియాః = స్త్రీయొక్క, ఉదరమ్ = ఉదరమును, ప్రవిష్టః = ప్రవేశించినవాడు అగును.

కపిల భగవానుడిట్లు పలికెను --- జీవుడు పూర్వకర్మానుసారముగా దైవముచే ప్రేరితుడై మనుష్యజన్మను పొందబోతూ, ఒకానొక పురుషుని వీర్యకణములనాశ్రయించి, తద్ద్వారా ఒక స్త్రీయొక్క ఉదరమును ప్రవేశించును.

కలలం త్వేకరాత్రేణ పంచరాత్రేణ బుద్బుదమ్ ।
దశాహేన తు కర్కంధూః పేశ్యండం వా తతః పరమ్ ॥ 2

ఏకరాత్రేణ తు = ఒక రాత్రి కాలముచే, కలలమ్ = రెండు కణములు కలిసిన ఒక కణము, పంచరాత్రేణ = అయిదు రాత్రులచే, బుద్బుదమ్ = బుడగరూపము, దశ-అహేన తు = పది రోజులచేనైతే, కర్కంధూః = రేగిపండువలె కఠినము, తతః పరం వా = ఆ పైన, పేశీ-అండమ్ = మాంసపిండము.

ఆ జీవుడు తల్లి ఉదరములో ప్రవేశించి మొదటి రోజు రెండు కణములు కలిసిన ఒక కణము రూపములోనుండి, అయిదు రోజులలో బుడగ వలె పెరిగి, పదిరోజులకు రేగిపండువలె గట్టిపడి, తరువాత మాంసపిండము అగును.

మాసేన తు శిరో ద్వాభ్యాం బాహ్వంఘ్ర్యాద్యంగవిగ్రహః ।
నఖలోమాస్థిచర్మాణి లింగచ్ఛిద్రోద్భవస్త్రిభిః ॥ 3

మాసేన తు = నెల కాలముచేనైతే, శిరః = తల, ద్వాభ్యామ్ = రెండు నెలలచే, బాహు-అంఘ్రి-ఆది-అంగవిగ్రహః = చేతులు కాళ్లు మొదలగు అవయవముల విభాగము, త్రిభిః = మూడు మాసములచే, నఖ లోమ-అస్థిచర్మాణి = గోళ్లు రోమములు ఎముకలు చర్మము, లింగ-ఛిద్ర-ఉద్భవః = ఇంద్రియగోళకముల ఉత్పత్తి.

ఒక నెలలో తల, రెండు నెలలలో చేతులు కాళ్లు మొదలగు అవయవముల విభాగము, మూడు నెలలలో గోళ్లు రోమములు ఎముకలు చర్మము ఇంద్రియగోళకములు ప్రకటమగును.

చతుర్భిర్ధాతవస్సప్త పంచభిః క్షుత్తృడుద్భవః ।
షడ్భిర్జరాయుణా వీతః కుక్షౌ భ్రామ్యతి దక్షిణే ॥ 4

చతుర్భిః = నాలుగు నెలలచే, సప్త = ఏడు, ధాతవః = మాంసము మజ్జ మొదలగు ధాతువులు, పంచభిః = ఐదు నెలలచే, క్షుత్-తృట్-ఉద్భవః = ఆకలి దప్పికలు పుట్టును, షడ్భిః = ఆరు మాసములచే, జరాయుణా = జరాయువుచే, వీతః = చుట్టువారబడినవాడై, కుక్షౌ = ఉదరమునందు, దక్షిణే = ఎడమ పార్శ్వమునందు, భ్రామ్యతి = తిరుగును.

నాలుగు నెలలలో మాంసము మజ్జ మొదలగు ఏడు ధాతువులు నిర్మాణమగును. ఐదు మాసములనాటికి ఆకలి దప్పికలు బయలు దేరును. ఆరు మాసములగు సరికి శిశువు చుట్టూ జరాయువు (చర్మవిశేషము) నిర్మాణమై, శిశువు ఉదరములో ఎడమ పార్శ్వమునందు తిరుగును.

మాతుర్జగ్ధాన్నపానాద్యైరేధద్ధాతురసమ్మతే ।

శేతే విణ్మూత్రయోర్గర్తే స జంతుర్జంతుసంభవే ॥ 5

సః = ఆ, జంతుః = జీవుడు, మాతుః = తల్లియొక్క, జగ్ధ-అన్నపాన -ఆద్యైః = తినబడిన ఆహారము నీరు మొదలగువాటిచే, ఏధత్-ధాతుః = పెరుగుచున్న ధాతువులు గలవాడై, అసమ్మతే = సుఖకరము కానట్టియు, జంతుసంభవే = క్రిములు మొదలగు ప్రాణులు పుట్టే, విణ్మూత్రయోః = మలమూత్రముల, గర్తే = స్థానమునందు, శేతే = పడియుండును.

తల్లి స్వీకరించే ఆహారము నీరు మొదలగువాటిచే ఆ జీవుని ధాతువులు వర్ధిల్లుచుండును. ఆ జీవుడు తల్లి ఉదరములో మిక్కిలి ఇబ్బందిని కలిగించే మలమూత్రముల స్థానమునందు పడియుండును. అచట క్రిములు మొదలగునవి కూడ ఉదయించుచుండును.

కృమిభిః క్షతసర్వాంగస్సౌకుమార్యాత్ప్రతిక్షణమ్ ।
మూర్ఛామాప్నోత్యురుక్లేశస్తత్రత్యైః క్షుధితైర్ముహుః ॥ 6

తత్రత్యైః = అక్కడనుండే, క్షుధితైః = ఆకలిగొన్న, కృమిభిః = క్రిములచే, ముహుః = మాటిమాటికీ, క్షతసర్వ-అంగః = కుట్టబడే అన్ని అవయవములు గలవాడై, సౌకుమార్యాత్ = సుకుమారుడగుట వలన, ప్రతిక్షణమ్ = ప్రతిక్షణము, ఉరుక్లేశః = గొప్ప బాధ గలవాడై, మూర్ఛామ్ = మూర్ఛను, ఆప్నోతి = పొందును.

మిక్కిలి సుకుమారమగు దేహము గల ఆ జీవుని అక్కడ ఉండే క్రిములు ఆకలి గొన్నవై మాటిమాటికీ కుడుతూ ఉంటే, ఆ జీవుడు ప్రతి క్షణము చాల నొప్పిని అనుభవించి మూర్ఛిల్లును.

కటుతీక్ష్ణోష్ణలవణరూక్షామ్లాదిభిరుల్బణైః ।
మాతృభుక్తైరుపస్పృష్టస్సర్వాంగోత్థితవేదనః ॥ 7

మాతృభుక్తైః = తల్లిచే భక్షించబడిన, ఉల్బణైః = నొప్పిని కలిగించే, కటుతీక్ష్ణ-ఉష్ణలవణరూక్ష-అమ్ల-ఆదిభిః = కారముగానుండి హింస పెట్టే వేడి ఉప్పని పొడిపొడిగానుండే పుల్లని మరియు ఇతరములైన పదార్థ

ములచే, ఉపస్పృష్టః = స్పృశించబడినవాడై, సర్వ-అంగ-ఉత్థితవేదనః = అన్ని అవయవములయందు లేచిన నొప్పి గలవాడు.

తల్లి భక్షించే పదార్థములు కొన్ని కారముగా నుండి కడుపులోని శిశువునకు హింసను కలిగించును. ఉప్పని పుల్లని పొడిపొడిగా నుండే వివిధపదార్థములు ఆ శిశువునకు తగిలి అన్ని అవయవములలో భరించరాని నొప్పిని కలిగించుచుండును.

ఉల్బేన సంవృతస్తస్మిన్నంత్రైశ్చ బహిరావృతః ।
ఆస్తే కృత్వా శిరః కుక్షౌ భుగ్నపృష్ఠశిరోధరః ।। 8

తస్మిన్ = ఆ తల్లి గర్భమునందు, ఉల్బేన = జరాయువుచే, సంవృతః = చుట్టువారబడినవాడై, బహిః చ = బయట కూడ, అంత్రైః = ప్రేవులచే, ఆవృతః = కప్పివేయబడినవాడై, శిరః = తలను, కుక్షౌ = ఉదరమునందు, కృత్వా = ఉంచి, భుగ్నపృష్ఠశిరోధరః = వంగియున్న నడుము మెడ గలవాడై, ఆస్తే = ఉండును.

ఆ తల్లి గర్భములో జీవుడు జరాయువుచే చుట్టబడినవాడై, దానికి బయట ప్రేవులచే చుట్టబడినవాడై, తలను తల్లి పొట్టలో నుంచి, నడుమును మెడను వంచి యుండును.

అకల్పస్స్వాంగచేష్టాయాం శకుంత ఇవ పంజరే ।
తత్ర లబ్ధస్మృతిర్దైవాత్కర్మ జన్మశతోద్భవమ్ ।
స్మరన్ దీర్ఘమనుచ్ఛ్వాసం శర్మ కిం నామ విందతే ।। 9

పంజరే = పంజరమునందలి, శకుంతః ఇవ = పక్షి వలె, స్వ-అంగచేష్టాయామ్ = తన అవయవములను కదిలించుటయందు, అకల్పః = అసమర్థుడై, తత్ర = ఆ సమయములో, దైవాత్ = దైవము వలన, లబ్ధస్మృతిః = పొందబడిన స్మృతి గలవాడై, జన్మశత-ఉద్భవమ్ = అనేకజన్మలలో ప్రోగు చేయబడిన, కర్మ = కర్మను, స్మరన్ = స్మరించువాడై, దీర్ఘమ్ = చాలసేపు, అనుచ్ఛ్వాసమ్ = శ్వాస లేనివాడై, కిం నామ శర్మ = ఏమి సుఖమును, విందతే = పొందును?

ఆ జీవుడు పంజరములోని పక్షివలె తల్లి గర్భములో తన అవయవములను ఇటునటు కదల్చుటకు సమర్థుడు కాడు. ఆ సమయములో దైవానుగ్రహము వలన వానికి పూర్వజన్మస్మృతి కలుగును. అపుడాతడు తాను అనేకజన్మలలో తాను చేసిన కర్మలను గుర్తు చేసుకొని, చాల సేపు శ్వాస లేకుండ నుండును. వానికి ఆ స్థితిలో ఏమి సుఖము కలుగును?

ఆరభ్య సప్తమాన్మాసాల్లబ్ధబోధోఽపి వేపితః ।
నైకత్రాస్తే సూతివాతైర్విష్ఠాభూరివ సోదరః ॥ **10**

సప్తమాత్ = ఏడవ, మాసాత్ ఆరభ్య = మాసమునుండి మొదలుకొని, లబ్ధబోధః అపి = పొందబడిన స్మృతి కలవాడై, సూతివాతైః = ప్రసూతి వాయువులచే, వేపితః = ఇటునటు కదల్చబడినవాడై, స-ఉదరః = అదే ఉదరమునందున్న, విష్ఠాభూః ఇవ = క్రిమివలె, ఏకత్ర = ఒకచోట, న ఆస్తే = ఉండడు.

ఏడవ మాసమునుండి మొదలుకొని ఆ జీవునకు స్మృతి కలుగును. కాని, వానిని ప్రసూతి వాయువులు ఇటునటు కుదిపివేయును. ఆతడు అదే ఉదరములోనుండే క్రిమి వలె ఒక స్థానములో స్థిరముగా నుండలేడు.

నాథమాన ఋషిర్భీతస్సప్తవధ్రిః కృతాంజలిః ।
స్తువీత తం విక్లబయా వాచా యేనోదరేఽర్పితః ॥ **11**

నాథమానః = ప్రార్థించుచున్నట్టియు, ఋషిః = పూర్వజన్మజ్ఞానము కలిగినట్టియు, భీతః = భయపడినట్టియు, సప్తవధ్రిః = ఏడు ధాతువుల స్థూలదేహమునకు కట్టుబడి యున్న ఆ జీవుడు, కృత-అంజలిః = చేతులను జోడించినవాడై, విక్లబయా = దీనమగు, వాచా = వాక్కుతో, తమ్ = ఆ భగవానుని, స్తువీత = స్తుతించును, యేన = ఎవనిచే, ఉదరే = తల్లి గర్భమునందు, అర్పితః = ఉంచబడినాడో.

ఏడు ధాతువుల స్థూలశరీరమునకు కట్టుబడియున్న ఆ జీవుడు పూర్వజన్మజ్ఞానము గలవాడై సంసారమునకు భయపడి చేతులను

జోడించి దీనమగు వాక్కుతో అర్థిస్తూ , ఏ భగవానుడు తనను తల్లి గర్భములోనికి పంపినాడో, ఆ భగవానుని స్తుతించును.

జంతురువాచ ।
తస్యోపసన్నమవితుం జగదిచ్ఛయాత్త-
నానాతనోర్భువి చలచ్చరణారవిందమ్ ।
సోఽహం వ్రజామి శరణం హ్యకుతోభయం మే
యేనేదృశీ గతిరదర్శ్యసతోఽనురూపా ॥ 12

ఉపసన్నమ్ = శరణు జొచ్చిన, జగత్ = జగత్తును, అవితుమ్ = రక్షించుటకు, ఇచ్ఛయా = తన ఇచ్ఛచే, ఆత్తనానాతనోః = స్వీకరించబడిన అనేకరూపములు గల, తస్య = ఆ భగవానుని, అకుతోభయమ్ = సర్వము నుండి అభయమునొసగే, భువి = భూమియందు, చలత్ = సంచరించే, చరణ-అరవిందమ్ = పాదపద్మమును, సః = అట్టి, అహమ్ = నేను, శరణం వ్రజామి = శరణు జొచ్చుచున్నాను, యేన = ఏ భగవానునిచే, అసతః = దుష్టుడనగు, మే = నాకు, అనురూపా = తగిన, ఈదృశీ = ఇట్టి, గతిః = గర్భవాసరూపమగు ఫలము, అదర్శి = చూపబడినదో.

భగవానుడు తనను శరణు జొచ్చిన జగత్తును రక్షించుట కొరకై తన ఇచ్ఛచే అనేకరూపములను స్వీకరించి భూమిపై అవతరించును. భూమిపై సంచరించే సర్వాభయస్థానమగు ఆయన పాదపద్మమును నేను శరణు జొచ్చుచున్నాను. ఆయన దుష్టుడనగు నాకు తగిన ఇట్టి గర్భవాసఫలమును చూపించినాడు.

యస్త్వత్ర బద్ధ ఇవ కర్మభిరావృతాత్మా
భూతేంద్రియాశయమయీమవలంబ్య మాయామ్ ।
ఆస్తే విశుద్ధమవికారమఖండబోధ-
మాతప్యమానహృదయేఽవసితం నమామి ॥ 13

భూత-ఇంద్రియ-ఆశయమయీమ్ = దేహము ఇంద్రియములు అంతఃకరణములుగా పరిణమించిన, మాయామ్ = ప్రకృతిని, అవలంబ్య =

ఆత్మరూపముగా భావించి, కర్మభిః = కర్మలచే, ఆవృత-ఆత్మా = కప్పివే యబడిన స్వరూపము గలవాడై, అత్ర = ఈ తల్లి ఉదరమునందు, బద్ధః ఇవ = బంధింపబడినవాడు వలె, యః తు = ఏ జీవుడైతే, ఆస్తే = ఉన్నాడో అట్టి నేను, విశుద్ధమ్ = ఉపాధిసంబంధము లేనట్టియు, అవికారమ్ = జన్మాది వికారములు లేనట్టియు, అఖండబోధమ్ = జ్ఞాతృజ్ఞేయభేదము లేని జ్ఞానస్వరూపుడైనట్టియు, ఆతప్యమానహృదయే = పరితాపమును చెందిన హృదయమునందు, అవసితమ్ = తెలియబడుచున్న భగవానుని, నమామి = నమస్కరించుచున్నాను.

ప్రకృతియే పరిణామమును చెంది దేహము ఇంద్రియములు అంతఃకరణము అనే రూపముగా నున్నది. జీవుడు దానినే తానుగా పొర పడి కర్మలను చేయుచూ వాటి ఫలమగు పాపపుణ్యములచే కప్పివేయబ డిన స్వరూపము గలవాడై బంధితుడు వలె తల్లి ఉదరములో నున్నాడు. అట్టి నేను ఉపాధిసంపర్కము లేని ఆ పరమేశ్వరునకు నమస్కరించుచు న్నాను. జన్మాది వికారములు లేని ఆ పరమేశ్వరుడు నా పీడితమైన హృద యములో భాసించుచున్నాడు. జ్ఞానస్వరూపుడగు ఆయనయందు జ్ఞాత, జ్ఞేయము అనే భేదము లేదు.

యః పంచభూతరచితే రహితశ్శరీరే
ఛన్నోఽయథేంద్రియగుణార్థచిదాత్మకోఽహమ్ ।
తేనావికుంఠమహిమానమృషిం తమేనం
వందే పరం ప్రకృతిపూరుషయోః పుమాంసమ్ ॥ 14

యః = ఏ నేను, పంచభూతరచితే = పంచభూతములచే నిర్మించ బడిన, శరీరే = శరీరమునందు; అయథా = అయథార్థముగా, ఇంద్రియగుణ -అర్థచిత్-ఆత్మకః = ఇంద్రియములు సత్త్వరజస్తమోగుణముల కార్యము లగు దేహము మనస్సు శబ్దాదులు చిదాభాసలే స్వరూపముగా గలవాడు గా, ఛన్నః = కప్పబడియున్నానో, తేన = దానిచే, రహితః = సంబంధములే ని, అహమ్ = నేను, అవికుంఠమహిమానమ్ = మొక్కవోని మహిమ గలిగి నట్టియు, ఋషిమ్ = సర్వజ్ఞుడైనట్టియు, ప్రకృతిపురుషయోః = ప్రకృతిపురు

షులకు, పరమ్ = అతీతుడైన, తమ్ = అట్టి, ఏనమ్ = ఈ, పుమాంసమ్ = పరమపురుషుని, వందే = నమస్కరించుచున్నాను.

సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతియొక్క కార్యములగు పంచ భూతములచే రచించబడిన ఈ దేహముతో గాని, ఇంద్రియములతో గాని, శబ్దము మొదలగు విషయములతో గాని, ఈ అంతఃకరణమునందు చిదాభాసయగు అహంకారముతో గాని నాకు వాస్తవముగా సంబంధము లేదు. కాని, సంబంధము భాసించుటచే నేను వాటికి కట్టుబడి యున్నాను. అట్టి నేను మొక్కవోని మహిమగల సర్వజ్ఞుడగు ఆ పరమపురుషునకు నమస్కరించుచున్నాను. ఆయన ప్రకృతికి, జీవతత్త్వములకు అతీతమైనవాడు.

యన్మాయయోరుగుణకర్మనిబంధనేఽస్మిన్
సాంసారికే పథి చరంస్తదభిశ్రమేణ ।
నష్టస్మృతిః పునరయం ప్రవృణీత లోకం
యుక్త్యా కయా మహదనుగ్రహమంతరేణ ॥ 15

యత్-మాయయా = ఏ పరమేశ్వరుని మాయచే, నష్టస్మృతిః = నశించిన స్మృతిగల, అయమ్ = ఈ జీవుడు, ఉరుగుణకర్మనిబంధనే = అనేకములగు సత్త్వాది గుణములు అవి నిమిత్తముగా గల కర్మలు చాల గట్టిగా బంధించే, అస్మిన్ = ఈ, సాంసారికే = సంసారమునకు సంబంధించిన, పథి = మార్గమునందు, తదభిశ్రమేణ = దాని శ్రమచే, చరన్ = సంచరించుచున్నవాడై, మహత్-అనుగ్రహం అంతరేణ = ఆ పరబ్రహ్మ అనుగ్రహము లేకుండగా, కయా = ఏ, యుక్త్యా = ఉపాయముచే, పునః = మరల, లోకమ్ = స్వరూపమును, ప్రవృణీత = తెలుసుకొనును?

ఈ జననమరణప్రవాహరూపమగు సంసారమార్గములో సత్త్వరజస్తమోగుణములు, అవి నిమిత్తముగా గల కర్మలు జీవుని గట్టిగా బంధించును. ఈ జీవుడు పరమేశ్వరుని మాయచే తన స్వరూపమును విస్మరించి అట్టి సంసారమార్గములో చాల శ్రమ పడుతూ సంచరించుచున్నాడు. అట్టి జీవుడు ఆ పరమేశ్వరుని అనుగ్రహము లేకుండగా మరే ఉపాయముచే తిరిగి తన స్వరూపమును తెలియగల్గును?

జ్ఞానం యదేతదదధాత్కతమస్స దేవః
త్రైకాలికం స్థిరచరేష్వనువర్తితాంశః ।
తం జీవకర్మపదవీమనువర్తమానాః
తాపత్రయోపశమనాయ వయం భజేమ ॥ 16

యత్ = ఏ, త్రైకాలికమ్ = మూడు కాలములకు సంబంధించిన, జ్ఞానమ్ = జ్ఞానము గలదో, ఏతత్ = దీనిని, కతమః = ఎవ్వాడు, అదధాత్ = కలిగించినాడు?, స్థిరచరేషు = స్థావరజంగమములయందు, అనువర్తిత -అంశః = అనువృత్తమైన అంశగల, సః = ఆ, దేవః = దేవుడు, అదధాత్ = కలిగించినాడు, జీవకర్మపదవీమ్ = జీవుని కర్మల మార్గమును, అనువర్త మానాః = అనుసరించే, వయమ్ = మేము, తాపత్రయోపశమనాయ = మూడు విధముల తాపముయొక్క ఉపశమనము కొరకు, తమ్ = ఆ దేవుని, భజేమ = సేవించుచున్నాము.

నాకు ఇప్పుడు భూతభవిష్యద్వర్తమానములు తెలియుచున్నవి. ఈ జ్ఞానము నాకెక్కడిది? స్థావరజంగమములగు ప్రాణులలో అంతర్యామి రూపముగా వ్యాపించియున్న ఆ దేవుడు నాకీ జ్ఞానమునిచ్చినాడు. జీవుడు తాను చేసుకున్న కర్మలచే నిర్ణయించబడిన మార్గములో ముందుకు సాగు చుండును. అట్టి నేను మూడు విధముల తాపము శాంతించుట కొరకై ఆ దేవుని కొలుచుచున్నాను.

దేహ్యన్యదేహవివరే జఠరాగ్నినాసృగ్-
విణ్మూత్రకూపపతితో భృశతప్తదేహః ।
ఇచ్ఛన్నితో వివసితుం గణయన్ స్వమాసాన్
నిర్వాస్యతే కృపణధీర్భగవన్ కదా ను ॥ 17

భగవన్ = ఓ భగవానుడా!, అన్యదేహవివరే = మరియొక దేహము లోని వివరమునందు, అసృగ్-విణ్మూత్రకూపపతితః = రక్తము మలమూత్ర ముల కూపమునందు పడియున్న, దేహీ = జీవుడు, జఠర-అగ్నినా = జఠ రాగ్నిచే, భృశతప్తదేహః = మిక్కిలి తపింపజేయబడిన దేహము గలవాడై, కృపణధీః = దీనమైన అంతఃకరణము గలవాడై, ఇతః = ఈ వివరమునుండి,

వివసితుమ్ = బయట పడుటకు, ఇచ్ఛన్ = కోరుచున్నవాడై, స్వమాసాన్ = తన మాసములను, గణయన్ = లెక్కపెట్టుచున్నవాడై, కదా ను నిర్వాస్యతే = ఎప్పుడు బయట పడవేయబడును?

ఓ భగవాన్! దేహినగు నేను మరియొక దేహి (తల్లి) యొక్క కుక్షి యందు రక్తము మలమూత్రముల కూపములో పడియున్నాను. ఈ జఠ రాగ్ని నన్ను చాల తపింపజేయుచున్నది. నా మనస్సు దైన్యము తో నిండి యున్నది. దీనినుండి బయట పడాలని నేను కోరుకుంటూ, నెల ను లెక్క పెట్టుకుంటున్నాను. నన్ను నీవు ఎప్పుడు బయట పడవేసెదవు

యేనేదృశీం గతిమసౌ దశమాస్య ఈశ
సంగ్రాహితః పురుదయేన భవాదృశేన ।
స్వేనైవ తుష్యతు కృతేన స దీననాథః
కో నామ తత్ప్రతి వినాంజలిమస్య కుర్యాత్ ॥18

ఈశ = ఓ పరమేశ్వరా!, భవాదృశేన = నీకు నీవే సాటియైన, పురు దయేన = నిరతిశయమగు దయగల, యేన = ఏ నీచే, దశమాస్యః = పది నెలల వయస్సు గల, అసౌ = ఈ నేను, ఈదృశీమ్ = ఇటువంటి, గతిమ్ = పూర్వజన్మజ్ఞానమును, సంగ్రాహితః = ఈయబడినవాడనో, దీననాథః = దీనులకు పాలకుడగు, సః = ఆ భగవానుడు, స్వేన = తన, కృతేన ఏవ = ఉపకారముచే మాత్రమే, తుష్యతు = సంతోషించుగాక!, అస్య = ఇట్టి భగ వానునకు, అంజలిం వినా = చేతులు జోడించి నమస్కరించుట మినహా, కః నామ = ఎవ్వాడు, తత్ = ఆ ఉపకారమును, ప్రతి కుర్యాత్ = ప్రత్యుపకార మును చేయును?

ఓ పరమేశ్వరా! నేను పది నెలల వయస్సు గల అయోగ్యుడను. కాని నిరతిశయమగు దయగల నీవు నాకీ పూర్వజన్మజ్ఞానమును కలిగించి నావు. నీకు నీవే సాటి. నీవు దీనులను పాలించువాడవు. నీవు చేసిన ఈ ఉపకారమే నీకు సంతోషమును కలిగించుగాక! చేతులు జోడించి నమస్క రించుట మినహా నీకు ప్రత్యుపకారమును చేయగలవాడెవ్వడు గలడు?

పశ్యత్యయం ధిషణయా నను సప్తవధ్రిః
శారీరకే దమశరీర్యపరస్స్వదేహే ।
యత్సృష్టయాఽఽసం తమహం పురుషం పురాణం
పశ్యే బహిర్హృది చ చైత్యమివ ప్రతీతమ్ ॥ 19

అయమ్ = ఈ, అపరః = ఇతరమగు (పశువు మొదలైన), సప్తవధ్రిః = ఏడు ధాతువుల స్థూలదేహమునకు కట్టుబడియున్న జీవుడు, స్వదేహే = తన దేహమునందు, శారీరకే = శరీరమునందు కలిగే సుఖదుఃఖములను, పశ్యతి = చూచుచున్నాడు, అహం నను = నేనైతే, యత్-సృష్టయా = ఎవనిచే ఈయబడిన, ధిషణయా = వివేకజ్ఞానముచే, దమశరీరీ = శమదమాదులతో గూడిన శరీరము గలవాడనై, ఆసమ్ = అయితినో, హృది = హృదయమునందు, చైత్యం ఇవ = అహంకారమును వలె, బహిః చ = బయట కూడ, ప్రతీతమ్ = అనుభవమునకు వచ్చే, తమ్ = అట్టి, పురాణమ్ = అనాదియగు, పురుషమ్ = పూర్ణపరమాత్మను, పశ్యే = దర్శించుచున్నాను.

ఇతరజీవులగు పశుపక్ష్యాదులు ఏడు ధాతువుల స్థూలశరీరమునకు మాత్రమే కట్టుబడి ఆ తన దేహమునందు కలిగే సుఖదుఃఖములను మాత్రమే అనుభవిస్తూ ఉండును. కాని, నాకు భగవానుడు వివేకజ్ఞానమునిచ్చినాడు. నేను దానితో నా హృదయములో అహంకారమునకు ఆశ్రయమగు ఆత్మరూపములో భాసించే ఆ పరమేశ్వరుని అపరోక్షముగా దర్శించుచున్నాను. ఆ పురాణపురుషుడే బయట కూడ జగద్రూపముగా భాసిల్లుచున్నాడు.

సోఽహం వసన్నపి విభో బహుదుఃఖవాసం
గర్భాన్న నిర్జిగమిషే బహిరంధకూపే ।
యత్రోపయాతముపసర్పతి దేవమాయా
మిథ్యామతిర్యదను సంసృతిచక్రమేతత్ ॥ 20

విభో = ఓ ప్రభూ!, సః = అట్టి, అహమ్ = నేను, బహుదుఃఖవాసమ్ = అనేకదుఃఖములతో సహవాసముగా, వసన్ అపి = నివసించుచున్ననూ, గర్భాత్ = ... మునుండి, బహిః = బయట, అంధకూపే = చీకటి నుయ్యి

వంటి సంసారమునందు, న నిర్జిగమిషే = బయట పడాలని కోరుటలేదు, యత్ర = ఎచ్చోటకు, ఉపయాతమ్ = చేరుకున్న జీవుని, దేవమాయా = విష్ణుమాయ, ఉపసర్పతి = కప్పివేయునో, మిథ్యామతిః = మిథ్యారూపము లయందు అభిమానము గలవాడు అగునో, యత్-అను = దేని తరువాత, ఏతత్ = ఈ, సంసృతిచక్రమ్ = సంసారచక్రమో.

ఓ ప్రభూ! నేనీ గర్భములో అనేకములగు దుఃఖములతో బాటు కలిసి కాపురము చేయుచున్నాను. కాని, ఇక్కడనుండి నిష్క్రమించి బయటనున్న అజ్ఞానాంధకారములోనికి రావాలని నాకు ఇచ్ఛ కలుగుట లేదు. ఏలయనగా బయట నన్ను విష్ణుమాయ కప్పివేయును. మిథ్యారూపమగు అభిమానము నన్ను పట్టుకొనును. దాని వెంటనే జననమరణరూపమగు సంసారచక్రముపై పరిభ్రమణము ఆరంభమగును.

తస్మాదహం విగతవిక్లబ ఉద్ధరిష్య
ఆత్మానమాశు తమసస్సుహృదాఽఽత్మనైవ ।
భూయో యథా వ్యసనమేతదనేకరంధ్రం
మా మే భవిష్యదుపసాదితవిష్ణుపాదః ॥ 21

తస్మాత్ = అందువలన, అహమ్ = నేను, విగతవిక్లబః = తొలగిన ఆదుర్దా గలవాడనై, సుహృదా = హితకారియగు, ఆత్మనా ఏవ = బుద్ధిచేతనే, ఉపసాదితవిష్ణుపాదః = హృదయమును పొందించబడిన శ్రీహరి యొక్క పాదములు గలవాడనై, ఆశు = శీఘ్రముగా, ఆత్మానమ్ = నన్ను, తమసః = అజ్ఞానమునుండి, ఉద్ధరిష్యే = ఉద్ధరించుకొనెదను, యథా = ఏ విధముగానైతే, భూయః = మరల, అనేకరంధ్రమ్ = అనేకదోషములు (నవ రంధ్రములు) గల, ఏతత్ = ఈ, వ్యసనమ్ = దుఃఖము, మే = నాకు, మా భవిష్యత్ = కలుగకుండునో.

కావున, నేను ఈ దుఃఖమును విడిచిపెట్టి, బుద్ధితో హృదయము నందు శ్రీహరియొక్క పాదములను స్మరించెదను. అట్లు స్మరించు బుద్ధి మాత్రమే నాకు హితకారి యగును. తద్ద్వారా నన్ను నేను శీఘ్రముగా ఈ అజ్ఞానము (సంసారకూపము) నుండి ఉద్ధరించుకొనెదను. దానివలన నాకు

మరల అనేకదోషములతో కూడిన (నవరంధ్రములతో కూడిన దేహము నందు దేహియై జన్మించుట అనే) ఈ దుఃఖము కలుగకుండును.

కపిల ఉవాచ ।
ఏవం కృతమతిర్గర్భే దశమాస్యః స్తువన్నృషిః ।
సద్యః క్షిపత్యవాచీనం ప్రసూత్యై సూతిమారుతః ॥ 22

ఏవమ్ = ఈ విధముగా, దశమాస్యః = పది మాసముల వయస్సు గలిగినట్టియు, ఋషిః = వివేకజ్ఞానము గల ఆ జీవుడు, కృతమతిః = చేయ బడిన నిశ్చయము గలవాడై, స్తువన్ = స్తుతించువాడై ఉండును, అవాచీ నమ్ = అధోముఖుడైయున్న ఆ శిశువును, సూతిమారుతః = ప్రసవకాలము నందలి వాయువు, ప్రసూత్యై = ప్రసవము కొరకు, సద్యః = వెంటనే, క్షిపతి = త్రోయును.

పదిమాసముల ఆ జీవుడు ఈ విధముగా వివేకజ్ఞానము గలవాడై తనను తాను ఉద్ధరించుకోవాలనే నిశ్చయముతో ఈశ్వరుని స్తుతించుచుం డును. ఇంతలో ప్రసవకాలమునకు సంబంధించిన వాయువు అధోముఖుడు గానున్న ఆ శిశువును ప్రసవము కొరకు క్రిందకు త్రోయును.

తేనావసృష్టస్సహసా కృత్వావాక్ శిర ఆతురః ।
వినిష్క్రామతి కృచ్ఛ్రేణ నిరుచ్ఛ్వాసో హతస్మృతిః ॥ 23

తేన = ఆ వాయువుచే, సహసా = వేగముగా, అవసృష్టః = త్రోయ బడిన శిశువు, శిరః = తలను, అవాక్ = క్రిందకు, కృత్వా = ఉంచి, ఆతురః = వ్యాకులుడై, నిరుచ్ఛ్వాసః = శ్వాస లేనివాడై, హతస్మృతిః = నశించిన పూర్వజన్మజ్ఞానము గలవాడై, కృచ్ఛ్రేణ = కష్టముతో, వినిష్క్రామతి = బయటకు వచ్చును.

ఆ శిశువును ప్రసవవాయువు వేగముగా త్రోయుచుండగా చాల పీడను పొంది తలను క్రిందకు ఉంచి అతికష్టముతో బయటకు వచ్చును. ఆ సమయములో ఆ శిశువునకు శ్వాస ఉండదు. ఆ జీవుని పూర్వజన్మస్మృతి కూడ నశించును.

పతితో భువ్యసృఙ్మూత్రే విష్ఠాభూరివ చేష్టతే ।
రోరూయతి గతే జ్ఞానే విపరీతాం గతిం గతః ॥ 24

భువి = నేలపై, అసృక్-మూత్రే = రక్తమునందు మూత్రమునందు, పతితః = పడినవాడై, విష్ఠాభూః ఇవ = క్రిమివలె, చేష్టతే = కదలాడును, జ్ఞానే = పూర్వజన్మజ్ఞానము, గతే = నశించగా, విపరీతాం గతిమ్ = జ్ఞానవిరుద్ధమగు దేహాభిమానమును, గతః = పొందినవాడై, రోరూయతి = వెక్కి వెక్కి ఏడ్చును.

ఆ శిశువు నేలపై రక్తమూత్రములలో పడి క్రిమివలె కదలాడును. ఆ జీవుని జ్ఞానము నశించుటచే, జ్ఞానవిరుద్ధమగు దేహాభిమానము గలవాడై వెక్కి వెక్కి ఏడ్చును.

పరచ్ఛందం న విదుషా పుష్యమాణో జనేన సః ।
అనభిప్రేతమాపన్నః ప్రత్యాఖ్యాతుమనీశ్వరః ॥ 25

పర-ఛందమ్ = శిశువుయొక్క ఇచ్ఛను, న విదుషా = యెరుగని, జనేన = వ్యక్తిచే, పుష్యమాణః = పోషించబడే, సః = ఆ శిశువు, అనభిప్రేతమ్ = ఇష్టము కానిదానిని, ఆపన్నః = పొందినవాడై, ప్రత్యాఖ్యాతుమ్ = త్రోసిపుచ్చుటకు, అనీశ్వరః = సమర్థుడు కాడు.

శిశువుయొక్క అభీష్టము శిశువును పోషించే తల్లికి తెలియదు. ఆ విధముగా విషయము తెలియని వ్యక్తిచే పోషించబడే ఆ శిశువునకు తనకు అభీష్టము కానిది తనమీద రుద్దబడినప్పుడు వద్దని త్రోసిపుచ్చే సామర్థ్యము ఉండదు.

శాయితోఽశుచిపర్యంకే జంతుస్స్వేదజదూషితే ।
నేశః కండూయనేఽంగానామాసనోత్థానచేష్టనే ॥ 26

స్వేదజదూషితే = నల్లులు మొదలగు చెమటనుండి పుట్టే క్రిములచే దుఃఖమును కలిగించే, అశుచిపర్యంకే = అశుచియగు శయ్యపై, శాయితః = పరుండపెట్టబడిన, జంతుః = ఆ శిశువు, అంగానామ్ = అవయ

వముల, కండూయనే = గోకుకొనుటయందు, ఆసన-ఉత్థానచేష్టనే = కూర్చుండుట లేచుట కదలుటయందు, న ఈశః = సమర్థము కాదు.

ఆ శిశువును పరుండబెట్టిన శయ్య అశుచియై, నల్లులు మొదలైన చెమటనుండి పుట్టే క్రిములతో దుఃఖమును కలిగించును. ఆ శిశువు తన శరీరముయొక్క అవయవములకు దురద కలిగినచో గోకుకొనలేదు, కూర్చుండలేదు, లేవలేదు. ఇటునటు కదలుటయైననూ ఆ శిశువునకు చేతకాదు.

తుదంత్యామత్వచం దంశా మశకా మత్కుణాదయః ।
రుదంతం విగతజ్ఞానం కృమయః కృమికం యథా ॥ 27

ఆమత్వచమ్ = కోమలమగు చర్మము గలిగినట్టియు, రుదంతమ్ = ఏడ్చుచున్నట్టియు, విగతజ్ఞానమ్ = తొలగిపోయిన వివేకజ్ఞానముగల ఆ శిశువును, దంశాః = ఈగలు, మశకాః = దోమలు, మత్కుణ-ఆదయః = నల్లులు మొదలగునవి, కృమయః = క్రిములు, కృమికం యథా = క్రిమిని వలె, తుదంతి = కుట్టును.

గర్భమునందుండగా ఉండిన జ్ఞానము ఇప్పుడా శిశువునకు తొలగిపోయినది. మిక్కిలి కోమలమగు శరీరముగల ఆ శిశువును ఈగలు, దోమలు, నల్లులు, క్రిములు మొదలగునవి చిన్న క్రిమిని వలె కుడుతూ ఉంటే, ఆ శిశువు ఏడ్చుచుండును.

ఇత్యేవం శైశవం భుక్త్వా దుఃఖం పౌగండమేవ చ ।
అలబ్ధాభీప్సితోఽజ్ఞానాదిద్ధమన్యుశ్శుచార్పితః ॥ 28

ఇతి ఏవమ్ = ఈ విధముగా, శైశవమ్ = శిశు అవస్థయందలి, పౌగండమ్ = కుమారావస్థయందలి, దుఃఖం ఏవ చ = దుఃఖమును కూడ, భుక్త్వా = అనుభవించి, అలబ్ధ-అభీప్సితః = పొందబడని అభీష్టము గలవాడై, అజ్ఞానాత్ = అజ్ఞానము వలన, ఇద్ధమన్యుః = ప్రజ్వరిల్లిన కోపము గలవాడై, శుచా = శోకముచే, అర్పితః = వ్యాపించబడియుండును.

ఈ విధముగా ఆ జీవుడు శైశవమునందు, యౌవనమునకు పూర్వమునందలి అవస్థయందు కూడ దుఃఖముననుభవించును. యౌవనములో

వాని కోరికలు తీరకపోవుటచే కోపము ప్రజ్వరిల్లి, ఆతడు అధికమగు దుఃఖ మునకు లోనగును.

సహ దేహేన మానేన వర్ధమానేన మన్యునా ।
కరోతి విగ్రహం కామీ కామిష్వంతాయ చాత్మనః ॥ 29

కామీ = కాముకుడగు జీవుడు, దేహేన సహ = దేహముతో బాటు, వర్ధమానేన = పెరుగుచున్న, మానేన = అభిమానముతో, మన్యునా = కోప ముతో, ఆత్మనః = తన, అంతాయ = వినాశము కొరకు, కామిషు = ఇతరకా ముకులయందు, విగ్రహమ్ = విరోధమును, కరోతి = చేయును.

కాముకుడగు ఆ జీవుని అభిమానము, కోపము దేహముతోబాటు పెరుగుచుండును. కావుననే, ఆతడు తన వినాశమును కొని తెచ్చుకొనుట కై, ఇతరులగు కాముకులతో కలహించును.

భూతైః పంచభిరారబ్ధే దేహే దేహ్యబుధోఽసకృత్ ।
అహం మమేత్యసద్గ్రాహః కరోతి కుమతిర్మతిమ్ ॥ 30

అబుధః = అవివేకి, అసత్-గ్రాహః = చెడు పట్టుదల గలవాడు, కుమతిః = చెడు ఆలోచనలు గలవాడు అగు, దేహీ = ఆ జీవుడు, పంచభిః = ఐదు, భూతైః = భూతములచే, ఆరబ్ధే = ఉత్పన్నము చేయబడిన, దేహే = దేహమునందు, అసకృత్ = సర్వదా, అహమ్ = నేను, మమ = నాది, ఇతి = అనే, మతిమ్ = అభిమానమును, కరోతి = చేయును.

అవివేకి, చెడు పట్టుదల గలవాడు, చెడు ఆలోచనలు గలవాడు అగు ఆ జీవుడు పంచభూతముల కలయికచే పుట్టిన దేహమునందు నేను, నాది అనే అభిమానమును కలిగియుండును.

తదర్థం కురుతే కర్మ యద్బద్ధో యాతి సంసృతిమ్ ।
యోఽనుయాతి దదత్ క్లేశమవిద్యాకర్మబంధనః ॥ 31

తత్-అర్థమ్ = ఆ దేహము కొరకు, కర్మ = కర్మను, కురుతే = చేయును, యత్-బద్ధః = దేనిచే బంధించబడినవాడై, సంసృతిమ్ = సంసార

మును, యాతి = పొందునో, అవిద్యాకర్మబంధనః = అవిద్యచే చేయబడిన కర్మచే నిర్మించబడే, యః = ఏ దేహము, క్లేశమ్ = దుఃఖమును, దదత్ = ఇచ్చుచున్నదై, అనుయాతి = అనుసరించి వచ్చునో..

జీవుడు దేహము కొరకు కర్మను చేయును. ఆ కర్మ వానిని బంధించి, జననమరణప్రవాహరూపమగు సంసారములో బడద్రోయును. అజ్ఞానముచే చేయబడిన కర్మ వలననే ఆ దేహము నిర్మాణమైనది. అట్టి దేహము వానికి దుఃఖమునే ఇస్తూ వెంట వచ్చును.

యద్యసద్భిః పథి పునశ్శిశ్నోదరకృతోద్యమైః ।
ఆస్థితో రమతే జంతుస్తమో విశతి పూర్వవత్ ॥ 32

జంతుః = ఆ జీవుడు, శిశ్న-ఉదరకృత-ఉద్యమైః = కామనా పరిపూర్తి కొరకు ఉదరపోషణ కొరకు చేయబడే ప్రయత్నము గల, అసద్భిః = దుష్టులతో, పథి = మార్గమునందు, ఆస్థితః = రుచి గలవాడై, రమతే యది = రమించే పక్షములో, పునః = మరల, పూర్వవత్ = పూర్వమునందు వలెనే, తమః = నరకమును, విశతి = పొందును.

ఆ వ్యక్తి సన్మార్గములోనున్నవాడే అయిననూ, కామపూర్తికొరకు ఉదరపోషణ కొరకు మాత్రమే కార్యనిరతులైయుండే దుష్టుల సంగమమునందు రుచి గలవాడై భోగలాలసుడైనచో, మరల పూర్వమునందు వలెనే నరకమును పొందును.

సత్యం శౌచం దయా మౌనం బుద్ధిః శ్రీర్హ్రీర్యశః క్షమా ।
శమో దమో భగశ్చేతి యత్సంగాద్యాతి సంక్షయమ్ ॥ 33

సత్యమ్ = సత్యము, శౌచమ్ = శౌచము, దయా = దయ, మౌనమ్ = మౌనము, బుద్ధిః = బుద్ధి, శ్రీః = సంపద, హ్రీః = వినయము, యశః = కీర్తి, క్షమా = సహనము, శమః = శమము, దమః = దమము, భగః చ = జ్ఞానము, ఇతి = అనునది, యత్-సంగాత్ = ఎవరి సంగము వలన, సంక్షయమ్ = వినాశమును, యాతి = పొందునో.

దుష్టులతోడి సంగము వలన సత్యము, అంతర బాహ్యములయం దలి పవిత్రత, దయ, మౌనము (మనస్సుయొక్క ప్రసన్నత), వివేకబుద్ధి, సంపద, వినయము, కీర్తి, సహనగుణము, మనోజయము, బాహ్యేంద్రియ నిగ్రహము, జ్ఞానము అనునవి నశించును.

తేష్వశాంతేషు మూఢేషు ఖండితాత్మస్వసాధుషు ।
సంగం న కుర్యాచ్ఛోచ్యేషు యోషిత్క్రీడామృగేషు చ ॥34

తేషు = అట్టి, అశాంతేషు = శాంతి లేనట్టియు, మూఢేషు = మోహ మును పొందియున్నట్టియు, ఖండిత-ఆత్మసు = దేహమునందు ఆత్మాభి మానము గల (విక్షిప్తమగు చిత్తము గల), శోచ్యేషు = శోకింపదగినట్టియు, చ = మరియు, యోషిత్-క్రీడామృగేషు = దుష్టస్త్రీలకు ఆటవస్తువులవలె వశులైయుండే, అసాధుషు = దుష్టులయందు, సంగమ్ = సంగమును, న కుర్యాత్ = చేయరాదు.

అట్టి దుష్టులు మోహమును పొందిన బుద్ధి గలవారగుటచే వారికి మనశ్శాంతి ఉండదు. దేహాభిమానము గల వారి చిత్తము కామాదులచే విక్షిప్తమై యుండును. దుష్టస్త్రీలకు ఆటబొమ్మలవలె వశులై యుండే అట్టి దుష్టులు శోకింపదగినవారే గాని, స్నేహము చేయదగినవారు కాదు.

న తథాస్య భవేన్మోహో బంధశ్చాన్యప్రసంగతః ।
యోషిత్సంగాద్యథా పుంసో యథా తత్సంగిసంగితః ॥ 35

అస్య = ఈ, పుంసః = జీవునకు, తథా = ఆ విధముగా, మోహః = మోహము, బంధః చ = బంధము, అన్యప్రసంగతః = ఇతరమునందు ఆసక్తి వలన, న భవేత్ = కలుగదు, యథా = ఏ విధముగానైతే, యోషిత్-సంగాత్ = దుష్టస్త్రీల సంగము వలన, యథా = ఏ విధముగానైతే, తత్-సంగిసం గతః = వారితోడి సంగము గలవారి సంగము వలన (కలుగునో).

ఈ జీవునకు దుష్టస్త్రీల సంగము వలన, వారితోడి సంగము గల వారి సంగము వలన కలిగే మోహము గాని, బంధము గాని ఇతరసంగ ముల వలన కలుగవు.

ప్రజాపతిస్స్వాం దుహితరం దృష్ట్వా తద్రూపధర్షితః ।
రోహిద్భూతాం సోఽన్వధావదృక్షరూపీ హతత్రపః ॥ 36

ప్రజాపతిః = బ్రహ్మగారు, స్వామ్ = తన, దుహితరమ్ = కుమార్తెను, దృష్ట్వా = చూచి, తత్-రూపధర్షితః = ఆమె రూపముచే మోహితుడై, రోహిత్-భూతామ్ = మృగము రూపములోనున్న ఆమెను, హతత్రపః = నశించిన లజ్జ గల, సః = ఆయన, ఋక్షరూపీ = మృగము రూపము గలవాడై, అన్వధావత్ = వెనుక పరుగెత్తెను.

బ్రహ్మ తన కుమార్తె రూపమును చూచి మోహమును చెందగా, ఆమె ఆడు లేడి రూపములో పరుగెత్తగా, ఆయన సిగ్గు లేకుండగా మగ లేడి రూపమును దాల్చి ఆమె వెంట పరుగెత్తెను.

తత్సృష్టసృష్టసృష్టేషు కో న్వఖండితధీః పుమాన్ ।
ఋషిం నారాయణమృతే యోషిన్మయ్యేహ మాయయా ॥ 37

ఇహ = ఈ లోకములో, తత్-సృష్టసృష్టసృష్టేషు = ఆ బ్రహ్మగారిచే సృష్టించబడిన మరీచి మొదలగు మహర్షులచే సృష్టించబడిన కశ్యపుడు మొదలగు ప్రజాపతులచే సృష్టించబడిన ప్రాణులయందు, నారాయణం ఋషిం ఋతే = నారాయణ మహర్షిని మినహాయించి, యోషిన్మయ్యా = స్త్రీరూపములోనున్న, మాయయా = మాయచే, అఖండితధీః = మోహమును పొందని, పుమాన్ = పురుషుడు, కః ను = ఎవడు గలడు?

బ్రహ్మగారు మరీచి మొదలగు మహర్షులను సృష్టించగా, వారు కశ్యపుడు మొదలగు ప్రజాపతులను సృష్టించగా, వారు దేవమనుష్యాదులను సృష్టించిరి. ఇట్టి ఈ సృష్టిలో స్త్రీరూపమగు మాయచే మోహింపబడని బుద్ధిగలవాడు, నారాయణ మహర్షిని మినహాయించి, మరి యెవడు గలడు?

బలం మే పశ్య మాయాయాః స్త్రీమయ్యా జయినో దిశామ్ ।
యా కరోతి పదాక్రాంతాన్ భ్రూవిజృంభేణ కేవలమ్ ॥ 38

స్త్రీమయ్యాః = స్త్రీరూపములోనున్న, మే = నా, మాయాయాః = మాయయొక్క, బలమ్ = బలమును, పశ్య = చూడుము, యా = ఏ స్త్రీ, కేవలమ్ = కేవలము, భ్రూవిజృంభేణ = కనుబొమల విరుపుచే, దిశామ్ = దిక్కుల, జయినః = జయించినవారిని కూడ, పద-ఆక్రాంతాన్ = స్వాధీనుల ను, కరోతి = చేయునో.

స్త్రీరూపములోనున్న నా మాయయొక్క బలమును చూడుము. స్త్రీ దిక్కులను జయించిన వీరులను కూడ తన కనుబొమల విరుపుచే పాదాక్రాంతులను చేసుకొనగల్గును.

సంగం న కుర్యాత్ప్రమదాసు జాతు
యోగస్య పారం పరమారురుక్షుః ।
మత్సేవయా ప్రతిలబ్ధాత్మలాభో
వదంతి యా నిరయద్వారమస్య ॥ 39

మత్-సేవయా = నా సేవచే, ప్రతిలబ్ధ-ఆత్మలాభః = పొందబడిన ఆత్మానాత్మవివేకము గలిగినట్టియు, యోగస్య = యోగముయొక్క, పరం పారమ్ = పరమపదమును, ఆరురుక్షుః = అధిష్ఠించగోరే భక్తుడు, జాతు = ఒకప్పుడైననూ, ప్రమదాసు = స్త్రీలయందు, సంగమ్ = సంగమును, న కుర్యాత్ = చేయరాదు, యా = ఏ స్త్రీ, అస్య = వీనికి, నిరయద్వారమ్ = నరకద్వారమని, వదంతి = చెప్పుచున్నారో.

నన్ను సేవించి ఆత్మానాత్మవివేకమును పొంది యోగముయొక్క పరమపదమును అధిష్ఠించగోరు భక్తుడు ఒకప్పుడైననూ దుష్టస్త్రీసంగ మును చేయరాదు. అట్టి సంగము వానికి నరకమునకు ద్వారము కాగలదని మహాత్ములు చెప్పుచున్నారు.

యోపయాతి శనైర్మాయా యోషిద్దేవవినిర్మితా ।
తామీక్షేతాత్మనో మృత్యుం తృణైః కూపమివావృతమ్ ॥ 40

యా = ఏ, దేవవినిర్మితా = భగవానునిచే నిర్మించబడిన, యోషిత్ = స్త్రీరూపములోనున్న, మాయా = మాయ, శనైః = మెల్లగా, ఉపయాతి =

సమీపించునో, తామ్ = ఆమెను, తృణైః = గడ్డిపరకలచే, ఆవృతమ్ = కప్పబడిన, కూపం ఇవ = నూతిని వలె, ఆత్మనః = తనకు, మృత్యుమ్ = మృత్యువునుగా, ఈక్షేత = దర్శించవలెను.

భగవానునిచే నిర్మించబడిన దుష్టస్త్రీరూపములోనున్న మాయ మెల్లగా సమీపించినప్పుడు, భక్తుడు గడ్డిచే కప్పబడిన నుయ్యివలె తనకు హానికరమని గ్రహించవలెను.

యాం మన్యతే పతిం మోహాన్మన్మాయామృషభాయతీమ్ ।
స్త్రీత్వం స్త్రీసంగతః ప్రాప్తో విత్తాపత్యగృహప్రదమ్ ॥ 41

స్త్రీసంగతః = స్త్రీసంగము వలన, స్త్రీత్వమ్ = స్త్రీత్వమును, ప్రాప్తః = పొందిన జీవుడు, మోహాత్ = మోహము వలన, ఋషభాయతీమ్ = పురుషుని వలె ప్రవర్తించుచున్న, యామ్ = ఏ, మత్-మాయామ్ = నా మాయను, విత్త-అపత్యగృహప్రదమ్ = ధనమును సంతానమును గృహమును ఇచ్చే, పతిమ్ = భర్తనుగా, మన్యతే = తలపోయునో.

జీవుడు పూర్వజన్మలో స్త్రీసంగము వలన ఈ జన్మలో స్త్రీయై పుట్టినాడు. అట్టి స్త్రీ తనకు ధనమును సంతానమును గృహమును ఇచ్చిన ఏ పురుషుని తన భర్తగా భావించుచున్నదో, ఆతడు పురుషుని రూపములోనున్న నా మాయయే.

తామాత్మనో విజానీయాత్పత్యపత్యగృహాత్మకమ్ ।
దైవోపసాదితం మృత్యుం మృగయోర్గాయనం యథా ॥ 42

పతి-అపత్యగృహ-ఆత్మకమ్ = భర్త సంతానము ఇల్లు రూపములో నున్న, తామ్ = ఆ మాయను, మృగయోః = కిరాతుని, గాయనం యథా = గానము వలె, ఆత్మనః = తనకు, దైవ-ఉపసాదితమ్ = దైవముచే పొందించబడిన, మృత్యుమ్ = మృత్యువుగా, విజానీయాత్ = తెలియవలెను.

కిరాతుడు పాడే పాట మృగములకు మృత్యువు అగును. అదే విధముగా, భర్త సంతానము ఇల్లు రూపములోనున్న ఆ మాయ తనకు దైవము సమకూర్చిన మృత్యువేనని స్త్రీ గ్రహించవలెను.

దేహేన జీవభూతేన లోకాల్లోకమనువ్రజన్ ।
భుంజాన ఏవ కర్మాణి కరోత్యవిరతం పుమాన్ ॥ 43

జీవభూతేన = జీవునకు ఉపాధియగు, దేహేన = లింగశరీరముచే, లోకాత్ = ఒక లోకమునుండి, లోకమ్ = మరియొక లోకమును గురించి, అనువ్రజన్ = పయనించుచున్న, పుమాన్ = పురుషుడు, భుంజానః ఏవ = కర్మఫలముననుభవిస్తూనే, కర్మాణి = కర్మలను, అవిరతమ్ = నిరంతరముగా, కరోతి = చేయుచున్నాడు.

జీవుడు తనకు ఉపాధియగు లింగశరీరముతో ఒక లోకమునుండి మరియొక లోకమునకు, ఒక దేహమునుండి మరియొక దేహమునకు వెళ్లుచునే యుండును. జీవుడు ఆ విధముగా ఒకవైపు కర్మఫలముననుభవిస్తూనే మరల కొత్త కర్మలను నిరంతరముగా చేయుచుండును.

జీవో హ్యస్యానుగో దేహో భూతేంద్రియమనోమయః ।
తన్నిరోధోऽస్య మరణమావిర్భావస్తు సంభవః ॥ 44

జీవః = లింగశరీరము, అస్య = ఈ జీవునకు, అనుగః = అనుసరించియుండునది, భూత-ఇంద్రియమనోమయః = పంచభూతములు ఇంద్రియములు మనస్సులతో కూడిన, దేహః = దేహము, అస్య = ఈ జీవునకు, తత్-నిరోధః = ఆ రెండు కలిసి పని చేయకపోవుట, మరణమ్ = మరణము, ఆవిర్భావః తు = కలిసి ప్రకటమగుటయే, సంభవః = జన్మ.

లింగశరీరము జీవునితో మోక్షము వరకు కొనసాగును. పంచభూతములు, ఇంద్రియములు, మనస్సులతో కూడిన దేహము ఆ జీవునకు భోగసాధనము. జీవుడు, ఉపాధి రెండు కలిసి పని చేసే సామర్థ్యమును కోల్పోవుటయే మరణము. అవి రెండు కలిసి ప్రకటమగుటయే జన్మ.

ద్రవ్యోపలబ్ధిస్థానస్య ద్రవ్యేక్షాయోగ్యతా యదా ।
తత్పంచత్వమహంమానాదుత్పత్తిర్ద్రవ్యదర్శనమ్ ॥ 45

ద్రవ్య-ఉపలబ్ధిస్థానస్య = ద్రవ్యము తెలియబడే స్థానమగు స్థూల దేహమునకు, యదా = ఏ కాలమునందైతే, ద్రవ్య-ఈక్షా-అయోగ్యతా = ద్రవ్యమును దర్శించే యోగ్యత కొరవడునో, తత్ = అది, పంచత్వమ్ = మరణము, అహంమానాత్ = నేను అనే అభిమానము వలన, ద్రవ్యదర్శనమ్ = ద్రవ్యముల ఉపలబ్ధి కలుగుట, ఉత్పత్తిః = పుట్టుక.

పదారథములు తెలియబడే స్థానము స్థూలదేహము. ఒక కాలములో దానికి ఆ యోగ్యత కొరవడును. అదియే మరణము. స్థూలదేహమును చూచి దానియందు, ఇది నేను అనే అభిమానమును కలిగి పదార్థములను దర్శించుట దానికి జన్మ.

యథాక్ష్ణోర్ద్రవ్యావయవదర్శనాయోగ్యతా యదా ।
తదైవ చక్షుషో ద్రష్టుర్ద్రష్టృత్వాయోగ్యతానయోః ॥ 46

యథా = ఏ విధముగానైతే, అక్ష్ణోః = కన్నులకు, యదా = ఏ కాలమునందు, ద్రవ్య-అవయవదర్శన-అయోగ్యతా = ద్రవ్యధర్మమగు రూపమును దర్శించే సామర్థ్యము లేకుండునో, తదా ఏవ = అప్పుడు మాత్రమే, చక్షుషః = ఇంద్రియమునకు (అయోగ్యత), అనయోః = ఈ రెండింటికీ (అయోగ్యతయే), ద్రష్టుః = జీవునకు, ద్రష్టృత్వ-అయోగ్యతా = చూచే సామర్థ్యము లేకుండును.

కంటిలో దోషముచే రూపమును గ్రహించే శక్తి కొరవడినప్పుడు, కంటి గోళకములోని చక్షురింద్రియమునకు కూడ చూచే శక్తి లోపించును. కన్ను, దానిలోని ఇంద్రియము అనే రెండు అసమర్థములైన కాలములో వాటిని రెండింటినీ దర్శించే జీవునియందు చూచే సామర్థ్యము లుప్తమగును. జీవుని జన్మమరణములు కూడ ఇట్టి ఉపాధిధర్మములు మాత్రమే.

తస్మాన్న కార్యస్సంత్రాసో న కార్పణ్యం న సంభ్రమః ।
బుద్ధ్వా జీవగతిం ధీరో ముక్తసంగశ్చరేదిహ ॥ 47

తస్మాత్ = కావున, సంత్రాసః = భయము, న కార్యః = చేయబడరాదు, కార్పణ్యమ్ = దైన్యము, న = చేయబడరాదు, సంభ్రమః = మోహము,

న = చేయబడరాదు, ధీరః = వివేకి, జీవగతిమ్ = జీవుని తత్త్వమును, బుద్ధ్వా = తెలుసుకొని, ముక్తసంగః = విడువబడిన ఆసక్తి గలవాడై, ఇహ = ఈ సంసారమునందు, చరేత్ = సంచరించవలెను.

కావున, వివేకి భయపడరాదు; దైన్యమును పొందరాదు; మోహమునకు తావీయరాదు. ఆతడు జీవుని స్వరూపమగు ఆత్మను తెలుసుకొని, ఆసక్తిని విడిచిపెట్టి, ఈ సంసారములో చరించవలెను.

సమ్యగ్దర్శనయా బుద్ధ్యా యోగవైరాగ్యయుక్తయా ।
మాయావిరచితే లోకే చరేన్న్యస్య కలేవరమ్ ॥ 48

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
ఏకత్రింశోఽధ్యాయః ॥

సమ్యగ్-దర్శనయా = యథార్థమగు దర్శనము గలిగినట్టియు, యోగవైరాగ్యయుక్తయా = సాధనతో మరియు వైరాగ్యముతో కూడిన, బుద్ధ్యా = బుద్ధితో, మాయావిరచితే = మాయాశక్తిచే నిర్మితమైన; లోకే = లోకమునందు, కలేవరమ్ = శరీరమును, న్యస్య = ఉంచి, చరేత్ = సంచరించవలెను.

ఈ సంసారము మాయాకార్యము. ఈ దేహముకూడ అట్టిదియే. సాధకుడు నిత్యానిత్యవస్తువివేకము గలవాడై, సాధనను చేస్తూ వైరాగ్యము కలవాడై దేహాభిమానమును విడిచి ఈ లోకములో సంచరించవలెను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
ముప్పది ఒకటవ అధ్యాయము ముగిసినది (**31**).

* * * * *

# అథ ద్వాత్రింశోऽధ్యాయః

## జీవుడు పొందే ఉత్తమగతి - భక్తియోగ మహిమ

కపిల ఉవాచ ।
అథ యో గృహమేధీయాన్ ధర్మానేవావసన్ గృహే ।
కామమర్థం చ ధర్మాన్ స్వాన్ దోగ్ధి భూయః పిపర్తి తాన్ ॥ 1

స చాపి భగవద్ధర్మాత్కామమూఢః పరాఙ్ముఖః ।
యజతే క్రతుభిర్దేవాన్ పితౄంశ్చ శ్రద్ధయాన్వితః ॥ 2

కపిలః = కపిల భగవానుడు, ఉవాచ = పలికెను, అథ యః = ఎవడైతే, గృహే ఏవ = ఇంటియందే, గృహమేధీయాన్ = గృహాశ్రమమునకు సంబంధించిన, ధర్మాన్ = ధర్మములను, ఆవసన్ = అనుష్ఠించువాడై, స్వాన్ = తన, ధర్మాన్ = ధర్మములను, కామమ్ = కామమును, అర్థమ్ = అర్థమును, దోగ్ధి = ఫలరూపముగా అనుభవించునో, భూయః = మరల, తాన్ = ఆ ధర్మములను, పిపర్తి = పూర్తి చేయునో, సః చ అపి = ఆతడు కూడ, కామమూఢః = కోరికలచే మోహింపజేయబడినవాడై, భగవత్-ధర్మాత్ = భాగవత ధర్మమునుండి, పరాఙ్ముఖః = విముఖుడై, క్రతుభిః = క్రతువులచే, దేవాన్ = దేవతలను, పితౄన్ చ = పితృదేవతలను కూడ, శ్రద్ధయా = శ్రద్ధతో, అన్వితః = కూడినవాడై, యజతే = ఆరాధించును.

శ్రీ కపిల భగవానుడిట్లు పలికెను --- ఒకడు ఇంటియందు ఉంటూ గృహాశ్రమధర్మములను పాటిస్తూ వాటి ఫలరూపములగు అర్థకామములను అనుభవించును. మరల ఆ ధర్మములనే అనుష్ఠించుచుండును. ఈ విధముగా ఆతడు కామనలచే మోహమును పొందినవాడై భాగవత

ధర్మమునుండి విముఖుడై క్రతువులచే దేవతలను, పితృదేవతలను శ్రద్ధావంతుడై ఆరాధించును.

తచ్ఛ్రద్ధయాక్రాంతమతిః పితృదేవవ్రతః పుమాన్ ।
గత్వా చాంద్రమసం లోకం సోమపాః పునరేష్యతి ॥ 3

పితృదేవవ్రతః = పితృదేవతలను దేవతలను అర్చించుటయే వ్రతముగా గల, పుమాన్ = పురుషుడు, తత్-శ్రద్ధయా = వారియందలి శ్రద్ధచే, ఆక్రాంతమతిః = వ్యాప్తమైన బుద్ధి గలవాడై, చాంద్రమసం లోకమ్ = చంద్రలోకమును, గత్వా = పొంది, సోమపాః = అమృతపానమును చేసినవాడై, పునః = తిరిగి, ఏష్యతి = రాగలడు.

పితృదేవతలను, దేవతలను ఆరాధించుటయే ఆతని వ్రతము. ఆతని బుద్ధి వారియందలి శ్రద్ధతో నిండియుండును. ఆతడు మరణించిన తరువాత చంద్రలోకమును పొంది అమృతపానమును చేసి, పుణ్యము క్షీణించిన తరువాత మరల భూలోకములో జన్మించగలడు.

యదా చాహీంద్రశయ్యాయాం శేతేఽనంతాసనో హరిః ।
తదా లోకా లయం యాంతి త ఏతే గృహమేధినామ్ ॥ 4

యదా = ఎప్పుడైతే, అనంత-ఆసనః = ఆదిశేషుడు శయ్యగా గల, హరిః = శ్రీహరి, అహీంద్రశయ్యాయామ్ = శేషశయ్యయందు, శేతే = నిద్రించునో, తదా = అప్పుడు, గృహమేధినామ్ = గృహస్థుల, తే = అట్టి, ఏతే = ఈ, లోకాః = లోకములు, లయమ్ యాంతి = లయమగును.

కల్పాంతమునందు శేషశాయియగు శ్రీహరి శేషశయ్యపై నిద్రించును. అపుడు గృహస్థులు సంపాదించిన ఈ లోకములు వినష్టమగును.

యే స్వధర్మాన్న దుహ్యంతి ధీరాః కామార్థహేతవే ।
నిస్సంగా న్యస్తకర్మాణః ప్రశాంతాశ్శుద్ధచేతసః ॥ 5

నివృత్తిధర్మనిరతా నిర్మమా నిరహంకృతాః ।
స్వధర్మాఖ్యేన సత్త్వేన పరిశుద్ధేన చేతసా ॥ 6

సూర్యద్వారేణ తే యాంతి పురుషం విశ్వతోముఖమ్ ।
పరావరేశం ప్రకృతిమస్యోత్పత్త్యంతభావనమ్ ॥ 7

యే = ఏ, ధీరాః = వివేకులు, స్వధర్మాన్ = తాము చేసిన ధర్మములను, కామ-అర్థహేతవే = అర్థకామములు అనే ప్రయోజనము కొరకై, న దుహ్యంతి = ఫలమును భోగించరో, నిస్సంగాః = సంసారమునందు ఆసక్తి లేనివారు, న్యస్తకర్మాణః = జ్ఞాననిష్ఠచే త్యజించబడిన కర్మలు గలవారు, ప్రశాంతాః = ప్రసన్నమగు మనస్సు గలవారు, శుద్ధచేతసః = పవిత్రమగు అంతఃకరణము గలవారు, నివృత్తిధర్మనిరతాః = సన్న్యాసధర్మమునందు ప్రీతి గలవారు, నిర్మమాః = మమకారము లేనివారు, నిరహంకృతాః = అహంకారము లేనివారో, తే = వారు, స్వధర్మ-ఆఖ్యేన = స్వధర్మము అనే, సత్త్వేన = సత్త్వగుణముచే, పరిశుద్ధేన = పరిశుద్ధమైన, చేతసా = మనస్సుచే, సూర్యద్వారేణ = సూర్యమార్గముచే, విశ్వతోముఖమ్ = సర్వవ్యాపకుడైనట్టియు, పర-అవర-ఈశమ్ = కారణకార్యరూపమగు జగత్తునకు ప్రభువైనట్టియు, అస్య = ఈ జగత్తునకు, ప్రకృతిమ్ = ఉపాదానకారణమైనట్టియు, ఉత్పత్తి-అంతభావనమ్ = సృష్టిప్రళయములను సంకల్పించే నిమిత్తకారణమైన, పురుషమ్ = శ్రీహరిని, యాంతి = పొందెదరు.

కొందరు భక్తులు తాము చేసిన ధర్మములను అర్థకామములనే ఫలరూపములో అనుభవించుటకు ఇచ్ఛగించరు. వారు సంసారమునందు ఆసక్తి లేనివారై, ప్రసన్నము పవిత్రము అగు అంతఃకరణముతో సర్వకర్మసన్న్యాసపూర్వకజ్ఞాననిష్ఠయందు ఉందురు. అహంకార మమకారములు లేని అట్టివారికి సన్న్యాసధర్మమునందు ప్రీతి మెండు. వారు స్వధర్మానుష్ఠానము అనే సత్త్వగుణముచే పరిశుద్ధము చేయబడిన అంతఃకరణము గలవారు. వారు సూర్యమార్గముగుండా సర్వవ్యాపకుడగు శ్రీహరిని పొందెదరు. కారణకార్యరూపమగు ఈ జగత్తునకు ప్రభువగు ఆ పూర్ణపురుషుడే ఈ జగత్తునకు ఉపాదానకారణము మాత్రమే గాక, దీని ఉత్పత్తిప్రళయములను సంకల్పించే నిమిత్తకారణము కూడ అగుచున్నాడు.

ద్విపరార్థావసానే యః ప్రలయో బ్రహ్మణస్తు తే ।

తావదధ్యాసతే లోకం పరస్య పరచింతకాః ।। 8

ద్విపర-అర్ధ-అవసానే = రెండు పరార్ధములు పూర్తి అయిన కాల ములో, యః = ఏ, బ్రహ్మణః = బ్రహ్మగారి, ప్రలయః తు = భగవానునిలో విలయము గలదో, తావత్ = అంతవరకు, తే = వారు, పరచింతకాః = ఆ హిరణ్యగర్భుని ఉపాసించువారై, పరస్య = హిరణ్యగర్భుని, లోకమ్ = లోక మును, అధ్యాసతే = అధిష్ఠించి యుందురు.

బ్రహ్మగారి ఆయుర్దాయము రెండు పరార్ధములు, అనగా బ్రహ్మ మానములో రెండు ఏభైలు అనగా వంద సంవత్సరములు. ఆ తరువాత బ్రహ్మ (హిరణ్యగర్భుడు) భగవానునిలో విలీనమగును. అంతవరకు ఆ పుణ్యాత్ములు హిరణ్యగర్భుని లోకము (సత్యలోకము) లో ఆయననే ఉపా సిస్తూ నివసించెదరు.

క్ష్మాంభోఽనలానిలవియన్మనఇంద్రియార్థ-
భూతాదిభిః పరివృతం ప్రతిసంజిహీర్షుః ।
అవ్యాకృతం విశతి యర్హి గుణత్రయాత్మా
కాలం పరాఖ్యమనుభూయ పరస్స్వయంభూః ।। 9

పరాఖ్యమ్ = రెండు పరార్ధముల, కాలమ్ = కాలమును, అను భూయ = అధికారముననుభవించి, క్ష్మా-అంభః-అనల-అనిలవియత్-మ నః-ఇంద్రియ-అర్థభూతాదిభిః = భూమి జలము అగ్ని వాయువు ఆకాశము మనస్సు ఇంద్రియములు శబ్దాది విషయములు అహంకారము అనువాటి తో, పరివృతమ్ = కూడియున్న బ్రహ్మాండమును, ప్రతిసంజిహీర్షుః = ఉప సంహరించగోరువాడై, గుణత్రయ-ఆత్మా = సత్త్వరజస్తమోగుణాత్మకమగు బ్రహ్మాండమునకు అభిమానియగు, పరః = దేవదేవుడగు, స్వయంభూః = స్వయంభువుడగు హిరణ్యగర్భుడు, యర్హి = ఏ కాలమునందైతే, అవ్యాకృ తమ్ = నిర్గుణనిరాకారుడగు పరమేశ్వరుని, విశతి = ప్రవేశించునో.

దేవదేవుడు, స్వయంభువుడు అగు హిరణ్యగర్భుడు రెండు పరా ర్ధముల కాలము తన అధికారముననుభవించును. తరువాత సత్త్వరజస్త మోగుణాత్మకమగు బ్రహ్మాండమునకు అభిమానియగు ఆ హిరణ్యగర్భు

డు, భూమి జలము అగ్ని వాయువు ఆకాశము మనస్సు ఇంద్రియములు శబ్దాది విషయములు, సకలభూతములకు ఆదియగు అహంకారము అను వాటితో నిండియున్న బ్రహ్మాండమును ఉపసంహరించగోరువాడై, నిర్గుణని రాకార పరమేశ్వరునిలో విలీనమగును.

ఏవం పరేత్య భగవంతమనుప్రవిష్టా
యే యోగినో జితమరున్మనసో విరాగాః ।
తేనైవ సాకమమృతం పురుషం పురాణం
బ్రహ్మ ప్రధానముపయాంత్యగతాభిమానాః ॥ **10**

ఏవమ్ = ఈ విధముగా, జితమరుత్-మనసః = జయించబడిన ప్రాణము మనస్సు గల, విరాగాః = వీతరాగులగు, యే = ఏ, యోగినః = యోగులు గలరో వారు, పరేత్య = దేహమును విడిచి, భగవంతమ్ = హిర ణ్యగర్భుని, అనుప్రవిష్టాః = ప్రవేశించినవారై, అగత-అభిమానాః = తొలగని అభిమానము గలవారై, తేన ఏవ సాకమ్ = ఆయన తోటే, అమృతమ్ = పర మానందస్వరూపుడైనట్టియు, పురుషమ్ = పూర్ణచైతన్యమైనట్టియు, పురా ణమ్ = అనాదియైనట్టియు, ప్రధానమ్ = సర్వాతిశాయియగు, బ్రహ్మ = పర బ్రహ్మను, ఉపయాంతి = పొందెదరు.

ఈ విధముగా, ప్రాణమును మనస్సును జయించి వైరాగ్యసంప న్నులై యున్న యోగులు కూడ దేహమును విడిచిపెట్టి ఆ హిరణ్యగర్భుని తోటే పరమానందస్వరూపమగు పరబ్రహ్మయందు విలీనమగుదురు. అంతవరకు వారిలో అభిమానము శేషమై ఉండుటచే, వారు అనాది, పూర్ణ ము, సర్వాతిశాయియగు పరబ్రహ్మచైతన్యమునందు విలీనము కాలేదు.

అథ తం సర్వభూతానాం హృత్పద్మేషు కృతాలయమ్ ।
శ్రుతానుభావం శరణం వ్రజ భావేన భామిని ॥ **11**

భామిని = అమ్మా!, అథ = కావున, సర్వభూతానామ్ = సకలప్రా ణుల, హృత్-పద్మేషు = హృదయపద్మములయందు, కృత-ఆలయమ్ = చేయబడిన నివాసము గలిగినట్టియు, శ్రుత-అనుభావమ్ = వినబడిన

మహిమ గల, తమ్ = ఆ శ్రీహరిని, భావేన = భక్తితో, శరణం వ్రజ = శరణు పొందుము.

అమ్మా! సకలప్రాణుల హృదయపద్మములలో నివసించే ఆ శ్రీహరియొక్క మహిమను నీవు నానుండి వినియున్నావు. కావున, నీవు భక్తితో ఆయనను శరణు పొందుము.

ఆద్యః స్థిరచరాణాం యో వేదగర్భస్సహర్షిభిః ।
యోగేశ్వరైః కుమారాద్యైస్సిద్ధైర్యోగప్రవర్తకైః ॥ 12

భేదదృష్ట్యభిమానేన నిస్సంగేనాపి కర్మణా ।
కర్తృత్వాత్సగుణం బ్రహ్మ పురుషం పురుషర్షభమ్ ॥ 13

స సంసృత్య పునః కాలే కాలేనేశ్వరమూర్తినా ।
జాతే గుణవ్యతికరే యథాపూర్వం ప్రజాయతే ॥ 14

యః = ఎవడైతే, స్థిరచరాణామ్ = స్థావరజంగమములగు ప్రాణులకు, ఆద్యః = కారణుడో, వేదగర్భః = వేదనిధియగు, సః = ఆ బ్రహ్మగారు, ఋషిభిః = మరీచ్యాది మహర్షులతో, యోగేశ్వరైః = యోగేశ్వరులగు, కుమార-ఆద్యైః = సనత్కుమారుడు మొదలుగా గల, యోగప్రవర్తకైః = యోగమును లోకములో ప్రవర్తిల్లజేయు, సిద్ధైః = సిద్ధులతో, సహ = కూడి, సగుణం బ్రహ్మ = సగుణబ్రహ్మ స్వరూపుడైనట్టియు, పురుషర్షభమ్ = పురుషోత్తముడగు, పురుషమ్ = నారాయణుని, సంసృత్య = విలీనమై, నిస్సంగేన = కామన లేని, కర్మణా అపి = కర్మతో కూడినవాడే అయిననూ, భేద దృష్టి-అభిమానేన = భేదదృష్టిచే మరియు దేహాభిమానముచే, కర్తృత్వాత్ = కర్తృత్వాభిమానము వలన, పునః = మరల, కాలే = కాలము వచ్చినప్పుడు, ఈశ్వరమూర్తినా = ఈశ్వరరూపమగు, కాలేన = కాలముచే, గుణవ్యతికరే = సత్త్వరజస్తమోగుణములయందు వైషమ్యము, జాతే = కలుగగా, యథాపూర్వమ్ = పూర్వకల్పమునందు వలె, ప్రజాయతే = ప్రకటమగును.

స్థావరజంగమప్రాణులకు కారణుడు, వేదనిధియగు బ్రహ్మగారు మరీచి మొదలగు మహర్షులతో, యోగేశ్వరులతో, సనత్కుమారుడు మొద

లగు జ్ఞానులతో, యోగమును లోకములో ప్రవర్తిల్లజేసిన సిద్ధపురుషులతో కూడి నిష్కామకర్మ ద్వారా ఆదిపురుషుడు, పురుషశ్రేష్ఠుడు అగు సగుణబ్రహ్మ (నారాయణుడు) లో విలీనమైనాడు. కాని, ఆయనలో ఇంకనూ భేద దృష్టి, దేహాభిమానము, కర్తృత్వము మిగిలియుండెను. కావున, మరల సృష్టికాలము రాగానే కాలస్వరూపుడగు ఈశ్వరునిచే ప్రేరేపించబడి సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతిలో వైషమ్యము రాగానే, ఆయన పూర్వకల్పమునందు వలెనే, జగద్రూపముగా ప్రకటమగును.

ఐశ్వర్యం పారమేష్ఠ్యం చ తేఽపి ధర్మవినిర్మితమ్ ।
నిషేవ్య పునరాయాంతి గుణవ్యతికరే సతి ।। 15

తే అపి = వారు కూడ, ధర్మవినిర్మితమ్ = ధర్మముచే సంపాదించి పెట్టబడినట్టియు, పారమేష్ఠ్యమ్ = పరమేష్ఠికి సంబంధించిన, ఐశ్వర్యమ్ = ఐశ్వర్యమును, నిషేవ్య = సేవించి, గుణవ్యతికరే సతి = గుణములలో వైషమ్యము కలుగగా, పునః = తిరిగి, ఆయాంతి = మరలి వచ్చెదరు.

ధర్మమును చేసి దాని ప్రభావముచే బ్రహ్మలోకమును పొందిన పుణ్యాత్ములు కూడ అచట పరమేష్ఠియొక్క ఐశ్వర్యముననుభవించి, ప్రకృతిలో గుణవైషమ్యము కలిగి సృష్టి రాగానే మరల తిరిగి జన్మించెదరు.

యే త్విహాసక్తమనసః కర్మసు శ్రద్ధయాన్వితాః ।
కుర్వంత్యప్రతిషిద్ధాని నిత్యాన్యపి చ కృత్స్నశః ।। 16

యే తు = ఎవరైతే, ఇహ = ఈ సంసారమునందు, ఆసక్తమనసః = తగుల్కొన్న మనస్సు గలవారో వారు, కర్మసు = కర్మలయందు, శ్రద్ధయా = శ్రద్ధతో, అన్వితాః = కూడుకున్నవారై, అప్రతిషిద్ధాని = నిషేధింపబడని కర్మలను, నిత్యాని అపి = నిత్యకర్మలను కూడ, కృత్స్నశః = సమగ్రముగా, కుర్వంతి = చేయుదురు.

ఈ సంసారమునందు తగుల్కొన్న మనస్సు గల కర్మరులు వేదముచే నిషిద్ధమైన కర్మలను విడిచిపెట్టి, నిత్యకర్మలను మాత్రమే గాక, కామ్యకర్మలను కూడ శ్రద్ధతో చేయుదురు.

రజసా కుంఠమనసః కామాత్మానోఽజితేంద్రియాః ।
పితౄన్ యజంత్యనుదినం గృహేష్వభిరతాశయాః ।। 17

రజసా = రజోగుణముచే, కుంఠమనసః = మొక్కవోయిన మనస్సు గలిగినట్టియు, కామ-ఆత్మానః = కామనలయందు లగ్నమైన మనస్సు గలిగినట్టియు, అజిత-ఇంద్రియాః = జయించబడని ఇంద్రియములు గలిగినట్టియు, గృహేషు = గృహవ్యవహారములయందు, అభిరత-ఆశయాః = ప్రీతిని పొందే హృదయము గల జనులు, అనుదినమ్ = ప్రతిదినము, పితౄన్ = పితృదేవతలను, యజంతి = ఆరాధించెదరు.

రజోగుణముచే విక్షిప్తమైన మనస్సు గల జనులు కామనాపరిపూర్తి యందు మాత్రమే లగ్నమై యుందురు. వారికి ఇంద్రియజయము ఉండదు. వారికి గృహవ్యవహారములయందు మాత్రమే ప్రీతి కలుగును. అట్టివారు ప్రతిదినము పితృదేవతలను ఆరాధించెదరు.

త్రైవర్గికాస్తే పురుషా విముఖా హరిమేధసః ।
కథాయాం కథనీయోరువిక్రమస్య మధుద్విషః ।। 18

హరిమేధసః = సంసారదుఃఖమును పోగొట్టే బుద్ధి గలిగినట్టియు, కథనీయ-ఉరువిక్రమస్య = కీర్తించదగిన గొప్ప పరాక్రమములు గలిగినట్టియు, మధుద్విషః = మధువు అనే రాక్షసుని సంహరించిన శ్రీహరియొక్క, కథాయామ్ = గాథయందు, తే = ఆ, త్రైవర్గికాః = ధర్మార్థకామములకు మాత్రమే కట్టుబడిన, పురుషాః = వ్యక్తులు, విముఖాః = విముఖులు.

మధుసూదనుడగు శ్రీహరిని బుద్ధియందు స్మరించినచో సంసారము తొలగిపోవును. ఆయన పరాక్రమములు గొప్పవి, కీర్తించదగినవి. కాని, ధర్మార్థకామములకు మాత్రమే కట్టుబడిన వ్యక్తులకు ఆయన గాథలయంగు అభిరుచి ఉండదు.

నూనం దైవేన విహతా యే చాచ్యుతకథాసుధామ్ ।
హిత్వా శృణ్వంత్యసద్గాథాః పురీషమివ విడ్భుజః ।। 19

యే చ = ఎవరైతే, అచ్యుతకథాసుధామ్ = శ్రీహరియొక్క గాథలనే అమృతమును, హిత్వా = విడిచిపెట్టి, విడ్భుజః = సూకరములు, పురీషమివ = మాలిన్యమును వలె, అసత్-గాథాః = చెడు కథలను, శృణ్వంతి = వినెదరో వారు, నూనమ్ = నిశ్చయముగా, దైవేన = దైవముచే, విహతాః = నాశనము చేయబడినారు.

శ్రీహరి గాథలనే అమృతమును విడిచి, సూకరములు మాలిన్యమును భక్షించునట్లు, చెడు కథలను వినువారు. నిశ్చయముగా తమ ప్రారబ్ధముచే తామే వినాశము చేయబడుచున్నారు.

దక్షిణేన పథార్యమ్ణః పిత్రులోకం వ్రజంతి తే ।
ప్రజామను ప్రజాయంతే శ్మశానాంతక్రియాకృతః ॥ 20

శ్మశాన-అంతక్రియాకృతః = గర్భాధానము మొదలుకొని శ్మశానములో చేసే అంత్యేష్టి వరకు గల కర్మలను చేసే, తే = వారు, దక్షిణేన పథా = దక్షిణమార్గముచే, అర్యమ్ణః = పితృలోకప్రభువగు అర్యముని, పితృలోకమ్ = పితృలోకమును, వ్రజంతి = పొందెదరు, ప్రజాం అను = తమ సంతానమునందు, ప్రజాయంతే = జన్మించెదరు.

గర్భాధానము మొదలుకొని వ్యక్తి మరణించిన తరువాత శ్మశానములో చేసే అంత్యేష్టివరకు గల కర్మలను వారు చేయుదురు. అట్టివారు దక్షిణమార్గముచే అర్యమునిచే పాలించబడే పితృలోకమును పొందెదరు. పుణ్యము క్షయమైన తరువాత తమ సంతానమునకే మరల సంతానమై జన్మించెదరు.

తతస్తే క్షీణసుకృతాః పునర్లోకమిమం సతి ।
పతంతి వివశా దేవైస్సద్యో విభ్రంశితోదయాః ॥ 21

సతి = ఓ పతివ్రతా!, తే = వారు, క్షీణసుకృతాః = క్షీణించిన పుణ్యము గలవారై, దేవైః = దేవతలచే, సద్యః = వెంటనే, విభ్రంశిత-ఉదయాః = నశింపజేయబడిన భోగము గలవారై, వివశాః = వివశులై, తతః =

ఆ పితృలోకమునుండి, పునః = మరల, ఇమమ్ = ఈ, లోకమ్ = లోకమును గురించి, పతంతి = పడెదరు.

ఓ పతివ్రతా! వారు ఆ పితృలోకములో భోగములననుభవించు చుండగా వారి పుణ్యము క్షీణించును. వెంటనే దేవతలు భోగములను తొల గించి, వారిని ఆ లోకమునుండి ఈ లోకమునకు త్రోసివేసెదరు. వార ప్పుడు అస్వతంత్రులై మరల ఈ లోకములో జన్మించెదరు.

తస్మాత్త్వం సర్వభావేన భజస్వ పరమేష్ఠినమ్ ।
తద్గుణాశ్రయయా భక్త్యా భజనీయపదాంబుజమ్ ॥ 22

తస్మాత్ = కావున, త్వమ్ = నీవు, సర్వభావేన = పూర్ణప్రేమతో (అన్ని విధములుగా), భజనీయపద-అంబుజమ్ = సేవించదగిన పాదపద్మ ములుగల, పరమేష్ఠినమ్ = సర్వేశ్వరుని, తత్-గుణ-ఆశ్రయయా = ఆయన గుణములే ఆశ్రయముగా గల, భక్త్యా = భక్తితో, భజస్వ = భజించుము.

కావున, నీవు పూర్ణప్రేమతో మనోవాక్కాయములతో, పరమేశ్వ రుని వాత్సల్యము మొదలగు గుణములనే ఆశ్రయించే భక్తితో ఆయనను ఆరాధించుము. ఆయన పాదపద్మములు తప్పక ఆరాధించదగినవి.

వాసుదేవే భగవతి భక్తియోగః ప్రయోజితః ।
జనయత్యాశు వైరాగ్యం జ్ఞానం యద్బ్రహ్మదర్శనమ్ ॥ 23

వాసుదేవే భగవతి = శ్రీకృష్ణభగవానునియందు, ప్రయోజితః = చేయబడిన, భక్తియోగః = భక్తియోగము, ఆశు = శీఘ్రముగా, వైరాగ్యమ్ = వైరాగ్యమును, జ్ఞానమ్ = జ్ఞానమును, జనయతి = కలిగించును, యత్ = ఏ జ్ఞానము, బ్రహ్మదర్శనమ్ = బ్రహ్మసాక్షాత్కారమును కలిగించునో.

సర్వాంతర్యామియగు శ్రీకృష్ణభగవానునియందు భక్తిని చేసినచో, దాని వలన వైరాగ్యము మరియు బ్రహ్మసాక్షాత్కారమును కలిగించే జ్ఞానము శీఘ్రముగా లభించును.

యదాస్య చిత్తమర్థేషు సమేష్వింద్రియవృత్తిభిః ।

న విగృహ్ణాతి వైషమ్యం ప్రియమప్రియమిత్యుత ॥ 24

స తదైవాత్మనాఽఽత్మానం నిస్సంగం సమదర్శనమ్ ।
హేయోపాదేయరహితమారూఢం పదమీక్షతే । 25

యదా = ఏ కాలమునందైతే, అస్య = ఈ భక్తుని, చిత్తమ్ = చిత్తము, ఇంద్రియవృత్తిభిః = ఇంద్రియవ్యాపారములచే, సమేషు = అన్ని (సమానమైన), అర్థేషు = శబ్దాది విషయములయందు, ప్రియమ్ = ప్రియమైనది, ఉత = మరియు, అప్రియమ్ = ప్రియము కానిది, ఇతి = అనే, వైషమ్యమ్ = తేడాను, న విగృహ్ణాతి = గ్రహించదో, తదా ఏవ = అప్పుడు మాత్రమే, సః = ఆ భక్తుడు, ఆత్మనా = చిత్తముతో, నిస్సంగమ్ = సంగరహితమైనట్టియు, సమదర్శనమ్ = సమము మరియు జ్ఞానరూపము అయినట్టియు, హేయ-ఉపాదేయరహితమ్ = త్రోసివేయదగినది స్వీకరించదగినది అనే భేదము లేని, పదమ్ = స్వరూపభూతమగు బ్రహ్మను, ఆరూఢమ్ = ఏకీభావమును పొందిన, ఆత్మానమ్ = ఆత్మను, ఈక్షతే = దర్శించును.

ఏ కాలమునందైతే భక్తుని చిత్తము తాను ఇంద్రియవ్యాపారముల ద్వారా గ్రహించే శబ్దాది విషయములను సర్వమును ఈశ్వరరూపముగను, కావున ప్రియము అప్రియము అనే వైషమ్యము లేనిదిగను దర్శించునో, అప్పుడో భక్తుడు ఆత్మయొక్క యథార్థస్వరూపమును దర్శించును. ఆత్మ నిస్సంగము. జ్ఞానరూపమగు ఆత్మ సర్వమునందు సమానరూపముగా నున్నది. ఆత్మయందు పరిత్యజించదగిన దోషములు గాని, స్వీకరించదగిన గుణములు గాని లేవు. ఈ దర్శనముచే ఆ భక్తుడు తన స్వరూపమగు ప్రత్యగభిన్నబ్రహ్మతో ఏకీభావమును పొందును.

జ్ఞానమాత్రం పరం బ్రహ్మ పరమాత్మేశ్వరః పుమాన్ ।
దృశ్యాదిభిః పృథగ్భావైర్భగవానేక ఈయతే ॥ 26

జ్ఞానమాత్రమ్ - జ్ఞానఘనుడు, పరమ్ - ప్రకృతికి అతీతుడు, బ్రహ్మ - నిరతిశయ బృహత్తత్త్వము, పరమ-ఆత్మా - జీవుని అంతరతమనుగు ఆత్మస్వరూపము, ఈశ్వరః - సర్వమును శాసించువాడు, పుమాన్ - పురుషుడు, ఏకః - అద్వితీయుడు అగు, భగవాన్ - భగవానుడు, దృశ్య-

ఆదిభిః - దృశ్యము మొదలగు, పృథక్-భావైః - వివిధరూపములుగా, ఈయతే - తెలియబడును.

జ్ఞానఘనము, తనయందు భాసించే సర్వమునకు అతీతము, నిరతిశయ బృహత్, భగవచ్ఛబ్దవాచ్యము అగు అద్వితీయ వస్తువు జీవుని యందు ప్రత్యక్ (అంతరతమమగు) ఆత్మరూపముగా, జగత్తును శాసించే ఈశ్వరునిగా, ప్రకృతిని ఆవేశించే పురుషునిగా శాస్త్రములలో ప్రతిపాదించబడుచున్నది. ఆ వస్తువే దృశ్యజగత్తుగా, దర్శించే జీవునిగా, దర్శించుటకు సహకరించే ఇంద్రియములుగా భాసించుచున్నది.

ఏతావానేవ యోగేన సమగ్రేణేహ యోగినః ।
యుజ్యతేఽభిమతో హ్యర్థో యదసంగస్తు కృత్స్నశః ॥ 27

ఇహ = ఈ సంసారములో, యోగినః = సాధనానిష్ఠునకు, సమగ్రేణ = సంపూర్ణమగు, యోగేన = యోగముచే, అభిమతః = శాస్త్రసమ్మతమైన, ఏతావాన్ ఏవ = ఇంతమాత్రమే, అర్థః = ప్రయోజనము, యుజ్యతే = పొందబడుచున్నది, యత్ = ఏదనగా, కృత్స్నశః = పూర్తిగా, అసంగః = సంసారమునందు ఆసక్తి లేకుండుటయో.

సాధనానిష్ఠుడగు వ్యక్తి సమగ్రమగు యోగసాధనచే పొందే పూర్ణ ఫలమేమనగా, ఈ సంసారమునందు సుతరాము ఆసక్తి లేకుండుటయే.

జ్ఞానమేకం పరాచీనైరింద్రియైర్బ్రహ్మ నిర్గుణమ్ ।
అవభాత్యర్థరూపేణ భ్రాంత్యా శబ్దాదిధర్మిణా ॥ 28

పరాచీనైః = పరాఙ్ముఖములగు, ఇంద్రియైః = ఇంద్రియములచే, శబ్దాదిధర్మిణా = శబ్దము మొదలగునవి ధర్మముగా గల, అర్థరూపేణ = ఘటము మొదలగు రూపముగా, ఏకమ్ = అద్వితీయము, జ్ఞానమ్ = విజ్ఞానఘనము, నిర్గుణమ్ = నిర్గుణము అగు, బ్రహ్మ = బ్రహ్మ, భ్రాంత్యా = భ్రాంతిచే, అవభాతి = భాసించుచున్నది.

ఉన్న వస్తువు విజ్ఞానఘనమగు అద్వితీయ నిర్గుణ పరబ్రహ్మ మాత్రమే. కాని, నామరూపాత్మకమగు బాహ్యవిషయములయందు ఆసక్తి

గల ఇంద్రియములు భ్రాంతిచే శబ్దము మొదలగు ధర్మములతో కూడిన వేర్వేరు రూపములను దర్శించుచున్నవి.

యథా మహానహంరూపస్త్రివృత్పంచవిధస్స్వరాట్ ।
ఏకాదశవిధస్తస్య వపురండం జగద్యతః ॥ 29

యథా = ఏ విధముగానైతే, స్వరాట్ = స్వయంప్రకాశమగు పరబ్రహ్మ, మహాన్ = మహత్తత్త్వము, అహంరూపః = అహంకారరూపమై, త్రివృత్ = త్రిగుణాత్మకమై, పంచవిధః = పంచభూతములుగా ప్రకటమై, ఏకాదశవిధః = పది ఇంద్రియములు మనస్సు అనే పదకొండు అంశములు గల జీవుడైనదో, తస్య = ఆ జీవుని, వపుః = శరీరము, జగత్ = జగత్తు, అండమ్ = బ్రహ్మాండము, యతః = ఏ పరబ్రహ్మనుండియో.

స్వయంప్రకాశస్వరూపమగు ఆ పరబ్రహ్మయే మహత్తత్త్వము, సాత్త్విక రాజస తామస అహంకారములు, పంచభూతములు, అయిదు కర్మేంద్రియములు అయిదు జ్ఞానేంద్రియములు మనస్సు వెరసి పదకొండుగా ప్రకటమైనది. వీటితో కూడి ఆ పరబ్రహ్మయే వ్యష్టి జీవుడు అగుచున్నది. ఈ జగత్తుతో గూడి ఆ పరబ్రహ్మయే సమష్టి హిరణ్యగర్భుడగుచున్నది. ఏలయనగా, వ్యష్టి జీవుడు, సమష్టి పురుషుడు, ఈ బ్రహ్మాండము కూడ ఆ పరబ్రహ్మనుండియే ఆవిర్భవించినవి.

ఏతద్వై శ్రద్ధయా భక్త్యా యోగాభ్యాసేన నిత్యశః ।
సమాహితాత్మా నిస్సంగో విరక్త్యా పరిపశ్యతి ॥ 30

సమాహిత-ఆత్మా = ఏకాగ్రమగు అంతఃకరణము గలవాడు, నిస్సంగః = సంసారమునందు ఆసక్తి లేని భక్తుడు, శ్రద్ధయా = శ్రద్ధతో, భక్త్యా = భక్తితో, నిత్యశః = నిత్యము, యోగ-అభ్యాసేన = యోగమును అభ్యసించుటచే, విరక్త్యా = వైరాగ్యముతో, ఏతత్ = ఈ జగత్తును, పరిపశ్యతి వై = నిశ్చయముగా బ్రహ్మరూపముగా దర్శించును.

భక్తుడు వైరాగ్యముచే సంసారమునందలి ఆసక్తిని విడిచిపెట్టి, నిత్యము యోగమునభ్యసించుటచే ఏకాగ్రమగు అంతఃకరణము గలవాడై ఈ జగత్తును నిశ్చయముగా బ్రహ్మరూపముగా దర్శించును.

ఇత్యేతత్కథితం గుర్వి జ్ఞానం తద్బ్రహ్మదర్శనమ్ ।
యేనానుబద్ధ్యతే తత్త్వం ప్రకృతేః పురుషస్య చ ॥ 31

గుర్వి = అమ్మా!, ఏతత్ = ఈ, తత్ = ఆ, బ్రహ్మదర్శనమ్ = బ్రహ్మసాక్షాత్కారమును కలిగించే, జ్ఞానమ్ = జ్ఞానము, ఇతి = ఈ విధముగా, కథితమ్ = చెప్పబడినది, యేన = దేనిచే, ప్రకృతేః = ప్రకృతియొక్క, పురుషస్య చ = పురుషునియొక్క కూడ, తత్త్వమ్ = యథార్థస్వరూపము, అనుబద్ధ్యతే = తెలియబడునో.

అమ్మా! ఈ విధముగా నేను నీకు బ్రహ్మసాక్షాత్కారసాధనమగు జ్ఞానమును బోధించితిని. దీని వలన భక్తునకు ప్రకృతిపురుషుల తత్త్వము తెలియును.

జ్ఞానయోగశ్చ మన్నిష్ఠో నైర్గుణ్యో భక్తిలక్షణః ।
ద్వయోరప్యేక ఏవార్థో భగవచ్ఛబ్దలక్షణః ॥ 32

నైర్గుణ్యః = నిర్గుణ పరబ్రహ్మ విషయముగా గల, జ్ఞానయోగః = జ్ఞానయోగము, మత్-నిష్ఠః = నాయందు నిష్ఠ గల, భక్తిలక్షణః చ = భక్తియే లక్షణముగా గల యోగము కూడ, ద్వయోః అపి = ఈ రెండింటికీ కూడ, భగవత్-శబ్దలక్షణః = భగవానుడు అనే శబ్దముచే తెలియచెప్పబడే, అర్థః = ఫలము, ఏకః ఏవ = ఒక్కటియే.

జ్ఞానయోగమునకు విషయము నిర్గుణ పరబ్రహ్మ. భక్తియోగము కూడ నాయందే నిష్ఠ గల యోగము. ఈ రెండింటికీ ఫలము ఒక్కటియే. ఆ ఫలమునే భగవానుడు అనే పదము బోధించును. అనగా, భగవత్ప్రాప్తియే రెండింటికీ ఫలము.

యథేంద్రియైః పృథగ్ద్వారైరర్థో బహుగుణాశ్రయః ।

ఏకో నానేయతే తద్వద్భగవాన్ శాస్త్రవర్త్మభిః ॥ 33

యథా = ఏ విధముగానైతే, బహుగుణ-ఆశ్రయః = అనేకములగు రూపరసాది గుణములకు ఆశ్రయమగు, ఏకః = ఒకే, అర్థః = పదార్థము, పృథక్-ద్వారైః = వేర్వేరు ప్రవృత్తిమార్గములు గల, ఇంద్రియైః = ఇంద్రియములచే, నానా = పలువిధములుగా, ఈయతే = తెలియబడుచున్నదో, తద్వత్ = అదే విధముగా, శాస్త్రవర్త్మభిః = శాస్త్రమార్గములచే, భగవాన్ = భగవానుడు (తెలియబడుచున్నాడు).

పదార్థము ఒక్కటే అయినా, అది రూపము రసము మొదలగు అనేకగుణములకు ఆశ్రయమగుచున్నది. ఇంద్రియముల ప్రవృత్తి మార్గములు కూడ వేర్వేరుగా నున్నవి. కావుననే, ఒకే పదార్థమును కన్ను తెల్లనిది అని, జిహ్వ తియ్యనిది అని ఈ విధముగా ఇంద్రియములు వేర్వేరుగా తెలియుచున్నవి. అదే విధముగా వివిధములగు శాస్త్రమార్గములు ఒకే భగవానుని పలు విధములుగా దర్శించుచున్నవి.

క్రియయా క్రతుభిర్దానైస్తపస్స్వాధ్యాయమర్శనైః ।
ఆత్మేంద్రియజయేనాపి సన్న్యాసేన చ కర్మణామ్ ॥ 34

యోగేన వివిధాంగేన భక్తియోగేన చైవ హి ।
ధర్మేణోభయచిహ్నేన యః ప్రవృత్తినివృత్తిమాన్ ॥ 35

ఆత్మతత్త్వావబోధేన వైరాగ్యేణ దృఢేన చ ।
ఈయతే భగవానేభిస్సగుణో నిర్గుణస్స్వదృక్ ॥ 36

క్రియయా = పూజాది కర్మలచే, క్రతుభిః = క్రతువులచే, దానైః = దానములచే, తపః-స్వాధ్యాయమర్శనైః = తపస్సు వేదాధ్యయనము మీమాంసలచే, ఆత్మా-ఇంద్రియజయేన అపి = మనస్సును ఇంద్రియములను జయించుటచే, కర్మణామ్ = కర్మల, సన్న్యాసేన = సన్న్యసించుటచే, వివిధ-అంగేన = ఎనిమిది అంగములు గల, యోగేన = యోగముచే, భక్తియోగేన చ ఏవ హి = నిశ్చయముగా భక్తియోగముచే కూడ, ఉభయచిహ్నేన = సకామము నిష్కామము అనే రెండు లక్షణములు గల, ధర్మేణ =

ధర్మముచే, యః = ఏ ధర్మము, ప్రవృత్తినివృత్తిమాన్ = ప్రవృత్తి నివృత్తి అనే రెండు రూపములు గలదియో, ఆత్మతత్త్వ-అవబోధేన = ఆత్మస్వరూపమును తెలుసుకొనుటచే, దృఢేన = దృఢమగు, వైరాగ్యేణ చ = వైరాగ్యముచే, ఏభిః = ఈ సాధనములచే, సగుణః = సగుణుడు, నిర్గుణః = నిర్గుణుడు, స్వదృక్ = స్వప్రకాశస్వరూపుడు అగు, భగవాన్ = భగవానుడు, ఈయతే = పొందబడుచున్నాడు.

పూజ మొదలగు కర్మలు, క్రతువులు, దానములు, తపస్సు, వేదాధ్యయనము, వేదతాత్పర్యవిచారము, మనస్సును ఇంద్రియములను జయించుట, సర్వకర్మసన్న్యాసము, ఎనిమిది అంగములతో కూడిన యోగము, భక్తియోగము, ప్రవృత్తి (వేదోక్తకర్మానుష్ఠానము) నివృత్తి (సన్న్యాసము) అనే రెండు రూపములలోనున్న సకామ నిష్కామ ధర్మము, నిత్యానిత్యవస్తువివేకము, దృఢమగు వైరాగ్యము అనే ఈ సాధనములన్నియు భగవానుని పొందుటయందు సహకరించును. స్వయంప్రకాశస్వరూపుడగు ఆ భగవానుడు సకలకల్యాణగుణసంపన్నుడే అయిననూ, స్వరూపముచే నిర్గుణుడు.

ప్రావోచం భక్తియోగస్య స్వరూపం తే చతుర్విధమ్ ।
కాలస్య చావ్యక్తగతేర్యోఽంతర్ధావతి జంతుషు ।। 37

తే = నీకొరకు, భక్తియోగస్య = భక్తియోగముయొక్క, చతుర్విధమ్ = నాలుగు విధముల, స్వరూపమ్ = స్వరూపమును, అవ్యక్తగతేః = తెలియబడని చేష్టగల, కాలస్య చ = కాలముయొక్క స్వరూపమును కూడ, ప్రావోచమ్ = చెప్పితిని, యః = ఏ కాలము, జంతుషు = ప్రాణులయందు, అంతః = లోపల, ధావతి = జన్మాది వికారములను కలిగించుచున్నదో.

నీకు నాలుగు విధముల (మూడు సగుణ, ఒక నిర్గుణ) భక్తియోగమును, కాలముయొక్క స్వరూపమును చెప్పినాను. కాలముయొక్క చేష్టలను తెలియుట సంభవము కాదు. అది ప్రాణుల లోపలనుండి జన్మ మొదలగు వికారములను కలిగించుచున్నది.

జీవస్య సంసృతీర్బహ్వీరవిద్యాకర్మనిర్మితాః ।

యాస్వంగ ప్రవిశన్నాత్మా న వేద గతిమాత్మనః ॥ 38

అంగ = అమ్మా!, జీవస్య = జీవునియొక్క, అవిద్యాకర్మనిర్మితాః = అజ్ఞానము మరియు కర్మలచే నిర్మించబడిన, బహ్వీః = అనేకములగు, సంసృతీః = గతులను (చెప్పితిని), యాసు = వేటియందు, ఆత్మా = జీవుడు, ప్రవిశన్ = ప్రవేశించువాడై, ఆత్మనః = తన, గతిమ్ = స్వరూపమును, న వేద = తెలియకున్నాడో.

అమ్మా! అజ్ఞానము, దాని వలన కలిగే కర్మలు జీవునకు అనేకగతులను కల్పించుచుండును. జీవుడు వాటిని పొందుచూ తన స్వరూపమును తెలియలేకున్నాడు. ఆ వివరములను కూడ నేను నీకు చెప్పితిని.

నైతత్ఖలాయోపదిశేన్నావినీతాయ కర్హిచిత్ ।
న స్తబ్ధాయ న భిన్నాయ నైవ ధర్మధ్వజాయ చ ॥ 39

ఏతత్ = దీనిని, ఖలాయ = దుష్టుని కొరకు, న ఉపదిశేత్ = ఉపదేశించరాదు, కర్హిచిత్ = ఏ కాలమునందైననూ, అవినీతాయ = వినయము లేనివాని కొరకు, న = ఉపదేశించరాదు, స్తబ్ధాయ = తలబిరుసువాని కొరకు, న = ఉపదేశించరాదు, భిన్నాయ = దురాచారి (అశాస్త్రీయమగు వాదము చేయువాని) కొరకు, న = ఉపదేశించరాదు, చ = మరియు, ధర్మధ్వజాయ = దంభము గలవానికొరకు, న ఏవ = ఉపదేశించనే రాదు.

ఈ జ్ఞానమును ఏ కాలములోనైననూ దుష్టునకు, వినయము లేనివానికి, తలబిరుసువానికి, దురాచారికి, అశాస్త్రీయమగు వాదమును చేయువానికి ఉపదేశించరాదు. దాంభికునకు అసలే ఉపదేశించరాదు.

న లోలుపాయోపదిశేన్న గృహారూఢచేతసే ।
నాభక్తాయ చ మే జాతు న మద్భక్తద్విషామపి ॥ 40

లోలుపాయ = ఇంద్రియభోగములయందాసక్తి గలవానికొరకు, న ఉపదిశేత్ = ఉపదేశించరాదు, గృహ-ఆరూఢచేతసే = ఇంటి సుఖములయందు తీవ్రముగా లగ్నమైన మనస్సు గలవాని కొరకు, న = ఉపదేశించరాదు, మే = నా, అభక్తాయ = భక్తుడు కానివాని కొరకు, న = ఉపదేశించరా

దు, చ = మరియు, మత్-భక్తద్విషాం అపి = నా భక్తులను ద్వేషించువారికి కూడ, జాతు = ఏ కాలమునందైననూ, న = ఉపదేశించరాదు.

ఇంద్రియభోగములయందాసక్తి గలవానికి, ఇంటి సుఖముల యందు లగ్నమైన మనస్సు గలవానికి, నా భక్తుడు కాని వానికి ఈ జ్ఞాన మునుపదేశించరాదు. నా భక్తులను ద్వేషించువారికి దీనిని ఏ కాలమునం దైననూ ఉపదేశించరాదు.

> శ్రద్దధానాయ భక్తాయ వినీతాయనసూయవే ।
> భూతేషు కృతమైత్రాయ శుశ్రూషాభిరతాయ చ ।। 41

> బహిర్జాతవిరాగాయ శాంతచిత్తాయ దీయతామ్ ।
> నిర్మత్సరాయ శుచయే యస్యాహం ప్రేయసాం ప్రియః।।42

శ్రద్దధానాయ = శ్రద్ధావంతుని కొరకు, భక్తాయ = భక్తుని కొరకు, వినీతాయ = వినయము గలవానికొరకు, అనసూయవే = ఇతరుల గుణము లయందు దోషములనారోపించనివాని కొరకు, భూతేషు = ప్రాణులయం దు, కృతమైత్రాయ = చేయబడిన మైత్రి గలవానికొరకు, శుశ్రూషా-అభిర తాయ చ = గురుసేవయందు అభిరుచి గలవాని కొరకు, బహిః = బాహ్యా మునందు, జాతవిరాగాయ = కలిగిన వైరాగ్యము గలవానికొరకు, శాంతచి త్తాయ = ప్రసన్నమగు మనస్సు గలవాని కొరకు, నిర్మత్సరాయ = మాత్స ర్యము లేనివాని కొరకు, శుచయే = శౌచము గలవాని కొరకు, దీయతామ్ = ఈయబడుగాక!, యస్య = ఎవనికి, అహమ్ = నేను, ప్రేయసామ్ = ప్రియ మైనవాటిలో, ప్రియః = ప్రియుడనో.

శ్రద్ధ, భక్తి, వినయము కలిగి ఇతరుల గుణమునందు దోషబుద్ధిలేని వానికి ఈ జ్ఞానమును బోధించవలెను. ప్రాణులయందు ప్రేమభావము, గురుసేవయందు అభిరుచి, బాహ్యావిషయములయందు వైరాగ్యము, ప్రస న్నమగు చిత్తము గలవానికి దీనిని బోధించవలెను. మాత్సర్యము (ఇతరుల క్షేమమును చూచి సహించలేకపోవుట) లేనివానికి, అంతరబాహ్యాశౌచము గలవానికి దీనిని బోధించవలెను. ఎవనికైతే నేను ప్రియమైన వస్తువులన్నిం టికంటె అధికముగా ప్రియమైనవాడనో, వానికి బోధించవలెను.

య ఇదం శృణుయాదంబ శ్రద్ధయా పురుషస్సకృత్ ।
యో వాభిధత్తే మచ్చిత్తస్స హ్యేతి పదవీం చ మే ॥ 43

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
ద్వాత్రింశో ఽధ్యాయః ॥

అంబ = అమ్మా!, యః = ఏ, పురుషః = మానవుడైతే, ఇదమ్ = దీనిని, సకృత్ = ఒక్కసారి, శ్రద్ధయా = శ్రద్ధతో, శృణుయాత్ = వినునో, యః వై = ఎవడైతే, మత్-చిత్తః = నాయందు చిత్తము గలవాడై, అభిధత్తే = చెప్పునో, సః = వాడు, మే = నా, పదవీమ్ = పరమపదమును, ఏతి హి = నిశ్చయముగా పొందును.

అమ్మా! ఎవడైతే నాయందు లగ్నమైన మనస్సు గలవాడై దీనిని శ్రద్ధతో ఒక్కసారైననూ వినునో, లేదా చెప్పునో, వాడు నిశ్చయముగా నా పరమపదము (మోక్షము) ను పొందును.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధములో
ముప్పది రెండవ అధ్యాయము ముగిసినది (32).

* * * * *

# అథ త్రయస్త్రింశోఽధ్యాయః

## దేవహూతి జ్ఞానమును మోక్షమును పొందుట

మైత్రేయ ఉవాచ ।
ఏవం నిశమ్య కపిలస్య వచో జనిత్రీ
సా కర్దమస్య దయితా కిల దేవహూతిః ।
విస్రస్తమోహపటలా తమభిప్రణమ్య
తుష్టావ తత్త్వవిషయాంకితసిద్ధభూమిమ్ ॥ 1

మైత్రేయః = మైత్రేయ మహర్షి, ఉవాచ = పలికెను, ఏవమ్ = ఈ విధముగా, కపిలస్య = కపిల భగవానుని, జనిత్రీ = తల్లి, కర్దమస్య = కర్దమ మహర్షియొక్క, దయితా = ప్రియురాలు అగు, సా = ఆ, దేవహూతిః = దేవహూతి, వచః = కపిలుని వచనమును, నిశమ్య = విని, విస్రస్తమోహపటలా = నశింపజేయబడిన మోహముయొక్క ఆవరణము గలదై, తత్త్వవిషయ -అంకితసిద్ధిభూమిమ్ = ప్రకృతి మొదలగు తత్త్వములే విషయముగా గల జ్ఞానముతో కూడిన సిద్ధపురుషులకు ఆశ్రయమైన, తమ్ = ఆ కపిలుని, అభి ప్రణమ్య = నమస్కరించి, తుష్టావ = స్తుతించెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- కపిలుని తల్లి, కర్దముని ధర్మపత్నియగు ఆ దేవహూతి ఈ విధముగా కపిల భగవానుని బోధను వినినంతనే బుద్ధిని కప్పియుంచిన మోహము అనే ఆవరణము తొలగిపోయెను. ప్రకృతి, పురుషుడు మొదలగు తత్త్వములను బోధించే జ్ఞానము గల సిద్ధులలో కపిలుడు అగ్రేసరుడు. ఆమె అట్టి కపిల భగవానునకు నమస్కరించి ఇట్లు స్తుతించెను.

దేవహూతిరువాచ ।

అథాప్యజోఽంతస్సలిలే శయానం
భూతేంద్రియార్థాత్మమయం వపుస్తే ।
గుణప్రవాహం సదశేషబీజం
దధ్యౌ స్వయం యజ్జఠరాబ్జజాతః ॥ 2

అథ = ఓ కపిలా!, యత్-జఠర-అబ్జజాతః = ఎవని ఉదరమునందలి పద్మమునందు జన్మించిన, అజః అపి = బ్రహ్మ కూడ, అంతః-సలిలే = నీటిమధ్యలో, శయానమ్ = పరున్నట్టియు, భూత-ఇంద్రియ-అర్థ-ఆత్మమయమ్ = పంచభూతములు ఇంద్రియములు శబ్దము మొదలగు విషయములు మరియు జీవులతో నిండియున్నట్టియు, గుణప్రవాహమ్ = సత్త్వరజస్తమోగుణముల ప్రవాహము గలిగినట్టియు, సత్ = సత్స్వరూపమైనట్టియు, అశేషబీజమ్ = సకలజగత్తునకు బీజము అగు, తే = నీ, వపుః = దేహమును, స్వయమ్ = స్వయముగా, దధ్యౌ = ధ్యానించెనో.

దేవహూతి ఇట్లు పలికెను --- ఓ కపిలా! నీవు ప్రళయజలములలో శయనించియుండగా నీ ఉదరమునందలి పద్మమునుండి బ్రహ్మ జన్మించెను. పంచభూతములు ఇంద్రియములు వాటికి విషయములగు శబ్దాదులు జీవులు అందరు నీ రూపమునందే ఇమిడియున్నారు. సత్త్వరజస్తమోగుణముల ప్రవాహరూపమగు ఈ సకలజగత్తునకు సత్స్వరూపమగు నీ సగుణరూపమే బీజమగుచున్నది. ఆ బ్రహ్మ పుట్టిన వెంటనే స్వయముగా నీ రూపమును ధ్యానించెను.

స ఏవ విశ్వస్య భవాన్ విధత్తే గుణప్రవాహేణ విభక్తవీర్యః ।
సర్గాద్యనీహోఽవితథాభిసంధిరాత్మేశ్వరోఽతర్క్యసహస్రశక్తిః ॥ 3

అనీహః = నిష్క్రియుడైనట్టియు, అవితథ-అభిసంధిః = సత్యసంకల్పుడవైనట్టియు, ఆత్మా-ఈశ్వరః = జీవులకు ప్రభుడైనట్టియు, అతర్క్యసహస్రశక్తిః = ఊహింప శక్యము కాని అనంతములగు శక్తులు గల, సః = అట్టి, భవాన్ ఏవ = నీవే, గుణప్రవాహేణ = సత్త్వరజస్తమోగుణముల ప్రవాహముచే, విభక్తవీర్యః = విభాగము చేయబడిన శక్తి గలవాడవై, విశ్వస్య = జగత్తుయొక్క, సర్గ-ఆది = సృష్టిస్థితిలయములను, విధత్తే = చేయుచున్నావు.

నీవు అకర్తవు, సత్యసంకల్పుడవు, జీవులకు ప్రభుడవు. నీ అనంతములగు శక్తులు ఊహకు అందవు. అట్టి నీవే నీ శక్తిని సత్త్వరజస్తమోగుణముల ప్రవాహముచే విభాగము చేసి, ఈ జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను చేయుచున్నావు.

స త్వం భృతో మే జఠరేణ నాథ
కథం ను యస్యోదర ఏతదాసీత్ ।
విశ్వం యుగాంతే వటపత్ర ఏకః
శేతే స్మ మాయాశిశురంఘ్రిపానః ॥ 4

నాథ = ఓ ప్రభూ!, సః = అట్టి, త్వమ్ = నీవు, మే = నా, జఠరేణ = ఉదరముచే, కథమ్ = ఏ విధముగా, భృతః ను = ధరించబడితివో గదా!, యస్య = ఏ నీయొక్క, ఉదరే = ఉదరమునందు, ఏతత్ = ఈ, విశ్వమ్ = జగత్తు, ఆసీత్ = ఉండెనో, యుగ-అంతే = కల్పాంతమునందు, మాయా శిశుః = మాయాబాలకుడవగు నీవు, ఏకః = ఒక్కడివే, వటపత్రే = మర్రి ఆకునందు, అంఘ్రిపానః = కాలి బొటనవ్రేలును నోటియందుంచుకున్నవాడవై, శేతే స్మ = పరుండెదవు.

ఓ ప్రభూ! నీ ఉదరములో ఈ విశ్వము ధరించబడుచున్నది. కల్పాంతమునందు నీవు మాయాబాలకుడవై మర్రి ఆకునందు పరుండి కాలి బొటనవ్రేలును నోట ఉంచుకొనెదవు. అట్టి నీవు నా జఠరములో ఎట్లు ధరించబడితివో గదా!

త్వం దేహతంత్రః ప్రశమాయ పాప్మనాం
నిదేశభాజాం చ విభో విభూతయే ।
యథావతారాస్తవ సూకరాదయః
తథాయమప్యాత్మపథోపలబ్ధయే ॥ 5

విభో = ఓ ప్రభూ!, త్వమ్ = నీవు, పాప్మనామ్ = పాపవర్తనుల, ప్రశమాయ = వినాశము కొరకు, చ = మరియు, నిదేశభాజామ్ = ఆజ్ఞను పాలించేవారి, విభూతయే = అభివృద్ధి కొరకు, దేహతంత్రః = దేహమును స్వీకరిం

చువాడవు, యథా = ఏ విధముగానైతే, తవ = నీ, సూకర-ఆదయః = వరాహావతారము మొదలగునవి ప్రవర్తిల్లినవో, తథా = అదే విధముగా, అయం అపి = ఈ అవతారము కూడ, ఆత్మపథ-ఉపలబ్ధయే = ఆత్మజ్ఞానమార్గమును చూపుట కొరకే.

ఓ ప్రభూ! నీవు పాపులను నశింపజేసి, నీ ఆజ్ఞను పాటించే భక్తులను ఉద్ధరించుటకొరకై అవతారములను దాల్చెదవు. నీ వరాహావతారము మొదలగు అవతారములు ఏ విధముగా లోకకల్యాణమును చేకూర్చినవో, అదే విధముగా ఈ అవతారము కూడ ఆత్మజ్ఞానము అనే మార్గమును ముముక్షువులకు అందజేయుట కొరకు ఉద్దేశించబడినది.

యన్నామధేయశ్రవణానుకీర్తనాత్
యత్ప్రహ్వణాద్యత్స్మరణాదపి క్వచిత్ ।
శ్వాదోఽపి సద్యస్సవనాయ కల్పతే
కుతః పునస్తే భగవన్ను దర్శనాత్ ॥ 6

భగవన్ = ఓ భగవానుడా!, క్వచిత్ = ఎప్పుడైననూ, యత్-నామధేయశ్రవణ-అనుకీర్తనాత్ = ఎవని నామమును విని కీర్తించినంత మాత్రాన, యత్-ప్రహ్వణాత్ = ఎవనికి నమస్కరించుట వలన, యత్-స్మరణాత్ అపి = ఎవనిని స్మరించుట వలన కూడ, శ్వాదః అపి = పరమకిరాతకుడు కూడ, సద్యః = వెంటనే, సవనాయ కల్పతే = సోమయాజివలె ఆదరించ దగిన వాడు అగునో, తే = నీ, దర్శనాత్ = దర్శనము వలన, కుతః పునః ను = కృతకృత్యుడగునని వేరుగా చెప్పవలయునా?

ఓ భగవానుడా! పరమకిరాతకుడగు మానవుడు కూడ ఎప్పుడైననూ నీ నామమును కీర్తించి, విని, నీకు నమస్కరించి, నిన్ను స్మరించినచో, సోమయాజివలె ఆదరించదగ్గవాడు అగుచున్నాడు. అట్టిచో, నిన్ను దర్శించు వ్యక్తి కృతకృత్యుడగునని వేరుగా చెప్పవలయునా?

అహో బత శ్వపచోఽతో గరీయాన్
యజ్జిహ్వాగ్రే వర్తతే నామ తుభ్యమ్ ।

తేపుస్తపస్తే జుహువుస్సస్నురార్యా
బ్రహ్మానూచుర్నామ గృణంతి యే తే ॥ 7

అహో బత = ఆశ్చర్యము!, యత్-జిహ్వా-అగ్రే = ఎవని నాలుక చివర, తుభ్యమ్ = నీ కొరకు, నామ = నీ నామము, వర్తతే = ఉండునో, అతః = ఈ కారణముచే, శ్వపచః = పరమకిరాతకుడు, గరీయాన్ = శ్రేష్ఠుడు, యే = ఎవరైతే, తే = నీ, నామ = నామమును, గృణంతి = కీర్తించెదరో, తే = వారు, తపః = తపస్సును, తేపుః = చేసినారు, జుహువుః = హోమములను చేసినారు, సస్నుః = తీర్థస్నానములను చేసినారు, ఆర్యాః = వారే పూజించ దగినవారు, బ్రహ్మ = వేదమును, అనూచుః = గురువు వద్ద అధ్యయనము చేసినారు.

ఆశ్చర్యము! నిన్ను గోరి నాలుక చివర నీ నామము గల వ్యక్తి పర మకిరాతకుడే అయిననూ, ఈ నామమహిమచే శ్రేష్ఠుడే యగును. నీ నామ మును కీర్తించువారు తపస్సులను, హోమములను, తీర్థస్నానములను, వేదముల అధ్యయనములను చేసినవారితో సమానము. వారే పూజించదగి నవారు.

తం త్వామహం బ్రహ్మ పరం పుమాంసం
ప్రత్యక్ స్రోతస్యాత్మని సంవిభావ్యమ్ ।
స్వతేజసా ధ్వస్తగుణప్రవాహం
వందే విష్ణుం కపిలం వేదగర్భమ్ ॥ 8

బ్రహ్మ = పరబ్రహ్మ, పరం పుమాంసమ్ = పురుషోత్తముడు, ప్రత్యక్-స్రోతసి = విషయములనుండి ఉపసంహరించబడిన, ఆత్మని = బుద్ధి యందు, సంవిభావ్యమ్ = ధ్యానించదగినవాడు, స్వతేజసా = స్వరూప మును ప్రకాశింపజేయుటచే, ధ్వస్తగుణప్రవాహమ్ = నశింపజేయబడిన సత్త్వరజస్తమోగుణముల ప్రవాహరూపమగు సంసారము గలవాడు, విష్ణుమ్ = శ్రీమహావిష్ణువు, వేదగర్భమ్ = వేదములు గర్భమునందు గల వాడు అగు, తమ్ = అట్టి, కపిలమ్ = కపిల భగవానుని, అహమ్ = నేను, వందే = నమస్కరించుచున్నాను.

పరబ్రహ్మ, పురుషోత్తముడు, శ్రీమహావిష్ణువుయొక్క అవతారము అగు కపిలభగవానుని నేను నమస్కరించుచున్నాను. బుద్ధిని విషయభోగములనుండి వెనుకకు మరల్చి ఆయనను ధ్యానించినచో, స్వరూపమును ప్రకాశింపజేసి ఆయన సత్త్వరజస్తమోగుణముల ప్రవాహరూపమగు సంసారమును నశింపజేయును. ఆయన వేదములకు మూలపురుషుడు.

మైత్రేయ ఉవాచ ।
ఈడితో భగవానేవం కపిలాఖ్యః పరః పుమాన్ ।
వాచా విక్లబయేత్యాహ మాతరం మాతృవత్సలః ॥ 9

కపిల-ఆఖ్యః = కపిలుడనే పేరు గల, పరః పుమాన్ = పురుషోత్తముడగు, మాతృవత్సలః = తల్లియందు వాత్సల్యము గల, భగవాన్ = భగవానుడు, ఏవమ్ = ఈ విధముగా, ఈడితః = స్తుతించబడినవాడై, విక్లబయా = గద్గదమైన, వాచా = వాక్కుతో, మాతరమ్ = తల్లిని ఉద్దేశించి, ఇతి = ఈ విధముగా, ఆహ = పలికెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- పురుషోత్తముడగు కపిల భగవానుడు తల్లియందు వాత్సల్యము గలవాడు. ఆమె ఇట్లు స్తుతించగా, ఆయన గద్గదమైన వాక్కుతో ఆమెతో నిట్లనెను.

కపిల ఉవాచ ।
మార్గేణానేన మాతస్తే సుసేవ్యేనోదితేన మే ।
ఆస్థితేన పరాం కాష్ఠామచిరాదవరోత్స్యసి ॥ 10

మాతః = అమ్మా!, సుసేవ్యేన = తేలికగా అనుష్ఠించదగినట్టియు, మే = నాచే, ఉదితేన = బోధించబడినట్టియు, తే = నీచే, ఆస్థితేన = అనుష్ఠించబడిన, అనేన = ఈ, మార్గేన = మార్గముచే, అచిరాత్ = తొందరలో, పరామ్ = సర్వోత్కృష్టమగు, కాష్ఠామ్ = ఫలమును, అవరోత్స్యసి = పొందగలవు.

కపిల భగవానుడిట్లు పలికెను --- అమ్మా! నేను బోధించిన ఈ మార్గము తేలికగా అనుష్ఠించదగినది. దానిని నీవు అనుష్ఠించి తొందరలోనే పరమఫలమగు మోక్షమును పొందగలవు.

శ్రద్ధత్స్వైతన్మతం మహ్యం జుష్టం యద్బ్రహ్మవాదిభిః ।
యేన మామభవం యాయా మృత్యుమృచ్ఛంత్యతద్విదః ॥ **11**

ఏతత్ = ఈ, మహ్యమ్ = నా, మతమ్ = బోధను గురించి, శ్రద్ధత్స్వ = శ్రద్ధను కలిగియుండుము, యత్ = ఏది, బ్రహ్మవాదిభిః = బ్రహ్మవేత్తలచే, జుష్టమ్ = సేవించబడినదో, యేన = దేనిచే, అభవమ్ = సంసారమును నశింపజేసే, మామ్ = నన్ను, యాయాః = పొందెదవో, అతత్-విదః = ఈ బోధను తెలియనివారలు, మృత్యుమ్ = మృత్యువును, ఋచ్ఛంతి = పొందెదరు.

నీవు నా ఈ బోధయందు శ్రద్ధను చూపుము. దీనిని బ్రహ్మవేత్తలు ప్రీతితో సేవించినారు. దీనివలన నీవు సంసారనివర్తకుడనగు నన్ను పొందెదవు. ఈ జ్ఞానము లేనివారలు మృత్యుగ్రస్తమగు సంసారమునే పొందెదరు.

మైత్రేయ ఉవాచ ।
ఇతి ప్రదర్శ్య భగవాన్ సతీం తామాత్మనో గతిమ్ ।
స్వమాత్రా బ్రహ్మవాదిన్యా కపిలోఽనుమతో యయౌ ॥ **12**

కపిలః భగవాన్ = కపిల భగవానుడు, ఇతి = ఈ విధముగా, సతీమ్ = శ్రేష్ఠమైన, తామ్ = ఆ, ఆత్మనః గతిమ్ = ఆత్మజ్ఞానమును, ప్రదర్శ్య = బోధించి, బ్రహ్మవాదిన్యా = బ్రహ్మస్వరూపమునెరింగిన, స్వమాత్రా = తన తల్లిచే, అనుమతః = అనుమతించబడినవాడై, యయౌ = వెళ్లెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- కపిల భగవానుడు ఈ విధముగా అట్టి ఆత్మజ్ఞానమును బోధించగా, ఆయన తల్లి బ్రహ్మవేత్త ఆయెను. అపుడామె అనుమతిని పొంది ఆయన వెళ్లిపోయెను.

సా చాపి తనయోక్తేన యోగాదేశేన యోగయుక్ ।

తస్మిన్నాశ్రమ ఆపీడే సరస్వత్యాస్సమాహితా ॥ 13

సా చ అపి = ఆ దేవహూతి కూడ, తనయ-ఉక్తేన = తన పుత్రునిచే బోధించబడిన, యోగ-ఆదేశేన = యోగసాధనచే, యోగయుక్ = యోగాభ్యాసమును చేయుచున్నదై, తస్మిన్ = ఆ, సరస్వత్యాః = సరస్వతీ నదికి, ఆపీడే = పువ్వుల దండయైన, ఆశ్రమే = ఆశ్రమమునందు, సమాహితా = సమాధియందు ఉండెను.

ఆ దేవహూతి కూడ తన పుత్రునిచే బోధించబడిన యోగసాధనను అభ్యసిస్తూ ఆ ఆశ్రమమునందే సమాధియందు ఉండెను. ఆ ఆశ్రమము సరస్వతీనదికి తలలో ముడిచిన దండవలె ప్రకాశించెను.

అభీక్ష్ణావగాహకపిశాన్ జటిలాన్ కుటిలాలకాన్ ।
ఆత్మానం చోగ్రతపసా బిభ్రతీ చీరిణం కృశమ్ ॥ 14

అభీక్ష్ణ-అవగాహకపిశాన్ = పలుమార్లు స్నానమును చేయుటచే బూడిదరంగు గల, జటిలాన్ = జటలు గట్టిన, కుటిల-అలకాన్ = గిరజాల జుట్టును, ఉగ్రతపసా = తీవ్రమగు తపస్సుచే, కృశమ్ = చిక్కిన, చీరిణమ్ = నారబట్టను దాల్చిన, ఆత్మానమ్ = దేహమును, బిభ్రతీ = ధరించుచున్నది.

ఆమె నిత్యము మూడు పూటలా స్నానమును చేయుటచే అందమైన గిరజాల జుట్టు బూడిద రంగును పొంది జడలు గట్టినది. ఆమె ఉగ్రమైన తపస్సును చేయుటచే శరీరము చిక్కిపోయినది. ఆమె నారబట్టలను ధరించియున్నది.

ప్రజాపతేః కర్దమస్య తపోయోగవిజృంభితమ్ ।
స్వగార్హస్థ్యమనౌపమ్యం ప్రార్థ్యం వైమానికైరపి ॥ 15

కర్దమస్య ప్రజాపతేః = కర్దమ ప్రజాపతియొక్క, తపః-యోగవిజృంభితమ్ = తపస్సుచే మరియు యోగశక్తిచే అతిశయముగా చేయబడిన, అనౌపమ్యమ్ = సాటిలేని, స్వగార్హస్థ్యమ్ = తన గృహాశ్రమము, వైమానికైః అపి = విమానములలో తిరిగే దేవతలచే కూడ, ప్రార్థ్యమ్ = కోరదగినది.

ఆమె గార్హస్థ్యమును కర్దమ ప్రజాపతియొక్క తపస్సు యోగశక్తి చాల గొప్పదిగా తీర్చిదిద్దినవి. ఆమె దాంపత్యమునకు సాటి లేదు. అట్టి దాంపత్యమును దేవతలు కూడ కోరుకుందురు.

పయఃఫేననిభా శయ్యా దాంతా రుక్మపరిచ్ఛదాః ।
ఆసనాని చ హైమాని సుస్పర్శాస్తరణాని చ ।। 16

పయః-ఫేననిభాః = పాల నురుగును పోలిన, శయ్యాః = శయ్యలు, దాంతాః = దంతముతో చేయబడిన, రుక్మపరిచ్ఛదాః = బంగరు పరికరములు, హైమాని = బంగారముతో చేసిన, ఆసనాని = ఆసనములు, చ = మరియు, సుస్పర్శ-ఆస్తరణాని చ = మెత్తని స్పర్శ గల కంబళ్లు.

ఆమె గృహమునందు పాల నురుగును పోలిన శయ్యలు, దంతముతో మరియు బంగారముతో చేసిన పరికరములు, బంగరు ఆసనములు మరియు మెత్తని స్పర్శగల కంబళ్లు ఉండెను.

స్వచ్ఛస్ఫటికకుడ్యేషు మహామరకతేషు చ ।
రత్నప్రదీపా ఆభాంతి లలనారత్నసంయుతాః ।। 17

మహామరకతేషు = గొప్ప పచ్చలు గల, స్వచ్ఛస్ఫటికకుడ్యేషు = స్వచ్ఛమగు స్ఫటికములతో కూడిన గోడలయందు, రత్నప్రదీపాః = రత్నదీపములు, లలనారత్నసంయుతాః = రత్నములతో చేసిన స్త్రీమూర్తులతో కూడియున్నవై, ఆభాంతి = ప్రకాశించుచున్నవి.

వారి ప్రాసాదములో స్వచ్ఛమగు స్ఫటికములతో నిర్మించిన గోడలయందు గొప్ప పచ్చలు పొదగబడెను. వాటియందు రత్ననిర్మితములైన స్త్రీమూర్తులతో బాటు రత్నదీపములు ప్రకాశించుచుండును.

గృహోద్యానం కుసుమితై రమ్యం బహ్వామరద్రుమైః ।
కూజద్విహంగమిథునం గాయన్మత్తమధువ్రతమ్ ।। 18

కుసుమితైః = పుష్పించిన, బహు-అమరద్రుమైః = అనేకములగు దేవలోకములోని వృక్షములచే, రమ్యమ్ = సుందరమైన, గృహ-ఉద్యానమ్

= ప్రాసాదమును ఆనుకొనియున్న ఉద్యానవనము, కూజత్-విహంగమిథు నమ్ = కూసే పక్షుల జంటలు గలది, గాయన్-మత్తమధువ్రతమ్ = గానము చేసే మదించిన తుమ్మెదలు గలది.

ఆమె గృహమునకు ఆనుకొనియున్న ఉద్యానవనము పుష్పించిన అనేకములగు దేవలోకమునకు చెందిన వృక్షములతో, పక్షుల జంటల కూతలతో, మదించిన తుమ్మెదల ఝుంకారగానముతో ప్రకాశించెను.

యత్ర ప్రవిష్టమాత్మానం విబుధానుచరా జగుః ।
వాప్యాముత్పలగంధిన్యాం కర్దమేనోపలాలితమ్ ॥ 19

యత్ర = దేనియందలి, ఉత్పలగంధిన్యామ్ = కలువల సువాసన గల, వాప్యామ్ = దిగుడు బావియందు, ప్రవిష్టమ్ = ప్రవేశించినట్టియు, కర్ద మేన = కర్దమ మహర్షిచే, ఉపలాలితమ్ = లాలించబడిన, ఆత్మానమ్ = తన ను, విబుధ-అనుచరాః = గంధర్వులు, జగుః = గానము చేసిరో.

ఆ ఉద్యానవనమునందు కలువల పరిమళముతో కూడిన సరస్సు గలదు. ఆమె దానిలో ప్రవేశించగా కర్దమ మహర్షి ఆమెను అచట లాలించె డివాడు. అట్టి ఆమె సౌభాగ్యమును గంధర్వులు కొనియాడెడివారు.

హిత్వా తదీప్సితతమమప్యాఖండలయోషితామ్ ।
కించిచ్చకార వదనం పుత్రవిశ్లేషణాతురా ॥ 20

ఆఖండలయోషితాం అపి = ఇంద్రుని స్త్రీలకు కూడ, ఈప్సితత మమ్ = మిక్కిలి కోరబడే, తత్ = ఆ గార్హస్థ్యమును, హిత్వా = విడిచి, పుత్ర విశ్లేషణ-ఆతురా = పుత్రుని విరహముచే వ్యాకులతను చెందిన దేవహూతి, వదనమ్ = ముఖమును, కించిత్ చకార = ఉదాసీనముగా చేసుకొనెను.

ఆమె గార్హస్థ్యముయొక్క సౌభాగ్యము ఇంద్రుని స్త్రీలకు కూడ మిక్కిలి అభీష్టము అగును. ఆమె అట్టి గార్హస్థ్యమునందు అభిమానమును విడిచిపెట్టెను. కాని, ఆమె హృదయము పుత్రుని వియోగముచే వ్యాకులమై యుండుటచే, ముఖము ఉదాసీనముగా నుండెను.

వనం ప్రవ్రజితే పత్యావపత్యవిరహాతురా ।
జ్ఞాతతత్త్వాఽప్యభూన్నష్టే వత్సే గౌరివ వత్సలా ॥ 21

పత్యౌ = భర్త, వనమ్ = వనమును గురించి, ప్రవ్రజితే = సన్న్యసించి వెళ్లిపోగా, అపత్యవిరహ-ఆతురా = పుత్రుని విరహముచే దుఃఖితురాలైన దేవహూతి, జ్ఞాతతత్త్వా అపి = తెలియబడిన ఆత్మతత్త్వము గలదియే అయిననూ, వత్సే = దూడ, నష్టే = కనబడకుండగా పోగా, వత్సలా = దానిని ప్రేమించే, గౌః ఇవ = ఆవువలె, అభూత్ = ఆయెను.

భర్త సన్న్యసించి అడవికి వెళ్లెను. అట్టి స్థితిలో దేవహూతికి పుత్రుడు దూరమయ్యెను. ఆమె ఆత్మజ్ఞానియే అయిననూ, ఆ వియోగముచే, దూడను కోల్పోయి దాని కొరకు కలవరపడే ప్రేమమూర్తియగు ఆవువలె, దుఃఖించెను.

తమేవ ధ్యాయతీ దేవమపత్యం కపిలం హరిమ్ ।
బభూవాచిరతో వత్స నిస్స్పృహా తాదృశే గృహే ॥ 22

వత్స = కుమారా విదురా!, అపత్యమ్ = తన పుత్రుడైనట్టియు, హరిమ్ = శ్రీహరియొక్క అవతారమైన, తమ్ = ఆ, కపిలం దేవం ఏవ = కపిలదేవుని మాత్రమే, ధ్యాయతీ = ధ్యానించుచున్నదై, అచిరతః = తొందరలోనే, తాదృశే = అట్టి, గృహే = గృహమునందు, నిస్స్పృహా = ఇచ్ఛలేనిది, బభూవ = ఆయెను.

కుమారా విదురా! శ్రీహరి తన పుత్రుడగు కపిలదేవుడై అవతరించెను. ఆమె ఆయననే ధ్యానిస్తూ తొందరలోనే అట్టి ఆ గృహమునందలి ఆసక్తిని విడిచిపెట్టెను.

ధ్యాయతీ భగవద్రూపం యదాహ ధ్యానగోచరమ్ ।
సుతః ప్రసన్నవదనం సమస్తవ్యస్తచింతయా ॥ 23

సుతః = తన పుత్రుడు, ధ్యానగోచరమ్ = ధ్యానమునకు యోగ్యమైనది, ప్రసన్నవదనమ్ = ప్రసన్నమగు ముఖము గలది అగు, యత్ = ఏ, భగవత్-రూపమ్ = భగవానుని రూపమును, ఆహ = చెప్పినాడో దానిని,

సమస్తవ్యస్తచింతయా = సమగ్రముగా మరియు వేర్వేరుగా భావన చేయుట చే, ధ్యాయతీ = ధ్యానించుచున్నది.

దేవహూతికి ఆమె పుత్రుడగు కపిలుడు ప్రసన్నమగు ముఖము గల భగవానుని ధ్యానయోగ్యమగు రూపమును ఉపదేశించియుండెను. ఆమె ఆ రూపమును మనస్సులో సమగ్రముగా మరియు వేర్వేరు అవయవములను కూడ ధ్యానించుచుండెను.

భక్తిప్రవాహయోగేన వైరాగ్యేణ బలీయసా ।
యుక్తానుష్ఠానజాతేన జ్ఞానేన బ్రహ్మహేతునా ॥ 24

విశుద్ధేన తదాఽఽత్మానమాత్మనా విశ్వతోముఖమ్ ।
స్వానుభూత్యా తిరోభూతమాయాగుణవిశేషణమ్ ॥ 25

భక్తిప్రవాహయోగేన = నిరంతరమగు భక్తి అనే యోగముచే, బలీయసా = దృఢమగు, వైరాగ్యేణ = వైరాగ్యముచే, యుక్త-అనుష్ఠానజాతేన = యోగ్యములగు పూజాది కర్మల అనుష్ఠానముల సముదాయముచే, బ్రహ్మహేతునా = బ్రహ్మసాక్షాత్కారమునకు కారణమగు, జ్ఞానేన = జ్ఞానముచే, విశుద్ధేన = పరిశుద్ధమగు, ఆత్మనా = అంతఃకరణముచే, తదా = అప్పుడు, విశ్వతోముఖమ్ = సర్వవ్యాపకమగు, స్వ-అనుభూత్యా = తన స్వరూపమును ప్రకాశింపజేయుటచే, తిరోభూతమాయాగుణవిశేషణమ్ = నశింపజేయబడిన మాయాశక్తియొక్క గుణములచే చేయబడిన దేహేంద్రియాది ఉపాధిగల, ఆత్మానమ్ = ఆత్మతత్త్వమును (ధ్యానించునది).

ఆమె దృఢమగు వైరాగ్యముతో నిరంతరమగు భక్తియోగమును నెరపెను. ఆమె యోగ్యమగు పూజ మొదలగు ఎన్నో కర్మలను చేయుచుండెను. బ్రహ్మసాక్షాత్కారకారణమగు జ్ఞానము ఆమెకు కలిగెను. అపుడామె పరిశుద్ధమగు అంతఃకరణముతో సర్వవ్యాపకమగు ఆత్మతత్త్వమును ధ్యానించెను. ఆత్మ తన స్వరూపమును ప్రకాశింపజేయుట ద్వారా మాయాశక్తియొక్క సత్త్వరజస్తమోగుణముల కార్యమగు దేహేంద్రియాది ఉపాధియొక్క బంధమును దూరము చేయును.

బ్రహ్మణ్యవస్థితమతిర్భగవత్యాత్మసంశ్రయే ।
నివృత్తజీవాపత్తిత్వాత్ క్షీణక్లేశాఽఽప్తనిర్వృతిః ॥ 26

భగవతి = భగవానుడు, ఆత్మసంశ్రయే = జీవులకు అధిష్ఠానమైనది అగు, బ్రహ్మణి = పరబ్రహ్మయందు, అవస్థితమతిః = స్థిరముగా నిలిచిన బుద్ధిగలిగిన దేవహూతి, నివృత్తజీవాపత్తిత్వాత్ = తొలగిన జీవభావము కల దగుట వలన, క్షీణక్లేశా = క్షీణించిన దుఃఖము గలది, ఆప్తనిర్వృతిః = పొంద బడిన పరమానందము గలది.

జీవులకు అధిష్ఠానము, భగవానుడు అగు పరబ్రహ్మయందే దేవ హూతి బుద్ధి స్థిరముగా నిలిచెను. ఆమెయందు జీవభావము తొలగుటచే దుఃఖము క్షీణించి, ఆమె పరమానందమును పొందెను.

నిత్యారూఢసమాధిత్వాత్పరావృత్తగుణభ్రమా ।
న సస్మార తదాఽఽత్మానం స్వప్నే దృష్టమివోత్థితః ॥ 27

నిత్య-ఆరూఢసమాధిత్వాత్ = నిత్యము ఆరోహింపబడిన సమాధి గలదగుట వలన, పరావృత్తగుణభ్రమా = తొలగిన సత్త్వరజస్తమోగుణ ములు నిమిత్తముగా గల దేహాధ్యాస గల దేవహూతి, తదా = అప్పుడు, స్వప్నే = కలలో, దృష్టమ్ = చూడబడినదానిని, ఉత్థితః ఇవ = నిద్ర లేచిన వాడు వలె, ఆత్మానమ్ = తనను, న సస్మార = స్మరించలేదు.

ఆమె నిరంతరమగు సమాధి స్థితియందు ఆరూఢయై ఉండెడిది. సత్త్వరజస్తమోగుణముల వలన కలిగే దేహాత్మభ్రాంతి ఆమెకు తొలగిపోయె ను. మానవుడు తాను కలలో చూచిన తన దేహమును నిద్ర లేచిన తరు వాత విస్మరించును. అదే తీరున ఆమె దేహమును కూడ విస్మరించెను.

తద్దేహః పరతఃపోషోఽప్యకృశశ్చాధ్యసంభవాత్ ।
బభౌ మలైరవచ్ఛిన్నస్సధూమ ఇవ పావకః ॥ 28

పరతః-పోషః అపి = ఇతరులచే పోషించబడినప్పటికీ, ఆధి-అసం భవాత్ = మనోవ్యథ సంభవము కాకపోవుట వలన, అకృశః = కృశించని, మలైః = మాలిన్యములచే, అవచ్ఛిన్నః = కప్పబడిన, తత్-దేహః = ఆమె

యొక్క దేహము, సధూమః = పొగతో కూడిన, పావకః ఇవ = అగ్నివలె నుండెను.

ఆమెను విద్యాధరస్త్రీలు పోషించుచుండిరి. అయిననూ, ఆమెకు జ్ఞానమహిమచే మనోవ్యథ సంభవము కాదు. కావుననే, ఆమె చిక్కిపోలేదు. మాలిన్యములచే కప్పబడిన ఆమె దేహము పొగతో కూడిన అగ్నివలె నుండెను.

స్వాంగం తపోయోగమయం ముక్తకేశం గతాంబరమ్ ।
దైవగుప్తం న బుబుధే వాసుదేవప్రవిష్టధీః ॥ 29

వాసుదేవప్రవిష్టధీః = వాసుదేవునియందు ప్రవేశించిన బుద్ధిగల దేవహూతి, తపోయోగమయమ్ = తపస్సుతో యోగాభ్యాసముతో నిండి యున్నట్టియు, ముక్తకేశమ్ = చెల్లాచెదరైన జుట్టు గలిగినట్టియు, గత-అంబరమ్ = అడ్డదిడ్డముగానున్న వస్త్రము కలిగినట్టియు, దైవగుప్తమ్ = ప్రారబ్ధ కర్మచే రక్షింపబడిన, స్వ-అంగమ్ = తన దేహమును, న బుబుధే = తెలియకుండెను.

దేవహూతి మనస్సు వాసుదేవునియందు లగ్నమై యుండుటచే, ఆమెకు తన దేహమునందు ధ్యాస లేకుండెను. తపస్సుతో మరియు యోగాభ్యాసముతో నిండిపోయిన ఆమె దేహము చెల్లాచెదరైన జుట్టుతో అడ్డదిడ్డముగానున్న వస్త్రముతో కేవలము ప్రారబ్ధకర్మచే మాత్రమే రక్షింపబడుచుండెను.

ఏవం సా కపిలోక్తేన మార్గేణాచిరతః పరమ్ ।
ఆత్మానం బ్రహ్మ నిర్వాణం భగవంతమవాప హ ॥ 30

ఏవమ్ = ఈ విధముగా, సా = ఆమె, కపిల-ఉక్తేన = కపిల భగవానునిచే చెప్పబడిన, మార్గేణ = మార్గముచే, అచిరతః = తొందరలోనే, ఆత్మానమ్ = ఆత్మరూపమైనట్టియు, నిర్వాణమ్ = దుఃఖలేశమైననూ లేని (మోక్షస్వరూపమగు), పరం బ్రహ్మ = పరబ్రహ్మ స్వరూపమగు, భగవంతమ్ = శ్రీహరి భగవానుని, అవాప హ = పొందెనట.

ఈ విధముగా ఆమె కపిల భగవానుడు బోధించిన మార్గముననుస రించి, తొందరలోనే ఆత్మస్వరూపము, దుఃఖసంపర్కము లేనిది, మోక్షరూ పము అగు పరబ్రహ్మయే స్వరూపముగా గల శ్రీహరి భగవానునిలో ఐక్య మయ్యెను.

తద్వీరాసీత్పుణ్యతమం క్షేత్రం త్రైలోక్యవిశ్రుతమ్ ।
నామ్నా సిద్ధపదం యత్ర సా సంసిద్ధిముపేయుషీ ॥ 31

వీర = ఓ విదురా!, తత్ = అది, నామ్నా = పేరుచే, సిద్ధపదమ్ = సిద్ధపదముగా, త్రైలోక్యవిశ్రుతమ్ = ముల్లోకములలో ప్రసిద్ధిని గాంచిన, పుణ్యతమమ్ = మిక్కిలి పవిత్రమగు, క్షేత్రమ్ = క్షేత్రము, ఆసీత్ = ఆయెను, యత్ర = ఎక్కడ, సా = ఆమె, సంసిద్ధిమ్ = మోక్షమును, ఉపేయుషీ = పొందినదో.

ఓ విదురా! ఆమె సిద్ధిని పొందిన ఆ అతిపవిత్రమగు క్షేత్రము ముల్లోకములలో సిద్ధపదము అను పేరుతో ప్రఖ్యాతిని గాంచెను.

తస్యాస్తద్యోగవిధుతమార్త్యం మర్త్యమభూత్సరిత్ ।
స్రోతసాం ప్రవరా సౌమ్య సిద్ధిదా సిద్ధసేవితా ॥ 32

సౌమ్య = సౌమ్యస్వభావము గల ఓ విదురా!, యోగవిధుతమార్త్యమ్ = యోగముచే విలీనమైన దేహమాలిన్యములు గల, తస్యాః = ఆమె యొక్క, తత్ = ఆ, మర్త్యమ్ = శరీరము, స్రోతసామ్ = నదులలో, ప్రవరా = శ్రేష్ఠమైనది, సిద్ధిదా = సిద్ధిని ఇచ్చునది, సిద్ధసేవితా = సిద్ధపురుషులచే సేవించబడునది అగు, సరిత్ = నదిగా, అభూత్ = ఆయెను.

సౌమ్యమగు స్వభావము గల ఓ విదురా! యోగశక్తిచే తొలగించబడిన మాలిన్యములు గల ఆమె ఆ దేహము నదియై పారెను. నదులలో శ్రేష్ఠమగు ఆ నది సిద్ధిని కలిగించును. దానిని సిద్ధపురుషులు సేవించెదరు.

కపిలోఽపి మహాయోగీ భగవాన్ పితురాశ్రమాత్ ।
మాతరం సమనుజ్ఞాప్య ప్రాగుదీచీం దిశం యయౌ ॥ 33

మహాయోగీ = గొప్ప యోగియగు, కపిలః భగవాన్ అపి = కపిల భగవానుడు కూడ, మాతరమ్ = తల్లిని, సమనుజ్ఞాప్య = ఒప్పించి, పితుః = తండ్రియొక్క, ఆశ్రమాత్ = ఆశ్రమమునుండి, ప్రాక్-ఉదీచీం దిశమ్ = ఈశాన్యదిక్కును గురించి, యయౌ = వెళ్లెను.

మహాయోగియగు కపిల భగవానుడు కూడ తల్లిని ఒప్పించి, తన తండ్రి ఆశ్రమమునుండి ఈశాన్యదిక్కు వైపునకు వెళ్లెను.

సిద్ధచారణగంధర్వైర్మునిభిశ్చాప్సరోగణైః ।
స్తూయమానస్సముద్రేణ దత్తార్హణనికేతనః ॥ 34

సిద్ధచారణగంధర్వైః = సిద్ధులు చారణులు గంధర్వులచే, మునిభిః = మహర్షులచే, చ = మరియు, అప్సరోగణైః = అప్సరసల గణములచే, స్తూయమానః = స్తుతించబడుచున్న కపిలభగవానుడు, సముద్రేణ = సముద్రునిచే, దత్త-అర్హణనికేతనః = ఈయబడిన అర్ఘ్యము, నివాసస్థానము గలవాడు.

సిద్ధులు, చారణులు, గంధర్వులు, మునులు, అప్సరసల గణములు స్తుతించుచుండగా, సముద్రుడు కపిల భగవానునకు అర్ఘ్యమునిచ్చి మకామునకు స్థానమునిచ్చెను.

ఆస్తే యోగం సమాస్థాయ సాంఖ్యాచార్యైరభిష్టుతః
త్రయాణామపి లోకానాముపశాంత్యై సమాహితః 35

సాంఖ్య-ఆచార్యైః = సాంఖ్యాచార్యులచే, అభిష్టుతః = స్తుతించబడిన కపిల భగవానుడు, త్రయాణామ్ = మూడు, లోకానాం అపి = లోకములకు కూడ, ఉపశాంత్యై = శాంతి కొరకు, యోగమ్ = యోగమార్గమును, సమాస్థాయ = అవలంబించి, సమాహితః = ఏకాగ్రచిత్తము గలవాడై, ఆస్తే = ఉన్నాడు.

సాంఖ్యాచార్యులచే స్తుతించబడే కపిల భగవానుడు ముల్లోకముల శాంతి కొరకై యోగమార్గమునవలంబించి సమాధిస్థుడై యున్నాడు.

ఏతన్నిగదితం తాత యత్పృష్టోఽహం తవానఘ ।
కపిలస్య చ సంవాదో దేవహూత్యాశ్చ పావనః ॥ 36

తాత = వత్సా!, అనఘ = పుణ్యాత్మా!, అహమ్ = నేను, యత్ = దేనిని, పృష్టః = ప్రశ్నించబడితినో ఆ, ఏతత్ = ఇది, కపిలస్య = కపిలుని యొక్క, దేవహూత్యాః చ = దేవహూతియొక్క, పావనః = పవిత్రమగు, సంవాదః చ = సంవాదము కూడ, తవ = నీకు, నిగదితమ్ = చెప్పబడినది.

వత్సా! విదురా! నీవు పుణ్యాత్ముడవు. నీవు అడిగిన మన్వంతరాదికమును, పవిత్రమగు కపిల దేవహూతి సంవాదమును కూడ నేను నీకు చెప్పితిని.

య ఇదమనుశృణోతి యోఽభిధత్తే
కపిలమునేర్మతమాత్మయోగగుహ్యమ్ ।
భగవతి కృతధీస్సుపర్ణకేతా-
వుపలభతే భగవత్పదారవిందమ్ ॥ 37

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే తృతీయస్కంధే
త్రయస్త్రింశోఽధ్యాయః ॥

॥ ఇతి తృతీయః స్కంధః సమాప్తః ॥

యః = ఎవడైతే, ఇదమ్ = ఈ, ఆత్మయోగగుహ్యమ్ = అధ్యాత్మ యోగముయొక్క రహస్యమగు, కపిలమునేః = కపిల మహర్షియొక్క, మతమ్ = బోధను, అనుశృణోతి = చెప్పుచుండగా వినునో, యః = ఎవడైతే, అభిధత్తే = చెప్పునో వాడు, సుపర్ణకేతౌ = గరుడధ్వజుడగు, భగవతి = శ్రీహరి భగవానునియందు, కృతధీః = చేయబడిన బుద్ధి గలవాడై, భగవత్-పద-అరవిందమ్ = భగవానుని పాదపద్మమును, ఉపలభతే = పొందును.

కపిల మహర్షియొక్క ఈ అధ్యాత్మయోగ బోధ రహస్యమైనది. దీనిని చెప్పువాడు, చెప్పుచుండగా వినువాడు కూడ గరుడధ్వజుడగు

శ్రీహరి భగవానునిపై లగ్నమైన బుద్ధి గలవారై, భగవానుని పాదపద్మములను పొందును.

శ్రీమద్భాగవత మహాపురాణములోని మూడవ స్కంధమునందు
ముప్పది మూడవ అధ్యాయము
ముగిసినది (33).

**మూడవ స్కంధము ముగిసినది.**

॥ హరిః ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ॥

* * * * *

T.T.D. Religious Publications Series No. (623) Price: Rs.



భారతీయ వాఙ్మయం అంతా ఒక యెత్తు; శ్రీమద్భాగవతం ఒక్కటి ఒక యెత్తు. ఈ ప్రఖ్యాతికి ముఖ్యకారణం - భగవంతుణ్ణి గూర్చి తెలిపే గ్రంథాల్లో భాగవత పురాణం అగ్రగణ్యమై అలరారుతూ వుండటం.

''వేద'' మనే కల్పతరువున ఫలించి, శుక యోగీంద్రుని వాక్కులనెడి అమృత రసంతో సమ్మిళితమయి, పుడమికి అవతరించిన పరిపక్వ మధుర ఫలం భాగవతం।

ఇంతటి విశిష్టతగల భాగవత మహాపురాణాన్ని 'తత్త్వప్రకాశిక' - 'అనే తెలుగు టీకతో ప్రచురించటం తెనుగువారందరికీ మిగుల సంతోషదాయకమైన విషయం. తి.తి.దేవస్థానంవారి ఈ ప్రచురణ సంస్కృతమూలంలోని పరమార్థాన్ని తెలిసికోవటానికి, అలాగే, పోతన మహాకవి రచనను ఇతోఽధికంగా అవగాహన చేసికోవటానికి - ఉభయతారకంగా ఆంధ్రావళికి ఉపయోగపడుతుంది.

సార్థకనామధేయమైన ఈ టీకను రచించినవారు పూజ్యశ్రీ తత్త్వవిదానంద సరస్వతీ స్వామివారు. బ్రహ్మవిద్యాకుటీర (సికిందరాబాదు) నిలయులు. సంస్కృతాంధ్రాంగ్లాది బహుభాషావేత్తలు. వేద, వేదాంతాది ప్రాచీన విద్యల్లోను, రసాయన శాస్త్రాది ఆధునికవైజ్ఞానిక శాస్త్రాల్లోను నిష్ణాతులు.

పరిశోధన, బోధన, బహుగ్రంథ రచన, సామాజికాది సమస్యల సదవగాహన - ఇత్యాది రంగాల్లో విశేషానుభవం గడించిన పరిణత ప్రజ్ఞావంతులు శ్రీ స్వామివారు. ఆర్ష విద్యాపారంగతులైన వీరు ఉత్తమవక్తగా అనేక జాతీయ, అంతర్జాతీయ వేదికలపై ప్రశస్తిగాంచారు.

విశేషించి, ఉపనిషత్తుల్లో నిక్షిప్తమై ఉన్న ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని ప్రబోధించే ఉదారాశయంతో సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించిన యతివరేణ్యులు వీరు। బ్రహ్మవిద్యానిధులయిన వీరు భాగవతానికి సరళ సుందర శైలిలో ఈ టీక రచించటం బంగారుకు తావి అబ్బినట్లయింది।

Published by Sri Ajeya Kallam, I.A.S., Executive Officer
T T Devasthanams and Printed at Keerthi Offset, Tirupati.